# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 16 జనవరి 1974 సంచిక 11

## విషయానుక్రమణిక



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 48

### అంత్యక్రియ

భరతుడు దీర్ఘముగా ఆలోచించి స్వామీ ప్రథమ పుత్రుడైన రామచంద్రుడు చేయవలసిన ఈ కార్యము నా తలపై పెట్టి తలంచితిరా ఇది న్యాయమా? ఇన్ని దినములే పూరబెట్టితిరి ఇక రెండు మూడు దినములు వుండిన నేను నేడే సోదరుడైన శత్రుఘ్నునితో అడవికి వెళ్లి నా రామచంద్రుని తోడ్కొనివత్తునని ఆజ్ఞ దయచేయుడని ప్రార్థించెను.

అందుకు వశిష్ఠులవారు, "నాయనా! నీవు అమాయకుడవు! రామచంద్రుడు తనకు నేమించిన కాలము గడువక ముందుగా వచ్చుటకు ఇష్టపడడు. ఏకవాక్య పరిపాలుడు, నీవెన్ని చెప్పినను రాముడు పదునాలుగు వర్షములు అరణ్యవాసము చేయక అయోధ్యను ప్రవేశించడు. నీవు ఆ ప్రయత్నమునకు పూనుకొనక, తండ్రి అంత్యక్రియలు ఆచరించి తదుపరి నీయిష్టప్రకారముగావింపుము," అని పదే పదే అనేక విధముల బోధించెను.

చేయునది లేక, భరతుడు సరి అని, వేదోక్త ప్రకారము తండ్రి కళేబరమునకు స్నానము చేయించి, తీసుకొని పోవుటకు తగిన యేర్పాటులు గావించెను.

ఇంతలో తనకేదియో వక భావము హృదయమున మొలకెత్తగనే, అంతఃపురమునకు సరాసరి వెళ్లి కౌసల్య, సుమిత్రల పాదములకు నమస్కరించి, తల్లులారా! మీరు సహగమనమునకు ప్రయత్నింపకూడదనియూ, అట్లు ప్రయత్నించు పక్షమున, తాను తండ్రి అంత్యక్రియలను జరుపనేరననియూ, వారలలో మాట ఇప్పించుకొనెను. వారు కొమారుని ప్రేమానురాగములకు సంతసించి; నాయనా! నీయిష్ట

ప్రకారమే చేయుమని మాటయిచ్చిన తరువాత, నిండు దుఃఖముతో, సరయూనదీతీరమున గంధపు చెక్కలతో యేర్పరచిన కాష్టమును చేరి, వశిష్టులవారు ఆశించినదానికంటే, వేయిరెట్లు అధికంగా వేదోక్తంగా తండ్రిగారి అంత్యక్రియలు భరతుడు గావించెను.

తండ్రి పేరుతో షోడశ మహాదానములు చేసెను. గోదానములు, భూదానములు, సువర్ణ దానములు, వస్త్రదానములు, అన్నదానములు, గృహదానములు, అశ్వదానములు, గజదానములు, ధనదానములు ఇత్యాది దానములు విరివిగా గావించెను. భరతుడు చేసిన పితృకార్యము ప్రజలు వేనోళ్లా చెప్పుకొని ఆనందించిరి

## రామవియోగబాధ

అయితే ప్రజలలో, పండితులలో, రాజులలో రాముడు లేని కొరత తీరలేదు. రామవియోగ బాధలు క్షణ క్షణమునకు వారి హృదయముల బాధించుచునేయుండెను. ఇక చేయునది లేక, రాముడు ఏకవాక్య పరిపాలుడని వారెరుగుట చేత, యేమిచేసినా రామచంద్రుడు పదునాలుగు సంవత్సరములు దాటువరకూ అయోధ్యకు రాడని వారు నిర్ణయముచేసుకొని, రాముడు అయోధ్య వచ్చువరకూ వారు రామదర్శన నిమిత్తము బ్రతికియుండక తప్పదని యేదో వక విధముగ హృదయాలను రాళ్లగాచేసుకొని, కాలమును గడుప నిశ్చయించుకొనిరి.

## మహాసభ

ఇంతలో గురువుగారైన వశిష్టులవారు, రాజులను, సామంతులను, మంత్రులను, పుర ప్రముఖులను, పండితులను, ఋషులను రప్పించి వక సమావేశము జరిపెను. అందులో భరత శత్రుఘ్నులకు ధర్మానుసారముగా రాజనీతులను ఐరస్కరించుకొని. ఉపదేశములు చేసెను.

ప్రథమమున కైకేయి చేసిన పన్నాగము మొదలు, రాముని వనగమనము వరకూ గల కథనతడు వివరించెను. తరువాత మహారాజు యొక్క సత్యమును ధర్మ పరిపాలనమూ, శౌర్య, వీర్య-పరాక్రమ బలములను త్యాగ, యోగ, భోగాది కర్మకలాపములను, యజ్ఞయాగాది క్రమ విశిష్ట కార్యదీక్షలను వర్ణించెను. మహారాజు రామ పట్టాభిషేకమునకు గావించిన ప్రయత్నములు, వాటికి అడ్డుతగిలిన అవాంతరములు కడకు, రామవియోగముతో తన ప్రాణమునే వీడెననియూ తెలిపెను.

ఇంతవరకూ, యెట్టి వివరములూ తెలియని భరతశత్రుఘ్నులకు గురువుగారు తెలిపిన వివరములు వినగనే, భరతశత్రుఘ్నులకు, వక వైపున పట్టలేని కోపము, మరొక వైపున సిగ్గూ, దుఃఖమూ వారలను క్రుంగదీసెను నేత్రముల వెంట నీరు ధారలై ప్రవాలెను, వారల విచారమును సభాసదులు చూడలేకపోయిరి. వశిష్టుల వారు సహితము తనకు తెలియకనే కంటిధారలు వదలెను. ఆ సభ మహాశోకముతో నిండెను ; యెవ్వరున్నూ మాటాడలేకపోయిరి. కొన్ని క్షణములు సభ నిశ్శబ్దముతో స్తంభించెను.

వశిష్టులవారు యేమి చెప్పుచున్ననూ భరత శత్రుఘ్నులు లక్ష్యము చేయలేదు. వారి మనసు కైక చేసిన పన్నాగములను తలంచుచూ, అట్టి

తల్లి కౌమారుడనై జన్మించుట యెన్ని జన్మల కర్మమోనని తలయెత్తుటకు సహితము సిగ్గు పడుచూ, యెప్పుడెప్పుడు ఆ సభను వీడి పోదునా అన్నబాధతో తలవంచుకొని వుండిరి.

ఉపశాంతి పలుకులు

వారి విచారమును గమనించి వశిష్టులవారు దగ్గరకు వెళ్లి వారిని తగిన ఉపశాంతి పలుకులతో నోదార్చి "నాయనా! విచారించి ప్రయోజనము లేదు; జరిగినది జరిగేపోయినది. ముందు జరుపవలసిన వాటికి తగిన విచారము సలుపుట మంచిది. అన్ని విధములా మీ తండ్రి అదృష్టవంతుడు. అతని నిమిత్తము విచారించుట వ్యర్థము. నా మాటలను విని మీ తండ్రి ఆజ్ఞను శిరసావహింపుము. మహారాజా నీకు రాజ్యాధిపత్యమునిచ్చెను. తండ్రి వచనములను మన్నించుట వుచితము,

ఆడిన మాటను తప్పలేక మీ తండ్రి రాముని వియోగమునకొప్పుకొనెను. అతనియందలి ప్రేమానురాగములచే ప్రాణమునే వీడెను. మాటకై ప్రాణమును వీడెననుమాటలో యెట్టి సందియము లేదు. ప్రాణముకంటే మాటనే ప్రధానమని భావించుట చేత కదా, మాటను తప్పక తన ప్రాణమునైననూ వీడుటకు సిద్ధమాయెను? తండ్రి మాటను నెరవేర్చుటకైకదా, శ్రీరాముడు కూడా భార్యతో అడవికేగెను? కాన ఈ ఇక్ష్వాకుల వంశమున ఆడిన మాటను తప్పక కాపాడుట ప్రధాన నీతి అదే మీ రాజజాతికి జ్యోతి.

భరతునికి అదొక శిక్ష

కనుక నీవుకూడనూ తండ్రిమాటను నిలబెట్టుటకై, పరిపాలనా బాధ్యతను వహించక తప్పదు. నీకు అన్ని విధములా మంగళమగుగాక; శుభములు చేగూరుగాక, నీ పైగల వాత్సల్యము చేతనూ, దయా అనుగ్రహములచేతనే, నేనిన్ని విధముల నీకుబోధింప బూనితిని. లేకున్న ఇంతటి బాధ్యతను నేను నీ పై మోపియుండెడివాడను కాను. నీవు నీ తండ్రి కీర్తిని నిలబెట్టగలవు పరిపాలనా శక్తి, దక్షత నీకు కలదు. సంశయించక, అంగీకరింపుము." అని వీపు నిమురుచూ, ఆశీర్వదించుచున్న వశిష్టులవారి వచనములు విని, దిగ్గున ఆసనమునుండి లేచి వశిష్టులవారి పాదములపై బడి, భరించలేని దుఃఖముతో అదురుచున్న పెదవులతో, కంఠమెత్తి, స్వామీ! నిజముగా ఈ వచనములు నాపై గల ప్రేమానురాగములకు సూచనలా? నే నమ్మలేకున్నాను! నిజముగా, తమకు నాపై అంతటి ప్రేమానురాగములే వుండి యుండిన, నాకిట్టి బాధ్యతను భారమును మోపుటకు అంగీకరించెడివారు కారు. ఇది నాకు పక శిక్షగా విధించుచున్నారు"

"యే రాజ్యము, పవిత్ర పావన పురుషుని అరణ్యమునకు పంపెనో, యే రాజ్యము ప్రజలను నిరంతరము కంటిధారలు కార్చునట్లు చేసెనో; యే రాజ్యము మహాధర్మాత్ముడైన రాజును కోల్పోయెనో; యే రాజ్యము ఈ ఇక్ష్వాకుల వంశమునకు కళంకము తెచ్చిపెట్టెనో; యే రాజ్యము మహా పతివ్రతా మతల్లులైన కౌసల్యా, సుమిత్రాదులకు వైధవ్యమునందించెనో; అట్టి రాజ్యమును ఈ భరతునకు అప్పజెప్పబూనుట, ఇది నా పాప ఫలము. క్రూరాత్మురాలైన కైక గర్భమున జన్మించిన దురదృష్ట ఫలము. నాకు ఈ శిక్షనిచ్చుట కంటే నన్ను నా రామచంద్ర ప్రభువున్న

స్థానమునకు పంపి పుణ్యమును చేకూర్చెడు ! వారల పాదసేవలు చేయుచు, వారు నడచు దారులను పూడ్చి తరింతును; కాన, ఈ రాజ్యమున క్షణమైననూ నే నిలువజాలను," అని వశిష్టులవారికి నమస్కరించి వనమునకేగ ఆజ్ఞ దయచేయమని కోరెను.

అంత మంత్రులు లేచి చేతులను జోడించు కొని భరతునితో ఇట్లు చెప్పనారంభించిరి :

"ప్రభూ ! రాజులేని రాజ్యము యెంత కాల మీ విధముగ జరుపుట మంచిది కాదు. గురువాజ్ఞను మన్నించి, మీరు పరిపాలనా బాధ్యతను చేపట్టక తప్పదు. శ్రీరాములవారు వచ్చిన తరువాత సమయోచితముగా తమరు ఇష్టాను సారముగా ప్రవర్తించవచ్చును. మా ప్రార్థనలను అంగీకరింపుము ; ప్రజలను పాలింపుము, రాజ్యమును చేపట్టుము " అని చెప్పుకొనిరి.

## తల్లుల హితబోధ

వక పరి మాతృదేవియైన కౌసల్యను దర్శించి వత్తునని భరతుడు కోరగనే, వశిష్టులవారు అందులకు సమ్మతించెను. సమావేశమునుండి భరత శత్రుఘ్నులు సరాసరి కౌసల్యా భవనమునకు వెళ్లి పాదములపై బడి, "అమ్మా ! దుర్మార్గురాలైన కైక గర్భమున జన్మించి, ఇన్ని విధముల అవాంతరములకు కారకుడైన ఈ భరతుని మొదలు క్షమింపుము. రాజ్య దుర్గతికి ఈ పాడు భరతుడే కారణము. నన్ను వనమునకు పంపుటకు ఆశీర్వదింపుము, అనుజ్ఞయిమ్ము. నా ప్రభువు లేని అయోధ్యలో క్షణకాలము నేను తలయెత్తి తిరుగుటకు వీలుకాదు. ఈ రాజ్యాధికారము జ్యేష్ఠపుత్రుడైన శ్రీరాములదే కాని, ఈ అల్పునకెట్టి అధికారమూ లేదు. నాకీ భారము వద్దు." అని దుఃఖించుచుండ, కౌసల్య ధైర్యమవలంబించి, "భరతా ! కాలగతులు గ్రహించి, విషాదమును విడచిపెట్టుము. ప్రస్తుతము స్థిమితముగానుండుటకు సమయము కాదు.

శ్రీరాముడు అడవిలోనుండెను మీ తండ్రి స్వర్గమును చేరెను. నీ తల్లులు, బంధువులు, మిత్రులు, జనులూ పరమ దుఃఖమున మునిగిరి. వారందరికీ ఇపుడు నీవే ఆధారము. కాల కర్మములు ప్రతికూలముగనుండెనని తెలుసుకొని నీవు ధైర్యము తెచ్చుకొనుము. తండ్రి ఆజ్ఞను నెరవేర్పుము. గురునాజ్ఞను శిరసావహించుము. ప్రజాప్రార్థనలను మన్నింపుము. మంత్రుల ప్రియవచనములను అనుసరింపుము," అని చేతులుపట్టి చెప్పుచున్న కౌసల్య వచనములు అతని హృదయమునకు కొంత చల్లని గంధమువలె మృదువుగా నాటెను. మధురముగానుండెను

## కౌసల్య విశాల హృదయము.

తన తల్లి చేసిన కృత్రిమ వ్యాపారమును తలంచక, తనను సంశయించక, కౌసల్య ఇట్టి ప్రియవచనములు చెప్పుట అతనికెంతయో తృప్తిగానుండెను, కౌసల్య విశాల హృదయమునకు వాత్సల్యభావమునకు యెంతయో సంతసించెను. ప్రియకుమారుడైనరాముడు అడవికి వెళ్లిననూ సవతికొమారుడైన తనపై పుత్ర వాత్సల్యమింత గాఢమైయుండునని భరతుడు కలనైననూ తలంచలేదు తన తల్లియైన కైకకూ కౌసల్యకు గల వ్యత్యాసము పోల్చవీలులేక పోయెను. విశాల హృదయుల భావములు

పూర్ణత్వమును ధరించుచున్న సత్యమును భరతుడు గుర్తించెను.

చేతులు జోడించుకొని, "తల్లీ! మీ ప్రేమ వచనములు నా హృదయమునకు చల్లని పన్నీరు జల్లులుగా హాయినిచ్చుచున్నవి. నేను రాములని తలంచితిరి కాబోలు! తల్లీ! ఆ పవిత్ర రాముడను కాదు నేను కైకేయీ కుమారుడను! కుటిల స్వభావుడను! సిగ్గులజ్జలేని తుచ్ఛుడను! రామ శత్రుడను! నావంటి అధముని రామునిగా భావించి, సంభాషించుచున్నారు కాబోలు, మీ చిత్తము రాములయందే లగ్నమగుట చేత అందరినీ రాములుగా తలంచుచుందురు.

నేను సత్యమును చెప్పుచున్నాను. నా మాటలు మన్నింపుము తల్లీ! రామచంద్రుడే ప్రభువు; ధర్మశీలుడే రాజ్యాధికారి, నాబోటి కుటిలచిత్తుడు రాజ్యమునేలిన భూమి పాతాళమునకు క్రుంగును. స్వార్థపరులు సంకుచిత చిత్తులు, దురాశాపరులు, ఆడంబర జీవులు, అహంకార వ్యక్తులు, అసూయా స్వభావులు, రాజ్యాధికారులు కారు. అట్టివారల పరిపాలన ప్రజలకు హాని కలిగించును; ధర్మమును నాశముచేయును; దేశమునకేకీడు వాటిల్లును. సదాచార, సచ్ఛీల, త్యాగ, సత్యవాక్యపరిపాలకులే రాజ్యాధికారులు. అట్టి ప్రభువు వక్క రామచంద్రుడు తప్ప అన్యులు నాకగుపించుట లేదు. కాన, నేను ఇప్పుడే వెళ్లి, రామచంద్రుని పాదముపట్టి ప్రార్థించి అయోధ్యకు తోడ్కొని వత్తును," అనుజ్ఞ దయచేయుము. ఆలసింపక ఆశీర్వదింపుము, అని పాదములపైబడెను.

భరతుని మాటలు కౌసల్య హృదయమునకెంతయో శాంతినందించెను. "నాయనా! నా రామభావములు అన్నియూ నీలో ఉట్టిపడుచున్నవి. నిన్ను చూచైననూ రామవియోగమును భరింతును, నీపుసూ అడవికి వెళ్లిన ఇక మాగతియేమి? నీవు తప్పదని అందువా నన్ను కూడనూ నీతో అడవికి తోడ్కొనిపొమ్ము. నేనెవరి నిమిత్తము అయోధ్యలో జీవించవలెను? పతిని కోల్పోయి సుతునకు దూరమై, ఈ సతి జీవించుటకంటే, వారి వియోగ బాధలో నా ప్రాణములు లీనమొనర్చుట మంచిది కదా? గురువాజ్ఞనుపొంది రమ్ము మనము అరణ్యమున ప్రవేశించి సీతారామలక్ష్మణులతో కొంతకాలమైననూ గడిపి నా జన్మమును ముగించుకొందును అని పలికిన పలుకులు భరతునకు కొంత శాంతినందించెను. అంత కౌసల్య సుమిత్రలకు నమస్కరించి, కైకగృహమునకు బయలుదేరెను.

సశేషము

# సాయి పలికినప్పుడు

నా జీవితములో 1973 ఆగస్టు 14 వ తేది అత్యంత సుదినము. ఆ ముందురోజు ఆధ్యాత్మిక విషయములలో నాకు కొన్ని సందేహములున్నవని, మరునాడు విశ్రాంతిగా వాటిని గురించి నాతో ముచ్చ టించుతానని బాబా నాతో చెప్పినారు. 14 వ తేదిన షుమారు 45 నిమిషములు దివ్యమైన ఉపదేశామృత మును బాబా వర్షించినారు. ఆ నిమిషములలో నేను నేర్చుకొనినది, గతయిరువది సంవత్సరములలో నేను కూడ పెట్టుకొనినదానినంత మాయము చేసివేసినది.

నా సందేహములను గురించి నేను బాబాకు చెప్పు నవసరము లేకపోయినది. వాటిని గురించి బాబాకు తెలుసును. ఈ అనుభవముతో కలిగిన ఆనందముతో నిరుత్తరుడనైనాను. అప్పటివరకు బాబాను ఈశ్వరు డని చెప్పినవారందరు, అంధవిశ్వాసముతో, మహి మలుచూచి మోసపోయి, అతిశయోక్తులు చెప్పినట్లు భావించినాను. కానీ ఆగస్టు 14 వ తేదిన, నాకు కలిగిన అద్భుతానుభవముతో, వారు మానవరూపధారి యైన పరమాత్మ అని దృఢవిశ్వాసము కలిగినది.

బాబా బోధామృతమునాలకించుటే అద్భుతానందా నుభవము. నాలోని చైతన్యమెన్నోరెట్లు పెరిగినట్లు భావించినాను. వారు దివ్యజ్ఞానమును వివరించుతూ నా మనస్సులోని ముడులు విప్పుచుండగా, నా యందున్న అహంభావమేదివ్యశక్తిలోనో కరిగిపోయి నట్లుగా తలంచినాను. సంపూర్ణానందముతో అందు లీనమైపోయినాను.

బాబా అతి శక్తివంతముగా మాట్లాడుటేకాక, వారు చెప్పినది అవగాహన చేసుకొను శక్తిని కూడా మనకను గ్రహించుతారు.

నాకు మరొక విషయము ప్రకాశమానమైనది. ఎప్పుడైనాయిద్దరు వ్యక్తులు సమావేశమైనప్పుడు, వాస్త వములో, రెండు భిన్నమానసికతత్వములు, అనేకా నుభవములతో, వాటిని గూర్చి వ్యక్తిగతవివరణలతో, ఎన్నో జ్ఞాపకములతో. అనుబంధములతో, పక్షపాత ముతో, అనేక విషయములను, పరిస్థితులను గురించిన అనుకూలప్రతికూలభావములతో, అగణిత ధోరణులతో, ఒకదానినొకటి ఎదుర్కొనుచు సమావేశమైనవని అర్థము. వారిద్దరు సంభాషణలో ఉపయోగించు పదజాలము నకు ఇవి అన్నిమూలముగా ఉంటవి. కాని, బాబా మనతో మాట్లాడునప్పుడు, వారిలో యీవిధానమే కను పించదు! అంతే కాదు. మన మనస్సులందు అస్తవ్యస్త ముగానున్న భావములన్నింటిని ఒక పద్ధతిలో పెట్టు కొను శక్తిని మనకు కలుగజేస్తారు! వారిమాటలు మన భావమునకు చక్కగా అతికినట్లుండును. ఏ మాత్రము తన భావమునకు తన బాషతగివున్నదా అనే ప్రయత్నము లేకుండా నే, తన భావము సరిగా వ్యక్తము చేసినానా అని ఆలోచించవలసిన అవసరము

ఏమీ లేకుండా బాగా సంభాషించగలరు ; ఆశ్చర్యము లలో ఆశ్చర్యము ! వారు పలికిన ప్రతిమాట దాని అర్థములో 'ఘనీభవించినట్లుండును. ఆ మాటలన్ని ఒక శ్రవ్య చిత్రముగా తయారవుతవి. ఈ చిత్రము కన్నులకు కట్టినట్లుండును ; దానిని పీల్చవచ్చు, స్పృశించవచ్చు. బాబాయొక్క భౌతికవిక్షేపముగా భావించవచ్చును. "వాతనియామక యంత్రము (air condition) శరీరమును చల్లపరచునుగానీ, మెదడును వేడెక్కించును" అని వారు పలికినప్పుడు, నా 'శరీరముతో' చలి, తలలో వేడిని అనుభవించి నట్లయినది. అదే విధముగా, వారితరవిషయములను గురించి చెప్పినప్పుడు వాటికి అనుగుణ్యమైనభావములు మనలో కలుగుతవి. ఇంతటి శక్తివంతమైన మాటలకు మూలమెంతో అద్భుతమైనదని, గుహ్యమైనదని అని పించినది. ఆ శక్తిని గురించి చెప్పుటకుకానీ, దానిలోతును కొలుచుటకుకానీ, నేనెంతో అల్పుడను.

పతంజలి యోగ సూత్రములలో, ఈశ్వరుని గురించి ఈ విధముగా వర్ణించబడినది ; భగవంతుడెటి ఆటంకములకు (అవరోధములకు) చలించడు, కర్మ బద్ధుడుకాడు : కర్మాతీతుడు. ఆతడే సర్వ కర్మ ఫలము. వారియందే సర్వశక్తులయొక్క, సర్వజ్ఞానము యొక్క మూలమున్నది. ఉపదేశికులకే ఉపదేశికుడు ; కాలాతీతుడు ; బాబా ఈశ్వరుడని నా కేమాత్రము సందేహము లేదు.

ఆ సంభాషణలో, బాబాలోనుండి అనురాగవాహిని ప్రవహించినది. ఈ విశిష్టమైన అనుభవమనందించి నందుకు నేనెంతో అదృష్టవంతుడను.

వాస్తవములో, సత్యముగా నాకు ప్రత్యేక అస్తిత్వము లేదని తెలియజేసినందుకు, నా కృతజ్ఞతనెట్లు ప్రకటించ గలను ! బాబా ఒక వృక్షమును నాటినారు ; దానికి వృద్ధి చెందు శక్తినిచ్చినారు ; దానికి బాబా నీరు పోసినారు ; ప్రోదిచేయుచున్నారు. ఫలితములు వారి ప్రకటనలు ..... నేను వారి సంసర్గములో ఉన్నాను, నేను వారిలోవున్నాను, నేను వారి స్వరూపమునే

దత్ షెథె

ఆ భగవంతుడు భూమి మీద అవతరించి ఆయన నిజరూప దర్శన భాగ్యమున్ను, ఆయన దివ్య సందేశము విను అదృష్టమును, ఆయన దివ్య పాద నమస్కార అనుగ్రహమును, వారి కరుణాకటాక్షమును. ప్రేమను అనుభవించే అవకాశమును ఇచ్చుచున్న సమయము మనము జీవించుట మహాభాగ్యము. మనము ఎంత అనుగ్రహ పాత్రులమైతిమో, ఎంత అదృష్టవంతుల మైతిమో పూర్తిగా గ్రహించుట అవశ్యకము.

ఏదొ ప్రత్యేక మహా సుకృతములను పూర్వ జన్మ ములలో చేసియుండుట చేతనే ఈ భాగ్యము పొందే అర్హత మనకు లభించినది. ఇదే నాకు బొంబాయిలో, భృగు సంహితలో నా జీవితమును కూర్చి చదువుచూ, ఒక పండితుడు ఇట్లు నుడివినాడు "గత జన్మములలో చేసుకొబడిన సుకృతవిశేషములవలన నీకు మహా పురుషునితో సంసర్గము ఏర్పడినది."

మనకు మనమే అభినందించుకోవాలి. భగవంతుడు 47 సంవత్సరములుగా, మనకోసము వచ్చి ఈ భూమి మీద సంచరిస్తున్నాడు. ఆయనకు మన ప్రేమను, మన విశ్వాసమును, మన పవిత్ర భావము లను సమర్పించుకోవలసిన తరుణమిది....జై భగవాన్

ఇంద్రాదేవి

# అందరిలోను ఆవరించి ....

శ్రీ భగవాన్ సత్యసాయిస్వరూప మపరిచ్ఛిన్నము. అప్రమేయము. వాఙ్మనస్సులకందనిది ప్రేమించిన వారికి సులభగ్రాహ్యమైనది. అప్రమేయమయ్యు ప్రమేయమగునది ; అవ్యక్తమయ్యు వ్యక్తమైనది. అపరిచ్ఛిన్నమయ్యు పరిచ్ఛిన్నమైనది ; గుణాతీతమయ్యు గుణశాలియయినది భగవత్తత్త్వము ఎవరు ఏరూపమున నుపాసించిన ఆ రూపముననే యుండి వారి కందునది భగవత్తత్త్వము ప్రేమించినవారి హృదయములను వీడనిది భగవత్తత్త్వము—అఖండ ప్రేమస్వరూపమే భగవత్తత్త్వము. దీనిననుభవించవలెనే కాని ఇట్టిదని వర్ణించుటకు వీలుకాదు. శ్రీ సత్యసాయి భగవాన్ సామాన్య మానవుడు, మానవోత్తముడు, పురుషోత్తముడు ఆప్తమిత్రుడు, నీతిప్రబోధకుడు, ధర్మప్రచోదకుడు వేదప్రచారకుడు, గాయకోత్తముడు, సుందర రూపుడు నటుడు, కోమలగాత్రుడు, సుస్వరశోభితుడు, దివ్యపురుషుడు, సిద్ధపురుషుడు, అనిర్వచనీయ మహిమాన్వితుడు. భగవాన్ నడక, రూపము, మాట, పాట సర్వము మధురమె "మధురాధిపతే రఖిలం మధురం" అను వాక్యమును శ్రీ సత్యసాయి వద్ద ప్రత్యక్షముగా చూడవచ్చును. భగవాన్ ఒక వేదము ; పురాణము ; మహా కావ్యము, అవ్యాహతమగు వాక్ శక్తిచే వేదము, హితమును దృష్టాంతములతో చూపుటలో పురాణము — చేయవలసిన దానిని చెప్పక ఆనందముతో ఎవరికి వారే ఆచరించునట్లు చేయుటలో మహాకావ్యము.

శ్రీ భగవాన్ ఒక భగవద్గీత- అది కర్మయోగమును, భక్తియోగమును, జ్ఞానయోగమును శరణాగతిని కూడ బోధించును. ఆ ప్రశాంతి మందిరము ఆర్తజనతాపహర ప్రశాంతిమందిరము. ఆ ప్రదేశమే మనసును చల్లపరుప గలదు. ప్రశాంతి నీయగలదు. అక్కడ ధూర్తులు, కితవులు, అవినీతులు, ఆర్తులు ఉండరు. అందరూ భగవత్తత్త్వోపాసకులే. ఎవరిమట్టుకు వారికి తెలియకుండగనే సాయి భగవాన్ అందరిలోనూ ఆవరించి యుందురు. ఇది ఒక విచిత్రమైన అనుభవము. అక్కడి ఉన్నంతసేపూ మనస్సున మరొకటి మెదలదు. ఎంత ఆర్తుడైనా ఎంత ధూర్తుడైనా శ్రీ సాయి భగవానే వాని మనసున కాలంబనమై యుండును. ప్రేమమయ వాత్సల్యపూర్ణ సర్వశక్తిమంత, సర్వసులభ సుమధుర, భగవత్తత్త్వమే-శ్రీ కృష్ణతత్త్వము అదే శ్రీ సత్యసాయి భగవత్తత్త్వము.

ఓం నమః సాయినే
ఓం నమః సత్య సాయినే
ఓం నమో భగవతే సత్య సాయినే

శ్రీ భాష్యం అప్పలాచార్యులు

# శ్రీ సత్యసాయి విజయం

( బుర్ర కథ )

కూర్పు : అమరేంద్ర

భక్తి జ్ఞాన వైరాగ్యమార్గములు
  ప్రజలకు బోధించే    భళాభళి
భుక్తి ముక్తి శక్తి ఇత్తును
  కీర్తన చేయండీ    భళాభళి
అనుచు బాలకుడు అద్భుతమైన
  భజనలు చేయించే    భళాభళి
" మానస భజరే గురుచరణం
  దుస్తర భవ సాగర తరణం  "

వచనం  అటుతరవాత కొన్నాళ్ళకు అన్నగారు హంపీ విరూపాక్షాలయానికి బాబాను తీసుకువెళ్ళారు, అక్కడొక గొప్ప చిత్రం జరిగిందయ్యా, మరుపురానిసన్నివేశమది.

వంత  ఏం జరిగిందో త్వరగా చెప్పవయ్యా నాయనా !

కథకుడు  అంతా ఆలయంలోపలికి వెళ్లారు. ఆయన ఒక్కరే వెలుపల మండపం దగ్గిర స్తంభానికి ఆనుకుని ఆకాశం వంక చూస్తున్నారు. అప్పుడేం జరిగిందంటే—

  తమ కన్నులనే నమ్మజాలకా
    తడబడిపోయారూ    భళాభళి
  మూల విరాట్స్థానంలో వారికి
    బాలుడు కనుపించే    ,,
  కలయో వైష్ణవమాయో అంటూ
    కలవర పడ్డారూ    ,,
  విరూపాక్షుడే తానని బాబా
    నిరూపించినాడూ    ,,

జీవుడు కానూ దేవుడనేనూ । తందానా
ప్రాణకమల మకరందం నేనూ । ,,
మేనొక రూపం నేనొక దీపం । ,,
మెరుపు తీగయే నాదు స్వరూపం । ,,
మేలుకొలిపి ఈ మానవ జాతికి మేలు చేయగలనూ । ,,

వచనం ఆ తరవాత ఒకనాడు మన పధ్నాలుగేళ్ల బాబు
పధ్నాలుగు భువనాలు పాలించే సాయిప్రభువైపోయి
1940 సంవత్సరం అక్టోబరు 20 తేదిన ఏమన్నారంటే
నాకు మీకు సంబంధము నేటితో సడలిపోయెనయ్యా । భళాభళి
భక్త బృందమే నావారలు మరి వారివాడ నేనూ । ,,
భక్తానందమే నా ఆహారం వారి మనస్సుల నాదు విహారం
ముక్తిమార్గమున సాగిపొండి
ఇక రక్తిని విడరండీ ,,

వచనం ఈ విధంగా ప్రారంభమైన సాయి ప్రబోధం పావన
జీవనదిగా ప్రవహిస్తూ ఎందరినో పునీతంచేస్తున్నది.

వంత ఇందాక మనం వస్తుంటే దారిలో కనుపించిందే పాత
మందిరం. దాని సంగతేమిటో చెబుతానన్నావుగదయ్యా

వచనం అది సాయి కృష్ణుడు ఆడిపాడిన గోకులం. ఆ మందిరం
1945 లో ఏర్పడింది.
బాలసాయియే పరమదైవ మని తందాన
భక్తులసేవయె తనకు ధర్మమని ,,
తలచి కరణము సుబ్బమ్మగారు ,,
వేసినదొక్క పాకను వేడ్కతో ,,

వచనం అప్పుడు స్వామి భక్తులతో ఆడుతూ పాడుతూ, ఆర్తి హరిస్తూ
ఆనందం చిలకరిస్తూ సంచరించేరు అప్పుడు—
తిరుమలరావను భక్తుడక్కడికి తరలి వచ్చినాడూ । భళాభళి
తిరుగులేని తన పేగునొప్పితో శరణు వేడినాడూ ,,
కరుణతోడ మన బాబా అతనికి కలలోకనుపించి । ,,
కత్తితోడ ఆ పేగును కోసి కడుపును సవరించే । ,,

తెల్లవారి తన పక్కచూసుకుని తెల్లబోయినాడూ ।తందాన
నెత్తురు దాగులు దుప్పటినిండా చిత్తర పోయాడూ । ,,
మాయమైన దా బాధ సర్వమూ మరుసటి దినమందే ,,
కలలోకనబడి ఆర్తిహరించే కరుణామయుడండీ । ,,
భక్త రక్షణమె బాబా దీక్షగా వరలుచుండునండీ
అమమతి గొని ఆ తిరుమలరావు అప్పుడు కట్టి చె
ఆచటికి వచ్చే భక్తుల వసతికి ఆ మందిరమదియే ॥

వంత అయితే ఆ మందిరంనుంచీ బాబా ప్రశాంతినిలయానికి ఎప్పుడు వచ్చారయ్యా ? గోకులంనుంచి బృందావనం మారినట్లు !

కథకుడు ఎప్పుడంటావా ? 1948 లో ఏర్పడిందయ్యా మనంపున్న ఈ నిలయం. ఎందుకంటే
దేశదేశముల సత్యసాయియే దేవుడంటు తెలిసే తందాన
దివ్యభక్తులకు పుట్టపర్తియె తిరునాళ్లయిపోయే ! ,,
జన సముద్రమే కదలివచ్చె జలసముద్రమును మించీ । ,,
భక్తుల గుండెలె బాబాగుడులై । ,,
బాబానామమే దివ్యమంత్రమై । ,,
పుట్టపర్తి పుణ్యాల రాశి
పుడమిపైన రెండవ కాశి
అన్నలారా, రెండు కన్నులారా మనము
దరిసించుకుందాము తరియించి వద్దాము -
మందమతివిడనాడి అంధమతులముగాక
ముందుగతులను కనగ ముందడుగు వేద్దాం

వచనం అనుకుంటూ అసంఖ్యాకంగా తరలి వచ్చే ఆ భక్త జనావళి సౌకర్యం కోసం వెలసింది.
అశాంతి హరమౌ ప్రశాంతినిలయం అవని వెలసెనండీ,
చింతలెన్ని మన యింటనుండినా తందానా
వంతలెన్ని తమ ఒంటనుండినా ,,
ఇంతలోనే మటుమాయంచేసే ,,
అంతులేని మహిమలకు మందిరం తందాన
శాంతిసౌఖ్య సౌభాగ్య సుందరం ,,

వంత ప్రశాంతి నిలయం దేశదేశాలవారికి పవిత్రక్షేత్రమై పోయింది. సర్వమత సమ్మతమైన మహిమాలయం రెండవ హిమాలయం.

కథక	అలనాడు షిర్డీలో సాగిన భక్తరక్షణ, ధర్మపోషణా నేడు కూడా బాబాకొనసాగిస్తూ వారే వీరని నిస్సందేహంగా నిరూపిస్తున్నారు : కాలికి దారుకట్టిన పావురాలలాగా తనవారిని దగ్గరికి చేర్చుకుంటున్నారు.

రగడ	వంటచేసేవేళ అదిలించి కొడుతుంది
పడ్డించు సమయాన ముద్దుగా పెడుతుంది
మన తల్లి శ్రీసాయి మాతరా ।	సై
ఘనప్రేమ సముపేతరా ।	సై
ప్రేమ స్వరూపమే సాయిరా ।	సై
జీవకోటికి దొరకె హాయిరా ।	సై
చెదపట్టిందని చెట్టును కూల్చుట క్షేమంకాదన్నా ।	భళాభళి
చెద తొలగించీ చెట్టును పెంచగ చేరవచ్చె సాయీ	,,

పాట :	ప్రేమావతారా సాయిమహిమావతారా సాయీ
యుగావతారా సాయీ కలియుగావతారా సాయీ.

వంత	వెయ్యితల్లుల ప్రేమ వెయ్యితండ్రుల మమత వెరసివేసినా తులతూగవు బాబా ప్రేమకు. ఒక్కసారి రుచిచూస్తే వదలగలమా ?

కథక	అమ్మల గన్న అమ్మరా ।	సై
ఆదరించెడీ అయ్యరా ।	సై
అందులకే శివశక్తి రూపమై ।	తందాన
అందరినీ అలరించు స్వామిరా ।	,,
ఆయనే రాముడై ఆయనే కృష్ణుడై ।	,,
సకల దేవతలరమ్య స్వరూపమై ।	,,
మన సాయి వెలసేనురా	,,
జనులెల్ల మురిసేనురా	,,
సాయి కనరానట్టి స్థానమేలేదురా	,,
ఆయనది కానట్టి నామమే లేదురా	,,

వంత	అంతా సాయిమయం జగమంతా సాయిమయం అందామా !

కథక		సాయి సర్వాధారుడై సకల జగదభిరాముడైనాడు.
సనాతన ధర్మ సంస్థాపనకు కంకణం కట్టుకున్నాడు.
నరుల-దరకూ తరణోపాయం

నామస్మరణమెరా		భళాభళి
నాగుపాములా తిరిగె మనసుకు
నాగస్వర మదిరా		,,
సత్యశాంతి ధర్మ ప్రేమలతో	తందాన
నిత్యజీవన యాత్రసాగాలీ		,,
నాల్గు గుణాలే నాల్గు వేదముల సారాంశంబనరా ।	భళాభళి
భారతదేశపు రథానికవియే నాల్గు చక్రములురా		,,
బాబాయే మన సారథికాగా పరుగులు తీసెనురా		,,
భద్రముగా భాగ్యోదయ సీమకు పయనము సాగెనురా		,,

వచనం		భూమాత, గోమాత, వేదమాత — ఈ మాతలను పోషించు
కోవాలి అంటున్న సాయి మాత

రగడ		వేదమన్నదే మనకాభరణం ।		తందాన
అంధకారమున ఆశాకిరణం ।		,,
ఖేదము తొలగీ మోదము కల్గును
వేదమెరిగియున్నా		,,
విశ్వానికి మన భారతదేశం		,,
వినిపించే నొక శుభసందేశం		,,

వచనం		వేదములను పునరుద్ధరించి సనాతన ధర్మం సంపూర్ణంగా
వికసించటం కోసం విద్వన్మహాసభ, వేదపాఠశాలా నెలకొలి
పారు. జనని సంస్కృత భాషను పోషణ చేస్తున్నారు.

వంత		అవునౌను. కళాశాలలు కూడా ఏర్పాటుచేశారని విన్నాను.

కథక		బృందావనమున యువకుల కొకటి ॥	తందాన
అనంతపురమున మహిళల కొకటీ		,,
సుందరముగ నిర్మించారూ		,,
శుభ సందేశం అందించారూ		,,

వంత		ఏమిటయ్యా సందేశం ?

కథః అందించెను ఒక సందేశం
అన్ని జాతులకు ఆదేశం తందాన
విద్యయన్నదే మనుజలందరికి
హృద్యమైన ధనమౌ ,,
చిరంజీవులకు చెప్పితీరవలె
చదువుల మర్మాలూ । తం । బాలవీరులే భావిపౌరులు । తం.
శ్రీమతులకు బోధించిన చాలును
చిక్కని ధర్మాలూ । తందాన
ఉయ్యాల ఊపేటి కేలూ । తందాన
ఉర్వినే సరిదిద్ది యేలూ । ,,
అప్పుడేదేశం అద్భుతశోభల
అలరారేనండీ భళాభళి
అక్షర జ్ఞానం అలవడినంతనె చదువురాదు బాబూ ,,
రక్షకుడగు పరమాత్ముని తెలుపుటె
చదువుల సారమురా ,,
చక్రహస్తుని ప్రకటన చేసే చదువదియే చదువూ ,,
హరిగుణగానము నేర్పని గురువూ ధరణికగును బరువూ ,,

వంత అందుకే నన్న మాట బాబా బృందావనంలో పెద్ద ఎత్తున వేసవి ప్రబోధ పాఠశాలలు నడుపుతున్నారు.

కథక బృందావనం ప్రాచీన కాలపు తపోవనం. అక్కడ స్వామి నడుపుతున్నది ఋషికులం, గురుకులం. అంతటి ఘనమైన కార్యక్రమం నిర్వహించటం మాటలా ? సర్వశక్తి సమన్వితుడైన సాయినాథ ప్రభువుకే సాధ్యం.

వంత నిజం నిజం. అనితర సాధ్యమైన కార్యాలు సాయికి సులభం సుసాధ్యం. సాయితత్త్వం విస్తరింపజేయటం కోసం నేడు

ఊరూరా భజన మండలులూ సేవాసమితులూ వెలసి కృషిచేస్తున్నాయి. బాలవికాస్ దళాలూ, సేవాదళాలూ, మహిళా విభాగాలూ సాయి ప్రబోధాలను అందరికీ అందిస్తూ అమృతధారలు చిందిస్తున్నాయి.

పాట సాయీ శ్రీ సత్యసాయీ - నీ నామస్మరణ మెంతైన హాయి.
రాగమాలికల రాముని కొలిచిన
త్యాగరాజునికి తమ్ముఁలమయ్య
అనృతమంటే మృత్యువంటివీ
అమృతమంటే సత్యమంటినీ
స్వధర్మాలను ఉద్ధరించుమని
అధర్మాలను ఉత్తరించమని
మెరుపుతీగవై మానవ జాతికి
వెలుగుచూపితివి జిలుగు కూర్చితివి
నీ పేరే నిజమగు జపమాలా
నిన్ను మరచి వేరే తపమేలా ?

వచనం త్యాగయ్యగారు రాముణ్ని గురించి చెప్పినవన్నీ మన సాయి రామునికి సరిపోతాయి. ఉండేది సాయి ఒకడు, తామసాది గుణరహితుడు: ధర్మాత్ముడు, సర్వసముడు. గురుపూర్ణిమ—నవ రాత్రి—శివరాత్రి పర్వదినాల ప్రాముఖ్యం వివరిస్తూ స్వామి చేసే ఆధ్యాత్మిక ప్రబోధం అసాధారణం అపమానం; పండిత పామరరంజకంగా గుండెలకి తగిలేట్లు చెబుతారు.

రగడ కోటివీణలూ ఝుంకరించురా గొంతు విప్పినంతా । భళాభళి
కోటికోకిలలు కుహూరవమ్ముల కొసరి కూయునండీ । భళాభళి
భస్మరాసులకు ప్రాణమొసంగే పావన జాహ్నవిరా । భళాభళి
బాబా పలుకులు తొలకరి చినుకులు । తందానా
బాబా మాటలు వెన్నెల బాటలు । తందానా
బాబా పాటలు తేనెల వూటలు । తందానా

వంత ఆ వుపన్యాసం ఒకసారి వింటే మరుపురాదు. ఇంకెవరి మాటలమీదా మనసు పోదు. ఆ మాటలు ముత్యాల మూటలు.

కథక రగడ
ఆలింపరా....పాలింపరా
సత్యసాయి సందేశం మంత్రోపదేశం
అచంచలం దీక్షతోటి అవరోధాలెల్ల దాటి
కోటి వేల్పులకు సాటి కృష్ణసాయియని చాటి
ప్రేమకు మదిలో పాదులు తీసి

మమతకు మనసుల నీరే పోసి
మానవ సేవే మాధవసేవని
మనుగడలో చూపి । ఆలింపరా

వంత బాబా ఎన్నో మహిమలు చేస్తారనీ, విభూతులూ ఆభరణాలూ ఉంగరాలూ ఇస్తారనీ అంటారు. ఆ మాటేచెప్పవేం ?

కథక ఆ మహిమలన్నీ బాబా అద్భుత శక్తికి నిదర్శనాలేకాని ప్రదర్శ నాలు కావు. అవి కూడా భక్తుల రక్షణ కోసం, ఆనందం కోసం బాబా చేస్తారు. ఒక్కొక్క భక్తుణ్ని కదిలిస్తే ఒక్కొక గ్రంథానికి సరిపడ్డ అనుభవాలు చెబుతాడు. అలనాడు షిర్డీలో వర్తకులు తైలం ఇవ్వకపోతే ప్రమిదల్లో నీళ్లు నింపి దీపాలు వెలిగించాడు సాయి. ఇప్పుడు కూడా ఆపదల్లో చిక్కిన తన భక్తుల్ని సంరక్షించటం కోసం ఎన్నో మహిమలు చేస్తారు బాబా
ప్రాణంలేదని శవాలగదిలో పడవేసినవాడూ భళాభళి
భక్తరక్షకుని హస్తస్పర్శతో బతికి లేచినాడూ । భళాభళి
ఎన్నని చెప్పను బాబా మహిమలు ఎన్నతరము గాదూ
కన్నవారికి విన్నవారికి కడువింతగ దోచూ
అన్నిటికంటే మనిషిని మార్చుట మిన్నయైన మహిమా । భళా
రాతిగుండెలే వెన్నముద్దలై రంజిల్లును నేడూ । భళా
పరుసవేదిరా బాబా ప్రేమ నిరుపమానమయ్యా । భళా

వంత ఇన్ని మన కోసం చేస్తున్న కరుణామయుని ఋణం నరులం ఎల్లా తీర్చుకోగలం ? సాయి నాకు ఏం చేశాడంటూ అడిగే వారు సాయికోసం నేను ఏం చేస్తున్నానని ఎన్నడైనా ప్రశ్నించుకున్నారా ?

కథక ఆయనకు మనం ఏమి ఇవ్వగలం ? ఆ ప్రేమమూర్తికి ఇతరు లకు ఇవ్వటమే ఆనందం. ఏదీ కోరని స్వామికి నేడు
సమర్పిద్దాము మన దేహపత్రం ॥ తందానా
సమర్పిద్దాము మన హృదయ పుష్పం । ,,
సమర్పిద్దామురా కర్మఫలం ,,
మన ఆనంద బాష్పాల జలం ,,

వంత ఇంతసేపూ దరహాసాలు వెదజల్లుతూ కథవింటున్న స్వామి
ఎల్లా మెరిసిపోతున్నారో చూడు ఊయ్యాలలో

కథక పాట

ఊగాలి ఊయ్యాలలూగాలి
ఊయ్యాలలూగాలి జంపాలలూగాలి
వెయ్యాలి హృదయాన ఊయ్యాల సాయికీ
పాలకడలిని తూగు పన్నగశాయి
భక్తాళి మనసులా బంగారు సాయి
అఖిల బ్రహ్మాండమే తూగాడు డోల
నాలుగూ వేదాలు గొలుసులై వ్రేల
ఆలించి మా మనవి లాలించి పాలించీ
ఆర్తిని తొలగించు కృపామూర్తీ మా చక్రవర్తి !

రగడ విశ్వమంతట వినూత్నతేజం విరిసనదీనాడూ ! భళాభళీ
శాశ్వతమైన సాయి యుగమె జగమందున సాగేనూ ,,
సత్యధర్మములు శాంతి ప్రేమలూ నిత్యము వెలసేనూ ,,
అనంతమైనది సాయి చరిత్రం తందానా
భవభయ హరణం పరమ పవిత్రం ,,
ఆయన మహిమలు తెలుప సాధ్యమా
అమర కవులకైనా ,,
సద్గతినొసగే సాయే మనకూ చక్కటి కనుదోయీ ,,
సద్గురువై బోధించును నిత్యం శివసుందర సత్యం ,,
శ్రీ సాయీశ్వర చంద్రశేఖరా శ్రితజనమందారా ,,
కరుణ జూపి సద్భక్తినొసగి మము కాపాడుము దేవా ,,
జగద్గురూత్తమ పీఠమురా మన ప్రశాంతినిలయమ్ము ॥ శ్రీ
నిగమాగమ సారామృత వర్షము నిత్యప్రబోధమ్ము । శ్రీ
ప్రశాంతి నిలయమె కైలాసమురా ! తందానా
పరమేశ్వరుడీ సాయినాథుడూ !
కుటిల కుంతలాల్ జటా జూటమురా ! ,,
గళమున దాచీ హాలాహలమూ ,,
కళల నిండు జాబిల్లివదనమున ,,
మధురశాంతి సుధ వసుధకొసంగెను ,,

శ్రీ సాయీశ్వర చంద్రశేఖరాశ్రితజనమందారా
చీకటిదారుల వెలుగుజూపిమము నడిపింపుముదేవా

మంగళం

సాయీ నీకిదే మంగళం
శ్రీ సత్యసాయీ నీకిదే మంగళం
కంటిరెప్పవోలె ఇంటా జంటా నుండీ
కాపాడి దరిజేర్చు కరుణాభరణ
సత్యసాయీ నీకిదే మంగళం
రాజీవనయన దివ్య తేజోవిరాజమాన
రమణీయ రూప సత్యసాయీ నీకిదే మంగళం
సాకేతపురధామా సకలగుణాభిరామా
నవనీల ఘన శ్యామా సాయీ పరంధామా
శ్రీ సత్యసాయీ నీకిదే మంగళం

## భజన—భేషజము

ఆరు సంవత్సరముల నుంచీ బెంగళూరులోని చామరాజపేట సత్య సాయీ సేవాసమితి విభాగమువారు గౌర్నమెంట్ మెంటల్ హాస్పిటల్‌కు వెళ్లి అచ్చట మాసమునకు రెండు మార్లు ముఖ్యమైన ఉత్సవదినముల లోనూ భజన కార్యక్రమములను శ్రద్ధగా నడుపుచున్నారు. డాక్టర్లు, నర్సులు, ఆ మానసిక రోగుల సంరక్షకులు ఈ భజనలు సలుపు సభ్యులకు స్వాగతమిచ్చి, ప్రోత్సహించుచున్నారు. ఈ భజనలు రోగులకు అలసట ను పోగొట్టి మనశ్శాంతిని అందించు నని వారి భావన. ఈ విభాగము వారు రోగులను చుట్టు ప్రక్కలనున్న దేవాలయములకు తీసికొని వెళ్లి వారితో కలసి పూజలు సలుపుచున్నారు. ఈ రోగులలో కొందరు చక్కగ భజనలు పాడుచుండగా, మరి కొందరు తబల, హార్మోనియము వాయించుచుండగా మిగత అందరూ వారితో కలసి గొంతెత్తి పాడుదురు. ఇందులో పాల్గొను రోగులలో 50 మంది పురుషులు 70 మంది స్త్రీలు కలరు. రోగులను వైట్‌ఫీల్డులోని బృందావనమునకు ఒకానొకదినమున తీసికొని వెళ్లి, వారికి భగవానుని దివ్యదర్శన భాగ్యము కూడ సభ్యులు అందజేసిరి.

# పవిత్ర సమరము

మనలను కూడా చేర్చి మన చుట్టూ ఉన్న యీ దృశ్య ప్రపంచమంతా ఆ పరబ్రహ్మములోని అంశమే కాని మరొకటి కాదు. ఉపనిషత్‌కారులైన మహా యోగులు తమ సహజ జ్ఞానముతో తమ ఆశ్రమము లలో ఈ సత్యమును చూచినట్లు వెల్లడించినారు. ఈ సత్యమును స్థిరపరచుటకే అవతారములు మరల మరల సంభవించినవి. మునులు ఈ సత్యమును తమ తీవ్ర సాధనతో అనుభవించి జీవన్ముక్తులైనారు.

మోహక్షయమే మోక్షమని బాబా చెప్పినారు. ఈ దృశ్య ప్రపంచము పరమపదార్థము నుండి వేరు అనే మోహము క్షయించాలి. ప్రాచీన పుణ్యభూమి అయిన భారత దేశములో ఏ కొద్దిమంది మాత్రమే ఈ పరమ సత్యమును పరమ విశ్వాసముగా భావించినారు, ఈ సత్యమును అతి కొద్దిమంది మాత్రమే గ్రహించ కలిగి నారు. చాలామందికి దానిని అవగాహన చేసికొని అనుభవైకవేద్యము చేసికొనుట కష్టము. దానిని బుద్ధితో అర్థము చేసికొనవచ్చునేమో కానీ, అనుభవము ద్వారా వాస్తవానికి విశ్వసించలేకున్నాము. మహా అయితే, మనకు పనికి వచ్చునంతవరకు భగవంతుడొక సంకేతము, మాత్రమే ! దృశ్యప్రపంచమును గురించి హేతు వాదములో ప్రవేశము కలిగి, సైన్సు విద్యలో పెరిగిన ఆధునిక మానవునితోనే వచ్చిన చిక్కు ; హెచ్చుమందికి విశ్వాసమును కలిగింప లేని స్థితికి చేరుకున్నాము. మతమును మూఢ విశ్వాసముగా భావించి ' బుద్ధిమంతులు ' దానికి దూరముగా తొలగి ఉంటున్నారు.

ఆధునిక భారత ఆధ్యాత్మిక మహాద్రష్ట అయిన రామకృష్ణ పరమహంస తన జీవితకాలమందే, అన్ని మతములకు దేవుడొక్కడే, అన్ని మార్గముల గమ్య మొక్కటె అని ప్రాచీన ఋషి పుంగవులు కనుగొనిన సత్యమును పునరుద్ఘాటించి మరొక అడుగు ముందు కేగినాడు; కొందరు యోగ్యులైన యువకులలో భగవంతుని గూర్చిన జిజ్ఞాసను కలిగించినాడు. వారిలో ముఖ్యుడు, వారికి ప్రేమపాత్రుడయిన, స్వామి వివేకానందుడు, ప్రాక్‌పశ్చిమ ఖండములలో వైదిక సత్యములను ప్రకటించిన మహానుభావుడు. దక్షిణ భారత దేశమందలి రమణమహర్షి మరొకరు. వీరు అంతర్గత ఉపపాదనలను విశదపరచి, తనను చేరిన వారందరికి ' అహం ' ను గురించి అన్వేషణా మార్గ మును చూపించిన మహా తపోధనుడు. శ్రీ అరవింద యోగి తన గంభీరరచనలద్వారా అనాది సత్యములను ప్రకటించి విద్యాధికులనేకులను ఉత్తేజపరచినారు.

షిర్డీ సాయిబాబా ఒక మహత్తర దివ్య దృగ్విష యము. వారి పద్ధతులద్వితీయములు. ప్రాచీన ఋషులవలెకానీ, ఈ మధ్య జన్మించిన యోగులవలె కానీ, కాకుండా, వారిని దర్శించుటకు వెళ్లినవారిని స్వయముగా తనవద్దకు ఆకర్షించుకొనినవారిని మాన సికముగానే కాకుండా తన సర్వాంతర తత్త్వమును

ప్రత్యక్షముగా చూపించి ప్రబోధించినారు. గ్రంథస్థము చేయబడిన లీలలు ఈ తత్వమును గురించే తెలుపుచున్నవి. భక్తులకు వారిచ్చిన సహాయసంపదలు స్వప్నములందే రానున్న విషయములు తెలిపి హెచ్చరించుట, వివిధ రూపములలో భక్తులకు తోడ్పడుట, వేదాంత గ్రంథములలో చెప్పినట్లు వారి సర్వ వ్యాపకత్వమును నిరూపించుచున్నవి. వారు మానవులలోనే కాక మానవేతర ప్రాణులలోకూడా కుక్కగానో, ఈగగానో ప్రత్యక్షమయినారు. దృశ్య ప్రపంచము, అంతిమ సత్యము, ఒక్కటేనని 'శాస్త్రీయముగా' రుజువుపరచినారు!

భగవాన్ సత్యసాయి బాబా వారు ఈ సత్యమునే ప్రకటించుచున్నారు. వారిని చూడ గలిగి, వారి దివ్య సందేశములను వినగలిగినందుకు మనమెంతో ధన్యులము. వెనుకటివలనే ఇప్పుడు కూడా, ఇంకా చాలా అధికముగా, షిర్డి విధానమె కొనసాగుతున్నది, బాబా తన సంభాషణలలో, ప్రత్యేక సమావేశములలో, తన సర్వవ్యాపకత్వము, సర్వాంతర్యామి తత్వము, సర్వజ్ఞత్వము ప్రకటించుటే కాక, ప్రతిదినమందలి ప్రతినిమిషము, ఆ శక్తులను ప్రకటించుచునే ఉన్నారు.

స్వామి తన 14 వ ఏట తమ దివ్య కార్యక్రమమును చేపట్టినప్పటినుండి, లక్షలాది ప్రజలు, రోగ నివారణకొరకుగానీ, వారి వస్తుసృష్టిని చూచుటకు కానీ, వారి 'గారడి'ని చూచుటకుకానీ, కుతూహలముతోకానీ వారి చేత ఆకర్షితులైనారు. వారి శక్తిని గురించి శ్రీ కే. యం. మున్షిగారు చెప్పినట్లుగా, "ప్రజలు వస్తారు, చూస్తారు, శరణంటారు"

తానే పరమాత్మననే సత్యమును తమ సన్నిధిచేరిన ప్రతివారికి తెలియునటు వారు చేసినారు. మనకుతెలిసిన మన రహస్యములనే కాక, మనకు కూడా తెలియని మన విషయములను తెలిపి, వారు మనయందే ఉన్నారని రుజువు చేసి, తమ ప్రేమ వాహినిలో మనలను ముందెత్తుచున్నారు. తన అనుగ్రహ ఆశీస్సులతో వారి దివ్య మధురవాణి మన చెవులలో ప్రతిధ్వనించుచుండగా, బాబా మనతో ఉండి మనకు దారి చూపెదనని చెప్పుచున్నారు. తన హృదయము చూపించుతూ "ఇక్కడొక రేడియో స్టేషనున్నది" అని మందహాసము గావించుతారు. భగవంతుడు సర్వ ప్రాణి హృదయములందు విరాజమానుడై ఉన్నాడని కవులు వర్ణించినారు కాని, అది వాస్తవమని బాబా చూపించినారు. ఈ భావము క్రమముగా చెరిగి పోవచ్చును; చాలా మంది విషయములో ఇది పరమ విశ్వాసముగా రూపొందుటకు చాలాకాలము పట్ట వచ్చును. అందుచేత స్వప్నములందు దర్శన మిచ్చుచూ, మిత్రులద్వారా లేక గ్రంథములద్వారా లేక మనతో సంభాషించి, "నేను మీ వెంట మీ వెనుక, మీ ముందు ఉన్నాను" అనే సత్యము తెలుపుతారు.

ప్రారంభములో ఈ పలుకు ఒక మిత్రుడు, లేక సహాయకారి చెప్పినట్లు కనిపించును. కాలము గడచిన కొలది, బాబా మనకొక ఉపదేశికుడై చెడ్డదారి పట్టవద్దని హెచ్చరించి, మన హృదయములను పరిశుద్ధ పరచెదరు. వారు నిరంతరము మనయందే ఉన్నారనే భావము స్థిరపడినంత, మనము వెనుకటి అలవాట్లకు దూరముగా ఉండకలుగుతాము. మానవునిలో పరివర్తనము కొనివచ్చుటకిదే సాయి మార్గము! శారీరక రుగ్మతనివారణ కొరకు వారి సన్నిధికి చేరిన వారము అంతకన్న అతి ముఖ్యమైన మానసిక రోగములను నివారించుకొని, ఆధ్యాత్మిక ప్రబోధ మార్గము వెంట నడిచి వెళెదము.

ప్రతివారితోనూ వారితో ఉండి వారికి మార్గము చూపుచున్నట్లు శ్రీవారు చెప్పుతారు; వారి రహస్యములు తెలియజేస్తారు. వారివన్నీ ఏ విధముగా చేయుచున్నారని కొందరు పాశ్చాత్యులు ప్రశ్నించగా బాబా ఇట్లు చెప్పినారు: "నేను మీలో ప్రవేశించి, అక్కడేమున్నదో కనుగొని, ఆపై వెలుపలికి వచ్చి, అక్కడేమి జరుగుచున్నది చెప్పినట్లు భావించవద్దు. నేనెల్లప్పుడు మీ హృదయములందే ఉండి, మీరెప్పుడేమి చేస్తున్నది తెలుసుకుంటాను," దూరాభారముచేత వెరచి బాబాను దర్శించలేనివారియందు, వారిని దర్శించినవారియందు, మీయందు, నాయందు బాబా ఉపస్థితులై ఉండగా, వారు సర్వాంతర్యామియైన పరాత్పరుడు గాక మరెవ్వరు?

బాబా అంతటితో ఆగరు. ప్రతివారియందుండుటచేత నీవు ద్వేషించువానియందు కూడా ఉన్నారు: అందుచేత ఎవ్వరిని ద్వేషించవద్దు అని బాబా పదే పదే చెప్పుచున్నారు. మీ ఇతరులను ద్వేషించిన సాయిని ద్వేషించినట్లే; మీరితరులకు బాధ కలిగించిన సాయికి బాధలు కలిగించినట్లే. ఈ విధముగా వారు సర్వాంతర్యామి అనే సత్యమును ధృఢపరచినారు; సాయి నిన్ను నన్ను వానిని ఒకే విధముగా ప్రేమించిన మనమెట్లు ద్వేషమును పోషించెదము. ప్రేమించుటకే ప్రేమ అని రుజువు పరచి, "ప్రేమతో దినమును ప్రారంభించు, ప్రేమతో దినమును వినియోగించు, ప్రేమతో దినమును పూర్తిచేయుము" అను ప్రపంచము కనివిని ఎరుగని ప్రేమ గీతము నందించినారు.

ఆ సంభాషణలగదిలో కానీ, మరొక చోటకానీ, స్వప్నములో కానీ, వారేది చెప్పినారో, దానినే వారనేక అవతారములలో యుగయుగములందు స్వయముగానో లేక తన ప్రతినిధులద్వారానో ప్రకటించినారు. ఏకత్వమందే అనేకత్వమున్నదని జ్ఞాపకము చేసినారు. వాస్తవమేమనగా, వారొక్కరే కాదు— మనమందరము దైవస్వరూపములే!

ప్రకృతి పరమాత్మ ఒక్కడేనని. పర్యాప్తతత్త్వమే దృశ్యప్రపంచపు ముసుగులో కనిపించుచున్నదని, పరమాత్మ నిన్ను పరివేష్టించిన, నీయందున్న ఈ దృశ్యప్రపంచము ద్వారానె చూడగలవను సత్యమునూ కూడా ప్రతిపాదించినారు. వారిపద్ధతికి అనుగుణముగా, ప్రస్తుత శాస్త్రీయయుగముయొక్క అవసరమును గుర్తించుకొని, ఈ సత్యమును వారు ప్రకటించి చూపుచున్నారు. రాతిని పంచదార కృష్ణునిగా మార్చిన లీలనుగమనించండి. "రాతిలో ఏమున్నది?" అని బాబా భూగర్భ శాస్త్రజ్ఞుని ప్రశ్నించగా, వారేమేమో చెప్పినారు; అందలి అణువులను గురించి, ఎలక్ట్రాన్‌లు ప్రోటానులను గురించి చెప్పినారు. కానీ, రాతిలో భగవంతుడున్నాడని బాబా చూపినారు. ఈ అద్భుతలీల ద్వారా, దృశ్యప్రపంచముయొక్క అంతర్యములో దైవత్వమున్నదని బాబా రుజువు చేసినారు; అది ఒక రాతిముక్క అనే భ్రమ తొలగించినారు; సచ్చిదానందమూర్తి అయిన పరబ్రహ్మ పదార్థమే రాతిముక్క సారమని తెలియ జేసినారు. ప్రకృతి దైవమునుండి వేరైనదని, ప్రత్యేకమైనదని భావించవద్దు; అది అంతా ఒక్కటే." ఈ విషయము తాను వ్రాసిన గరుడపురాణములోని విషయముతో సరిపోయినదని డా॥ నరసప్పగారు తన వ్యాసములో తెలియజెసినారు. ఒక ఆకునుండి దైవత్వము వరకు పరివర్తనలు చేయవచ్చునని, పదార్థ ప్రపంచము వెనుక పరమసత్యముదాగివున్నదని రుజువు దానిలో చేయబడినది. ఆభరణమునే చూచుచున్న నీకు,

అందలి బంగారము కన్నులకు మిరమిట్లు గొలుపు చున్నప్పటికి శ్రద్ధ అంతా ఆభరణముమీద వున్నప్పుడు, ఆ బంగారము కనుపించదు. అదే మాయ లేక అవిద్య.

నేడు బాబా స్పష్టముగా చాటినట్లుగా ఏ వేదాంత శాస్త్రము కూడా దృశ్యప్రపంచము పరమాత్మ స్వరూపమనే గంభీర సత్యమును మానవ చరిత్రలో మరెవ్వరూ, ఎన్నడూ చెప్పి ఉండలేదు. మానవరూపమును ధరించినందుకు అనుగుణ్యముగా, బాబా ప్రజల రోగములు నివారించి, దుఃఖములలో వారిని ఓదార్చి, వారెన్నడో పోగొట్టుకొనిన మహత్తరమైన వారి సత్యమును గురించి హెచ్చరించి, ప్రతివారిలో దైవత్వమును చూపించి, వారందరిని తనవద్దకు ఆకర్షించుచున్నారు. ఈ విధముగా ప్రపంచ పరివర్తనమునకు మార్గము సుగమము గావించుచున్నారు. ఈ బృహత్ ప్రయత్నములో, మన బాహ్యాంతరములందున్న ఆధ్యాత్మిక క్షేత్రములలో జరుగు పవిత్ర సమరములో మనమందరము భాగ స్వాములగుట మన అదృష్టము !

నారాయణమూర్తి

మధురమందస్మితానంద మదమరాళ
గమన హైమవతీనాథ గరళకంఠ
నిత్యమంగళమూర్తినిటిలనయన
నీదు శేషాహిభూషిత నిత్యసీమ
భక్తి మీరగనర్తించు భాగ్యమునకు
ఎన్నో మానవహృదయాలు ఏకమగుచు
మాలలై సుమమాలలై మమత నిలచె

ఓ విరాడ్రూప సాయిగానువృషమయి
ధిమికి ధిమి ధిమి ధీమిధిమి ధిమియటంచు
నటనమొనరించుచున్నావు నాదబ్రహ్మ
దివ్యనటరాజ పర్తీశ దేవదేవ
నీతొనైక్యమ్ము చెందెడి నియతినిమ్ము

టి. వి. సుబ్బరావ్

# విద్యా విధానములు

భావి భారతోద్ధారకులైన విద్యార్థులారా! విద్యాభిమానులారా! ఈనాడు మన పవిత్ర భారతదేశమందు విద్యా విషయములో విపరీతమైన మార్గములు, వికృతమైన తలంపులు మితిమీరి పోవడము మీకు తెలిసిన సంగతే! దీనిని యెంత త్వరగా చక్కచేసిన, అంత మంచిది ఎందుకన, మీరు చదువుయొక్క సార్థకతను సాధించినను, సాధించకపోయినను. భారతీయ పవిత్ర సంస్కృతిని అర్థముచేసుకొని ఆచరించి ఆనందించినను, ఆనందించకపోయినను, సంవత్సరములు మాత్రము దొర్లిపోతూనే యుంటున్నవి. కాయమునకు కేటాయించిన కాలము, క్రమక్రమేణా కరిగిపోతూనేయున్నది.

విద్యార్థి జీవితముయొక్క వయఃపరిమాణము అతి పవిత్రమైనది; యువకుల హృదయములు నిర్మలమైనవి; వాటిని పవిత్రపరచేది అతి సులభము; మలిన పరచేది కూడ అతి సులభమే. అయితే, వాటిని దివ్యత్వమువైపు మరల్చుటకు విద్యావిధానము పూనుకోవాలి. సమాజోన్నతికి ఇది అత్యవసరము. సమాజ జీవితమనేది, ఒక పెద్ద రైలు ప్రయాణమువంటిది. ఇందులోని పాసెంజర్సే ప్రజలు, సామాజిక వ్యక్తులు ఆ రైలులో, ప్రక్క స్టేషన్‌లో దిగేవాళ్లు కొంత మంది వుంటారు, కానీ, దీర్ఘ ప్రయాణము సలుపువారు, యువకులు, విద్యార్థులు కనుక వారికందించే విద్యను గురించి మనము ఎక్కువ జాగ్రత్తగా వుండాలి. వారి జీవితమును పుష్టివంతముగాను తుష్టివంతముగాను ప్రయోజనవంతముగాను రూపొందించాలి. దేశవాసులందరికీ ధైర్యసాహస ఆనందములను అందించవలసిన విద్యార్థులు నేడు అరుదు అయి పోవడము చేతనే, భారతదేశముయొక్క సత్కీర్తి, భారతీయ సంస్కృతియొక్క పవిత్రవ్యాప్తి, సన్నగిల్లిపోవడానికి కారణమైనవి.

లేత హృదయములైన విద్యార్థి హృదయములలో చక్కని సుందరమైన భావనలను నాటవలెను. సుగుణములనే పరిమళము వెదజల్లేపుష్పములనందించే లతలవంటివారు విద్యార్థులు. తల్లితండ్రులపై, దేశ నాయకులపై, ఉపాధ్యాయులపై వారిని సక్రమ మార్గములో శృంగారమైన రీతిగా తీర్చి దిద్దవలసిన బాధ్యతవున్నది.

విద్యార్థి జీవితము త్యాగమయమై, సహనభావముతో కూడినదై వివేక విజ్ఞాన విచక్షణలు నిండినదై రూపొందాలి. విద్యావిధానమందు నైతిక ఆధ్యాత్మిక ధార్మికములయొక్క సమ్మిళిత పద్ధతిని మనము ప్రవేశపెట్టవలెను.

దివ్యాత్మ స్వరూపులైన విద్యార్థులారా! మానవ జీవితముయొక్క విశిష్టతను మీరు ప్రప్రథమములో విచారణజేసి తెలుసుకోవలసిన అవసరము యెంతైన వున్నది. మీరు ఇంత శ్రమపడి కష్టనష్టములకు ఓర్చుకొని ఆర్జించే డిగ్రీలు కేవలము భిక్షాపాత్ర

ములే! వాటిని తీసుకొని, ఆఫీసులకు వెళ్లి, ఉద్యోగం ఉద్యోగం అని వారిని వీరిని అడుగుకొనేదే, ఈ విద్య యొక్క ఫలితము; మానవుని మాధవత్వమునకు కొని పోయే విజ్ఞానము యువకులకు ప్రాప్తించటము లేదు; దానిని భారతదేశముయొక్క పెద్దలూ నాయకులూ కోల్పోయినారు. అన్ని కష్టనష్టములకూ దారిద్ర్యమునకూ ఇదే మూలకారణము.

మీరు విద్యను మనస్సిచ్చి అందుకోవలెను; హృదయమిచ్చి అందుకోవలెను; ఆత్మయిచ్చి అందుకొవలెను. కానీ ధనముయిచ్చి కొనుటకు సాధ్యము కాదు. అయితే, ఈనాడు సరస్వతీనిలయమైనట్టి విద్యామందిరములలో లక్ష్మివచ్చి తిష్ఠవేసుకొనడము చేత, పిల్లల హృదయములందు సరస్వతి దూరమై పోవుచున్నది. సరస్వతీ లక్ష్మి ఇద్దరూ అత్తా కోడళ్లవంటివాళ్లు. ఇరువురూ సమానముగా ఒక్క గృహమునందు నివసించుటకు వీలులేదు. విద్యా రంగములో అనేక కళాశాలలలో, విద్యామందిరములలో పిల్లలను చేర్చుటకు డబ్బు, మార్క్సు కావలెనన్న డబ్బు, పాస్ చేయాలంటే డబ్బు, ఈ రీతి ధనమే ప్రధానమగుటవలన, సరస్వతి అంతర్ధానమై పోయినది. విద్యార్థులు కూడ మార్కులకే ప్రాకులాడుతున్నారు, కానీ రిమార్కులకే మాత్రము యోచన చేయడము లేదు. ఇది విచారించవలసిన పరిస్థితి. దీనివలన, విద్యారంగమునందు వికార మార్గములు విజృంభించి, తద్వారా దేశమునకు సమాజమునకు వ్యక్తికి తీరని లోపము కలుగటము జరుగుచున్నది.

యువకుల హృదయమునుంచి ఉప్పొంగి పొరలే ఉద్రేకమును ఈ వయస్సునందే చక్కగా అరికట్టుటకు, శారీరిక మానసిక ఆధ్యాత్మిక శక్తులు అన్నీ పుష్టి వంతమైన ఈ వయస్సునందే పూనుకోవలెను. అయితే అట్లు ప్రయత్నించక, ఆ శక్తులను విచ్చలవిడిగా ఇతి మితి లేక ప్రవహింపజేయడం వలన, వారి అభివృద్ధి వారి పురోగతి క్రమక్రమేణ క్షీణించిపోవుచున్నది ఈనాడు విద్యార్థుల సమూహమునుంచి వెలువడే ఉద్రేకములకు కాని, తిరుగుబాటుకు కాని, వారి భవిష్యత్తును ఏ మాత్రము లెక్క పెట్టక, వారిని కొంతమంది రెచ్చకొట్టి రచ్చలు లేపడమే కారణమని చెప్పక తప్పదు. ఈలాంటి ఉద్రేకములు తిరుగుబాట్ల వలన ప్రజలకూ సమాజమునకూ కలుగు నష్టము కంటే, విద్యార్థులకే అధిక నష్టము సంభవించు చున్నది. వీటివలన, విద్యార్థులు విలువైన కాలమును వ్యర్థముచేసుకొనడమే కాక, ధనమును వ్యర్థము చేసుకొనడమే కాక, ఉత్తమ భావములను మలిన పరచి, తమ జీవితములనే నిరర్థకము గావించు చున్నారు. Time wasted is Life wasted

ఈ లేత వయస్సునందే మీరు ఉత్తమ ప్రవర్తనలకు కాలమును అంకితంచేసిన, మీ భవిష్యత్తు సర్వాంగసుందరమగును. ప్రప్రథమములో మాతృ దేవో భవ, పితృ దేవో భవ, ఆచార్య దేవో భవ, అతిథి దేవో భవ—అనె వేదవాక్యములనాదరించి అనుసరించి వారిని ఆనందింప జేసి మీరూ ఆనందించండి. సత్యంవద, ధర్మంచర అనే శ్రుతివాక్యములను మీ హృదయమునందు ప్రతిష్ఠ చేసుకొనండి.

అయితే ఈ నాడు కాలమార్పుచేత, విపరీతమైన వికారతత్వములు బయలుదేరి, కొన్ని రాజకీయ వ్యక్తులు విద్యార్థులను హృదయములను మాలిన్య పరచుచున్నారు. వారి స్వార్థముకోసం విద్యార్థులనుప యోగించుటకు వారు చేసే ప్రయత్నములలో మీరే మాత్రమూ ముందంజవేయ కూడదు. విద్యార్థులు విషయార్థులు కాకూడదు, మీరు విద్యార్జనను పూర్తి

చేసిన తరువాత, రాజకీయములో చేరి లీడర్స్ ప్లీడర్స్ కావచ్చు. కానీ విద్యార్థి దశయందు మాత్రము ఇట్టి అపవిత్రమైనవాటికి యే మాత్రమూ చోటివ్వక, విద్యనుమాత్రము చక్కగా నేర్చుకొని మీ భవిష్యత్తు యొక్క భారతదేశము భారతీయ సంస్కృతియొక్క గౌరవ ప్రతిష్ఠలను నిలుపుకొనుటకు పూనుకొండి.

విద్యా విధానములలో చాలా మార్పు కావలసిన అవసరమున్నది. వేదవిహితమైన మన ధర్మమును, పురాతనమైన మన చరిత్రను ఆనందదాయకమైన మన నీతి నిజాయితీలను నిలబెట్టుటకు మీరు పూనుకోవాలి అని నేను ఆశిస్తున్నాను.

మరొక విషయం: ఈనాడు కళాశాలలకు వెళ్లడమనేది కేవలము ఒక క్లాసులో చేరి, గ్రంథములను పఠించి, బహుళ గ్రంథపరిచయము కొరకు వెళ్లడం కాదు గ్రంథములను చదువాలంటే, ఒక టీచరును గ్రంథములను ఇంటిలోనే పెట్టుకొని చదువవచ్చును కదా ? కళాశాలకు వెళ్లవలసిన అవసరమేమున్నది ? ఒక సబ్జెట్ నిమిత్తమై, గ్రంథము చదువే నిమిత్తమై కాలేజికి వెళ్లడము కాదు. క్రమశిక్షణను లక్ష్యములో పెట్టుకొనే కాలేజికి వెళ్లాలి ! వివిధమైన జాతి మత కుల అంతస్తుగల బాలకులతో వివిధమైన కాలములయందు క్లాసులలోపల, బయటవాతావరణమందు ఏ రీతిగా మెలుగాలి ఏ రీతిగా నడచుకోవాలి ఏ రీతిగా మన ప్రవర్తనను మార్చుకోవాలి, ఏ రీతిగా మన హృదయాల్ని పరివర్తన గావించుకోవాలి, కాబట్టి ఈ నిమిత్తమై కాలేజి చేరాలి.

ఈ నాడు విద్యార్థులందరూ పరీక్షాసమయము వచ్చే సరికి రాత్రింబగళ్లు టీ త్రాగి తలలు నింపుకున్న విషయాలతో పరీక్ష జరిగే హాల్‌లోనికి వెళ్లేప్పటికి ఆ తలలోనున్న సామాన్లంతా కాగితాల మీద గుమ్మరించి ఇంటికి విచ్చేయుచున్నారు. తలలు సంపేది పేపరులో నింపేసి ఖాళీగా యింటికి వచ్చుచున్నారు. కాదు, కాదు; విద్యతో హృదయమును నింపుకోవలెను ! హృదయమును కేవలము ఒక నెగటివ్‌గా తయారు చేసుకోవాలి. అప్పుడు, జీవితములో యెప్పుడు వచ్చినగానీ. ఈ నెగటివ్‌ను పాసిటివ్‌గా ప్రింట్ వేసుకొంటూ కూర్చోవచ్చు, ముఖ్యముగా, జీవితం నిమిత్తమై విద్యగాని, జీతం నిమిత్తం కాదని దృఢం చేసుకోవాలి. విద్యయొక్క బాహ్య లక్షణము, వినయము. విద్య Morality సచ్ఛీలమును అభివృద్ధి పరచాలి, నీతి నిజాయితీలను ఆచరణలో లోతుగా నాటాలి. మన మన పాదముల మీద నిలుచుకొని మన జీవితమును సాగించు స్వశక్తిని ఆత్మవిశ్వాసమును మనోధైర్యమును సంపాదించాలి. మన దేశానికి మన ఆర్షసంస్కృతికి మన సమాజమునకు సేవ జేసె విధానములను నేర్చుకోవాలి. సేవకత్వమే ఉత్తమ సాధనామార్గము. నాయకత్వము నాశించిన, అహంకారము పెరిగి సుఖసంతోషాలకు ముప్పు తెచ్చును. సేవకత్వములోని పటుత్వము, దివ్యత్వము, సార్థకత్వము మానవ హృదయమును మాధవ హృదయముగా తీర్చిదిద్దును.

Love is God ; live in Love. దేవుడు ప్రేమ స్వరూపుడు ; ప్రేమ జీవితము వలనే ఆ దేవుని సాన్నిధ్యము దొరకును. ప్రేమ అనేదే ప్రధానమైన అస్త్రము ; శక్తి ; సామర్థ్యము. జీవనము ప్రేమమయము చేసుకొని ప్రేమస్వరూపుని పొందాలి ; వేరే మార్గములేదు. ప్రకాశించే చంద్రుణ్ణి చూడటానికి వేరె హరికేన్ లైటో, టార్చి లైటో, పెట్రొమ్యాక్స్ లైటో అక్కరలేదు. ఆ చంద్రుని వెలుతురుయొక్క ఆధారముతోనే, చంద్రుణ్ణి చూడవచ్చు.

ప్రేమలేకపోతే, జీవితమే లేదు. ఒక ప్రేమయే మోహముగాను, అనురాగముగాను, వాత్సల్యంగాను, ఇచ్ఛగాను, భక్తిగాను, ప్రకాశవంతముగా పరిణామము పొందుచుండును.

ముఖ్యముగా, ప్రకృతియొక్క స్వరూప స్వభావములను, మానవునియొక్క మానసిక స్వరూప స్వభావములను, భారతీయ విద్యావిధానము తీర్చి దిద్దవలసియున్నది. Nature is the best teacher. ప్రకృతి మానవులకు అత్యుత్తమ గురువు. కనుక, ఆ గురు తత్వమును అది అన్ని విధాలా నేర్పుతుంది. ఈ కళాశాలలో ఈయబడు పవిత్ర విద్యావిధానమును మీరు అభ్యసించి, అభివృద్ధిని పొందండి. అనేక మంది పెద్దలు చేరి ఈ కళాశాలను అభివృద్ధి చేయడం వలన, మీకు ఇచ్చట మంచి విద్యాభ్యాసావకాశము దొరకినది. మన రాజమాతా త్యాగము, పరిశుద్ధమైన అనురాగము, వారి పవిత్రత, ఈ కళాశాలయందు ప్రసరించడము మీరు చాలా ఆనందించవలసిన విషయం. మీరు రాజమాతకు అందించవలసిన కృతజ్ఞత ఏమనగా, ఏ దృక్పథముతో, ఏ ఆశయముతో, ఏ పవిత్ర ప్రేరణవలన, రాజమాత ఈ కళాశాలను అభివృద్ధి చేసిందో, ఆ ఆశయానికి అదృక్పథానికి తగిన శ్రద్ధాభక్తులను వినయ విశ్వాసములను మీరు ఆచరణలో చూపెట్టాలి. ఈ కళాశాల దిన దినాభివృద్ధిగాంచి ఇంకా ఉత్తమమైన వ్యక్తులను దేశోద్ధారణకై సిద్ధము చేసి అంపుతుందని ఆశిస్తూ నేను ఆశీర్వదిస్తున్నాను. నాకు విద్యార్థులన్న, విద్యాసంస్థలన్న అతి ప్రీతి. మీరు ప్రతి ఒక్కరు మంచిగా క్రమశిక్షణలను పాటించి, మంచి మార్కులు సంపాదించి, మీ ఉపాధ్యాయులనూ తల్లి తండ్రులనూ రాజమాతా మొదలైన పెద్దలనూ సంతృప్తి పరచవలెనని కూడ మిమ్ములనాదేశించుచున్నాను.

చర్వితచర్వణంబులకు చంచలవృత్తులలోన చిత్తముల్
పర్వులు బెట్టనిన్ గనరు భవ్యపదంబును గాంచజాలరే
సర్వము సారహీనమొక సాయియె నిత్యుడనంతుడాద్యుడై
పర్వతవాసి శ్రీకరుడు భక్తినిగొల్వనొసంగు భద్రతన్

సిద్ధార్థ

# మానవాళికి గుణపాఠము

అవతార పురుషుల జననీజనకులు — కౌసల్యా దశరథులు, దేవకీ వసుదేవులు, ఈశ్వరమ్మ–పెద వెంకమ రాజుగార్లు — తమ పుత్రుల లీలాగుణగణ విశేషములను అవగాహనము చేసి, అమితానందము పొంది, తమ జన్మ జన్మల తపఃఫలము పరిణమించినదని సంతృప్తులై, దివ్య మూర్తులైన తమ పుత్రులను భజించి తరించుకొనే ప్రజల నాశీర్వదించుచూ, వారి శ్రద్ధాభక్తులలో నిత్యమూ పాల్గొనుచూ, తమ పవిత్ర లోక యాత్ర కొనసాగించిరి.

సత్యసాయీశుని జనకులైన శ్రీ పెదవెంకమరాజు గారు దైవభక్తి పరాయణుడు; సాయిదేవుని భక్తుల పట్ల వాత్సల్యపూరితమైన ఆసక్తి కలిగి, భగవానుని దర్శనార్థమై పుట్టపర్తికి వారు వచ్చినపుడు వారికి సదుపాయములను సౌకర్యాలను ఆదరణతో అంద చేస్తూ ఆనందపడేవారు. భగవానులతో ఋషికేశ్, బదరీనాథ్, అయోధ్యా, కాశీ ప్రయాగ క్షేత్రములకు యాత్రచేసినప్పుడు వివిధ రాష్ట్రములనుంచి వచ్చిన భక్తసమూహముతో యెంతో స్నేహసౌహార్ద్రములతో కలసి మెలసి వారందరినీ సంతోషపరచి తామూ సంతసించే వారు; వారికి శ్రీవారి బాలలీలలను మహిమలను వివరముగా చెప్పి, ఆనందమదించేవారు.

శ్రీవారి జనని శ్రీమతి ఈశ్వరమ్మగారి దివ్య జీవితము భారతీయ మాతృత్వానికి మహదాదర్శము, వారి దయాగుణము, సహన శీలము, దీనులపై వారు వర్షించు అవ్యాజ కరుణ, వివిధ దేశ విదేశాల లక్షల కొలది ప్రజలు అందుకొని, వారిని దేవమాత, జగన్మాత, అని నోరార కొనియాడిరి. తన కుమారునిపై సహజమైన మాతృవాత్సల్య భావమును ఆమె ప్రకటించగా, దానిని గుర్తించిన వారందరికీ యశోదా, కౌసల్యా మాతలు స్మరణకు రాక తప్పదు.

ఆ జననీ జనకుల కళేబరములు, ప్రశాంతినిలయమునకు తూర్పున అందముగా నిర్మింపబడిన ఒకే 'సమాధి'యందు సంస్థాపితమైనవి. 23-11-72, జన్మదినోత్సవ సందర్భమున, ప్రశాంతినిలయమందు సమావేశమైన వేలాది భక్తులనుద్దేశించి, శ్రీవారు, జీవించియున్న తల్లితండ్రులయెడల పెంచవలసిన భక్తి గౌరవాదులను గురించి, గతించిన తరువాత కూడ వారియందు ఉంచవలసిన కృతజ్ఞతా భావమును గురించి, బోధించిరి. శ్రీవారు 'సమాధి' యొద్దకు విజయము చేసి, స్మారక శిలల పైపూలదండలు వేసి, నేటి మానవ జాతికి ఒక దివ్య సందేశమునందించిరి.

"నా జీవితమే నా సందేశము" అంటారు, భగవాన్ ఈ సంవత్సరము కూడ, 23 నవంబరు, జన్మ దినోత్సవమందు, ప్రశాంతి మందిరముపై ప్రశాంతి పతాకను ఎగురవేసిన తరువాత, భక్తసమూహముతో, శ్రీవారు తల్లితండ్రుల 'సమాధి' యొద్దకు వెళ్లి, నూతనవస్త్రములనూ, పూలదండలనూ అర్పించిరి. అచ్చట చేరిన పుట్టపర్తి గ్రామములోని పిల్లలకు, "శ్రీమతి ఈశ్వరమ్మ హైస్కూల్" విద్యార్థులకు నూతన వస్త్రములు, పుస్తకములు, బొమ్మలు, మిఠాయిలు మొదలయినవి స్వహస్తముతో పంచి వారిని సంతోషపరచిరి.

భగవానుని ప్రతి కార్యము, మానవాళికి ఒక అమూల్యమైన గుణపాఠము; సాధకులకు ప్రోద్బలము.

(సం)

# బంధితుల సేవ

నేరస్థులైన బాలురను న్యాయాలయముల తీర్పుల ననుసరించి బోర్స్టలో స్కూల్ అనే ప్రత్యేక పాఠశాలలలో చేర్చి వారికి శిక్షణనందించి వారిని మంచి పౌరులుగా తర్ఫీదు చేసేది ప్రభుత్వముయొక్క నీతి. విశాఖపట్టణమందు ఒక బోర్స్టలో శాలయున్నది. విశాఖపట్టణములోని శ్రీ సత్యసాయి సేవా సమితివారు ఆ శాలలో తమ సేవా కార్యక్రమములను 1971సం॥ యుగాది దినమందు ప్రారంభించిరి.

పిల్లలకు ప్రణవ జపము, సుప్రభాతములను నేర్పించి వారి శాలచుట్టూ నగరసంకీర్తనము చేయుటకు పిల్లలు ఉత్సాహముతో ముందువచ్చారు. ప్రతి దినము తప్పక చేయుచున్నారు కూడ. దినము సాయంత్రము అందరూ సమావేశమై భజనలో పాల్గొను చున్నారు. రెండు మూడు నెలల కొక్కపర్యాయము అఖండభజన కార్యక్రమమును కూడ నిశ్చయించుకొని జరుపుచున్నారు. ఈ క్రమశిక్షణ వలన, వారిలో నైతికాభివృద్ధి కలిగినదని అధికారులు సంతసించు చున్నారు. శిర్డిసాయిబాబా అవతార కథయొక్క ఆధారముమీద రచించిన ఒక నాటకమును దాదాపీర్, ఇమానుఎల్, రామారావు, వెంకటేశ్వర్లు అనే ముస్లిం, క్రిశ్చియన్, మరియు హిందు మతస్థుల పిల్లలు, బాగా నేర్చుకొని విశాఖపట్టణమందు నాలుగు చోట్ల చక్కగా అభినయించి ప్రేక్షకులైన జనస్తోమము యొక్క మెప్పును పొందిరి. శిర్డిసాయి సమాజముయొక్క సభ్యులు పిల్లల నాహ్వానించి, తమ సంస్థయందు కూడ ఈ నాటకము నాడించి పిల్లలను ప్రోత్సహించిరి.

శ్రీవారి వచనామృతములందించు గ్రంథములను బహుమంది పిల్లలు శ్రద్ధగా పఠించుచున్నారు కొందరు చిత్రకల నభ్యసించి శ్రీవారి చిత్రమును వ్రాయుచున్నారు. కొందరు రామకోటి వ్రాయుటకు పూనకొని, ఆ మూలముగా నామస్మరణ గావించు చున్నారు. ఒక అబ్బాయి విడుదల తరువాత, శ్రీవారిని వైట్‌ఫీల్డులోని బృందావనమును దర్శించి వారి ఆశీస్సులను సంపాదించి సంతోషించాడు ; హైదరాబాద్ నగరమందు 'శివం' అనే సౌధమును సమితి వారు నిర్మించి శ్రీవారు దాన్ని ప్రారంభోత్సవము చేసినపుడు కూడ వాడు అక్కడకు వెళ్ళి, ఆ వైభవమును కండ్లార చూచి ఆనందించినాడు. మరి కొందరు, విడుదల తరువాత, వారి వారి గ్రామముల యందు శ్రీ సత్యసాయి సేవాదళ సభ్యులుగా చేరి, భక్తితో కైంకర్యము నొనరించుచున్నారు. వ్యాసరచన నాటకాభినయము, భజనగానము, ఆధ్యాత్మికోపన్యాసములు, మొదలైన విషయములందు పోటీలు ఏర్పాటు చేసి బహుమతుల నందించటము కూడ జరుగుచున్నది. 73వ సం॥ శ్రీవారి దివ్యసందేశము యొక్క విశిష్టతను గురించి, పిల్లలు అమోఘమైన వ్యాసములను రచించి, శిక్షకులనూ సమితి సభ్యులనూ ఆశ్చర్యానందము లందు ముంచివేసిరి. పరమాత్మ స్వరూపుడైన సాయి

భగవాన్ ఈ కలియుగములో కాలానుగుణ వేషధారియై మనము నమ్మేరీతిలో దర్శనమిచ్చాడు, కానీ, భగవాన్ మనిమానవాళికే కాదు. సకల చరాచర జీవకోటి యొక్క కర్త; అందుకే వారు సృష్టికర్త, సర్వాధికారి, సర్వాంతర్యామి, అంటున్నాము. బాబా అంటే, తండ్రి అని అర్థము. భౌతికముగా మన తల్లిదండ్రుల మాదిరి, ఆధ్యాత్మికముగా భగవాన్ మన తండ్రియే. భగవాన్ బాబా కేవలము భక్తులకు మాత్రం దేవుడు, అని కాదు; అందరికీ వారు భగవానే! ఒక తండ్రికి ఇద్దరు కొడుకులున్న, పెద్దవాడు మంచివాడై, చిన్నవాడు దుర్మార్గుడైన, ఇద్దరూ వారి పుత్రులే కదా ? పెద్దవానిలా, చిన్నవాడు సక్రమ మార్గంలో రావాలన్న, తండ్రి వానికి తగిన శిక్షనిచ్చి దిద్దాలి, కదా ? అలాగే సాయిప్రభువు మంచి చెడ్డ మిశ్రితమైన మానవుల హృదయాలలో తగిన అనుభూతులను చూపించి తీర్చి దిద్దుతాడు. అందుకే బాబాఅను రెండక్షరములు సమానస్థాయిలో నున్నవి. అని 857 నం. అబ్బాయి వ్రాసినాడు. ఇంకనూ వాడు "యెన్నో శతాబ్దాలనుంచి ప్రపంచ దేశాల్లో ఆధ్యాత్మికంగా వృద్ధిచెందిన దేశం భారతదేశం. కావున, దైవత్వమును నమ్మిన భక్తుల ఆదరణతో, ఇంకా వివిధ దేశాలకు బహుళ ప్రచారాలు చేసి, అంధకారమనే అజ్ఞానాన్ని రూపుమాపుటకే అవతరించాడు, బాబా.... ప్రపంచమే అతని యిల్లు; దేశాలు అతని గదులు; సృష్టియే అతని రాజ్యము. అతడే శక్తి స్వరూపుడు. . సత్య ధర్మ శాంతి ప్రేమ అనే ఆయుధములతో, కామ క్రోధ మద లోభ మత్సర్యాదులను ఓడించి నన్ను చేరాలని, వివరించి చెప్పి తరింప జేస్తున్నాడు.... మానవ సేవయే మాధవసేవ; సత్సంగము, స్వార్థరహిత సేవ; నాదేదియు లేదని అంతా ఈశ్వరునిదే అనేభక్తి — ఈ భావాలన్నియును పెంచుకోవాలి, అని బోధించుచున్నాడు". ప్రేమతో ఆదరించి విద్య నందించిన, పిల్లలు ఎంత అభివృద్ధిని సాధించగలరని ఈ బాలుడు మనకు తెలుపుచున్నాడు

851 నం॥ బాలుడు, తన వ్యాసమును ఒక పద్యము (ఆశు కవిత) తో మొదలు పెట్టినాడు.

పరమ బాంధవుండు - పర్తిపురీశుండు
భవభయ నాశకుండు — దేవుడితడు
నమ్మియున్నవారిని — నయముగ బ్రోచును
వాని పాదయుగము — భక్తిగొల్చు
సకల జీవరాశి — తనలోనే నున్నవి
తాను జీవులందు — సదా నివసించు
ప్రకృతియంత నిండి — బ్రహ్మ స్వరూపియై
ప్రజ్వలించువానికి — వందనములు

శ్రీవారి దివ్యబోధను గురించి వ్రాయుచూ ఈ అబ్బాయి, "సత్యము: నీవు నీ శరీరము కాదు; నేను నేను అనుచున్న ఆత్మయున్నదే, పరబ్రహ్మ స్వరూపము, అది నీవు; ఇదే సత్యము. ఈ సత్యమును అందరూ తెలుసుకోవాలి. ధర్మము: తాను చేస్తూవున్న ప్రతియొక్క కర్మనూ ధర్మదృష్టితో పరికించాలి:—అంటే, దానివలన ఏ ఒకటికికూడ నొప్పి కలిగించకూడదు, శాంతి: నాది అనునది ఏది లేదు; అంతా పరమాత్మునిది, పరబ్రహ్మ స్వరూపము. సుఖదుఃఖములు అన్నీ నాకంటవు. నన్ను చలింప జేయవు అని తెలుసుకొంటే శాంతి. ప్రేమ: దేవునితో లీనము కావలెయునని ఆరాటపడుట" అని తెలుపుచున్నాడు.

"నేను తల్లిదండ్రులను వదలి 7 సంవత్సరములు ఎన్నో దొంగతనములు చేసినాను, ఎవ్వరు చెప్పిన,

పాజువిడిచేము; కావున 7 సంవత్సరములు కూడ జైలులో గడుపుచుంటిని ఈ స్కూలుకు వచ్చిన ఒకవాత, నాకు అర్థమైయే రీతిగా, నాకు, అఖండ జ్యోతివలె, పుట్టపర్తిలో వెలుగుచున్న నిరాకారము సాకారముగా వచ్చిన భగవానులు శ్రీసత్యసాయి వారి సేవాసంఘము సభ్యుల ద్వారా మంచిని బోధించి నారు. పంకలపైన నీ మనస్సు కోతిలాంటి నీ మన స్సును నీకు ప్రియమైన ఏదో ఒక నామరూపమును (బాబా కావచ్చు, రాముకృష్ణ, క్రీస్తు ప్రవక్త ఎవ్వరి నైన) నీ దృష్టిలో ఉంచుకొని యెక్కడికి పోనీయ కుండ సాధన చేసినయెడల, 'నీవు ఎవ్వరు, ఎందుకు వచ్చావు; నీ కర్తవ్యమేమిటి అని తెలుసుకొని, ఆనం దము నందుకో, అని వెన్నముద్దను నోట్లోపెట్టిన, దానిని మ్రింగుటము ఎంత సులభమో అంత సులభము గా నా మనస్సును మార్చివేచిరి. ఆయన అమృత బోధ ఎంత అద్భుతముగావుండునను అని నామనస్సును కుతూహలపరచుచున్నది.'' అని ఆ అబ్బాయి తన దారుణమైన పూర్వకథను స్మరించి కృతజ్ఞతతో అంజలి సమర్పించుచున్నాడు !

858 నం॥ విద్యార్థి వ్రాసినదాన్ని కొంచెము అవలోకించండి. ''మహత్వము కలిగిన ఇతరులు ఎందరు లేరు ? మనము వారందరినీ భగవానుడని ఎందుకు పిలవము ? ఎందుచేత అనగా, వీరందరునూ యీ లోక సంప్రదాయముల కనుగుణముగా ప్రాణులు ధరించుచూ, నేనే దైవస్వరూపుడను అని చాటి చెప్పు చున్నారు. కానీ శ్రీ బాబావారు, 'నేను మీవాడను; మీరు నావారలు. మీకూ నాకూ ఉన్న సంబంధము జన్మజన్మల సంబంధము, ఈ సంబంధము మీ కర్మల బట్టి మారుచుండును. నేను మీవాడనైనందువలన, మీరు యెక్కడవున్న యేమిచేయుచున్న, మిమ్ముల విడనాడను.'' అని అభయమిచ్చి జీవులను రక్షిం తురు, కాపాడుదురు. ఆయనకు ఒక దేశము, ఒక ప్రదేశము అని వుండదు. గజేంద్రుడు, '' దేవా ! నీవుతప్పు నన్ను కాపాడువాడు లేడని వేడుకొనగా శ్రీహరి వైకుంఠమునుంచి ఈ భూలోకము వచ్చి ఆ భక్తుని రక్షించలేదా ? ఆ లోకమునయున్న విష్ణుమూర్తి ఈ లోకమునకు వేగముగా వచ్చాడు, కదా ? అలాగే, భక్తుల మొరలనాలకించి, వారికడకేగును. ఆ దలకే శ్రీసత్యసాయి బాబావారిని భగవంతుడు అంటాము. భ— భక్తిని పంచువాడు, పాప భక్షకుడు ; గ—గమ్యము చూపించి గమ్యమునకు చేర్చు వా—వారిధివలె నున్న పాపిలోకమునందు అవతరించిన సాయిరాముడు, వారిధిలో యెంత నీరుంటుందో అంత దయ కలిగిన వాడు; న—మీ యందు 'నేను' వున్నాను ; 'నా' యందు మీరున్నారు అని చాటి చెప్పే అంతర్యామి అయిన దేవుడు.''

ఈ రకమైన ఉత్తమ ఆదర్శములూ భావాలూ ఈ పిల్లలలో అంకురింపజేసి శ్రీవారు సమితి సభ్యు లను ప్రోత్సహించుచున్నారు. శ్రద్ధా భక్తులతో సద్గుణాభివృద్ధికి పూనుకొంటున్న పిల్లలపై శ్రీవారు ఆశీస్సులను కురిపించుచున్నారు కూడ, ఒకనాడు ఒక అబ్బాయి సేవాదళ సంచాలకుడైన డా॥ రామకృష్ణ రావు గారిని, '' కలలో శ్రీవారిని దర్శించుకొని వారితో సంభాషించేది నిజమునా ?'' అని ప్రశ్నించినాడట. ఏందుకనిన, శ్రీవారు ఆ అబ్బాయి కలలో వచ్చి నీకు త్వరలోనే విడుదల దొరకును, అని చెప్పిరట అట్లనే, ఆశ్చర్యముగా అనిరీక్షితముగా జరిగినది, కూడ !

ఆ అబ్బాయి ఖూనినేరస్తుడు! జీవావధి కారాగృహ వాసమునను భవించు బాలుడు ! గ్రామములో పార్టీ పెరిగి ద్వేషమభివృద్ధియై, ఆ ఖూనిపరకూ బలపడినది. నేరస్తుడై జైలువాసమనుభవించుచున్న అబ్బాయికిని 25 వేలు రూపాయి బాండ్ వ్రాసి ఇచ్చినాడు. ఖూని చేసిన బంధువొకడు విడుదల చేసి, వాడు మంచివాడుగా వుంటాడని హామి ఇచ్చుటకు సిద్ధమైనాడు. బొర్స్టల్ స్కూల్ సూపరింటెండంట్ వారికి ఆ రీతిగా ఉత్తరము వ్రాసి పంపినాడు కూడ, ఇది యెన్నడూ యెక్కడనూ జరుగని పని, కలలో శ్రీవారు అనుగ్రహించిన కొద్ది రోజులలోనే, అబ్బాయికి విడుదల ఆజ్ఞ దొరకినది ; జైలువాసము అంత్యమైనది.

# పుస్తకసూచి

1 పుస్తకముల వెలనూ పోస్టు మరియు రిజిస్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ, 1-00 పై వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

తెలుగు:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2 | ,, ,, (2) | 4 00 | 0-45 |
| 3 | మణిమాల | 1-00 | 0-15 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5 | అర్పణ | 1-00 | 0-10 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0-15 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 9 | వచనామృతము | 4-00 | 0-30 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 0-80 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 13 | భజనావళి | 1-50 | 0-20 |

కన్నడ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం[1] | 3-50 | 0-35 |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-15 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 9 | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:—

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3 | గీతావాహిని | 3-00 | 0-25 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-10 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజన్‌సాంగ్స్ (అమెరికన్ ప్రకటన) | 2.00 | -20 |
| | (ఇండియన్ ప్రకటన) | 1-50 | -15 |
| | సత్యం శివం సుందరం (2) | 5-00 | -30 |
| | ప్రశాంతవాహిని | 2-00 | -15 |
| 5 | జ్ఞానవాహిని | 2-00 | -15 |
| 6 | నామ సంకీర్తన్ | 1-50 | -10 |
| 7 | ధ్యానవాహిని | 2-00 | -15 |
| 8 | సమ్మర్‌షోవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5 00 | 0-35 |
| 9 | సత్యం శివం సుందరం III | 6-00 | 0-40 |
| 10 | సందేహ నివారిణి | 3-00 | 0-15 |

అరవం:—

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-40 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-40 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-30 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-35 |
| 6 | భజనావళి | 1-00 | 0-20 |
| 7 | సాయిమాతా | 1-00 | 0-10 |
| 8 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 9 | సందేహనివారిణి | 2-00 | 0-25 |
| 10 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 11 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 12 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-10 |

హిందీ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-10 |

బెంగాలి:—

| | | | |
|---|---|---|---|
| 1 | అడ్వైస్‌టు స్టూడెంట్స్ | 0-25 | 0-10 |

గుజరాతి:—

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 2 | కథాసుధ | 2-00 | 0-15 |
| 3 | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-30 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-10 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

అస్సామి:—

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారధి [షార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0-10 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కదా | 0-25 | 0-10 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్- టు ది స్టుడెంట్సు] | 0-50 | 0 10 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-20 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-15 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-10 |
| 7 | సాయి గాధ (పద్యములు) | 1-00 | 0-10 |

ఒరియ:—

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీసత్యసాయి చరితామృత (II) | 1-00 | 0-10 |
| 2 | సహస్రనామ పూజావిధాన్ | 1-00 | 0-10 |
| 3 | గీతావాహిని | 5-00 | 0-25 |

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2 చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4 చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5 పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు ../2-74 అని యుండిన, మీ చందా ఫిబ్రవరి నెకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) ఫిబ్రవరి నెల 8. వ తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

M.O. ద్వారా పైకమును పంపించువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియజేయవలెను.

6. పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాప్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, రు.1 (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబులిచ్చుటకు ఆలస్యమగును.

8. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### —:శ్రీవారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు ఎడిటర్, 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.)పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

మైసూరు రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు పి. ఎస్. సుబ్బరామన్ గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

Regd. No. KRN/A-67

January 1974

సుఖశాంతులు దేహనిమిత్తమా, ఇంద్రియముల నిమిత్తమా మనస్తృప్తినిమిత్తమా అనే ప్రశ్నలనటుంచి, అసలు తాను దేహమా ఇంద్రియమా మనసా లేక వీటికతీతమైన ఆత్మనా అనే విచారణను మానవుడు మొట్టమొదట సలుపాలి. దేహమనేది ఒక ఘటము మాత్రమే జాతి కులము మతము రూపము నామము ఇవన్నియునూ ఆ ఘటమునకు సంభంధించినవే కానీ ఆకాశమువలె సర్వవ్యాపియై నిర్గుణ నిరాకారమై ఆ ఘటములో దాచియున్న ఆత్మకు అంటునవి కాదు.

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 16 ఫిబ్రవరి 1974 సంచిక 12

## విషయానుక్రమణిక



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 49

### కైక భవనము

భరతశత్రుఘ్నులు వెనుకాముందూ నడచుచూ, కైక మందర మాటలను నమ్మి ఇంత ఘాతుకచర్యలకు పాల్పడెనని చింతించుచూ తమలో తాము పుట్టుకొస్తున్నట్టుగా పొంగివచ్చు క్రోధమును అణగద్రొక్కుకొంటూ కైక భవనద్వారమును ప్రవేశించిరి. ప్రవేశించగనే మందర మంచిగా అలంకారము చేసుకొని ద్వారములో వారల రాకకై కాచుకొనియుండుట చూచి శత్రుఘ్నుడు భరించలేక, మందర కురులను పట్టి క్రింద ఈడ్చి కొట్టెను. మందర అయ్యో అయ్యో అని కేకలు పెట్టగనే కైక, పరుగెత్తుకొని వచ్చి శత్రుఘ్నుని మందలించెను.

అవకాశమును అనువుగా చేసుకొని భరతుడు మండిపడి, ఛీ పాపాత్మురాలా, ఈ దుర్మార్గురాల మాటలు విశ్వసించి మహాపాపమునకు పాల్పడితివి, ఈ దుర్బుద్ధులు నీ మనసులో పుట్టినపుడే నీ హృదయమేల రెండు ముక్కలుగా లేదు. ఇట్టి కోరికలు అడుగుటకు నీ నాలుక యెట్లు ఆడినది. అది భస్మము కాకపోయెనా? యే మొఖము పెట్టుకొని ఈ రాజభవనమున నివసించుచున్నావు సిగ్గులేదా? ఇట్టి దుర్మార్గురాలైన నీ మాటలపై రాజునకెట్లు నమ్మకము పుట్టెను. రాజు కామాంధుడై కొడుకును అమ్మి భార్యను కొనుటకు పూనుకొనుటకు నీవు పన్నిన పన్నాగములు, మహా సంకుచితమైనవిగా తోచుచున్నవి. రాజు యొక్క పవిత్రహృదయాన్ని పాడుచేసి, రాజ్యమునకు నిప్పుపెట్టి, వంశమును నాశముగావించి రఘువంశమును నిర్మూలమొనర్ప చేరిన కుటిలాత్మురాలవు నిన్ను తల్లి అని పిలుచుట కూడనూ మహాపాపము.

పరుల చెడ్డను కోరిన నీ బిడ్డలు బాగు పడుదు రని యెట్లు తలంచితివి. నీ బిడ్డలవంటివారు కారా, పరుల బిడ్డలు. పరబిడ్డల కీడును కోరు స్త్రీలు తమ బిడ్డల దుర్గతినే ఆసించినవారు గాగలరను పరమ సత్యమును నీవేల తెలుసు కొనలేక పోతివి. రాజవంశమున జన్మించి రాక్షస గుణములను కలిగియుండుటయే జన్మల కర్మఫలమో, ఇదంతయూ నా దురదృష్టము. అందున్న నిర్మల నిశ్చల నిస్స్వార్థపరుడైన నా రామచంద్ర ప్రభువును, మహా సాధ్వీమణురా లైన సీతామతల్లిని అరణ్యమునకు పంప, యెంత ఘోరము, యెంత కఠినము! ఛీ, ఇట్టి దుర్మార్గురాలవైన నీతో సంభాషించుట కూడా నా పాపఫలము.

నేను కూడనూ యే జన్మలో యే పాపము చేసితినో లేకున్న నీ బోటి కుటిలాత్మురాల గర్భ మున జన్మించియుందునా ? పాపులకు పాపులే చేరుదురు కానీ పుణ్యులు చేరరు కదా ? సూర్య వంశము హంసవంటిది. నీవు నిజముగా నా తల్లి వంటిదానవే. నీ తల్లి తన మనోభీష్టమును పురస్క రించుకొని తన భర్తను చంపుకొనెను నీవునూ నీ దురాశను నెరవేర్చుకొను నిమిత్తము నీ పతిని జంపుకొంటివి. వంశాచారమునకు విరుద్ధ ముగా చిన్నవాడు పెద్దవానిని విడచి రాజ్యము చేయునా ? ఈ భావము నీకు ఈ నాడు కలిగినది కాదు. ఇట్టి పాడు తలంపు మొదటినుండియూ నీలో బీజరూపముగ నుండియే యుండును లేకున్న ఈ నాడు ఇదింత వృక్షముగా మారుటకు వీలులేదు. ఇట్టి బుద్ధే నీకుండియుండిన నేను పుట్టిన తక్షణమే నన్ను చంపియుండిన, ఇంతటి దురవస్థల పాలయ్యేది కాదు ఈ రాజ్యము. వగచి ప్రయోజనమేమి. చెట్టును నరికి కొమ్మ లకు నీరుపోసిపెంచే నీ బుద్ధి, మీనములు జీవించ వలెనని కోరుతూ సరస్సులోని జలమును తోడి వేయుచున్న నీ తెలివి తేటలకు నవ్వవలెనో యేడ్వవలెనో అర్థమగుట లేదు.

నీతో సంభాషించి కాలమును అపవిత్రము చేయుటకంటే, నేనిప్పుడే రాములచెంతకు వెళ్లి అతనిని అయోధ్యకు రమ్మని ప్రార్థించి తెత్తును, అతను అంగీకరించకున్న నేనునూ ఆ ప్రభు సన్నిధిలోనే లక్ష్మణుని వలే సేవలు చేయుచూ అక్కడే నివసింతును నీ మొఖము చూడను అని తమ్మునితో వెనుకకు తిరిగెను,

### పాప బుద్ధికి సిగ్గు

తన తప్పును తలంచుచూ, తన పన్నాగ ములు కడకిరీతిగా మారెకదా అని చెడ్డ తలం పులు యెట్టివారలకైనా తాత్కాలికపు తృప్తిని అందించును కానీ జీవితములో అవే మన పతన మునకు రాజబాటగా మారునని తలంచి ఇక వేరు మార్గములేక, మాటలురాక, స్తంభించిపోయెను. కైకకు మందరపై విసుగు పుట్టెను. భరతు డన్న మాటలలోని అంతరార్థమును సత్యమును గుర్తించెను. రాముని పవిత్రతలంపులకు నెంతో సంతసించెను తన పాపపు బుద్ధికి తాను సిగ్గుపడెను.

కైకేయీ మందిరమునుండి భరతశత్రుఘ్ను లు, సరాసరి మంత్రులు, గురువూ, పుర ప్రము ఖులూ వుండిన సమావేశ స్థానము చేరిరి. వీరల రాకకై యెదురుచూచు చుండిన మంత్రులు యేమి నిర్ణయము గావింతురో అని వినగోరుచు,

వారి ప్రత్యుత్తరమును వినుటకై నిశ్శబ్దముగా ఏకాగ్రచిత్తులై వువ్వెళ్లూరునట్లు కాచియుండిరి.

### ధర్మ విరుద్ధము

ఇంతలో భరతుడు గురువుగారి పాదములకు నమస్కరించి, గురుదేవా! నేను పరమ సత్యమును తెలుపుచున్నాను, నిష్కపటముగా వివరించ గోరితిని. నన్ను, నా మాటలను విశ్వసింతురని ఆశించుచున్నాను.

కారణముకంటె కార్యమే కఠినము. పాషాణములో పుట్టిన లోహము పాషాణముకంటే కఠినమన్నది మీకు తెలుసు. కఠినురాలైన కైక గర్భములో పుట్టిన నేను మరింత కఠినుడను. కాకున్న రామవియోగముచే నా ప్రాణములు నా శరీరమును వీడి పోకున్నవి, కైక, సీతా రామలక్ష్మణులను అడవికి పంపి, పతిని స్వర్గమునకు ప్రయాణముచేసి, ప్రజలను అశాంతిలో ముంచి, కొడుకును అపకీర్తుల పాలుచేసి, రాజ్యమునకు మాయని మచ్చగా నన్ను రాజ్యము నేలమని మీరు శాశించుటలో నాకేమాత్రమూ, సంతృప్తి లేదు. నేను అర్హుడను కాదు.

రామచంద్రుడు వనమున సంచరించుచుండ, నేను రాజ్యాధికారిగా సింహాసనముపై కూర్చొనిన లోకులు నవ్వరా. నా పరిపాలన ప్రజలకు హానినే కలిగించును. నీతినిజాయితులు తప్పి అక్రమంగా, ధర్మవిరుద్ధంగా రాజ్యాధిపత్యమును వహించువారిని చూచి ప్రజలెవ్వరూ గౌరవించరు. కారణమేమన, వారిని నేను దండించుటకు అధికారముండదు. నాలో కావలసిన దోషములు గుట్టలుగా పెట్టుకొని పరుల దోషములను చక్కదిద్దుటకు నేనే మొఖము పెట్టుకొని చెప్పగలను. కాన నాలోని దోషములు నేను అధికార బలముచేత కప్పిపుచ్చుకొన్ననూ సమయము వచ్చినపుడు ప్రజలు ప్రేలును చూపించక పోరు. నా తల్లియొక్క పాడుతలంపులు నాకు తలవంపులుగా మారెను. సీతారాములను చూడక నేనిక క్షణమైననూ నిలువజాలను, నా ఈ దారుణమగు దుఃఖమును మీకు విన్నవించుచున్నాను.

నా దుఃఖము రామదర్శనముతో చల్లారును తప్ప అన్యబోధనలు నన్ను ఓదార్చలేవు. నేను కౌసల్యా సుమిత్రల ఆజ్ఞలను పొందితిని. రేపటి తెల్లవారి నేను తమ్మునితో కూడి నా ప్రభువును దర్శించుటకు వెళ్ల నిశ్చయించుకొంటిని, నా పాపములెన్నియున్ననూ రామప్రభువు చూపుతో భస్మమైపోవును. తాను పలుకరించక పోయిననూ సరే నేను తనను దర్శించుచూ చెట్టు చాటుననైననూ వుండి కాలమును హాయిగా గడుపుదును.

### నేను రామప్రభు దాసుడు

ఓ మహాజనులారా! మీరందరూ నా శ్రేయస్సు కోరి నన్ను దీవింపుడు, మంత్రులారా నన్ను రాములవద్దకు వెళ్లుటకు అనుజ్ఞ దయచేయుడు. నేను రామప్రభు దాసుడను. మనందరికీ అతడే ప్రభువు. ఈ పలుకులకు పురప్రముఖులు, మంత్రులు, సామంతులు అందరూ మారు మాటాడలేకపోయిరి. భరతుని బాధను బాగుగా అర్థముచేసుకొనిరి. భరతుడు నిర్మలచిత్తుడనియూ, తల్లి పన్నిన పన్నాగములకు తాను కట్టు

బడలేదనియూ తలంచి, భరతుని వచనముల లోని పవిత్రతను గుర్తించిరి. పుర ప్రముఖులలో ప్రధానుడు లేచి ప్రభూ మీతోపాటు మేమునూ బయలుదేరి వత్తుము రామవియోగమును మేము కూడనూ భరించలేకున్నాము. వకపరి ఆ ప్రభు వుని దర్శించిన, తదుపరి మా ప్రాణములేమయి ననూ పరవాలేదు అని శెలవును గోరెను.

ప్రజలందరూ ఈ కోరికను మన్నించి మమ్ము కూడనూ తమవెంట తోడ్కొనిపొమ్మనమని కోరిరి. ఈ వార్త కొన్ని నిమిషములలో పురమంతయూ, నగరమంతయూ ప్రాకెను. ప్రతియింటిలోనా, స్త్రీ పురుష బాల వృద్ధులందరూ మేముకూడా వత్తుము అని ప్రయాణములైరి.

యెవరు యెవరిని వద్దని నివారించగలరు? రామదర్శనమునకు వద్దని చెప్పు మూర్ఖులు ఆనాడు అయోధ్యలో ఒక్కరును లేకపోయిరి. వారందరితో పాటు తల్లులైన కౌసల్యా సుమిత్రా దులు కూడా, దాసీలతో బయలుదేరిరి. ఇంతలో కైక, తన పొరపాటునకు పాపమునకూ పశ్చా త్తాప పడుచూ కౌసల్యకు తన కోరికెను తెలియ పరచెను. తనను కూడా వనమునకు తోడ్కొని పో గోరెను. రాణులతో తన తప్పును క్షమించ మని కోరి తనను అయోధ్య చేరుటకు తగిన ప్రయత్నములు కావింతునని ఆశించెను. నిర్మల చిత్తురాలైన కౌసల్య, తనలో యెట్టి మాలిన్యము కూడనూ తలంచక చేర్చక, తప్పక తనతో రమ్మని కబురంపెను. సాయంత్రమునకు, నగర ములో అందరూ బయలుదేరుచున్నట్లు భరతునకు వర్తమాన మందెను. అయితే, నగర సంరక్ష ణకు, కొంతమందైనా వుండకతప్పదని మంత్రితో తెలిపి, కొందరిని నిలచిపోవునట్లు యేర్పాట్లు చేసెను, రాత్రికే కొన్ని వాహనములు వక్కొక్క గృహము చెంతా, సిద్ధమాయెను. ఇంచు మించు అన్ని రకములైన వాహనములూ, సిద్ధము చేసిరి. వారలందరికి ఆహారపానీయములు యేర్పాట్లు గావించిరి. చక్రవాక మిథునము వలె నగరము లోని స్త్రీ పురుషులు ప్రాతఃకాలమునకు యెదురు చూచుచుండిరి.

## మహా సుదినము

ఆ నాటి రాత్రి పురజనులకు మహా సుదిన ముగా వుండెను. యెప్పుడెప్పుడు సీతారామ చంద్రులను దర్శింతుము అని వువ్విళ్లూరు చుండెను. చతురంగ బలములను సన్నాహము చేసిరి. అగ్నిహోత్రములు చేయుటకు తగిన సామగ్రిని, యేర్పాటు గావించుకొనిరి. పండితులు రథములలో వాహనములలో సయితము వేద పారాయణములు చేయుచూ వుండవలెనని మంత్రి ఆజ్ఞాపించెను. సుముహూర్తమున, భరతశత్రు ఘ్నుల వాహనములు, ముందూ, వాని వెంటనే కౌసల్య పల్లకిని పెట్టించిరి. అయితే అందరినీ వారి వారికి నిమించిన వాహనములలో ఆసీనులు కామని భరతుడు ఆజ్ఞాపించెను.

తన రథము ఖాళీగా నడుపుచుండిరి. భరత శత్రుఘ్నులు పాదచారులై వెళ్లుచుండిరి. యేదో కొంత దూరము అట్లు నడుతురని తలంచిరి. కానీ ఎంతసేపయినప్పటికినీ భరత శత్రు ఘ్నులు రథమున కూర్చొనకుండుట చూచి తల్లి యైన కౌసల్య భరతుని పిలచి, నాయనా! నీవు ఈ రీతిగా పాదచారివై వెళ్లుట నా మనసు

తరగుకొనిపోవుచున్నది. కొంతసేపయిననూ రథమున ఆసీనుడవుకమ్ము అని కోరెను. అందులకు, అమ్మా ! నా పాప పరిహారమునకు ఇది వక మార్గము. పాదచారులై సంచరించుచున్న సీతా రామలక్ష్మణులకు లేని శ్రమ నాకేమి. వారి దాసుడనై నేను రథమునందు కూర్చొనుట మహా దోషము. తమ అజ్ఞను మీరుచున్నానని తలంచక క్షమించి నన్నట్లే నడచుటకు అనుజ్ఞ ఇవ్వమని కోరెను. ఇంతలో ముందు రథములో ఆసీనులైన గురువుగారగు వశిష్ట అరుంధతియూ వారి వాహనమును ఆపి, భరతుని దీక్షను గమనించి, తమ రథమునకు సారథిగానైనా కూర్చొనమని కోరిరి. క్షమించమని కోరుచూ భరతుడు తాను రామ రథమునకు మాత్రమే నేను దాసుడను అంత వరకూ యే రథ మునూ నేను యెక్కను, యే గుఱ్ఱములను చేపట్టను ఇది నా ప్రతిజ్ఞ అని తెలిపెను. రామప్రేమకు వశిష్టులవారెంతయో సంతసించిరి.

## నిషాద రాజుని సందేహములు

మొదటిదినము రాత్రికి తమసానదీతీరమును రెండవదినము గోమతీతీరమును చేరిరి. తమసా నది ఘోఘ్రానదియొక్క ఉపనది. గోమతి, గంగానది ఉపనది. చీకటిపడిన తోడనే రథములను ఆపి, స్త్రీ, పిల్లలకూ, వృద్ధులకూ తగిన వసతులూ, తిండితీర్థాదులు సక్రమంగా గావించమని మంత్రి సిపాయిలకు అజ్ఞచేసెను. యెవరెవరికి నిమించిన పనులు వారు అయా వేళ వేళలకు గావించుచు మార్గమధ్యమున యెవ్వరికీ యెట్టి ఇక్కట్లూ కలుగకుండా చూచుకొని పోవుచుండిరి.

మూడవదినము తెల్లవారి బయలుదేరి ఆ నాటి రాత్రికి శృంగిబేరపురమునకు వచ్చిరి. భరతుని ఆగమనము నిషాదపతి విని విషాదము నొంది ఈ భరతుడు వనమునకు బోవుటకు కారణమేమి వెళ్ళిననూ ఇంత సైన్యముతో, చతురంగబల సమేతుడై వెళ్ళుటలోవున్న అంతరార్థమేమి ! అని తనలోతాను అనేకవిధముల అనుకూల ప్రతికూల భావములను పెంపొందించుకొనెను,

చెట్టు విషమయినపుడు ఫలముమాత్రము విషము కాకుండునా ? అని నిర్ణయించుకొని, తన జాతివారలను పిలిచి, అన్ని పడవలను నీటిలో ముంచిపెట్టుడు, పడవమార్గమును స్థంభింప చేయుడు యే చిన్న పడవనుకూడ నడుపకూడదని శాసించెను. ఈ దినము మనము చావున కైననూ తెగించి అన్నిటికినీ సంసిద్ధమై వచ్చువారలు అటువైపున చేరకుండునట్లు చూడవలెనని ఆజ్ఞాపించెను. ఇంతలో నిషాదపతి ధనుర్బాణములను తెప్పించెను. భరతుడు మహా సైన్యము కలవాడయిననూ రామునిమిత్తమై తన కించిత్ శక్తిని ధారపోయ తలంచెను.

సశేషము

# సత్యసాయి ప్రభూ

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

అవనిన్ మానవులెల్ల రీతుల నధర్మాసక్తులై ద్వేషముల్
రవులన్ శాంతికి దూరమైన తరి సంరక్షింపగా నెంచి మా
ధవ తత్త్వంబును బోధచేయఁ గరుణోదారాంతరంగుండవై
అవతారమ్ము ధరించి వచ్చిన మహేశా ! సత్యసాయిప్రభూ !

ఆ చిత్రావతి తీరమందు రమణీయంబౌ ప్రదేశంబునన్
ప్రాచీనర్షి సుతప్రశాంతినిలయ ద్వారంబు దర్శింపగా
మా చింతల్ మటుమాయమై హృదయనైర్మల్యంబు ప్రాప్తించు నా
హా చిత్రమ్ము భవన్మహత్త్వము మహేశా ! సత్యసాయిప్రభూ !

చూడన్ వచ్చినవారినుండి యొక కాసుంగూడ కాంక్షింప వెం
తో డబ్బున్న మనుష్యులున్ గడుదరిద్రుల్ నీ కృపాదృష్టిఁ జూ
రాడం గల్గుటలో సమానులె ! యమూల్య ప్రేమపూర్ణంబులౌ
మాడెందంబులె చాలు నిన్ను నలరింపన్ సత్యసాయి ప్రభూ !

భగవన్నామము పాటపాడుకొనుచున్ బ్రాహ్మీముహూర్తంబునన్
నగరంబందలి వీధులందిరిగి యానందంబునందించుటే
యుగమందొక మహా తపస్సనుచు భక్తుత్సాహముల్ గూర్చి పొ
ల్పుగ బోధించి తరింపజేసితివి మమ్మున్ సత్యసాయిప్రభూ !

విసుమానంబొదవించునట్టి మహిమల్ వీక్షించి కేల్మోడ్చి నీ
య సమానంబగు ప్రేమకున్ మురిసి అవ్యాజంపు యుష్మద్దయా
రసముం బొంది భవద్వచోమృతము గ్రోలంగల్గు భాగ్యమ్ము మా
కొసగం గోరెద మెల్లవేళల కృపాళూ ! సత్యసాయిప్రభూ !

---

# శ్రద్ధావాన్ లభతే జ్ఞానం

కలికాల ప్రభావమువలన, ధర్మద్వేషము దైవ ద్వేషము ప్రభుద్వేషము పెరిగి, భారతీయులు తప్పులను ఒప్పులుగానూ, ఒప్పులను తప్పులుగానూ భావించి, తమ ప్రయాణమును తప్పుత్రోవలో సాగించుచున్నారు, తమ ఉద్దేశమునే పవిత్రమని విశ్వసించుచున్నారు. ఇది కలి మహత్వమే కానీ వేరు కాదు

సుఖ దుఃఖములు త్రిగుణాత్మకములు, సాత్త్విక గుణము ప్రకాశశీలము; రాజసగుణము క్రియాశీలము; తామసగుణము ఆ రెండు గుణములను అణగద్రొక్కి, అంధకారమునూ, సోమరితనమునూ అభివృద్ధిచేయును. ప్రకాశశీలము అధికముగా ప్రకటింపబడి, క్రియాశీలము తక్కువగా ఉంటే, ఆ అవస్థకు సుఖమని పేరు; క్రియాశీలమధికమై ప్రకాశము తక్కువవుంటే, దుఃఖప్రకటన సంభవించును. సాత్త్వికము రాజసము రెండూ అణగద్రొక్కబడి, మోహము మాత్రము మానవుని ఆవరించిన, అపుడు దుఃఖపరంపరకే గురి అగును.

గుణములకు రెండు ముఖములున్నవి — భోగముఖము, అపవర్గముఖమని. భోగముఖములో అవి సుఖ-దుఃఖములనే ద్వంద్వములలో మానవుని ముంచి, జనన-మరణమనే చక్రమందు కట్టివేయును. అపవర్గముఖములో, అవి ముక్తినొసంగును. అయితే, మానవుడు ఇప్పుడు, భోగాపవర్గముల మధ్య చిక్కి, ఇక్కట్టులనుభవించుచున్నాడు. మానవత్వానికే దూరమై దీనత్వమందు కృశించిపోవుచున్నాడు. దైవానుగ్రహమునకు పాత్రుడు కాక, జీవితమును వ్యర్థము చేసుకొనుచున్నాడు.

ఈనాడు దైవమును నిర్ణయించుకోవటములో కూడ, కొన్ని విచిత్రమైన నడకలు అనుసరింప బడుచున్నవి. తర్కము, బుద్ధి ప్రమాణములవలన దైవమును నిర్ణయించుకొనుటకు సాధ్యమా? తనకు అనుకూల వాతావరణమేర్పడిన, ఈశ్వరుడు సర్వవ్యాపి. సర్వశక్తుడు, సర్వజ్ఞుడు; ప్రతికూల వాతావరణమావరించిన, ఈశ్వరుడు సర్వవ్యాపకుడు కాడు, ఈశ్వరుడే లేడు అని వాదించటము కద్దు. భారత యుద్ధమందు విజయము ప్రాప్తించినపుడు, కృష్ణుడు, అర్జునుని దృష్టిలో, సర్వశక్తుడు. "స్వామి! మీ వలన మాకు విజయము లభించినది!" అయితే అభిమన్యు మరణించినపుడు, అదే కృష్ణుడు అదే అర్జునుని దృష్టిలో, సర్వజ్ఞుడు, సర్వశక్తుడు కాదు! దీనికి బుద్ధియొక్క వికారమే కదా, కారణము

అయితే ఈ మార్పులు, ఈ చంచలత్వము మనసుయొక్క వికారస్వభావములే కానీ, బుద్ధియొక్క స్వభావము కాదు. మనస్సు బుద్ధిని కూడ దోషమయముగా నిరూపించును. చలించే మనస్సు అటు ఇటు బుద్ధిని కూడ చలింప జేయుటకు పూనుకొంటుంది. అయితే, యుక్తులతో ప్రమాణసహితముగా వాదించి, బుద్ధిని స్థిరనిశ్చయములోను పెట్టి, చలించక ఉంచుకోవచ్చు. ఈశ్వర విశ్వాసమును స్థిరనిర్ణయముగా బుద్ధి అంగీక

రించిన తరువాత, యెవరు యేమి చెప్పిన, హృదయ స్థానమందు దృఢముగానిలచును, నిశ్చయ బుద్ధి లేని వారికే నిరంతరమూ సందేహము. అట్టి స్థిర నిశ్చయము కలిగినవారే, దైవానుగ్రహమునకర్హులు !

ఈ నాడు కొంత మంది ఈశ్వరత్వాన్నే తిరస్కరించి, విరుద్ధ కారణములను కల్పించుకొని, ప్రచారము చేయుదురు. వీరివలన, భగవద్విశ్వాసము సన్నగిల్లి పోవటములో ఆశ్చర్యము లేదు. భార్యను నమ్మని భర్త, భర్తను నమ్మని భార్య తండ్రిని నమ్మని కొడుకు, కొడుకుని నమ్మని తండ్రి, గురువును నమ్మని శిష్యుడు, శిష్యుని నమ్మని గురువు, వీళ్లే అధికమైన ఈ కాలమందు, ఈశ్వరుని నమ్మని మంది పెరుగుచున్నారంటే, ఆశ్చర్యమేమీ లేదు.

దివ్యాత్మ స్వరూపులారా ! బుద్ధియొక్క శక్తి అన్నిటికన్న అతీతమైనది. గీతలో శ్రీ కృష్ణుడు "బుద్ధియే నేను" అని శెలవిచ్చినాడు ; దదామి బుద్ధి యోగం తం" అన్నాడు. బుద్ధివలన చలించే మనస్సును తీర్చి దిద్ద వీలగును. దీనిని నమ్ముకొని సాధనామార్గమునవలంబిన, తప్పక, మనసును జయించవచ్చును.

ఈశ్వర తత్వమును శ్రీ కృష్ణుడు వెల్లడించుచూ, "సమోహం సర్వభూతేషు" అన్నాడు ! ఆయనకు ఆగ్రహమూ లేదు, అనుగ్రహమూ లేదు, సుఖ దుఃఖములు, బంధమోక్షములు, జనన మరణములు వీటిని జీవులే తమ కర్మలవలన సంపాదించుకొంటున్నారు. అయితే, మీకు ఒక సందేహము కలుగవచ్చును ; భగవంతుడు "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం" అని శెలవిచ్చియున్నాడే ? కొంత మందిని సాధువులని ప్రత్యేకించి వారిని ఆశీస్సులచే ఆనందపరచేదేమి, మరి కొంతమందిని దుష్టులని దూరముచేసి శిక్షించటమేమి, ఇవి ఆగ్రహానుగ్రహములకు నిదర్శనము కదా ? అని మీరడుగవచ్చు అయితే, అన్నీ తనేయందే ఉద్భవించినవి, అని ఒప్పుకొన్న తరువాత, ఇంక భేదభావములెల్ల కలుగును? దేహము తనదే, హస్తము తనదే, వ్రేళ్లు తనవే, ఆ వ్రేళ్లలోని గోరులూ తనవే ! అయినా, వ్రేళ్లలోని గోరులను కత్తిరించుచున్నాము కదా ? కడుపు తనదయిననూ, కడుపులోని మల మూత్రములను విసర్జించక తప్పదు. అట్లు చేయకపోతే, రోగములచే దేహమునకే అపాయము కలుగును. కొన్ని పరిస్థితులలో, రోగనివారణము కొరకు ఆపరేషన్ కూడ చేయించుకోవలసి వచ్చును. ఆపరేషన్ల వలన, దుఃఖప్రాప్తియగునే అని దానిని మానుట సరికాదు ; అది వివేకియొక్క లక్షణము కాదు. దుఃఖనివృత్తి కొరకు, తాత్కాలికమైన ఆ దుఃఖమును అనుభవించియే తీరాలి. డాక్టర్లు ఆ మూలముగా మనకు ఉపకారమునే చేయుదురు, అపకారమును కాదు ! విశ్వమనే దేహమందు కౌరవులనే క్యాన్సర్ పుండు బయలుదేరినపుడు, శ్రీ కృష్ణుడు అనే డాక్టరు, అర్జునుని కాంపౌండరుగా పెట్టుకొని, కురుక్షేత్ర యుద్ధము అనే ఆపరేషన్ చేసి, లోకకల్యాణమును సాధించి, తన క్రియాశక్తిని, కరుణాస్వభావమును ప్రకటించినాడు.

విషయవాసనలో మునిగినంత కాలము యేది మంచి యేది చెడ్డ, అని నిర్ణయించుట సాధ్యము కాదు; మనస్తత్వమునకు అట్టి విచక్షణా సామర్థ్యము లేదు. బుద్ధిని అభివృద్ధి చేసి, చిత్తశుద్ధిని సంపాదించి, సత్ శీలమును పెంచుకొనిన, క్రమ క్రమేణ అనసూయాభావము దృఢమగును ; నిజస్వరూపమైన దివ్యత్వము ప్రకాశించును. అన్ని జీవులనూ యేకత్వముగా,

భావించిన, మానవుడు భగవంతునికి కేవలము సన్నిహితుడు కాగలడు. ముఖ్యముగా, చలించే మనస్సుకు, భ్రమించే దృష్టికి, అంత్య మొనరించాలి.

పెండ్లి నిర్ణయించవలెనన్న, ఈ నాడు, అమ్మాయి అబ్బాయి, ఇద్దరి సౌందర్యములను చూచి, ఒక అభిప్రాయమునకు వస్తారు. తరువాత వారి ఆస్తిపాస్తుల విషయాలను విచారణ చేస్తారు. ఆ తరువాత, వారిరువురి విద్యా, వారి శీలము, వారి కులాలు వీటిని పరీక్షిస్తారు అంటే, కేవలము బాహ్య విషయములనే విచారించి జంట కలపటానికి ప్రయత్నము చేయుదు రన్న మాట! బాహ్య ఆకర్షణలచే భ్రాంతిపడి, జీవితమును కుక్కలవలె జరుపుకొంటున్నారు, బహు మంది. ఇవన్నీ స్థూలమైన ఆధారములే! వాటిపై దాంపత్య జీవనమును స్థాపించిన, అది నిత్య సత్యముగా, నిశ్చల నిర్మలముగా, నిలవదు. అవన్నీ తాత్కాలికము, లోకసంబంధమైనవి. అంటే, వాటిని అలక్ష్యము చేయమని చెప్పలేదు. వాటికన్న గుణ సామ్యత, సత్‌శీలము, సత్ప్రవర్తనలపై అభిలాష; ఆత్మవిశ్వాసము, హృదయ పరిశుద్ధత. ఇవి ముఖ్యమని గమనించవలెను.

దైవారాధన కూడ ఇట్టిదే. అభీష్టాలనివృత్తిపై, ప్రేమ విశ్వాసములను యే మాత్రమూ పెట్టకూడదు. అభీష్టాలు నెరవేరకపోతే, ఆరాధనను విసర్జించకూడదు. ఈ నాడు దైవ విశ్వాసము ఒక ఫ్యాషన్‌గా మారిపోయినది. "రాత్రి నా స్వప్నములో రావాలి! వస్తివా, నువ్వు సాయిబాబా! రాలేదా? నువ్వు సాయిబాబా కాదు, రాయిబాబా!!." ఆరాధించి నపుడు సాయిబాబా, లేనపుడు ఇంకొకడు అనే పరివర్తన, నాలో లేదు! నేనెపుడూ సాయిబాబానే! ఆరాధన అనిన, ఇది కాదు. ఈ మార్గములో ప్రయాణము సల్పిన, అన్నీ వ్యర్థమే: అన్ని కష్టములు నష్టములు దుఃఖములు బాధలు, విచారములు వచ్చినా, విశ్వాసమును మాత్రం కదలక మెదలక దృఢముగా వుంచుకోవలెను. అదే భక్తి అదే నిజమైన ప్రపత్తి. ఆత్మస్వరూపము చిత్తమందు హత్తుకొనిన, దుఃఖ ముండదు. భగవంతుని ఆధారము చేసుకొని, అన్ని క్రియలలోనూ ప్రవేశించాలి. పవిత్ర ప్రేమచే పరమాత్ముని చేరాలి. సుఖదుఃఖములకు మనస్సే కారణమని తెలుసుకొని, దానిని పరిశుద్ధముగా తీర్చి దిద్దితే, ఫలముకూడ పరిశుద్ధముగును. సుఖదుఃఖము లను మీకు అందించేది, భగవంతుడు కాదు. పరులు కూడ కారు. సర్వములకూ కారణము మీ మీ మనస్సే! కాబట్టి, ఆ మనస్సును మాధవునిపై మరల్చితే, సర్వ క్షేమములూ చేకూరును. మనస్సును విశాలభావముతో నింపవలెను; సర్వ భూత హితే రతాః, అన్నాడు కృష్ణుడు, గీతలో. యెవరికి యేరీతిగాను కీడుచేయక, బాధ నందించక, జాగ్రత్తగా జీవించాలి. ఉపకారము చేయుట చేతకాకపోతే, అపకారము చేయకుండిన అంతేచాలు; అదే పెద్ద ఉపకారము చేసినట్టు!

కర్మలనుకూడ వివేక వైరాగ్యములతో చేయుటకభ్యసించవలెను. అభీష్టవస్తువులను సంపాదించేకొరకు, అనిష్టవస్తువులను త్యజించుటకు, ఈ రెండు ద్దేశములె మానవుని కర్మలలో ప్రవేశపెట్టుచున్నవి. అంటే ఆనందప్రాప్తి, దుఃఖనివృత్తి. ఆనందప్రాప్తికి ప్రాకులాడేవారు భక్తులేకారు, ప్రతివ్యక్తికీ, జీవికీ, ఆనందమును పొందాలి అనేఆశ ఆవేదన ఉన్నది. అయితే సక్రమమార్గము ననుసరించక వక్రమమార్గములో పడి దుఃఖములకు గురియగుచున్నారు, అంతే. ఫలమునాశించక, కర్తవ్యదృష్టితో కాయమును కాలమును సదుపయోగపరచిన, అదే అతిపవిత్రమైన

స్రక్రమమార్గము. అన్ని కర్మలనూ తృష్ణార్పితముగా ఆచరించక, కృష్ణార్పణముగా నిర్వర్తించిన, అదే భక్తిగా మారును.

రమణీయమైన, విజాతీయమైన, ఉత్కృష్టమైన వస్తువందు నిలబెట్టిన పరిశుద్ధ ప్రేమయే, భక్తి. ఉత్కృష్టమైన, అంటే, మార్పుచెందనది, అని తాత్పర్యము. ప్రేమకూడ అంతే; కాలము స్థానము పరిస్థితి వీటిననుసరించి, మార్పుచెందనదిగా వుండాలి. గీతలో దీనికి సమచిత్తము అని పేరు. శీతోష్ణములు, సుఖదుఃఖములు, నిందాస్తుతులు, మొదలైన ద్వంద ములు ఆ ప్రేమను యేమాత్రమూ కదలించవు. యోగః కర్మసు కౌశలం, అన్నాడు. కర్మయోగము కానీ భక్తియోగముకానీ జ్ఞానయోగముకానీ, కర్మముల ద్వారా ఏకత్వమును సాధించి దుఃఖనివృత్తి ఆనంద ప్రాప్తి వీటిని పొందుటలో ఫలసిద్ధినొందును.

ఒక వృక్షము పెరిగే రీతిని పరీక్షించండి. ప్రథమతః, మొదలు, తరువాత కొమ్మలు రెమ్మలు, తరువాత పుష్పములు, తరువాత కాయలు, పండ్లు అట్లనే, ఈ జీవితవృక్షములకు కర్మనే మొదలు; భక్తియే కొమ్మలు రెమ్మలు సుగంధమును వెదజల్లు సుమములు; జ్ఞానమే, పండ్లు, వాటిలోని మాధుర్యము. జ్ఞానఫలంలేని కర్మకానీ భక్తికానీ హాస్యాస్పదమైన చర్యలే. కర్మ భక్తిలేని జ్ఞానము కూడ శుష్క వేదాంతమే !

భక్తిఅనే మార్గములో సగుణభక్తి నిర్గుణభక్తి అని రెండు విధములున్నవి. తాను అన్యుడు, పరమాత్మ అన్యుడు అనే భావమునందు, అనేకరకములైన ఆరాధనాకలాపము నాశ్రయించి ఆ పరమాత్ముని అనుగ్రహమునార్జించుటకు ప్రయత్నము చేయుదురు. ఇదొక రీతి. పరమాత్మలో తన వ్యక్తిత్వమును కలిపి సర్వ భూతములందు ఏకత్వము దివ్యత్వము సచ్చిదానందము ప్రత్యక్షముగా అనుభవించి ఆనందించేది నిర్గుణ భక్తి. చక్కెరతో చేయబడిన రకరకాల బొమ్మలను పిల్లలకమ్ముతూవుంటారు, కొంతమంది, ఊరులో, స్కూల్ గేటు దగ్గర నిలచుకొని అమ్ముతారు. ఒక్కొక్క పిల్లవాడు ఒకొక ఆకారమును ఆశించి ధనమిచ్చి తెచ్చి ఆనందపడుతాడు. అట్లే తన ఇష్టదేవతను సాకారముగా సగుణ స్వరూపుడుగా ఆరాధిస్తూ వుంటాడు సగుణభక్తుడు అన్ని బొమ్మలలోనూ ప్రకాశించే చక్కెరను పురస్కరించి, ఆ ఏకత్వమునే చింతించి ఆనందపడి దుఃఖనివృత్తి నొందువాడు, మరొకడు, నిర్గుణభక్తుడు. చక్కెరలో భేదము లేదు; రూప నామములవలన భేదములు అనే భ్రమ ఉత్పత్తియగును అంతే.

భారతీయ సంస్కృతిలో యజ్ఞయాగాదులకు ఒక ముఖ్యస్థానమున్నది. యజ్ఞముల నాచరించినప్పుడు, సోమపా, అనే ఒక క్రియను చేయవలసియున్నది; దానికి ఎన్నో విధివిధానములు నిబంధనలు కూడ ఉన్నవి. దీని అంతరార్థమును చక్కగా గమనించవలెను. సోమ అంటే చంద్రుడు. పా అంటే త్రాగటము ! చంద్రుణ్ణి ఎట్ల త్రాగటము ? ఇది సమన్వయము కాదే ? అని భ్రమింపనక్కరలేదు. ఎందుకనిన, చంద్రుడు అంటే, చంద్రుడే అధిష్ఠానముగా వున్న "మనస్సు". "చంద్రమా మనసో జాతః" చంద్రునికీ మనస్సుకూ నికట సంబంధమున్నది. చంద్రుణ్ణి త్రాగటము అంటే, విచ్చలవిడిగా సంచరించే మనస్సును అరికట్టి తాను జయించేది, అనేదే అంతరార్థము మనస్సును నిగ్రహించిన, యజ్ఞయాగాదులకర్తుడు కాగలడు. మనో నిగ్రహములేక, కర్మలాచరించిన, అవి నిరర్థక కర్మలే !

మనస్సును అరికట్టుటకు, నామస్మరణ చాలా సులభమైన మార్గము, సర్వభూతములందు సర్వాత్మకుడైన భగవంతుని లీలా గుణగణములను. కీర్తించి ఆనందించితే మనస్సు పరిశుద్ధమగును, సాత్త్వికమగును. దానితోపాటు, సాత్త్వికమైన ఆహారమును కూడ భుజించవలెను. మానవులకు జిహ్వ ఒకటే కాదు. ఇంద్రియము ; పంచేంద్రియములతోనూ మానవుడు ఆహారము నందుకొంటున్నాడు. చెవులతో వినేది ఆహారమే, ముక్కుతో వాసన నందుకొనేది ఆహారమే, కన్నులతో చూచేది ఆహారమే, చర్మముతో స్పృశించేది కూడ ఆహారమే ఇవన్నీ సాత్త్వికాహారముగా వుండాలి. మంచి శ్రవణము, మంచి దృష్టి, మంచి పలుకు, మంచి రుచి, మంచి స్పర్శల నాశించి పొందవలెను.

మనో నిగ్రహమునకు జన సామాన్యముయొక్క సంచారములేని ఏకాంతమందు, ప్రకృతి సౌందర్యముతో ఆకర్షించు అందమైన వాతావరణము ఉత్సాహము నందించును. అయితే, ఎంత కాలము ఈ ఏకాంతవాస మవసరము ? ఇంటిలో ప్రమిదను వెలిగించితే, గాలి వచ్చినపుడు, కిటికీలను వాకిలిని మూసివేస్తాము; గాలి అణగిన తరువాత, దీపమునకు అవాంతరము కలుగదు కాబట్టి, వాటిని తెరచినా భయము లేదు. దేహమనే దేవాలయమందు, జీవుడనే జ్యోతి వెలుగుతున్నది. దైవత్వము దాని ప్రకాశము. ప్రకృతి భావమనే గాలి ఆ దీపమును ఆర్పక, ఇంద్రియములనే కిటికీలను భద్రముగా మూసివేయాలి. అంటే, విషయసంబంధమైన రాగములు వాంఛలు ఉన్నంతవరకూ ఏకాంతవాసం అవసరమే. అవి చల్లబడిన తరువాత, ఈ అనేకత్వములోనూ, ఏకత్వమును సాక్షాత్కరించి ఆనందాన్ని అనుభవించు కొనుట కవకాశమున్నది

కలి ప్రభావమో, ఏమో ? ఈనాడు బజారులో గుంపులమధ్య ఆసనము వేసుకొని, ధ్యానం చేయు మంది బయలుదేరారు ! తన్ను పదిమంది పరమ భక్తుడుగా పరిగణించాలి అనే వాంఛయే దీనికి కారణము. ఇట్టి ప్రదర్శనముల వలన, కలుగు ఆదాయమేమియూ లేదు. ధ్యానమును పరులకు తెలియక ఏకాంత స్థానమందు సలుపవలెను. పరుల మెప్పుకై పాటుపడక, పరమాత్ముని మెప్పుకై పాటుపడవలెను. ముఖ్యముగా, హృదయ మాలిన్యమును పోగొట్టుకోవలెను. అన్ని సాధనల ఉద్దేశము ఇదియే. ఇతరుల మాలిన్యమును దోషములను నిరంతరమూ పరికించితే, మీలోని మాలిన్యము ఎక్కువగును. వారి చెడ్డను, వారి తప్పులను చూడక, తలంచక, వారిని గురించి చెప్పక, మీ మీ దోషములనే పరికించి సరిదిద్దుకోవలెను తెలిసి తెలియక యెవరినైనా నిందించిన, తక్షణమే పశ్చాత్తాపముతో ప్రాయశ్చిత్త మొనరించి మంచి మాటలచే వాని దిద్దుటకు పూనుకోవలెను. అప్పుడు, ఆ చెడ్డవాడు మంచిగా మారుతాడు. వాని ఆక్షేపణలతో కుంగింప జేయకూడదు. ఇతరులను ఆక్షేపణచేసితే, మనము అల్పులమైపోతాము; అధికులము కాము ! పరులను దూషించేది ఏమి అంత ఘనకార్యమా ? పరులను నొప్పించిన, మీ దూషణ పలుకులన్నీ మీ అంత్యకాలములో మీచుట్టూ నాట్యమాడును.

జీవిత కాలములోని ప్రతికర్మ అంత్యకాలమునందు ఆధారముగా ఆదర్శముగా నిలచును. ఆక్షేపణా జీవితం వ్యర్థజీవితం. మీరు ధ్యాన జపాదులను చేయక పోయిననూ పరవాలేదు; భజన చేయకుండిననూ పరవాలేదు. పరులను నిందించక, హేళనచేయక, బాధించక జీవితమును సాగించిన, అంతేచాలు, అదే పెద్ద సాధన. మీ మనస్సులో ఏదోషమూ లేనపుడే, ఇత

రుల దోషములను చూపెట్టుటకు మీకు అర్హత. అది లేక, పరులను దూషించేది, హీనమే కానీ, మంచిది కాదు. తెల్లవారిన మొదలు పరుండేవరకు, జీవితమును ప్రేమ మయముగా మార్చండి. ప్రేమ మయమన్న, పరమాత్మ మయమే కానీ వేరుకాదు.

ధ్యానములో కూర్చున్నంత కాలము పవిత్రత శాంతి ననుభవించి, తరువాత మరొక స్థానమందు దుర్వాసులుగా మారితే ప్రయోజనము లేదు. అది భక్తికి లక్షణము కాదు. ధ్యానమునకు ఫలితమేమి ? 'సతతం యోగినః' అని గీత ప్రబోధించుచున్నది. "సర్వదా సర్వకాలేషు సర్వత్ర హరి చింతనం" అనేడి ఆర్ష బోధ. నామజపము రూపధ్యానము వీటిని సతతమూ నలుపుటకు ఈనాటినుంచి ప్రయత్నము చేయండి. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అణుమాత్రం అగ్నినిప్పు దొరకితే, శ్రద్ధవలన దానిని అధికముగా అభివృద్ధి చేసుకొనవచ్చు. అయితే శ్రద్ధలేనివానికి, ప్రజ్వలించే అగ్గిదొరకినకూడ. దానిని ఆర్పివేసుకొంటాడు ! గురిపై విశ్వాసము దృఢమైనపుడు, శ్రద్ధ సునాయాసముగా బలపడును. దైవవిశ్వాసము, ఆత్మవిశ్వాసము వీటిని సత్సంగములద్వారా, పెద్దల సదోధవలన, శాస్త్రాభ్యాసమువలన, పెంచికొని, తరించండి.

దేహత్వమును విడిచి, బ్రహ్మత్వమును వడసి
అద్వైత విహితమగు సాయి నామం
ఆద్యంత రహితమగు సాయి నామం !

నీ లోన నను నిలిపి, నా లోని నిను తెలిపి
తానెవరొ చెప్పేది సాయి నామం
తాపములు తీర్చేది సాయి నామం !

మృణ్మయత్వము చెరిపి, చిన్మయత్వము గరి
చైతన్య ఝురు లొలుకు సాయి నామం !
జన్మ సఫలత కొరకు సాయి నామం !

రచన : పొతూరి ప్రసన్న

# బాల వికాస్

## ధనసంబంధము

విద్యనుంచి వినయమును పొందవలెను; వినయము వలన, పాత్రత కలుగును, పాత్రతనుంచి ధనమునార్జింప వీలగును. ధనమును వినియోగించిన, ధర్మము పెరుగును. ధర్మము వలన, ఐహికాముష్మిక ఫలములను సంపాదింప సాధ్యమగును.

అయితే, రాను రాను, అన్ని సంస్థలయందు అన్ని క్షేత్రములయందూ సంస్కరణమనే పేరున రక రకములైన మార్పులు మార్పులు ఏర్పడి, వికార స్వరూపముగా బయలుదేరుచున్నవి విద్యా రంగమునందు కూడ ఇట్టి సంస్కరణాల ప్రభావము వలన, విద్యయొక్క నిజార్థమునే మరపించి, మానవత్వమునే మరుగుపరచి, విషయ సమాచార శేకరణ మాత్రమే ముఖ్యలక్ష్యముగా భావించి, ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధను సంపూర్ణముగా విసర్జించుటము జరిగినది. ఆ నాటి విద్యా ప్రబోధమునకు ఈ నాటి విద్యాప్రచారము చాలా విరుద్ధముగా కనబడును. ఈ నాడు, ప్రతి వ్యక్తి ఆ యా నెలకు తాను చెల్లించవలసిన ధనమును చెల్లించక పోతే, విద్యను అందుకో అర్హతను కోల్పోవుచున్నాడు. అధ్యాపకులు కూడ, నెల నెలకు తమ జీతమును అందుకొని, విద్యను అందింతురు, కాబట్టి, ఏదైన ఒక నెలకు జీతము అందకపోతే, ఆ నెల పూర్తి విద్యను అందించలేక పోతున్నారు. ధనమిచ్చి విద్య నందుకొనే విద్యార్థులు, ధనము పుచ్చుకొని విద్య నందించే అధ్యాపకులు, ఈ విధముగా విద్యాబోధ జరిగితే, దానిలో ప్రేమకు స్థానమెక్కడ దొరకును ?

గోకాక్ చెప్పినాడు : బిడ్డలను మనము ప్రేమించిన, బిడ్డలు మమ్మలను ప్రేమింతురు. అని, ప్రేమనే అధ్యాపకులకు విద్యార్థులకూ మధ్య ఉండవలసిన బంధము; ధనము కొరకు, ఒక పదార్థము నిమిత్తమై ప్రేమించిన, అది కృత్రిమమైన భావముగా మారును. దానివలన, పదార్థమే దొరకును కానీ ఆనందము దొరకదు. ప్రేమనిమిత్తమై ప్రేమించిన, ఆ ప్రేమ నిర్మలముగా నిశ్చలముగా నిస్వార్థముగా నిలుచును.

## విద్య-వికాసము

బాల వికాస్ తరగతులలో మీరు ధననిమిత్తమై విద్యను బోధించువారు కారు కాబట్టి, పిల్లల హృదయమును వికసింపజేయుటకు మీకు అధికారము అవకాశము ఎంతైనా వున్నవి. సామాన్యముగా ఈ నాటి అధ్యాపకులందరూ పాశ్చాత్య విద్యలనభ్యసించిన వారు కాబట్టి, వారికి ఆధ్యాత్మికముయొక్క అర్థమే తెలియదు; వారిలో స్వార్థమే అభివృద్ధియైవుండును ; నాస్తికత్వమునకే వారి భావములు వాలును. అయితే, విద్య అనే పదముయొక్క అంతరార్థమును మీరు గుర్తించి దానికి తగిన రీతిగా వర్తించవలెను. మానవత్వములో అంతర్గతమైన దైవత్వమును తెలిపి వికసింపజేసేదే సరైన విద్య. భారతీయ సంస్కృతియొక్క

సారమే ఇది. పిల్లలు భారతమాతయొక్క ఉత్తమ పుత్రులుగా భారతీయ సంస్కృతికి వారసులుగా మెలుగవలెనన్న, ఆధ్యాత్మిక చింతనలు, పలుకులు, ప్రవర్తనలు, వారిలో అభివృద్ధి కావలెను. మ్యాథ మాటిక్స్ చక్కగా పఠించిన ఫలమేమి, గణితము తెలియనియెడల ? అమెరికా దేశమునకు మార్గము చూపింతురు, అయితే, కాశికా మార్గమును కానరారు ! ఆల్జిబ్రా ఎరుగుదురు కానీ ఈ నాటి విద్యావంతులు యువకులు, ఇంటి వైశాల్యమునెరుగరు ! డ్రిల్ చేస్తారు, దినమూ ! అయితే, పద్మాసనమును వెయ్యా లంటే బాధపడుదురు. వృక్షశాస్త్రమందు ప్రవీణులు; అయితే, తులసి ఉపయోగము తెలియుని. నక్కల కుక్కల డ్రాయింగ్ బాగా వ్రాయుదురు, అయిననూ, అక్షరములను గుండ్రముగ వ్రాయబోరు. ఇట్టివారి బోధవలన, భారతీయ సంస్కృతి అభివృద్ధి అగునని ఎట్లు నమ్మేది ?

అధ్యాపకులు విద్యయొక్క తత్వమును తెలుసుకొని బాల బాలికల లేత మనస్సులలో ఉత్తమ భావము, అనుసరణీయ మార్గము, దృఢ విశ్వాసములను హృదయపూర్వకముగా బోధించవలెను. బాల వికాస్ విద్యార్థులయందు, ఈ నాడు ఎంత ఉత్సాహము ఉవ్విళ్ళూరుచున్నది, వారి అధ్యాపకులందు కూడ, ఎంత పవిత్రమైన ఉత్సాహమున్నది. అనేది నాకు తెలుసు అయితే, అధ్యాపకులు మాత్రము, విద్యను బోధించవలసిన విధానములను బాగా నేర్చుకోవలసియున్నది. పూర్వమందు, స్వార్థరహిత భావముతో, అధ్యాపకులు పిల్లలకు పద్యములను, పద స్పష్టతతో, ఒక్కొక్క పదమును చక్కగా పలుకు రీతి, దాని ధాతురూపము సహితము, కంఠస్థము చేయించువారు. సః, త్వం అనే పదముల అర్థము మాత్రము కాదు ; ఆ పదములు ఏ ధాతువునుంచి వచ్చినవి అని కూడ బోధింతురు. ఈ నాడు, అట్లు చేసితే ఆ రీతి నేర్చుకోవటము పిల్లలకు శ్రమము అని తలంచి, లేక, అధ్యాపకులకు ఆ విషయమే తెలియదు అనే కారణమును పురస్కరించుకొని, ధాతురూపములను చెప్పుటము లేదు. కాబట్టి ఏదైన కఠినమైన శ్లోకమును చదువమంటె, పిల్లలు తబ్బిబ్బై పోతున్నారు అంతే కాదు, ఎక్కడనుంచి ప్రారంభించాలి, ఎక్కడ నిలపాలి అని తెలియక, నానార్థములో పడి అపార్థము చేసి, చదివినదంతా వ్యర్థమని నిరూపింతురు.

## అక్షరజ్ఞానము

చింతకు పులుసు లేదు ఎర్రచీమకు తొండము కద్దు, అనే ఒక శ్లోకమును ఎక్కడ విభజించాలి అని తెలియక, చింతకు పులుసు లేదు, ఎర్రచీమకు తొండము కద్దు, అని అర్థము చేసుకొనిన, ఎంత హాస్యాస్పదముగా వుంటును ! చింతకు పులుసు, లేదు ఎర్రచీమకు తొండము, అనేది ఆ శ్లోకమును చదువుటకు సరైన రీతి. రామునితోకపివరుడిట్లనియె, అనే వాక్యమును, రామునితోక, పివరుడిట్లనియె, అని విభజించి, ఒక అధ్యాపకుడు పివరుడు అంటే, ఎవరని తికమకలో పడినాడట ! విషయ వాసనలు, సంతపకోడీలవంటివి, పదార్థము చెడ్డది. ఒకక్షణ చాలా గొప్పది, అనినేను వ్రాసితే, తెలుగు తెలియని మా కస్తూరి, ఆ మాటయొక్క అర్థము తెలియక, (కోడీలు అంటే ఆయనకు తెలుసు; సంతప అంటె ఏమి అని తెలియక శ్రమపడి) సంతప కోడీలు అని సనాతన సారథిలో అచ్చు వేయించినాడు. అక్షర స్వరూపమును కూడ చక్కగా నేర్చుకోవలయు చాలా అవసరము. శ్రీరామచంద్రుడు ఋషికోటికి ఆధ్యాత్మిక విషయములను ప్రబోధించినాడు, అని నేను

వ్రాసి ఇచ్చిన, ఋషి అనే దానిలో త్వరత్వరగా వ్రాసినపుడు స్వామి కొమ్మొకటిని ఎక్కువ వ్రాశారే అని, కస్తూరి (ఆయనకు తెలుగు అక్షరముల స్వరూపము అంత బాగ తెలియదు) దానిని కొట్టివేసి, ఋషికోటి అని అచ్చువేయించాడు. దానిని చదివి ఎంతోమంది పండితులు కూడ, నాకు, "స్వామి! శ్రీరామచంద్రుని అవతార కాలమందు ఋష్కోట్లు ధరించిరా?" అని ప్రశ్నించిరి. బాలవికాస్ పిల్లలచే మీరు శబ్దములను స్పష్టముగా పలికించాలి, సమాసములను విడదీసి చదువుటకు నేర్పించాలి, అక్షర స్వరూపములను కూడ చక్కగా బోధించాలి. అప్పుడే వారు, ఇట్టి ప్రమాదములు లేక, వాక్యములనూ శ్లోకములనూ, చదివి అర్థము చేసుకోగలరు.

మరొక విషయము. ఈనాడు మన పవిత్ర గ్రంథములకు విరుద్ధమైన అర్థములను కల్పించి, తప్పు నిర్ణయములను ప్రబోధించే పాఠములు కూడ, పిల్లల పుస్తకములలో ప్రకట మగుచున్నవి. రామాయణము నిజముగా జరిగినదా, దశరథుడు రావణుడు అనే వ్యక్తులు జన్మించి జీవించిరా, అనే సందేహములను కూడ ప్రచారముచేయు పాఠ్య పుస్తకములు బయలుదేరినాయి. రామాయణము అనేది నాగరికులైన ఆర్యులకూ అనాగరికులైన అనార్యులకూ జరిగిన కలహముల కథ అనికూడ వ్రాస్తున్నారు. దీనివలన, విద్యార్థుల హృదయములు చాలా ఛిన్నాభిన్నమై, వారు సత్యమునే ధర్మమునే గుర్తింపలేని స్థితిని చెందుచున్నారు. పిల్లలకు బోధించే విషయములు, సూక్తులు, రీతినీతులు లోక కల్యాణమునకు, సమాజ భద్రతకు, వ్యక్తియొక్క ఆధ్యాత్మికాభివృద్ధికి ప్రోత్సాహకరముగా వున్నవా, లేవా, అని అధ్యాపకులూ, తల్లిదండ్రులూ జాగ్రత్తగా పరిశీలించాలి. దీనినే ప్రహ్లాదుడు,

"చక్రహస్తుని ప్రకటించు చదువు, చదువు! కుంభినీ ధవుని చెప్పెడి గురువు, గురువు! హరి చేరుమనె తండ్రి, తండ్రి!" అని స్పష్టము చేసినాడు

### గురు—శిల్పి

కొండలలో గుట్టలలో ఎన్నోరాళ్లు, పనికిరానివి, పడివుంటాయి. ఒక శిల్పి వాటిని గమనించి, ఏబండ, ఏగుండు ఏవిధముగా ఏపదార్థముగా పనికివచ్చును, దేనికి వుపయోగించవచ్చునని, యోచించి, వాటిని అందుకొంటాడు. కొన్నింటిని, రుబ్బు గుండ్లుగా తయారుచేసి సంసారులకు విక్రయము చేస్తాడు; కొన్ని రాళ్లను వాటి స్వరూపస్వభావములననుసరించి వికార రూపముగనే ఉంచి, దృష్టిబొమ్మగా చెక్కి, పెట్టుతాడు. శుద్ధమైన రాతిపై తన విద్యనంత ధార పోసి సుందరముగా మార్చి ఆశ్చర్యమైన విగ్రహముగా తీర్చిదిద్ది, మ్యూజియములో పెట్టుతాడు; ఆధ్యాత్మికాదర్శముగల శిల్పి పవిత్ర భావముతో ఆ కొండలోని బండ్లను రాముడు, కృష్ణుడు, శివుడు, దుర్గా మొదలైన దేవ విగ్రహములుగా చెక్కి, దేవాలయములలో ప్రతిష్ఠింపజేసి, వాటికి అఖండముగా ఆస్తికులచే ఆరాధన ఆరతి నైవేద్యాదులనందిస్తాడు. అన్ని రాళ్లు ఒక కొండయందు పుట్టినవే! అయిననూ, వాటికి రకరకములైన సేవాభాగ్యము, ఉపయోగము దొరికినది ఎవరి వలన? శిల్పియొక్క శక్తిసామర్థ్యములే, శ్రద్ధాభక్తులే, దానికి కారణము. అధ్యాపకులు ఈ శిల్పి వంటి వారు. పిల్లలలో ఎవరెవరికి ఏ ఏ మార్గమును, ఎవరెవరికి ఏ ఏ రూపము నందించాలి అని మీరే వివేక విచక్షణాలచే నిర్ణయించి కార్యసిద్ధికి కావలసి ప్రయత్నములు సలుపవలెను.

అయితే, విద్యాభ్యాసమనేది, కేవలము శిల్పి యొక్క తత్వము మాత్రము కాదు. పిల్లలను తీర్చి

దిద్దటములో, తల్లి దండ్రులు కూడ, శ్రద్ధవహించాలి. దైవమునకు కూడ, తన సంకల్పముతో భక్తుని కర్మ కూడ చేరినపుడే, జయమును సాధించు అవకాశము! పాసిటివ్ నెగటివ్ రెండూ చేరినపుడే కదా, కరెంట్ ఉత్పత్తి. పూలు, సూది, దారము, మూడు వుండిననూ కట్టేవాడొకడు లేక, మాల యెట్లు తయారగును? ప్రమిద, నూనె వత్తి మూడు వుండిననూ, ముట్టించే వాడు లేక దీపము ఎట్లు వెలుగును? గురువులు న్నారు, శిష్యులూవున్నారు. సద్భావము, సత్‌శిక్షణ లేక వ్యక్తి, సమాజము ఎట్లు అభివృద్ధియగును? మీరందరూ, సహనముచే, సాధనా భావముతో, ప్రబోధ సలుపే సంకల్పమునను పూనుకోవాలి. బోధించిన విషయమును పిల్లలు తక్షణమే అర్థము చేసుకొనక పోతే విఫలప్రయత్నము అనే మీలో ఉద్రేకముండకూడదు. శాంత మనస్సుతో, పది పర్యాయము వారికర్థము కానట్టి విషయమును బోధించవలెను. శిష్యులకు గురువుపై భక్తి ఉండ వలెనన్న, గురువులకు శిష్యులపై వాత్సల్యము కూడ ఉండవలెను కదా?

## గురు శబ్దము

గురువుయొక్క దైవిక స్వరూపమును తల్లిదండ్రు లూ, విద్యార్థులూ గుర్తించి విశ్వసించిన మాత్రమే, విద్యాభ్యాసము అభివృద్ధియగును. గురువును ద్వేషించితే అగౌరవపరచితే ఆయనను అవమాన పర చితే. ఆయన ప్రబోధపై శ్రద్ధపుట్టునా? గురువులు కూడ, మొట్టమొదట తమ కర్తవ్య నిర్వహణలో తాము చూపు శ్రద్ధాభక్తులచే, ఆ స్థానమునకు తగిన అర్హతను పొందవలెను. "గురు బ్రహ్మ గురుర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః" అనే శ్లోకమును గోకాక్ ఉదహరించి ఉపన్యసించినారు. ఇట్టి గౌరవ స్థానమును మీరు గుర్తించి దానికి తగినట్టుగా వర్తించాలి అన్నారు. కర్షకుడు భూమిని సిద్ధము చేసి, విత్తనము నాటునట్లే అధ్యాపకులు పిల్లల హృదయ క్షేత్రములో సద్భా వము సత్‌చింతన సత్‌ప్రవర్తనలను నాటుదురు; ఇది బ్రహ్మకార్యము దీనివలనే గురువులను బ్రహ్మ అందురు. అయితే, బోధించవలసిన బోధనలు సలిపి నామే, అని గురువులు కూర్చొనకూడదు. కర్షకుడు అట్లు చేయడే! పంటకు నిత్యమూ పోషణలు రక్షణలు, సలుపుతూవుంటాడే! అట్లనే గురువులు కూడ, హృద య భూమియందు విద్యా విత్తనములు నాటి నిశ్చింతగా వుండుటకు వీలులేదు. 'గురుర్విష్ణుః'. గురువులు తమ విష్ణుస్థానమును పురస్కరించుకొని, కర్షకుడు, నీరు ఎరువులు అందించునట్లు పిల్లలు నేర్చిన పాఠ ములను ఆచరణలో అనుభవములోనికి తెచ్చి, వాటిని జీర్ణించి సంతుష్టిచెందేవరకు శ్రద్ధవహించాలి. కర్ష కుడు పంటనే నిర్మూలము గావించు కలుపులను తీసి వేస్తాడు. నిరుపయోగమైన నిష్ప్రయోజనమైన గడ్డి మొలకలను పెరికి శుభ్రము చేస్తాడు. అట్లనే శివ స్వరూపము ధరించి, అధ్యాపకులు చెడ్డ అలవాట్లనూ అభ్యాసములను నడవడికలను పలుకులను భావము లనూ ఖండించి విద్యార్థులలో వాక్శుద్ధి భావశుద్ధి, క్రియాశుద్ధిని అభివృద్ధి పరచవలెను. విద్య అనేది తిన్న న్నము కక్కినట్టుగా తలకందించే తలభార విషయ ములు కాదు: హృదయమునుంచి హృదయమున కందించే సద్భావములే విద్య. గ్రంథస్థ విషయ ములను బోధించువార్లు టీచర్లు. ఆ పేరు మీకు సరైనది కాదు. బాలవికాస్ అధ్యాపకులకు ఇంక పై "గురు" అనే పేరును అందరూ వుపయోగించ వలెను. ప్రకృతి సహజమైన అంధకారమును నివా రించి దైవిక ప్రకాశమునందించు ప్రజ్ఞానమును

వెలిగించేదే గురువుయొక్క కర్తవ్యము. దానివలననే, భారతీయ సంస్కృతియందు గురువులను పవిత్ర వ్యక్తులుగా, త్రిమూర్తిస్వరూపులుగా ఆదరించి ఆరాధించటము సాంప్రదాయమై నిలచినది. గురువులు కూడ శాంతము, సహనము, దయా, ప్రేమలను అభివృద్ధి చేసుకొని, సత్యము ధర్మము శాంతి ప్రేమలను వ్యక్తులలో సమాజములో అభివృద్ధి చేయుటకు పూనుకొని సార్థకతనందుకోవాలి. అట్లు చేసితే, అన్యాయము అక్రమము అసత్యము అశాంతి ఇకన్నీ ప్రజలనుంచి దూరమై సుక్షేమము దేశమందు స్థిరమగును.

## లేత హృదయములు

భవిష్యత్తులో భారత సంస్కృతి భారతదేశము, ఏమైపోవునో అని బహుమంది కంగారు పడుతుంటారు. ఇది చాలా పొరపాటు; దూరదృష్టిలేనివారి మనోభావము. అట్టి భయాందోలనములకే మాత్రమూ అవకాశమీయకూడదు. ఎందుకనిన, లేత వయస్సందే, బాలవికాస్ తరగతుల పిల్లల హృదయములందు ఉత్తమ భావములను నాటి పోషించిన, రేపటి దినము దేశమును తీర్చి దిద్దే నాయకత్వము వారికి లభించును. ఈ చిన్న వయస్సులోనే పవిత్ర భావములను వారి మనస్సులందు చేర్చితే, అవి జీవితపర్యంతము నిలచును. ఇచ్చట సమావేశమైన వేలాది మంది స్త్రీ పురుషులలో నూటికి 95 మందికి, వారు ఉదయము చదివిన పుస్తకమందున్న విషయములు ఇప్పటికి జ్ఞాపకమునకు రావు కానీ, తమ చిన్నతనములో, తమకు అవ్వ తాత నేర్పించిన స్తోత్రములు నీతి శ్లోకములు బాగా జ్ఞప్తికి వచ్చును, కదా? లేత వయస్సులో చదువే చదువు ముఖ్యము; వినే కథలు మహాత్ముల చరిత్రలు, అతి ముఖ్యమైనవి. అవన్నీ పవిత్రమైన విత్తనములు. జీవితము పెరుగే కొలది అవి కూడా వృక్షములుగా శాఖోపశాఖలతో పెరిగి ఫలవంతమైన స్వరూపములుగా వుపకరించును.

ఈ నాడు కొంత మంది, చిన్న వయస్సులో పిల్లలకు ఆధ్యాత్మిక తత్వములనందించేది పొరపాటని ప్రచారము చేయుదురు. అట్లు అనుకొనేది పెద్ద పొరపాటు అని మీరు తెలుసుకోవాలి. తరువాత జీవితములో, ఆత్మశాంతి, ధైర్యము సహనము శ్రద్ధా భక్తులు అవసరమైనపుడు, మీకు అందించే ఈ విద్యా ధనము సార్థకమగును. దప్పికలిగిన సమయములో నూతి త్రొవ్వటము మొదలుపెట్టితే మూర్ఖతనమనిపించును, కానీ, ఫలితమేమియుండదు. Start early; Drive slowly; Reach safely అనే ఉపదేశము అన్ని విధముల ప్రయాణములకు అన్వయించును. చిన్న వయస్సులో హృదయమందు చేర్చుకొన్న ఆధ్యాత్మిక సూక్తులవలన, ఉన్నతమైన మార్పులు క్రమముగా కలిగి, జీవితము సుఖమయముగానూ సార్థకతతోనూ సాగును. ఏనాడో రిటైరయిన తరువాత, విశ్రాంతి దొరకిన తరువాత, ఆధ్యాత్మిక చింతన మొదలు పెట్టుతాము అంటే, అది సాధ్యమయ్యే పనికాదు; అసలు ఏ మాత్రము జరుగదు. అంత్యసమయములో, హరి నామమును పలుకేది తరము కాదని, భాగవతమందు చక్కని యుక్తులచే బోధించియున్నది. ఆసమయములో తన చుట్టూ అందరూ ఏడ్చుదురు; తానూ ఏడ్చుచుంటాడు. అపుడు దేవుని స్మరణ ఎట్లు కలుగును? భౌతిక వస్తువుల కోసం జీవితమంతా ఏడ్చిన, దైవం కోసం ఏడ్చేది ఎపుడు మానవుడు? జీవితమంతా ఒక దైవమునకు మాత్రమే ఏడ్వాలి; కానీ దైయ్యస్వరూపమైన దేహముకొరకు ఏడ్వకూడదు; అపార పుణ్యధనమును

ప్రోగుజేసి ఆర్జించి అందుకొన్న ఈ మానవ జన్మమును, అసాధ్య శ్రమతో దక్కించుకొన్న ఈ నర జన్మమును, వదలిపెట్టితే, తిరిగి చిక్కేది అసంభవము. ఏదో అనేక జన్మల పుణ్యఫలముగా, సాయిని చూచే భాగ్యము ఈ జన్మలో లభించినది సంసార సముద్రమందు మునిగి చేతికి చిక్కిన ఈ ముత్యమును తిరిగి చేనుంచి జారిపోకుండ, నన్ను కాపాడు, అని ప్రార్థించేదే జీవితమునకు సార్థకత.

## జీవితసార్థకత

బాలవికాస్ పిల్లలకు, ఇంటియందు వారు తల్లి దండ్రులను గౌరవించాలి, అని మొదట బోధించాలి. పాంచభౌతికమైన దేహమునందించినవారు, తల్లి దండ్రులు. దానికి కృతజ్ఞతనందించాలి, సరే. అయితే, పంచభూతములను ప్రపంచమందు ఏ రీతి ఉపయోగించవలెను అని బోధించు గురువులను గౌరవించి ఆదరించవలెనని కూడ బోధించవలసియున్నది. మానవత్వములోని దైవత్వమును ప్రకటించుటకు గురూపదేశమే కారణమని వారు తెలుసుకోవాలి. ఎందు నిమిత్తమై మాతాపితృలకు గురువులకు కృతజ్ఞత నందించాలి అని వారికి ప్రబోధించాలి. లౌకిక విద్యలతోపాటు, ఆత్మవిద్యను కూడ అభ్యసించవలెను. M.A., B.A,, B.Sc., మొదలైన బిరుదులతో 'అమృతస్యపుత్రాః' అనే బిరుదును కూడ ఆర్జించాలి అనే ఆదర్శము, ఆవేదన, ఉత్సాహము పిల్లలలో పెరిగాలి. కూటికోసం ఆర్జించు విద్యలన్నీ, 50. 60 సంవత్సరములవరకూ ఉద్యోగములో పాల్గొనేవరకూ పనికి వచ్చును కానీ, తిరిగి ఆధ్యాత్మిక విద్యను అభ్యసించక మనశ్శాంతి ఆనందము చేకూరవు.

జీతము నిమిత్తము కాదు, జీవితము నిమిత్తమై విద్యనార్జించాలి. దిక్కులేనివానికి దేవుడే దిక్కు; ఎక్కడ ఉన్న, ఏ పరిస్థితిలోవున్న, దైవము రక్షించును; ఆనందమిచ్చును. ఆ దైవత్వముపై దృఢ విశ్వాసమునందించే ఆత్మవిద్యను మీరు ప్రచార ప్రబోధనల ద్వారా అందించి, భారతీ, భారతీయ సంస్కృతియొక్క సత్‌సంతానములైన బాలబాలికలకు అనుభవరూపమైన ఆనందమును కలుగజేయాలని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

## ప్రేమమతము

మరొక విషయము. మీ విద్యావిధానములో, తరగతులలో, పాఠ్యక్రమములలో, జాతిమత భేదములు ఏ మాత్రమూ రాకుండ లేకుండ జాగ్రత్తగా చూచుకోవాలి. There is only one religion, the religion of love. మానవకులమునకొకే మతమున్నది; అది ప్రేమమతమే! There is only one caste, the caste of humanity. మానవులందరూ ఒకే కులమునకు చెందినవారు; అదే మానవకులము! మీరు ఎక్కడ చేరెన ఎక్కడికి పోయినా, అన్ని దేశములలోనూ, అన్ని తెగలలోనూ, మతములలోనూ, సత్యధర్మ శాంతి ప్రేమ అనే మూల సూత్రములు ఒకే రీతిన ప్రకాశించవలెను. ఇతర మతములవారిని, అన్ని తెగలవారిని ఆనందముగా మీ తరగతులలో చేర్చుకొని విద్యనందించండి. ఎవరినీ ఏ కారణమువలననూ తిరస్కరించకూడదు. పిల్లల లేత హృదయములను ద్వేషాసూయలు భేదభావములు ఏ మాత్రమూ కలుషితము గావించకుండ చూచుకోవలెను. పవిత్ర పురుషుల చరిత్రలను బోధించునపుడు. మహాత్ముల పుణ్య కథలను బోధించు

నపుడు, ఇతర దేశములకు చెందిన, ఇతర మతములకు సంబంధించిన మహనీయుల చరిత్రలను అందించండి. రామ కృష్ణ సాయి గణపతి దుర్గా వీరితో క్రైస్ట్. మహమ్మద్ జొరొస్టర్ వీరి గాథలను కూడా అందించండి. విశాల భావముతో విశ్వప్రేమను సాధించండి. దైవత్వమునకు దేశ కాల పరిమితులు లేవు ; సర్వత్ర సర్వకాలమందునూ ఒకే తేజస్సుగా ప్రకాశించే తత్వమది. ఆ తత్వమందు అధికము అల్పము, గొప్పది చిన్నది అనే భేదభావములను చూపి వాదించేది మూర్ఖతయొక్క లక్షణము. తాను ఎవరని తనకు తెలియని వ్యక్తులు, దైవముయొక్క నామరూపములను గురించి తర్కించి ఇది గొప్పది అది చిన్నది అని వాదించేది హాస్యాస్పదమే కానీ వేరు కాదు. రాముణ్ణి శివుణ్ణి కృష్ణుణ్ణి క్రైస్తుని ఎవరినీ చూడని వ్యక్తి, ఇతను ఆతను కాదు, అతను ఇతను కాదు, అని ఎట్లు చెప్తాడు? చదువులేని గుడ్డివాడే అట్లు చెబుతాడే కాని, మరొకడు అట్ల వాదించడు. అన్ని మతములవారికి సన్నిహిత సంబంధము కలుగునట్లు మీ ప్రబోధ ప్రచారమునందించండి. ధైర్య స్థైర్యములతో చక్కని విశ్వాసముతో ఈ పవిత్ర కైంకర్యములో పాల్గొని, మీ మీ జీవితమును సార్థకము చేసుకొండి.

రాజమహేంద్రవరము — శ్రీవారి దివ్యబోధ

3—1—1974

## అమరతరువు

ఆ సుందరాస్యేందు నాలోక మె చాలు నైశ్చల సిద్ధియౌ నయనములకు
ఆ సుధామధుభాష లాలకించినఁజాలుఁ గర్ణాల కమృతయోగంబు వట్టు
ఆ దివ్యసన్నిధానాప్తిగాంచినఁజాలు నితర ప్రపంచవిస్మృతిజనించు
ఆ యభయంకరహస్తముంచినఁజాలు యమునైనగెల్చుధైర్యముఘటిల్లు

చిన్ని శ్రీపాదమది త్రుటి చిక్కెనేని
నాకలోకాధిపత్యమే యబ్బినట్లు
అట్టిబాబయ్య మనపాలియమరతరువు
అవతరించి చరించు నేఁ డవనిఁగనరె ॥

రామశర్మ

# అఖిల భారత ఆరవ మహాసమ్మేళనము

## నూతన సంవత్సరము

జనవరి 1వ తేదీ నూతన సంవత్సర పర్వదినము. రాజమహేంద్రవరపు చరిత్రలో అది వినూత్న పవిత్ర దినం. రాజమహేంద్రవరము గౌతమీ నదీ తీర మండలి యాత్రాస్థలమని పురాతన కాలమునుండి ప్రసిద్ధి. కానీ, నేడు ఆదొక సంగమస్థానము. భక్త–భగవంతుల సంగమక్షేత్రమై మరింత వన్నె కెక్కినది.

శ్రీ సత్యసాయి సంస్థలనుండి ఎన్నిక చేయబడిన కార్యకర్తలూ సభ్యులూ అరువేల భక్తులు, మహిళా విభాగ్‌లకు అనుబంధమైన "బాలవికాస్" తరగతుల ఉపాధ్యాయులు ఎడునూర్ల యాబదిమందీ, రాజమహేంద్రవరమునకు చేరిరి. తమలో తాము సంప్రతించుకొని, పెద్దల సలహాలనుపొంది, శ్రీవారి ఆశీస్సుల నందుకొని, ముందు కార్యక్రమమును రూపొందించు కొనటమే, సమావేశముయొక్క ఉద్దేశము. సమావేశము రెండు మూడు నాలుగు తారీఖులందు జరిగెను; అన్ని విధములా జయప్రదమై ఫలవంతమైనదనుటకు సందేహమే లేదు హాజరైన కార్యకర్తలూ వుపాధ్యాయులూ తాము వహించుచున్న బాధ్యతయొక్క మహత్వమును గుర్తెరిగి నూత్న ఉత్సాహము వికాసమును అందుకొని, తమతమ సేవాక్షేత్రములకు తరలిరి.

## చక్కని ఆతిథ్యం

రాజమహేంద్రవరము శ్రీ సత్యసాయి సేవాసంస్థల సభ్యులు, వచ్చిన వేలాది భక్తులకు ఆతిథ్యము నొసంగిరి. రాజమహేంద్రవరములోనే, సర్వసమృద్ధి కరమైన వసతులూ సదుపాయములూ వుంచినవూ, తూర్పుగోదావరీ జిల్లా అంతయూ చక్కగా ప్రబోధ ప్రచారములను ఆచరణ పూర్వకముగా జరుపుచున్న వందలాది సమితులూ మహిళా విభాగములూ భజన మండలీలూ వారికితోడునీడగా తను ధన మనస్సుల ద్వారా ప్రోద్బలము నొసంగి సంతోషముగా సహకరించి భక్తులకు అమితానందము నందించిరి. వేలాది స్వయం సేవకులు — స్త్రీ పురుషులు — సమ్మేళనము జరిగిన 'నవభారత్ గురుకుల' మందు కొన్ని వారముల ముందుగనే చేరి, పెద్దపని చిన్నపని అని లెక్కచేయక, దేహశ్రమకు ఓర్చుకొని, విశాలమైన మెద్దులనూ అతి రమణీయముగా అలంకరింపబడిన వేదికనూ వంట గదులనూ భోజన మందిరములనూ, స్నానపు గదులనూ—వాటియందు వేడినీటికి చన్నీటికి కుళాయిల నమర్చి-భక్తులకాశ్చర్యము కలుగునట్లు గురుకులముయొక్క విశాల ప్రదేశములను శ్రద్ధాభక్తులచే తీర్చిదిద్దిరి. జిల్లా స్వయంసేవకులు చూపిన అణకువ, వారి సేవానిరతి సామర్థ్యము, వారందించిన ఆదరణ వీటివలన వచ్చిన ప్రతి సభ్యుని హృదయము కృతజ్ఞతతో నిండినది. మరుపురాని వారి ఆతిథ్యము మాటలతో వర్ణింప నలవి కానిది.

## దర్శనభాగ్యం

సంవత్సరారంభ దినము సాయంత్రం 6-30 గంటలకు భగవానులవారు ప్రత్యేక విమానమందు

రాజమహేంద్రవరము చేరిరి. రైలుబండ్లు సక్రమముగా నడువకపోయిననూ, పెట్రోలు కొరతవల్ల కార్ల సంచారము సన్నగిల్లిననూ, ప్రయాణమందు సమ్మెలవల్ల యెన్నో అంతరాయములు కలిగిననూ, వాటికి లెక్కించక, ఎంత ఎంత దూరమునుండియో వచ్చిన భక్తులకు శ్రీవారు తమ దివ్యదర్శనమును ఆనాడు 7 గం॥లకు గురుకులమునందే అనుగ్రహించిరి. వేలాది భక్తుల కన్నుల కరువు తీరినది; పడిన శ్రమ అంతయూ వారు క్షణములో మరచిరి. యెవరి కరుణవలన వారందరూ అక్కడ సమావేశమైరో, వారి దివ్యసుందర



మంగళ రూపమును కన్నులపండుగగా హృదయము నిండుగా ఎంచుకుని వారు ఆ సాయంత్రం పాడిన భజనలు నిజముగా బ్రహ్మానందదాయకమై యుండినవి.

### సాయినిలయం

రాజమహేంద్రవరము సత్యసాయి సేవాసమితి కార్యక్రమములకు కేంద్ర స్థానముగా "సాయి నిలయ" మనే భవనమునకు, రెండవ తేదీ ఉదయము, శ్రీవారి దర్శనలాభము పొందుటకు వేలాది ప్రజలు అచ్చటజేరి భజనలో ఆనందముగా పాల్గొనిరి. శ్రీవారు విడిది చేసియుండిన, గాంధీపురములోని భవంతిలోనూ, సాయినిలయమందునూ, తమ దర్శనము కొరకు తహతహలాడు భక్త సమూహములకై, ఒక మారు కాదు, మరల మరల, శ్రీవారు దర్శన

మొసంగి. వారిని ఆనందపరచిరి. గురుకులము ప్రక్క రోడ్డులమీద వరుసలలో నిలుచున్న భక్తులకు దర్శన మొసంగుటకు శ్రీవారు కారు మీదకెక్కిన దృశ్యమును కాంచిన భక్తులకు, శ్రీవారి కరుణయొక్క వ్యాప్తి స్పష్టమై, వారి మనస్సులు పుప్పొంగినవి. మానవుని మాధవునివైపు మరల్చుటకు భువిపై అవతరించిన ఆ మధుర మందస్మిత మోహనమూర్తిని చూచి వారి కండ్లు ప్రకాశించినవి.

అన్ని రాష్ట్రములనుండి, దూరదూర ప్రాంతము లైన అస్సాం హిమాచల ప్రదేశ్, కేరళనుండి, శ్రీలంక, ఫిజి, సింగపురం, మలయా, మొదలైన పూర్వ దేశములనుండి యూరోప్ అమెరికా ఆఫ్రికా ఖండములనుండి, వేలకువేలు ప్రజలు శ్రీవారి దర్శనమునకై జేరజేర, వారిఅందరిదరికి జేరిజేరి, మరల మరల బాబావారుదర్శన మొసంగిరి వారికి భగవద్భక్తి గరపి గరపి, మురిపించి, తరియింపజేసిరి.

## ప్రారంభోత్సవము

సత్యసాయి సంస్థల కార్యకర్తల ఆరవ అఖిల భారత మహాసమ్మేళనము, జనవరి రెండవ తేదీన, సాయంత్రము 4-30 గంటలకు ప్రారంభమైనది. వేదసీమయని పేరెన్నికకన్న కోనసీమనుండి, వేద పండిత బృందములు వేదపఠనము చేయుచూ, నాద స్వర విన్యాసములు స్వాగతగీతికలను ఆలాపింప, వూరేగింపుతో బా బా వా రు, నయనానందకరముగా అలంకరింపబడిన పూలబాటలపై నడచి, వేదిక చెంత కరుదెంచిరి.

పదిహేనువేల కంఠములు పదిహేనువేల హృదయములు నిండు భక్తి ప్రపత్తులతో, ఓం శివాయ! ఓం శివాయ, అని పాడుచుండగా, శ్రీ సత్యసాయి సర్వేశ్వరుడు సమ్మేళన ఆరంభసూచకముగా శుభజ్యోతిని వెలిగించిరి. అప్పుడు "నందలాలా! యదు నంద లాలా!" అనే భజనగానము అందరి మానసములను పులకరించినది.

తరువాత, ప్రశాంతినిలయ మందలి శ్రీ సత్యసాయి వేదశాస్త్ర పాఠశాలా, విద్యార్థి అయిన బాలుడు, సాయిరాం సుబ్రమణ్యంను, డా॥ సూరిభగవంతంగారు సభకు పరిచయము చేసిరి. ఇంత చిన్న వయస్సులోనే, శ్రీవారి అనుగ్రహబలమువలన, ఆ అబ్బాయి, వేదమంత్రములను ఆ మూలాగ్రముగా వల్లించుటయే కాక, వేదార్థమును కూడ చెప్పగల సామర్థ్యమును సంపాదించినాడనిరి. "మధువాతా ఋతాయతే" అను వేదమంత్రమును చదివి దాని అర్థము, అంతరార్థములను, విపులముగా తేట తెలుగులో సాయిరాం సుబ్రహ్మణ్యం తెలిపినపుడు అందరూ విస్మితులైరి.

తూర్పు గోదావరి జిల్లా శ్రీ సత్యసాయి సేవా సంస్థల అధ్యక్షులైన శ్రీ దండమూడి రామరావు గారు, M.Sc., తమ జిల్లాలోని అన్ని సంస్థల తరుపున శ్రీవారికి వందన నమస్కారములనర్పించుచూ, తమ కందరికి శ్రీవారు కండ్ల వెలుగు; హృదయనివాసి అని తెలిపిరి. సమ్మేళనము జరుగుటకు అన్ని విధాల అనుకూలములతో అమర్చబడిన "నవభారత గురుకుల" ము గురించి ప్రస్తావించుచూ ఆ ప్రదేశపు వాతావరణము మానవసేవకై అంకితమైయున్నదని తెలియజేసిరి తరువాత గురుకుల స్థాపకులైన శ్రీ బుల్లయ్యగారు శ్రీవారికి స్వాగత పత్రము నందించిరి.

భగవానులవారు తమ దివ్య సందేశమునందించుచూ, సనాతన ధర్మముయొక్క విశిష్టతను గురించి నొక్కి వక్కాణించిరి. బ్రాహ్మణ్యము (బ్రహ్మమార్గ

నందాసక్తి) మరియు బ్రహ్మచర్యము (ఇంద్రియ నిగ్రహము) వీటిద్వారా వలననే లోకమందశాంతి వర్ధిల్లినది అని వివరించిరి.

## రాష్ట్రాధ్యక్షుల నివేదికలు

భారత దేశమందలి వివిధ రాష్ట్రముల సేవా సంస్థల రాష్ట్రాధ్యక్షులను వేదికపైకి పిలచి, వారి నేతృత్వమందు ఆయా రాష్ట్రములందు సాధించిన ప్రగతి పథకములను గురించి సభ్యులకు తెలుపమని శ్రీవారు ఆదేశించిరి, డిల్లీ పంజాబ్ హర్యానా రాష్ట్ర ములకు అధ్యక్షుడైన శ్రీ సోహన్‌లాల్‌గారు, ఆ రాష్ట్ర ములందు అన్ని సంస్థలలోనూ, వాటి కార్యక్షేత్ర పరిసరములలోనూ అధ్యాత్మిక జాగృతి జరిగి. నూతన సాయీశకమారంభమైనదనుటకు విపులమైన నిదర్శన ములు కలవని తెలిపిరి. కలకత్తా నగరాధ్యక్షుడైన హైకోర్ట్ జడ్జిగారు శ్రీ అరుణకుమార్ దత్‌గారు మాట్లా డుచూ వైద్యశాలలయందు కారాగారములందు సత్య సాయి సేవాదళ సభ్యులు చేయుచున్న కార్యక్రమ ములను వివరించి, స్టడీ సర్కల్, భజన మండలి మొదలైన సంస్థల వివిధ కార్యక్రమములను వివ రించిరి. వయోవృద్ధుల వంటరితనమునూ దైహిక మానసిక బాధలనూ బాపుటకై ఒక వసతిగృహమునే ఏర్పాటు చేయుటకు వ్యవస్థ చేసితిమి" అని తెలిపిరి.

గుజరాత్ రాష్ట్రపు అధ్యక్షుడైన డా॥ చూడాసమా గారు తమ రాష్ట్రములో ఈ మధ్యవచ్చిన వరదల సందర్భమందు సమితుల సభ్యులు వొనరించిన సేవను గురించి వివరములనందించిరి, గుజరాతి భాషలో ప్రకటమగుచున్న 'సనాతన సారథి' పత్రికకు నాలుగు వేలకు పైగా చందాదార్లు గలరని తెలిపిరి. జస్టిస్ శ్రీ బాలకృష్ణ యెరాడిగారు కేరళ రాష్ట్రమందు సేవా సంస్థలు సంస్కృతమందూ తెలుగునందూ తరగతులు నడుపుచున్నవని తెలిపిరి. తెలుగు నేర్చుకొన్న బాలవికాస్ పిల్లలు. ప్రశాంతి నిలయమందు శ్రీవారి దివ్య సన్నిధియందు, జన్మదినోత్సవ సందర్భము నందు, తెలుగునందే కొన్ని నాటికలను ప్రదర్శించు భాగ్యమును పొందిరనిరి. కాలికట్ నగరమందు సేవాసమితి నడపుచున్న ఉచిత కండ్ల ఆస్పత్రిని గురించియూ మిగిలిన కొన్ని సమితులు యేర్పరచి జరుపుచున్న ఉచిత వైద్యాలయములను గురించి యూ వివరములనందించిరి.

మహారాష్ట్రపు స్టేట్ ప్రెసిడెంట్‌గారైన శ్రీ M M. పింగెగారు కూడా తెలుగు తరగతులు బొంబాయిలోనూ ఇతర పట్టణములలోనూ భక్తులకొరకు చక్కగా జరుగు చున్నవని తెలిపిరి. అనావృష్టిచే కరువు బాధకు గురిఅయిన ప్రజలకు సభ్యులు అందించిన సేవను గురించి ప్రస్తావించిరి. బొంబాయి నగరమునకు చేరువగానున్న ఒక సముద్రతీరపు పల్లెయను సేవాదళ సభ్యులు తమ విశిష్ట సేవాక్షేత్రముగా యెంచుకొని, అక్కడ ప్రజలకు విద్యాప్రబోధ సామాజికైక్యత, ఆరోగ్యశిక్షణ ఆర్థికప్రగతి ఆధ్యాత్మికోన్నతి వీటిని సంపాదించుటకు సూక్తసహకార సహాయ సదుపాయ ముల నందించుచున్నారనిరి. బీద విద్యార్థులకై ధర్మక్షేత్రమందు సమితి నడుపుచున్న పాఠశాలను ఉన్నత పాఠశాలగా అభివృద్ధిగాంచుటము జరిగించనిరి. పిల్లలకు జీవనోపాయము కల్పించుటకొరకు వడ్రం గము, కుట్టుమిషీన్ పని మొదలగువాటిలో వృత్తి శిక్షణమును కూడ యేర్పాటు చేయడమైనదన్నారు. సనాతనధర్మ పునరుద్ధరణమందాసక్తి కలిగిన కాలేజీ విద్యార్థులకు పూనా నగరమందు ఒక హాస్టల్‌కు శ్రీవారే తమ దివ్య ఆశీస్సులతో ప్రారంభోత్సవము జరిపిరనిరి.

అస్సాం రాష్ట్రపు విషయములను వివరించుచూ డా॥ బరువాగారు "క్రొత్తసమితి యొకటిని స్థాపించు సందర్భమందు, శ్రీవారిని నేను సందేశము కొరకు ప్రార్థించినాను. అపుడు, వారు సూర్యుని గురించి ప్రచారమెందుకు ? సూర్యుడుదయించినాడని ప్రజలకు తెలుపుటకు ప్రత్యేక ప్రయత్నమెందుకు ? అని తెలిపిరి. శ్రీవారే ఆ ప్రచారమును అస్సాం ప్రజల హృదయ క్షేత్రమందు సతతమూ జరుపుచున్నారు" అని తెలిపిరి. బిహార్ రాష్ట్రపు సంస్థల కార్య సాధనను గురించి డా॥ G.V.L.N.మూర్తి D.Sc. గారు తెలిపిరి. భగవానుని దివ్యసందేశమును జంషెడ్పూరము, పాట్నా మొదలైన నగరములలోనూ చుట్టుపక్కలనున్న పల్లెలలోనూ శ్రద్ధగా ప్రచారము చేయుచున్న సంస్థల సేవను తెలిపిరి.

శ్రీమతి సుందర్ సింగ్‌గారు రాజధాని ఢిల్లీనగరంలోని మహిళా విభాగ్ సభ్యుల కార్యక్రమములను తెలిపిరి. వారు అనేక ఆస్పత్రులలోని రోగులకు సేవ చేయుచున్నారు; మురికి వాడలయందు పరిశుభ్రతను పాలింపచేయుచున్నారు ; అంధబాలుల పాఠశాల పిల్లలకు మాతృవాత్సల్యమునందజేయుచున్నారు. శ్రీమతి సరళా షాగారు బొంబాయి మహిళా విభాగ్ సదస్యులు బాలవికాస్ తరగతుల అభివృద్ధిని గమనించుచున్నారనిరి. ప్రెసిడెన్సిజైల్‌లో బంధింపబడిన స్త్రీలకూ వారి పిల్లలకూ సేవ జేయు అవకాశము తమ సభ్యులకు దొరకినదని, శ్రీమతి సుధా మజుందార్ గారు సంతోషముతో సభకు తెలిపిరి. "గ్రామీణ స్త్రీల అభివృద్ధికి, వారి ఆధ్యాత్మిక సాధనలకు తోడునీడుగా కొన్ని కేంపులను విభాగ సభ్యులు జయప్రదముగా జరిపి వెనుకబడిన విద్యార్థినులకు ప్రత్యేకముగా ఉచిత శిక్షణ తరగతులనేర్పరచినాము" అని మద్రాస్ నగర మహిళా విభాగ్ తరుపున డా॥ లీలా M.A., గారు తెలిపిరి.

తరువాత, కర్ణాటక రాజ్యములోని సేవాసమితుల రాష్ట్రస్థాయి అధ్యక్షుడైన డా॥ ఎం. బి. సుందరరావుగారు తమ రాష్ట్ర ప్రగతిని తెలుపుచూ దుర్భరమైన కరువు పరిస్థితిని ప్రజలు ఎదుర్కొనుటకు నేలల కొలది "సత్యసాయి ప్రసాద కేంద్ర" ములను కొన్ని కొన్ని గ్రామములలో నెలగొల్పి, బీదలకు ఆహారమునందించి తాత్కాలిక వుపశాంతిని కలుగజేసినాము, అనిరి. వాన రావాలి, ఆకలిబాధ తీరాలి అనే ఆవేదనతో శ్రీవారినుద్దేశించి ఏడు దినములు అఖండ భజన చేయుటకు గుల్బర్గా నగర భక్తులు నిర్ణయించి మొదలు పెట్టిరి ; 6 దినములు గడచినవి 7 వ దినము మంగళహారతి ముహూర్తము వచ్చే సరికి, మేఘాలు చేరి, కుంభద్రోణముగా వర్షము వచ్చినది అని తెలిపి, సభ్యులను హర్షింపజేసిరి. తమిళనాడు రాష్ట్రాధ్యక్షుడైన జడ్జి శ్రీ జి. వి. దామోదరరావుగారు కోయముత్తూరు జిల్లాలోని కొన్ని సమితీలు సహకరించి నిర్వహించిన చికిత్సా కేంపుని వర్ణించిరి.

ఒరిస్సా రాష్ట్రాధ్యక్షుడు శ్రీ బ్రహ్మానంద పండా గారు ఆ రాష్ట్రమందు సాయి సందేశము, సాయి మహిమలు. సాయి అవతారము వలన జరుగుచున్న కనుపించుచున్న అపార మహిమలు అద్భుత లీలలు, ఆస్తికాభివృద్ధి ఇవి మూలమూలలకు కూడ ప్రాకినవి, అయితే ఇంకనూ సాధించవలసిన పని యెంతో వున్నదని విన్నవించిరి. ఉత్తర ప్రదేశ్ అధ్యక్షుడు శ్రీ డి. పి. శుక్లాగారు ఆ రాష్ట్రము చాలా విస్తారముగా నుండుటవలన, మొత్తం 54 జిల్లాలనో 32 జిల్లాలలో సంస్థలు చాలా తక్కువ, అన్నారు. మీరట్ నగరమందు ఒక సత్యసాయి కాలేజిని స్థాపించుటకు సిద్ధమగుచున్నారని తెలిపిరి.

మధ్యప్రదేశ్ ప్రెసిడెంట్‌గారైన శ్రీ ఎస్. పి. శేట్ గారు భోపాల్ నగరములో జరుగిన "బాలవికాస్ పిల్లల ర్యాలి"లో రెండు వేలు బాలబాలికలు పాల్గొనిరనిరి. శ్రీ సత్యసాయి విద్యాసంస్థల సమావేశమును గురించి ప్రస్తావించిరి. ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ జడ్జి గారైన శ్రీ వి. పార్థసారథిగారు ఈ రాష్ట్రమందలి విజయవాడ, విశాఖపట్టణము, హైదరాబాద్ నగరములలోని సేవాదళ సభ్యుల కార్యక్రమములను వివరించిరి. వందలాది పల్లెలయందు నగర సంకీర్తన కార్యక్రమము శ్రేష్ఠ రీతిగా జరుగుచున్నది; ప్రతివారు ప్రతిదినము తప్పక వచ్చుచున్నారు, అనిరి. పెద్దలు అనుపించుకొనే మనము మాత్రము వారికి సరైన మార్గదర్శకులుగా లేమనిరి; వారికి ఆదర్శప్రాయముగా పట్టణవాసులూనడుచవలెనని హెచ్చరించిరి.

## సబ్ కమిటీలు

తరువాత సంస్థయొక్క వుద్దేశములు సఫలత నొందుటకు సభ్యులనుంచి, వారి వారి అనుభవముల ఆధారముపై వారిచ్చే సలహాలను తీసుకొని, సమావేశమునకు సమర్పించుటకొరకు కొన్ని సబ్‌కమిటీలను యేర్పరచిరి ఒకొక సబ్‌కమిటి ఇద్దరు చాలకులు; అన్ని రాష్ట్రములనుంచి యేరబడిన మెంబర్లు (1) సత్యసాయి సంస్థల ప్రభావము, పురోభివృద్ధి (చాలకులు : శ్రీ జి. కె. దామోదర రావుగారు, శ్రీ బి. పండాగారు) (2) వివిధ సంస్థలలో అన్యోన్యతను అభివృద్ధి యుట. వాటి అజమాయిషీ; (చాలకులు: శ్రీ సోహన్ లాల్‌గారు, డా॥ చూడాసమాగారు) (3) విద్యాప్రచారమునకు సంబంధించిన కార్యక్రమములు. ఆధ్యాత్మిక ప్రబోధ (చాలకులు : డా॥ వినాయక కృష్ణగోకాక్ గారు, శ్రీ అరుణకుమార్ దత్‌గారు) (4) బాలవికాస్ శిక్షణముద్వారా ధర్మస్థాపనాకాంక్షము (చాలకులు : శ్రీ యెరాడిగారు, శ్రీ యెస్. పి. శేట్‌గారు) (5) నియమ నిబంధనల పరిశీలన (చాలకులు : శ్రీ పార్థసారథి గారు, శ్రీ రాయనింగర్ గారు) (6) సత్యసాయి సేవాదళ్ (చాలకులు : శ్రీరమణరావుగారు, డా॥ కె. కె. మిస్త్రిగారు).

## విశ్వవ్యాప్తి

సబ్‌కమిటీల సదస్యుల మరియు చాలకుల పేర్లను శ్రీ ఇందూలాల్ షాగారు సభలో తెలిపిరి. గమనించవలసిన కొన్ని మార్గదర్శకములైన సూచనలను కూడ సబ్‌కమిటీలకు అందించడము జరిగినది బాలవికాస్ కార్యక్రమముయొక్క ప్రాముఖ్యతను గురించి ఉపన్యసించుచూ, వాటివలన పిల్లల మనోబుద్ధులు నడవడికలు స్నేహసౌహార్ద్రములు యెంతవరకు ఉత్తమమైనవి, తల్లితండ్రులలోనూ అక్కచెల్లులు అన్నతమ్ముళ్లు వీరిపై కూడ యే రీతిగా మార్పులు కలుగుచున్నవి, అని పరీక్షించి, తరగతులను యే మార్గమందు జరిపితే సంతుష్టికరమగు ఫలితమునందించును, అనే సమస్యలను పరిహరించు సలహాలను పొందుకొరకు బొంబాయి యూనివర్సిటి సైకాలజి ప్రాధ్యాపకులు, ఎడుకేషన్ ప్రాధ్యాపకులు, చేరి రిసర్చ్ స్కీమును తయారుచేసి, దాని ప్రకారము పని చేయుచున్నారు, ఖరగ్‌పురం ఇన్‌స్టిట్యూట్ ప్రాధ్యాపకులు కూడ, వారిలో చేరి ఉత్సాహమునందించుచున్నారు. వీళ్లతో సహకరించి, వాళ్ల సలహాలను పరిశీలించవలెనని షాగారు తెలిపిరి. త్వరలోనే, సత్యసాయి యూనివర్సిటి స్థాపనకు అవసరమైన ఆదర్శస్థానమందుకొని సాయి సందేశమును విశ్వవ్యాప్తి గావించవలెనని పలికిరి.

1975వ సంవత్సరము చాలా ముఖ్యమైనది. ఆ సంవత్సరము మనము భగవానులవారి 50 వ జన్మదినోత్సవమును జరుపుదాము. అన్ని దేశము

లకు అతి పవిత్రమైన అత్యానందకరమైన సంవత్సర మది. దానికి అనుగుణమై, శ్రీవారికి అతి ప్రియమైన, వారి ధర్మసంస్థాపనా కార్యమునకు పోషకమైన బాలవికాస్ తరగతులను గ్రామగ్రామమునందు స్థాపించవలెను; చక్కగా శ్రద్ధా భక్తులతో అందరి లోనూ సాయియున్నారనే దృఢవిశ్వాసముతో మానవ సేవకు బద్ధకంకణులైన వేలాది సత్యసాయి సేవాదళ ములను స్థాపించవలెను; సత్యసాయి భజనమండలి, లైబ్రరి, స్టడిసర్కిల్, మొదలైనవి బహు సంఖ్యలో పెరిగి, ప్రజానీకమందు సత్య ధర్మ శాంతి ప్రేమలను నెలగొల్పుటకు పూనుకోవలెను; సత్యసాయి పాఠ శాలలూ కళాశాలలూ వ్యవసాయదార్ల ప్రత్యేక శిక్షణ క్షేత్రములు, వెనుకబడిన ప్రదేశముల ప్రజలకొరకు వెనుకబడినవారి పురోభివృద్ధికొరకు ప్రత్యేక విద్యా క్షేత్రములు, ఇంకను ఎన్నెన్నో స్వార్థరహిత సేవాస్థాపనములను కూర్చిన పవిత్ర పుష్పమాలను భగవానుల పాదపద్మములందు జన్మోత్సవమునాడు సమర్పించవలెను. ఈ సంకల్పమును సాధించుటకు ఈ నిముషమునుంచి త్రికరణశుద్ధితో ప్రయత్నించ వలెనని సభ్యులనుత్సాహపరచిరి.

### నామ మహిమ

మహారాష్ట్రపు సేవాసంస్థల అధ్యక్షుడైన శ్రీ పింగె గారి సెక్రటరిగారు, 73 డిసెంబర్ నెలలో బెంగళూరు నుంచి బొంబాయికి కుటుంబ సమేతముగా కారు ప్రయాణము చేసినపుడు, సరిహద్దు సమస్య పరిహా రము కాలేదనే వుద్రేకముతో ప్రజలు గుంపులు గుంపులుగా కోపావేశముతో గలభాలు చేసే చోటులో చిక్కుకొనిరి. వారి కారును ఆపి, వారిని బెదరించి, ఒక పెద్ద గుంపు కారుకు నిప్పు పెట్టుటకు ప్రయ త్నించినపుడు, వారు ఆ గుంపుయొక్క నాయకుని యెదుట శ్రీవారి చిన్న ఫోటో ఒకటిని చూపించి, అయ్యా! నేను బాబావారి సన్నిధినుంచి వచ్చుచు న్నాను; వారి ఆదేశం ప్రకారం నేను మరి కొన్ని దినములలో ఇట్లనే వచ్చి వారిని దర్శించాలి" అని చెప్పగా, ఆయన మనస్సు మెత్తపడినది. ఆయన ఆజ్ఞకు ఆ గుంపంతా తలవంచి, వారిని వెళ్లనిచ్చిరి; యేమీ ఆటంక పరచలేదు, అని చెప్పి శ్రీ ఇందూలాల్ షాగారు, బాబావారి చిత్రము, వారి నామ జపమే ఆ కోపాంధులలో యింత పరివర్తనను తేగలిగినది, అంటే, వారి అనుగ్రహము వారి మార్గ దర్శకత్వము. వారి కరుణాకటాక్షము లభించిన సాధించలేనిదేమున్నది," అని పలుకగా, విన్న వేలాది సభ్యులు ఆనందబాష్పములతో ఆనందించిరి.

సేవాదళ్, మహిళా విభాగ్, బాలవికాస్, భజన మండలి, సేవాసమితి, సత్యసాయి విద్యాసంస్థలు, వీటిని స్థాపించి నడుపించే సభ్యులకు మార్గదర్శక ముగా వాటి ఆదర్శములు, సాధించవలసిన లక్ష్యములు, పాటించవలసిన నియమ నిబంధనలను అచ్చువేయించిన ఆరు పుస్తకములను షా గారు శ్రీవారికి సమర్పించి, ప్రచారమునకు విడుదల జేసిరి

### బాలవికాస్—గురువులు

జనవరి 3 వ తారీఖు ఉదయము 10-30 గం॥కు భారత దేశపు అన్ని రాష్ట్రములనుండి వచ్చియున్న సుమారు 750 బాలవికాస్ టీచర్లు సభా మందిరమందు సమావేశమైరి. డా॥ గోకాక్ గారు వారినుద్దేశించి మాట్లాడుచూ, "పిల్లల మనస్సు చాలా సున్నితము; మొక్కై వంగనిది మానై వంగదు. సనాతనమైన మన సత్సంప్రదాయములను చిన్నతనములోనే వారికి బోధించవలెను. ఈ నాటి పాఠశాలలలో బాలులకు

స్క్రమ నడవడి అలవర్చుట లేదు. పసి హృదయములకు సహకారము నేర్పవలెను కానీ పోటీ తత్వము పెంచకూడదు. దయా సహనము మొదలగు సద్గుణములు ఆ చిన్నవయస్సునందే వారికి అలవరచవలెను. పరీక్షలో ఉత్తీర్ణులగుట కంటే సత్ప్రవర్తనమగుట మేలు. పిల్లలకు మన పురాణ పురుషులు, వీరులు ఋషులు మునులు సాధుసంతులు, భక్తులు మొదలగు వారి కథలను బోధించవలెను. ప్రస్తుత పాఠశాలలయందు ఇట్టి కథలను విని ఆనందించుటకు బాలుల కవకాశమే లేదు. అన్నిటికన్న మిన్న ప్రేమను పంచి, ప్రేమను ప్రసరింప జేసి, ప్రేమ ప్రవాహమందు అందరినీ వోలలాడించవలెను. స్వర్గమనిన, పాలబుగ్గల పసి హృదయములందే అనుభవించవచ్చును" అనిరి.

## దివ్య బోధ

శ్రీవారు తమ దివ్యోపన్యాసమందు, గురువుయొక్క త్రివిధములైన బాధ్యతను తెలియజేయుచూ, "గురు బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుదేవో మహేశ్వరః" అనే శ్లోకమును ఉదహరించిరి. బాలవికాస్ టీచర్లు పిల్లలలో మంచి అలవాట్లను భావములను కలుగజేసి (బ్రహ్మ తత్వము) వాటిని శ్రద్ధగా కాపాడుచూ వృద్ధి చేయుచూ (విష్ణుతత్వము) చెడు తలంపులను చెడు భావములను త్రుంచివేయుచూ (మహేశ్వర తత్వము) పిల్లలను తీర్చి దిద్దవలెనని ప్రబోధించిరి. ఇక ముందునుండి బాలవికాస్ టీచర్లను 'గురు' వులనవలెనని ఆదేశించిరి.

## నివేదికలు

ఆ సాయంత్రము 4 గం॥కు సబ్ కమిటీల నివేదికలను సభకు సమర్పించుటము జరిగినది. "సాధనా శిబిరములను నెలకొక పర్యాయము ప్రతి సమితి నిర్వహించి తీరవలెను. నియమనిబంధనలు సభ్యులందరికీ తరచు చదివి వినిపించి వివరించవలెను; దీని వలన సంస్థయొక్క ఉద్దేశములు సదా వారి గుర్తులో వుండును. సత్యసాయి విశ్వవిద్యానిలయమును ఎంత త్వరలో వెలసిన, అంత మంచిది; మొదట ప్రయత్నముగా మహిళా విశ్వవిద్యాలయమైనా ప్రారంభమై, అన్ని రాష్ట్రములలోనూ అనుబంధ కళాశాలలు వెలువడవలెను. భారతీయ సంస్కృతి, వేదాంత ప్రచారము ఆధ్యాత్మిక ప్రబోధలపై, ఉపాధ్యాయులకు తరగతులు వేసవిలో నడుపవలెను

బాలవికాస్ తరగతుల ప్రాముఖ్యతను గమనించి, ప్రతి గ్రామమునందు వాటిని ప్రారంభించి, జిల్లా వారీగా రాష్ట్రవారీగా "పిల్లల రాలీ" లను యేర్పరచవలెను, కేంద్రం వారిచే గుర్తింపబడని కొన్ని సంస్థలను కొన్ని వ్యక్తులు నమస్తూ భక్తులను మోసగించుచున్నారు. అట్టివాటిని ప్రోత్సహించక భక్తులకు తెలియపరచవలెను. సేవాదళములకు రాష్ట్రస్థాయిలో కన్వీనర్లుండవలెను. తరఫీదు పొందిన సేవాదళ సభ్యులకు అన్ని రాష్ట్రములలోనూ ఒకే రకమైన గుర్తింపు బ్యాడ్జీలుండవలెను. బొంబాయినుండి వెలువడుచున్న బాలవికాస్ సేవాదళ్ పత్రికలకు విశేష కార్యక్రమములను కన్వీనర్లూ మహిళా విభాగ్ కార్యకర్తలూ పంపవలెను........ ఈ మొదలగు విషయములు వారి నివేదికలలో ప్రస్తావింపబడినవి.

తరువాత, శ్రీవారు, కొంత మంది బాలవికాస్ టీచర్లు తామొనరించవలసిన సేవను గురించి వేసిన ప్రశ్నలకు సమాధానమిచ్చి, దివ్యోపన్యాసము నొసంగిరి.

అన్ని మతములవారి పిల్లలూ బాలవికాస్ తరగతులకు చేరవచ్చుననిరి. సర్వమతముల ఆదర్శములకు

టీచర్లు ప్రత్యేక శ్రద్ధ చూపవలెనని బోధించిరి. అన్ని దేశముల మహాత్ములు పురాణపురుషులు వీరులు సాధు సంతులు వీరి చరిత్రలను పిల్లలకు బోధ పరచవలెననిరి. అర్థముకాని చదువులకన్న సత్ శీలము మెండు అని శ్రీవారు తెలిపిరి. బాలవికాస్ తరగతులు జయప్రదముగా జరుగుటకు, తల్లిదండ్రుల సహకారము కూడ చాల అవసరము. దానిని కూడ పొందుటకు పూనుకోవలెను, అని హెచ్చరించిరి.

ఉపాధ్యాయులు నిరుత్సాహ పడనక్కరలేదనియూ తమ కరుణ వారిపై సదా నుండుననియూ, వారిని సదా కాపాడుచూ వారికి సదా దారి చూపుచుండు ననియూ శ్రీవారు హామియిచ్చిరి.

అమలాపురం, రాజమహేంద్రవరము, బాలవికాస్ పిల్లలు 'జయదేవ' 'మీరా' మొదలైన భక్తి ప్రబోధక నాటికలను చక్కగా ప్రదర్శించి, అందరి మన్ననలను పొందిరి.

## వైకుంఠ ఏకాదశి

జనవరి నాల్గవ తే॥ వైకుంఠ ఏకాదశి పర్వ దినము. ఆ నాడు పవిత్ర గోదావరీ తీరమందు భగవానుడు విడిదియుండుటచే, రాజమహేంద్రవరమునకు వేలాది భక్తులు విచ్చేసియుండిరి. ఆ సుదినమందు శ్రీవారి దివ్యదర్శనామృతానందమునకై గాంధీపురమందూ సాయి నిలయమందూ భక్తులు వేచియుండిరి వారి నోములు పండినవి. సమావేశమునకు వచ్చియుండిన ప్రతినిధులు శ్రీవారి దివ్య వచనామృతము గ్రోలి సంతుష్టిపొందిరి.

## నిర్ణయములు

ఆనాడు ఉదయం 8-30 గంటకు సమావేశము ప్రారంభమైనది. సభ ప్రారంభమైన తరువాత వచ్చిన కార్యకర్తలను శ్రీవారు తీవ్రంగా మందలించి, ఇక్కడికి చేరినది కొత్త సంబంధములను కూర్చుకొనుటకు కాదు, యేది ప్రధానమో దానిని మొదట చూచుకోవలసినది. అని హెచ్చరించిరి.

సబ్‌కమిటీలు సమర్పించిన సలహాలను పరిశీలించి శ్రీవారు తమ తీర్మానములను తెలియజేసిరి. స్టేట్ ప్రెసిడెంట్లు తమ పర్యవేక్షణ కార్యక్రమము లందు జోనల్ కన్వీనర్ల సహాయమునందుకో వచ్చును, అనిరి. శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ మునకు, దానికి అనుబంధముగా అన్ని రాష్ట్రము లందూ కళాశాలలు నెలకొల్పుటకు శ్రీవారు తమ ఆశీర్వాదములనందించిరి. కానీ, విద్యార్థులకు సక్రమమార్గమున బోధలు సలుపి వారిలో విశ్వ ప్రేమను సత్‌శీలమును సేవాభిలాషను పెంపొందించ గల ఉపాధ్యాయులు చాలా అవసరమని తెలిపిరి.

వేసవి తరగతులను వివిధ రాష్ట్రములందు యేర్పాటు చేయవచ్చుననియూ, వ్యాసరచనల పోటీ ద్వారా ఆ తరగతులకు విద్యార్థులను ఎన్నిక చేయ వలెననియూ ఆదేశించిరి. సాంకేతిక వృత్తిశిక్షణ పాఠశాలలను ప్రారంభించే ఉద్దేశ్యమును బాబావార ప్రోత్సహించిరి. రాజమహేంద్రవరము వద్ద వ్యావసాయిక కళాశాల ప్రారంభించి రైతులకు వ్యవసాయమందు ఆధునిక సాంకేతశాస్త్ర పరిజ్ఞానాభివృద్ధి జేసి, డెల్టా ప్రాంతమును "అన్నపూర్ణాక్షేత్ర"ముగా మార్చెదము అని శ్రీవారు తెలిపిరి.

సేవాదళ సభ్యులకు Identity Cards (గుర్తింపు చీటీలు) యిచ్చు పద్ధతిని అంగీకరించి ప్రతి సభ్యుడూ తమకై ప్రత్యేకింపబడిన సేవా కార్యక్రమ ములలో ఏ మూడింటిలోనైనా తప్పక కృషి సలుప

వలెనని బాబావారు నొక్కి వక్కాణించిరి. బాలవికాస్ ఉపాధ్యాయులకు శిక్షణమివ్వవలసిన అవసరమున్నది ; వేసవి తరగతులకు ముందుగా తామే స్వయముగా ఉపాధ్యాయుల శిక్షణ తరగతులను ఏర్పాటు చేసెదనని బాబావారు తెలిపిరి సాధనా కేంపులను సమితులు ప్రతినెల జరుపవలసినది. అనిరి. సంస్థల కార్యకర్తలు జిల్లావారిగా రాష్ట్రవారిగా తరచు సమావేశమై పరస్పర సహాయ సహకారములను పెంచుకోవలెను, అనిరి.

శ్రీ సత్యసాయి విద్యాసంస్థలకు ధనమివ్వ దలచిన వారు తామే స్వయముగా శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, కెనరా బ్యాంకు. టౌన్‌హాల్ బ్రాంచ్, బెంగళూరు, అను చిరునామకు పంపవచ్చునని శ్రీ గోకాక్ గారు తెలియజేసిరి.

మధ్యాహ్నము 3=30 గం॥కు మహాసమ్మేళనము యొక్క చివరి సమావేశము ప్రారంభమైనది. అన్ని కార్య క్రమములనూ జయప్రదముగా నిర్వహించుటకు, నేర్పుతో ఓర్పుతో, శ్రద్ధా భక్తులతో వారముల తరబడి కృషిచేసిన స్వయం సేవకుల సేవాదళ సభ్యుల సేవను శ్రీవారు మెచ్చుకొనుచూ, వారి సేవాసాధన సర్వులకూ ఆదర్శమైనదనిరి. ఒక్క పైసా అయినా ఖర్చు పెట్టవలసిన అవసరము లేకుండ. అన్ని సేవలనూ వారే ఒనర్చి ధన్యులైరి అని చెప్పిరి.

తమ తమ ప్రాంతములకు శ్రీవారిని విజయము చేయమని సమర్పించిన విన్నపముల విషయమును ప్రస్తావించి, వారు ఎంతనో ఆర్తితో తమను ఆహ్వానించుచున్నారనిరి. స్వామి వచ్చినపుడు చందాలు వసూలు చేయుట, వ్యాపార ప్రకటనల మధ్య తమ సందేశములను ప్రచురించుచున్న 'సవనేరు' (Souvenirs) అచ్చువేయించుట తమకు నచ్చదు అని తెలియజేసిరి.

ఈ వంక పెట్టుకొని డబ్బును వసూలు చేసిన, స్వామి వచ్చి వెళ్ళిన తరువాత విరాళముల నిచ్చిన వారందరూ తమకు సరియైన స్థానము లభించలేదని, వారు తమలో తాము, విభేదములను కల్పించుకొని, మనస్పర్ధలను పెంచుకొని జగడములాడుకొనుచున్నారు. 'సాయిబాబా ధనవంతుల యిండ్లకే వస్తారు ' అను అపోహ వకటి కొందరిలో వున్నది. "విశ్వమంతా నా ధనమైనపుడు నా దృష్టిలో ధనవంతులెవరు ? అందరూ నావారే; నేను అందరివాడను " అనిరి అందువల్ల తమకు ధనవంతుడు బీదవాడు అను వ్యత్యాసము కనపడనే కనపడదనిరి సర్వమూ తనదే అయినపుడు ఇతరుల ధనము అనుమాటేమున్నది? తమకు కావలసినది, ఎక్కడెక్కడ బాధలు, దుఃఖములలోనుండి తమను ఆర్తితో పిలుచుచున్నారో అక్కడకే తాము వెళ్ళేది; తాము చూచేది భక్తియొక్క ఉన్నతిని, కాని వ్యక్తియొక్క ఉన్నతికాదు. సేవా తత్పరులై, వారొనరించు సేవ ఇతరులకు ఆదర్శ ప్రాయముగా ఎవరు చూపగలరో అట్టివారి వద్దకు తాము వెళ్ళెదమని శ్రీ బాబావారు పలికిరి తమను మానవులు అర్థము చేసుకొనలేరు. "స్వామి తత్వమును తెలుసుకొనుటకు మానవ మేధాశక్తి చాలదు కనుక ఆవిషయమటువుంచి, మీలోనున్న అహంకార నిర్మూలన చేసుకొని తద్వారా మీ హృదయ సీమలందు స్వామిని ప్రతిష్ఠించుకొని, ప్రకాశింపజేసుకొనండి. ఇదియే వుత్తమ సాధన" అని శ్రీవారు సలహాయిచ్చిరి.

సేవా సంస్థల పురోభివృద్ధికిగాను నియమింపబడిన నిబంధనలను స్టేట్ ప్రెసిడెంట్లు, జిల్లా ప్రెసి

దెట్లు తాము విధిగా అనుసరించుచూ, సంస్థలోని ఇతరులుకూడ అనుసరించునటుల చూచుకొనుచూ, తాను చేయు నిస్వార్థ సేవచే, ఇతరులకు మార్గదర్శకులై ఆదర్శప్రాయముగా మెలగవలెనని బాబావారు హితవు చెప్పిరి. నియమ నిబంధనలు కంచెవంటివనియూ చిన్న మొక్కకు కంచె ఎంత అవసరమో అటులే సంస్థకు నియమావళి అంత ముఖ్యమనిరి.

"అందరూ నావారే"

బాబావారు తమ అపార కృపావృష్టిని సభవారందరిపై చిలికించుచూ మీరందరూ నాతోనే యున్నారు, నేను మీ అందరిలోనున్నాను, నేను మిమ్ములను నానుండి దూరము చేయను, సదా మీ హృదయమందే వసించుచుందును మీ అందరిలోనూ సాయి వున్నాడు, సాయియే మీరు, మీరే సాయి. సాయి అను సాగరమునకు మీరందరూ అలలు, అని పలికి అందరినీ పులకింపజేసిరి.

ఇది ఆరవ సమావేశము. అయిదు సమావేశములు గడచిపోయినవి. ఇంక పంచేంద్రియముల అధికారము అంతమొందవలెను. ఆరవ సంవత్సరము ఆరంభమైనది కనుక నిగ్రహముతో, పవిత్ర కార్యక్రమములతో, ఆత్మసాక్షాత్కార మొందించుకొని వ్యక్తికి, సమాజమునకు, యావత్ మానవాళికి, నూతన శకమారంభమువ వలెను. ఆరు ఏండ్ల వయసు కల బాలుడు అజాగ్రత్తగా, చెప్పినను లక్ష్యపెట్టక, దుడుకుగా రోడ్డుపైకి పరిగెత్తి, లారీలు మొదలగు బండ్ల మధ్య యిరుకుకొని, ప్రమాదములను తెచ్చిపెట్టుకొనును. ఈ వయస్సు ప్రమాదమైన వయస్సు. అందువల్ల ఈర్ష్య, కోపము అహంకారము, మొదలగు లారీలనుండి మీ సంస్థను కాపాడుకొనుడు, అని బాబా వారు బోధించిరి

శ్రవణ మనన నిదిధ్యాసనములు

బాబావారు కొన్ని భజనలు పాడిరి. సమావేశమునకు వచ్చిన ప్రతినిధులందరూ, కృతజ్ఞతతో నిండిన గుండెలతో, ఆనందాశ్రువులు నిండిన కండ్లతో, భజనచేసిరి. రాష్ట్రవారిగా ప్రత్యేకము, ఏర్పాటు చేయబడిన స్థలమందు, ఆ ఆ రాష్ట్ర ప్రతినిధులు కూర్చొనియున్న ప్రదేశమునకు శ్రీవారు స్వయముగా విచ్చేసి, వారందరినీ, తమ దివ్య చరణారవింద స్పర్శనానందమొసగి తృప్తి పరచిరి. ఆదినము రాజమహేంద్రవరములోని సమావేశమందు పాల్గొన్నవారి జీవితములందు ఒకొక మధుర ఘట్టము. వారివారి మనస్సులలో మరల మరల మననము చేసుకొను మరువరాని స్మృతి.

"మా మనస్సు మీకు స్వాధీనము, మీ చిత్తమే మా భాగ్యము, మీ పలుకులె మాకు తేనెల వూటలు, మా హృదయపేటికలో అతి భద్రముగా దాచుకొన్న, మాణిక్యాల మూటలు. మీరు చూపిన బాటలోనే మా పయనము. వెనుదిరగము, వీడము మీ పక్షము కూడెదము మీ పదములచెంత"....... అక్కడకు చేరిన ప్రతినిధులందరి మనోభావన ఈరీతిగానే సాగినది, రాజమహేంద్రవరములో జరిగిన సమావేశము ముక్తాయింపు.

(సం)

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజిస్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన పిదప మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిస్టర్డు బుక్‌పోస్టుతో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిపుస్తకముతోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 0-50 పై వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

**తెలుగు:—**

| | పేరు | వెల | పోస్టేజి |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-45 |
| 3 | [illegible]మాల | 1-00 | 0-15 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5 | అర్పణ | 1-00 | 0-10 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0-15 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 9 | వచనామృతము | 4-00 | 0-30 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 0-80 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 13 | భజనావళి | 1-50 | 0-20 |

**కన్నడ:**

| | పేరు | వెల | పోస్టేజి |
|---|---|---|---|
| | సత్యం శివం సుందరం[1] | 3-50 | 0-35 |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-15 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 9 | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-25 |

**మలయాళము:—**

| | పేరు | వెల | పోస్టేజి |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3 | గీతావాహిని | 3-00 | 0-25 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-10 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజన్‌సాంగ్స్ (అమెరికన్ ప్రకటన) | 2.00 | 0-20 |
| 2 | ,, (ఇండియన్ ప్రకటన) | 1-50 | 0-15 |
| 3 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-30 |
| 4 | ప్రశాంతవాహిని | 2-00 | 0-15 |
| 5 | జ్ఞానవాహిని | 2-00 | 0-15 |
| 6 | నామ సంకీర్తన్ | 1-50 | 0-10 |
| 7 | ధ్యానవాహిని | 2-00 | 0-15 |
| 8 | సమ్మర్‌షోవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5 00 | 0-35 |
| 9 | సత్యం శివం సుందరం III | 6-00 | 0-40 |
| 10 | సందేహ నివారిణి | 3-00 | 0-15 |

అరవం:—

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-40 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-40 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-30 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-35 |
| 6 | భజనావళి | 1-00 | 0-20 |
| 7 | సాయిమాతా | 1-00 | 0-10 |
| 8 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 9 | సందేహనివారిణి | 2-00 | 0-25 |
| 10 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 11 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 12 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-10 |

హిందీ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీ[illegible] [పద్యములు] | 1-00 | 0-10 |

బెంగాలి:—

| | | | |
|---|---|---|---|
| 1 | అడ్వైస్‌టు స్టూడెంట్స్ | 0-25 | 0-10 |

గుజరాతి:—

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 2 | కథాసుధ | 2-00 | 0 15 |
| 3 | గీతా వాహిని | 4-00 | 0 40 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-30 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-10 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

అస్సామి:—

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారథి [షార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0 10 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కదా | 0-25 | 0-10 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0 50 | 0 10 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-20 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-15 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-10 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0-10 |

ఒరియ:—

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీసత్యసాయి చరితామృత (II) | 1-00 | 0-10 |
| 2 | సహస్రనామ పూజావిధాన్ | 1-00 | 0-10 |
| 3 | గీతావాహిని | 5-00 | 0-25 |

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2. చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5. పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను. M.O. ద్వారా పైకమును పంపించువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియ జేయవలెను.

6. పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబులిచ్చుటకు ఆలస్యమగును.

8. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు ../3-74 అని యుండిన, మీ చందా మార్చి నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) మార్చి నెల 8.వ తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —: శ్రీవారి కార్యక్రమములు: —

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు ఎడిటర్, 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

మైసూరు రాష్ట్రపు బెంగుళూరు జిల్లా గాడగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు పి. ఎస్. సుబ్బరామన్ గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె, బి. యల్.

Regd. No. KRN/A-67

February 1974

ఇతరులు ఏమి చేసిన, తప్పనియు, ఎట్లు నడచుకొనిన అది సరికాదనియు తలంతువో, అట్టివాటిని నీవు మొదలు చేయకుండ ఉండుటకు ప్రయత్నించు.

లోకులు నిన్ను ఏ రీతిగా గౌరవించవలెననియు, ఎట్లు భావించవలెననియు కోరుదువో, మొదలు నీవు ఆ రీతిగా లోకుల గౌరవించు, భావించు.

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 మార్చి 1974 సంచిక 1

## విషయానుక్రమణిక



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 50

### భరతుని చూచుటకు గుహుడు

తన జాతివారి నందరినీ అన్ని విధములా యుద్ధమునకు సిద్ధముగా యేర్పరచి, భరతుడు మిత్రుడో, శత్రుడో, మధ్యముడో మొదలు కనుగొనవలెనని, రాజును దర్శించుటకు వెళ్లునపుడు తీసుకొని వెళ్లదగిన పదార్థములన్నింటినీ సిద్ధపరచుకొని ఫలములను, పుష్పములను మీనములను పలలములను ప్రాచీన పాఠీనములను గంపలు గంపలు తెప్పించెను.

కందమూల ఫలములు సత్త్వగుణము ; వాని వలన మిత్రుడని తెలియును. ఖరమృగములు, రజోగుణము ; వానివలన మధ్యముడని తెలియును. మీనములవలన శత్రువని తెలియును ; అవి తమో గుణము.

నిషాదపతి ఈ సామగ్రులను వెంట తీసుకొని భరతుని చూచుటకు వెళ్లెను. అపుడు మంచి శకునమయ్యెను. దూరమునుండీ, వశిష్ఠుల వారిని జూచి తన పేరు చెప్పుకొని, గురువునకు దండప్రణామములు ఆచరించెను. అతడు శ్రీరాముని సఖుడని గ్రహించి, గురువు అతని దీవించెను ; ఇంతలో భరతుని బిలిచి, గురువు, నిషాదపతిని చూపి, ఇతడు శ్రీరాముని సఖుడని తెలిపెను.

ఆ మాటలు వినిన వెంటనే నిషాదపతిని కౌగిలించుకొని అనేక విధముల క్షేమ సమాచారముల విచారించెను. అంత గుహునితో మాటలాడు సందర్భమున ఒకనాటి రాత్రంతయూ రామచంద్రుడు ఈ నదీ తీరమున, తనతో కాలము గడిపెనని గుహుడు చెప్పగనే, కన్నులు కరువు తీరా, విప్పి చెవులను నిక్కబొడుచుకొని. ఆ నాటి రాత్రి రాములతో గడిపిన పవిత్ర సమయమును వర్ణించమని, తానెంతో ఆతురతతో ప్రశ్నించెను.

## విరోధులు కారు

నిషాదపతి రామచంద్రుని యెంతయో కొనియాడి, సీతా రామలక్ష్మణుల విశ్రాంతి నిమిత్తమై తాను యేర్పరచిన కుటీరములను చూపుచూ, లక్ష్మణునితో, ఆ రాత్రి సంభాషించిన పవిత్ర సంభాషణలను భరతునకు తెలుపుతూవుండ, భరతశత్రుఘ్నులు కంట తడిపెట్టుకొని. పొరలి వచ్చు దుఃఖమును అణచుకొనుచూ వుండుట చూచి, నిషాదపతి, భరతశత్రుఘ్నుల భక్తి శ్రద్ధలను అర్థము చేసుకొని, వీరు నిజముగా రామ సోదరులే కాని, రామ విరోధులు కారని తనలో తాను సమ్మతించెను. సీతారాముల నిమిత్తమై నిషాదపతి యేర్పరచిన కుటీరములను దర్శించుచూ, వాటిని తగిన జాగ్రతతో చూచుకొనవలెనని భరతుడు కోరెను.

తిరిగీ గురువాజ్ఞను వడసి, తమ తల్లులతో గంగానది స్నానములాచరించి, తిరిగీ నిషాదపతిని పిలిపించుకొని, ఆ నాటి రాత్రి రామచంద్రుడు విశ్రమించిన స్థలమును చూపమని కోరగా, నిషాదపతి, పెద్ద వటవృక్షము చెంతకు తీసుకొని వెళ్లి అక్కడ గాలికి చెదరిపోయివున్న దర్భాసనము చూపి, సీతారాములు ఇక్కడ విశ్రమించిరని తెలుపగనే భరతశత్రుఘ్నులు ఆ పవిత్ర స్థలమునకు నమస్కరించిరి. పట్టు పాన్పులపై పవ్వళించు నా ప్రభువు ఇంతటి కఠిన నేలపై యెట్లు పవళించిరో? ఆ మహా తల్లి సీతా మాత యెన్ని శ్రమలు పడెనో? అని వారికివారు తలంచి, మహా బాధతో అక్కడే కొంత సేపు నిలిచి, తిరిగి నా ప్రభువు సంచరించిన స్థానములు చూపించమని భరతుడు కోరగా శింశుప వృక్షమును చూపించి, దాని క్రింద ఫలములు భుజించిరని నిషాదపతి తెలుపగా అక్కడ కూడనూ వారు నమస్కరించిరి.

ఈ స్థలములు దర్శించునంతకాలము భరత శత్రుఘ్నులు పడిన బాధ వర్ణనాతీతము. రామ ప్రేమకు నిదర్శనముగా వారు చూపిన వినయ భక్తి శ్రద్ధలు గుహుని హృదయాన్ని కరిగించెను. దశరథమహారాజు కోడలు, జనకమహారాజు ప్రేమ పుత్రిక, శ్రీరామచంద్రుని ధర్మపత్ని అయిన సాక్షాత్ లక్ష్మీదేవియె అయిన ఆ సీతాదేవి యిన్ని విధములైన అనానుకూలముల పాలు కావటము భరతుడు భరించలేకపోయినాడు.

అట్టి మహా పవిత్ర ప్రభు, దంపతులను విడచి, అయోధ్యావాసులు వుండలేక పోవుటచేత, రాములులేని అయోధ్య అరణ్యముగా యెంత జారుటచేత వారి తాపములు చూడలేక, మేమును ఆ అరణ్యమున నివసించలేక సపరివారముగా రాముడున్న ప్రదేశమే అయోధ్యఅని తలంచి అందరమూ బయలుదేరి రామసన్నిధికి వెళ్లుచున్నామని భరతుడు తెలిపినంతనే, నిషాదపతికి విషయము పూర్తిగా అర్థమాయెను.

లేకున్న రామదర్శనార్థము చతురంగబల సమేతముగా వెళ్లుటలో అర్ధములేని విషయం అని తలంచి తాను పూర్వము తలచిన భావములను వెలుఁబరచి క్షమించమని కోరెను. అంత భరతుడు అందులో తప్పేమియూ లేదనియూ, తాను మహా కిరాతకుడననియూ, శ్రీరాముల వనవాసమునకు తానే కారణుడనియూ, అట్టి కారణభూతుడైన నన్ను వధించినమా పాపము లేదనియూ తన్ను తాను నిందించుకొనుచుండ, నిషాదపతి క్షమించమని ప్రార్థించెను.

## రామచంద్రుని వెనుకకు తోడ్కొనిరండి

భరతుని ఆగమనమును విని, శృంగిబేరపుర ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి వారిని దర్శించి రామచంద్రుని సోదరులని విని అనేక విధములవారిని స్తుతించి, నమస్కరించిరి. కైకేయిని దూషించిరి ; విధికృతమునకు బ్రహ్మను దూషించిరి ; కన్నీరు కార్చిరి ; రామచంద్రుని అనేక విధముల కొనియాడి, త్వరలో రామ చంద్రుని వెనుకకు తోడ్కొనిరమ్మని స్త్రీ బాల వృద్ధులు యేక కంఠముతో భరతశత్రుఘ్నులను కోరిరి.

వారు రామవియోగము చేత పడుచున్న బాధలను గమనించి భరతుడు మాటాడలేక పోయెను; కంటి ధారలు కార్చెను "ప్రార్థించుట నా వంతు ; తదుపరి రామకృప. నేను దాసుడనే కాని, కాములను నిర్బంధ పెట్టుటకు నేనెంతవాడను ? మీరు కూడా మీ మీ హృదయములలో రామచంద్రుడు అయోధ్యకు తిరిగి చేరవలెనని కాముసే ప్రార్థింపుడు. ఈ విధమైన మీ ప్రార్థనలు-నా ప్రార్థనలకు సహాయపడును. మన అందరి ప్రార్థనలచేత రామహృదయము కరుగక మానదు, ఇదియే మన కర్తవ్యము. లోకోద్ధారకుడైన రాముడు లోకుల అభీష్టమును కాదనలేడు కదా అని అ వచ్చిన ప్రజలకు తగిన రీతుల సమాధానములు ఇచ్చెను. ఇంతలో చీకటిపడెను. ప్రజలను వారి వారి గృహములకు వెళ్లమని నిషాదపతితో తెలిపి, ఆ రాత్రి నిషాదపతి తెచ్చిన ఫలములను భుజించి రాత్రంతయూ రామ విషయములనే మాటలాడుతూ, కాలము గడిపిరి.

తెల తెలవారుచుండగనే ప్రజలను మేలు కొలుపమని మంత్రికి తెలిపి, తమ్మునితో తల్లులతో పవిత్రగంగా స్నానము నాచరించి ముందు కొనసాగించవలసిన ప్రయాణమునకు సిద్ధపడిరి. నిషాదపతి పడవలను తగినన్ని యేర్పాటు చేసి అయోధ్యా ప్రజలను రథములనూ, గుఱ్ఱములనూ, అన్నింటినీ, దాటించెను. అటువైపున చేరిన తరువాత, అందరూ వచ్చినదీ లేనిదీ వక పరి విచారించి, నిషాదపతి మార్గమును చూపించుచుండ భరతుడు పరివారముతో అతనిని అనుసరించెను,

బ్రాహ్మణులు, వసిష్ఠులవారు వక గుంపుగా, ప్రజలందరూ వక గుంపుగా, కొంత దూరము నడిచిరి. మూడవ యామమునకు భరతుడు పరివారము ప్రయాగకు వచ్చి చేరిరి.

## త్రివేణి క్షేత్రము

భరతుడు యేనాడునూ యింత దూరము పాదచారియై ప్రయాణము చేయనందున పాదములు బొబ్బలు కట్టి ఒటికి మంటలు పెట్టెను. అయిననూ, వాటిని లెక్క చేయక తన బాధలనన్నింటినీ, రామబాధగా భావించెను. ఈ విధమైన బాధలు రాముడెన్ని విధములుగా అనుభవించెనో అని రామప్రేమను తలంచుచు, తన ప్రేమను మరచెను.

అందరూ పవిత్ర త్రివేణి స్నానము నాచరించిరి. ప్రయాగ వాసులైన వైఖానసులు, బ్రహ్మచారులు, గృహస్థులు, ఉదాసీనులు, దిగంబరులూ, యోగులు, ఋషులు మొదలగు వారందరూ భరతుని చూచి ఆనందించిరి. ఇతని వర్చస్సు శ్రీరామచంద్రుని పోలియున్నది. ని[illegible]

ఇతవే శ్రీరామచంద్రుడూ అన్నట్లు వారి కంట్లకు కనుపించెను ; చూచిన ప్రతివారు రెప్పలార్చక నిలిచి చూచుచుండిరి.

భారద్వాజ మహర్షి

రాముని సోదరులైన భరతశత్రుఘ్నులు చతురంగబల సమేతులై తల్లులతో, మంత్రులతో ప్రయాగ చేరుకొన్నారన్న వార్త భరద్వాజ ఆశ్రమవాసులకు తెలిపెను. అంత భరద్వాజ మహరుషి తమ శిష్యులను పంపి ఆశ్రమము నకు అహ్వానించెను. మహాఋషి ఆజ్ఞానుసారము తమ్మునితో ఆశ్రమమును ప్రవేశించెను. మునిరాజునకు ఇరువురూ నమస్కరించిరి అంత భరద్వాజ మహర్షి వారలను లేవనెత్తి యెంతో వాత్సల్యముతో వారలను దగ్గరకు చేర్చుకొని, కొంత చల్లని పానీయములను తెప్పించి ఇప్పించెను.

అయితే మహాఋషి తనను యేమి ప్రశ్నించునో ? యేమి అడుగునో ? అని భరతుడు లోలోన భయపడుతూ, సిగ్గుచే శిరస్సును వంచుకొని, విచారముగా నుండునటుల కనుపించెను. అంత మహరుషి భరతుని స్థితిని గమనించి, "భరతా! భయపడనక్కరలేదు నాకు సర్వమూ విదితమే, విధికృతములు పరరి అధీనములు కావు కదా ! నీ తల్లి కోరిన కోర్కెను నీవు తలంచి విచారించ పనిలేదు. ఆమె దోషము ఇందులో యే మాత్రమూ లేదు. దైవ సంకల్పమే ఆమె బుద్ధిని ఆ రీతిగా మార్చినది ; కైకకు శ్రీరాముడన్న మహాప్రాణము ; అట్టితల్లి ఇంతటి కఠిన చర్యకు పాల్పడవలెనన్న దైవకృతమే కానీ మానవ మాత్రుల ప్రయత్నములు కావు.

లోకవాదుక ప్రకారము కైక దోషి ; వేదాచార ప్రకారము సరస్వతి దోషి ; వీరిరువురు పరమాత్మకు సమ్మతమే ; ప్రభువు స్వేఛ్ఛా సారము సర్వమూ జరిగెను, భరతా! నీ స్వరత కీర్తిని గానము చేయుటవలన లోకములకు క్షామములకూ గొప్పవచ్చును.

యే కొమారునికి తండ్రి రాజ్యము ఇచ్చిన యెడల వాడే రాజ్యమును చేయుటకర్హుడు అని లోకసిద్ధాంతము. అదియే వేదవాక్యము. ఆ సత్యసంధుడు, మహాత్ముడు, దశరథమహారాజు నిన్ను బిలిచి నీకు రాజ్యమిచ్చి రాజధర్మములననుసరించి ప్రవర్తింపుమని చెప్పెను శ్రీరాముని వనగమనము సకల అనర్థములకూ మూలమయ్యెను. అందులకు లోకమంతయూ విచారించెను. ఇప్పుడు నీ తల్లి పూర్వము తాను చేసిన పనికి విచారించెను ; ఈ విషయములో నీ అపరాధమే మాత్రమూ లేదు ; నీవు రాజ్యమును యేలిననూ పరవాలేదు ; నీవు రాజ్యము నేలుచున్నావన్న విషయమును విన్న శ్రీరాముడు కూడా సంతసించును :

అంతే కాదు నీవు ఇప్పుడు పూనుచున్న పని శ్లాఘనీయము. నీ యుద్యమము సర్వోత్కృష్టము. శ్రీరాముని చరణారవిందములయందు అనురాగము కలిగియుండుటయే సకలసన్మంగళములకు మూలము. భరతా ! నీ యంతటి గుణశాలి, అదృష్టవంతుడు, వేరొకడు లేడనే చెప్పవచ్చును. రాముని ప్రియ తమ్ముడవనుటలో సార్థక నామమును అందుకొంటివి.

శ్రీరామచంద్రుడు వనమునకు వెళ్లు మార్గ మధ్యమున మన ఆశ్రమమున్ను పవిత్రము

చేసెను. ఆ నాడు అర్ధరాత్రి వరకూ రామ ప్రభువు నీ గుణములనే వర్ణించెను. వారు ప్రయాగకు స్నానము చేయుటకు నాతోనే వచ్చిరి. స్నానమాచరించు సమయమున కూడనూ నిన్నే తలంచి, అయోధ్యను విడచునపుడు నా సోదరులైన భరతశత్రుఘ్నులను చూడనైతినని యెంతో విచారించెను. రామునకు మీ పైనున్న ప్రేమ యింతయని చెప్పలేను.

### రాముడు ప్రణతార్తిహరుడు

అంతే కాదు, అతడు ప్రణతార్తిహరుడు. అతనికి లోకమే కుటుంబము. మూర్తీభవించిన శ్రీరాముని వాత్సల్యమే నీవని నా అభిప్రాయము !

ఏ విషయమును నీవు కళంకమని తలంచు చుంటివో ఆ విషయము నావంటి వారికి ఉపదేశమనే నా అభిప్రాయము. భరతా ! నీవు చింతించ కూడదు. చింతామణిని స్వీకరించి దరిద్రమని తలంచుట మంచిది కాదు ; సీతారామ లక్ష్మణులను దర్శించుటయే సకల సాధనములకు ఫలము ఆ ఫలము నాకు లభించెను. కన్నులార వారిని చూచితిని ; సంభాషించితిని ; స్పర్శించితిని ; ఆతిథ్యము నందించితిని.

అంతో ఇంతో శేషము కొంత వున్నది నీ దర్శనముతో పూర్తి అయినది. నేను ధన్యుడను. ఇట్టి మునులను పవిత్రమొనర్చుటకే రామచంద్రుడు వనవాసము చేసెను. ధన్యులము !

సశేషము

# ఆనందం దేహి మే సదా

సత్యసాయీశ్వరీం వన్దే సర్వలోకనివాసినీమ్
భక్తాభీష్ట ప్రదాత్రీం త్వాం భవరోగవినాశినీమ్ 1

అజ్ఞాన నాశినీం దేవీం సుజ్ఞానామృతదాయినీమ్
శుద్ధమోక్ష ప్రదాత్రీంచ భజామి మనసా సదా 2

పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే
త్వద్దర్శన స్పర్శనాభ్యాం సర్వబాధా నివార్యతే 3

పూర్వజన్మ కృతాత్పుణ్యాత్ దర్శనం మమయచ్ఛసి
సాష్టాంగ వందనం కర్తుం దయాంకురు మయీశ్వరి ! 4

షట్చక్రచారిణీ దివ్యా కుండలిన్యాఖ్యయా మమ
సుషుమ్నామార్గసంచారిణ్యంబా సాయీశ మేమతిః 5

శ్రీ షోడశాక్షరీ విద్యారూపిణీం త్వాముపాస్మహే
బ్రహ్మజ్ఞానం సదాదేహి భవరోగవినాశిని ! 6

లౌకికా లౌకిక జ్ఞానం లౌకికా లౌకికం సుఖమ్
కుటుంబ క్షేమ సౌఖ్యంచ మమదేహి దయామయి ! 7

మహాప్రేమన సంసంతుష్టా సహస్రారాంబుజస్థితా
శివేనసహ యోగస్య ఆనన్దం దేహిమే సదా 8

మోతేవర్తి
వేంకట సత్యనారాయణః, M.A. Ph.D.

---

# కొంచెం నిదానం వహించండి

యెనిమిది సంవత్సరముల తరువాత, నేను మెక్సికో పట్టణానికి రావటం జర్గింది. అచట నేను ఒక సాయిబాబా సెమినార్ సభను వహుపవలసి యున్నది. అప్పుడు నాకు "యిచటి ప్రజలు కేథలిక్కులు మతం రీత్యా, గాన సాయిబాబా విషయాల గూర్చి చెప్పటలో కొంచెం నిదానం వహించుట మంచిది" అని సలహా చేయుట జర్గింది. యేమో, ఆ సలహాను నేను అంతగా పాటించలేదు. నేను భగవాన్‌ను గురించి యిచ్చిన రెండు ఉపన్యాసాల సమయంలో, హాల్లో జనం క్రిక్కిరిసియున్నారు, జనం ఉత్సాహంగా విన్నారు. ఫిల్ము ప్రదర్శనంకు ముందు, అచట భారతీయ రాయబారి కార్యాలయంలో పని చేస్తున్న ఒక ఉద్యోగి సతీమణిని పత్న్యులకు పరిచయం చేసాను. ఆమె పేరు కమలాదేవి. నేను చెప్పతున్న దానిలోని సత్యాన్ని గూర్చి ఆమె గాధయే నిరూపిస్తుంది. నేను ఆమె గాథను స్పానిష్ భాషలోకి తర్జుమా చేస్తున్నపుడు, అది వింటున్న జన సమూహం యొక్క హృదయం ద్రవించింది.

బాబా ఆమెకు ఇంటర్వ్యూ యిచ్చినపుడు ఆమె కుమారుని గూర్చి బాధపడనక్కర లేదు; "నేను రక్షించానులే" అన్నారు. సహజంగా ఆ తల్లి గూడ, ఢిల్లీలో ఆమె కుమార్డు ఎట్లాగున్నాడో నని ఆలోచిస్తూయున్నది. వారు అట్లా యెందుకన్నారో ఆమెకు అర్థం కాలేదు. ఆమె కుమార్డు ఒక ఆట స్థలంలో నిలుచుని, ఆటలను చూస్తున్న సమయంలో, 'షాట్ పుట్' అనే, ఇనుపగుండును దూరంగా విసిరే క్రీడాసమయంలో, ఆ గుండు ఆ బాలుని తలకు తగిలి చనిపోవలసిన వాడు. ఆ క్షణంలో ఆ బాలుని ఎవరో దూరంగా లాగినారు; ఆ ఇనుప గుండు వాని కాలికి తగిలింది, బలమైన గాయం తగలనప్పటికి ఆ బాలుని ఆస్పత్రిలో చేర్పటం జర్గింది.

ఆ దృశ్యం చూసిన వారి ప్రకారం, ఆ బాలుడు ఒక్కడే నిలబడియున్నాడు; అతనికి అతి సమీపంలో మరెవ్వరూ నిలబడియుండలేదు; ఆ ఇనుప గుండు వాని వైపుకు వస్తున్నదని ఆ బాలుడు తలంచనూలేదు, ప్రక్కకు జరుగనూలేదు, ఎవరో అతనిని అకస్మాత్తుగా, బలంగా ప్రక్కకు లాగివేయటం జర్గినది.

ఆ బాలునికి, బాబా తనను యే విధంగా రక్షించినది తన తల్లి వద్దనుంచి విన్నపుడు ఆ పసివాని హృదయం భక్తి కృతజ్ఞలతో నింపబడినది. తరువాత, జైపూర్‌లో పక్షపాతంతో బాధపడుచున్న ఒక బాలుని బాబా ఆరోగ్యవంతునిగా చేయుట చూచాక, బాబాపై విశ్వాసం మరింత పెరిగింది.

సుమారు 800 మంది నా విద్యార్థులు బాబాను గురించి ఫిల్ము ప్రదర్శనం చూసి మేము చెప్పిన దంతా విన్నాక, వారికి, నావద్దనుంచి మంత్రోపదేశం పొందాలని, నాకు బాబా అనుగ్రహించిన ఋష్యమూలను స్పర్శించవలెనని కోరిక గల్గింది. వేదికపై ఒక

మూల చిన్న మండపాన్ని యేర్పరచి, దానిపై బాబా ఫోటోను, క్రొవ్వొత్తులను, అగరబత్తీలను, పూలను యుంచాను. నాకు బాబా రోగులను ఆరోగ్యవంతులుగా చేయుటకు యిచ్చిన, ముత్యాల జపమాలను, బాబా పాదాలవద్ద ఉంచాను. ఒకరి తర్వాత, ఒకరు వెళ్ళి, ప్రణామము, భక్తి శ్రద్ధలతో ఆ జపమాలను ముద్దిడినారు. "మాతాజీ దైవానికి, శిలువ చిహ్నముగ ప్రార్థించు తున్నారు.

తరువాత సెమినార్‌లో పాల్గొన్న విద్యార్థులు కొందరు, తమ దీర్ఘ తలనొప్పి తగ్గిందని, నడుము నొప్పి తగ్గిందని, నరముల బలహీనత తగ్గిందని, మరి కొందరు, కళ్ల జబ్బు తగ్గిందని చెప్పసాగారు, స్వామి విభూతి, జపమాల స్పర్శన మూలంగా.

తదుపరి, ప్రతివారిలోను, యింకా బాబా ను గురించి వినాలన్న కుతూహలం హెచ్చింది. లెకాటే లోని మా యోగ కేంద్రంలో సంభవించిన వరద ప్రమాదం మొదలు, అచట జర్గిన అగ్ని ప్రమాదం వరకు, యే విధంగా బాబా రక్షించడం జర్గిందో, తదుపరి, జపమాల. ఉంగరం, బాబా ప్రసాదించిన విభూతి అక్షయ పాత్రల మూలంగా జర్గిన, అనేక మహిమలను గూర్చి వారు విన్నారు.

మా అక్టోబరు సెమినార్ ఆఖరి రోజున ఒక మహిమ జర్గింది. సెమినార్ పూర్తి అయింది. అంతా శెలవు తీసుకుంటున్న సమయంలో ఒక యువకుడు లోనికి వచ్చి, మూడు సంవత్సరాలుగా విభూతి ప్రవహిస్తున్న బాబా ఫోటో ముందు (బాబా గదిలో) కూర్చుని ధ్యానిస్తున్నాడు.

కొంచెం సేపు అయాక ఎవరో అతని వెనుక నెమ్మదిగా వచ్చి వారి చేతులను అతని తలపైనుంచి, అధ్యానికి, క్రొవ్వొత్తి వెలుగులో స్పష్టంగా కనుపిస్తూ ప్రక్క ద్వారంలోనుంచి వెళ్లారట. కొన్ని నిమిషాల య్యాక, విద్యుద్దీపం స్విచి వేశారు విద్యార్థులు.

ఆ యువకుడు, "వారు యిక్కడుంటున్నారా?" అని బాబా ఫోటోలవైపు చూపిస్తూ అడిగాడు. బాబా భారత దేశంలో యుంటున్నారు. ఇచటకు వారి భౌతిక కాయంలో మాత్రం యెపుడూ రాలేదన్నపుడు అతని చెవులను అతనే నమ్మలేకపోయాడు, "కొన్ని నిమిషాల క్రితం వారిక్కడున్నారు; వారి చేతులను నా తలపైయుంచారు; నాకు చాల ఆనందమైంది; నా కుడి చేతి వైపు ద్వారములోనుంచి బయటకు వెళ్లారు; నాకు దగ్గరగ నడచారు; నేను స్పష్టంగా ఆ సుందరాంగుని, నల్లని శరీరఛాయ, నల్లని కేశకిరీటము, నారింజరంగు గౌను చూశాను, వారిలాగే ఉన్నవారు, ఇంకెవరైనా ఇచట ఉన్నారా?" అని అన్నాడు. అపుడు అందరూ నిర్ఘాంత పోయి "లేరు, వారి లాగనున్న వారు, యిచట యెవరు లేరు" అన్నారు.

అతనికి సాయి బాబా అంటే యెవరో, వారు చెప్పారు. యీ సంఘటనకు ఆశ్చర్య చకితుడై, యేదైనా మంత్రోపదేశం చేయమని నన్నడిగాడు, జర్గిందంతా అయోమయముగా ఉందతనికి.

"బాబా నా దగ్గరకెందుకు రారూ?" అన్నారు. కొందరు విద్యార్థి భక్తులు అసూయగా, "నా కట్లా కనిపించడానికి నేను యేమి అర్పించుకోవలసి వచ్చినా వెనుదీయను," అన్నారు కొందరు. "కొంచెం కాలం ఆగాలి, నీవంతు వచ్చేవరకు, నీకోరిక ఫలించ వచ్చును, ఇచ్చట యీ గదిలోగ యీ మాదిరి బాబా దివ్యదర్శన భాగ్యం కొందరికి కల్గింది. ధ్యాన సమ

తుంలో చాలమంది వారి దివ్యదర్శన భాగ్యమును భవించారు", అన్నారు అచట చేరిన పెద్దలలో ఒకరు.

యీ సంఘటన విన్న నా విద్యార్థులు, బాబావారి అనుగ్రహాన్ని పొందడానికి, చిరకాల భక్తులు కానక్కరలేదు, అని తెలుసుకొని చాల సంతోషించారు. యీ క్రింది విషయాన్ని గూడ నేను వారికి చెప్పాను.

మేము ఒకసారి అనంతపురం నుంచి ప్రశాంతి నిలయానికి కారుతో ప్రయాణం చేస్తున్నాము. బాబా వారి కారు, మా కారుకి కొంచెం ముందుగా పోతూ యున్నది. మేము నిర్జనమైె యెచట దగ్గరలో యేమి గ్రామం కన్పించనటువంటి రోడ్డులో ప్రయాణం చేస్తూయుండగా, మా టాక్సి హటాత్తుగా ఆగిపోయింది. కారులోని పంఖా బెల్టు తెగిపోయింది. యిక ముందుకి ప్రయాణం సాగించలేము. "భగవంతుడా, మేము కష్టములో యున్నాము", అని భగవంతునికి చెప్పుకున్నాను. ఇది "చాల దూరపు పిలుపు", ఇట్లా అనుకున్నానో లేదో ఒక కారు కన్పించింది, అది మా వైపే వస్తూవుంది. ఆగి మా కారుకి యేమైందని అడిగారు.

మా డ్రైవరు విషయమంతా చెప్పాక, ఆ వ్యక్తి ఒక సరి క్రొత్త పంఖా బెల్టుని తీసి మాకు యిచ్చారు. మాకు నోట మాట రాలేదు అంటే నమ్మండి. "ఇచటి వారు యెప్పుడూ ఒక క్రొత్త పంఖా బెల్టు తీసుకుని ప్రయాణం చేస్తూయుంటారా" అని అడిగింది, మాతో నున్న ఒక అమెరికన్ మహిళ ఆశ్చర్యంతో. నేను జవాబు చెప్పాను, "నీవెప్పుడైనా ఒక బెల్టుని తీసుకుని నీ వెంట, ప్రయాణం చేసావా కార్లో, లేక ఎవరైనా అట్లా ఒక పంఖా బెల్టు తీసుకుని ప్రయాణం చేస్తూయుంటారు కార్లో అని విన్నావా ?"

ప్రశాంతి నిలయం చేరాక, భజన జరుగుతూ యుంది. మేము ప్రశాంతి నిలయం బైట కూర్చున్నాము. భగవాన్ బయటకి వచ్చాక సరాసరి మా దగ్గరకు వచ్చి ఆలస్యమైందేమని అడిగారు, "కారు యిబ్బంది యిచ్చింది", అన్నాను. "అవును, అవును, నాకు తెలుసు ........ పంఖా బెల్టు" అన్నారు.

సెమినార్ పూర్తి అయ్యాక, అంతా శెలవు తీసుకుంటున్న ఆ దృశ్యం వర్ణించ నలవికానిది. కొందరు పూలతో, కొందరు కన్నీటితో, నన్ను తిర్గి త్వరలోనే అ చ ట కు రా వ లె న ని కోరుతూ నాకు వీడ్కోలు యిచ్చారు. వారంతా ఆ, నా మెడలోనున్న జపమాలను స్పర్శించటం, ముద్దిడటం, లాగడం మొదలు పెట్టారు, నేను నేలమీద కూర్చుని, అడిగినవారి పుస్తకాలపై సంతకాలు చేస్తున్నంత సేపూ, నా నా కంఠము బిగిసిపోయినంత పని అయ్యింది.

నాకు మొదట "నేను కొంచెం సాయి బాబా విషయాలు మాట్లాడ్డంలో నిదానంగా పోవడం మంచిది" అని సలహా యిచ్చిన ఖాళ్యా భర్తలను అడిగాను "నేను కొంచెం నిదానంగా పోవాలి, సాయి బాబా విషయాల్లో అ న్నా రు క దా ?" వారు తలలు మాత్రం ఊపారు జరుగుతున్నదంతా చూస్తూ వారు అన్నారు "నీవే నెగ్గావు మాతాజీ", నేనన్నాను, "నేను కాదు నెగ్గింది, బాబా వారు."

జై భగవాన్.

ఇంద్రా దేవి,
మెక్సికో.

# స్వామి అడుగు జాడలలో

బాబ! నీవెందుపోయిన నేనందు వత్తు భక్తితోడ
ప్రాణముండుదాక, సత్యమీ మాట నమ్ము స్వామి.

అదిగో! సమయమైనది! స్వామి తమ గదిలో ప్రవేశించినారు. అది బృందావనమున ప్రజలకు స్వామి దర్శనమిచ్చు వేళ, త్వరలో స్వామి ఆ గదిని దాటి బయటికి వచ్చెదరు. భగవానుని కరుణాపూర్ణమగు ప్రేమ పలుకునకు, అనుగ్రహ వీక్షణమునకు, ఏమో స్వామిదయ, ఇంటర్వ్యూ పిలుపునకు ఆశతో, ఉత్కంఠతో వందలకొలది భక్తులు ద్వారమున కివల చేరి నిశ్శబ్దముగా కూర్చొనియున్నారు.

ఇద్దరు వాలంటీర్లు ద్వారమును తెరువగా సుందర వదనారవిందమున మందహాసము చిందులాడ స్వామి బయటికి వచ్చినారు. మెరియుచున్న అరుణాంబరముతో, ప్రకాశమానమగు జటాజూటముతో స్వామి దివ్యమంగళ విగ్రహము తేజోమయమై యొప్పుచున్నది. క్షణమా ద్వారముచెంత ఆగి అచట చేరిన బాహుళ్యముపై తమ చల్లని చూడ్కులను నిగిడ్చినారు. విదేశీయులు పలువురితో, దేశము నలుదెసల నుంచి ఏతెంచిన ప్రజలతో నిండియున్న ఆ ప్రాంగణ[illegible]న ఒక విద్యుత్కాంతి మెరిసినట్లాయెను. అట్టి [illegible] వాతావరణము ప్రేమపూర్ణము కాగా ప్రతి ఒక్క[illegible]ను అనిర్వచనీయమగు ఒక మహాశక్తితో ఐక్యమైనట్లు భావించిరి. మరికొన్ని క్షణము లచట నిలిచి భక్తసందోహమును వీక్షించుచు అభయ ప్రదానము చేయుచున్నారో యన స్వామి హస్తచాలనము చేయుచున్నారు. అంతరంగవాసియగు స్వామికి ప్రతి యొక్కరి సమస్యయు తేట తెల్లముగుటచే స్వామి అభయ హస్తము ప్రజలకెంతయు కూరిమి కూర్చునదియై యున్నది.

స్త్రీలోక ప్రక్క, పురుషులోక ప్రక్క బాట కిరు దెసల బారులు తీర్చి కూర్చొనియున్న భక్తులవైపు బాబా రానారంభించినారు. ధర్మమడుగంటి అధర్మము పెచ్చుపెరుగు ప్రతియుగమున అవతరించుదునని మున్ను కురుక్షేత్రమున జరిగిన భారతయుద్ధ సమయమున అర్జునునకు ప్రతిజ్ఞ చేసిన ప్రకారము నేడు అవతరించి మనముందు తిరుగాడుచున్న స్వామి చెంతకు ఆకస్మికముగా నొక వనిత లేచి తన ఆర్తిని విన్నవించుటకు సమీపించినది. స్వామికి ఆమె బాధ తెలియును. అయినను ఆమెను విన్నవెను వెంటనే తమ కుడి భుజమును కొంచెముగా ఎత్తి హస్తమును క్షణకాలము, త్రిప్పగా అందు పరమ పవిత్రమగు విభూతి ఆవిర్భవించుటయు దానిని ఆమె చేతిలో పోయుటయు జరుగును. ఆమె సంతృప్తితో ఆనందబాష్పములు రాల్చును. స్వామి ఆమె శిరస్సుపై చేయియుంచగా ఆ దివ్య స్పర్శతో ఆమె సర్వసందేహములు, సర్వభయములు తొలగును.

మరి కొన్ని అడుగులు ముందుకు నడువగా ద్వారముచెంత చెట్టుక్రింద నీడలో కూర్చొని దీర్ఘ వ్యాధితో క్రుంగుచున్న బాలుని గాంచి స్వామి వాని కడకేగును. తోడనే బాలుని తల్లిదండ్రులు, చెంత వచ్చిన బంధువర్గము ఆ బాలుని వద్ద గుమిగూడుదురు. సర్వజ్ఞుడును సర్వశక్తి సమన్వితుడును అగు స్వామికి ఆ బాలుని దురవస్థకు కారణము తేటతెల్లమే. కర్మ ఫలము దురతిక్రమమయ్యు భగవదనుగ్రహశక్తి బల వత్తరమైనది కదా! పరమదయాళువగు స్వామి బాలుని తల నిమిరి తల్లిదండ్రులకు బిడ్డ వ్యాధి వృత్తాంతము తెలియచెప్పి, ఉపశమన వాక్కులు పలికి పరమ పవిత్రమును, విచిత్రమును అగువిభూతిని క్షణమాత్రమున సృష్టించి పిల్లవాని శుష్కించిన శరీర మునకు ప్రేమతో రాయుదురు. పిల్లవాని తల్లిదండ్రుల దిగులు తొలగినది. వారియందొక క్రొత్త ఆశ పొడ సూపి సర్వేశ్వరుని అపారము, అమోఘము అగు శక్తి సామర్థ్యములపై విశ్వాసము దృఢపడినది. వేద ములలో 'అప్రాప్యమనసా సహ' అను వర్ణింపబడు ఈశ్వర తత్వము మానవమేధకు అందనిది కదా!

ఒకానొకడు తోటివాని చెవిలో సాక్షాత్తు భగవంతుడే సుమా అని చెప్పుచున్నాడు. వాని కండ్లు సుస్పష్ట ముగా చెమర్చినవి. వాని నమ్మకము తాత్కాలికమే కావచ్చును, కాని, ప్రస్తుతమాతడు, అతనివలె మరి నూరు మంది, బాబా సాన్నిధ్యమున ఉత్తేజితులైరనుట నిస్సంశయము. బాబా సమక్షమున వాతావరణములో మనము గమనించు మార్పు వర్ణనకలవికానిది. నవ్య చైతన్యముతో దివ్య తేజస్సుతో అలరారు ఆ సన్ని వేశము "నభూతో న భవిష్యతి" అ చెప్పనొప్పును. తమ మధ్య నడచుచున్న స్వామిని తమ వైపు ఆకర్షించుకొనుటకు తమపై స్వామి కరుణావీక్షణము పడుటకు ప్రతి ఒక్కరును వేయివిధముల ప్రయత్నించు చున్నారు. అశ్రుపూరితనయనములతో, చెప్పరాని బాధా భయములచే చెన్ను తరిగిన వదనములతో సంసార సమస్యలతో బాధ్యతలతో ఈదలేక వేగ జాలక బరువెక్కిన గుండెలతో దయాభిక్షను వేడుచు, చేసిన దుష్కర్మలకు క్షమార్పణ కోరుచు, ప్రజ తమ ప్రత్యక్ష దైవము దెస దృష్టి నిగిడ్చి ఇతర వ్యాపార ములను విస్మరించియున్నారు. "ఆర్తో జిజ్ఞాసుర ర్థార్థీ జ్ఞానీ" అని కదా భక్తులను నాల్గు విధముల గీత విభజించియున్నది. కోరికల కొరకై వచ్చిన వారు, విషయము తెలిసికొన గోరి వచ్చినవారు, ధనార్జన పరులు, జ్ఞానులు ఈ నాల్గు వర్గములవారే కాక అనాధలు, దీనులు, దేశద్రిమ్మరులు నాస్తికులు, కాలయాపనపరులు, కుక్షింభరులు, కపటసన్యాసులు వేషధారులు, విషకుంభులు మొదలగువారనేకులు ఇచ్చట చేరియున్నారు. ఎవరెవరెట్టివారో ఎరిగి వారినావిధమున సన్మానించి సంభావించుటయు స్వామి చేయు అద్భుత లీలలో నొకటి.

లీలామానుషధారియగు నా ప్రేమైకస్వరూపునకు అందరును కన్నులప్పగించి చేతులెత్తి నమస్కరించు చున్నారు. ఆ జనసమూహములో ఒక చెంత స్వామి ఆగి అచ్చటివారిలో ఏ ఒక్కనికో విభూతిని తీసి అను గ్రహించుచుందురు. ఒక వృద్ధురాలు స్వామిపాద స్పర్శకై ఆరాటపడుచుండుట చూచి కరుణాపూర్ణ నయ నములతో స్వామి "వద్దు బంగారూ" అని ఆమెనువా రించును. బంగారూ అను మాట బాబాయొక్క ప్రేమ ఊట. స్వామి దివ్యానుభూతి దర్శనమునకు భక్త హృదయమును తెరపించుటకు ఈ మాట ఒక బంగరు మాట. ఈ మాటలోని మాధుర్యము హృదయాంతరముల వరకు ప్రవేశించి పారవశ్యము [illegible]

చాలా ఏండ్ల క్రితము నన్ను మొదటిసారిగా బంగారూ
అని పిలువగా నేనెంతయో తన్మయత్వము చెందితిని.
ఆ మాటయందలి మాధుర్యము నన్ను పులకించినది.
స్వామి నన్నీవిధమున పలుకరించిన వేళ నా ఆనంద
మునకు అంత శ్శాంతికి అంతు కానదు. ఒక్కొక్క
సమయమున ఆలోచనాని మగ్నులైనట్లు బాబా కదలక
మెదలక ఉండి ప్రాపంచిక సంపర్కము లేని ఒక
మహాయోగి వలె కన్పట్టుదురు. ఏమి ఆలోచించు
చున్నారో స్వామికే ఎరుక. సృష్టియొక్క భూత
భవిష్యద్వర్తమానములు కావచ్చును. యుగ యుగ
ములలో దాల్చిన పూర్వావతారముల సన్నివేశము
లను గూర్చికావచ్చును. "ఓ అర్జునా నీవు నేను
ఎత్తిన జన్మలు అసంఖ్యాకములు. నీకు తెలియక
పోవచ్చుకాని నాకవన్నియు గుర్తే; అని యోగేశ్వరు
డగు శ్రీ కృష్ణ భగవానుడు గీతయందు వాకొని
యున్నాడు. యుగములు మారిననూ. జగములు
కదలిననూ చెరగని, మాయని నిత్య సత్యమగు
చైతన్యమే బాబా.

-

ఒక్కొక్కపరి ఎవరిని గమనించక, నిశ్శబ్దముగా.
సహజమందహాసమును గూడ మరుగుపరచి భక్తుల
మధ్య స్వామి త్వరితగతిని సాగిపోవుచుందురు. దీని
అర్థము స్వామి అలక్ష్యము చేయుచున్నారనియా ?
కాదు కాదు. ఎవరిని ఎప్పుడు పలుకరించవలయునో
స్వామికే తెలియును. స్వామి దర్శనమందు స్వామి
ఆశీర్వాదము అవినాభావముగా ఇమిడియున్నది.
మాటలాడకయే ప్రజాహృదయమున మార్పును తీసి
కొనిరాగల నేర్పు స్వామిది. స్వామి సమక్షమే
మనకు అక్షయమగు రక్ష. మొదటిసారిగా చూచిన
క్షణమే అనిర్వచనీయానందమును పొందితినని ఒక
అమెరికన్ భక్తుడు నాకు వెల్లడించినాడు. మానవ
బుద్ధికతీతుడైన భగవంతుని కార్యాచరణ మిట్టిదని
ఎవరేవిధముగ నిర్ధరించి చెప్పగలరు ? భగవల్లీలా
విలాసములతి విచిత్రములు కదా ! మానవుని నడక
లోని చాంచల్యత, నిర్వ్యాజము, నిర్వికారము అగు
భగవంతుని ప్రేమను మార్చదు. ఆ ప్రేమ ఎడ
తెగనిది, తగ్గనిది. స్వామి చేయు ప్రతిపనికి నిగూఢ
మగు కారణమేదియో యుండియే తీరును. ఎవరెంత
అలక్ష్యము చేసినను, ఎవరెంత కృతఘ్నతతో తన్ను
గుర్తించకయున్నను యోగక్షేమములు నిర్వహించు
తన బాధ్యత తగ్గించదని, తన ప్రేమను కురచ పరచ
దనియు స్వామీ ఘంటాపదముగ ఎన్నోసార్లు చెప్పి
యున్నారు. చాలమంది స్వామికి మాలలుగాని
తదితర వస్తువులుగాని ఈయ జూచెదరు. కొంత
మంది స్వామి స్వదస్తూరీతో సంతకమును పొంద
గోరుదురు. వారి వారి అదృష్టము కొద్దీ వారిచ్చు
వాటిని స్వామి ముట్టుకొని వారికే ఇచ్చివేయుదురు.
సహజసుందర మందహాసముతో పూలమాలలను ఏ స్త్రీ
వైపో విసరి నీకేకాదు సుమా అని హెచ్చరించుదురు.
అధునాతన సమాజమునకు చెందిన చిత్ర విచిత్రము
లగు జుట్టు కట్టులతో యున్న ఇద్దరు యువకులచ్చట
చేరియున్నారు. స్వామి అట్టి యువ తరపుపోకడలకు
ఓర్పు చూపరు. వారిని కొంచెము మందలించెదరు.
కొంత మంది కానుకలను తీసికొని వచ్చెదరు. నాకు
కావలసినది మీ కానుకలు కాదు మీ హృదయ పారి
శుద్ధము, అని స్వామి చెప్పెదరు. ఇచ్చుటయే కాని
తీసికొనుట నా స్వభావము కాదు అని తరచు చెప్పు
చుందురు. స్వామి కోరికలతీర్చు కల్పవృక్షము.
స్వామి దయ అపారము. స్వామి పరిహాసమందు
కూడ సహజమాధుర్యమొలుకుచుండును, ఒకానొక
సారి ఒక ఆమె బాబాతో స్వామీ నా కొడుకు స్కూలులో
తిన్నగా చదువుటలేదని ఫిర్యాదు చేయగా స్వామి

నీవే స్కూలుకు వెళ్ళి చదువుకొనరాదా అని చమత్క రించినారు. స్వామి పరిహాసము నీటిపై నడయాడు ఉదయభాస్కరుని రశ్మి చందమున లలితమై యొప్పును. సువాసన లీను గులాబీ రేకలవలె రంగు రంగుల వెద జల్లు ఇంద్ర ధనుస్సు వోలె వేసవికాలపు చిరుజల్లు మాడ్కి మనస్సు రంజించు పసివాని ముసి ముసి నవ్వుచందమున, పికసంతతికలకలరవము భంగి స్వామి పరిహాసము మన మలరించునదియై ఎవరిని ఇసుమంతయు నొప్పించదు బాబా ఎప్పుడును మెత్తగా ఉందురనుకొనుట పొరపాటు. అదే పనిగా తప్పు దారిలో పోవువారిని బాబా గట్టిగా మందలించు దురు. అయితే స్వామి కాఠిన్యము కూడ భక్తుల బాగు కొఱకే. "వజ్రాదపికఠోరాణి, మృదూని కుసుమాదపి" అనునట్లు స్వామి శిక్షణ రక్షణలు పొసగును.

బాబాకు పిల్లలన్న ఎంతో ప్రేమ. ఒక్కొక్క సారి వారు తమ తల్లిదండ్రులను వదలి పువ్వునో పండునో పట్టుకొని అకస్మాత్తుగా బాబా వైపు పరు గెత్తుదురు. స్వామి, వారిని లాలనగా చేరదీయుదురు. ఒక్కొక్కప్పుడు వారికి తీపులను కూడ తీసి ఇచ్చుట నేను చూసియున్నాను. భక్తుల మధ్య తిరుగునప్పుడు పెద్దవారు పాదనమస్కారము చేయుట స్వామికి సామాన్యముగ ఇష్టముండదు. అయినను పిల్లలు సాష్టాంగపడిన స్వామి వారించరు. సమయా సమ యములనయని ఈ పాదనమస్కారములు స్వామి స్వేచ్ఛగా తిరుగుటకు కాని ఒకచో నిలబడి మాట్లాడు టకు గాని ఇబ్బంది కలుగచేయుటయే దీనికి కారణము. పలకలపై ఓమ్ అను పవిత్రాక్షరమును వ్రాసి పిల్లలచే అక్షరాభ్యాసము చేయించి స్వామియే ప్రేమతో పిల్ల వానిచే దిద్దించుదురు. దూర దూరములనుంచి వచ్చిన వయో వృద్ధులగు భక్తుల క్షేమ మరసివారిని లోపలికి పిలిపించుకొని ఇంటర్వ్యూ ఇచ్చెదరు. వారిని వారి వెంట వచ్చినవారిని పలుకరించి, ప్రసాదమిచ్చి వారిని తృప్తిపరచెదరు. కల్లకపటము తెలియని అమాయ కులే స్వామికి ఇష్టులు. ప్రశాంతినిలయమున గాని బృందావనమున గాని స్వామి ఇచ్చు ఇంటర్వ్యూల యథార్థము భగవంతుని పొందు భక్తుల గమ్యమున కొక సంకేతము. స్వామితో ఎదురెదురుగా నిలబడి సంభాషించిన దినము భక్తుని జీవిత చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపదగిన దినము. స్వామి సమక్షమున నిలిచి, హృదయాంతర్గత భావములను స్వామికి చెప్పుకొని స్వామి ప్రేమను తనివి తీర గ్రోలుట ఒక మరపురాని అనుభవము. ఆ క్షణమె ఒక నూతన పరివర్తనతో గూడిన పునర్జన్మ అని చెప్ప వచ్చును. ఈ సన్నివేశమును శాశ్వత స్మృతి పథ మునందుంచుకొన్న వాని జన్మధన్యము. భగవంతుని మ్రోల నిల్చి ఉన్న అతని హృదయము వికసించి పరిపూర్ణ ప్రేమభావముతో నిండి ఆత్మ తత్వముతో తాదాత్మ్యము నొందును. ఆ క్షణమందు సమిష్టిని చేరిన వ్యష్టి తాత్కాలికముగ లయమొందును.

స్వామి లోనకేగు సమయమైనది. ప్రజ ఆత్రుతతో క్రమము వీడి గుంపులుగా స్వామి దెస పరుగెత్తు చున్నారు. స్వామి లోనికి వెళ్ళుచున్నారు. చేరిన భక్తులు కూడ తమ ఇండ్లకు మరల వలయును. ఇదియే కదా వారికి ఆఖరి తరుణము. స్వామి పాదము లంటి నమస్కారము చేయవలయునని వారి ఆశ. గురువు పాదము నంటుట సమస్తము అర్పించుటకు సంకేతము. ఈ కలకలములో వాలంటీర్లు అప్ర మత్తతగా నుండవలసిన సమయము. లేనిచో ఈ అసంఖ్యాక భక్త సందోహమును తప్పించుకొని [illegible] పడుట దుష్కరము.

స్వామి ద్వారమును దాటి ఇరుప్రక్కల పూల మొక్కలతో వెలువారు చిన్నబాటపై నడచుచు ఇంటర్వ్యూ గది చేరుచున్నారు. మానసికముగా దైహికముగా క్రుంగి స్వామి ప్రేమౌషధమునకై పరితపించు జనసమూహమచ్చట బయట వేచియున్నది.

స్వామి మెల్లిదిగా గది తలుపు తీసి భక్తులను లోనికి రమ్మని సంజ్ఞ చేయుచున్నారు. స్వామి యెచ్చట యున్నను ఏ దినము భక్తులను సాకు తమ ఈ కార్యక్రమమును తప్పరు.

హెచ్. సుందరరావు

బృందావనము.

నిన్ కనులార గాంచితిని నీ పరమాద్భుతభూతి నొందితిన్
నీ కమనీయగాన ఝరి నిశ్చల చిత్తత గ్రోలినాడ నీ
లోకపు నీచవృత్తులవలోకన చేయగలేను నిత్యసా
లోకత నీ వొసంగుమిక లోకశుభంకర సత్య సాయిరో.

టి. వి. ఎస్.

పాపము పాపమంచు భవబంధములందున చిక్కనేలకో
పాపము లెల్ల భస్మమయి బాయునుబంధములెల్ల సాయినిన్
తాపమునాశమున్ గలుగు లోకశుభంకరు చూచు భాగ్యతన్
పాపము పుణ్య బంధములు బాపిచనెన్ నను దర్శనంబునన్

సం. పి.

# అరుణాచలమందు నవోదయము

భారతీయ సంస్కృతి, ఆత్మ తత్వమును తెలియ పఱచుటకు బృందావనములో జరిగిన 1973 సమ్మర్ కోర్సునందు పాల్గొనుటకు నేను, నా మిత్రుడు టేమో మిబాంగ్ వచ్చేము. మేమిద్దరము అరుణాచల్ ప్రదేశ్ నందలి పశిగాట్‌లోని జవహర్‌లాల్ విశ్వవిద్యాలయమునకు చెందిన విద్యార్థులము. ఇంతకు పూర్వము, నేనెన్నడూ నూతన సాంస్కృతిక ప్రదేశాలకు గాని, కొంగ్రొత్త సహచరులతో కలియుటకు కానీ ఇంత దీర్ఘ ప్రయాణము చేసి ఉండలేదు. నిజంగా నేను బయలుదేరే ముందు ఇంత దీర్ఘ ప్రయాణము చేయలేనేమో అని తటపటాయించాను. కాని అంతా బాగుగానే జరిగినది. మే 24 వ బృందావనము చేరేము.

అచ్చట వందలకొలది ప్రజలు రెండువైపులా బారులుగా భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి మందిరము వరకు కూర్చుని ఉండటం చూచి ఆశ్చర్య చకితుడనయ్యాను. ఆ బారుల మధ్యమార్గమంతయూ అందమైన పూల రేకులతో ముగ్గులు వేయబడియున్నవి. వారు భక్తులనియూ, బాబా గురించి నిరీక్షిస్తున్నారనియూ, అచ్చటకు కొలది నిమిషములలో బాబా, వారి మధ్యకు పూలమీదనుంచి నడచి వచ్చి దర్శన భాగ్యము ప్రసాదించి, ఆశీర్వదించెదరనియూ, నాకు తరువాత తెలిసినది.

ఇందు పాల్గొన్న విద్యార్థులలో, వివిధ రాష్ట్రముల నుంచి వచ్చిన యువతీ యువకులను చూచాను. అందులో చాలమంది హిందువులు, కొంతమంది క్రైస్తవులు, ముస్లిములు కూడా వుండిరి. వారందరూ మా భాష, మతము లేమిటని తెలుసుకొనుటకు కుతూహల పడిరి. మా జాతి, భాష 'అది' అని, 'డోన్యిపోలోయిజమ్' మా మతము అని తెలియబరచితిమి. కాని, వారికి మా జవాబులు అంతగా అర్థము కాలేదు. నిజమే! అరుణాచల ప్రదేశ్ ప్రజలకు ఒక విశిష్ట మతము గాని, ఒక మాతృభాష గాని లేదు. డోన్యిపోలో ఆరాధన కూడ సియాంగ్ జిల్లాకు చెందినది మాత్రమే.

మనము భారతీయ సంస్కృతిలో పెరుగుతున్నప్పుడు, దానికి ఆధారమైన సాంస్కృతిక సమైక్యతను మాత్రము బాగా తెలుసుకొనవలెను. ప్రేమ శక్తితో జాతి వైరుద్ధ్యములను రూపు మాపవలెను. ప్రేమను, సేవాతత్వాలను, సత్‌శీలమును, ఉత్తమ ధర్మాలను పెంపొందించుకొనవలెనని భగవాన్ మనకు చెప్పారు. ఐశ్వర్యము పోతే ఏ నష్టము లేదనియూ, ఆరోగ్యము పోతే కొంచెము నష్టముందుననియూ కాని శీలము పోయెనా, సర్వము నశించునని బాబా ఉద్ఘాటించారు.

నిజంగా, సమ్మర్‌కోర్సులో దినచర్యలను నేను మొదట ఇష్టపడలేదు. వాటికి అనుగుణంగా నడుచుకొనుట, నాకు చాలా కష్టంగా గోచరించింది. ప్రాతఃకాలమున 4-30గంటలకు భగవంతుని ప్రార్థించే విధానము నేను అనుసరించలేకపోయాను. రెండు దినములు ప్రయత్నించి, తరువాత కొద్దిరోజులు

వెతమించుకొన్నాను. కాని, తరువాత, కర్తవ్యాన్ని, విధిని వదలుట చాల బలహీనత అని గుర్తించితిని. ఈ కార్యక్రమములో పాల్గొన్న కారణము అందులో నున్న క్రమశిక్షణను, కట్టుబాట్లను పాటించి, తగిన ఫలితములు అందుకోవాలని గుర్తించాను. ఇంకా భోజనమునకు, టికి, టఫిన్లకు క్యూలో నిలబడుట కూడా నాకు ఇష్టము లేదు. పళ్లెములో అన్నము వేసుకొని తీసికొనివెళ్లి, భుజించిన తరువాత, ఆ పళ్లెమును కడుగుట, ఈ పనులు చేయుటకు చాల సిగ్గువేసేది. కాని, పెద్దలు, పండితులు ఆనందముతో చేయుటచూచి, అటువంటి వారేచేసిన, నాలాటి మామూలు ఒక విద్యార్థి సిగ్గుపడవలసిన విషయము కాదని, నేను ఇంకా పక్వము కాలేదని, స్వయంకర్తవ్యాలు చేయగలిగే జ్ఞానము ఇంకా నాకు లేదని తలచేను. భగవాన్ నుంచి, స్వయం సేవయే, మంచిదనియూ, ఈ స్వయంసేవ ఆత్మ నిగ్రహాన్ని, దాని నుంచి ఆత్మవిశ్వాసము, ఆత్మవిశ్వాసము నుంచి త్యాగము, తద్వారా ఆత్మ సాక్షాత్కారము కలుగుతాయని విన్నాను. బాబా "కర్తవ్యమే భగవానుడని" మాకు చెప్పారు.

మొదట్లో, రకరకాల ఆ యువకులను చూచి వారితో కలసుకొనుటకు నేనిష్టపడలేదు, ఎలాగు, ఆ నెల అంతా గడపాలని బాధపడేవాణ్ణి. నెమ్మదిగా, తతిమ్మా విద్యార్థులతో కలసిమెలసి తిరుగుట మొదలు పెట్టేక, ఇంటిధ్యాస పోయి, మేమంతా ఒక కుటుంబముగా భావించేను. ఈ కుటుంబము బృందావనము లోని సాయీ కుటుంబముగా మారింది. మా స్నేహము వృద్ధి చెందింది. అందుకే భగవాన్ మాకు సౌహార్దమే దివ్యత్వము అని చెప్పారు.

సమ్మర్ కోర్సు ద్వారా సత్శీలము యొక్క విలువ తెలుసుకోగలిగాను. సర్వమానవత్వాన్ని పొందాలంటే సత్య ధర్మ శాంతి ప్రేమలే ఏకైక మార్గమని గుర్తించేము. ఈ సమ్మర్ కోర్సు నిజంగా భారతీయ ప్రాచీన సంస్కృతిని నాగరికతను పునరుద్ధరణ చేయుచున్నది. వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, గీతా రామాయణ భారతములయొక్క సంగమ స్థలమే ఈ సమ్మర్ కోర్సు. వీటియొక్క విషయములను భారతీయ విద్యార్థులకు ఇక్కడ బోధించడం జరుగుతుంది. దేవతలు, మానవులు కలిసే చోటు ఇది. హిందూమతమునకు సంబంధించక పోయినా, ఇచ్చట మేము నిజమైన ఆనందమును అనుభవించ గలిగేము.

ఈ సమ్మర్ కోర్సు అందరినీ ఆదరణచే ఆహ్వానించి, ప్రపంచ శాంతిని నెలకొల్పుతుంది. అహంకార మమకారములు, భ్రాంతులు, అపనమ్మకము, అసత్య అధర్మములను నిర్మూలిస్తుంది. వివిధ మతములను అంగీకరించి, వారి ఐకమత్యాన్ని ప్రబోధిస్తుంది. క్రైస్తవులు, యహూద్యులు, ముసల్మానులు, బౌద్ధులు, జైనులు, కన్‌ఫ్యూషియనులు, అందరూ పాల్గొనటానికి ఆహ్వానిస్తుంది. వారి వారి మతములలోనే ఉంటూ, ఆ మతమునే అమితమైన నమ్మకముతో ఆచరింప చేస్తుంది. సత్య, ధర్మ, శాంతి ప్రేమలను హృదయానికి హత్తుకొనేటట్లు చేస్తుంది. సత్‌కర్మలను ఆచరింప చేస్తుంది. మానవ భ్రాతృత్వాన్ని, దైవ పితృత్వాన్ని సూచిస్తుంది. ఆత్మ విశ్వాసమును, స్వయం సేవను, ఆత్మనిగ్రహాన్ని, త్యాగశీలాన్ని వృద్ధి చేసి, ఆత్మ సాక్షాత్కారము వైపు ప్రగతిని సాగింప చేస్తుంది.

భగవంతుడు ఒక్కడే అని, అనేక రూపములతో రూపొంది చిత్రాతి చిత్రములైన లీలలతో శక్తులను

వ్యక్తము చేయునని, వివిధ మతములలో వివిధ నామములతో పిలువబడుచున్నాడనియూ, ఏ మతమునకు సంబంధించిన దేవున్ని ప్రార్థించిన, అన్ని మతములలో రకరకములుగా పిలువబడు భగవంతునికే చెందుతుందనియూ, బాబా చెబుతారు. శ్రీ సత్య సాయిా దివ్యజ్ఞానమును దివ్యకాంతిని ప్రసాదించును. అవతార పురుషుడు ; ఇప్పుడు ఈ సుందరమైన ఆకారముతో విలసిల్లుతున్నాడు.

భవిష్యత్తులో అరుణాచల ప్రదేశ్‌యొక్క బాల బాలికలకు, ఇటువంటి దివ్య కార్యక్రమములలో పాల్గొనుటకు, దివ్య సందేశములు వినుటకు, దివ్య వ్యక్తుల సన్నిధికి చేరుటకు అరుణాచల్ ప్రదేశ్ ప్రభుత్వము అవకాశమిచ్చి సహాయము చేయవలెనని నా హృదయపూర్వక ప్రార్థన. అందువలన, వారి సద్గుణములు వృద్ధియై, తద్వార ఈ అరుణాచల ప్రదేశ్ కొత్తరకమైన భారతీయ భూ భాగముగా నిర్మింపబడును. మనము అంతా ఆత్మజ్ఞానమును బడసి, మన సంస్కృతి నుద్ధరించెదము గాక ; మన అరుణాచల ప్రదేశమందే భారత భూమియందు ప్రథమ సూర్యోదయము. భారత సంస్కృతియొక్క నవోదయము కూడ ప్రప్రథమముగా మన స్వదేశమందు జరుగుగాక.

విద్యా గాది

వేదార్థంబులు విస్మరింపఁబడు విప్వేళన్ జన్ముల్ శ్రద్ధయై
వేదాంతశ్రవణం బొనర్చుటకు నువ్విళ్లూరునట్లెప్పుడున్
ఈ దేశాటన సువ్రతా మహిమచే సర్వేశార్చనా సక్తులన్
బోధిన్ జేసెడి సాయినాధునిపదంబుల్ గొల్తు సద్భక్తితోన్

జనుల కలుష మడచి, సాధువర్తన నేర్పి,
దైవభక్తి గరపి, దానరక్తి
గూర్చి భువనములకు గురుఁడవై సర్వదా
జగతి హితము కొఱకు సలుపు వ్రతము.

# ఆశీర్వచనము

పవిత్రాత్మ స్వరూపులారా ! నేడు భారతదేశ మందు ఐహికవాంఛలు పెరిగి, పారమార్థిక దృష్టి హీనమై, వేదశాస్త్రములందు భారతీయులు తమ విశ్వాస మును కోల్పోయి, భగవంతుడున్నాడా లేడా అనేతికమ కలలో పడి, ఆత్మ విశ్వాసము క్షీణించి, అక్రమ, అసత్య, అశాంతులకు పాలు కావటము విచారముగా నున్నది కోతులు తాము చెడి, వనమంతయు చెరచినట్టు, తాము అశాంతిలో పడి, మిగిలిన వారిని కూడ, ఇట్టి పరిస్థితికి తెప్పించుచున్నారు. కర్మ క్షేత్రము ధర్మక్షేత్రముగా ప్రకాశించిన భారతభూమి యందు కర్మధర్మములకు విరుద్ధముగా ప్రబోధ ప్రచారములను చేసి, భారతమాతకపకీర్తిని తెచ్చు చున్నారు.

అనేక మంది వైదికాభిమానులు ధర్మాభిమానులు ఇట్టి దుస్థితినిగమనించి, వారి వారి ఇష్టానుసారము బుద్ధ్యనుసారము రకరకములైన ప్రయత్నములు సలిపి భారతీయ సంస్కృతిని ఉద్ధరింప పూనుకొను చున్నారు, సరే, అయితే ఇట్టి దుస్థితికి కారణమేమి, దాని మూలాధారమెక్కడ, అని యెవరూ చక్కగా గమనించక పోవడమే విచారకరముగా నున్నది, అట్లు చేయక, పరిస్థితి చక్కపరచుటకు వీలులేదు, అవనతిని నిలుపటానికి వీలుకాదు.

ఒక వృక్షము మొదలునుంచి, కొమ్మలు రెమ్మలు వరకూ ఎండిపోవుచున్నదని గమనించి, తత్పరిహా రార్థమై, పైపైన నీళ్లు పోయుట సక్రమ మార్గము కాదు ; గాని మూలములను నాశనము చేయుచున్న, క్రిమికీటాదులను ధ్వంసము చేయక, వృక్షమును రక్షించుట సాధ్యము కాదు.

అట్లనే, మహాపవిత్రమైన వైదిక ధర్మమునకు, వేద విహితమైన సనాతన ధర్మమునకు వేళ్లు ఏవి అన్న. బ్రాహ్మణ్యము, బ్రహ్మచర్యము, ఇవి రెండే. వీటి రెండింటికి సంప్రాప్తియైన కీటకములను జబ్బులను మొదట ధ్వంసంచేసి, తరువాత మిగిలిన చర్యలను తీసికోవలసియున్నది. అపుడే భారతీయ సంస్కృతి అభివృద్ధియగును. బ్రహ్మ మార్గముననుసరించు బ్రాహ్మణులు, బహ్మచర్యమును పాటించు యువకులు బాలబాలికలు అభివృద్ధి కావాలి. మనమందరము సమావేశమైయున్న ఈ నవభారత గురుకులమువంటి గురుకులాశ్రమ సంస్థలు బయలుదేరిన, మన పవిత్ర భారత సంస్కృతిని పోషించి రక్షించగల్గును. పూర్వ కాలమందు శ్రేయోదాయక బ్రాహ్మణ్యము ఇపుడు ఈ దుస్థితికి దిగజారడానికి కారణము, విహితానుష్ఠా నము యొక్క అభావమే. అనుష్ఠానమునకు దిగితే వేదశాస్త్రముల పతనమునకడ్డు తగులును అనే భయ భ్రాంతులకు గురియై పఠించుటలోనే కాయమును కాల మును వ్యయముచేసిన ఫలితమేమాత్రము ఉండదు. అనుష్ఠానము లేని పాండిత్యము కేవలము హాస్యాస్పద ముగా నుండును. తెలిసిన కొన్ని విషయములనైనా

ఆచరణయందుంచి, ఉద్భవించే ఆనందమును ఆరగించుకోవలెను. కాలము అనంతము ; లోకము విశాలము ; జీవితము మాత్రము అంతవంతమైనది ! జీవించుటకు దొరకిన ఈ అల్పకాలమందే వేదవిద్యను అనుష్ఠానములో పెట్టి, ఆనందించి ఆత్మతత్వమును అనుభవించవలెను. ఇదే సార్థకతనొందు మార్గము.

ధర్మము, ఆచారము, కేవలము వ్యక్తిగతము కానేరదు. "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా", యావత్ప్రపంచమునే కట్టిపెట్టేది, ధర్మము ఐహికాముష్మిక సుఖములనిచ్చి, దుఃఖమును దూరము చేసి, ధర్మము మానవులకు అమృతత్వమునే అందించును. ప్రపంచమందు కనిపించునవి కనిపించనవి అన్ని కర్మములూ ధర్మముపైననే నిలచినవి. ఏ చిన్న వస్తువైననూ ధర్మము లేక నిలువదు ; ఏ చిన్న కార్యమైననూ ధర్మముయొక్క ఆధారములేక, జరుగదు. ఏ దేశములైన కూడ, తాము గుర్తించనీ, గుర్తించక పోనీ, విజయమును సాధించవలెనన్న, ధర్మమునే ఆశ్రయించవలెను.

భారతీయులు ధర్మమును రెండుగా విభజించి పాటించుచూ వచ్చారు. ఒకటి, సామాన్య ధర్మము : జాతి మత లింగ భేదములు లేక, మానవులందరూ పాటించవలసిన సత్యము, అహింసా, దయాది గుణముల అనుసరణ, ఆచరణ. రెండవది, విశేష ధర్మము : అగ్నిష్టోమము మొదలైన అగ్ని కార్యములు, హోమములు. దైవత్వమునుంచి అగ్ని ఉద్భవించినది ; బ్రాహ్మణ్యము కూడ దేవపురుషుని ముఖమునుంచి ఉద్భవమైనది. కనుక, ఇవి రెండూ పవిత్రమైనవి ; అగ్ని లేక ఏ యజ్ఞమూ యాగమూ సార్థకము కాదు. అగ్ని, గాయత్రి, వేదములు, ఇవన్నీ ప్రజాపతియొక్క అంశసంభవములే.

యావద్భారత దేశమందు, ప్రపంచమందున్న ఇతర దేశములందు కూడ, భగవద్విశ్వాసము మనశ్శాంతి నిత్యశాంతిని సంపాదించేకొరకు, లౌకిక సుఖసంతోషములనే మాత్రమూ లక్ష్యమందుంచక, వేలాది మంది ఆర్తులు, జిజ్ఞాసులు అరలు చాచి అవస్థ పడేది మీకు తెలియనిది కాదు. ఆధ్యాత్మిక విచారము, విషయము, ఆధ్యాత్మిక సాధనలు వ్యక్తికి మాత్రమే అన్వయించునని, దానికి మాత్రమే సంబంధించినవి అని, సమాజమునకు దానితో సంబంధము లేదని అనుకొనేది కద్దు. ఇది చాలా తప్పు. వ్యక్తి ద్వారానే సమాజమును అభివృద్ధి పరచి, శాంతి క్షేమము కల్యాణములను స్థిరపరచుటకు ప్రాప్తిలేక పోలేదు. ఇంటియందు సంచరించుటకు మాత్రం వెలుతురు అవసరము, బయట తిరుగుటకు వెలుతురు అనవసరము అనే భావన తప్పు ! సమాజాభివృద్ధికి వ్యక్తి తత్వమవసరము ; వ్యక్తియొక్క సుఖశాంతులకు సమాజతత్వము అవసరమే. వ్యక్తుల సమూహమే కదా, సమాజము ? నిత్యానందము వ్యక్తిద్వారా ప్రవహించి, సమాజము అనేకొలను నిండి, అనుగ్రహ సముద్రములో అంత్యము కావచ్చు. సమాజమునకు ప్రత్యేకముగా ఒక భౌతిక దేహము లేదు. సమాజము యొక్క అంగములైన వ్యక్తులకే రూపనామములున్నాయి. వ్యక్తియే లేక, సమాజమును స్థాపించటానికి వీలులేదు. వ్యక్తిని తీర్చి దిద్దితే సమాజ స్థితి ఉన్నతమగును. మానవత్వమును దైవత్వముగా మార్చి, నిత్యానంద ప్రాప్తినందుకొని ఆచరణ రూపమైన ప్రబోధ ప్రచారములను సలిపి, ఆ ఉన్నత స్థితిని యావత్ ప్రపంచమునకు అందించుట కొరకు సాయి సంస్థలను అనేక విధములుగా ఏర్పరచుట సాయిసంకల్పం. అయితే, సత్యసాయి వేలకు వేలు భారతదేశమందే కాక ఇతర దేశములందు

కూడ స్థాపితమైనప్పటికినీ, ఆశించిన ఆశయములను అందుకోలేక పోతున్నాము. దీనికి కారణమేమిటో, గుర్తించుకొని, కావలసిన కూర్పులు మార్పులు కలిగించుకొని, సంస్థలను వ్యాప్తి గావించవలెను. ఇట్టి సమావేశమందు, మీరందరూ చేరి సత్యమును గుర్తించి పరిహారములను నిర్ణయించేది అత్యవసరము.

ముఖ్యముగా మీరు ఒక విషయమును గమనించవలెను; ఇతరులు ఏది చేసిన అది మంచిది అని మనము భావించుచున్నామో అట్టివాటిని మనము ఆచరించి అనుసరించి ఆనందమును వారికందించాలి. చెప్పటములో ముందంజ వేసి చేయటములో మాత్రము వెనుకంజవేసిన, అది తప్పు మార్గమే. మన సంస్థలవారు ప్రబోధముకంటే, ఆచరణలో ఎక్కువ శ్రద్ధ వహించాలి.

అనేక మంది ఊహలకు ఉన్నత స్థానమిచ్చి, రకరకములైన అపోహలకు స్వాగతము చెప్పి, కార్యకర్తలను సభ్యులను నిరుత్సాహపరచుటకు కూడ పూనుకుంటున్నారు కొన్ని రోజుల క్రితము ఒక సద్గృహస్థుడు నా దగ్గరకు వచ్చి, "స్వామి! మీ సంస్థలో ఇంత మంది కార్యకర్తలున్నారే! వారందరికీ వేదశాస్త్రములపై, ధర్మజీవనముపై, భగవంతుని లీలాగుణగణ విశేషాలపై సంపూర్ణ విశ్వాసమున్నదా? అని ప్రశ్నించినారు "సంపూర్ణ విశ్వాసము లేక పోయిననూ, వారిలో కొద్ది కాలములోనే, వారు ఈ సంస్థలద్వారా సేవ చేస్తూ చేస్తూ, ఇతర సంస్థల కార్యక్రమములను చూస్తూ చూస్తూ భగవన్మహిమ అను చెప్పుతూ చెప్పుతూ, వారి అవిశ్వాసము క్రమేణ తగ్గుచూరాగా వారి ప్రవర్తనలను వారే మార్చుకొనుటకు అవకాశములున్నవి." అని జవాబిచ్చి మీరెవరు? ఏ సంస్థలో కార్యకర్తలు, ఏ సేవా కార్యమును చేపట్టియున్నారు?" అని ప్రశ్నించాను దానికి "స్వామి! నేను రాజకీయ వాది" అని ఆయన అన్నాడు. "మీ సంస్థ లోపల సభ్యులెంత మంది?" అని నేను అడుగగా, "5 లక్షలు" అన్నాడు "ఆ 5 లక్షల మందిలో అందరూ రాజకీయవాదులా? దేశభక్తులా? మీ నిబంధనలను అనుసరించేవారా? మాట తప్పక అనుసరించుచున్నారా? లేక, అధికారభక్తులా? పదవీ భక్తులా? అందరూ ఖద్దర్ ధరించుచున్నారా? నువ్వు ధరించు వస్త్రము యేది? పైన ఖద్దర్ షర్ట్ వేసినావు. క్రింద ఖద్దర్ ధోతి కట్టావు; అయితే, లోపల, పాశ్చాత్యులు తయారు జేసిన బనీను వేసుకొన్నావే?" అని చెప్పినాను. ఇతర సంస్థల వారి నడకలో ఇట్టిది సహజముగా నుండవచ్చునే గానీ, సత్యసాయి సంస్థల సభ్యులలో ఇట్టి కపటము, కుయుక్తులు, తప్పులు, ఏ నాడూ ఏ మాత్రమూ ఉండకూడదు; ఉండవనే నా నమ్మకము. చూడండి, మన దేశములో సోషల్ సర్వీస్ అని సమాజసేవా కార్యక్రమములు యెన్నో జరుగును, కానీ, ఈ గురుకులమందు ఆడంబరమునకూ అహంభావమునకూ ఏ మాత్రమూ అవకాశము లేక, మన తూర్పు గోదావరి జిల్లా సంస్థల సభ్యులు ఎంత శ్రద్ధగా యెంత భక్తి ప్రపత్తులతో యెంత పెద్ద సేవను అందించారు! ఒక నయాపైసా కూడ ఒకరికి కూలిగా ఖర్చుపెట్టకనే, ఒక నెల పూర్తి, సభ్యులే అన్ని రకములైన శ్రమలకోర్చి, ఉత్సాహ హృదయములతో, యావత్ప్రపంచమునుంచి వచ్చిన వేలాది మందికి ఇక్కడ అనుకూలముల నేర్పరచిరి! వారి సహనము, వారి ప్రేమ, వారి ఆనందమును ఇతరులు, సత్యసాయి సంస్థలవారు మాత్రమే కాదు, అందరూ గుర్తించి అదే రీతి నిస్స్వార్థసేవనందించాలి అని ఆశించుచున్నాను. సత్యసాయి సంస్థల సభ్యులారా!

ఇదియే నిజమైన కర్మోపాసన ! ఈ ఉపాసన వలన చిత్తశుద్ధి కలిగి జ్ఞానజ్యోతి వలన కైవల్యము సిద్ధించును. భగవత్ ప్రీత్యర్థముగా గావించు కర్మలన్నియు, కైవల్యమునకు సోపానములే, అని విశ్వసించి, సత్య సాయి సంస్థల నిబంధనలను తూచ పాటించి తద్వారా ఆనందమునందుకొని ఇతరులకు పంచండి ! ఎట్టి కష్ట నష్టములకైనా నిందలుకు నిష్ఠూరములకైనా ఓర్చుకొని, పూర్తి త్యాగముచేసి, ఆనందమునందుకొనుటకు ప్రయత్నించవలెను.

ధర్మో రక్షతి రక్షితః ఆచరణలో పెట్టిన ధర్మమే మీకు అన్ని విధాల రక్ష నందించును. అట్ల కాక, తుచ్ఛమైన వాంఛలను అహంకార మమకారములను హృదయమందుంచుకొని, ఆ వాంఛలు నెరవేరినప్పుడు విశ్వసించటము, లేకపోతే విరమించుకోవటము, ఇట్టి వారు జీవితమునే వ్యర్థము చేసుకొనుచున్నారు. విశ్వాసము అవిశ్వాసము అనే బ్రతుకు చావుల మధ్య జీవించు మర్త్యులు ఎట్లు ఈ సంస్థలలో చేరి, సేవ నొసంగుదురో సాధనలను సలుపుదురో తెలియ కున్నది. దృఢవిశ్వాసము లేక, డోలాయమాన మనస్సుతో కార్యక్రమములను నిర్వహించువారిని జీవచ్ఛవములనే పిలువవచ్చును.

సత్యసాయి సేవా సంస్థలలో చేరి కార్యాచరణ నొనరించటము స్వామినిమిత్తమై కాదు ; ప్రజల నిమిత్తమూ కాదు ; ధర్మ నిమిత్తమై యుండవలెను. ధర్మమే జగత్తుకు ఆధారము. మానవుడు మాధవుడుగా మారాలంటే, అహంకార రహితమైన సర్వజన సమాన మైన, శుద్ధ ప్రేమను ప్రదర్శించు సేవయే, సాధన ! అహంకారములో నున్నవంకా దుఃఖమూ, విచారమూ, తప్పవు.

నిజస్వరూపమైన సచ్చిదానందముతో కర్మలు చేరి నపుడే, జయము కలుగును.

కర్మభూమి యోగభూమి త్యాగభూమి అని దేశ విదేశాలచే స్తుతింపబడిన భారతభూమియందు భారత మాత పుత్రులైన మీరు మీ దేహములను శక్తి సామర్థ్య ములను ఆ మాతృసేవకై అంకితము చేయవలెను.

వివేకానందుణ్ణి, లండన్‌లో ఒకప్పుడు మ్యాక్స్ ముల్లర్ అనే ప్రఖ్యాత పండితుడు విందుకు ఆహ్వా నించి ఆదరించాడు. భోజనవేళయందు, వివేకా నందుడు వారిని " మీరు ఇండియా దేశమునకెపుడు వస్తారు " అని ప్రశ్నించాడు. దానికి ఆయన, " అయ్యో ! నేను ఇండియాకు వచ్చిన వాపసు రావటానికి వీలుంటుందా ? అక్కడే నా దేహమును వదలి భస్మము గావించటమే దానికి సార్థకత. భగవంతుడు ఏ నాడు నన్ను ఆ పుణ్యభూమికి పిలు స్తాడో తెలియలేదు. In the whole world, India is Heaven on Earth " అన్నాడు. అంటే, భూలోకమందు స్వర్గసమానమైనది ఇండియా అని పాశ్చాత్యులు మన దేశమును ఆరాధించుచుండగా, భారతీయులు మాత్రం ఇండియా దేశమును అపవిత్ర ముగా భావించుచున్నారు. ఎందువలన ఇట్టి భావము అని అర్థము కాదు. అదే మ్యాక్స్ ముల్లర్‌గారు మరొక మాట కూడ అపుడు అన్నారు : " What is not in India in nowhere." అంటే, ఇండియాలో లేనటువంటిది ఇంకెక్కడనూ లేదనేది ఆయన భావము. భారతమాతయొక్క పవిత్రతను గుర్తించలేక అంధులైనారు ఆమె పుత్రులు, అహో, ఎంత దురదృష్టమో యోచించండి. [illegible] స్వార్థమునకు మాత్రమే లొంగి సత్యాన్ని [illegible] చేయువాళ్ల స్వభావ స్వరూపమిది.

తెలిగేట్లయిన మీరే మీకు విధించిన క్రమశిక్షణను పాటించలేదు ! ఇంక, మీరితరులకు ఎట్లు ఆదర్శము నందింతురు ? Duty, Discipline, Devotion ఇవి మూడూ కార్యకర్తలకవసరము Devotion (డివోషన్ : భక్తి) ఉండవచ్చును ; Duty (డ్యూటి) జరుపవచ్చును. అయితే, Discipline (డిసిప్లిన్) క్రమశిక్షణ లేక అన్నీ నిష్ప్రయోజనమే. ఉదయముభక్తులను కలసుకొనే నిమిత్తమై నేను వచ్చినపుడు అనేక మంది రూల్సును సక్రమముగా పాటించలేదు. నమస్కారము కొరకు వారి స్థానము నుంచి లేచి ఇతరులను నెట్టి వారికిబ్బంది కలిగించిరి. ప్రదర్శన ప్రవర్తనలచే ముందు ముందుకు వచ్చిరి. మీ మీ స్థానములను వదలకూడదని తెలిపియూ ఇట్లు చేసిరి.

క్రమశిక్షణను లక్ష్యమందుంచుకొని మెలగాలి సంస్థలకు సంబంధించిన కార్యములలో మాత్రము కాదు ; నిత్యజీవితమందు చేయవలసిన అన్ని పనులలో కూడ క్రమశిక్షణను చక్కగా పాటించాలి.

Duty is God ; Work is Worship (డ్యూటీ యీజ్ గాడ్, వర్క్ యీజ్ వర్‌షిప్) అని అనేక వర్షములనుంచి కూడనూ మీకు చెప్పచున్నాను. కానీ, దానిని చెవులతో వినటము మాత్రమే జరుగు చున్నది, హృదయముతో అందుకొనే యత్నమునకు మీరు పూనుకొనటము లేదని స్పష్టమగుచున్నది. సంస్థలు సక్రమముగా సేవనందించే కొరకు ఏ ఏ శాసనములను అంగీకరించినామో, వాటిని నిర్మల దృష్టితో, నిశ్చల హృదయముతో, నిస్వార్థ భావముతో అందరూ గౌరవించాలి. ఎవరినీ దూషించక, తిరస్కరించక, ఏ మతమునూ తూలనాడక, మీ కర్తవ్యములను సక్రమముగా నిర్వహించాలి. "All are one ; Be alike to every one " అందరూ ఒక్కటే, ప్రతివానిపై సమభావముంచుకో "అనే బోధను ఆచరణలో అనుసరించాలి. వ్యక్తి ద్వేషము, సంస్థల ద్వేషము, మతద్వేషము, వీటకి ఏ మాత్రము గురి కాకూడదు. మీరు ఆత్మతత్వము అందరియందూ ఒకటిగానే యున్నది అని దృఢముగా విశ్వసించాలి. మానవ సోదరత్వము, దేవ పితృత్వము వీటిని మీ ఆచరణల ఆధారముగా అంగీకరించాలి.

" Brothers and sisters ! " (బ్రదర్స్ అండ్ సిస్టర్స్) అనే పలుకులతోనే తృప్తిచెందకూడదు. దానికి తగిన క్రియలు కూడలేకపోతె, ఆ పలుకుల వలన కాలము వ్యర్థమగును, అసత్యము అభివృద్ధి యగును, అంతే. అందరిలోని ఆత్మతత్వము ఒకటే అని విశ్వసించిన, అట్లు పలుకుటకు అర్హత కలుగును. మన వేదశాస్త్రములు "ఈశ్వర స్సర్వ భూతానాం ", " ఈశావాస్య మిదం సర్వం " " వాసుదేవ స్సర్వ మిదం " అని, ఈ తత్వమునే ప్రబోధిస్తూ ఉన్నాయి.

ఇతరులయొక్క గౌరవమునందుకొనుటకు, వారి నుంచి కృతజ్ఞతను ప్రేమను స్వీకరించుటకు మీకు ఆవేదన ఉంటుంది. సరే. అయితే, ఇది one way traffic (ఒక వైపు దారి) కాదు, మీయొక్క ప్రేమను కృతజ్ఞతను గౌరవమును మీరు కూడ ధారాళముగా అందించాలి, ఇవ్వాలి, పుచ్చుకోవాలి !

గడచిన All India Conference [ఆల్ ఇండియా కాన్ఫెరెన్స్] చేసిన నిర్ణయములను ఏ రీతిగా ఆచరణలో పెట్టినాము, ఎంతవరకు మన ఆదర్శములను సాధించినాము, ఆర్జించిన ఫలితమేమి, అని సమావేశములో పరీక్షించి తగిన చర్యలను శీఘ్రగా తీసుకోవలెను. అది లేక సంవత్సరము సంవత్సరా

రావటము పోవటము మాత్రము జరిగినా, ధనవ్యయమే ఫలితము. కాలమును వ్యర్థముగావించటమే, ఫలితము. దృఢ విశ్వాసముతో నిబంధనలను నిర్ణయము చేసుకొని, తద్వారా ఆశయాన్ని సాధించుటకు కృషి సలుపాలి, లేకపోతే, ప్రయోజనముండదు. ఈ సమావేశము కొరకు వ్యయమయ్యే ఖర్చులను బీద సాదలకు పంచి పవిత్ర సేవ నందించవచ్చును, ఒక వైపు అట్లు ఉపకారమూ కాక, మరొక వైపు ఆనందమూ జరుగక ఆశయాలు నెరవేరక, సమావేశములను జరుపటము సరైన మార్గము కాదు. కాలమును కాయమును కర్మను అపవిత్రము గావించక, సార్థక మార్గములో తగిన ప్రయత్నములు సలుపాలి.

యావత్ భారత దేశమందు అన్ని రాష్ట్రముల లోనూ భజన మండలులు, స్టడి సర్కిల్లు, మహిళా విభాగములు, సేవాదళములు, కాలేజీలు చాలా ఆనందముగా జరుగుచున్నవి; అయితే, కొన్ని సంస్థలు సత్యసాయి ఆశయమును అర్థము చేసుకొనక, [illegible] కూడ పరిస్థితిని సరి చేయుటకు కృషి చేయాలి. ఉత్తమ మార్గమును చేరి సాధించటానికి కంకణము కట్టుకోవాలి.

ముఖ్యముగా బాలవికాస్ తరగతులకు ప్రాధాన్యత నీయవలెను; ఉత్సాహముతో పిల్లలకు భారతీయ సంస్కృతిని అందించి ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దాలి ఈ గురుకులమందు సమావేశమైన ఈ కాన్ఫిరెన్సు వలన, భారతీయ సంస్కృతి పునరుద్ధరింపబడి, పవిత్ర భావములు నిర్మల హృదయములు అభివృద్ధి చెంది, సత్యధర్మ శాంతి ప్రేమలు జగత్తులో స్థాపితమగునని ఆశించి ఆశీర్వదించుచున్నాను!

2—1—74

మహాసమ్మేళనము, ప్రారంభోత్సవము

సృష్టిరహస్యమును గురించి విచారణ సలిపిన సృష్టికర్త వేరు, సృష్టివేరు అనే భావన తప్పుఅని తెలిసిపోవును— సృష్టి కపటముకాదు— కృత్రిమ ముకాదు అది సంపూర్ణ ఆధ్యాత్మికతత్వమే! భగవదాకారమే! భగవత్సంకల్పము వలన కలిగినది— కపటమెట్లగును? భగవంతుని ఆనందము శక్తి వీటియొక్క ప్రకటనమే సృష్టి! వానియొక్క స్వరూప నిరూపణమే! స్వభావప్రదర్శనమే! భగవత్సంకల్పముతో ఆవిర్భవించిన సృష్టి భగవద్రహిత మెట్లగును? ఆ సంకల్పమును గుర్తించి వర్తించిన విషయములతోనిండిన ప్రపంచము విషముగా వెంటాడదు— దివ్యత్వమనే అమృతములోనే ముంచివేయును!

# శివునితో శివరాత్రి

ఈ మహాశివరాత్రికి (20-2-74) ప్రశాంతి నిలయమునందు భగవాన్ యొక్క కార్యక్రమము గురించి, సనాతనసారథిలో తెలియచేయకపోయినా, ఆరోజు ఉదయమునకు 20 వేలకు పైగా భక్తులు వివిధ రాష్ట్రములనుంచీ, విదేశములనుంచి కూడా, అక్కడకు వచ్చి చేరారు! భగవానుని అద్వితీయ మహిమాతిశయమును, తమను తిలకించే అవకాశము వారికి లభించినందుకు, మరియు, తృష్ణకు మించిన రీతిగా ఎన్నోరెట్లు యెక్కువగా అనుగ్రహింపబడి నందుకు, వారిని అత్యంత అదృష్టవంతులని భగవాన్‌వారే చెప్పారు.

ఉదయము 7-30 గంటలకు ప్రశాంతిమందిరము యొక్క ప్రథమ అంతస్థులోనున్న కమలమంటపము యొద్దకు, ప్రపంచ మతముల చిహ్నములతో కూడి యున్న వెండి తలుపులను తామే స్వయముగా తెరచుకొని వచ్చి, వేలాది భక్తులకు శ్రీవారు దివ్య దర్శన భాగ్యాన్ని ప్రసాదించారు. ఆ సమయములో ఘంటారావములు, భక్తుల భజనలు, వేదఘోష, జయజయనినాదములు మిన్నుముట్టినవి. డా॥గోకాక్ గారు ఆ భక్త సమావేశమునుద్దేశించి మహాశివరాత్రి యొక్క అంతరార్థమును గురించి వుపన్యసించారు. ఆ పవిత్ర దినమునందు కోట్లకొలది ప్రజలచేత ఉపవాస జాగరణములతో ఆరాధింపబడే ఆ శివుడే భగవానుడని స్పష్టమగునట్లు చేశారు. తరువాత తన హృదయమునుంచి ఉప్పొంగి వచ్చిన ఈ క్రింది పద్యమును చదివి, ఆ భక్తసమావేశముయొక్క భావాలను ప్రతిధ్వనింపచేశారు.

ఓ పరిపూర్ణ ప్రేమస్వరూపా!
ఓ దివ్యాత్మదీప్తి
ఓ సత్యస్వరూపా!
ఓ సాయీ!
నీవు నావాడవు:
తెలుసు నాకు, అందరివాడవని!
కానీ నాతో నీవున్నంతవరకు
నీవు నావాడవే!

నేను నీవాడను!
తెలుసు నాకు; అందరు నీవారే అని!
కాని, నేను నీతోనున్నంత వరకు
నేను నీవాడనే!
ఆలకించు నా ప్రార్థన!
ఇదే నా ప్రార్థన!
నా అడుగులను అసత్‌నుంచి సత్‌లోనికి నడిపించు;
నా అజ్ఞానాన్ని జ్ఞానమయముచేయి;
నన్ను మృతత్వాన్నుంచి అమృతత్వానికి తీసికొనివెళ్లు!
ఇదే నా ప్రార్థన
ఇది ఈడేరేటట్లు అనుగ్రహించు!

భగవాన్ తన దివ్య ప్రసంగములో బ్రహ్మ, శివ, విష్ణు తత్వాల గురించి చెపుతూ, బ్రహ్మ రజస్ తత్వ మనియూ, శివుడు తమస్ తత్వమనియూ, విష్ణు సత్వ తత్వమనియూ సూచించారు. విష్ణు తత్వము సచి అనియూ, బ్రహ్మ శివ తత్వములనేవి సాగరము అనియూ వివరించారు. విష్ణువు కపిలుడుగా సాంఖ్య యోగాన్ని నియమించేరు. సాంఖ్యదర్శనములో నున్న ప్రాథమిక భాగములను, వాటి అంకెలను గురించి సంగ్రహముగా చెబుతూ, భగవాన్ సృష్టికి స్థితికి, వ్యక్తీకరణ మొదలగునవి ఈ అంకెల మీద ఎలా ఆధార పడి ఉంటుందో వివరించేరు. ఉపనిషత్తులలో చెప్పబడిన దశాంగుళము, నిజముగా హృదయానికీ, మూలాధారమునకు, నిర్దేశింపబడినదని సూచించేరు. 60 విఘడియలతో, 60 ఘడియలతో, 360 దినముల సంవత్సరములతో కాలము ఎలా గమనము చేయుచుందో, అదే విధముగా జీవతత్వము, ప్రాణ తత్వము ఇవి కూడ పది పదిగా గుణితమై గణింపబడుతూ పెరుగుతాయని వివరించేరు.

శివరాత్రియొక్క ప్రాముఖ్యత అయిన లింగోద్భవము గురించి చెపుతూ, భగవాన్, ఆద్యంతాలు లేనిది, సమస్తము దేనికొరకు ప్రయాణము చేస్తున్నాయో, సమస్తము దేనిలోనికి లీనమై పోతున్నాయో, అదే లింగమని సూచించేరు. శివమనగా మంగళము, రాత్రి అంటే చీకటి. ప్రతి ఒక్కరు తమను ఆవరించిన చీకటితో కూడిన రాత్రిని, ప్రేమ అనే జ్యోతిని వెలిగించి, వెలుగుతో కూడిన పగలుగా మార్చుకోవాలి, అని నుడివేరు. ఆ సమావేశమునకు ఆహ్లాదము కలుగచేస్తూ, భజన సమయములో విభూతి అభిషేకము చేసెదననియూ, అభిషేకముయొక్క, లింగోద్భవముయొక్క అంతరార్థము గురించి ప్రసంగించెదననియూ, ప్రకటించారు

11 ఘంటలకు, ఊరేగింపుగా వేదపండితులతో పాఠశాల విద్యార్థులతో సమస్త వైభవముతో పూలరేకులచే అలంకరింపబడిన దారిమీద నడుస్తూ భగవాన్ పూర్ణచంద్ర ఆడిటోరియమునకు వెళ్లేరు. భక్తులు కొంతకాలము భజనలు సలిపిరి; పిమ్మట భగవాన్ షిర్డీ సాయి బాబా వెండి విగ్రహానికి యథావిధిగా అభిషేకము చేసి, అచ్చటనున్న భక్తులలో ప్రతి ఒక్కరు పులకరించేటట్లుగా ఒక చిన్న బిందెనుంచి హస్తచాలనముతో విభూతిని కుండపోతగా ధారలు ధారలుగా సృష్టించి అభిషేకించారు. అభిషేక సమయములో నమక చమక పఠనము జరుగుచుండగా ఆ పెద్ద ఆడిటోరియము "ఓం శివాయ" అనే భజనతో ప్రతిధ్వనించింది.

అప్పుడు భగవాన్ పెల్లుబికి వచ్చే అనుగ్రహ తరంగములతో వేదికనుంచి దిగివచ్చి, పవిత్రమైన అభిషేక జలమును స్వయముగా, భక్తుల మధ్య నడుస్తూ, వారి శిరస్సుల మీద ప్రోక్షించేరు. భక్తుల యొక్క శుభప్రదమైన అదృష్టమునకు ఇది మరియొక అభిలషణీయమైన చేర్పు.

సాయంకాలము 4—30 ఘంటలకు పూర్ణచంద్ర ఆడిటోరియములో భక్తులు మరల సమావేశమయ్యారు. గోవా మాజీ గవర్నరు శ్రీ నకుల్ సేన్ I. C. S. గారు పురాణములలో భాగవతములో వివరింపబడిన శివతత్వాన్ని గురించి, భారతీయ శ్రుతిస్మృతులలోని శివనామముల గురించి ప్రసంగించారు. మహారాష్ట్ర విధానసభా అధ్యక్షులు శ్రీ పాగేగారు సరళ సుందరమైన హిందీ భాషలో శివసాయి తత్వములో నున్న దివ్య తత్వాన్ని చక్కగా వివరించారు. రాజమహేంద్రవరవాస్తవ్యులైన కారుణ్యానంద స్వామివారు శ్రీవారి దివ్యానుగ్రహముతో కూడిన లీలల వృత్తాంతము

వివరించిరి. వేలాది స్త్రీ పురుషుల నిస్వార్థ సేవపల సనే ఆరవ సత్యసాయీ సేవా సమితుల అఖిలభారత సమావేశము జయప్రదముగా అచ్చట నడచినదని తెలిపారు. సమావేశ కాలములో సేవచేసిన వాలంటీర్లు పంటశాలలో గాని, భోజన గదులలో గాని, కాన్ఫరెన్సు హాలులో గాని, నాటక మంటపములో గాని వారు ఎక్కడ పని చేస్తున్నా, వారు భగవానుని సన్నిధిని వాస్తవముగా ప్రత్యక్షముగా అనుభవించారని, ఆనంద మొందినారని తెలిపారు. సభ్యులందరూ ఆ వివర ములను విని హర్షించిరి.

మద్రాసు వాస్తవ్యులైన శ్రీతారాపూర్‌గారు ఆ నగ రము యొక్క కేంద్రస్థానమైన మౌంట్‌రోడ్డులో నెలగొన్న ఐదు ఎకరముల స్థలమును (అందులో ఏబట్స్‌బరీ అని ఇప్పటివరకు పిలువబడే సువిశాల సౌధమును) శ్రీ సత్యసాయీ ట్రస్ట్‌కు సమర్పించారని డా॥ భగవంతంగారు సభలో తెలిపిరి. ఆ భవనమునకు భగవాన్ "శ్రీ సత్యసాయీ సుధా" అని నామకరణము చేశారని ప్రకటించేరు. వేలాదిమంది సభ్యులు జైజైకారముతో ఈ విషయమునకు ఆహ్లాదించిరి.

భగవాన్ తమ దివ్య ప్రసంగములో సర్పారాధన, ఆరు చక్రములతోకూడి, సహస్రారమనే పడగ గల కుండలినీ శక్తి యొక్క చిహ్నమని వివరించేరు. ఏడుకొండల స్వామి ఈ చక్రములద్వారా అధిరోహణ చేసే యోగశక్తి చే పొందదగిన పురుషోత్తముడు; ఏడుకొండలనబడే, ఆరుస్థానములుదాటే యోగ సాధకునికి నిత్యానందమును ప్రసాదించే భగవంతుడు వెంకటేశ్వరుడు, అన్నారు. సుబ్రహ్మణ్యుడు అనగా: సర్పముగా పూజింపబడే దేవుడు. విషముతో కూడినది అని ఆ సర్పమును పూజించుచున్నాము అనేది సామాన్యుల అభిప్రాయము. అయితే, మూలాధార చక్రములో నిద్రించు కుండలినీశక్తియొక్క చిహ్నము గానే ఈ సర్పారాధనను సలుపవలెనని శ్రీవారు చెప్పారు.

మన్మథుణ్ణి, లేక కామమును శివుడు భస్మము చేసి ఆ భస్మాన్ని విభూతిగా తన శరీరమందు పూసు కొని శివుడు తను విజయమును ఆనందమును వ్యక్త పరిచేడని శ్రీవారు తెలిపారు. ఈ విభూతియే అన్నిటికి అంత్యము; గమ్యస్థానము. విభూతి వాడనిది, మాడ నిది, కుళ్లనిది, ఇగరనిది, పాడవ్వనిది.

భగవదారాధన నిమిత్తమై యథావిధిగా నిత్యము సమర్పింపబడే పూలు, ఫలములు, పత్రములు, జలము వీటన్నింటికన్న నిత్యమై నిలచేది, పవిత్రముగా నుండేది విభూతియే కనుక, విభూతియే భగవంతు నికి అర్పింపతగినది. కావున, అభిషేకములో విభూతిని సమర్పించడం జరిగిందని, కాని నిజమైన విభూతి, మానవుని బాధించే కోరికల భస్మమై ఉంటా అని చెప్పారు.

తరువాత, భగవాన్ ప్రేమముదిత మనసె కహో రామ రామ రామ్........; గోవిందా గోపాల ప్రభు గిరిధారి........; అనే భజనలను పాడిరి. మూడవ సారిగా శివలింగా మంగళాంగా, శివరాత్రి ఆత్మ లింగా అనే భజనను పాడుతూ, తాను నిలిపి సభ్యు లనే పాడమని ఆజ్ఞనిచ్చారు. అపుడు, తన ఉదర ములో ఉత్పన్నమైన లింగము వెలువడును అని 40 వేల కనుల నిరీక్ష వీక్షణములు వారి వదనారవింద మందు కేంద్రీకృతమైనవి. భగవాన్ కొన్ని మార్లు నీటిని త్రాగిరి; లింగోద్భవ ముహూర్తమందు కష్ట శ్వాసతో, వెక్కిళ్లతో కొంతకాలము గడిపిరి. అనంత రము, శివమహాతత్త్వచిహ్నమైన, దేశకాల పరిస్థితుల

నిరంతరస్థితిని సూచించే ఆత్మలింగము ఆకుపచ్చని స్ఫటికలింగము పెద్ద అండాకారముగానున్న జ్యోతిర్ లింగము ఒకటి తమ నోటిలోనుంచి బయటకు వెడలు చుండగా, శ్రీవారు తమ హస్తముతో పట్టుకొన్నారు. దిగ్భ్రాంతిచెంది ఆనందభరితులై పులకితాంగులైన భక్తులమధ్యకు వచ్చి వారికి ఆ లింగమును చూపించి వారిని ఆనందములో ముంచేరు. ఈ అద్భుతమును సందర్శించిన ప్రతివారిముఖము అత్యంతానందపరి పూర్ణతను పొంది వెలుగందింది.

దివ్యశక్తితో సృష్టింపబడిన ఆ లింగమును బాబా వేదికమీదనే వుంచిరి. ఆత్మలింగ సన్నిధిలో వేలాదిమంది స్త్రీ పురుషులు రాత్రంతా అఖండభజన జరిపిరి. ఆ భజనగానము రాత్రి గడచేకొలది, భక్తుల ఉత్సాహమును అధికము చేశాయి.

అరుణోదయమందు, శ్రీవారు ఆడిటోరియమునకు వచ్చి, దివ్యదర్శన మొసంగిరి. ఆత్మలింగమును గురించి వివరముగా దివ్యోపన్యాసము నందించిరి. దాని చుట్టుకొలత పది అంగుళములనియూ, అందులో శివుని త్రిశూలము మెరయుచున్నదనియూ, సాంఖ్య యోగములో చెప్పబడు 10 అంకెల ప్రాముఖ్యత ననుసరించి, త్రిశూలము ప్రతీ పది నిమిషములకు రంగులు మారుస్తాయనియూ, నుడివిరి.

ఈ లింగోద్భవము అత్యంత పవిత్రమైన సంఘటన అని, ఆవేదనతో ఈ సంవత్సరము శివరాత్రికి ప్రశాంతినిలయమునకు వచ్చిన వారందరూ లింగో ద్భవమును, లింగములోని త్రిశూల ప్రకాశమును తిలకించి, తద్వారా జనన మరణ చక్రములనుంచి విముక్తిపొందిరని శ్రీవారు ఉద్ఘాటించారు. ఆ దివ్యాను భవ స్మృతిని హృదయములో నింపుకొని, అందుకు అనుగుణముగా మనోవాక్కాయ కర్మలతో సత్య ధర్మ శాంతి ప్రేమలతో జీవించమని ఆదేశించేరు. నీచ ప్ర వృత్తులను, సంకుచిత తత్వమును, ద్వేషమును ఎన్న డూ అనుసరించవద్దని చెప్పారు. తప్పుత్రోవలో పడతా నేమోనని, శివరాత్రిమహోత్సవ దివ్యదృశ్యమును మరచిపోతానేమోనని భయముతో, జాగ్రత్తగా నుండ వలెనని నుడివారు.

ఆఖరున, బాబా పూర్ణచంద్రహాలులో చేరిన వారి నందరునూ, పూర్ణచంద్రునిరీతిగానే జీవితమును సరి దిద్దుకోవాలనీ, పూర్ణచంద్రుడనగా ప్రశాంతమైన, నిశ్చలమైన, నిర్మలమైన, ఆనందమైన మనస్సు యొక్క చిహ్నమని చెప్పారు. విశాలమైన అనుకూల మైన పూర్ణచంద్రహాలు ఉండుటచేతనే, ఈ శివరాత్రి ఇక్కడ జరుపుట జరిగినదని, అందుచేత ప్రతీఒక్కరి బాధ్యత ఈ ఆడిటోరియమును నిర్మించిన పూర్ణ చంద్ కమానిగారి ఆదర్శాన్ని అభినందించి అను సరించి ఆనందించవలెనని బోధించారు. తరువాత వేలాది భక్తులలో ప్రతీ ఒక్కరికీ ఆత్మలింగ ప్రసా దము పంచారు.

బాబా ఇచ్చిన అభయమువలన, వారి హృదయ ములో ఉప్పొంగిన కృతజ్ఞతవలన వాతావరణ మంతయూ అత్యంత పవిత్రముగా విలసిల్లినది. అందరి హృదయములూ నిర్మల నిశ్చల నిస్వార్థ ప్రేమయొక్క నిలయములుగా మారినవి.

# సకల కల్యాణ గుణధామ

అత్ర్యాది మహాఋషుల్ । అదృశ్యముగ నందు
అంజలి జేయుచు । వచ్చిగొల్వ,
అనిమిషులెల్లరు । ఆనంద భరితులై
నింగి నుండియుచట । తొంగి చూడ,
పంచభూతంబులు । ప్రణవంబుపాసించి
వింతగా నిన్ను సే । వించు చుండ,
ప్రత్యూష సమయాన । పవనాంకురంబులు
ఋత్విక్కులను బల్క । రించుచుండ,
వేదాంత పండితుల్ । వేడ్క మీఱగ ముందు
ఆమ్నాయముల నెల్ల । జదువుచుండ,
నీవె శరణమంచు । నీభక్తు లెల్లరు
నిండు భక్తితో గొల్చి । నిలిచియుండ,
శృంగారముగ నీవు । బంగారు టంగీతో
రజత ద్వారము దీసి । రమ్యముగను,
ఆర్తజనులకెల్ల । అభయద్వార మిదంచు
కరుణార్ద్రవీక్షణన్ । కదలిరాగ :

మహిని ధర్మంబు రక్షించు । మాధవుడవా !
వెండి వుయ్యాలలో వూగు । విష్ణువీవా !
భవభయంబుల మాన్పెడి । భవుడవేమో !
లోక కల్యాణ మొనరించు । లోక పితవా !
యనుచు ఆనంద సుధనెంతొ । నారగించి
భక్తి యున్మత్తులగుదురే । భక్త తతులు ;
నిన్ను దర్శించు భాగ్యంబు । నెన్న వశమె ;
యెన్ని పూజలు జేసిరో । నిన్ను గాంచ !

ఎన్ని నోముల ఫలమదో । యెన్నగాను !
జపములేటికి పేయంగ । తపములేల ?
నిన్ను దర్శించ సకలముల్ । నిండు గాదె :
సకల కల్యాణ గుణధామ । సాయిరామ !

జెమ్‌షెడ్‌పూర్, చెన్నమల్ల సత్యం

# దక్షిణఆఫ్రికాలేఖ

బాబాయొక్క పటములను వేలకొలది ప్రింట్‌చేసి, వాటిని కోరే ప్రతీ ఒక్కరికి పంచుట జరుగుచున్నది. భగవాన్ దివ్య ప్రసంగములకోసం అర్తిచెందిన వేలాది ప్రజలకోసం, బాబా పుస్తకములను మేము తెప్పించుకొనుచున్నాము. బాబా మాదేశమును ఒక్కసారిగా ముంచి ఎత్తారు. ఇచ్చట ప్రజలందరిలో ఒక్కసారిగా గొప్ప ఆధ్యాత్మికచైతన్యము చెలరేగినది. అనేకమంది భక్తులు భజనలను సలుపుచున్నారు. బాబా ఎంతోమందికి, అనేక రకములుగా తన సన్నిధిని అనుగ్రహాన్ని సూచించే లీలలనుచూపి ఆశీర్వదించుచున్నారు. పటములనుండి కొంతమంది ఇళ్లలో విభూతి ధారాపాతముగా కురుస్తుంది. అమృతము, కుంకుమ పటములనుంచి పడుతూ ఉండటం ఎన్నో ఇళ్లలో జరుగుతుంది. బాబా వారితోనే ఉన్నారని వారిని ఆశీర్వదించుచున్నారని భక్తుల యొక్క అనుభూతి.

దర్బాన్‌లో, పీటర్ మారిట్జ్ బర్గ్‌లో 30 భజన మండలులున్నవి. నాటాల్ నుంచి బాబా నామము భజనాలాపన, ట్రాన్స్‌వాల్, కేప్ ప్రావిన్స్ వరకు ప్రాకింది. [illegible] జాంబియా భక్తులు ఈ మధ్య జరిగిన "దక్షిణ ఆఫ్రికా భగవాన్ సత్యసాయిబాబా ఫౌండేషన్" కార్యక్రమాలలో మాతో కలిసారు. దర్బాన్‌లో హెడ్‌క్వార్టర్సు ఉన్నవి. బాబా నేర్పిన భజనలు సంగ్రహించి, అచ్చువేసి ఈ ఫౌండేషన్ దూరదూర తీరాలకుపంపి పంచిపెడుతుంది. దాని ముఖ్యోద్దేశము ఎన్నో శాఖలను ఇతర ప్రాంతములలో ప్రారంభించి, వాటికి, దారిచూపి సలహాలను, సహాయములనిచ్చి, కార్యక్రమాలను నెలకొల్పాలని. సభ్యులు వివిధ రకములైన సేవలను చేస్తున్నారు. రోగుల ఇండ్లలోనికివెళ్లి, వారు ఆరోగ్యము పొందాలనే ప్రార్థనతో, భజనలు సలుపుచున్నారు. 25, నవంబరున భగవానుని జన్మదినోత్సవమును ఆచరించు సందర్భమున, 2500 మందికి పైగా హాజరు అయ్యారు. దర్బాన్‌లో బన్వారీ మహరాజ్, వైట్ ఫిల్ములో తీసిన 8mm ఫిల్మును ప్రదర్శించగా, ప్రతీ ఒక్కరూ బాబా అక్కడ ఉండి, అనుగ్రహాన్ని అందిస్తున్నట్లు భావించేరు మేము, బాబా నిరూపించిన, మానవాళికి ముక్తినొసగే సత్య ధర్మ శాంతి ప్రేమమార్గములద్వారా నడచుకొనుటకు మాకు కావలసిన జ్ఞానమును ప్రసాదించమని బాబావారిని ప్రార్థించుచున్నాము.

**Statement about ownership and other particulars about newspaper**

**SANATHANA SARATHI (Telugu Edition)**

**From IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. | Place of publication ... ... | 'Brindavan', Kadugodi Post<br>Bangalore Dist. |
| 2. | Periodicity of its publication ... ... | Monthly |
| 3. | Printer's name<br>(whether citizen of India)<br>Address ... ... | P. S. Subbaraman, Indian<br>20/1 Upstairs, Buddha Vihara Road,<br>Frazer Town, Bangalore-5 |
| 4. | Publisher's name<br>(whether citizen of India)<br>Address ... ... | B. V. Raja Reddy, Indian<br>'Brindavan', Kadugodi Post<br>Bangalore Dist. |
| 5. | Editor's name<br>(whether citizen of India)<br>Address .... ... | N. Kasturi, M.A. B.L. Indian<br>Prasanthi Nilayam Post<br>Anantapur Dist. A.P. |
| 6. | Names and addresses of individuals who own the newspaper or share-holders holding more than one per cent of the total capital. | Sri Sathya Sai Central Trust<br>Prasanthi Nilayam Post<br>Anantapur Dist. A.P. |

I, B. V. Raja Reddy, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: 2—3—74

(B. V. Raja Reddy)
Signature of Publisher

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్టు మరియు రిజిస్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిజిర్డ ... వ్రాసి పంపవలెను.

పేరు

**తెలుగు:—**

| | | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-45 |
| 3 | మణిమాల | 1-00 | 0-15 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5 | అర్పణ | 1-00 | 0-10 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0-15 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 9 | వచనామృతము | 4-00 | 0-30 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 0-80 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |

**కన్నడ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం[1] | 3-50 | 0-25 |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-15 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 6 | జ్ఞాన వాహిని | 1-60 | 0-10 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-25 |

**మలయాళము:—**

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3 | గీతావాహిని | 3-00 | 0-25 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-10 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0-10 |

**ఇంగ్లీషు:—**

| | | | |
|---|---|---|---|
| 1 | భజన్‌సాంగ్స్ (అమెరికన్ ప్రకటన) | 2-00 | 0-20 |
| 2 | ,, (ఇండియన్ ప్రకటన) | 1-50 | 0-15 |
| 3 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-30 |
| 4 | ప్రశాంతవాహిని | 2-00 | 0-15 |
| 5 | జ్ఞానవాహిని | 2-00 | 0-15 |
| 6 | నామ సంకీర్తన్ | 1-50 | 0-10 |
| 7 | ధ్యానవాహిని | 2-00 | 0-15 |
| 8 | సమ్మర్‌షోవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0-35 |
| 9 | ,, 1973 | 0-35 | 6-50 |
| 10 | సత్యం శివం సుందరం III | 6-00 | 0-40 |
| 11 | సందేహ నివారిణి | 3-00 | 0-15 |

**అరవం:—**

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-40 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-40 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-30 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-35 |
| 6 | భజనావళి | 1-00 | 0-20 |
| 7 | సాయిమాతా | 1-00 | 0-10 |
| 8 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 9 | సందేహనివారిణి | 2-00 | 0-25 |
| 10 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 11 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 12 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-10 |

**హిందీ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయణము: [పద్యములు] | 1-00 | 0-10 |

**గుజరాతి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 2 | కధాసుధ | 2-00 | 0-15 |
| 3 | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-30 |

**సింధి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-10 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

**అస్సామీ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారథి [షార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0-10 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కదా | 0-25 | 0-10 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్స్] | 0-50 | 0-10 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-20 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-15 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-10 |
| 7 | సాయి గాధ (పద్యములు) | 1-00 | 0-10 |

**ఒరియా:—**

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీసత్యసాయి చరితామృత (11) | 1-00 | 0-10 |
| 2 | సహస్రనామ పూజావిధాన్ | 1-00 | 0-10 |
| 3 | గీతావాహిని | 5-00 | 0-25 |

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2 చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5. పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను.

M.O. ద్వారా పైకమును పంపించువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియజేయవలెను.

6. పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోష్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు ../4-74 అని యుండిన, మీ చందా ఏప్రిల్ నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) ఏప్రిల్ నెల 8.వ తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —:శ్రీవారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు ఎడిటర్, 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'బ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు పి. ఎస్. సుబ్బరామన్ గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

Regd. No. KRN/A-67 March 1974

"రసోవైసః"; పరమాత్ముడు రసస్వరూపుడు కదా? ఇంక ఆయనచే సృజింపబడిన, ఆయన ప్రవేశించిన, ఆయన నడుపుచున్న, ఆధారమూ ఆధేయమూ ఆయనగానే ఉన్న ప్రపంచము కూడ, దివ్యస్వరూప స్వభావములు గలవే కదా? సూర్యునికీ సూర్యకిరణములకూ అవినాభావ సంబంధము; అట్లనే, భగవంతునికి ప్రపంచమునకూ అవినాభావ సంబంధమే!

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 ఏప్రిల్ 1974 సంచిక 2

## విషయానుక్రమణిక



శివలింగ మంగళాంగా! శివరాత్రి ఆత్మలింగా!



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 51

### తెలుపలేని బాధ

ఈ విధముగ భరద్వాజ మహాఋషి భరతుని అనేక విధముల కొనియాడెను. భరద్వాజుని నేత్రములనుండి ఆనంద బాష్పములు యేక ధారగా నేల రాలెను. భరతశత్రుఘ్నులు రామప్రేమను తలంచుచూ, వారు యెంతటి అదృష్టవంతులమో అన్న భావమును తమలో తాము తలంచి అట్టి ప్రేమస్వరూపునికి దూర మైతిమి కదా అని భరించలేని బాధను, తెలుప లేని హృదయముతో విచారించిరి.

భరతుడు గద్గదస్వరముతో మహా ఋషుల వారికి నమస్కరించి స్వామీ! మీరు త్రికాల జ్ఞానులు, మీ వాక్యములు పరమ సత్యములు, రామచంద్రప్రభువు సమర్థుడు, సర్వజ్ఞుడు. అయిననూ తమ సన్నిధియందు పరమ సత్యము నే పలుక తలంచితిని. జనుల మనో అభిప్రాయములు రామచంద్రప్రభువుకు తెలియును. మా తల్లి చేసిన దుర్వ్యాపారమునకు దుఃఖము లేదు, లోకులు నన్ను దూషింతురను భయము లేదు, పరలోకము నాకు దక్కదేమో అన్న విచారము కూడనూ లేదు.

మా తండ్రి కీర్తిమంతుడు. మృతజీవుడు, వారి కీర్తి లోకమంతయూ వ్యాపించెను. ప్రియ పుత్రులైన రామలక్ష్మణులు వారి గర్భమున పుట్టిరి. రామవియోగ దుఃఖమును భరించలేక క్షణభంగురమైన కాయమును క్షణములో విడిరి. అందుచేత వారిని గురించి విచారించ పనిలేదు. సీతారామలక్ష్మణులు మునివేషములను ధరించి వనములలో పాదచారులై భ్రమ్మరు చుండిరి. కుశపత్రములే వారి ఆసనములు.

తరుచ్ఛాయలే వారి నివాసములు. యెండలకెండి వానలకు తడిసి చలిబాధలకోర్చి వనములలో వారు తిరుగుచుండిరి కదా! వారి కష్టములన్నింటికి నేనే కదా కారణము. ఈ దుఃఖమే దివారాత్రములు నన్ను దహించుచున్నది.

కడుపునకు తిండీ కంటికి నిద్రా చేరకున్నది. నా తల్లియొక్క ఈ కుబుద్ధియే నా ప్రాణముల పాలిటి వజ్రదంగివంటిదైనది. ఆమె నాకు హితమనుకొని చేసిన పనియే నాకు మహా అహితము, అపకారముగా మారినది. నా ఈ బాధ యేమి చేసిననూ తీరదు. దీనికి మందే లేదు. యేనాడు రామచంద్రుడు అయోధ్యకు తిరిగి వచ్చునో ఆ నాడే నా యీ బాధ తీరును.

ఇంతకంటే మరొక మార్గము నా బాధను తీర్చలేదు.

ఈ మాటకు చేరిన మునులందరును హర్షించిరి. అనేక విధముల వారతనినుగ్గడించిరి. నాయనా భరతా! ఇక మైయిట్టి విచారమును నొందకుము శ్రీరామచంద్రుని చరణకమలములను సందర్శించినంతనే నీ విచారములన్నియు పటాపంచలై పోవును. ఈ విధముగ మునులు భరతుని ఓదార్చిరి.

## వైభవముగా విందులు

ఇంతలో భరద్వాజ మహాఋషుల వారు తమ శిష్యుని పిలిచి, భరతశత్రుఘ్నులకు కందమూల ఫలాదులను తెచ్చిపెట్టుమని ఆజ్ఞాపించెను. రామ సందర్శనాభిలాషులై అనేక ఇక్కట్లును సహితము ఓర్చుకొని రామ వియోగ బాధతో కుములుతున్న అయోధ్యా ప్రజలకు, మంత్రులకు పరివారమునకు, తగిన ఆహారములు యేర్పాట్లు చేయునట్లును శిష్యులకు ఆనతిచ్చెను.

గురువాజ్ఞను శిరసావహించి క్షణములో పరివారమునకు, ప్రజలకూ, అందరికీ తగిన రీతిగా మృష్టాన్నములు యేర్పాటు చేసిరి. భరతునకు, శత్రుఘ్నునకూ, వారి కుటుంబము వారలకు మంత్రులకు, పండితులకు, బ్రాహ్మణులకు, అత్యంత వైభవముగా విందులు యేర్పాటు గావించిరి. ముని మహా తపోమహిమతో క్షణములో గావించిన అద్భుతమైన యేర్పాట్లును భరతుడు సంతసించెను.

అయితే ఈ వైభవములు భరతశత్రుఘ్నులకే కాక, అయోధ్యావాసులకు సహితము తృణప్రాయములు వలె గనుపించెను. సుగంధ ద్రవ్యములు, పూలగుచ్ఛములు, ఫలములు, వివిధ రకములైన భోజన పదార్థములు, చూచుటకు చాలా వింతగా యుండెను. భరతశత్రుఘ్నులకై యేర్పరచిన రెండు ఉన్నత ఆసనాలను వర్ణించ వీలులేకపోయెను. ముని ఆజ్ఞను శిరసావహించి అయోధ్యావాసులు, పరివారము మంత్రులు, పండితులు, బ్రాహ్మణులూ అందరూ ఆ సుందరమైన మందిరమున ప్రవేశించిరి. వశిష్ఠులవారికి, వారి ధర్మపత్నికి ప్రత్యేక ఉన్నతాసనమునేర్పరచిరి. అందులో వారు ఆసీనులైరి. ఇక రాణులు వారి వారి స్థానములందు భరదాలలో మహావిచారములలో చేరిరి.

## సింహాసనములు

ఇంతలో ముని శిష్యులు, భరతశత్రుఘ్నులను ఆశ్రమ మర్యాదలతో వింజామరలు

వీచుచూ, వారిని తోడ్కొని వచ్చిరి. ఆ ఆసనముల చెంతకు వచ్చినతోడనే, భరతశత్రుఘ్నులు శిరస్సు వంచుకొని నమస్కరించి, ముని శిష్యుల హస్తములందున్న వింజామరలను తీసుకొని రెండు ఉన్నత సింహాసనములకు అటు వకరు ఇటు వకరు నిలుచుకొని వింజామరలతో ఆ సింహాసనములకు సేవలు సలిపిరి. చేరిన అయోధ్యవాసులు, యెవ్వరూ ఆసీనులు కానట్టి ఆ సింహాసనములకు సేవ చేయుచున్న భరత శత్రుఘ్నులను చూచి ఆశ్చర్యపడిరి.

ఇంతలో ముని వారలను సింహాసనములపై ఆసీనులు కమ్మని కోరగా, భరతశత్రుఘ్నులు మునికి నమస్కరించి, స్వామి! యీ స్థానములు, సీతారాములవి కాని మావి కావు, మా కంతటి అధికారము లేదు, ముని ఆశ్రమములందు లక్ష్మీనారాయణ సమానులైన సీతారాములు మాత్రమే ఇట్టి ఆసనములందు కూర్చొను అధికారులు, మేము వారి సేవకులము, మాకు ఈ విధమైన సేవను చేసి యందించుటకు అనుజ్ఞ ఇమ్మని కోరిరి. ఈ విధమైన మాటలతో అందు చేరిన ప్రజలు, ఋషులు, ముని శిష్యులు, పరమానందపడి భరతశత్రుఘ్నులయొక్క రామభక్తిని వర్ణించిరి. ఆనందబాష్పములరాల్చిరి. వారి విశ్వాసమునకు మునులు కూడనూ పరమానందపడిరి, తెచ్చిపెట్టిన ఫలహారములు పండ్లు కందమూలాదులను ఆ సింహాసనములకే నైవేద్యముగా నొసంగి అందులో సీతారాముల స్వరూప భావములను చిత్రించుకొని, వారి ప్రసాదముగా భావించి వక్క పర్యాయము ఆ ఫలహారములలో అణుమాత్రము త్రుంచుకొని కన్నుల కద్దుకొని భుజించిరి.

సీతారాముల వియోగబాధతో మేమీ విందులను ఆరగింపలేమనియు మునివర్యులు క్షమించవలెననియూ ప్రజలూ, పరివారము, భరద్వాజ ఋషులవారిని క్షమాపణ వేడిరి. ముని యెంత వైభవముగా విందు యేర్పాటు చేసిరో అంత అలక్ష్యముగా అయోధ్యావాసులు దానిని తిరస్కరించిరి. ఆరగింప మనస్కరింపలేదనియూ, రామదర్శనమే మాకు అమృతపానమనియూ ఆ క్షణములకై తహతహలాడుచుండిరి. ముని చేయునది లేక వారి ఇష్టప్రకారమే అనుమతించెను,

యమునా తీరము

తెల తెలవారగనే అందరు ప్రయాణమునకు సిద్ధమైరి. అందరూ మునివర్యులకు నమస్కరించి సెలవు తీసుకొని ఆశ్రమమును వీడిరి. మార్గమును చూపించు సేవకులు ముందు నడచుచుండ మిగిలిన రథములు, పల్లకీలు వారిని అనుసరించెను. ఈ రీతిగా నడచుచూ, మూర్తీభవించిన అనురాగమే అనునట్లు భరతుడు నిషాదపతి మెడమీద హస్తములు వేసి నడచుచుండెను. పాదములకు రక్షలుకానీ, పైన గొడుగు కానీ లేదు, పెట్టనివ్వలేదు, పట్టనివ్వలేదు, అది వారి వ్రతము వక మేఘము తా సిగ్గుపడి నీడనిచ్చెను. భూమి జాలినొంది మృదుమధురముగా మారెను. వాయువు చల్లని పిల్లవాయువులుగా మారి వీచెను.

ఆ దినము సాయంకాలమునకు యమునా తీరమును చేరి అక్కడ విశ్రమించిరి. రాత్రి రాత్రి లెక్కలేనన్ని పడవలు యమునా నదిలో

శనపించెను. తెలతెలవారగనే యేక కాలము
ననే అందరూ నదిని దాటిరి. స్నానములాచ
రించి అటువైపున నదికి నమస్కరించి పయా
ణము సాగించిరి. అక్కడినుండి భరతశత్రు
ఘ్నులు సాధువుల వేషమును ధరించిరి. వారి
వెంట మంత్రులు, మిత్రులు, సేవకులు, సీతా
రాములను స్మరించుచూ నడిచిరి.

### స్త్రీల పలుకులు

మధ్య మధ్య అడ్డు తగిలిన పల్లెలవారు నదీ
తీరమునకు జల నిమిత్తమై వచ్చిన స్త్రీలు దుత్తలు
క్రింద పెట్టి రెప్పవాల్చక వీరలను చూచుచూ
మొన్న వెళ్ళిన రామలక్ష్మణులే వీరుగా వున్నట్లు
న్నది. ఆ నాడు సీతాసమేతులై వెళ్ళిరి. యీ
నాడు చతురంగబలసమేతులై వచ్చుచున్నారు.
సీత యెక్కడున్నదో అని ఆమె నిమిత్తమై అటూ
ఇటూ చూచుచూ, వారిలో వారు విచారించు
చుండిరి. అయితే ఆ స్త్రీల పలుకులలో యథా
ర్థము లేక పోలేదు.

ఆ నాటి రామలక్ష్మణులు రూపవయశ్శీల
లావణ్యములతో కళకళలాడుచుండిరి. వీరి
ముఖములు ఖేదముతో కూడియున్నవి. అందు
చేత వారే వీరు కాకపోవచ్చునని మరొకరు
ఇటాటు చెప్పుకొనుచుండ పరివారములోని గూఢ
చారులు విని భరతశత్రుఘ్నులకు తెలిపిరి.
ఇంతలో వారు విచారించిరి. ఈ ఇరువురూ
శ్రీరామచంద్రుని సోదరులనియూ, వారు శ్రీరామ
చంద్రుని సందర్శనార్థమై వెళ్ళుచున్నారనియూ
తెలిసికొని అందులో వక గడుసు స్త్రీ, నిర్దాక్షిణ్య
ముగా ఈ రీతిగా పలికెను. సఖీ! తండ్రి యిచ్చిన
రాజ్యమును యేలుతూ, తానే రాజునైతినన్న
గడుసుతనముతో, రాములను దర్శించుటకు చతు
రంగబలసమేతుడై వెళ్ళుటకు సిగ్గులేదు అని
అన్నది. అంతలో మరొక స్త్రీ, అక్కా! అట్లనకు
మన దశరథమహారాజునకు అట్టి కఠిన
బుద్ధులు గల బిడ్డలు పుట్టరు. చతురంగబల
సమేతముగా వెళ్ళి రామచంద్రుని ప్రార్థించి
అయోధ్యకు కొనిపోవుటకై వెళ్ళుచుండవచ్చును,
అని అనగనే, మూడవ స్త్రీ, అవునవును. యే
పుట్టలో యే పాము, యెవరు చెప్పగలరు. యెవ
రెవరి భావములు యెట్టి వున్నతస్థాయిలో
వుండునో నిర్ణయించ యెవరి తరము.

రామచంద్రుడు సత్యవాక్పరిపాలుడు కదా
పదునాలుగు సంవత్సరములు పూర్తి కాకమునుపే
యెవరొచ్చి ప్రార్థించినా తాను అయోధ్యకు వెళ్ళ
డనే నా ఉద్దేశము అని ఆమె ఉత్తమ భావ
ములను ప్రకటించెను. ఈ రీతిగా పల్లె పడు
చులు మాటాడుకొను విషయములన్నియూ గూఢ
చారుల వలన భరతశత్రుఘ్నులు వినిరి. రామ
తత్వమును ప్రజలెంత బాగుగా గ్రహించిరన్న
విషయమును తలంచి తమలో తాము
ఆనందించిరి.

### దర్శనము దొరకినవారు

ఈ విధముగ మార్గమధ్యములందు సంభా
షించు, తన గుణములను రాముల గుణములను
భరతశత్రుఘ్నులు వినుచు రాముని స్మరిం
చుచూ నడచిరి. వీరికి ఎదురుగా కొందరు
బ్రహ్మచారులు, ఋషులు, మునులూ అత్యంత
ఆనంద భరితులై రాముల గుణగణములను

వర్తించుకొంటూ వచ్చుచుండిరి. వారిని చూచి భరతశత్రుఘ్నులు నమస్కరించిరి. వారి రాక యెక్కడనుండి అని విచారించిరి.

అందులో బ్రహ్మచారులు ఉప్పొంగి వచ్చు ఆనందమును అణచుకొనలేక మేము సీతారామ లక్ష్మణులను సందర్శించి వచ్చుచున్నామని తెల పగనే భరత శత్రుఘ్నులు పుట్టిపడి ఆనంద బాష్పములను రాల్చుచూ మీరెంత ధన్యాత్ములు నా సీతారామలక్ష్మణులు యెట్లున్నారు యెక్కడు న్నారు అని ఆతురతతో వారిని నానావిధముల కుశల ప్రశ్నలు వేసి ఆనందించిరి. అయితే ఇంకా కొంత దూరమున్నదని విని ఆనాటి రాత్రి అక్కడ నిలిచిరి.

సశేషము

పట్టుటంగీని గప్పిన పాదకముల
జాహ్నవీప్రేమ పూర్ణమౌ ఝరులతడసి
నార్ద్రమైనది హృదయమ్ము
అమర సేవ్య
హృదయబంధాల భేదించి ముదమొసంగు
మధుర వాగమృతంబునమనసుపండె

సర్వవేళల ఆనందముగా నుండగోరుదువా ? ప్రేమతో మాటాడు, ప్రేమతో యోచించు, ప్రేమతో ప్రవర్తించు, ప్రేమతో స్మరించు.

పెద్దలయెడ వినయము, పాపమన్న భయము, మంచి విషయములపై విశ్వాసము కలిగియుండుట మంచిది.

ఆత్మసాక్షాత్కారమే జీవితపరమావధి. దానిని కోరువారు త్యాగము, నిష్కామసేవ, ధ్యానముల సాధనచేయుదు.

— బాబా

# నమస్కార శతము

ఆడిన మాటలో అమృతత్వమొదవించు
వేదాంత సారంబు వెల్లివిరియ
పాడిన పాటలో పారవశ్యముగూర్చు
ప్రవిమలంబౌ భక్తి పరిమళింప
చూచిన చూపులో క్షుభిత చిత్తములపై
కారుణ్య పీయూషధార గురియ
చేసిన చేతలో జీవరాసులకెల్ల
శ్రేయముల్ చేకూరు రీతిదోప

సత్యధర్మ శాంతిప్రేమ సాధనంబు
ప్రథమ కర్తవ్యమని బోధపరచుచున్న
పుణ్యచరితుడవతార మూర్తి వీవు
సత్య సాయి ప్రభూ నమస్కార శతము

అది ఉపన్యాసమా ? అతులితాత్మజ్ఞాన
తత్త్వబోధక వాక్సుధాస్రవంతి
అది భక్తి గీతమా ? అఖిల సాధక చిత్త
నైర్మల్య సంపాద నౌషధంబు
అది మందహాసమా ? అతిదుర్భర వ్యథా
తిమిరాపహారి చాంద్రీవిభూతి
అది వస్తు సృష్టియా ? ఆస్తిక్యభావసం
స్థాపకామూల్యప్రసాద లబ్ధి.

అనుచు భక్తులు తలపోయ ననుదినంబు
సకల జగముల భాగ్యాతిశయము చేత
మానుషాకృతిబూని మా మధ్యనున్న
సత్యసాయి ప్రభూ నమస్కార శతము

వినిపింతు వొకమారు వీనులవిందుగా
గిరిధర గోపాల కీర్తనంబు
చూపింతు వొకమారు చుబ్బనదూఱగా
ప్రవిమల దివ్యలీలా విభూతి
బోధింతు వొకమారు పున్నెంపు పంటగా
కర్మఫలాతీత ధర్మపథము
కురిపింతు వొకమారు కోరికల్ దీరగా
అభయప్రదానుగ్రహామృతంబు
జప తపో దీక్షనైన యజ్ఞములనైన
పడయలేనట్టి నీ పదస్పర్శ మాకు
కలియుగంబున గలిగె భాగ్యంబదేమొ
సత్యసాయి ప్రభూ నమస్కార శతము

శ్రీపాద లక్ష్మినారాయణ మూర్తి

కమలాక్ష నీ పాదకమలాలు సేవించి
కరములు ధన్యతగాంచు భువిని
శ్రీనాథ నీ నామ సేవన మొనరించు
జిహ్వకే నాటికి చేటులేదు
సురరక్ష నిను జూచు చూడ్కియే చూడ్కియో
శేషాహికిని మొక్కు శిరమే శిరము
విశ్వవంద్యుని గాథ విన్నవే వీనులు
మా సాయిపై నిల్పు మనమే మనము
దివిజవంద్యుని సాయిని దేవదేవు
సత్యనారాయణాఖ్యుని సత్యసాయి
పర్తిసంవాసు సేవించు భాగ్యమబ్బె
చూచినాడను నా సాయి చూచినాడ

T. V. S.

# అత్యంతావశ్యకము

అతి సామాన్యుతనయిన నేను సర్వదేవతాస్వరూపు డయిన శ్రీ సత్యసాయిబాబావారినిగూర్చి వ్రాయడం సాహసమే అవుతుంది. ఎందువల్లనంటే నేను ఇంత వరకు ఆయన్ను చూడలేదు — మాట్లాడలేదు — ఆయ ననుగూర్చి నే తెలుసుకొన్నది తదనుగవత్కృపావిశేషం వలన నాలో ప్రవేశించిన జ్ఞానమాత్రం చేతనే.

పదిహేనేళ్ల క్రితం నేను చాలా దుర్దశలో వుండగా ఎవరో ఒకసాధారణ వ్యక్తి సత్యసాయిబాబావారిని కలసి ఆశీస్సులు పొందండి మీరు ఒడ్డున పడతారు అని సూచించడం జరిగింది. అయితే ఆ సూచనను నేను పెద్దగా లెక్కచేయలేదు. గాని నా మనసులో ఒకమూల బాబావారి పేరు మెదలుతూనే ఉన్నది. ఆతరువాత సంవత్సరానికి కాబోలు, మా దగ్గర గ్రామంలో ఒక ఆసామీ సాయిబాబావారి ఆరాధనోత్సవాలు పెద్ద పెట్టున జరుపుతున్నట్లు విని కవిత్వంలో కొంచెం ప్రవేశం ఉన్నవాతనవటం చేత సాయిబాబా మీద పద్యాలు వ్రాసుకువెళ్లి పూజామందిరంవద్ద పఠించాను. వచ్చాను కొలదికాలానికి నా ఘోరదుర్దశ క్రమక్రమం గా సడలుచబడి వెలుగు చూడడం జరిగింది. అప్పట్లో నా సమీపబంధువునింటిలో మెహర్బాబాను తీవ్రంగా ఆరా ధిస్తూండేవాళ్లు. ఆ యింటి యజమానికి పక్షవాతం వచ్చి, బ్రతకడనుకొని కంగారుపడే సమయంలో నేను వాళ్లకు సాయిబాబాను ఆరాధించమని సలహా యిచ్చాను. క్రమక్రమంగా వాళ్లు సాయిభక్తులైనారు. ఆయన పూర్తిగా లేచి తిరగడం లేదు కానీ బ్రతికాడు. ఇప్పుడు వాళ్ల యిల్లు ఒక సాయినిలయంగా ఉన్నది. వాళ్ల అబ్బాయే మా అల్లుడు.

అనుకోకుండ సత్యం శివం సుందరం మొదటిభాగం రెండవభాగం, సాయిపూజావిధానం, సాయిబోధలు, సాయి ఉపన్యాసాలు నా వద్దకు చేరినై. కాగా సాయి విభూతి కూడా తరగకుండా లభ్యమవుతోంది.

ఈ విధంగా క్రమక్రమంగా సాయి ప్రభావం నా అధ్యాత్మిక, సాంఘిక, ఆర్థిక, దైవిక జీవనరంగాలలో ప్రస్ఫుటమౌతోంది.

కాగా బాబాగారి దయను లేక ప్రేమను కోరడంలో మన తాత్పర్యమే మైయుండాలనేది నేను తెలుసుకుంటు న్నాను.

ఐహికసుఖాలకోసం శారీరక ఆరోగ్యం కోసం ఆయన్ని ఆశ్రయించకూడదా? ఆశ్రయించవచ్చును.

బిడ్డ తండ్రిపై అన్నిటికి ఆధారపడ్డట్లే మనమూ ఆ దైవం పై భారం వేసి అన్ని సుఖాలూ, లాభాలూ పొందవచ్చు, తప్పులేదు.

అయితే బిడ్డయొక్క అవసరాలు తీరుస్తూ తండ్రి ఊరుకుంటాడా? ఊరుకోడు. బిడ్డయొక్క అభ్యున్నతి కొరకు బిడ్డనేక రీతుల కృషికి పాల్పడచేస్తాడు. ఓ పక్క బిడ్డయొక్క ఆనందం, సుఖం చూస్తూనే మరో

పక్కబిడ్డలోని లోపలక్షణాలను సరిదిద్ది, క్రమశిక్షణ నేర్పి, శారీరక మానసిక ఔన్నత్యం అతనికి లభ్యపడే ట్లు చేసే దానికి ప్రయత్నిస్తాడు తండ్రి.

అటువంటప్పుడు తండ్రి ఇచ్చే సుభాషలు వింటూ, ఆ తండ్రి సలహాలూ, సూచనలను, కష్టాలను ఏ మాత్రం లెక్క పెట్టక, తండ్రి ఆలోచనను ఆమోదించక, సదుపాయాలు సమకూర్చే ఒక ఏజన్సీగా మాత్రమే తండ్రిని పరిగణిస్తూ ఉంటారు బిడ్డలు. అటువంటివాళ్లు తమకుతామే ఎందుకూ పనికిరాకుండా పోయే వ్యర్థులై జీవిత అపరాహ్నంలో చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు ఆవేదనతో అశాంతితో ఆర్థిక దుర్భిక్షంతో అనారోగ్యంతో (అజ్ఞానం మొదటినుంచే ఉన్నదే కనుక ఇప్పుడు క్రొత్తగా చెప్పక్కర్లేదు,) కృంగి కృశించేవాళ్లు కోకొల్లలు.

ఇలాగే మన గురువు, మన బంధువు, మన ఆప్తుడు, మన దైవం మనకు మన ఇహపరసాధనకై చెప్పే వాటిని మనం యథాశక్తి కొంతవరకైనా ఆచరించాలా వద్దా?

ఆయనేమన్నా తీవ్రకష్టతమయోగాభ్యాసం మనకు చెప్పడం లేదు. ఉపవాసం చేయమనడం లేదు. సుఖభోగాలు త్యజించమనడం లేదు.

ప్రేమ, శాంతి, సత్యం, ధర్మం వీటిని మన హృదయాలలో పటిష్టంగా నెలకొల్పి, వాటిని మిగతా హృదయాలకు అందజేయమంటున్నారు.

ఆయన ఎట్టి కానుకలూ స్వీకరించడు. కనీసం పళ్లు పూవులులాంటివి కూడా తీసుకోడు, లేదా నీ సర్వస్వం నాకర్పించు [భౌతికంగా] అనడు.

నీవు, ఇతరులు నీయందు ఎలా ఉండాలని భావిస్తావో అలా నీవు ఇతరులయందు ప్రవర్తించు అని, నీ నియమిత ధర్మాన్ని చిత్తశుద్ధితో మనస్ఫూర్తిగా, అతి శ్రద్ధతో సంతృప్తికరంగా నిర్వర్తించు అని, ఎప్పుడూ ఏదో పనిచెయ్యి, బద్ధకం వద్దు, సోమరివి కాబోకు అని, అందరినీ ప్రేమించు వైషమ్యాలను [illegible] చెయ్యకుమని. నీ యిష్టం వచ్చిన రూపం స్వీకరించు, నీ యిష్టం వచ్చిన దైవాన్ని ఆరాధించు, నీ యిష్టం వచ్చిన నామం చేస్తూ ఆ నామం చెప్పే మూర్తిని హృదయంలో ప్రతిష్ఠించు అని, ఇలాంటి బోధనలే శ్రీ సత్యసాయిబాబావారు మనకందించేది.

ఈ నాడు మానవసంఘం భౌతికంగా ఎంతో పురోగమించినప్పటికీ ఆయన చెప్పే ప్రవర్తన, మానసిక ధర్మం మనలో లోపించినై.

రాజకీయవేత్తలు, నాయకులు, విద్యావంతులు సామాన్యుడిని ఏమాత్రం ఉద్ధరించలేకుండా ఉన్నారు. సైన్సు గ్రహాంతరయానం సాధ్యం చేసేటంత పురోగమించినప్పటికీ సుఖమూ శాంతీ క్షణంక్షణం నశిస్తోంది. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య, కులానికి కులానికి మధ్య, మతానికి మతానికీ మధ్య, అగాధాలు పెరుగుతున్నవి. దేశాల మధ్య ద్వేషాలూ, రాష్ట్రాల మధ్య రాజసాలూ ప్రకోపిస్తున్నవి. అధికధరలు, నిరుద్యోగం, దారిద్ర్యం అజ్ఞానం, అనారోగ్యం మానవాళికి తీరని శాపాలు.

ఇట్టి ప్రపంచంలో సామాన్యులకు అదృష్టం కొద్దీ లభించిన పెన్నిధి శ్రీ సత్యసాయిబాబా. ఆయన్ను ప్రేమించండి. ఆరాధించండి. ఆయననుండి మీకేం కావాలో తీసుకోండి.

అయితే సత్యం, ధర్మం, సమానత్వం, ప్రేమ శాంతి వీటిని ఆయన చెప్పిన పద్ధతిలో అనుష్ఠించండి. సాయికృపారసాన్ని దుర్వినియోగం చేయకండి.

మానవాళి ఇహపరాలకై సత్యసాయిని నమ్మి, ఆరాధించి, ఆయన చెప్పినవి ఆచరించటం అత్యంతావశ్యకం.

**కాజేపల్లి యుగంధరరావు**

# సాధన

(ఒక సంభాషణ)

**భక్తుడు :** పశ్చిమ దేశాలవారు సాధన యనగా తన అభివృద్ధి మార్గము అని తలంచుదురు. అనగా వ్యక్తిలో కలుగుచున్న పరిణామము అని గూడ అర్థము యిమిడియున్నది. ఏమందురు స్వామి ?

**శ్రీ సత్యసాయి :** ప్రథమంలో తన యభివృద్ధికి తృష్ణయుండవచ్చును ; కాని దాని తరువాత దశ, విచారణ, 'ఇది' మరియు 'అది' అను విషయాల సత్యాన్ని తెలిసికొనుటకు జరిపే "విచారణ", సాధన అంటే ముఖ్యముగా విచారణే !

**భక్తుడు :** సాధన యనగా, యేదో ఒక ఫలమును ఆశించి సలుపు శ్రమ అని సామాన్యంగా మనం అర్థము చేసికుంటూ యుంటాము. యిది సరియైన అర్థము కాదు. సాధన సల్పవలెనని, దానికదే ఉద్భవించిన యెడల, అట్టి సాధన నిజమైన సాధన యనిపించుకొనబడును. అనగా, భగవంతుని సహజముగా ప్రేమించుట, అపుడు భగవంతుని ప్రేమించక తప్పదు. విచారణ సలుపక తప్పదు.

**శ్రీ సత్యసాయి :** అవును నీవు చెప్పింది నిజమే, కాని ఆ సహజంగా కల్గు భగవంతునిపై ప్రేమను నీవు అనుభవించలేదు. అది యింకా ఒక ఊహ మాత్రమే, నీలో భగవంతునిపై సహజమైన ప్రేమ గలదు అని ఒక నమ్మకము యున్నది. అనేక జన్మలలో జరిపిన ఆధ్యాత్మిక సాధనవలననే నీకు ఆ నమ్మకమనునది కల్గినది.

**భక్తుడు :** ప్రాణం ఒక్కటే, నేను, ఇతరులు, స్వామి అంత ఒక్కటే, అను దృఢ నమ్మకం నాకు యున్నది, ఆ ఏకైక వస్తువు ఆత్మ, అది యీ క్షణంలో యిక్కడ పూర్తిగ ఉన్నది ; నేను యెడ తెరపి లేకుండా సాధనలో నిమగ్నుడనై యున్నాను. ఆ ఐక్యము నేనే అను అనుభూతి నాకు యింకా యెందుకు కల్గుటలేదు ?

**శ్రీ సత్యసాయి :** ఐక్యము అను నీ నమ్మకము ఒక ఊహ లేక తలంపు మాత్రమే, అది అనుభూతి కాదు. నీ భార్యకు తలనొప్పి వచ్చిందనుకో, నీకు తలనొప్పి వస్తుందా ? రానప్పుడు ఆ ఐక్యము, అను అనుభూతి యెక్కడున్నది ? ఆ ఐక్యము అను భావన అనుభవించవలెను, గాని ఊహగా తలంపుగ మాత్రమే యుండిన చాలదు.

**భక్తుడు :** సాధన, నమ్మకములవలన అనుభవము కలుగకున్న, మరి దానిని పొందుట యెట్లు ?

**శ్రీ సత్యసాయి :** యెడతెరిపిలేని సాధనవలన! ఇపుడు మనం యీ కారులో ప్రయాణం చేస్తూ యున్నాము. కారుని జాగ్రత్తగా సారథ్యము చేసు

కుంటే చాలు. కొద్ది సేపటిలో అనంతపురము చేరు తాము, కదా ? సరియైన అచంచలమైన సాధన వలన ఆ ఆసలైన ఏకత్వము అనే అనుభవము దాని కదే వస్తుంది.

**భక్తుడు :** తానూ, పరాయివాడు ఒకటేనను భావన పొందుటెట్లు ? జాలివలన ఒకరికి మరొకరిపై అనురాగము కల్గుతూయుంటుంది, కరుణలేక జాలి అనునది ఒక భావన ఒక ఊహ. అది సరియైన ఏకత్వ అనుభవమనుటకు వీలులేదు. ఎవరో ఒకరు ఒక కుక్కను కొట్టినపుడు షిర్డి సాయి బాబాకు గాయములు తగిలినవి ; అది సరియైన ఐక్యభావన.

**శ్రీ సత్యసాయి :** సర్వం బ్రహ్మమయమే. నీయొక్క భగవత్తత్వమందు నీవు స్థిరపడియున్నపుడు, ఇతరులూ భగవద్స్వరూపులేనని నీవు తెలిసికోగ్గలు తావు. దేహభ్రాంతి వలన, నీవు వేరు, ఇతరులు వేరు అనుకున్నంత సేపు నీకు ఇతరులపై కరుణ కల్గుతూనే యుంటుంది. నివు విన్న షిర్డి సాయి బాబా కథ పూర్తిగా సరియైనది కాదు, ఆ కథ యేమిటంటే ఒక ఆమె బాబాకొరకు మిఠాయిలు వండి ఒక పళ్లెములో పెట్టి సిద్ధంగేసి యుంచితే, వాటిని ఒక కుక్క వచ్చి తినివేసింది, ఆమె ఆ కుక్కను బాగ తరిమి వేసింది. తర్వాత బాబాకు, యింకొక పళ్లెములో మిఠాయిలు పెట్టి తీసుకొని వెళ్లి యిస్తే, ఆయన వద్దన్నారు. వారికి ముందుగ పెట్టిన మిఠాయిలను తినుట వలన కడుపునిండింది అన్నారు. తాను, అదే మొదటిసారిగ మిఠాయిలను తీసుకువస్తే, ముందు పెట్టినవి తినడం ఏమిటి అని అడిగింది. బాబా అన్నారు ; "లేదు నీవు మిఠాయిలను పెట్టావు, తింటుంటే కొట్టావు కూడాను," వీరు సర్వాంతర్యామి, సర్వులలోనున్న ప్రాణం, ఒక్కటేనని యీ విధంగా ఒక గుణపాఠం బోధించారు.

**భక్తుడు:** స్వామి,సర్వాంతర్యామి అనగా నేమి?

**శ్రీ సత్యసాయి :** సర్వాంతర్యామి అనగా, సర్వజ్ఞతా, అదే సమయమంతు, అన్ని సమయములందు.

**భక్తుడు :** ఒక దశయందు, సాధనలో బహిర్గతమైన ప్రకృతి అనేది ఉండదు అని తెలవిచ్చారు అది యెట్లు ?

**శ్రీ సత్యసాయి :** సాధనయందు పది దశలున్నవి, ఒక్కొక్క దశ ఒక్కొక్క శబ్ద ఆకృతిని కల్గియుండును, వివిధ శబ్ద తరంగములను బోధియుండును—ఘంట, పిల్లన గ్రోవి, శంఖము, ఢక్క, ఉరుము శబ్దము మొదలగునవి, పదవ, దశ ఇంద్రియములకతీతమైనపుడు కల్గును. ఇంద్రియములకు అతీతమైనపుడు కల్గునదే ఆనందము.

**భక్తుడు :** ఆనందానుభవము కొంత సమయములోనే కల్గునా ? దైనందిన జీవితములో దానిని పొందుటెట్లు'

**శ్రీ సత్యసాయి :** ఆ స్థితి యెల్లపుడునూ యుండును, అపుడు సదా ఆనందమే. అతడు దైవమును స్మరిస్తూ, భుజిస్తూ, త్రాగుతూ, పిలుస్తూ దైవముతోనే యుంటాడు

**భక్తుడు :** ప్రతివారు, ఈ పది దశలమండి పోతూయుంటారా ?

**శ్రీసత్యసాయి** లేదు, ఒకరు సరాసరి పదవ దశకే పోవచ్చును, అనగా నిత్య, అవికార్య

పదమునొందును, యింకొకరు ఆరవ దశకు, మరొకరు ఏడవ దశకు పోవచ్చును, మరొకరు అసలు పురోగమనమే లేకపోవచ్చును, అందరికి ఒకే తీరున యుండదు.

భక్తుడు : సాధకుడు, ఒక దశనుంచి, మరియొక దశకు పురోగమనము చేయుచున్నపుడు, వారి దృక్పథము దేనిపై కేంద్రీకరించవలెను ?

**శ్రీ సత్యసాయి :** గతులు మారును కాని, దృక్పథము మారరాదు.

**భక్తుడు :** అయితే, ఆ వివిధ గతులకు మనము యేమి విలువ నివ్వవలెను ?

**శ్రీ సత్యసాయి :** ఆ ఒక్క గతి వలన సాధకుడు తృప్తినొందడు. ఏలనన, పూర్తి ఐక్యమే వాని గమ్యము. ఆ పరమ పద ఆనందము పొందు వరకు దానిపై కామము చాల బలముగ యుండును. ఆ పైన ఆ కామము నశించును. ఆ స్థితిలో సర్వం బ్రహ్మమయమే. తలంపులు, కోరికలు అన్నీ బ్రహ్మమే.

**భక్తుడు :** మనస్సులోనుంచి ప్రవహించే యీ తలంపులు జడమైనవా ?

**శ్రీ సత్యసాయి :** అవును, అవి జడమైనవే, జడమైనదంతా అనిత్యము.

**భక్తుడు :** తలంపులు యెచటనుంచి వచ్చును ?

**శ్రీ సత్యసాయి :** అవి మన ఆహార, విహారముల నుంచి వచ్చును. నీవు సాత్వికాహారమును తీసుకొని, మంచి విషయాలను, మంచి వాతావరణమును కోరిన యెడల మంచి తలంపులు కల్గును.

**భక్తుడు :** తలంపు లెచటికి పోవును ?

**శ్రీ సత్యసాయి :** అవి యెచటకు పోవు, యెందువలననగా తలంపులు మనస్సు ద్వారా ప్రవహించవు. మనస్సు బయటికిపోయి, పట్టి, తలంపులతో చేరుతుంది, భగవంతునినే కోరితే, మనస్సు బయటికి పోదు. గాన, యీ చిక్కులలో చిక్కుకొనక యుండుటయే మేలు. "తలంపులను వదలించుకొనుటెట్లు ?" అన్ని తలంపులను భగవంతునిగానే చూడు. అపుడు, అన్ని భగవద్విషయమైన తలంపులే వచ్చును. యీ దేహము, మనస్సు, బుద్ధి అనే యంత్రాంగమంతా ఒండొకరితో పరస్పర సహకారంతో, ఉత్తమ గమ్యార్థమై పని చేస్తూ యుంటాయి.

**భక్తుడు :** అయితే ఎవరికొరకు యీ యంత్రాంగమంతా పని చేస్తూయుంటుంది ?

**శ్రీ సత్యసాయి :** ఆత్మకొరకు ఒక చిన్న ఉదాహరణ : భూమి తనచుట్టూ తాను తిరుగును, అదే సమయములో, సూర్యుని చుట్టూ కూడ తిర్గుచున్నది. మానవునియొక్క వివిధ మనోవృత్తులు, వాటి వాటి విధులను నిర్వర్తించవలెను, కాని వాటన్నిటికి కేంద్రము ఆత్మ.

**భక్తుడు :** స్వామి, ఆ మనోవృత్తులను, ఆత్మయొక్క అధికారము క్రిందికి తీసికొనువచ్చుటెట్లు ?

**శ్రీ సత్యసాయి :** ఆత్మ ఆ ఏకైక సద్వస్తువని తెలిసికొనినయెడల, అంతయూ చక్కగా నడచిపోతూ యుండును. సర్వమూ ఆత్మకు అర్పణము చేయుటయే సమస్య.

**భక్తుడు :** మనము మనలను ఈ మాదిరిగ ప్రశ్నించుకోవలెనని స్వామి చెప్పారు, "మనస్సును,

బుద్ధిని ఈశ్వరార్పణ చేయవలెననుటకు నేనెవరిని? అవి నావి కావు. నావి కానివాటిని, కనీసం నా అధికారము క్రింద లేనివాటిని నేనెట్లు అర్పించ గలను?"

**శ్రీ సత్యసాయి :** అర్పణ అంటె, వేరెవరికో, యిచ్చుట లేక అర్పించుట అని కాదు. తనకు తానే అర్పించుకోవాలి. తానే ఆత్మ అను ఆత్మజ్ఞానాన్నే అర్పణ అంటారు. (ఆత్మార్పణ)

**భక్తుడు :** స్వామి, అసద్వస్తువుని ప్రక్కకు నెట్టుటయే అర్పణ అంటాడు.

**శ్రీ సత్యసాయి :** అవును.

**భక్తుడు :** యిపుడు నాకు అర్థమైంది. అర్పణ అనగా తన వస్తువులను గాని లేక తననే గాని యితరులకు యిచ్చుట, కాని, నిజానికి, పనికిమాలిన ఊహలను, పనికిమాలిన సిద్ధాంతములను, తప్పుడు ఉద్దేశములు లేక, అసంపూర్ణ ఉద్దేశములను విడిచివేయుటను అర్పణ అనవచ్చును.

**శ్రీ సత్యసాయి :** అవును.

శ్రీవారి పాదదాసుడు
క్యాలిఫోర్నియా, అమెరికా



సీ॥ దరిలేని సంసారశరధి దాటగజేయు
సముచితమగు నావ సాయిసేవ
బహుదూరమైయున్న స్వర్గమ్ము జేర్చెడు
సరియైనదగు త్రోవ సాయిసేవ
సకలాగమజ్ఞాన సారమంత్రమ్ముల
సమధికమగు సేవ సాయిసేవ
బహుజన్మ దుష్కృత బంధముల్ భేదింప
చంద్రహాసము సేవ సాయిసేవ

గీ॥ సకలగుణముల త్రోవ శ్రీ సాయిసేవ
సరళభక్తిపూదేవ శ్రీ సాయిసేవ
అట్టి శ్రీ సాయిసేవలనహరహంబు
జలిపి ముక్తిని బొందుడో జనములార!

మూలా పేదన్న శాస్త్రి

# సమాజదృష్టి; ఆధ్యాత్మికదృష్టి

మామూలుగ సాంఘిక జీవిత మనగానే అందుకు ఆధ్యాత్మిక విషయాలతో ప్రసక్తి ఏముంటుందని అనుకోవటం కద్దు. అలాగా. ఆధ్యాత్మిక జీవితమన గానే అందుకు సాంఘిక విషయాలతో ప్రసక్తి ఏముంటుందని అనుకోవటము కద్దు.

ఇది పొరపాటు. యావత్తు సమాజపు దివ్య వికాసానికి, జాతి దివ్య పరిణామానికి ఆధ్యాత్మిక జీవితం వుపయోగపడుటయేకాక, అవసరం! సమాజములోని ఈశ్వరత్వం వ్యక్తిద్వారా అభివ్యక్తం అవుతుంది.

జగత్తు కనబడుతుంది కానీ ఈశ్వరుడు యెట్లు కనబడడో అలాగే, వ్యక్తులు కనబడుతారు కానీ సమాజం దాని కదే విడిగా కనబడదు సమాజం అనేది మరొక పాంచభౌతిక ప్రాణి కాదు. అది ఈశ్వరుని దివ్యభావనా విస్తృతి.

మర్త్యుడైన మనిషిలో అమరమైన ఆత్మవుంది. ఇది కేవలం వేదాంత ధోరణిలో ఉదాహరించుట కాదు. యావత్తు మానవ జాతికి సమాజానికి మూలం, యేక మూలం, ఒకే కుదురు ఈశ్వరుడు. కాబట్టి కుల వర్ణవర్గదేశ పరిమితులను దాటి సర్వమానవ జాతిని ఒకే ఈశ్వర కుటుంబంగా గుర్తించమని తెలుపుతుంది సత్యసాయి సూక్తి.

ప్రకృతిద్వారా లభించే భోగభాగ్యాలను, ఎలాగో అలా. సమంగానో అసమంగానో పంచుకొందామనే కామప్రవృత్తి సామాజిక జీవితానికి ప్రాతిపదిక కాకూడదు. ఈశ్వర సచ్చిదానందతత్త్వాన్ని మూర్తీభవించుకొందామనే ఆధ్యాత్మిక దర్శనమే సామాజిక జీవితానికి ప్రాతిపదికగా వుండాలి,

ఆత్మకు చావులేదు. కాబట్టి శరీరాలను వధించు, అనే కేవల యుద్ధ ప్రోత్సాహం కాదు సాయి బోధ! "స్వకుటుంబంపై, రక్త సంబంధంపై ఆధారపడిన బంధుత్వాన్ని మించిన ఆధ్యాత్మిక బంధుత్వాన్ని గుర్తించు! అపుడు ఆ దివ్య బంధుత్వానికి పవిత్ర సూత్రమాత్రమైన ధర్మానికి అనుగుణంగా వర్తించ గలవు."

ఇప్పటి సంకుచిత బంధు ధర్మం కర్తవ్యధర్మకు అడ్డుపడుతుంటే ఆ దివ్య బంధుధర్మం కర్తవ్యకర్మము అనువైన అహంకార రహితమైన జ్ఞానాన్ని, క్రియా శక్తిని ప్రసాదిస్తుంది. ఇది సాయిలోని అంతరార్థం. ప్రకృతినుంచీ ఆత్మలోనికి నిష్క్రమించమని కాదు; ఆత్మద్వారా ప్రకృతిలోనికి ప్రవేశించు అనేదే సత్య సాయి ప్రోత్సాహము.

భోగేచ్ఛతో ప్రవర్తించే వేదవాదరతులు చూపెట్టే సాంఘిక జీవితముకన్నా ఉత్కృష్టమైన సాంఘిక జీవితాన్ని సాయి నిర్దేశిస్తున్నాడు.

వేదవాదరతులది కూడా కామ్యప్రవృత్తియే ; వేద వాదరతులకు కర్మఫలాలను అనుభవించాలని వుం టుంది. ఈశ్వరార్పితంగా ప్రకృతి చేసే కర్మను వీరు ఫలాసక్తితో తమవైపు త్రిప్పుకొంటారు. కోరిక లను కొమ్మలపై విహరిస్తారు

త్రిగుణాత్మకమైన విషయములకు చెందినట్టివి, వేదాలు ; నీవు త్రిగుణాలకు అతీతుడవు కావలెను. ద్వంద్వరహితుడవు, నిత్యమైన సత్యము యెదివుండో దానితో వుండు. ఆత్మకు యోగక్షేమాలు అవసరము లేదు ; అది పూర్ణము. భోగభాగ్యాల దృష్టివలననే అనాదినుండీ సమాజం దివ్యస్థాయిని చేరలేకుండా వుంది. నైతికస్థాయి భోగభాగ్యాల తృష్ణను నిగ్ర హిస్తుంది. కానీ దానికి మూలమైన మానసిక తత్వాన్ని తృష్ణాతీతమై, ప్రకృతినే శాసించగల ఈశ్వర తత్త్వంగా మార్చలేకుండా వుంది. ఇది మామూలు నైతిక స్థాయికి సాధ్యమయ్యేది కాదు.

ఈ అపూర్వ పరివర్తనను ఆధ్యాత్మికము ప్రబో ధిస్తుంది. మానసిక తత్వం మనిషిలో ఉన్నంత వరకు ప్రకృతికి అడ్డు యేమీ లేదు ; కానీ అలా అని ప్రకృతిని సాధించగల, పరివర్తనం చేయించగల శక్తి మరేదీలేదనుకోరాదు. ఈశ్వర తత్త్వానికి ఆ శక్తి కలదు.

మానవుడు మానసిక తత్త్వాన్ని సంపూర్ణంగా పరిత్యజించి ఈశ్వర తత్త్వాన్ని సమగ్రంగా అలవరచు కొంటే అప్పుడతని త్రిగుణాత్మక ప్రకృతి ఈశ్వర ప్రభావితమైన దివ్యత్వాన్ని ప్రకటిస్తుంది, అదే నిజ మైన సృష్టి,

మరొక మాట. భోగభాగ్యాలదృష్టి లేకపోతే సాంఘికజీవితం మాత్రం యెందుకు ? అనే భావం కలు గవచ్చు, సాంఘిక జీవితానికి భోగభాగ్యాలదృష్టే ఏ కైకమూలమైనట్లు! ఇంతకూ భోగభాగ్యాలదృష్టితో ఏర్పడుతున్నది నామమాత్రపు సమాజమే కదా ? సమాజంలో సామరస్యం యెక్కడ వుంటుంది? బలవం తులు బలహీనులను అణచిపెట్టగలగటం సహజమైన సామరస్యం యేలా అవుతుంది?

అందరికీ ప్రకృతివిషయాలను సమంగా పంచ పెట్టాలని ప్రయత్నించినా, అప్పుడూ నామమాత్రపు సమాజమే అందులో సహజమైనసామరస్యం వుండదు. వస్తువుల సంఖ్యను పరిమితం చేయవచ్చును గానీ తృష్ణను, కామాన్ని, కోరికలను ఎలా పరిమితం చేయటం? కోరికల తత్వమే పరిమితిని అతిక్రమించటం కాబట్టి, కోరికను రేకెత్తించే మానసిక తత్వమే సమూ లంగా నిర్మూలం కావాలి.

విషయం పట్ల కోరికను కాక, తాదాత్మ్యాన్ని ఏకతను స్ఫురింపజేసే ఆత్మతత్త్వం మనిషిలో అవతరించినపుడు భోగభాగ్యాలదృష్టి పోతుంది. అపుడు సమాజభావన ప్రాతిపదిక ఏమిటి ? నిజానికి ఆత్మస్థాయిలోనే సమాజం అనే పదానికి సరియైన అర్థం ఉంటుంది. అంతవరకూ కులాలు, మతాలు, వర్గాలు !

ఆత్మస్థాయిలో మానవజాతి యావత్తు బంధువులు మాత్రమే కాదు, ఏకంగా వకే కుటుంబంగా, వసుధైక కుటుంబంగా అనుభవం అవుతుంది. అది సహజమైన అనుభూతి. ఆ సామరస్యం అప్రయత్నంగా యేర్పడే దివ్యమది, ఇపుడు అహంకారాల పెనుగులాటకు దు ర్వినియోగం అవుతున్న ప్రకృతీ విషయాలు అపుడు ఈశ్వరతత్వాన్ని మానవసామాజికజీవితంలో అవత రింపజేసి ప్రతిష్ఠాపితం చేయడానికై సద్వినియోగం అవుతాయి.

నైతిక సానుభూతికన్నా అన్నివిధాలా వున్నతమైన ఆధ్యాత్మిక ప్రేమ కేవల సానుభూతిగనే కాక పరివర్త నను కలిగించగల దివ్యశక్తిగా రూపొందుతుంది. మా మూలు రాజకీయ, సాంఘిక, ఆర్థిక [illegible] దృక్పథా [illegible] స్థాయి లేదు; శక్తిలేదు. ఆ సమతకు యేదోవక అసమత సీమగా కొంటూనేవుంటుంది. ఎందుకంటే పై రాజకీయ సాంఘిక, ఆర్థిక దృక్పథాల్లో మానవుల యావన్మందిలోనూ, మానవత్వ వ్యక్తిత్వంలోనూ సం పూర్ణమైన, నిశ్చయమైన తాదాత్మ్యం లభించదు. మరి అంతటి తాదాత్మ్యం అనుభవం కాని స్థాయికి అంతటి శక్తివుండదు.

[illegible] సాత్విక దృష్టికి, రాజసిక దృ ష్టికి, తేడావుంది. రాజసికంకన్నా సాత్వికం మిన్న. కానీ, దివ్యపరివర్తన రావాలంటే, సమాజంలో ప్రతి బింబించాలంటే, సాత్వికమైన భోగదృష్టికూడా పోవాలి, పోయి, కర్మను దాని ఫలాన్ని, జీవశక్తిని, జీవాన్ని, ఈశ్వరునికి అభిముఖం చేసి సమర్పించే ఆధ్యాత్మిక దృష్టి, భక్తి, కలగాలి.

ఆధ్యాత్మికశాస్త్రం వ్యక్తికి మాత్రమే కానీ సంఘా నికి కాదని అనేది పొరపాటు. యింటిలో మాత్రమే వెలుగులో తిరగాలి, బైట మాత్రం కాదు, అని అంటే అందులో యెంత అర్థం వుందో దీనిలోనూ అంతే, తోటి మానవులకేసి చూచినపుడు రాగద్వేషాలు, ఈశ్వరునికేసి చూచినపుడు భక్తి ఇది సమగ్ర ఆధ్యా త్మిక జీవితం కాదు.

సర్వకాలసర్వావస్థలయందూ సచ్చిదానందమనే సత్యదర్పణములోనే తోటి మానవులనూ జగత్తునూ చూడాలి. వ్యక్తి అనీ, సంఘమనీ పూర్తీ విభక్తియతా నికి వీలులేదు. వ్యక్తికే విస్తృతిసమాజం. మానవులు గుణప్రకృతిద్వారా తమ బాంధవ్యాలను రూపొందించు కుంటున్నంతవరకూ దుఃఖము తప్పదు; భేదము తప్పదు. అలా కాక ప్రకృతిద్వారా సచ్చిదానందం ద్వారా, సాటి బాంధవ్యాలను రూపొందించుకొంటే సత్యసాయి నిత్యభావములు, సత్యభావములు, సాక్షా త్కరిస్తాయి. వూహలు పోయినటులంతా పదములు దొర్లకూడదు.

మంచి చెడ్డలు వారివారి భావమార్పులే కానీ, అన్యులస్థితిగతులు కానేరవు. వేదాంతం కానీ నిరీశ్వర వాదన కానీ వ్యక్తిభావములపై ఆధారపడలేదు. అవి వారివారి విశ్వాసములే కానీ పై రెండూ నిరంతరం స్వతంత్రమైనవే. ఒకరు తూలనాడిన కృంగునవీ కాదు మరొకరు వర్ణించిన పొంగునవీ కాదు. పొంగికృంగుట వ్యక్తుల విశ్వాస అవిశ్వాసములే. అవి తాత్కాలిక ఉద్రేకములు. అవి సత్యము కావు.

దైవత్వమిట్టిదని నిర్ణయించుటకు యెవ్వరికి అధి కారము లేదు. కలదని చెప్పువారు, వారి బుద్ధిబలమును ఆధారము చేసుకొని పలికే స్వార్థపు వార్తలు. అందరి యందూ ఆత్మరూపుడు నిండి వుండు. ఈశ్వర త్వాన్ని కాదనుట తనను తాను వంచించుకొనుటే కానీ పరులను కానీ, లేక పరమాత్మను కానీ వంచించుట కానేరదు.

సత్యాత్మభావము సమాజరూపమున విశ్వసించి సమాజక్షేమను సమాజవృద్ధిని గావించు వ్యక్తిత్వం పరమపవిత్రం. ఇట్టి విశాల భావమును, వికాస తలపు లను, విజ్ఞానదృష్టిని, అలవరచుకొనుటే మానవుని ప్రధానకర్తవ్యము. పై మూడూ లేనివాడు, లేక పై మూడింటినీ తిరస్కరించువాడు మానవత్వమును కోల్పో యినజడస్వరూపుడనే చెప్పవచ్చు. సామరస్యం,

త్యాగము, శీలం, ఇవి ప్రధాన మానవతా చిహ్నములు. వాటిని లెక్కచేయని జీవితము జీవితమనిపించుకోదు.

మానవ సోదరత్వమును పక్క దివ్యత్వమైన ఆత్మ తత్వముద్వారా మాత్రమే గుర్తించ వీలగును. అందరి గమ్యము, అందరి ఆశయము, శాంతి, సుఖ, ఆనంద ములు. అవి దైవధనాగారములు. మానవునికి మానవునికి మధ్యనున్న సంబంధబాంధవ్యములను చక్కగా గుర్తించినవారికే అవి లభించును.

మానవులందరూ ఏకైక జాతియైన దైవజాతికి సంబంధించినవారని తలంచుటలోనే మన దివ్యత్వం వ్యక్తమవుతుంది. ఇదే మన అధికారం, సర్వమానవుల సమాన అధికారం. మాత్రమే కాదు, మన మతం, అభిమతం, వ్రతం.

సర్వం ఇదియే : మానవమాత్రులమైనవారందరూ మానవులుగా బ్రతకటం నేర్చుకోవాలి. ఇదే సాధన.

# శుభోదయము

కర్ణాటక రాష్ట్రమందు బెంగళూరు జిల్లా హోసకోట తాలూకా కన్నమంగల గ్రామమందు ఫెబ్రవరి 3వ తేదీన, శ్రీవారి గ్రామోద్ధార పథకముయొక్క ప్రారంభోత్సవము బాబావారి దివ్య సన్నిధియందే చాలా వైభవముగా జరిగినది. భారతదేశమందు లక్షలాది గ్రామములందు లెక్కలేని కష్టనష్టములను ధైర్య సాహసములతో యెదుర్కొని నిత్యజీవితమును సాగించుచున్న గ్రామీణ జనతకు అదొక శుభ దినము ; నవ భారత చరిత్రలో ఒక క్రొత్త అధ్యాయమే ఆ నాడు తెరవబడినది ; శ్రీవారే శెలవిచ్చినట్లు " ఇందు దేశమందు అరుణోదయము కాదు, ఆనందోదయమే జరిగినది ". యువజనాంగమును గ్రామ సేవా కైంకర్యమందు శ్రద్ధా భక్తులతో పాల్గొని లోక కళ్యాణము దేశ క్షేమము ఆత్మోన్నతి వీటిని సాధించుటకు శ్రీవారు ఆ దినము పాంచజన్యముతో పిలచిరి. ఆ పిలుపు శ్రీ సత్యసాయి కాలేజి విద్యార్థుల అధ్యాపకుల హృదయములందు ప్రతిధ్వనించి కర్ణాటక రాష్ట్రమంతట యువజనులను మేలుకొలిపినది. శ్రీ సత్యసాయి కాలేజి విద్యార్థులు అధ్యాపకులు ఇకపై చుట్టూవున్న పల్లెలకు ప్రతివారమూ బయలుదేరి. గ్రామజీవితమందు ఆధ్యాత్మిక దృష్టినివెదజల్లి, సేవా సాధనల ద్వారా గ్రామస్థులకు అవసరమైన అనుకూలములను తమ శక్తి కొలది అందించుటకు పూనుకొన్నారు. ఈ పథకము యే అడ్డూ లేక జయప్రదముగా నెరవేరుననుటకు శ్రీవారి సారథ్యమే ఆధారము.

ఫెబ్రవరి 3వ తేదీ, శ్రీవారి దర్శనాభిలాషులైన వేలాది రైతులు 20, 30, మైళ్ల దూరమందున్న పల్లెల నుంచి కూడ, స్త్రీలు, వృద్ధులు, బాలురు అందరూ, కన్నమంగల గ్రామమును సూర్యోదయసమయమందే చేరి భజనలో పాల్గొని ఆనందభరితులైరి.

కన్నమంగల గ్రామస్థులైన పిల్లయ్య మునిరాజు శ్రీరామ మొదలగు విద్యార్థులు కొంతమంది శ్రీ సత్య సాయి కాలేజి చేరి, చదువుచున్నారు. వారి ద్వారా, శ్రీవారి గుణగణవిశేషములనూ, మహిమలనూ, ఉపదేశ ములనూ, అవతార రహస్యమునూ విన్న పెద్దలు రెండు మూడు సంవత్సరాలుగా, శ్రీవారిని తమతమ గృహ ములందు పూజించి కృతార్థతను పొందుచున్నారు. శ్రీవారిని తమ గ్రామమునకు విజయము చేయవలెనని వారు ప్రార్థించగా, వారి మనోభీష్టము సిద్ధించినది.

గ్రామస్థులందరూ అమితోత్సాహముతో, ఊరంతట శుభ్రపరచి, నయనమనోహరముగా అలంకరించిరి. రోడ్డులంతా తామే రిపేర్ చేసిరి. ఇంటింట ముందు ధ్వజపతాకాలను తోరణాలను కట్టిరి. గోవులనూ ఆవుల కొట్టములనూ సింగరించిరి. గ్రామస్థులకు తోడుగా కాలేజీ విద్యార్థివృందమూ, అధ్యాపకులూ [అధ్యాపకుల సతీమణులూ] గ్రామపరిసరమును శుభ్రపరచుటలో చేరి, సంతోషముగా సహకరించిరి. అదొక అపూర్వ ప్రేమోత్సవము !

సాయంత్రం 4 గం॥ కు శ్రీవారు కారులో కన్న మంగలగ్రామము చేరినపుడు ఊరు సరిహద్దులోనే వారికి తాలూకాలోని పెద్దలందరూ ఘనస్వాగతమొసం గిరి. ఎన్నో నాళ్ల తమ నోము పండినదని, తమ కన్నుల పదవు తీరినదని, తమ పాలిటి కల్పవృక్షము తమ వద్దకే వచ్చినదని, ఆనందించి, కొనియాడిరి. తమ మృదుమధుర వచనములతో తామే ప్రజల మాతా పితా గురు దైవము అని వెల్లడించుచూ శ్రీవారు అంద రినీ కరుణాకటాక్షముచే ఆశీర్వదించిరి. గ్రామవీధులలో నడచివచ్చి, ప్రజలకు నయనానందమునందించిరి. వేదికపై కాలేజీ అధ్యాపకుల మధ్య ఆసీనులైరి.

డా॥ వినాయక కృష్ణ గోకాక్‌గారు ఆ మహాసభ నుద్దేశించి మాటలాడుచూ, శ్రీ సత్యసాయి సేవాసంస్థలు ఆసేతుశీతాచలము ఆచరించుచున్న కైంకర్యములను విపులముగా తెలిపిరి. బాలబాలికల శిక్షణనిమిత్తమై బాలవికాస్ తరగతులు, దేశసేవకు తగు రీతిగా యువ కుల తర్ఫీదుకు సత్యసాయి సేవాదళములు, పెద్దల కాధ్యాత్మిక జ్ఞానాశక్తిని కలిగించి వారి జీవితమును సార్థకము చేయుటకు సత్యసాయి సేవా సమితులు, "మహిళా విభాగ్"లు మొదలగు సంస్థలు చేయు కార్యకలాపములను గూరించి వుపన్యసించిరి. ఈ సంస్థలన్నియూ గ్రామోద్ధరణ కార్యక్రమములలో పాల్గొనుటకు పూనుకొని, దేశోద్ధార కార్యమును సాధిం చును, అనిరి. శ్రీవారి అవతారోద్దేశమైన ధర్మసంస్థా పనము త్వరలోనె జయప్రదముగా జరుగునని నొక్కి వక్కాణించిరి.

"భారత దేశముయొక్క సంస్కృతి, పవిత్రత, అంతస్సత్వము, ఆత్మశక్తి వీటిని సంరక్షించి నిల బెట్టుటకు గ్రామోద్ధరణకార్యము అత్యవసరము ; గ్రామపోషణ అత్యవసరము. యెందుకనగా ఆ సంస్కృతియొక్క విశిష్టలక్షణము అంతో ఇంతో ఇంకనూ మిగిలియుండునది, కనబడేది, కన్నమంగలం వంటి గ్రామములలోనే. నగర జీవనము కృత్రిమము; ప్రేమశూన్యము ; అనుకరణ ప్రధానము. దానిపై వ్యామోహపీడితులైన విద్యావంతులు ఏర్పరచిన శిక్షణ క్రమమువలన, గ్రామ జీవితము కూడ కృత్రిమముగా, అశాంతిగా రూపొందుచున్నది." అని శ్రీవారు శెలవిచ్చి నపుడు ఆ బ్రహ్మాండ సభలోని వేలాది ప్రజలు ఆనందాతిరేకముతో అపుకన్నిరి.

"పిల్లలు బి.ఎ., ఎం.ఎ., డిగ్రీలను సంపాదించి యేదో ఒక పట్టణమందు ఉద్యోగము దొరకించుకొని,

తల్లితండ్రులకు దూరమై వారి సేవచేయుటకు అసమర్థులగుచున్నారు. దొరకే జీతము కూడ తక్కువ కాబట్టి వారి వారి గ్రామమునుంచి బియ్యము మొదలైనవి తెప్పించుకోవలసి వచ్చును ; మాతాపితృలకు వృద్ధాప్యము ప్రాప్తించినపుడు వారు, ఇళ్లువాకిళ్లను విక్రయము చేసి, భూమిని అమ్మి కొడకు కోడలు దగ్గరకు పోతే వారికి ఏది? సరిపోక, అక్కడనూ వుంతలేక, పాతగ్రామమునకు వెళ్లుటకు వీలులేక, చాలా నిరాశపొంది, బాధపడుదురు. డిగ్రీలు పొందినవెంటనే ఉద్యోగమోహమంతు పడకుండ, గ్రామములోనే తల్లితండ్రుల సేవలోనే నిలచిన, అందరికీ ఆనందము, దేశమునకు సుభిక్షము, శాంతి.''

తమ దివ్యోపన్యాసమందు, అన్యోన్యత సర్వ సమాన ప్రేమ, పాపభీతి, దైవప్రీతి, వీటి అభివృద్ధి వలననే గ్రామాభ్యుదయము చేకూరుననిరి. "నేను కాడుగోడి గ్రామములో కాలేజి స్థాపించినది, మీ పిల్లలకు బి.ఎ., బి.ఎస్‌సి , బి. కాం , డిగ్రీలు దొరకించేందుకు కాదు. వాళ్లకు ఉద్యోగాలందించి, వారిని స్వగ్రామములనుంచి తల్లితండ్రుల సేవనుంచి దూరము చేయుటకు కాదు. వారు విద్యావంతులై, వినయసంపన్నులై, సేవాతత్పరులై. వారి వారి గ్రామములోనే నిలచి ఇళ్లు వాకిళ్లు పొలములు వీటిని బాగుగా రక్షించుకొని అభివృద్ధి చేసుకొని తన దివ్యత్వమును ప్రకటించుకొరకే,'' అనిరి.

"విద్యార్థులూ అధ్యాపకులూ నేనూ ఏ గ్రామమునకైనా, గ్రామస్తులందరూ చేరి ప్రేమతో ఆహ్వానించిన ఆనందమునందించుటకు సదా సంసిద్ధులము" అనిరి

స్వాగత పత్రమందు శ్రీ పి. రామయ్యగారు కన్నమంగల గ్రామమందు సోమేశ్వర దేవస్థానము యొక్క జీర్ణోద్ధార కైంకర్యము అత్యవసరమని సూచించిన విషయమును ప్రస్తావించి, శ్రీవారు 'గుడియే గ్రామమునకు గుండె', భక్తి ప్రపత్తులు క్షీణించటము వలన పురాతన క్షేత్రములన్నీ జీర్ణావస్థలో పడినవని తెలవిచ్చిరి. కట్టడములను కట్టిన ప్రయోజనము లేదు ; భగవద్విశ్వాసముతో గుడికి, పరిశుద్ధ మనస్కులై వెళ్లి, జరుపవలసిన కైంకర్యములన్నింటినీ తూచ తప్పక చేయవలెననిరి. గుడిలో యేదైనా తప్పులు జరిగినా దాన్ని దుష్ఫలము గ్రామమునకు తగులును, అని హెచ్చరించిరి. జీర్ణోద్ధార కార్యము అవసరమనియు దానికి కావలసిన సహాయ సలహాలను తాము అందించగలమనియు తెలిపి, గ్రామస్తుల ననుగ్రహించిరి.

"ఆదాయ మెంత తక్కువ ఐననూ దాన్ని దుర్వ్యసనములలో దురలవాట్ల కొరకు ఖర్చుపెట్టక సంసారమందందరికీ కర్తవ్యమెరిగి బాధ్యతను గుర్తించి ఖర్చుపెట్టిన, యెంతో హాయిగా వుండును. గ్రామములో యెవరికి యే కష్టము వచ్చిన, అందరూ దానికి సహాయమునందించి, అనేకత్వములోని యేకత్వమును, సాధించవలెనని ఉపదేశించిరి.

"ప్రతిదినం సాయంత్రము కొంత సేపు మందిరములో కానీ గుడిలోకానీ అందరూ చేరి, భజనలో పాల్గొనిన మనశ్శాంతి దొరకును, మహిళా సంఘమొక్కటిని యేర్పాటుచేసుకొని, స్త్రీలు కూడ కాలమును సార్థక విధానములో వినియోగించవచ్చును. పిల్లలకు సద్బుద్ధిని బోధించి వాళ్లు దుస్సంగమందు చేరి దొంగతనము అబద్ధమాడుట మొదలగు చెడ్డ అలవాట్లలో పడకుంత నీతి నిజాయితితో మెలగునట్లు నేర్పించవచ్చును" అని చక్కని మధుర కన్నడ భాషలోనే శ్రీవారు వుపన్యసించిరి.

శ్రీవారి కృపను, ప్రేమను, ఆశీస్సులను అందు కొని తమ తమ గ్రామమును తరింప జేయుటకు గుంపులు గుంపులుగా గ్రామాధికారులూ పెద్దలూ 'బృందావన' మునకు వచ్చుచున్నారు. 10 వ తేదీ, శ్రీవారు శీగేహళ్లి అనే గ్రామమునకు విజయము చేసిరి. ఆ గ్రామవాసులైన శ్రీ సత్యసాయి కాలేజి విద్యార్థులు, పెద్దల సహాయముతో, అధ్యాపకుల సహకారముతో స్వామివారికి ఘన స్వాగతమొసంగిరి. శ్రీవారు అచ్చట సమావేశమై భజన మొదలగు ఆధ్యాత్మిక కార్యక్రమములలో పాల్గొన్న వేలాది ప్రజలకు ఉజ్జ్వలభాషణము నందించిరి. ఆ గ్రామములో కూడ, సేవాసమితి మహిళా సంఘము, బాలవికాస్ తరగతులు యువక సంఘము మొదలగువాటిని స్థాపించుటకు విద్యార్థులను పెద్దలను ప్రోత్సహించిరి.

భారతదేశపు యువజనాంగమందే కాక గ్రామీణ జనాంగమందు కూడ, శ్రీ సత్యసాయి సందేశమువలన, నవచైతన్యము కలిగి, శాంతిసౌఖ్యముల స్థాపనకు ఈ పథకము ప్రథమ సోపానము.

(సం)

పరమాత్ముని ప్రేమస్వరూపునిగా భావించిన జయదేవ, గౌరాంగ, తుకారామ్, రామదాసు, సూరదాసు, మీరా, సక్కుబాయీలకు పరమేశ్వరుడు ప్రేమస్వరూపుడుగానే, అండయై దండయై నిండు ఆనందమొసగెను. అమాయకపు బిడ్డలు సూర్యుని, అమ్మముఖమునకు బెట్టిన కుంకుమబొట్టువలె భావింతురు. అనుభవజ్ఞులైన పెద్దలు ఆ సూర్యుని తేజోమండలంగా దర్శింతురు. వీటి కారణము వారివారి మనోభావములే కదా? ఇట్లే మానవులు పరమేశ్వరునిగూర్చి విధవిధములుగా సంభావించగలుగుతారు. ఉన్నత సంభావన చేయగలగడం మానవజాతికి సముచితం, సత్ఫలప్రదం. మానవుడు మాధవుని మానవాకారముగా సంభావించుటము సముచితమే, అయితే అప్రాకృత దివ్యమంగళ విగ్రహంగా సంభావించవలెను. ఇది భక్తిభావముల ధర్మము.

—బాబా

# మహా శివరాత్రి—లింగోద్భవము

తనయందు సర్వమూ ఉన్నప్పటికినీ, సుఖశాంతులకు కావలసిన ఆనందమూ, జ్ఞానమూ తనలోనే అఖండముగా ఉన్నప్పటికినీ, మానవుడు నిర్విరామముగా శ్రమపడుతూ, నిజమైన నిత్యమైన సుఖశాంతులను అందుకోలేకపోవుచున్నాడు. తనయందే ఇమిడియున్న శక్తులను గుర్తించక, బయట ప్రపంచములో వెదకుచున్నాడు, నిరాశ చెందుచున్నాడు, తనయందే శాంతి సంతోషములున్నవి అని తెలిసినవారు కూడ, దృఢవిశ్వాసము లేక, అనుమానపడి, తికమకలలో కాలమును వ్యర్థము చేయుచున్నారు.

భూమి క్రిందభాగములో జలము దొరకును; అది సత్యము. అయితే, దాని పైనున్న మట్టిని ప్రయత్నపూర్వకముగా వేరు చేసితే కాని, అడుగునందున్న జలమును పైకి తెచ్చి వుపయోగించుటకు వీలు కాదు. అట్లనే, నిత్యశాంతి అనే జలము కావలెనన్న, విషయవాసనలనే మట్టిని త్రొవ్వి పారవేయవలెను. మన జీవితమే శాంతిస్వరూపము; మన నడకలే ప్రేమస్వభావము; మన హృదయమే సత్యధామము, సరైన మార్గమునునుసరించి ప్రయత్నించిన, అవన్నీ సులభముగా దొరకును.

చెంతనే వుండిననూ శాంతి ప్రేమ సత్యములు నిత్యజీవితమందు అలవరచుటకు యెందుకు దొరకవు? దేహాభిమానము విషయవాసన వీటివలన కామ క్రోధాలు పెరిగి, సామరస్యము సహనము వినయము ఇవన్నీ అదృశ్యమైనవి. భార్య భర్తలు పిల్లలు తల్లి తండ్రులు స్నేహితులలో కూడ రెండు మనస్సులు రెండు భావాలు పుట్టి ద్వేషాసూయాలు అభివృద్ధియగుచున్నవి. భావములలో సమత్వముండదు, ఆదర్శములలో ఏకత్వము అరుదు.

ఏకత్వమే పవిత్రత. అది ఒక భగవత్తత్వములోనే, భగవత్తత్వములోనే లభించును. జీవతత్త్వము నీరు; భగవత్తత్వము క్షీరము. నీరు క్షీరముతో చేరి దానిలో లీనమగును; నీటి విలువ కూడ దానివలన అధికమగును. చేరిన తరువాత ప్రత్యేకించుట కష్టమైన పని. హనుమంతుడు తన భావములన్నిటినీ రామచంద్రుని భావములో లీనము చేసినాడు. సీతాన్వేషణము నిమిత్తమై లంకకు పొమ్మని ఆజ్ఞయిచ్చినపుడు హనుమంతుడు నాకే చెప్పేరి అని పొంగలేదు; ఇంత పెద్ద బాధ్యతను నిర్వహించగలనా అని బెదరలేదు. నా శక్తిసామర్థ్యములను గమనించియే ఈ ఆజ్ఞనిచ్చియుంటారు: ఒక వేళ నాలో అవి తక్కువ ఉంటే, కావలసినదాన్ని అనుగ్రహించి సమర్థునిగా చేస్తారు, అని ఆ విషయమై శంకించలేదు. లక్ష్మణుడు కూడ అంతే. రామాజ్ఞనే ఆయన ప్రాణము. ఒకపుడు, శ్రీరాముడు లక్ష్మణుణ్ణి పిలచి, తమ్ముడా! ఈ అరణ్యప్రదేశము చాలా మనోహరముగానున్నది. ఇచ్చట, నీకిష్టమైన స్థలమొక్కటిని

నిర్ణయించి ఒక పర్ణశాలను త్వరగా నిర్మించు, అని ఆజ్ఞాపించినాడు.

ఆ మాట విన్న తక్షణమే, "హా ! నేనెంత పాపిని !" అని లక్ష్మణుడు నేలపై కూలబడ్డాడు ! శ్రీరాముడు ఆశ్చర్యముతో యేమయినది అని ప్రశ్నించగా, "అన్నా ! నా యిష్టము అని ఒకటి ప్రత్యేకముగా నున్నదా ? రామాజ్ఞనే కదా నా ఇష్టము ? నీకిష్టమైన ప్రదేశమేదో నువ్వే నిర్ణయించి అచ్చట పర్ణశాలను నిర్మించు అన్నది యెంత కఠిన మైన వాక్కు ? ఎంత హృదయ భేదకమైన ఆజ్ఞ !" అన్నాడు. ఇదే సరైన ప్రపత్తి భావము, భగవదాజ్ఞ అనే రథములో కూర్చొని జీవితయాత్రను సాగించ వలెను అపుడే హాయి.

మీరిపుడు ఆ రథమందు కూర్చున్నట్టు భావించు చున్నారే గాని, మీ మనస్సు హృదయము దేహము యేదీ ఆ రథములో లేవు. అట్టి ప్రాప్తికి, కఠిన సాధనలు కానీ, అన్న పానాదుల త్యాగము కానీ అక్కరలేదు. ప్రేమతో స్వార్థరహితమైన బుద్ధితో, నామస్మరణ చేసిన చాలు.

రాత్రంతా మీరు ఆత్మలింగ సన్నిధియందు యేక ధారగా భజనచేసిరి ; దీనికి అఖండ భజన అనే పేరును వాడుదురు. కానీ, అఖండ భజన అంటే, ఇట్టిది కాదు; కొన్ని గంటలు మాత్రము చేసే భజన, ఖండ భజన అనిపించుకొనును. జీవమున్నంతవరకూ, నిరంతరమూ, సోహం భావములో మునిగియుండుటమే అఖండ గాయత్రీ సాధన, అఖండ హంస జపము, అఖండ సోహమ్ ఉపాసన.

మనస్సుయొక్క అధిదేవత చంద్రుడు ; చంద్రమా మనసో జాతః. మనస్సుకు కూడ చంద్రునివలె 16 కళలున్నాయి. కృష్ణపక్షమందు చతుర్దశినాడు ఆ 16 లో 15 క్షీణమై ఇంకొక కళమాత్రము మిగిలి యుండును. చంద్రుడు బింబము ; మనస్సు ప్రతి బింబము. కాబట్టి, భగవత్ చింతనతో రాత్రులన్నీ తినీ పగలు చేసితే, మనోనాశనము ఈ శివరాత్రినాడే జరుగును. ఆశలమూటనే మనస్సు ; ఆశలు లేక పోతే, మనస్సేవుండదు, శివరాత్రియొక్క వైశిష్ట్య మిది ; ఆహారపానీయములందు కూడ మనస్సును పోనీయక, జాగ్రత్తగా దానిని పరమేశ్వర స్మరణలోనే వుంచితే, మనోనాశనము సిద్ధించును అనేది శివరాత్రి బోధ.

యేదో ఒక రకమైన ఆవేదనతో, ఇక్కడికి రావలెయు ననే ఉత్సాహముతో మీరందరూ, ఇటువంటి సన్నివేశ మందు ఇటువంటి సమావేశములో ఇటువంటి సన్నిధి లో హాజరగుటకు నిజముగా చాలా పుణ్యశాలులే. ఇన్ని కోట్ల జీవరాసులలో మీరు మాత్రం రాకలిగినా రంటే, లింగోద్భవమును చూడగలిగినారంటే, మీ జన్మలు సార్థకమైనవియనుటకు సందేహములేదు. మీరింతవరకు యెన్నో మహాపవిత్రమైన, వేదవిహిత మైన కర్మలయందు, సత్సంగములయందు పాల్గొని యుండవచ్చు, అయితే, వేదోపనిషత్తులలో కపిల దేవుడు ప్రబోధించిన కాలదేశాత్మకమైన దశాంగుల స్వరూపమైన మండలాకారమైన లింగము, లింగ స్వరూపునియందు, ఉద్భవించిన మహాముహూర్త మును తిలకించి తరించే పుణ్యము మీకు మాత్రమే లభించినది.

అవతార సమయములో దేవతలందరినీ రండీ రండీ పవిత్ర దర్శనము చేసుకొండీ అని కపిలదేవుణ్ణి తల్లి కేకవేసింది, కాబట్టే ఆమెకు "దేవహూతి" అనే పేరు వచ్చినది; ఇటువంటి పవిత్ర దర్శనము మీకు లభించటమువలన మీకి జన్మసార్థకత చేకూరినది.

తిరిగి జగత్తత్వ సంబంధమైన జనన మరణములు మీకు లేవు! దాన్నిగురించి మీకు చింతించనక్కర లేదు.

మీరు దర్శించిన లింగోద్భవమునే జీవితమంతా చింతన చేయుచూ, ఆనందముగా ఏకాగ్రతతో ధ్యానించండి. "యెవరికీ సులభముగా దొరకని లింగోద్భవమును చూచినాము; లింగముయొక్క దివ్య ప్రకాశమును సందర్శించినాము" అని సంతోషించండి. "దశాంగులం" అనే మంత్రరీత్యా దీని చుట్టుకొలత, పది అంగుళములు; దీనిలోపల జ్యోతిరూపముగా శివుని త్రిశూలము కనుపించుచున్నది. త్రికాలము త్రిలోకము త్రిగుణము ఏకత్వముగా సూచించు త్రిశూలమది. కాలము, 360 దినములు, 60ఘడియలు, 60 విఘడియలు అని, 10, 10 అంకెలకు సంబంధించి పెరుగును, అని నేను నిన్న చెప్పినట్లుగా, ఈ లింగమందు మరొక విశేషము సదా జరుగుచునే యున్నది! అది యేమనగా, 10, 10 నిమిషముల కొకసారి, ఉన్నట్టుండి, ఈ త్రిశూలము క్రొత్త క్రొత్త వర్ణవైఖరితో ప్రకాశించును.

మీరందరూ, ఈ దివ్యసృష్టిని తిలకించి ఆనందించిరి; ఈ దివ్యస్వరూపమును దర్శించిరి; ఈ పవిత్ర సమావేశమందు పాల్గొనిరి. ఈ ప్రాప్తిని పురస్కరించుకొని, పదార్థములో అంతర్గతమైన పదార్థమును స్మరించుకొని, ఈ ప్రకాశమును ధ్యానించుకొని పవిత్ర క్రియలతో, పవిత్ర తలంపులతో, పవిత్ర వాక్కులతో ఇకపై నిత్యజీవనమును పవిత్రము గావించండి. క్షణక్షణమూ, మీకు మీరే హెచ్చరించుచూపోండి. అదే నీ బాధ్యత.

శ్రీవారి దివ్యబోధ, 21–2–74, ఉదయము.

## నందీశ్వరుడు

ఒక ఉపమానము తెలిసిన, ప్రాచీనధర్మ మెట్టిదో, యిప్పటి అర్థమెట్టిదో, మీకు బోధపడగలదు. శివదేవాలయములు చూడని భారతీయుడుండడని తలంతును. ఆ దేవాలయములో శివుని కెదురుగా ఒక నందిని చూతుము. వాటి భావమేమని? ఇప్పటి అర్థము ఈశ్వరుని వాహనమైన ఒక కోడె యనియు బసవన్న అనియు తలంతురు. కానీ, ప్రాచీనకాలపుయొక్క శాస్త్రము వేరు! శివలింగం ఈశ్వరప్రతీకం అనియు, నంది జీవ ప్రతీకం అనియు జీవేశ్వరులమధ్య విభేదం చూడగూడదనియు, శివలింగానికి నందికి మధ్య యెవ్వరూ పోకూడదనియు, ఆలయాచారము! నంది శృంగమధ్యములోనుంచి శివలింగదర్శనం చేయడం మహాపుణ్యమని ఇప్పటివారు భావింతురు; ఎందుకనగా యధార్థమయిన అర్థమును తెలియనివారగుటచే! కానీ, దాని అంతరార్థము అదికాదు. జీవునిలో శివుని దర్శించమనియే పరమార్థము. పశువు, పశుపతికి వాహనము, అనగా అంకితమైనపుడు, నంది ఈశ్వరుడను రెండు రూపములు, రెండు భావములు, కాక అపుడు నందీశ్వరుడును ఒకే నామరూపములను స్వీకరించును అప్పుడు అది ఆరాధనీయమవుతుంది. పశువు ఈశ్వరార్పితమై ధన్యత గాంచటమే యధార్థ పరమార్థము. —బాబా

# విద్యయొక్క విశిష్టత

(శ్రీ వారి దివ్య లేఖ)

ప్రశాంతి నిలయం, 18–1–74

ధార్మిక మహోదయులారా! అందుకొండి ఆశీర్వాదములు. ప్రశాంతినిలయము చేరినది మొదలు, మీకీ కమ్మని కమ్మ వ్రాయ సంకల్పించితిని. అయితే అనేకమంది భక్తులు దూరప్రాంతములనుండీ వచ్చి వేచియుండుటచే వారలను శాంతపరచి పంపుటలో కొంత ఆలస్యమాయెను.

దివ్యాత్మస్వరూపులారా! ఒకపరి కనులు తెరచి పరికింపుడు, మన పురాతన మహోన్నతస్థితిని. నేటి మానవ దుస్థితిని ఒకపరి బాగుగా విమర్శించు కొనుడు. మన పరిస్థితి పర్వతాగ్రమునుండి క్రింద బడినవాని స్థితివలెలేదా? ఆధ్యాత్మిక, భౌతిక, వైజ్ఞానిక, ఆర్థిక విషయములలో అన్నింటగూడా ఆనాడు ధర్మమువలన అత్యున్నతస్థితి నొందియుంటిమి. భగవదాజ్ఞారూపమగు శ్రుతిస్మృతులచే విధింపబడిన ధర్మమును అత్యాదరభావముతో ననుసరించుచూ పరస్పర సౌహార్దముతో మెలంగుచు మనము సభ్యత యొక్క పరాకాష్ఠనొందియుంటిమి. నేడో అత్యంత విపరీతస్థితినొందితిమి. ఆధ్యాత్మముగ, వైజ్ఞానిక ముగ, ఆర్థికముగ ఎటుచూచిననూ మానవులు అతి నీచస్థితిలోనున్నారు. భగవానుడు మానవులనుద్ధ రించవలెననునాశయముతో శ్రుతిస్మృతుల ద్వారముగ విధించిన ధర్మముల పరిత్యజించుట జరిగెను. పర స్పర విద్వేషములతో కార్యభావముల వెళ్లగక్కు కొనుచు ప్రపంచశాంతికి భంగము కలిగించుచున్నా ము. భగవదాజ్ఞలనతిక్రమించుటయే ఈ ప్రపంచ శాంతిరాహిత్యమునకు ముఖ్యహేతువు.

నేటి దారిద్ర్యమునకు, నిస్సత్వమునకు, ఆధ్యా త్మికజ్ఞానరాహిత్యమునకు ముఖ్యకారణము భగవదాజ్ఞా రూపమగు ధర్మమునతిక్రమించుట కాదా? ఇప్పటి కైనా కొందరీ విషయము నన్వయ వ్యతిరేకములచే నిశ్చయించుకొని, జగత్కల్యాణ హేతుభూతమగు ధర్మోద్ధరణమునకు పాటుపడుచుండుట యనునది మన మందరు ఆనందింపతగిన విషయము. యేది నశిం చుటచే నెయ్యది నశించుచున్నదో దానిని రక్షించుటయే రెండవదాని రక్షణకు ముఖ్యోపాయమను సూత్రము సర్వసంప్రతిపన్నమే కదా! ప్రస్తుతము ధర్మ క్షైణ్యముచే జగత్ప్రశాంతి నశించుట మనము చూచుచున్నదే. జగత్కల్యాణమును మనము కలిగించతలచినపుడు, అట్టిధర్మము నుద్ధరించుటయే ముఖ్య కర్తవ్యము కదా!

అధ్యాపకులారా! యిప్పటికైనా మేల్కొని ధర్మ రక్షణకై పాటుపడుట ముఖ్య కర్తవ్యము. నేడు కొందరు భారతీయ ధర్మమును సమూలముగనున్మూ లింపనుద్యోగించుచున్నారు. వారి ప్రయత్నముల మనమెదుర్కొనవలసియున్నది. అట్టి ప్రతిఘటనమే మనమొనర్పనిచో ధర్మము నిర్మూలము కాగలదు.

నాగరికతా వ్యామోహమోహితులగు కొందరు "సంఘసంస్కర్తలను" గౌరవ నామమును వహిం చుచు సంఘమునే ధర్మదూరముగ చేసి చెడగొట్టుటకు పలుభంగుల యత్నించుచున్నారు.

ధార్మిక వరేణ్యులారా ! మన మేధర్మమునకై ధన మాన ప్రాణముల లెక్కించక పోరాడుటకిచ్చగించు చుంటిమో ఆ ధర్మము పేరే "సనాతన ధర్మము". సనాతనమనగా నిత్యము. లెండు ! సంసిద్ధులు కండు! ఏతెంచినది మీ యనన్యతేజః పరాక్రమముల ప్రకటింప వలసిన కాలము !

అఖండ తేజంబున వెల్గొందిన భారతావనిలో జన్మించిన మీరు, స్వీయ ధైర్య స్థైర్య పరాక్రమ ధర్మ పరత్వములకు పుట్టినిండ్లై యన్యాప్రతిధృష్యులై వెల్గొందిన హైందవ మహావీరులయందుద్భూతులైన మీరు, స్వీయ తపః పరాక్రమాది శక్తుల ముల్లోకముల సైతము గడగడలాడించిన భార్గవ, కౌశిక, వశిష్ఠ, భరద్వాజ, కశ్యపాది మహర్షుల పరమపవిత్ర వంశ సంజాతులగు మీరు, ప్రాణోత్కృష్టమగు ధర్మమునకు హాని వాటిల్లుచుండ పిరికివారలవలె, పరాక్రమ విహీనులభంగి ప్రయత్న రహితులై యుదాసీనత వహింపనగునా ? లోక కల్యాణమునకు బద్ధకంకణులగు మీకు భగవానుడు తోడౌట తథ్యము !

రానురాను ప్రతిదానియందును సంస్కరణమేర్పడు చున్నది క్రమశః అది విద్యావిధానమున కూడా యేర్పడజొచ్చినది. పూర్వము సకాలోపనీతులై యథా శాస్త్రముగ నధ్యయనమొనర్చెడివారు. కాలగతిచే పాశ్చాత్యులు ప్రభువులగుటచే తద్భాషాభ్యాసమున ద్వితీయ పురుషార్థమగునర్థము లభించుటను ఆశతో అనేకులు పాశ్చాత్య విద్యాభిమానులైరి.

పూర్వము అధ్యాపకులు విద్యతోపాటు భగవత్భక్తి కూడ అలవడునట్లు చేసెడివారు. అందువలననే వారలకు ఆధ్యాత్మిక విజ్ఞాన మెక్కుడుగనుండెను. వారల ప్రతికృత్యముకూడా ఆముష్మికమునిచ్చునదై యుండెను.

దేశ, మత, సంస్కార రహస్యముల నెరిగిన గురువుల సన్నిధిని బాలబాలికలు విద్యనభ్యసించెడివారు. ఇపుడో అధ్యాపకులకే సంస్కారమన్ననేమో, ఆధ్యాత్మికమన్ననేమో, మతమన్ననేమో తెలియక పోవుటచే పిల్లలు తమ హృదయాలకు చల్లదనము నందుకోలేకపోవుచున్నారు.

పాశ్చాత్యనాగరికతా వ్యామోహితులునగు గురువుల నాస్తికమత ప్రచారకములును, వేద అప్రామాణ్య సూచకములును, హిందూమత నాశకములును నగు హిష్టరి మొదలగువాటిని చెప్పుచుండుటతటస్థించుచున్నది. ఇట్టి విధానమును అనుసరించునది విద్య యనబడునా ? అట్టివాటిని చెప్పువారు గురువులనదగునా ? విద్య అనగా భగవంతుని దివ్యశక్తిని, అంతర్గతమైన ఆత్మతత్త్వమును తెలుపునదే విద్య. అదియే దాని ముఖ్యార్థము.

ఆధ్యాత్మిక చిత్తములు లేకపోవుట చేతనే అల్లకల్లోలములలో పాల్గొని, అవిద్యాప్రవర్తనలకు గురియయి అంధులకంటే హీనస్థితికి వచ్చి హాస్యాస్పదులగు చున్నారు. విద్యాసంస్థలకే వికృతరూపము తెచ్చుచున్నారు.

అధ్యాపకులారా ! మన కాలేజిలో కొంతవరకు ఉన్నతభావములు మహోన్నత కార్యములు చేపట్ట వలసియున్నది. మీరందరూ ఉల్లాసవంతులుగను ఆధ్యాత్మికభావ ప్రియులుగను, సాయి అభిమానపాత్రులుగను వుండుటచే నాలోని భావములను మీ కందించ తలంచుచున్నాను.

1 మనము కాలేజిలో పాఠములు చెప్పినంత మాత్రమున పిల్లలలో ఉన్నత స్థితి తగినంతగా యేర్పడదు. మొక్కనాటినంతమాత్రాన అది వృక్షము కాదు దానికి తగిన భద్రత, పోషణ, మధ్య మధ్య జరుపవలసిన కలుపులు అత్యవసరము.

2. అమాయకులగు పల్లెపిల్లలను ఆంగ్లభాషాభిమానులుగా తయారుచేసి నిత్యజీవితమున వినయ విశ్వాసములను కోల్పోవునట్లు గావించుట క్షేమకరము కాదు. విద్యార్థులను ఉద్యోగ అర్హులుగా చేసినంత మాత్రమున నీతినిజాయితీలను పెంపొందించుకొనలేరు. ఇంటిలో తలిదండ్రులకు తగిన రీతిగా తోడ్పడి వారల మన్ననలను అందుకొనువారలుగా తయారుచేయ వలెను.

3. ఉన్న 200 పల్లెపిల్లలలో 20 లేక 30 పిల్లలను ఒక్కొక గుంపుగా చేసి వారల బాధ్యతలను ఒక్కొక టీచరు స్వీకరించి వారు దేనియందు వెనుకయుందురో ఆ సబ్జెక్టును తగిన రీతిలో అభి

వృద్ధిపరచి, వారి తలిదండ్రులతో కొంత సంబంధ బాంధవ్యములను కలిపించుకొని అబ్బాయి స్థితిగతులను కనుగొనుచూ అతనిలోని ఉత్తమ భావములను పోషించుటకు తగిన చర్య తీసుకొనవలెను.

4. చిన్న చిన్న పల్లెలలో దురభ్యాసములు, దుశ్చింతలూ. దుష్టపలుకులూ సులభముగా నివారించుటకు తగిన పద్ధతిని కలిగించాలి. అపుడే చదివిన విద్యార్థికూడా తగిన గుణములను పోషించుకొనును. లేకున్న చదువునంతవరకే, తరువాత పల్లెకు వెళ్లిన తోడనే వారి నడతలు. వారి మాటలు వారి చేష్టలు అలవడును కాన మన కాలేజీలో చేరిన ఒకొక పల్లె పిల్లలతో ఆయా పల్లెలలో ఒకొక ఆధ్యాత్మిక సంస్థను స్థాపించి, యే జాతి, మత. కుల, భేదములకూ స్థానము లేక, కలహములకు, కక్షలకు గురికాక గ్రామాలు బాగుపడునట్లు చూచుట ప్రధాన విద్యామార్పు కాగలదు.

5. వారమునకొక పరి లేదా, 15 దినములకొకపరి టీచర్లు పిల్లలను చేర్చుకొని కొన్ని ఉన్నత ఆశయాలను ప్రబోధించుచు వారి వారి గ్రామములకు వెళ్ళి అభివృద్ధి కార్యక్రమములలో కంకణము కట్టుకొనుట మంచిది. దానికి తగిన యేర్పాట్లు మీరు గావించిన నేను వచ్చి ఈ ఫిబ్రవరి, మార్చి నెలలలో మన మందరమూ ఒకొక పల్లెకు వెళ్లి ఒకొక సంస్థను స్థాపించి, ఆ గ్రామములను తగిన రీతిగా ఆదర్శ గ్రామములుగా చేసినవాడే విద్యయొక్క విలువ వికసించి ప్రకటించి పవిత్రము గావించుకొన్నవారమగుదుము.

6. ప్రతివానికి ఉపాధ్యాయులు ఆదర్శవంతులు కావలెను. అపుడే విద్యార్థులు అనుసరింతురు మన కాలేజీ యిట్టి ఉన్నత ఆదర్శాలను అందించుటలో ప్రప్రథమము నాయకత్వము వహించవలెను. ఇది వ్యక్తిగతమైనది కాక సర్వమానవులకు సమత్వ పద్ధతిలో నడువవలెను.

7. పిల్లలతో మీరు గుంపులుగా మాట్లాడి యెవరికి వారివారి గ్రామములతో అట్టి ఆధ్యాత్మిక సంస్థలను స్థాపించుటకు కుతూహలముగా ఉండునో ఆయా గ్రామములలో తగినరీతి యేర్పాట్లుగావించిన నేనే స్వయంగా వచ్చి ఆ గ్రామములలో ప్రారంభించి గ్రామప్రజలకు తగిన ఉత్సాహమును అనుకూలమును అందింతును. మొదట ఈరీతిగా మనము చిన్న చిన్నగ ప్రారంభించి, పల్లెలను ఈ రాజకీయ రాక్షసత్వమునుండీ విడదీసి సాత్వికభావపరిపూర్ణులు గావించుటే విద్యయొక్క విశిష్టత.

8. పల్లెపిల్లలు ఒకటి రెండు చూచిన తదుపరి ప్రతిపిల్లవాడు ముందుకురాగలడు. వారలకు విద్యతో పాటు వినయము, వినయముతోపాటు ఆధ్యాత్మిక విజ్ఞానము అత్యవసరము. అది లేకపోవుటచేతనే విద్యవుండీ మూర్ఖులవలె, అంధులవలె నిత్యానిత్య విషయజ్ఞానమును కోల్పోయి కక్షలతో కల్లోలములలో దిగి మానవత్వమునే మంటగలుపుకొంటున్నారు. మానవులు మానవులుగా బ్రతికిన చాలు ; రాక్షసులుగా తయారు కాకుండా సమాజమును పాడుచేయకుండా దేశమును భూకంపమునకు లపాలుగావించక చూచుకొనవలెను. ఈవిధమైన చర్యను మనము చేపట్టకున్న మన పిల్లల భవిష్యత్తు భయభ్రాంతులకు గురికాక తప్పదు

9. మీరందరూ చేరి ఈ విషయమున తగిన శ్రద్ధ తీసుకోవలెను. శ్రద్ధలేనివారిని నిర్బంధించనక్కర లేదు. ప్రీతితో, శ్రద్ధాభక్తులతో కావించువారు 5, 6, మంది ఉండినచాలు. అభిరుచియుండిన, అందరూ పాల్గొన్న మరింత ఆనందము. మన సంస్థలో నిర్బంధమేమాత్రము ఉండకూడదు. మీకు ఈ కార్యములో పాల్గొనుటకు వక కారైనా యిచ్చి తగిన తోడు జరుపుదును. యెంతకాలమునుండియో యున్న నా భావములు ఈ పవిత్ర సంక్రాంతిలో మీ ఉత్సాహములను పురస్కరించుకొని వెలువరుచున్నాను. తగిన చర్యలు తీసుకొందురుగాక.

# మహాసమ్మేళనము

కర్ణాటక రాష్ట్రపు "భగవాన్ శ్రీ సత్యసాయి సేవా సంస్థల కార్యకర్తల మూడవ మహాసమ్మేళనము" మార్చి 17వతేదీ, భానువారమున బెంగళూరు నగరములోని లాల్‌బాగ్ ఉద్యానమందు సిల్వర్ జూబిలీ సభామంటపమున, శ్రీ వారి దివ్యసన్నిధియందు జరిగినది. అన్ని జిల్లాలనుండి కార్యకర్తలు 400 మంది అమితోత్సాహముతో బెంగళూరు చేరి సమ్మేళనయందు పాల్గొనిరి. వేలాది ప్రజలు ఉద్యానమందు ఆసీనులై శ్రీవారి దర్శనభాగ్యమునందుకొని, వారి దివ్యోపన్యాసములను శ్రద్ధతో ఆలకించి కృతార్థులైరి.

ఉదయం 9గం॥లకు శ్రీవారు సభామంటపమునకు విజయముచేసి, ప్రశాంతి పతాకను ఎగరవేసి, వేద సామ్రాట్ బ్రహ్మశ్రీ కామేశ్వర ఘనపాఠిగారిచే వేద పారాయణము జరుగుచుండగా, దీపమును వెలిగించి, సమ్మేళనమున ప్రారంభోత్సవము నెరవేర్చిరి. బెంగళూరు జిల్లాధ్యక్షులైన డా॥ పి.ఎస్ రావు D.Sc. గారు, "ఈ సమావేశమును కాన్ఫరెన్స్ అని వివరించేది సత్యముకాదు; ఇది నిజముగా సాయిమాతా సంతానముల పునర్మిలనము" అని సెలవిచ్చిరి. కర్ణాటక రాష్ట్రాధ్యక్షులైన డా॥ ఎం. బి. సుందరరావ్ M.B.B.S. గారు, "ఈరాష్ట్రపు సేవాసంస్థల కార్యకర్తల మూడు సమ్మేళనములూ భగవానుని దివ్య సన్నిధియందే వారి దివ్యఆశీస్సులతోనే వారి దివ్యోపదేశానుగ్రహముతోనే జరిగెననేది ఒక భాగ్యవిశేషము" అని వెల్లడించిరి.

తరువాత, డా॥ వినాయక కృష్ణ గోకాక్‌గారు సభ్యులనుద్దేశించి ఉపన్యసించుచూ, "ఆధునిక జగత్తులో ప్రచారమగుచున్న రకరకములైన దర్శన వికార విశేషములనుదహరించి, వాటి వాదములకు సాయిభక్తులు సంవాదరూపమైన ప్రతిక్రియనందించ వలెననియూ, దానికి ముఖ్యముగా శ్రీవారి పదకమలములపై దృఢమైన శ్రద్ధను పెంచుకొనవలెననియు నొక్కి వక్కాణించిరి.

బుద్ధియే సర్వోత్తమమైన జ్ఞానోపకరణము అనే వాదముయొక్క బలము తగ్గినదనియూ, హృదయమును సంస్కరించిన, భావశుద్ధివలన, సుజ్ఞాన ప్రజ్ఞాన విజ్ఞానములను సంపాదించుట సులభమనియూ చెప్పిరి. శ్రీవారు ఉపదేశించు మార్గమునను సరించితే, హృదయ సంస్కరణ సులభసాధ్యమనిరి. మనలోని అంతశ్శక్తిని ప్రబోధించి, సాధనామార్గమందు చేయూతనొసగి, గురిని చేరేవరకు వెంటనే ఉండునే కంటి రెప్పవలె కాపాడుటకు ఒక గురువు అత్యవసరమనియూ, శ్రీవారి అవతారము ముముక్షువు లందరికీ —వారు యే దేశములోనున్న, యే సోపానములోనున్న యే నామరూపములనాదరించి ఆరాధించుచున్న— ప్రోద్బలమందించి సాక్షాత్కారము నొసంగుటకే, అని విశదీకరించిరి. సైన్స్‌యొక్క అభివృద్ధివలన, సత్ చిత్ అనే భగవల్లక్షణములను, సర్వభూతాంతర్యామియైన ఆత్మలక్షణములను అంతో ఇంతో మానవుడు తెలుసుకోగలుగుతాడు. అయితే, ఆనందమనే మూడవ లక్షణమును సైన్సుయొక్క ప్రక్రియవలన అందుకొనేది కాని పని, అన్నారు,

శ్రీవారు తమ దివ్యోపన్యాసమందు, భారతమాత యొక్క ప్రపంచవ్యాప్తిగావించిన పవిత్రతకీర్తిని భారతీయులు, సత్యసాయి సేవాసంస్థల ద్వారా, ఏ రీతి నిలబెట్టగలరని ఉద్బోధించిరి. కర్తవ్యకర్మలను గుర్తించి చిత్తశుద్ధితో పరమాత్మప్రీతిగా వర్తించినపుడే భారతీయులుగా జన్మించినందుకు సార్థకత, అనిరి.

మూడవ మహాసమ్మేళనమునకు 'ప్రారంభోత్సవము' అనేది సమన్వయము కాదు; ప్రతి సంవత్సరమూ ప్రారంభము చేయవలెననేది ఒక భ్రమ; మీరు ఇపుడు చేయవలసిన కర్తవ్యము, మననమే కానీ ప్రారంభము కాదు, అనిరి. ఏ ఉద్దేశముతో సంస్థలు ఏర్పడినవి, ఆ ఆదర్శములను సాధించుటకు చేయవలసిన సాధనలేమి, ఇంతవరకు సాధించిన ఫలితమేమి, అని మీకుమీరే పరీక్షచేసుకొని, ముందు చేపట్టవలసిన కార్యక్రమములను నిరూపించడము మీ పని. సత్యమార్గమును అవలంబించి, దానినే అనుసరించి ప్రకృతివిజ్ఞానమునూ ఆత్మవిజ్ఞానమునూ సంపాదించిన, ఆనందపిపాస తీరును; నిత్యానందము దొరకును, అని బోధించిరి.

కర్తవ్యమును గుర్తించి, దానిని నిర్వహించుటలో ఉత్సాహమును అభివృద్ధి చేసికొని, సంస్థయొక్క పవిత్రతను పురస్కరించి పాలించుకొని రావాలి. అది మీ బాధ్యత. స్వామియొక్క ఆజ్ఞలను ఆదేశములను ఆచరణలో పెట్టి అన్యులకు ఆదర్శప్రాయులుగా మెలగాలి. ఏ విషయమును తీసుకొన్నా, దాని ప్రథమపాఠములకు ఎ. బి. సి. అని పేరు పెట్టేది వాడుక. మీసేవా కైంకర్యముయొక్క ప్రథమపాఠములు కూడ, అంతే! ఏ. బి. సి. Always be careful. "సదా జాగ్రత, జాగ్రత" అనేదే. ధర్మజునికి దేహబలము బుద్ధి బలము కలిగిన భీముడు ఒక భుజము! నిర్మల హృదయుడైన అర్జునుడు (అర్జున అనే పదమునకు, శ్వేతవర్ణము, నిర్మలత్వము అనేది అర్థము) మరొక భుజము. మీ మీ ధర్మాచరణకు కూడ బుద్ధిబలము గుణబలము రెండూ తోడుగా వుండవలెను; అవి లేక మీ సంకల్పములు ఫలించవు.

కార్యకర్తల బాధ్యతను గురించి చెప్పుతూ శ్రీవారు అందరూ సంతోషముతో ఉత్సాహముతో భజనలోనూ నగరసంకీర్తన కార్యక్రమములోనూ పాల్గొనవలెనని బోధించిరి. తమ పిల్లలను సేవా దళములో చేర్చిన తరువాత, ఇతరులకు సేవాదళముయొక్క శ్రేష్ఠతను గురించి ప్రచారము చేయుట మంచిది అన్నారు. అయితే, ఎవరినీ నిర్బంధము చేయనక్కరలెదు; శ్రద్ధ లేకపోతే ఉత్సాహము లేకపోతే, అధికారస్థానముల నుంచి తప్పించుకొనేది మంచిది. కానీ తానూ చేయక ఇతరులకూ అవకాశమీయక పదవులకు మాత్రం ఆశపడేది దేశద్రోహమే అగును అనిరి. అన్నలక్ష్యము కాదు ముఖ్యము; ఆత్మలక్ష్యమే ప్రధానము, అని బోధించిరి.

సాయంత్రము 4 గం॥ కు చేరిన సమావేశమందు (1) మహిళావిభాగ్ సంస్థలకు సమితి సదస్యులు అందించవలసిన సహాయ సహకార సౌలభ్యములు (2) జనతా కల్యాణమును సాధించుటకు గ్రామీణ జనాంగమునకు వైద్యసహాయ, విద్యాసహాయ కార్యక్రమములు (3) బాలవికాస్ కార్యక్రమమును అభివృద్ధి చేయుటకు అవలంబించవలసిన విధానములు (4) యువజనాంగమునకు భారతీయ సంస్కృతియొక్క తత్త్వములను సత్ సంప్రదాయములనూ ప్రబోధించుట—ఈ నాలుగు విషయములను పరిశీలించిన ఉపసమితుల సలహాలను వాటి కన్వీనర్లు సభ్యులకు తెలిపిరి. కర్ణాటకరాష్ట్రపు పూర్వ పశ్చిమ ఉత్తర దక్షిణ జిల్లాలకు ప్రత్యేక జోన్‌లో కన్వీనర్ల పేర్లను ఆయా జిల్లాల సంస్థల కార్యకర్తలు సూచించిరి

తరువాత శ్రీవారు తమ దివ్యోపన్యాసమునందించిరి. "మృణ్మయమైన దేహములో చిన్మయమైన ఆత్మవిరాజమానముగానున్నది. మట్టిలోనే రత్నము లున్నవి, వెండి ఇనుము మొదలగు లోహములూ ఉన్నవి. అయితే, రత్నమునకు విలువ యెక్కువ; ఎందుకంటే, రత్నములు అన్ని స్థలములలోనూ దొరకవు. పవిత్రమైన దివ్యత్వము నిండియున్న స్థలమందే ఆధ్యాత్మిక రత్నము దొరకును, అని బోధించిరి.

ఒకే క్లాసులోనే నిరంతరమూ చదువుతూ వుంటే, అభివృద్ధి ఎట్లగును? ద్వైతమునుంచి విశిష్టాద్వైతమునకూ, విశిష్టాద్వైతమునుంచి అద్వైతమునకూ ముందు ముందుకు పోతుండాలి.

అర్చన అభిషేకము పూజ నైవేద్యము షోడశోపచారములు అని బాహ్యవిషయములలోనే మనస్సు చలించిన, హృదయాంతరాళమందు ఏనాడు భగవంతుని ప్రతిష్ఠచేసికొని ఆనందించేది? పూలహారములు ప్రైమరిక్లాసు సరే. రాను రాను, అనిత్యమైన దాన్ని అర్పించిన ఫలితము కూడ అనిత్యమే, అనే జ్ఞానము కలుగవలెను. అహింసా ప్రథమం పుష్పం, అనే భావము అంకురింపవలెను మనోవాక్కాయ కర్మలంతా ప్రేమపూర్ణముగా మారాలి. తరువాత, రెండవ పుష్పం, ఇంద్రియ నిగ్రహం. కోపతాప ఈర్ష్యాసూయలను త్యజించడముకూడ ఇంద్రియ నిగ్రహమునకు చేరినవే. మూడవది, సర్వభూత దయా పుష్పం. నాల్గవది శాంతి పుష్పం. దూషణ భూషణలను సమముగా భావించి, నిరంతర మధుర వచనములతో ఉండడమే శాంతి. ఐదవది తపః పుష్పం. ఆవేదనే తపస్సు, భగవంతుణ్ణి పొందాలి అని, తహతహలాడుచూ ఆ స్మరణలోనే వియోగ

దుఃఖములోనే తపించడమే, తపస్సు. ఆరవది సత్య పుష్పము; అన్నిటికన్న విలువైనది, పరిమళము నిండినది, సత్యము. ఇట్టి పుష్పములతో పూజ సలిపిన, భగవంతుడు సుప్రీతుడై సుప్రసన్నుడౌతాడు, అని శ్రీవారు సెలవిచ్చిరి.

పరమాత్ముడే నరాకారమును ధరించి, "My Life is My Message" అని ఉపదేశించి అందరినీ తరింపజేసే స్వామిని అనుసరించితే చాలు, జన్మ సార్థకత లభించును. ఈ సమ్మేళనము కూడ ఒక నెపము మాత్రమే. మీకు పరమాత్ముని సన్నిధిలో కొంతసేపు ఉండటానికి అవకాశమీయుట, దర్శన స్పర్శన సంభాషణ శ్రవణభాగ్యము నొసంగుట, ఇవే పరమ లాభములు.

భారతదేశపు స్థితిగతులు విచారకరముగానున్నవే అని మీరు కంగారుపడనక్కరలేదు. ఈ పవిత్ర దేశమునకు సుఖసంతోషములు శాంతి భద్రతలు త్వరలోనే సిద్ధించును అనే దృఢవిశ్వాసముతో ధైర్య స్థైర్యములతో మీమీ కార్యక్రమముల ఆచరణకు మీరు కంకణధారులుకండి. అతి శీఘ్రముగానే యువకులు ప్రభుత్వము ఆస్తికులు అందరూచేరి భారతముయొక్క సత్కీర్తిని నిలబెట్టుదురు. సమస్తలోకాస్సుఖినోభవంతు అని సాయిసంస్థల సభ్యులందరూ సర్వమానవ సమాన ప్రేమతో ప్రార్థన సలుపండి ఉత్తమ ఆదర్శముల నాచరించి అనుసరించి మీ మీ జీవనయాత్రను సాగించండి

మీ సేవయే మీకు అధికారమునిచ్చును, అధిక స్థానమునందించును. మీరు సేవను సలుపకపోయిన, మీకు అల్పస్థానమే దొరకును. సేవకుడు కాక, నాయకుడగుటకు వీలులేదు. కొన్నికొన్ని స్థలము లందు సంస్థయొక్క ఆదర్శములకు విరుద్ధముగా కొంతమంది స్వామి మా మూలకముగా ఆదేశమీయు చున్నారు, మాకు ఈరీతి అనుగ్రహమిచ్చినారు, ఆదేశమందించినారు అని ప్రచారముచేయుచున్నారు. వీరికి దోహదమిచ్చి, సంస్థల సభ్యులు కూడ తమ అర్హతను పాడుచేసుకొంటున్నారు. రెండవ ప్రశాంతి నిలయమని మూడవ ప్రశాంతినిలయమని తమకు తామే పేరు పెట్టుకొని, ప్రచారము చేసుకొంటున్నారు. వీటిని సంస్థల కార్యకర్తలు కనిపెట్టి, సభ్యులను హెచ్చరించవలెను.

ముఖ్యముగా, కలతలకు రాజకీయాలకూ అహంకార ఆడంబరములకు అవకాశమీయక, ప్రేమభావమును హృదయమందు బరపరిచి, సాయికుటుంబ బాంధవ్యమును అభివృద్ధిచేసి, సత్య ధర్మ శాంతి ప్రేమలనే స్తంభములపై వ్యష్టి జీవితమును సమష్టి జీవితమును భద్రముగా రూపొందించాలి, అని శ్రీవారు ఉపదేశించిరి. ఎంత చిన్నపని చేసిన, భగవదర్పితము అనే భావముతో సత్యబోధతో ధర్మబుద్ధితో శాంతిభావముతో ప్రేమపూర్ణముగా దాన్ని ఆచరించాలి.

ప్రేమయోగము ననుసరించండి; భక్తియోగము కర్మయోగము రాజయోగము అన్నీ దానిలోనే ఇమిడి యున్నవి. ప్రేమయోగము మీకు విశ్వవిరాట్ స్వరూపమునే అందించును. అంతర్వాహినిగా ఆ ప్రేమ మీ కర్మలన్నిటినీ భగవత్ప్రీతి గావించును. విరాట్ స్వరూపమనిన, మీరుకూడ ఆ స్వరూపములో లీనమైనవారే. మీరందరూ విగ్రహారాధకులే! మీకు తెలియదుకానీ, దేహమనేది దేవుని విగ్రహమే: మీరు ఆ విగ్రహమునకు స్నానముచేయించుచున్నారు. నైవేద్యము పెట్టుచున్నారు కదా? వాటినంతా, పూజాభావముతో చేయండి. ఇతరులనూ, అదే పూజాభావముతో ఆదరించండి, ఆరాధించండి. అని ఉద్బోధించి ఆశీర్వదించిరి.

తరువాత, శ్రీ వారు కార్యకర్తలందరికి పాద నమస్కారము చేయుటకవకాశము ననుగ్రహించిరి. మృదుమధుర మందస్మితముచే అందరినీ ఆనంద పరచిరి ప్రతి ఒక్కరి హృదయములోనూ తానే నివసించి, వారికి తెలివిని స్ఫూర్తిని ధైర్యమును కలుగజేస్తూంటానని విశ్వాసమును కలుగజేసిరి.

తరువాత, శ్రీవారి దివ్యసన్నిధిని హావేరి కాలేజి ప్రొఫెసర్ మడివాళర్, M.A, గారు శ్రీవారి బాల్యమును గురించి కథా కాలక్షేపము చేసి భక్తులందరినీ ఆనందపరవశులు గావించిరి.

రాత్రి 8 గం॥ కు మహాసమ్మేళనము జై జై ధ్వానములతో జయప్రదముగా సమాప్తమైనది.

# భగవానునిపై పద్యములకు పిలుపు

భగవానునిపై అన్ని భారతీయభాషలలోనూ, ఆంగ్లములోనూ పద్యములను ప్రచురించుటకు సంకల్పించబడినది. ఈ పద్యములను బాబావారి ఏబదియవ జన్మదినోత్సవమున అనగా 23–11–75న బాబావారి పాదపద్మములవద్ద సమర్పించవలెను.

భగవానునిపై పద్యములను సమర్పింప కుతూహలముగల కవులు, భక్తులు ఈ క్రింది విధముగా వాటిని మాకందింప కోరడమైనది. కవులు వారి వారి జీవిత విశేషములను సంగ్రహముగా వ్రాయవలెను. ప్రతి ఒక్క భాషకు 75 పంక్తులు మాత్రమే కేటాయించబడినవి కనుక కవి క్లుప్తముగా వ్రాసిన ఒకటి లేక రెండు పద్యములను మాత్రమే పంపవచ్చును. చాలా బాగున్నయెడల దీర్ఘమైన పద్యమును కూడ అంగీకరించవచ్చును. ప్రతి పద్యమును ఈ క్రిందిరీతిలో ప్రచురించెదము. పద్యము యే భాషలో వ్రాయబడినదో ఆ భాషలో మొదట దానిని ప్రచురించెదము. తదుపరి దానిని దేవనాగరి లిపిలోనూ, ఉచ్చారణ గుర్తులతో రోమన్ లిపిలోనూ ప్రచురించెదము. ఆ వెంటనే పద్యముయొక్క తర్జుమా ఆంగ్ల భాషలో ప్రచురించెదము.

పద్యములను, స్వీయచరిత్రలను పంపగోరు భక్తులు, వారి జీవితవిశేషములను తప్పకుండా పంపవలెను. పద్యమును ప్రచురించుటకు నిర్ణయించిన యెడల కవి పంపిన కాపీ ప్రెస్‌కాపీగా వ్యవహరించబడును. పద్యములను పంపగోరువారు వాటిని కాగితమునకు ఒకవైపునే వ్రాయవలెను, పద్యమును స్వంత భాషలో, దేవనాగరిలిపిలో, ఉచ్చారణ గుర్తులతో రోమన్‌లిపిలో వేర్వేరు కాగితములమీద వ్రాయవలెను. ఆ పద్యములను ఆంగ్లములో తర్జుమాచేసి వేరు కాగితములమీద టైపు చేయించి పంపవలెను.

స్వీయ చరిత్రలో కవియొక్క వయస్సు వృత్తి, ప్రచురించిన గ్రంథములు, అందుకున్న సన్మానములు వగైరా వివరములను తెలియచేయవలెను.

కావలసిన ఈ వివరములను పద్యములతో సహా ఈ క్రింది చిరునామాకు 1–8–74 లోగా అందునటు పంపవలెను. వాటిని 1–8–74 ముందే పంపిన మరీమంచిది.

ఉచ్చారణ గుర్తులతో రోమన్‌లిపి విషయములను తెలుసుకొనగోరిన కవులు ఆ విషయములు తెలియపర్చిన వాటిని విపులముగా తెలియచేయగలము.

బృందావన్, వైట్‌ఫీల్డ్ రైలు స్టేషను దగ్గర కాడుగోడి పోష్టు,
బెంగళూరు జిల్లా కర్ణాటకరాష్ట్రము. 1–3–74.

—వినాయక కృష్ణగోకాక్

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజి్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 0-50 పై వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

తెలుగు:—

| | | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-45 |
| 3 | మణిమాల | 1-00 | 0-15 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5 | అర్పణ | 1-00 | 0-10 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0-15 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 9 | వచనామృతము | 4-00 | 0-30 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 0-80 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |

కన్నడ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం[1] | [illegible] | [illegible] |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-15 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 9 | జ్ఞాన వాహిని | 1-60 | 0-10 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:—

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-35 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-10 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0-10 |

**ఇంగ్లీషు:-**

| | | | |
|---|---|---|---|
| 1 | భజన్‌సాంగ్స్ (అమెరికన్ ప్రకటన) | 2-00 | 0-20 |
| 2 | ,, (ఇండియన్ ప్రకటన) | 1-50 | 0-15 |
| 3 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-30 |
| 4 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-40 |
| 5 | ప్రశాంతవాహిని | 2-00 | 0-15 |
| 6 | జ్ఞానవాహిని | 2-00 | 0-15 |
| 7 | నామ సంకీర్తన్ | 1-50 | 0-10 |
| 8 | ధ్యానవాహిని | 2-00 | 0-15 |
| 9 | సమ్మర్‌షోవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0-35 |
| 10 | ,, 1973 | 6-50 | 0-30 |
| 11 | సందేహ నివారిణి | 3-00 | 0-15 |

**అరవం:—**

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-40 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-40 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-30 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-35 |
| 6 | భజనావళి | 1-00 | 0-20 |
| 7 | సాయిమాతా | 1-00 | 0-10 |
| 8 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 9 | సందేహనివారిణి | 2-00 | 0-25 |
| 10 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 11 | అతుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 12 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-10 |

**హిందీ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వతాయనము: [పద్యములు] | 1-00 | 0-10 |

**గుజరాతి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 2 | కథాసుధ | 2-00 | 0-15 |
| 3 | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-30 |

**సింధి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-10 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

**అస్సామి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారథి [పార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0-10 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కదా | 0-25 | 0-10 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0-50 | 0-10 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-20 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-15 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-10 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0-10 |

**ఒరియా:—**

| | | | |
|---|---|---|---|
| 1 | గీతావాహిని | 5-00 | 0-25 |

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరించబడవు.

2 చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5 పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను.

M.O. ద్వారా పైకమును పంపించువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియజేయవలెను.

6. పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోష్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు ...5/-74 అని యుండిన, మీ చందా మే నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) మే నెల 8.వ తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —:శ్రీవారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు ఎడిటర్, 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.)పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్

Regd. No. KRN/A-67

April 1974

ప్రయాణము సల్పు బాటసారి చీకటి పడగానే విశ్రాంతికొరకు ఒక సత్రము చేరునట్టిది ఈ లోకం. తెల్లవారినదాకనే అక్కడ ఉంటాడు. తెల్లవారగనే ఎక్కడికి తాను పోవలెనో ఆక్కడికి ప్రయాణమవుతూ ఒక చోటునుండి మరొక చోటుకు పోతూవుంటాడు. ప్రస్తుతము ఈ జన్మలో పూర్తిగా మునిగిపోక, దీనిని ఒక సత్రము క్రింద చూచుకొన్న యుక్తము,

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక అధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 మే, 1974 సంచిక 3

## విషయానుక్రమణిక

## 52

### వింతైన స్వప్నము

తెల్లవారగనే చిత్రకూట పర్వతమునకు సమీపమునందే వున్నామని తెలిసికొని యెప్పు డెప్పుడు రామలక్ష్మణ, సీతా మాతను చూతుమా అని ఉవ్విళ్లూరుచూ ప్రయాణము సాగించిరి, మధ్యాహ్న సమయమయ్యేటప్పటికి, మందాకినీ నది శబ్దము వినిపించెను. చిత్రకూట పర్వతము కనిపించెను. ఆపర్వతమును చూచిన తక్షణమే అయోధ్యావాసులు, భరతశత్రుఘ్నులు, సాష్టాంగ నమస్కారములు గావించిరి. మార్గాయాసముచే నడువలేనివారు సహితము వీను గంత బలమును పొంది త్వరత్వరగా నడువ సాగిరి. వారి దేహములను ఏమాత్రమూ లెక్క చేయలేదు. పల్లకీ మోయువారల పాదములు రక్తములు కారుచున్ననూ, వారేమాత్రమూ లెక్కచేయక, రామసందర్శన నిమిత్తము, జయ జయ నాదములు పలుకుచూ రామా! రామా! అని స్మరించుచూ తీవ్రముగా నడువ ప్రారంభించిరి.

ఆ నాటి తెల్లవారక మునుపే రాముడు మేల్కొని, ఈ నాడు తండ్రిగారు అమితముగా తలపునకు వచ్చుచున్నారని సీతతో తెలిపెను. అంతలో సీత, నాథా! నాకు స్వప్నములు యే నాడునూ రావన్న విషయము నాకు తెలుసు. అయితే రాత్రి, చాలా వింతైన స్వప్నము వచ్చెను. అది స్వప్నము కాదనే చెప్పవచ్చు. మీ వియోగ దుఃఖము చేత భరతుడు శత్రుఘ్నుడు కృశించినటులను వారు క్షణమైననూ అయోధ్యలో ఉండుటకు ఇష్టపడక మన చెంతకు వచ్చినటులను, వారితో అయోధ్యావాసులే కాక, రాణులైన కౌసల్యా, సుమిత్రా, కైకేయిలు కూడా మన చెంతకు వచ్చినటులను చూచితిని, అని కన్నీరు కార్చెను.

అంత లక్ష్మణుని పిలిచి తమ్ముడా సీత స్వప్న వృత్తాంతమును వింటివి కదా. ఇది శుభ సూచన కాదు. మిగిలిన వారందరూ సీతకు కనుపించినారు. తండ్రి మాత్రమే నాకు కనుపించినారు. వీరందరితో సంబంధము లేక తండ్రి వేరుగా వుండినట్లుగా కనిపించుట, అశుభముగా వున్నది. అని అశుభమని తలంచిన తక్షణమే మనము స్నానము చేయుట మంచిదని తలంచి ముగ్గురూ స్నానము చేయుటకై నదికి వెళ్లిరి. ఇంతలో ఆకాశమున పక్షులు గుంపులు గుంపులుగా ఎగిరినవి, ఉత్తర దిక్కున దూళిచే కప్పబడెను, అనేక మృగములు అరచుచూ అటూ యిటూ పరిగెత్తజొచ్చెను. ఇంతలో దీనికి కారణమేమని విచారించి లక్ష్మణుడు యెత్తైన వృక్షమును ఎక్కి చూచెను. యేదో చతురంగ బలసమేతుడై రాజు వచ్చుచున్నట్లు గుర్తించెను. ఆ వార్త రాములకు తెలిపెను. ఇది సీత స్వప్న ప్రత్యక్షమే అయినట్లుందని లక్ష్మణునికి తెలిపి త్వరగా పర్ణశాలకు వెళ్లుట మంచిదని తెలిపెను.

### చతురంగబలముతో

ఇంతలో భిల్లులూ, కిరాతులూ, వనవాసులూ పరుగెత్తుకొని వచ్చి, రామా ఎవరో రాజు చతురంగ బలసమేతుడై వచ్చుచున్నాడనియూ, ఆ రథమునకు ఒక పతాకము వున్నదనియూ, ఆ పతాకము పైన చెట్టు గుర్తుగా వున్నదనియూ తెలిపిరి. సీతారామలక్ష్మణులు నిస్సంశయముగా అది భరతుని రథమని తెలుసుకొనిరి. ఇంతలో లక్ష్మణునికి [illegible], రామదర్శనార్థమై [illegible] చతురంగబల సమేతుడై వచ్చునా?

ఆ దుర్మార్గురాలైన తల్లి మాటలు విని రామునితో పోరాడి, శాశ్వతంగా రాముని అరణ్యములో అడుగుపెట్టనివ్వక చేయు నిమిత్తమే వచ్చుచుండునని తనలో తాను తలంచి మండిపోయెను.

కండ్లెఱ్ఱనాయెను, పలుకులు కటువుగా మారెను. రాములు గ్రహించి "లక్ష్మణా! శాంతింపుము భరతుడు గుణశాలి, అతని ప్రేమను యెవ్వరునూ వర్ణించలేరు. ఇక్ష్వాకుల వంశమను కొలనుకు భరతుడు తామరపుష్పము వంటి శోభను కలిగించును. అట్టి పవిత్రుని మీద అపవాదులు వేయుట న్యాయము కాదు" అని భరతుని భావములను వర్ణించుచు లక్ష్మణుని శాంతింపజేసెను.

ఇంతలో భరతుడే శత్రుఘ్న సమేతుడై, పరివారముతో రామదర్శనార్థమేతెంచుచుండినట్లు అటవి కోయల ద్వారా తెలిసెను. ఆ సుమంగళ వర్తమానము విని రామచంద్రుడు సంతోషించెను. శరత్కాల సరోరుహముల వలే కమలలోచనములు జలపూరితములయ్యెను.

రామలక్ష్మణులు స్నాన సంధ్యాదులు ఆచరించి పర్ణశాలకు వచ్చునప్పటికి భరత శత్రుఘ్నులు వారిని చూచి రామా, రామా అని పరితపించుచూ పరుగులిడుచూ వచ్చి రాముని పాదములపైపడి విలపించిరి. వారి విరాగ పరితాపమును గమనించిన లక్ష్మణుడు, తను తలంచిన భావములు తప్పని తెలిసికొని తనలో తాను బాధపడెను.

### ఆనందదుఃఖ మిశ్రాశ్రువులు

భరత శత్రుఘ్నులతోపాటు తాను కూడనూ కంటిధారలు కార్చుచూ విచారముతో తలవంచు

కొనెను. రామచంద్రుడు సోదరులైన భరత శత్రుఘ్నులను ఓదార్చుచూ శాంతింపజేయు చుండగనే, చతురంగ బలముతో తల్లి కౌసల్య, సుమిత్ర కైకేయితో మంత్రులు, గురువుగారైన వశిష్టులవారూ, బ్రాహ్మణులూ, పండితులు, రామ చంద్రుని చూడినతోడనే, ఒక వైపున దుఃఖమును మరొక వైపున ఆనందమును భరించలేక ఆనంద దుఃఖమిశ్రమమైన రోదనలు సలిపిరి. అరణ్య మంతయూ వద్దశిల్లినట్లు, రామా, రామా అన్న పలుకులు, మిన్నుముట్టెను.

రామచంద్రుడు అందరినీ క్షేమ సమాచార ములు విచారించి ఓదార్చి నెమ్మదిగా తల్లుల దగ్గరకు వెళ్లి అమంగళముగా వున్న దృశ్య ములను చూడలేక పోయినాడు. కారణమును తెలిసికొని, తండ్రిలేని కొరతను కొంత విచారించి, లక్ష్మణుని పిలచి, విషయములను తెలిపెను. అయితే లక్ష్మణుడు విషయమును విపులముగా తెలిసికొనిన మంచిదని తలంచి, సుమంతునితో అయోధ్యా పరిపాలన విషయమును, దశరథుని వార్తలను తెలియజేయుమని కోరెను.

అంత సుమంతుడు వట్టరాని దుఃఖముతో నేల చూచి, "లక్ష్మణా! అంతెక్కడి దశరథుడు, మీ వియోగ బాధతో భస్మమయ్యెను, అయోధ్య అరణ్యముగా తయారైనది. ఎందు చూచినా విచారమే, యెక్కడ చూచినా రోదనే. కేవలము జనులే కాక, పశు, పక్షి, మృగాదులు సయితము మీ వియోగముతో ప్రాణములు విడచినవి. మిగిలినవి మీ రాకకై నిరీక్షించుచున్నవి," అని తెలుపుచుండగనే లక్ష్మణుని కంటిధారలు జల జల స్రావెను, స్థభించిపోయెను.

మారుమాటాడక రాములచెంతకు వచ్చి అంత ఘోరము సంభవించునని కలయందైననూ తలంచనైతిని, తండ్రిని అంత్యసమయము నందైననూ చూడనైతిమి, అని బాధపడుచున్న లక్ష్మణుని చూచి, రాముడు "జరిగినదానికి చింతిం చ నక్కరలేదు. కాయములు నీటి బుడగలు. అవి అసిత్యములు. నేడు కాకపోయిన రేపటికైననూ విడక తప్పదు," అని నీతివాక్యములను బోధించి స్నానమాచరించుటకై నదికి వెళ్లిరి.

నిర్జలోపవాసము

అంతలో జానకి అత్తలను దర్శించి పాద ములకు నమస్కరించి, గురుపత్ని పాదములకు నమస్కరించి, పుర స్త్రీలను ఆదరించి సత్కరించి నది. సీతను చూచిన క్షణమే అత్తలు గొల్లున యేడ్వసాగిరి. పుర స్త్రీలు కూడను ఆసుకుమార సుందరి దుర్దశను చూచి భరించలేని దుఃఖముతో విలపించిరి. దశరథమహారాజు స్వర్గస్థుడైన విషయమును తెలిసికొని జానకి పునః పునః అత్తలకు నమస్కరించుచూ, అయ్యో ! నేనెంతటి దురదృష్టవంతురాలను, మా పై గల ప్రేమచే కదా మా వియోగమును భరించలేక మహారాజు ప్రాణములు విడెను, అనుచు వజ్రము వలే హృదయమును ఛేదించునట్టి దుర్వార్తను వినిన జానకి రాణులతో గూడి యేడ్వసాగెను. అనాడం దరూ నిర్జలోపవాసమును మాత్రము జేసి, విచారముతో కాలము గడిపిరి.

అంత రెండవ దినము ప్రాతఃకాలమయ్యెను. అప్పుడు గురువుగారి ఆజ్ఞ ప్రకారము రాముడు భక్తి శ్రద్ధలతో పితృకార్యమును శాస్త్రోక్తముగా గావించెను.

"గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి, నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధిం కురు" అని చెప్పుటవలన, తీర్థము పరిశుద్ధమగునట్లు శ్రీరాముడు స్వయముగ జేయుట వలన, పితృకార్యములకు పవిత్రత వచ్చెను.

## ప్రజల వ్యాకులము

రామలక్ష్మణులు, భరత శత్రుఘ్నులు, తల్లులతో, సీతామాతతో, పురజనులతో, గురువుగారైన వశిష్ఠ మహర్షితో రెండు దినములు కాలము గడిపిరి. రెండు దినములు గడచిన తరువాత శ్రీరాముడు గురువుగారి చెంతకు వెళ్లి, స్వామీ! ఈ ప్రజలందరూ కందమూల ఫలములు భుజించి, జలము త్రావి కడుకష్టములు పడుచున్నారు. భరత శత్రుఘ్నులను తల్లులను చూచిన తరువాత నొక నిమిషము ఒక యుగముగ గనపించుచున్నది. తాము దయయుంచి నగరమునకు వెళ్లుట మంచిది. తామందరూ ఇచట ఉంటిరి. మహారాజు స్వర్గస్థుడయ్యెను; నేను విస్తరించి చెప్పుట భావ్యము కాదు. ఉచితమగునట్లు వ్యవహరింపుడు అని నమస్కరించెను.

అంత వశిష్ఠులవారు "రఘునాథా! ఎందులకు నీవిట్లు పలుకుచున్నావు. రెండు దినముల నుండి ప్రజలు నీ ముఖారవిందమును చూచి యెంత సంతోషించుచున్నారో యోచించవైతివి." అని పలికెను.

ప్రచండ వాయువు వీచినపుడు సముద్రముపై పోవుచుండిన పడవ తల్లడిల్లు విధమున శ్రీరామ వచనములను విని జనులు వ్యాకులులయిరి. అనుకూల వాయువు వీచినపుడు పడవ నిరుపద్రవముగ పోవునట్లు మునీశ్వరుని మంగళవచనములను విని స్వస్థచిత్తులయిరి. మందాకినీ నదిలో త్రికాలములూ స్నానము చేసి, సాత్వికమైన, విరివిగా లభించు వివిధ ఫలములను భుజించుచూ, సీతా, రామ, లక్ష్మణులను కన్నులారా చూచుకుంటూ, నిత్యమూ రామ సంభాషణలతో అయోధ్యనే మరచి హాయిగా వున్న జనులకు అయోధ్యకు తిరిగి వెళ్లుటకే మనసొప్పకుండెను.

సీత అత్తలను సేవించుచూ వారల నోదార్చుచూ తాను అరణ్యమున సమస్త సుఖములతో ఎట్టి కొరతయూ లేక హాయిగా జీవితము గడుపుచున్నానని అత్తలకు యెంతో ధైర్యమును తెలుపుచూ వర్ణించుచున్న సీత పలుకులు అత్తలకు ఆశ్చర్యము కలిగించెడివి, ఆనందము నందించెడివి. సీత గుణగణములు వారికి అమితమైన ధైర్యము నందించెడివి.

## వియోగ విలాసములు

భరతునకు రాత్రి నిద్రకాని పగలు ఆకలి కాని లేదు. ప్రజలెంత రాముని చూచి సంతసించుచున్నారో, భరత శత్రుఘ్నులు రాముని చూచి అంత విచారించుచుండిరి. భరించలేక ఇక కాలమును వృథా గడుపుటకు మనస్కరించక, గురువుల పాదములపై బడి రామచంద్రుని సీతాసమేతముగా అయోధ్యకు వచ్చునట్లు చేయవలెనని ప్రార్థించుచూ, అనేక విధముల బ్రతిమలాడిరి. వారి వియోగ, విలాసమును గమనించి, గురువులకు శ్రీరాముని తత్వము తెలిసినప్పటికినీ రాముడు పితృవాక్య పరిపాలనలో యే మాత్రమూ మార్పు చేయడని,

అడిన మాట తప్పడని యెరిగియూ, భరతుని తృప్తికై, రాములను కొంతకు రప్పించుకొని, "ఓ రామా! భరతుని విన్నపమును ఆల కింపుము.

సాధు సమ్మతమును, లోక సమ్మతమును, రాజనీతి కనుగుణ్యముగను వేద సమ్మతమగు నట్లు సంచరింపుము" అని, వశిష్టులవారు ఆజ్ఞా పించిరి. గురువునకు భరతుని మీదనున్న వాత్సల్యమును రాముడు గమనించెను. మరింత ఆనందముతో, భరతుడు ధర్మధురంధరుడనియు, మనోవాక్కాయ కర్మలచే ఆతను తన సేవకు డనియూ, తన కనుకూలముగా ప్రవర్తించున నియూ, రామునకు తెలియును. గురువాజ్ఞ నను సరించి మృదుమధురమగు మంగళవాక్య ములను శ్రీరాముడు పలికెను.

"స్వామీ! మీరే సాక్షి, తండ్రి పదములే సాక్షి! లోకములో నాకు భరతుడువంటి తమ్ముడు మరొకడు లేడు. గురుని చరణముల యందు అనురాగము కలవారు అదృష్టవంతులు. మీకు అతని మీద యింత దయకలదు కనుక అతని అదృష్టము నెవరు చెప్పగలరు. నాకంటే భరతుడు చిన్నవాడు. అతని ముఖమునెదుట అతనిని స్తుతించుటకు సంశయించుచున్నాను. భరతుడు చెప్పినటుల నడచుకొనుట, యుచిత మని నా అభిప్రాయము", అని నమస్కరించి కూర్చొనెను.

సశేషము

"న కర్మణా, న ప్రజయా, ధనేన, త్యాగేనైకే అమృతత్వమానసుః"
అమృతత్వమును కర్మకాంతలతో, జన్మతో, ఐశ్వర్యముతో కాక, పరి త్యాగమువలన మాత్రమే పొందవచ్చును. ఈ విధముగా వేదములు ప్రకటించుచున్నవి. నేడు మీరందరూ చేయపూనుకొనిన సేవయే అట్టి త్యాగము యొక్క శిక్షణతో మొదటి పాఠము. సేవ ఉత్తమోత్తమమైన సాధన; కారణము, భగవంతుడే మానవాకారము ధరించి మానవసేవకొఱకు దిగి వచ్చి, మానవాళి మరచిపోయిన ఆదర్శములదిక్కుగా త్రోవ చూపు చున్నారు. కాబట్టి, మానవుడు తోటిమానవునకు సేవ చేసిన, భగవంతు డెంతగా సంతోషించునో ఊహించండి.

—బాబా

# భయమెందుకు?

“ నేనిక్కడుండగా భయమెందుకు ? ” అని, వారి కోర్కె తీరేదునో లేదో అని అనుమానించువారికి తరచు బాబా యిస్తూవుంటారు హామీ. భక్తిస్తానని చెప్పినప్పటికీ యింకా భయపడే రోగగ్రస్తులకు, నిరాశాపరులకు, కష్టాలలో యున్నవారికి, బాబా షిర్డీలో యున్నపుడు కూడ ఇదే చల్లని ప్రశ్న వేస్తూయుండేవారు. వారు కుడి హస్తమును భుజముపరకు ఎత్తి మనకు చూపుతున్నపుడు, అభయహస్తమని అనగా భయము నివారించే హస్తము అని తరచు మనం అనుకుంటూ యుంటాము. బాబా అభయ హస్తము చూపుచు, దాని క్రింద, నేనిక్కడుంతగా భయమెందుకు అని ముద్రించబడిన చిత్రపటములను, పూజా మందిరములందుంచి, భక్తులు స్వామి సదా వారి విషయాల్లో ఆ ప్రతిజ్ఞ జరిపించవలసిందిగా ప్రార్తిస్తూయుంటారు.

జనాన్ని చాల దగ్గరగా మాట్లాడవద్దని హెచ్చరించుటకే, వారి హస్తాన్ని అట్లా యెత్తుతూయుంటారు, అని ఒక రోజున బాబా అన్నారు, నిజం. నీవు నెమ్మదిగ మాట్లాడుతున్నపుడు, కోపం అణుగుతుంది, గర్వము తగ్గుతుంది, మాటలతో నెగ్గాలనే కోరిక కూడ అదుపులో యుంటుంది, క్షమ (సహనం) కూడ పెరుగుతుంది. అరచుట, కేకలు వేయుట, తంబాలు చెప్పుకొనుట, తిట్టుట, ఈ విధమైన చెడ్డ అలవాట్లు, ఇతరులలో. తిరస్కారం, విరోధములను తెచ్చగొట్టి, భయమునకు దారితీయును. మనిషి తన కంటితో కూడ అదుస్తాడు. ప్రతి ఇంద్రియము కూడ గోల చేసి మనలను భయములోనికి లాగగలదు. కనుక బాబా అనే దేమిటంటే, “ నీ ఇంద్రియాలను గట్టిగ పిలుపనీయకు, వాటిని నిగ్రహముతో ఉంచుము, అప్పుడు నీవు భయపడవలసిన అవసరముండదు.” నాలుక, తదితర ఇంద్రియాలు మాత్రమే, గాక, మనస్సు, దాని చపలత్వము ; బుద్ధి, దాని నాపదించి యున్న మాయ ; అహంభావము దాని హాస్యాస్పద మైన చేష్టలు మొదలగువాటికి, నిరోధాలను (బ్రేకులను) కల్పించుకొని, ఆ నిరోధాలను యెల్లపుడు అవి సరిగ పని చేస్తున్నవో లేదో పరీక్షించుచుంటూ ఉండవలసిందని, ఆ పైకి యెత్తబడిన హస్తము సూచిస్తూయుంటుంది.

బాబా “ ఇక్కడ ” అను పదముతో మనకు బోధిస్తున్న దేమిటి? ‘నేనిక్కడున్నాను’, అన్నప్పుడు వారెక్కడున్నారు ? పూజామందిరములోనా ? పూజా మంటపము మీదా ? గోడ మీదా ? ద్వారముపైనున్న చెక్క మీదా ? లేక హృదయములోనా ? మనము ఎల్లపుడు, బాబా అభయ హస్తమును చూపుతున్న చిత్రమును పర్సులో పెట్టుకొని యుండవలెనా, లేక మన శరీరముపై ధరించి యుండవలెనా ? బాబా ప్రతిజ్ఞాపూర్వకంగా, ‘ వెంటనే, జంటనే, ఇంటనే, కంటనే ఉన్నాను ’ అని చెప్తూయుంటారు ; ఈ అనుభూతిని అనేక వేల మంది అదృష్టవంతులు

పొందియున్నారు. కాన బాబా 'నేనిక్కడున్నాను' అని చెప్పుటలో అర్థము, వారు సర్వాంతర్యామి అని ప్రపంచములో అన్ని ప్రాంతాలలో ఉన్న ప్రజా నీకము, వారెక్కడున్నా, బాబా 'ఇక్కడే' వున్నట్లు వారు అనుభూతి పొందుచూ యుంటారు. నార్వే దేశస్థుడైన జోహానెస్సన్ ట్రైడ్‌మన్ అను వ్యక్తికి, బాబా వైట్‌ఫీల్డులో సృష్టించి బహుకరించిన ఉంగరమును అతను ఒక నెల క్రితం చిట్టగాంగ్ నదిలో పోగొట్టు కున్నాడు. దానిని అతనికి తిరిగి యిస్తూ బాబా అన్నారు "ఇది నా చేతులో పడ్డది. నేను అంతటా యున్నాను, అది ఆ నదిలో పడ్డపుడు నేను ఆ నదిలో యున్నాను." కాన బాబా 'యిక్కడ' అంటే దాని అర్థము 'అంతటా' అని. వారిని పిలువుము; వారు సమాధానం యిస్తారు. బాబా శ్రీరామునివలె "సర్వ జీవులకు నేను అభయ ప్రధానం చేస్తాను, ఇది నా ప్రతిజ్ఞ" అని ప్రకటించారు. సాయిరాముడు కూడ అదే ప్రతిజ్ఞ చేశారు. బాబా 'భయమెందుకు' అనుటలో 'భయము' అను పదము ఏమి తెలియ చేయును? భయము అనగా, వ్యాధి, మరణ భయములు మొదలగు వాటిని సూచించును; యెల్లపుడును, మరణమునుంచి తప్పించుకొనుట శక్యము కాదని వక్కాణించి చెపుతూ, యీ భయాన్నుంచి మనలను రక్షిస్తూ యుంటారు, మరణమన్నది, మనం యీ పాత్రకాలలో, ఒక కాల ప్రమాణాన్ని పూర్తి చేసి, మరియొక కాల ప్రమాణంలోకి పోవుటవంటిది. మరణమును గూర్చి భయపడుట శుద్ధ అవివేకము, వృథా శ్రమ అని బాబా బోధిస్తున్నారు. పేదతనము, తిండి లేమితనము అనే మరియొక భయము కూడ యున్నది. ఒక దేశ ప్రముఖుడైన పండితునికి బాబా ఉత్తరంలో యీ విధంగా వ్రాశారు. 'నేను అన్ని లోకాల్లోని జీవరాసులను పోషిస్తూ వారికి ఆహారాన్ని యిస్తూయుంటాను, గాన నీవు చాల పేదవాడవు అని అనుకోవద్దు నేను నీ కుటుంబాన్ని పోషించనంత మాత్రాన ! నీకు కొన్ని గుణపాఠాలను నేర్పుటకై నీకు యీ కష్టాలను, ఆవేదనలను కలుగ చేస్తున్నాను.'' ఈ సత్యమును తెలిసికొన్నవాడు, యేమి జరిగినా, భగవత్సంకల్పముగనే భావింతురు. భయము, తొట్రుపాటు, బెంగారు పడవలసిన అవసరము లేదు. చాల ఆనందము చెందాలి. ఎందువలనంటే, యీ కష్టాలు, బాబాకు మన పై గల కరుణ, యిష్టము వలననే; మనకు ఇంకా కొన్ని పాఠాలు చెప్పి, మనల గమ్యాన్ని సాధించుటకు సూచనలు అని గమనించవలెను.

బాబా, వారి భక్తుల హృదయములలోని భయోత్పాదనవలన కలుగు ఆందోళనే కాక, సర్వుల హృదయాలలో భయోత్పాదనకు ప్రతి చర్య చేస్తూనే యుంటారు. ఆ తదితరులు ఎచ్చట నున్నప్పటికిని, సత్యసాయిగా అవతరించిన యీ నిరాకార మూర్తిపై ఏ విధమైన దృక్పథములు కల్గి యున్నప్పటికిని, ఒకరు బాబావారి వద్దకు వచ్చినా రాకపోయినా, వారిని గూర్చి తెలిసినా తెలియకపోయినా, 'ధైర్యము' అనునది కావలయును అని గుర్తించినా, లేకపోయినా, బాబా ధైర్యమును సర్వులకు యిచ్చుటకు అవతరించియున్నారు.

బాబా 21 సంవత్సరముల వయస్సప్పుడు వారి సోదరునికి యీ క్రింది విధంగా వ్రాసారు: "అనంతాన్ని ప్రసాదించి, మానవులను రక్షించుటకు నేనవతరించితిని". "రక్షణ" అనగా భయము నుంచి తప్పించుట అని అర్థము. అనగా, శత్రువులనుంచి, దుష్టశక్తులనుంచి, దుష్టప్రేరేపణల

నుండి, భావములనుండి, రక్షించుట అని గ్రహించవలెను. సాయికి, 'ఇతరులు' 'దూరపువారు' 'దగ్గరవారు' అని యెవ్వరూ లేరు.

'అందరు సాయియే' అని కూడ బాబా వక్కాణించి చెప్తూయుంటారు. ప్రతివారిలోను సాయి ఉన్నారు. బాబా చెప్తూయుంటారు, "నీవు కలిసికొనే ప్రతి మనిషి ద్వారము పై నాచిత్రపటము గల ఒక గృహమే. వానిలోని సాయిని పూజింపుము. నన్నుగాని, నా పటమునుగాని గౌరవించునట్లే వానిని కూడా గౌరవింపుము." అందరు సాయియే అయినపుడు, యెవరిని గూర్చి భయపడవలెను ? ఎవరు మనకు హాని చేస్తారు ? అని బాబా అంటారు. "నీ వ్రేలు, నీ కంటిని పొడుస్తుందని భయపడవు కద. నీ వ్రేళ్లే నీ జేబులోని ధనాన్ని అపహరిస్తాయని భయపడవు కద. నీ పళ్లు నీ నాలుకను కసిగ, రెండు ముక్కలుగ కత్తిరించునని భయపడవు కద," ఉపనిషత్తులు "ఏకత్వమునందు, యెవరు యెవరిని గురించి భయపడవలెను ?" అని అడుగుచున్నవి. సాయి సత్వులలోను ఉన్నారని ప్రకటించి, వారు భయమనే దానిని కూకటి వ్రేళ్లతో తీసివేసినారు. దీనిని బట్టి, బాబా ప్రకటించిన, యింకొక విషయము కూడ గుర్తుకొస్తుంది. "నేనే యిక్కడుండగా, భయమెందుకు ?" సాయి భక్తులకు "నేను" అనగా సాయి అని అర్థము. వేరు నామములతో సాయిని భజిస్తున్న యితర భక్తులకు "నేను" అనగా ఆ యితర నామములు. వారు నిర్భయులుగ నుండవచ్చు. ఏలనన ఆ నామములు గల దైవము, వారిలో నున్నట్లే, ప్రతి ఒక్కరిలోను యున్నారు. "అహం" సాయి అనే సముద్రపుతరంగము. "సోహం" (నేనే వారు) అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మను) తత్వమసి (నీవే అది), నేనే అది అయినపుడు, దానిని గూర్చి యెందుకు భయపడాలి. ఎవరు కూడ తన ప్రతిబింబాన్ని అద్దంలో చూచి భయపడరు కద. ఎవరుకూడ వానిని వాడు ప్రేమిస్తాడు కాని వానికి వాడు భయపడడు.

పైన వివరించిన శాస్త్రోక్తులలో సత్యాన్ని కప్పిపుచ్చే ద్వైత భావము యిమిడియున్నది, అని అంటారు బాబా. దానిని సాయి కృపవలన స్వయం ప్రకాశ శక్తిచే తీసివేసినయెడల "అది" అనునది మిగులును. అద్వైత భావాన్ని, ఉద్ఘాటించుటకు, ఆ ఆనంద తన్మయతను వెలిబుచ్చుటకు వేరు మార్గమేమీ లేదు; "ఉన్నది" అనునది మాత్రమే గలదు "ఉంటెను", "ఉంటును" అను హద్దులు లేవు. ఆ అభయ హస్తము, ప్రతిజ్ఞ చేసినట్లుగనే, యీ ప్రకాశము అనుదానిని అన్ని జీవరాసుల పైన వెదజల్లును.

—తారకదాస్

# ఆనందసంవత్సరము

నేడు అన్ని దేశములలోనూ మానవులు ఆత్మ తృప్తి కొరకై స్వార్థపరులై ఆత్మస్తుతి చేసుకొనటము, పరనింద చేయటము, శుష్కభాషణములతో సంతోషించటము వీటితో నిరతులై ఈర్ష్యాసూయలను పెంచి అశాంతిలో మునుగుచున్నారు. మంచి ఆదర్శములను ఆచరణలో పెట్టి, సార్థక కీర్తిని సంపాదించక, తమ దుశ్చర్యలవలన సమాజములో భయాందోళనములను నెలకొల్పుచున్నారు.

ఈ దినము ఉగాది పండుగ అని మీరందరూ ఇచ్చట చేరారు కానీ, యెన్నో లక్షల ఉగాదులు వచ్చి పోయినాయి కదా ? ఈ ఉగాది కూడా అంతే ! ఇది కూడా వచ్చినది, పోవుచున్నది. అయితే, క్రొత్త సంవత్సరమును క్రొత్త జీవిత పథమునందు అభివృద్ధి పొందుటకుపయోగించిన, అది నిజమైన సార్థకత ; అట్లు చేయుటకు ఈ పండుగ హెచ్చరించును ; అదియే దీనియొక్క ప్రధాన ఉద్దేశము

క్రొత్త సంవత్సరపు పేరు కూడ బాగున్నది ; ఆనందనామ సంవత్సరము, ఆనందమును అంతఃకరణ పరిశుద్ధిచే సమాజసేవచే, ఆత్మోన్నతిచే సాధించవలెను. పవిత్ర కర్తవ్యములను భగవదర్పితముగా నెరవేర్చుటయే ఆనందానుభవమునకు ముఖ్య సాధన. రామ అని మీ పేరుండవచ్చు, మీ వ్యక్తిత్వములో రామతత్త్వము వికసించిన అపుడే, ఆ పేరుకు సార్థకత. ధర్మజ, ధర్మరాజ, అని పేరు పెట్టుకుంటే యేమి లాభము ? ఆ పేరుతో ఆనందముండదు ; ధర్మాచరణముచే శాంతిసంతోషముల నందుకొనే ప్రయత్నమునకు పూనుకొన్నపుడు దానికి సార్థకత, అర్హత, "ఆనంద" అనే పేరుకు కూడ అంతే !

ధనమునార్జించిన, బుద్ధిని బలపరచిన, దేహబలాభివృద్ధి చేసికొన్న ఏమీ సార్థకత లేదు. దైవబలము ధర్మబలము అత్యవసరము. ధృతరాష్ట్రునికి ఇవి రెండూ లేవు కాబట్టే, ఆయన వంశము సర్వనాశము పొందినది ! మానవుడు తన కర్తవ్య కర్మ యేమి అని గుర్తించి వర్తించటము లేదు. కాలము చండమారుతముయొక్క వేగముతో పరుగిడేది అయినా గమనించటము లేదు మరణము దగ్గర దగ్గరకు వచ్చుచున్నదని కూడ యోచించటము లేదు. మానవత్వముయొక్క విలువను, దాని గురియేమి, ఉద్దేశమేమి అని ఒక క్షణమైన వివేకముతో విచారణ చేయుటము లేదు. సర్వ జీవులయందూ అంతర్యామిగా వర్తించుచున్న పరమాత్ముడే తనలోనూ ఆత్మరూపముగా వర్తించుచున్నాడనే సత్యమును తెలిసికొనేదే మానవుని లక్ష్యము.

ఆత్మస్తుతి అహంకారముయొక్క చిహ్నము ; ఆ స్వభావమును పొందినవానికి అశాంతి అసుఖము అసూయలు, తప్పినవి కావు. పరదూషణ చేసే వారికి పాపమే ప్రతిఫలము ! వాళ్లకు సమాజమందు

గౌరవము లభించదు ; వాళ్లకు ఎక్కడ చూచిన, ఎవరిని చూచిన, అపకర్మమే కనబడును. దానివలన, వాళ్లకూ శాంతియుండదు. మీకొక వ్యక్తిపై ప్రీతి లేదంటే, ఊరికే వుండు ; వాని సంగమందు చేరకు; అంతే కాని, వానిని దూషించేదెందుకు ? ఊరికే వుండేదే, మీరు చేయవలసిన సత్కర్మము. తన మనస్సుపై, తన ఇంద్రియములపై అధికారము సాధించలేనివాడు మరొకరిపై ఎట్లు అధికారము చలాయించ తారు ?

శుష్కభాషణముతో కాలమును వ్యయము చేయకూడదు. కాలమునను సరించి మీ మీ అభిప్రాయములనూ అభిమతములనూ మార్చకూడదు. పరులు ఏది చేసిన తప్పు అని మీరంటురో, అట్టి క్రియలను మీరూ చేయకూడదు. దైవత్వమును సాధించక పోయిననూ పరవాలేదు ; మానవుడు పశుత్వమునకు దిగక, మానవత్వమును సాధించిన, అంతే చాలు !

దైవము సర్వత్ర, సర్వ పదార్థములోనూ, సర్వ జీవులయందూ, నివసించుచున్నాడు ; భగవంతుని వెతుకుచూ, దేశదేశాలు తిరుగనక్కరలేదు మీ మీ నిత్యకృత్యములలోనే, మీ మీ ప్రవర్తనలోనే, పరిశీలించుకొన వీలగును. హృదయమనే సువర్ణ కలశమందు, పవిత్ర జ్ఞానము అనే రూపముతో భగవంతుడున్నాడు అది తెలియక, బయట వెదకేది అవివేకమునకు గుర్తు.

అట్లనే, హృదయమందు దయా గుణముండవచ్చును. దానితో వివేకమూ వుండాలి. లేకపోతే, నీటినుంచి బయట డిన చేపపై దయను, ప్రేమను చూపుటకు, దానిని ఇంటికి తెచ్చి వేడి కాఫీ తాపించి చంపిన అవివేకితో మీరు చేరవలెను ! జననాయకులకు దయా ప్రేమలు ఉండవచ్చును ; అయితే, దేశ క్షేమమును అభివృద్ధి చేయుటకు, లోక కళ్యాణమును సాధించుటకు సరైన మార్గము తెలియక, వారు అపవిత్రమైన అపమార్గములనే అనుసరించి అన్యాయ అక్రమాలనే నెలకొల్పుచున్నారు.

ద్వేషమును పెంచితే, జయము సిద్ధించదు ; సిద్ధించిననూ, అది తాత్కాలికమే. శాంతి రీతిగా ప్రేమ మార్గమందు ప్రయాణము చేసిన, ప్రయత్నము లొనర్చిన, కార్యసాఫల్యమగును. భయపడేది, భయము పెట్టేది — రెండూ మనిషికి సహజము కాదు. భయపడేది పశువు ! భయము పెట్టేది మృగము !

సత్యము ధర్మము నీతి నిజాయితీ — వీటిని దృఢముగా నమ్మినవారికి భయముండదు ; వారు ఎవరినీ హింసించరు కూడ. నేను సత్యసాయి ! సత్యమే ఆధారమై వుండిన భయమెందుకు ? అపజయమెట్లు కలుగును ?

నిరర్థక జీవులు నిరర్థకమైన పేరు ప్రతిష్ఠల కొరకు, సత్యసాయి నామమును తామే పెట్టుకొని సంస్థలను కట్టె ప్రయత్నము చేయవచ్చు ! అటువంటి వాళ్లకూ నాకూ సంబంధమే లేదు. నేను అన్నిటికి సాక్షి ! ఫాన్ స్విచ్ ఆన్ చేసితే తిరుగును, చల్లని గాలి నీయును, స్విచ్ ఆఫ్ చేసిన, తిరుగదు. అయితే, నా పేరును దుర్వినియోగము చేసుకొనే నిమిత్తమైన, దూషణ చేసుకొనే కొరకైన, వారు ఉపయోగించి, ఆ రీతిగా ఏదో ఒక రకముగా సంతృప్తి పొందుచున్నారే, దానికి నేను సంతోషిస్తున్నాను. దూషణ భూషణాలు నాకు యుగ యుగాలనుంచి వెంటాడేవే, అయితే, వాటికి నేనెపుడూ విలువ నీయను. నేను వచ్చిన కార్యము ధర్మ సంస్థాపన ; దానికి అడ్డుగా ఏది వచ్చిననూ, నా పని నిలువదు, దానికి అవకాశముండదు.

దివ్యాత్మ స్వరూపులారా ! క్షణ క్షణమునకూ మార్పు చెందుచున్న ప్రపంచమును స్థిరమని నమ్మ

వద్దు; మరణమునకు భయపడక సదా సర్వత్ర సిద్ధముగా నుండవలెను నిత్య శుద్ధ బుద్ధుడైన పరమాత్ముడే హృదయస్థానమందున్నపుడు, దుఃఖము భయ భీతులు ఎందుకు ?

పురందరదాసు కన్నడములో పాడిన రీతిగా, "మనుజ శరీరమిదేను సుఖా ?" అనే భావము మీలో అంకురించి, మీరే గడచిన జీవితమును గురించి సిగ్గుపడే అవసరము వచ్చును; దాని కవకాశ మీయకుండ, ఇపుడే హెచ్చరిక తీసుకొనేది మంచిది.

సత్యసాయి అనేది ఈ దేహముయొక్క పేరు. సత్యసాయి అంటే, ఈ దేహమని భావించకూడదు. శేషశాయి అన్నట్లు, సత్యసాయి అంటే సత్యమునే ఆధారముగా నిర్ణయించుకొన్నవాడు, అని అర్థము. సత్యము నిండుకొన్న హృదయములలో స్థాయిగా నిలుచువాడు. సత్యస్యసత్యమైన సాయి మీ మీ హృదయములో శయనించియున్నాడు, అనేది ఆ పేరు యొక్క అంతరార్థము. ఈ దినం చైత్ర శుద్ధ పాడ్యమి; దీనికి యుగాది అని అంటారు; యుగమునకు ఆది, అంటే యుగములను, వాటి ఆది వాటి అంత్యములను చింతన చేయుటకు ఇది ఒక చిహ్నము, అంతే కానీ, ఈ నాడు ఒక క్రొత్త యుగము ప్రారంభమని కాదు. హృదయమున ఆది, జడమున ఆది, చైతన్యమున ఆది, వీటిని గురించి విచారణ సలిపి, తన్ను తాను తెలిసికొనే ప్రయత్నమునకు పూనుకోవాలి అని దాని కర్థము. జడము, చైతన్యము రెండూ ఆ బ్రహ్మమే. సర్వం బ్రహ్మమయం జగత్. జగత్తు భగవంతుని దేహమే! పంచకోశములూ బ్రహ్మమయమే. వాటిలో విజ్ఞానమయ కోశము ఆనందమయ కోశము రెండూ ఆధ్యాత్మిక మార్గము నవలంబించినవారికి ఆవాస స్థానము. అహింస, ప్రేమ, శ్రద్ధా భక్తులవలన, అది సాధించును.

వాక్కులచే, కాయముచే, క్రియలచే, భావముచే, పరులకు హింసను కలిగించ కూడదు. తనలో చెల రేగుచున్న కోపములకు బానిసలై మెలగువారిని బలహీనులనే చెప్పవలెను. వారిని పెద్దలని ఎట్లా గౌరవించుటకు సాధ్యము ? తుచ్ఛమైన వాంఛలనూ అర్థములేని ద్వేషాసూయలనూ అణగద్రొక్కుటకు బలము లేని వాళ్లకు ధైర్యస్థైర్యములుండునా ?

ఇంద్రియ శక్తులను నిగ్రహించేదే నిజమైన పరాక్రమము. మనస్సును స్వాధీనము చేసేదే నిజమైన విజయప్రాప్తి. మీరు బలహీనులు కాకూడదు; భగవంతుడే మీలో మీ హృదయస్థానమందుండగా, బలహీనత ఎందుకు ? వ్యక్తి బలమే సమాజ బలము: సమాజ బలమే దేశబలము. సత్యము కొరకు, దాన్ని నిలబెట్టకొరకు కష్టనిష్ఠూరము లెన్ని వచ్చినా అన్నిటినీ నెట్టివేయవలెను. సత్యమువలనే ఆనందము, అమృతత్వము, లభించుతుంది. ఆ ఆనందమును మీరు అందు కొని, జగమున కందించవలెనని నేను ఆశించుచున్నాను

అనుకూలమేర్పడినపుడు భగవద్విశ్వాసము, ప్రతికూలములు గుమిగూడి వచ్చునప్పుడు, ఆ విశ్వాసమును కోల్పోవటము, ఇది మానవునికి భూషణము కాదు. విశ్వాసమునకూ శ్వాసమునకూ ఇదే పెద్ద వ్యత్యాసము: శ్వాసము వచ్చును పోవును, నిమిష నిమిషమునకు రావటము, పోవటము! అయితే, విశ్వాసము అట్ల వుండకూడదు; అది నిరంతరముగా నిశ్చలముగా నిర్మలముగా ఏకధారగా వుండాలి. అప్పుడే భగవంతుని అనుగ్రహము కూడ ఏకధారగా ప్రవహించును.

శ్రీవారి దివ్యబోధ
24-3-74, బృందావనము.

# దివ్యాత్మ స్వరూపులారా!

దివ్యాత్మ స్వరూపులారా అని భగవాన్ శ్రీ సత్య సాయి బాబా వారు ప్రజలను సంబోధింతురు. అక్షరాలాది ప్రజలు ఆ మాటను విని ఆనందింతురు. అదొక ఆశీర్వచనము; అజ్ఞానాంధకారములో అల్లాడుచున్న ప్రజానీకమునకు అదొక జ్ఞానాంజనశలాక; అది సత్యస్య సత్యము, మన మనోవాక్కాయ కర్మలలో మనము ఆచరణలో పెట్టి ఆనందించవలసిన మహోపదేశవాక్యము!

అయితే, కర్మబంధములవలన, క్లేశములవలన, ఆవరణములవలన, మనకు స్వస్వరూప జ్ఞానము సులభముగా కలుగదు. బెర్గసన్ అనే ప్రఖ్యాత పాశ్చాత్య తత్వవేత్త ఈ విషయమును కొంత విపులముగా విచారణ చేసియున్నారు. ఇంద్రియముల ద్వారా లోనికే విషయ సంగ్రహమును జ్ఞప్తియందుంచుకొనే సామర్థ్యమును గురించి వ్రాయుచూ, ఆయన బుద్ధియొక్క మూలస్థానమైన మెదడు, కోపతాపముల వాహకములైన నరములు దశేంద్రియములు, ఇవన్నీ మన కవసరమైన అనుభవములను మాత్రము, అనుకూలమైన అనుభవములను మాత్రముంచుకొని, మిగిలినవన్నీ లోనికి స్వీకరించి శేకరించక జాగ్రత్తగా ఉండునని తెలిపియున్నారు. అట్లు అవి మనకుపకరించక పోతే, కంటికి కనబడినదంతా, విన్నవన్నీ, ఆఘ్రాణించిన వన్నీ, రుచిచూచినవన్నీ, సోకినవన్నీ, జ్ఞప్తిలో నిలచి, మెదడులో బరువెక్కి, జీవితమే జటిలమగును. అయితే, దీనివలన మానవుని ప్రజ్ఞ సంకుచితమై సన్నగిల్లి వికాసరూపమును పొందక వికారరూపమైయుండును.

హక్స్లీ అనే ప్రఖ్యాత విజ్ఞాని కూడ ఈ అభిప్రాయమునే సమర్థించాడు: "ఈ సంకుచిత దృష్టినే సత్యమని మానవుడు నమ్ముతాడు; దాని వలన ఆయన నిజమునకు దూరమవుతాడు కూడ." అని హక్స్లీ వ్రాసినాడు! కానీ, కొంత మంది యోగ శక్తుల వలన, ఆధ్యాత్మిక సాధనల వలన, బుద్ధిని వికసింప జేసి, ప్రపంచమందు సర్వ వ్యాపిగా సర్వ శక్తితో విహరించుచున్న, అన్ని కాయములతో కార్యములను జరుపుచున్న, పరమాత్మ తత్వమునే తెలుసుకో గలుగుదురు, అని హక్స్లీ విశదీకరించాడు. కాలదేశముల కతీతమైన భావములనూ సంభవములనూ వారు కని విని ఆనందింతురు, అంటారు.

"ఈ దేహమనే ఉపాధితో మీరు ఈ ప్రపంచమంతు జీవించునది, మీ స్వస్వరూపమును అనుసంధానము చేసి, తెలిసికొనుటకే! మీలోని దైవత్వమును ప్రకటించి ప్రకాశించుటకే! మీ కర్మలచే, పట్టుపురుగు వలె మీరే ఈ గూడును రచించుకొని దానిలో చేరుకొంటున్నారు. మీ ఆశలే, మీ వాంఛలే, మీ ఇష్టానిష్టములే ఈ గూడుయొక్క దారములు! గూడులోనే బంధించుకొని జీవించుచుండ, రెక్కలనభివృద్ధిజేసుకొని, బయటకు వచ్చి, స్వతంత్రముగా

లీలాజాలముగా పారి పోయి విహరించండి అని శ్రీవారు మనకుపదేశించియున్నారు కదా ?

1963 సం॥ లో వందలాది వటువులకు గాయత్రి దీక్షనొసంగి అనుగ్రహించిన సుదినమందు శ్రీవారు ఆ ఉపవీతులకు ఈ మహోపదేశము నందించిరి. ధీ శక్తిని ప్రచోదించి. నిత్యానిత్యవస్తు వివేకము ననుగ్రహించుటకు జ్యోతిస్వరూపమైన సవితాదేవిని ప్రార్థించుటయే, గాయత్రి మంత్రముయొక్క పరమోద్దేశము.

ఉపాధి బంధితమైన బుద్ధిశక్తిని బంధముక్తముగా చేసితే, అది జీవాత్మ పరమాత్మ భేదమనే మాయను త్రుంచి, అందరూ దివ్యాత్మ స్వరూపులే అనే సత్య జ్యోతిని వెలిగించును, అనేదే శ్రీవారి బోధ; ఆశ; ఆశీస్సు.

దివ్యాత్మ స్వరూపులారా !—అనే పిలుపు, మన అందరి హృదయస్థుడైన పరమాత్మని మనకు గోచరింప జేయుటకే.

దత్ పేట

# ఒకప్రశ్న

నేటి కాలములో మనయొక్క నైతిక ప్రమాణములలోని అధోస్థితివలన ఒక ప్రశ్న ఉత్పన్నమౌతుంది. సేవయొక్క శీలముయొక్క ఆదర్శములను సూత్రీకరించుటలో, మన విద్యాలయములలో మతమును గురించిన క్రమమయిన శిక్షణ ద్వారా పిన్నవారికి భక్తి విధేయతలను నేర్పుట అవసరము కాదా అన్నదే ఈ ప్రశ్న. ప్రపంచమందనేక దేశములలో ధర్మబోధ పాఠ్యాంశములలో ఒక (భాగముగా) అంశముగా అంగీకరించబడినది.

కానీ, మనకు కనుపించే కొన్ని కారణముల వలన భారత దేశములో పరిస్థితి భిన్నముగా ఉన్నది. మన దేశమందలి విద్యాశాలలలో బోధించే నైతిక శిక్షణకు, ప్రభుత్వమువారిచే గుర్తించబడిన విద్యాశాలలలో నిషేధించబడిన మతవిషయ బోధనకు గల తేడాను మనమిక్కడ తెలిసికొనవలసి వున్నది. లౌకిక రాజ్యాంగ విధానము గల మన దేశములో ఈ నిషేధమునకు గల కారణములను అర్థము చేసికొనవచ్చును. ప్రభుత్వముచే గుర్తించబడిన విద్యాలయములలో, అన్ని మతములను గుర్తించైనా బోధించవలెను, లేకుంటే దేనిని గురించీ బోధించరాదు. అన్ని మతములను గురించి బోధించుట చాలా ఇబ్బందితో కూడుకొనిన విషయము. ఏ విధముగా చూచినా, ఏ ఒక్కదానిని బోధించకుండా ఉంటటమే నిరపాయకరమైన పద్ధతి.

అయినప్పటికి, ఈ సందర్భములో వివిధ విధములైన పాఠశాలలలో కొన్ని చిన్న చిన్న తేడాలు

కన్పించుచున్నవి, ఉదాహరణకు మతసంస్థల ఆధ్వర్యమున నడిచే విద్యాలయములున్నవి. కానీ, అన్ని సంఘములందు నేడు బాలబాలికలలో మత మన్న వైముఖ్యమేర్పడినది. కాబట్టి పాఠశాలలు పనిచేయు సమయమునకు వెలుపలనే ధర్మ ప్రబోధ మునకు అవకాశములు కనుగొనవలసియున్నది. ఇటు వంటి అభ్యాసము అమలుపరచిన చోట దానిని మెచ్చు కొనవలసినదే. ఈ తరగతులను సరియైన పద్ధతిలో నిర్వహించితే, బాలబాలికల మీద దీని ప్రభావము చాలా ప్రయోజనకారిగా ఉంటుంది. ప్రస్తుతము పాఠ్యక్రమమందు అమలులో ఉన్న నీతిబోధలోని నిజమైన బలహీనత ఏమంటే, అందులో లోతు కని పించకుండుట, ఆసక్తి దాయకము కాకుండుట. పైగా ఈ నీతిబోధ బాలుర మనస్సులను తికమక పెట్టు చున్నది. దీనికి కారణము, అన్ని మతములందలి నైతిక ప్రాతిపదిక ఒక్కటిగా ఉన్నప్పటికి, మతము లన్నీ కొన్ని విషయములలో ఒకే రూపము కలిగి యుండవు.

ఎవరికైన తమ మతమును గురించి నేర్చు కొనుటకు వీలుపడకున్న, అట్టివారు ప్రత్యేకముగా "మతము"ను గురించిన జ్ఞానము కలిగియుంటక పోవుట టుంచి, తమ సాంస్కృతిక వారసత్వములో ఒక ప్రధానమైన భాగమునే పోగొట్టుకొనినవారగుచున్నారు. అందుచేత ఎన్ని యితర ప్రావీణ్యములున్నప్పటికి, వారి మనస్సులొక విధమైన లోతులేని తనముతో ఉండి పోయి, పూర్తి ప్రతిఫలము పొందలేకుండా పోతున్నవి.

మాతృదేశ సంస్కృతినే జీర్ణింప చేసికొనలేనివారు, అదే సమయములో ప్రచారములో ఉన్న మరొక సంస్కృతిని అర్థము చేసికొనుటలో విజయము పొంద లేడనుట నిర్వివాదము.

విద్యయొక్క ఆశయములను గురించి బొంబాయి లోని ఉన్నత పాఠశాలల ఉపాధ్యాయులయొక్క సమావేశములో శ్రీ సత్య సాయి బాబా ఉపన్య సించుతూ ఈ విషయమును గురించి చాలా తీవ్ర ముగా చెప్పినారు. న్యూయార్కు నగరమునకు మార్గమును తెలిసికొనినవారు వారణాసికి మార్గము తెలియదే అని చెప్పినప్పుడు వారి కంఠధ్వనిలో కోపముకన్న ఆవేదన విచారము ఎక్కువగా వ్యక్త మైనవి.

కొద్ది మాటలలో చెప్పవలెనన్న, నైతికవిలువలను ప్రతిష్ఠించుటలో మతవిద్యాబోధన ఉత్తమ విధానము గా ఎంచవచ్చును. సంపూర్ణముగా మతవిశ్వాసములో ఉత్సాహము కలిగియున్న జీవితముయొక్క సుస్పష్ట విధానము, నైతిక కార్యాచరణకు బలమైన ప్రేరణ లను అందింపచేస్తుంది,

మతముతో నిమిత్తము లేకనే మానవుడు నైతిక ప్రవర్తన కలిగియుండవచ్చును. కానీ, ఈ విధముగా ఉండుట చాలామంది సాధారణ మానవులకు కష్ట సాధ్యము. కారణము, వ్యక్తియొక్క గాఢమైనట్టి, సాం ఘికమైనట్టి, నీతి ఒకేఒక సురక్షితమైన పునాదిమీద ఆ ధారపడి ఉన్నది. మానవుని వ్యక్తిత్వముయొక్క పవిత్రతను సహజ జ్ఞానముతో గ్రహింప కలుగునదే ఈ పునాది,

మన స్వార్థముకొరకితరులను ఉపయోగించుకొన కుండుట నేర్చుకొనినప్పుడే, నిల్వచేయుట, అధిక లాభముల నార్జించుట, లంచగొండితనము, వంచన నల వంటి దురన్యాయములు మానవుని అధీనమందుం డుట మొదలవుతుంది.

ధార్మిక శిక్షణలోని వేదాంత విషయములను గూర్చి నేర్చుకొనుటలో సిగ్గుపడవలసినదేమీ లేదు.

అన్ని వేదాంతములు స్వాభావికముగా వర్ణనాత్మక ములు. అందుచేత హిందూ వేదాంతముయొక్క మౌలిక సత్యముల నవగాహన చేసికొనుటకు, అత్యున్నతమైన మేధాశక్తి అవసరము లేదు ; యువతరములో కని పించే భావుకత చాలు. ఈ సత్యములన్నీ భారత దేశ సాంస్కృతిక వారసత్వములోని భాగములే. ఇవి అన్నీ మానవ ప్రతిభ సాధించిన ఘన విజయములే. వంశ పారంపర్యా లభించిన ఈ సుజ్ఞానమును మన చిన్నవారికి బోధించక, వారిని అజ్ఞానదశలో ఎందు కుంచవలెను ?

ఇంత చెప్పినా, అసలు ప్రశ్న మిగిలి పోనే పోయినది. ఈ దృక్పథములో మతమును గురించి పాఠశాలలలో బోధించకున్న మరెక్కడ బోధించాలి ? తాకిక ప్రపంచములో బాలురకిచ్చే మత నైతిక శిక్షణ లకు ముగ్గురు భాగస్తులున్నారు—ఒకటి కుటుంబము. రెండు పాఠశాలలు, మూడు మత సంస్థలు. బహుశా పై ప్రశ్నకు భారత దేశములో జవాబు దొరకక పోవచ్చును. దానికి కారణము, మనమింతవరకు ధార్మిక విద్యయొక్క ప్రాముఖ్యమును గుర్తించలేక పోవడమే ; గుర్తించినపుడు మార్గము దొరకక పోదు. ఏది ఎట్లు ఉన్నప్పటికి, శ్రీ సత్యసాయి బాబా లేవ తీసిన ఈ ప్రశ్నను గురించి మనమందరము దీర్ఘముగా ఆలోచించవలసియున్నది,

ఎకనమిక్ టైమ్స్, బొంబాయి

భగవంతుడు గుణాతీతుడు; భగవంతునికి ఆగ్రహము లేదు. ఆతడెల్లప్పుడు ప్రేమమూర్తి. ఆతడు గుణములతో వున్నాడుగాని, గుణములు ఆతనిలో లేవు. కుండలలో. మన్ను వున్నదిగాని, కుండలు మట్టిలో లేవు. భగవంతుడనిన భయపడవలదు. వారిని ప్రేమించి, వారికి అంగీకారము కాని అన్ని కార్యములను అనగా అన్యాయములకు భయ పడుట, ఇతరులనుద్వేషించుటకు భయపడుట, భగవదనుగ్రహము పోవునని భయపడుట మొదలైనవి, విసర్జించవలెను.

—బాబా

# అనుగ్రహ వాహిని

సమ్మెలు, బంద్‌లు, ఘెరావోలు, కొట్లాటలున్న దినములు గడచి బొంబాయిలో తిరిగి ప్రశాంతి నెల కొన్నది. జరిగినదంతా ఒక పీడకలగా ప్రజలు మరచిపోయినారు, మామూలు వాతావరణము ఏర్పడినది. మార్చినెల మొదటి తేది సాయంకాలము శ్రీ బాబావారి ఆగమనముతో బొంబాయి నగరము ఆనంద కోలాహలముతో నిండిపోయింది. శ్రీవారి దివ్యదర్శనము కొరకు, ఆ మధ్యాహ్నము నుండే వేలాది భక్తులు ధర్మక్షేత్రము ప్రక్క భజన చేస్తూ, దాహముగొనిన వారిమాదిరి వేచి ఉన్నారు. 8వ తేది ఉదయము భగవాన్ బెంగుళూరుకు వెళ్ళేవరకు, బొంబాయి నగరవాసులకా వారము దినములు ఆనందోత్సాహ భరితములైన మహత్తర పర్వదినములు. ఆదివారము సర్దార్ వల్లభాయి పటేల్ క్రీడాప్రాంగణములో రాష్ట్రములో నలుమూలల నుండి 2500 మంది బాలబాలికలు తమ దండ్రులతో వచ్చి, సత్యసాయి బాలవికాస్‌వారి కార్యక్రమములో పాల్గొనినారు. చెంబూరులోని ప్రభుత్వమువారి బాల సదనస్థులు, వోర్లీలోని గ్రుడ్డివారి పాఠశాల విద్యార్థులు కూడా పాల్గొన్నారు. వీరందరికి, బొంబాయి శ్రీ సత్యసాయి సేవాసమితి మహిళావిభాగము వారు మంచి శిక్షణ యిస్తున్నారు. "ఓంతత్ సత్ శ్రీ నారాయణ...." అనే సర్వధర్మ ప్రార్థనతో కార్యక్రమము ప్రారంభమైనది. పిల్లలందరు భారతములోని అన్ని ప్రాంతములవారి దుస్తులు ధరించి, ఇండియా పటము చుట్టూ దానిని అలంకరించినట్లుగా కూర్చొనినారు.

హరికథ ధర్మక్షేత్రముయొక్క ప్రాముఖ్యమును గురించిన ఉపన్యాసము మొదలైనవి బాలబాలికలు ఏర్పాటు చేసినారు. కుమారి కె. లక్ష్మీకాంత తన అనుభవములను గురించి ప్రసంగించినది. ఈమె బాలవికాస్ శిక్షణను పొందినది; పూర్వ సేవాదళ్ విద్యార్థిని; ట్రైనింగులో ఉన్న ఉపాధ్యాయ విద్యార్థిని. బాబావారి ఈ బాలవికాస్ ప్రణాళిక తన జీవితములో ఎటువంటి మార్పు తెచ్చినదో, అదే విధముగా ఎందరు పసివారి జీవితములలో మార్పు తెచ్చినదో తెలిపి, అది తనకొక వరమైనట్లుగా చెప్పినది

రాష్ట్ర అధ్యక్షుడు శ్రీ యం. యం. పింగేగారు, ఈ సమావేశమును రాజమండ్రి సభ చేసిన తీర్మానాన్ని అనుసరించి ఏర్పాటు చేసినామని చెప్పినారు. వైట్‌ఫీల్డులోని శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థి అయిన కమల్ సహాని "ఈ సమావేశము మనవుని తిరిగి తీర్చి దిద్దుటకొరకు చేయబడినది. ఇదే బాబావారి పవిత్ర కార్యక్రమము. ప్రాచీన భారతదేశముయొక్క ఔన్నత్యాన్ని, వారసత్వమును పునరుద్ధరించటానికి ఆధ్యాత్మిక భావప్రేరితమైన యువసైన్యము త్వరలోనే దేశాన్ని ముంచి ఎత్తుకుంటుంది" అని చెప్పినారు. భగవాన్ తన దివ్య సందేశములో "చిన్న బిడ్డలు దత్తాత్రేయ తత్వమును జీర్ణించుకొని, దానికి తగినట్లుగా జీవించాలి. అనగా ప్రపంచమనే భ్రమలో పడకూడదు, మృత్యువునకు భయపడకూడదు, భగవంతుని

యుండు శక్తియుక్తులు కలిగియుండవలెను. బాబా ఇంకా ఈ విధముగ చెప్పినారు: "క్రమశిక్షణ, దైవశక్తి, ధర్మనిరతి, ఇవి ప్రతివాని వ్యక్తిత్వములో ప్రతిఫలించాలి. పాపభీతి, దైవప్రీతి, మానవునికి రెండు కన్నులై దారి చూపించాలి. సర్వమత, సత్య ధర్మ సమభావమే సాయి తత్వము. మన దేశము నందనవనము. ఇందులో అన్ని మత పుష్పములు వికసించి సువాసనలు వెదజల్లుతవి; ఆనంద సౌందర్యములు దానికి చేకూర్చుతుంటవి."

మార్చి 8వ తేది ఉదయమునాడు దాదర్‌లోని పింగే విద్యాసంస్థవారి ఉన్నత పాఠశాలలో అన్ని కళాశాలల, పాఠశాలల ఉపాధ్యాయులయొక్క సమావేశములో, బాబావారు విద్యయొక్క ఆశయములను గురించి ప్రసంగించినారు.

పింగే సంఘమువారికి బొంబాయిలో చాలా పాఠశాలలున్నవి; వీటన్నిటిలో 400 మంది ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. కింగ్ జార్జి పాఠశాలకు ప్రతి సంవత్సరము యస్. యస్. సి. పరీక్షలలో ప్రథమ స్థానము పొందుచున్నదన్న ఖ్యాతి ఉన్నది. "అనేక విషయములతో పాటు, నైతిక, ఆధ్యాత్మిక, శిక్షణ కూడా పిల్లలకు గరపకున్నట్లయిన, విద్య తన ఉన్నతాశయమును నెరవేర్చుకొనలేదు. విద్యయొక్క ప్రధానాశయము శీలసంపదను సంపాదించటము; శీలములేని విద్య వ్యర్థము." అని బాబావారు చెప్పినారు.

ఆ రోజునే 'ధర్మక్షేత్రం'తో చేరిన బొంబాయి విశ్వ విద్యాలయములోని ఉపాధ్యాయ బృందముతో బాబావారు సంభాషించినారు. పాఠశాలల స్థాయిలో బాలురకు నైతిక ధార్మిక విషయములలో సరైన పునాది ఏర్పాటు చేయబడనందున, వీరు కళాశాలలలో ప్రవేశించేనాటికి ఎన్నో అవాంఛనీయములు అనారోగ్యకరములు, అపత్యములు అయిన అలవాట్లు నేర్చుకొనిఉందురని, వానిని బాగుచేయుటము చాలా కష్టముగా ఉన్నదని బాబా వారితో చెప్పినారు. ఈ లోపములు ఉపాధ్యాయులు సరిదిద్ది విద్యార్థుల మనస్సులను మంచి మార్గములందుంచవలెనని, నైతిక ఆధ్యాత్మిక ఉన్నత జీవితములు వారిలో నాటునట్లు చేయుటకు ప్రయత్నించాలని కూడా బాబా చెప్పినారు.

ఆ సాయంత్రము ధర్మక్షేత్రములో బాబా ఒక బహిరంగసభలో ప్రసంగించినారు: ముఖ్యముగా నిష్కామకర్మను గురించి నొక్కి చెప్పినారు. వైట్‌ఫీల్డు శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థి శ్రీనివాస్ ఈ సభలో మాట్లాడినారు. ఆ కళాశాలలో చదువుకొనుచున్నందుకు తానెంతో అదృష్టవంతుడనని, అక్కడ విద్యార్థి యొక్క నైతిక, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక వ్యక్తిత్వమును వృద్ధిచేయుటకు సమగ్రమైన కృషి జరుగుచున్నదని చెప్పినారు. రాష్ట్ర ప్రశాంతి విద్వన్మహా సభ అధ్యక్షుడు పి. కె. సావంత్‌గారు భగవాన్ తమ రాష్ట్రములో అన్ని ప్రాంతాలకు విజయము చేయాలని, ముఖ్యముగా తన పూర్వ అవతారమునకు నిలయమైన షిర్డీకి రావలెనని కోరినారు

ఆ రాత్రి బాలవికాస్ పిల్లలు రెండు చిన్న నాటకములు ప్రదర్శించినారు. ఒకటి ఇంగ్లీషులో: దీని పేరు 'ప్రేమ సేవ'. ఇందులో ఒక ముసలమ్మ సెయింట్‌ల్యూక్ సమాధి వద్దకు యాత్రగావించు చుండి. రెండవది మరాఠీభాషలో: దీని పేరు 'గురుభక్తి'. దీనిలోని విషయము మహాభారతము లోని ఒక కథ. రాజమండ్రిలో జరిగిన అఖిల భారత సమావేశములో, వ్యవసాయ ప్రయోగ క్షేత్రములు, పాలీటెక్నిక్ కళాశాలలు ప్రారంభించవలెనని, మొదట బొంబాయిలో రాజమండ్రిలో ప్రారంభించవలెనని, వాటికి కావలసిన పరికరములన్ని సంపాదించాలని.

నిర్ణయించినారు. ఇందుకు సంబంధించిన ఒక ప్రదర్శనను 4 వ తేది సోమవారమునాడు ధర్మక్షేత్రములో బాబా ప్రారంభించినారు.

ఆ సాయంకాలము ఖర్ ప్రాంతములో ఉన్న ఒక పాఠశాలను బాబా దర్శించినారు. ఈ పాఠశాలలోని పిల్లలకు, బొంబాయి సేవా సమితివారు ఉచిత వైద్య సహాయాన్ని అందించుచున్నారు. ఆ తరువాత ఖర్‌లో ఒక బహిరంగ సభలో బాబా ప్రజలకు దర్శనభాగ్య కలిగించి, తన అమృత కంఠమెత్తి కొన్ని భజన కీర్తనలు పాడి పాడించినారు. 5వ తేది ఉదయమున ధర్మక్షేత్రములో నెలకొల్పబడ్డ పారిశ్రామిక పాఠశాల యొక్క నూతన భవనములకు బాబా ప్రారంభోత్సవము చేసినారు. ఆ తరువాత అగరవత్తులు తయారు చేసే మహిళావిభాగము వారిని బాబా దీవించినారు; 'దిల్‌మే రాం, హాత్‌మే కాం' ఉంచుకొని నందుకు మెచ్చుకొనినారు. అక్కడే సత్యసాయి విద్యామందిరములోని ప్రాథమిక పాఠశాలల విద్యార్థులను, కేంద్రప్రభుత్వమువారి మూగ చెవుడు పాఠశాల విద్యార్థులను, బాబా దీవించినారు. ఈ పాఠశాలలో ఒక బాలవికాస్ తరగతిని బొంబాయి సమితి వారు నడుపుచున్నారు.

ఆ మధ్యాహ్నము బాబా 36 గురు డాక్టరులతో సంభాషించినారు. వీరంతా సేవాసమితి నిర్వహించే ఉచిత వైద్య శిబిరములో దఫాలువారిగా సేవ చేస్తున్నారు. చెంబూరులోని ట్రాంబే-కోలివాడలో ఉన్న ఉచిత వైద్యశాలలో కూడ క్రిసమస్‌నుండి ప్రతి ఆదివారము పని చేస్తున్నారు.

ఆ సాయంకాలము రాష్ట్ర అధ్యక్షుడు ప్రకటించే, 'క్వార్టర్లీ న్యూస్‌లెటర్'ను బాబా విడుదల చేసినారు. ఇందులో, సేవాసమితులందు పనిచేసేవారికి పనికి వచ్చే సలహాలు, రాష్ట్ర సమితి చేపట్టి చేస్తున్న, చేయనున్న కార్యక్రమముల వివరాలను ప్రకటించుచున్నారు. అందుచేత ఎక్కడేమి జరుగుతున్నదీ అందరికీ అవగాహన అవుతుంది. ఇది కూడా రాజమండ్రిలో తీసుకొనిన ఒక నిర్ణయమును ఆచరణలో పెట్టడములో మొదటి దశ. ఇతర రాష్ట్రముల వారు కూడా దానిని అనుసరించాలి. తరువాత సేవాదళ సభ్యులకు గుర్తింపు కార్డులు, కార్యనిర్వాహక సభ్యులకు దినచర్య పుస్తకములు పంచి పెట్టినారు.

6వ తేది సాయంకాలము సేవాసమితులు, సేవాదళముల సభ్యులకు వారి కార్యక్రమమును గురించి, సాధనను గురించి బాబా ఉద్బోధించినారు. 7వ తేది ఉదయము బాబా స్వచ్ఛంద సేవకులను ఆశీర్వదించినారు. 8వ తేది ఉదయము ప్రత్యేక విమానములో బాబా బెల్గాము వెళినారు. వారి వెంట రాష్ట్ర సంఘ అధ్యక్షుడు, రాష్ట్ర కేంద్ర ట్రస్ట్ సభ్యులు, ఇతరులనేకులు ప్రయాణము చేసే అదృష్టమును నోచుకొనినారు.

భగవాన్ బొంబాయిలో ఉన్న దినములలో, నిత్యము చకాలానుండి ధర్మక్షేత్రము వరకు నగర సంకీర్తన చేసినారు; వారందరికి బాబా దర్శన భాగ్యమును అనుగ్రహించేవారు. ఉదయ సాయంకాలములందు భజనలు జరిగినవి. వేలాది ప్రజలు నిత్యము బాబా దర్శనానికి వచ్చేవారు.

సాధారణంగా స్వామి తన భక్తుల ఆర్తి తీర్చి, వారికి దర్శనము కలిగించేటందు కిటువంటి ప్రయాణములు చేస్తుంటారు. కానీ, ఈ ప్రయాణము, రాజమండ్రిలో తీసికొనిన నిర్ణయములను యథాశక్తి అమలు జరుపుటకు ప్రయత్నించినట్టి బొంబాయి రాష్ట్రమును దీవించటానికి జరిగింది. బాబావారి అనుగ్రహముతో, ఆశీస్సులతో సాధించలేనిదేమున్నది ?

# సాధకురాలి అనుభవము

భగవాన్ పాదపద్మములకు ప్రణామములు; గురువులకు పెద్దలకు నమస్కారములు; సాయి సోదరసోదరీమణులకు నా అభినందనలు.

బాలవికాస్, పూర్వసేవాదళము సేవావిభాగముల లోని అనుభవాల సారాంశాన్ని, వాటి అనుభూతుల సారాన్ని, నాలో యివి కలిగించిన మార్పులను క్లుప్తముగా మీకు చెప్పదలచుకున్నాను.

స్వామి వివేకానందుడొక కథ చెప్పినారు. ఒక సింహపు పిల్ల పుట్టిన వెంటనే తల్లి చనిపోయినందున ఒక గొర్రెల మందతో పెరిగింది. తానొక సింహమునని, వనరాజ్యానికి వారసుడనని దానికి తెలియదు. తాను కూడా ఒక దుర్బలమైన గొర్రెపిల్లనని భావించింది. నేటితరమునకు చెందిన మనము కూడా ఆ సింహపు పిల్లవలె మన సంస్కృతికి దూరము చేయబడి, ప్రపంచములోనే ఉన్నతమైన సంస్కృతికి వారసులమని తెలిసికొనలేక ఎంతో శోచనీయమైన స్థితిలో ఉన్నాము. ఆ కథలో, సింహగర్జన విని గొర్రెపిల్లవలె గజగజలాడుతున్న యీ సింహశాబకాన్ని ఒక సింహము చూచి "నీ స్థితి చాలా హీనంగా ఉన్నది! నీవు వనానికి రాజకుమారుడవు కాని గొర్రెపిల్లవు కావు. నీకు సహజమైన గొప్పతనాన్ని స్వీకరించు" అని చెప్పింది. కథలో సింహపు పిల్లకు సింహము చెప్పినట్లుగానే, బాబాయొక్క బాలవికాస్ ప్రణాళిక మాకు బోధించింది: "మీరు అమృతపుత్రులు; మీ ఉత్కృష్టవారసత్వాన్ని తెలిసికొని దానికి తగినట్లుగా జీవించండి" అని బాబా చెప్పుచున్నారు.

నా చిన్నతనములో, నేను బాలవికాస్ తరగతులకు (ఆ దినములలో దానిని బాలవిహార్ అనేవారు) వెళ్ళవలెనని నా తల్లిదండ్రులు చెప్పినప్పుడు, అది నాకేమాత్రమూ సంతోషము కలిగించలేదు. ఈ తరగతులు ఆదివారమునాడుండేవి. ఆ దినము ఆనందముతో గంతులు వేయడానికి ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూసేవారము. పైగా బాలవికాస్ తరగతి అంటే, నీతిబోధ, ఆధ్యాత్మిక బోధ అని నాకు చెప్పినారు. అదంతా నాకు అర్థము కాక అగమ్యగోచరంగా ఉండేది. నా గొణుగుడు కానీ, ఆక్షేపణలు కానీ, పని చేయలేదు; నేను పోక తప్పలేదు. కానీ, అక్కడి వాతావరణము నేనూహించి భయపడినదానికి చాలా విరుద్ధంగా ఉన్నది.

"సాయిరాం దీదీ" అని పిల్లలు సంబోధించే ఉపాధ్యాయిని మమ్మెంతో ప్రేమాభిమానాలతో చూచింది. అయినా అక్కడి భజనలు, ధ్యానము, స్తోత్రములు, ముఖ్యంగా శాంతిమంత్రము యొక్క అవసరము నాకర్థము కాలేదు. నా సుఖము కొరకు సౌఖ్యముకొరకు ప్రార్థించటము బాగానే ఉన్నది కాని, అందరికొరకు, అందులో నాకిష్టము లేనివారికొరకు, ప్రార్థించటమెందుకో నాకర్థము కాలేదు. దీనిని నేను సరిపెట్టుకోలేకపోయినాను. ఏమైనా

తరగతులు చాలా ఆనందాన్ని కలిగించినవి. ముఖ్యంగా భారత భాగవత రామాయణముల లోని కథలు చాలా బాగున్నవి. వీటికి, నేను లోగడ చదివిన కథలకు, చాలా తేడా ఉన్నది. త్వరలోనే ఆదివారము ఎప్పుడు వస్తుందా అని చూచినాను. ధ్యానము నా కెంతో హాయి నిచ్చినట్లుగా తెలుసుకొన్నాను. అది నా ఏకాగ్రతను జ్ఞాపకశక్తిని వృద్ధిపరచింది. వెనుకటికన్నా నా చదువు లో నేను ముందున్నాను.

ఆధ్యాత్మిక దినచర్య వ్రాసుకొనే అలవాటు కూడా నాకు పట్టుపడింది. అంటే, సత్యహరిశ్చంద్రుడు అయినానని అర్థము కాదు. అబద్ధమాడినప్పుడు, ఏదైనా చెడ్డ పని చేసినప్పుడు నా మనస్సులో ఏదో పొడిచి నట్లు బాధపడేదానిని. అంతకుముందు అబద్ధము చెప్ప టానికి ఎటువంటి సంకోచము, భయము, ఉండేవి కావు. బాబా స్వయముగా అక్కడ బోధించే విషయ ములను గురించి వివరించే వరకు నా కవి కొంతవరకే అర్థమైనవి.

బాబా యీ విధంగా చెప్పినారు: " మీ తల్లిదండ్రులే మీకు కనిపించే దైవము. పండరీపుర వాస్తవ్యుడైన పుండరీకుడు ఏ విధముగా వైకుంఠనాథుని అను గ్రహము సంపాదించాడు ? భగవంతుని ప్రార్థించి కాదు ; తల్లిదండ్రులను ప్రేమతో భక్తితో సేవించి, ఆ సేవే వైకుంఠనాథుని వాని సన్నిధికి తీసుక వచ్చింది." ఉదయము నిద్రలేచినంతనే, తల్లి దండ్రులకు మనస్సులోనే నమస్కరించమని పంతులమ్మ ఎందుకు చెప్పిందో అప్పు డర్థమైనది. స్తోత్రములు, ప్రార్థనలను గురించి బాబా ఈ విధంగా చెప్పినారు : " మీరు ఉపయోగించుకొనే నీటికి విద్యుచ్ఛక్తికి మీరు పన్ను కట్టుతున్నారు. ప్రకృతిద్వారా అనంతమైన సదుపాయములు, పగలు వెలుతురు ప్రసాదించు సూర్యుడు. మధురమైన జలమును మీకిచ్చి మీ దాహము తీర్చే జీవనదులు మొదలగునవి కలిగించే భగవంతునికి, అతడిచ్చే కానుకలకు, మీరేమి పన్ను చెల్లించుచున్నారు ? భగవంతునియొక్క అనంత దాతృత్వమునకు మనము చేసే ప్రార్థనలే మనము చూపించే కృతజ్ఞత. సైన్సు సాంకేతిక విద్యలందు మనమెంతో అభివృద్ధి చెంది నామని చెబుతుంటాము. కానీ, ఈ అభివృద్ధి అంతా, భగవంతుడు ప్రసాదించిన బుద్ధి బలము, మేధా శక్తి అనే అమూల్యమైన వరముల ద్వారనే కదా సాధ్య మైనది. గణపతిని ప్రార్థించినా, గాయత్రిని పూజిం చినా, మనకు సన్మతినిచ్చి సన్మార్గమున నడిపిం చేందుకే కదా.

"ధ్యానము మనస్సును సాధువుగా చేస్తుంది. భజన అన్ని విధములైన కల్మషాలను తొలగించుతుంది. ఇది మానవుని రోగములకు, దుఃఖములకు, మంచి విరుగుడు మందు వంటిది " అని బాబా చెప్పినారు. బాబా ఇంకా ఈ విధముగా చెప్పినారు : "మాలలోని పూలన్నిటిని దండగా కట్టి ఉంచిన దారము మాదిరిగా, ఏకైక దైవ తత్వము ఈ సృష్టినంతా భరించుతుంది. అంతా వసుధైక కుటుంబములోనివారే—భగవంతుని తండ్రిగా, తోటి మానవుని సోదరునిగా తెలిసికొనండి." అప్పటికి శాంతిమంత్రమైన " ఓం సర్వే జనాః సుఖినో భవంతు ". యొక్క భావము నాకర్థమైనది. నాకు శత్రువు అనుకొనినవారితో సహా—వారందరు వాస్తవములో నా తోబుట్టినవారే కాబట్టి —సర్వ జనుల సుఖముకొరకు ఈ మంత్రము నెందుకు పఠించవల సిందో తెలిసింది.

బాలవికాస్ తరగతినుండి, పై తరగతి అయిన పూర్వ సేవాదళ తరగతిలోనికి వచ్చినాము ఇక్కడ

నైతిక ఆధ్యాత్మిక విషయాలను మాకు ఇంకా లోతుగా చెబుతుండేవారు. మాకు రామకృష్ణ పరమహంస జీవితమును గురించి, వారి ఉపదేశములను గురించి చెప్పినారు. వారి జీవితము భగవంతుని అన్వేషనలో ఒక మహత్తరమైన నిరూపణ. భగవంతుని సాక్షాత్కరించుకొనుటలో ఉత్తేజకరమైన ప్రయోగము. "ఏకంసత్ విప్రాః బహుధా వదంతి"—సత్య మొక్కటే కాని దానిని యోగులనేక నామములతో పిలుస్తారు ; అదే మహా వాక్యము ననుసరించి, అన్ని మతములసారమొక్కటే అని క్రైస్తవ సిద్ధాంతము యొక్క అధ్యయనము నాకు విశ్వాసము కలిగించింది.

చక్కని సరళమైన భాషలో గీతాసారాన్ని ఉప దేశించినట్టి బాబావారి 'గీతావాహిని' మాకొక పాఠ్య గ్రంథము. తన జీవితానికి కర్మధారిగా, ఆమన యించే మిత్రునిగా, అన్నివేళలారక్షించే తల్లిగా, మహాత్మా గాంధి భగవద్గీతను వర్ణించినారు, వారిట్లనినారు ; " నిరాశ కన్నుల ఎదుట తేరి చూస్తుంటే, ఒక వెలుగు కిరణం కూడా నాకు కని పించనప్పుడు, గీత ఒక్కటే నాకు శరణ మైనది. ఇక్క డొక శ్లోకము అక్కడొక శ్లోకము కనిపించేవి. దానితో, అంతవిచారంలోనూ నేను నవ్వుకొనేవాడిని." ఎవ్వరి యందు ద్వేషము లేనట్టి, సర్వభూతములందు ప్రేమ కలిగినట్టి సమభావాన్న—" అద్వేష్టా సర్వభూతా నాం మైత్రఃకరుణఏవచ," అనే ధార్మిక జీవితాన్ని గీత ప్రబోధించుచుంది. భగవంతునికి ప్రియమైనట్టి, సార్థక్యము చెందినట్టి జీవితముయొక్క కళను బోధించి, ఆత్మను కనుగొనుటకు తోడ్పడుతుంది.

యోగాభ్యాసములో కూడా మాకు శిక్షణ యిచ్చి నారు. ఆరోగ్యముగా ఉన్న మనస్సు ఆరోగ్యముగా ఉన్న శరీరములోనే ఉంటుంది. శరీరము ఆరోగ్య ముగా ఉన్నప్పుడే, లౌకికమైనట్టి లేక ఆధ్యాత్మిక మైనట్టి అభివృద్ధికి అవకాశముంటుంది ధ్యానమును గురించి కూడా బోధించినారు. ఈ విధంగా పూర్వ సేవాదళ తరగతిలో శరీరము, మనస్సు, ఆత్మలను గురించి చక్కని శిక్షణ యిచ్చినారు.

ఈ తరగతి పూర్తి అయిన తరువాత మేము సేవా దళ కోర్సులో కాని, బాలవికాస్ బోధన కోర్సులో కాని చేరవలసివున్నది. బాలవికాస్ తరగతులలో బోధించుతూ, అదే సమయములో క్రొత్త విషయములు నేర్చుకొనుటము నా అభిలాష. అందుచేత, నేనిప్పు డొక బాలవికాస కేంద్రములో శిక్షణ పొందుతున్న ఉపాధ్యాయురాలిని.

బృందావనమందు వేసవి తరగతులలో, నేను గడిపిన దినములు నా జీవితములో ఉత్కృష్టమైన అనుభవముగా భావించుచున్నాను. ఆ అనుభవము జ్ఞానమందాకినిలో స్నానము చేసినటువంటిది. పావన గంగానది మన పాపములను కడిగి మనలను పరి శుద్ధులు గావించినటుగానే, జ్ఞానగంగ మన అజ్ఞానాన్ని పోగొట్టి మన హృదయాలను జ్యోతిః పూర్ణము గావించుచుంది అమూల్యములైన వేదములలో, ఉప నిషత్తులలో, ఉదాత్తమైన ధర్మగ్రంథాలలో నిక్షిప్త మై ఉన్న మన సంస్కృతిని గురించి, వారసత్వమును గురించి, జ్ఞానమును గురించి ఎంతో నేర్చుకొంటిమి. ఆదిశంకరుని "భజగోవింద" శ్లోకములను గురించి మృదమధురమైన భాషలో బాబావారి ఉపన్యాసము నిత్యకార్య క్రమమునకు మకుటముగా ఉన్నది. ఇంక ఏ మాత్రము 'మంద-మతులు' గా నిలిచిపోక, 'ముక్త-మతులు' గా మారవలసిందని ప్రబోధించి,

జీవితమునందిప్పుడే ఆధ్యాత్మిక మార్గము [illegible] ను సించవలసిందని స్వామి సలహా యిచ్చినారు.

బాబావారి బాలవికాస్ ప్రణాళిక నా జీవితములో ఉత్తమోత్తమమైన వరముగా రుజువైనది. అంతకు ముందు ఆదివారములన్ని సినిమాలు చూడటములో, వ్యర్థ ప్రసంగాలలో నాకాలమంతా వెళ్లబుచ్చేవాడిని. అర్థములేని ఆనందముతో గడిపే నా జీవితానికి బాలవికాస ప్రణాళిక ఒక ఆదర్శమును ప్రసాదించినది : నన్నొక ఆదర్శ [illegible] తీర్చిదిద్దినది. మా చిన్న తనమందే బాబా మమ్ము సత్యాన్వేషణ మార్గములో నడిపించుట మహద్భాగ్యము నిజముగా మేమెంతో అదృష్ట వంతులము. ఆ జ్యోతి నుండి మేమెంతో ప్రకాశించే భవ్యభవిష్యత్తు బాబా మాకు చూపించినారు.

మా ఈ సత్యాన్వేషణ సాధనమును ముందుకు సాగించుటకు, బాబాయొక్క ప్రేమ సందేశాన్ని వ్యాపింపచేయుటకు తగిన శక్తి సహకారంగా, బాబా మమ్ము ఆశీర్వదింతురుగాక.

లక్ష్మీదాస్

ప్రణవోచ్చారణతో భజన మొదల [illegible] ఆదస్లే
మరే ప్రశాంతస్థలములోనైనా కొంతసేపు ధ్యానముచేయవలెను. ఒక జ్యోతిని వెలిగించి ఉంచుకొని, చక్కగ దానినే ధ్యానించి, భ్రూమధ్యమునకు, నేరుగా హృదయకమలములోనికి దానిని ప్రవేశపెట్టవలెను. ఆ తరువాత కమలము వికసించినట్లుగనూ, లోని జ్యోతి ప్రకాశము వ్యాపించి అంధకారమును నాశనము చేసినట్లుగాను భావించుకొనవలెను..........

తత్త్వోపదేశమును శ్రవణము చేసి, మననముతో ధృవీకరించి, నిధిధ్యాసముతో అనుభవములోనికి తీసుకొనిరావలెను

—బాబా

# ద్వితీయాగమనము

## పలుకు సత్యమైనది

1974 మార్చి 9వతేది శనివారమునాడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా సొండూరు నగరములో ఒక మహా భక్త సమావేశములో ప్రసంగించారు. సొండూరు విజ్ఞాన వివేకములుకలిగిన ఘోర్పడే వంశమువారిచేత పాలింపబడిన సంస్థానము. ఈ సమావేశము, చాలా ప్రాశస్త్యమై, అందమైన సొండూరు రాజభవనము ముందు జరిగింది. వెనుకటి విషయములు జ్ఞాపకము చేసి బాబా తన ఉపన్యాసమును ముగించినారు: "దివ్యాత్మస్వరూపులారా! 27 సంవత్సరాలనాడు నేనిక్కడకు వచ్చినప్పుడు సొండూరు సంస్థానములోని ప్రజలను కలిసికొనలేకపోయినాను. ఈ ప్రాంతీయ ప్రజలకు నాసందేశము నందివ్వలేకపోతిని. కానీ, చాలాకాలముగా మీకు నాకుమధ్య, ఎడతెగని సంబంధమొకటి నిలిచిపోయింది ఒక వృక్షము పెరిగి ఫలముగా తయారగుటకు కొంతకాలము పట్టుతుంది. గడచిన కాలమంతా మీకు తెలియకుండానే ఈ కోరిక ఫలించేందుకు కృషి జరిగింది పసివాడు కొన్ని సంవత్సరాలు గడచినకాని పెద్దవాడు కాలేడు. అదేవిధంగా. మీభక్తి అనురాగముల, ఈ సాన్నిహిత్యాన్ని పొందటానికింతకాలము పట్టినది."

ఈ ప్రథమ సమావేశములో, 27 సంవత్సరముల నాడు బాబావారు తమ సంస్థానమునకు విజయము చేసి, అనాటినుండి నిరంతరము వారి అనుగ్రహమును తనకు, తన ప్రజలకు కలిగించినందుకు, మహారాజా యశ్వంతరావు ఘోర్పడే కృతజ్ఞత తెలిపినారు. "1947వ సంవత్సరమునుండి నాకు బాబావారి పాదసేవ చేసుకొనే భాగ్యము కలిగినది. బాబావారి నిజభక్తునను భయమన్నా, ఆశాభంగమన్నా ఏమిటో తెలియదు. ఆశాభంగము నన్ను తేరిచూసుండగా ఏకాకిగా, ఒక్క ఆశాకిరణముకూడా కనిపించని స్థితిలో నేను బాబావద్దకు వెళ్లేవాడిని. నాజీవితములో ఎన్నో విషాదమయ సంఘటనలు జరిగినవి. వాటి యొక్క చిహ్నములు నాయందేమాత్రము మిగిలి లేవంటే, బాబావారి అనుగ్రహ ప్రబోధములే ముఖ్య కారణములు".

బాబావారి ఒక ప్రత్యేక అనుగ్రహమును గురించి మహారాజిట్లు చెప్పినారు: "భారత దేశముయొక్క ఐక్యత, ఆనందము కొరకు, 1949లో నేను ఈ సంస్థానముయొక్క పరిపాలన వదలివేసినప్పుడు, మానవుడను కాబట్టి, చాలా విచారించినాను. నా భవిష్యత్తు నాకు స్పష్టముగా కనిపించలేదు. దాని కొరకు బాబా శ్రీచరణాలను ఆశ్రయించినాను. నేను విచారించవలసిన పనిలేదని, యీ సంస్థానముకన్న పెద్ద సంస్థనే నిర్మించగలనని, అప్పుడు బాబా చెప్పినారు! బాబా పలుకులలోని భావమప్పుడు నాకవగాహన కాలేదు.

1954లో, ఒక యూరోపియన్ ఆధిపత్యములో ఉన్న సాండూరు మాంగనీస్ గనులకం పెనీ యాజమాన్యమును నేను తీసుకొని పారిశ్రామిక రంగములో ప్రవేశించి, సాండూరు మాంగనీస్ అండ్ ఐరన్ ఒర్ ప్రయివేటు లిమిటెడ్ కంపెనీని ప్రారంభించినాను. బాబా అనుగ్రహముతో అది త్వరలోనే అభివృద్ధి చెందింది. 1961లో. దానిని పబ్లిక్ లిమిటెడ్ కంపెనీగా మార్చి, దానిని పెంచి, దానితో ఎలెక్ట్రో మెటలర్జికల్ పరిశ్రమను నెలకొల్పినాను. బాబా ఆశీస్సులతో, మెటల్ అండ్ ఫెరో ఎల్లాయిస్ ప్లాంటుకు పునాది వేసినాము. 1966లో దానితో ఉత్పత్తి ప్రారంభమైనది. నేడు బాబా స్వయముగా ఫెర్రో సిలికాన్ విభాగమును ఆశీర్వదించుచున్నారు.

1949లోని బాబాయొక్క దివ్యవాణియొక్క అంతరార్థము నేనిప్పుడు గ్రహించగలిగినాను. ఇప్పుడు గనులలో 3000 మందికిపైగా కార్మికులు పని చేస్తున్నారు. ఈ నూతన విభాగములో మరొక వెయ్యి మంది పని చేయడానికి అవకాశమున్నది. కాబట్టి, నేడు మీరు నావ్యక్తిగత భావము లేమిటో తెలిసికొనగలరు. బాబావారి ఆశీస్సులతో, యిందులో ఘన విజయమును సంపాదించి, కర్ణాటకరాష్ట్ర పురోభివృద్ధికి నిరంతరము కృషిచేయగలవాడను "

రెండు దినములు బాబా రాజకుటుంబముతోనూ ప్రజలతోనూ గడిపుట వాస్తవములో మరపురానట్టి ఘట్టము. శుక్రవారమునాడు ప్రాచీన నగరమైన హంపి దగ్గరలో ఉన్న వ్యాసనకరే ఫెర్రోయల్లాయిస్ ప్లాంటుకద్దకు బాబా వచ్చినారు. ఈప్రదేశమందున్న హొసపేటయందే బాబా అవతార ఉషఃకాంతులు వ్యాపించే కాలములో, యిక్కడి పెద్దలు. 14సంవత్సరముల ప్రాయముండున్న బాబాకు ఘనమైన ఆహ్వానము నందించినారు

ఘాత్వార్‌నుండి మహరాజా బాబాకు వెంబడించినారు. వారంతా కొలిమి నిర్మించే స్థలమునద్దకు వెళ్లినారు అచట కలశమును తీవించి, మహారాణిని దానిని వేద ఘోషమధ్య, సుస్థాపితము చేయమని ఆదేశించినారు. అక్కడి వేదపండితులను, ప్రాజెక్టునిర్మాణుని, బాబా అనుగ్రహచిహ్నములు ప్రసాదించినారు. కొలిమి గదిలో ఉంచేటందుకు తెచ్చిన తన పెద్దపటమునకు స్వామి సంతకము చేసినారు.

తరువాత బాబా పిగ్ ఐరన్ కొలిమివద్దకు వెళ్లినారు; అది పనిచేస్తుండగా కొంత తడవుచూచి 'స్వాగత వచనము' ప్రవేశమార్గములో రెండు చెంపలమొక్కలు నాటినారు. ఈ వాటికను ప్రతీకముగా బాబావారి ఆగమన చిహ్నముగా నిర్మించినారు. తరువాత, గానముల దివ్యసుగంధము గాలిలో వీచుచుండగా, వేలాదిభక్తులు స్వామికి స్వాగతముపలికినారు. "యోగస్తంభము" నావిష్కరించిన తరువాత, జయజయధ్వనులమధ్య స్వామి వేదికనలంకరించినారు.

మృదుమధురమైన కన్నడములో బాబా ప్రసంగించినారు. ప్రతి పలుకులో స్రవించే ప్రేమవాహినితో బాబా అందరి ప్రేమవిధేయతలు పొందినారు. "మనసా, వాచా, కర్మణా, భగవంతుని సన్నిధి యందున్నప్పుడే మానసికశాంతిని పొందవచ్చును దీనిని పాండిత్యముతో, అధికారముతో, ధనముతో పొందలేము, మనమేమి చేస్తున్నప్పటికీ, భగవంతుని సాన్నిధ్యము ననుభవించగలము. మీరిక్కడ యినుమును సాగదీసి దానికొకరూపమును కల్పించుచున్నారు. అయస్కాంతము ఇనుము నాకర్షించుతుంది.

కానీ, ఇనుము త్రుప్పులేక సుభ్రముగా ఉండాలి. మానవుడే ఆ ఇనుపముక్క: భగవదనుగ్రహమే అయస్కాంతము. మనస్సు దుష్టభావములతో అప విత్రమైపోయినప్పుడు, అనుగ్రహమును పొందలేము. అయస్కాంతము ఇనుము నాకర్షించవలెనంటే, దాని నేవిధముగా శుభ్రపరచాలి ? ప్రేమ పరిశుద్ధపరు స్తుంది భగవంతుడే ప్రేమ ! ప్రేమ మనలను దేవతలుగా చేస్తుంది,'' అని బాబా చెప్పినారు.

బాబా మానవశరీరము నొక యంత్రముతో పోల్చిచెప్పినారు, "మీరందరు యంత్రములతో పరిచయమున్నవారే కదా. అవి ఎంతవిలువ కలవి అయినప్పటికి, ఎంత జటిలముకలవి అయినా, ఉప యోగకరము.లైనా, వాటిలో కరెంటు ప్రవేశించినప్పుడే అవి పనిచేయగలవు. ఈ కరెంటే ఆత్మజ్ఞానము: దీనిని సంపాదించటము మానవుని ముఖ్యకర్తవ్యము. నేడు మానవుడు లక్షలాదిమైళ్ల దూరములో ఉన్న చంద్రునిలో ఏమున్నదో తెలిసికొన ప్రయత్నించు చున్నాడు. ఇది ధనము కాలము వృధాచేయడమే. దీనికిబదులు మానవుడు కనీసమొక అరంగుళము దూ రము తన హృదయములో ప్రవేశించగలిగి, అందున్న ఆత్మయొక్క ఘనతను, వైభవాన్ని తెలుసుకుంటే బాగుంటుంది". అని బాబా బోధించినారు.

"శరీరము మందిరమువంటిది; అందులో శివుడు ప్రతిష్ఠితుడైఉన్నాడు, కానీ, ఆ శివుని చూచుటకు ప్రయత్నించక, ఆనందముపొందలేక పోతున్నావు. నీయందేఉన్న శివుని తెలిసికొన ప్రయత్నించక, ఆ మందిరానికి యోగ్యుడైన ధర్మకర్తగా నివశించ లేకున్న నీ జీవితము వృధా. దినమంతా శ్రమించినంత మాత్రాన, ఆనందము లభించదు. ఆనందమేరీతిగా లభించుతుందో నేనుచెబుతాను. నిత్యము ఉదయ సాయంకాలములందు కనీసము ఐదు నిమిషములు మంచి ఆలోచనలతో, మంచివారితో, మంచి కార్య ములుచేస్తూ గడపండి; ద్వేషమును, కోపమును, దురా శను విసర్జించండి; అందరిని గౌరవించండి ; ఎవ్వరిని ద్వేషించవద్దు."

ఆధ్యాత్మికాభివృద్ధికి సరియైనపద్ధతులలో తగిన ప్రయత్నములు చేయవలసిందని బాబా చెప్పినారు. "పళ్లెములోని చపాతీలు పొట్టలోనికిపోవాలంటే, మంచి ప్రయత్నముండవలెను కదా ? సరియైన పంథాలో ఏ ప్రయత్నములేకుండా, మానసికశాంతి ఎట్లా వస్తుంది ? దీనికొరకు ధ్యానముకానీ జపముకానీ పూజకానీ, తపస్సుకానీ అవసరమని భావించవద్దు. నిర్మలభావములు, ప్రేమపూర్వకకార్యములు, మధుర భాషణలు, సానుభూతి చాలు'' అని చెప్పినారు.

## రాజ భవనము

ఈ ఉపన్యాసము తరువాత బాబా సాండూరు రాజ భవనానికి వేంచేసినారు, వారివెంట మహారాజా, డా॥ వి.కె. గోకాక్, కర్నల్ జోగారావుగారలున్నారు రాజభవన ద్వారమువద్ద స్వామికిలభించిన స్వాగతము చూచి ఆనందించవలసినదేకాని వర్ణించలేము. వేలాది భక్తులు పాడిన కీర్తనలధ్వని అంతటా ప్రతిధ్వనించి నది. సహనాయిమేళ మృదుమధురధ్వని చెవులకు విందుచేసినది. స్వామిని, పుష్పములుచల్లిన మార్గము వెంట, వేదికమీదకు తీసికొనివెళ్లినారు. అందముగా అలంకరించుకొనిన బాలికలు బాటకు రెండుప్రక్కల నిలబడి బాబామీద పుష్పములు చల్లినారు. రాజ ఛత్రమునీడన బాబా నడచినారు, పూర్ణచంద్రుడు నిర్మలాంబరములో చల్లనివెలుగు ప్రసాదించుచున్నా డు. రంగురంగుల దీపమాలికలా ప్రదేశమునంతా

# “భాగ్య” నగరము

భగవాన్ బృందావనంనుంచి విమానంలో ఏప్రిల్ ఒకటవతేదీన హైదరాబాదు విచ్చేసి తమ ఆగమనం కోసం నిరీక్షిస్తున్న వేలాదిభక్తులను అనుగ్రహించారు. ఆదినం శ్రీరామనవమి. శివం ప్రాంగణంలో శ్రీవారి దర్శనం లభించగానే భక్తులు హర్షధ్వానాలు చేశారు.

ఆనాటి సభలో స్వామి వేదముల పరమార్థమును వివరించారు. భగవంతుడు వేదస్వరూపుడనీ, మానవుని దివ్యత్వమును ప్రబోధించుటే వేదముల లక్ష్యమనీ సెలవిచ్చారు. ధర్మార్థకామమోక్షములు నాలుగూ ఉత్తమములే అనీ, అర్థకామములుకూడా భగవత్పరమైనప్పుడు ఉదాత్తములు కాగలవనీ, అర్థింపబడువాడు కనుక భగవంతుని అర్థమనీ, కామేశ్వరుడనీ, వేదములు పేర్కొన్నవని స్వామి ప్రవచించారు. ఆనాడు శ్రీరామనవమి. పండుగ జరుపుకోవటంకంటే ధర్మస్వరూపుడైన రాముని గుణగణములను అలవరచుకొని అనుసరించుట ప్రధానమని భగవాన్ ప్రబోధించారు.

స్వామి ప్రసంగానికిపూర్వం బెంగళూరు శ్రీసత్యసాయి కళాశాలవిద్యార్థి శ్రీనివాస్ తనఅనుభవములనూ, స్వామి రూపొందించిన విద్యాప్రణాళికలోని విశిష్టతనూ వివరించాడు. స్వామి ప్రసంగానంతరము లండన్ నగరంనుంచి వచ్చిన ముకుంద్ తన వీణాగానంతో వీనులవిందుచేశాడు.

ప్రణవ సుప్రభాతాలతో నగరసంకీర్తనం చేసి వచ్చిన భక్తబృందాలకు స్వామి ప్రభాతదర్శనం అనుగ్రహించారు. ఉదయం తొమ్మిదిన్నర గంటలకు ప్రతీక్షించే భక్తకోటికి స్వామి దర్శనంప్రసాదించారు. రెండు మూడు తేదీలలోకూడా సాయంకాలం స్వామి ఆధ్యాత్మిక ప్రవచనాలుచేశారు. మాత, భూమాత, గోమాత, వేదమాతలను పూజించటం భారతీయ సంస్కృతికి ముఖ్యలక్షణమనీ, ఆనందం లోపలినుంచి వూరేదికాని బైటనుంచి కూరేదికాదని సెలవిచ్చారు.

నాలుగవతేదీన శివం వార్షికోత్సవం. కవి సమ్మేళనం ఏర్పాటుచేశారు. మాటలమూటలుగావుండి కాసులకు అమ్ముడుపోయే నేటి కవిత్వాన్ని స్వామి నిరసించారు. అర్థం, భావం, శబ్దం అన్నీ చక్కగా అమరి పరమాత్మ తత్వ ప్రబోధంచేసే ఉత్తమ కవిత్వాన్ని ప్రశంసిస్తూ “శ్రీరమారమణీమనోహరా, ఆశ్రితజనశుభకర” అనే కీర్తనను మృదుమధురంగా ఆలపించి ఉదహరించారు. డాక్టరు దివాకర్ల వెంకటావధాని, కరుణశ్రీ, ముదిగొండ వీరభద్రమూర్తి, అమరేంద్ర తమ కవితా కుసుమాలు స్వామి చరణకమలాలకు సమర్పించారు. జమ్మలమడక మాధవ రామశర్మగారు కవి సమ్మేళన సంచాలకులుగా వ్యవహరించారు.

రెండు మూడు తేదీలలో స్వామిప్రసంగానికి పూర్వం, రాజన్‌పటేల్, కమల్‌సహానీ అనే విద్యార్థులు స్వామిసన్నిధిలో తమ యువహృదయాలకు లభించిన ఉత్తేజాన్ని వివరించారు.

కార్తిక్ శేషాద్రి అనే కుర్రవాడు మూడవ తేదీన సితార్ వాద్యంతో శ్రోతలను ఉర్రూతలూగించాడు. నాల్గవ తేదీ రాత్రి హైద్రాబాదు బాలవికాస్ సభ్యులు భక్త కుచేల, భీమ గర్వభంగం, బాబా కథ బుర్ర కథ ప్రదర్శించి ప్రేక్షకులను అలరించారు.

ఆరవ తేదీ సభలో స్వామి ప్రసంగిస్తూ తమకు పాండిత్యంతోనూ వ్యాకరణంతోనూ ప్రమేయం లేదని తమది హృదయంనుంచి సూటిగా ఎగసివచ్చే బాష అనీ, ప్రేమపూరితమైనబాష అనీ, వినేవారి హృదయాలకు సూటిగా తగిలే బాష అనీ ప్రకటించారు.

ఏడవతేదీ ఉదయం స్వామి బృందావనానికి తరలి వెళ్తుంటే భక్తుల నయనాలు అశ్రుపూరితాలైనాయి. మళ్లీ ఎన్నాళ్లకు ఇటువంటి భాగ్యం ? అనే ఆవేదన లో హృదయాలు బరువెక్కిపోయాయి. మాతాపితా గురుదైవ సర్వస్వమైన ఆ ప్రేమస్వరూపుని శివమ్ ప్రాంగణంలో సందర్శించే మహాభాగ్యం ఎన్నాళ్లకో ?

వచ్చేవరకు ఎప్పుడువస్తారో అని నిరీక్షణ; వచ్చిన తరువాత మళ్లీ మమ్మల్ని విడిచివెళ్లిపోతారనే భయం. వెళ్లినతరువాత మళ్లి ఎన్నాళ్లకో ఈ భాగ్యం అనే ఆవేదన.

[సం]

---

అంజలి

ఇందుగల డందు లేడను
సందేహము లేక సాయి చరణాబ్జములన్
డెందములో పూజించిన
అందముగా భక్తజనుల ఆర్తుల దీర్చున్

చూచితి కన్నులార ఘన సుందరమూర్తిని సాయినాధునిన్
జూచితి వాంఛితంబు తగ జూచితి నిండుమనంబు తోడుతన్
జూచితి సర్వవంద్యు ప్రభు జూపుల తోడనె భక్తులందరిన్
బ్రోచెడి సత్యసాయి ప్రభు మోక్ష ప్రదాతను ఆర్తరక్షకున్

# పుస్తక సూచి

[illegible] పుస్తకములు [illegible] [illegible] మూల [illegible] [illegible] పుస్తకములు [illegible].

[illegible] పుస్తకములు వాటి పోస్టుఖర్చ్ లు క్రింద [illegible]. పుస్తకములు [illegible] కు [illegible] పోస్టులో [illegible]. [illegible] పుస్తకములు [illegible] పోస్టుఖర్చ్ [illegible] రూ. 1.00 తో [illegible] గా [illegible] పంపవలెను.

| | పేరు | | [illegible] ఖర్చు |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-45 |
| 3 | మణిమాల | 1-00 | 0-15 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5 | అర్పణ | 1-00 | 0-10 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1 50 | 0-15 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 9 | వచనామృతము | 4-00 | 0-30 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 11 | గీతావాహినీప్రకాశము | 15-00 | 0-85 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |

కన్నడ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం[1] | 3-50 | 0-35 |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-15 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 6 | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:—

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0-20 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-35 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-10 |
| 5 | ధర్మవాహిని | 1.00 | 0-10 |

**ఇంగ్లీషు:—**

| | | | |
|---|---|---|---|
| 1 | భజన్‌సాంగ్స్ (అమెరికన్ ప్రకటన) | 2-00 | 0-20 |
| 2 | ,, (ఇండియన్ ప్రకటన) | 1-50 | 0-15 |
| 3 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-30 |
| 4 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-40 |
| 5 | ప్రశాంతవాహిని | 2-00 | 0-15 |
| 6 | జ్ఞానవాహిని | 2-00 | 0-15 |
| 7 | నామ సంకీర్తన్ | 1-50 | 0-10 |
| 8 | ధ్యానవాహిని | 2-00 | 0-15 |
| 9 | సమ్మర్‌షోవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0-35 |
| 10 | ,, 1973 | 6-50 | 0-30 |
| 11 | సందేహ నివారిణి | 3-00 | 0-15 |

**అరవం:—**

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-40 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-40 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-30 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-35 |
| 6 | భజనావళి | 1-00 | 0-20 |
| 7 | సాయిమాతా | 1-00 | 0-10 |
| 8 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 9 | సందేహనివారిణి | 2-00 | 0-25 |
| 10 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 11 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 12 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-10 |

**హిందీ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-10 |

**గుజరాతి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 2 | కథాసుధ | 2-00 | 0-15 |
| 3 | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-30 |

**సింధి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-10 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

**అస్సామి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారథి [పోర్ట్‌బయోగ్రఫీ] | 1-00 | 0-10 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కథా | 0-25 | 0-10 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0-50 | 0-10 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-20 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-15 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-10 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0-10 |

**ఒరియా:—**

| | | | |
|---|---|---|---|
| 1 | గీతావాహిని | 5-00 | 0-25 |

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2. చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5. పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను.

M.O. ద్వారా పైకమును పంపించువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియ జేయవలెను.

6. పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోష్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు ..6/-74 అని యుండిన, మీ చందా జూన్ నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) జూన్ నెల 8. వ తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —:శ్రీవారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు ఎడిటర్, 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్ ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

उसे दूर ही से उसके सहपाठियों ने पहचान लिया और उनमें से बहुत से लड़के 'अहमद अली, अहमद अली' का शोर मचाते हुए, खच्चरें दौड़ाते हुए उसके पास आगये। खच्चरों को वृक्षों के साथ बाँध दिया गया और अहमद अली ने यहाँ पर काफ़ले के लिये खाने का जो प्रबन्ध किया था, उसे ठीक तरह से निभाया और फिर काफ़ला आगें चल पड़ा।

अहमद अली ने अपनी सफ़ेद घोड़ी अब्दुल के खच्चर के साथ मिला ली और दोनों मित्र धीरे-धीरे बातें करने लगे।

अब्दुल ने कहा, "तुमने सुना होगा, अब फ़ौज भेजकर हमसे लगान बसूल कर रहे हैं।

अहमद अली ने त्यूरी चढ़ाकर कहा "हां सुन चुका हूँ, काफ़रों की मौत आई है।"

अब्दुल्ला ने कहा "मेरा तो इम्तिहान देने को भी जी नहीं चाहता!"

अहमदअली ने कहा "यहाँ किस सूअर का जी चाहता है—जी चाहता है कि राजा का गला घोंट दूँ। तुम देखना कुछ दिन में ही—बस अब ज्यादा देर नहीं लगेगी!"

अब्दुल ने कहा "तुम्हें कैसे मालूम है?"

अहमद अली ने उसकी ओर झुककर कहा "मुझे अब्बा ने बताया है।"

अब्दुल ने कहा "एक भेद की बात मैं बता दूँ, मैं रैज़ीडैंट-बहादुर से मिला था।"

अहमद अली की आँखों में खुशी की चमक पैदा हुई। धीरे से बोला, "रैज़ीडैंट बहादुर बहुत अच्छा आदमी है। वह हमारा देश फिर हमें सौंपना चाहता है। देख लेना, एक दिन हमारा खानदान फिर पलंदरी की सरदारी सँभालेगा। पलंदरी बहुत देर तक डोगरा राज का गुलाम नहीं रह सकता।"

अहमद अली की सफ़ेद घोड़ी बार-बार आगे निकलने की कोशिश

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 జూన్, 1974 సంచిక 4

## విషయానుక్రమణిక

'శివం' లో శివుడు - హైదరాబాద్ (చిత్రము)



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## ౬౩

### నలుగురికీ సమానమే

అపుడు మునిరాజు భరతునితో నిట్లు పలికెను. "ఓ భరతా. అన్ని సంశయములను విడచి, ఆ దయా సోదరుడు శ్రీరాముడు, నీ జ్యేష్ఠ భ్రాత. నీ మనోభిప్రాయమునతనితో జెప్పుము" అనెను. భరతుడు ముని వచనములను విని రాముని చిత్తమును కనిపెట్టి వారిరువురు తన యందు అనుకూలముగా నుండిరని తెలిసికొని, సంతసించెను.

సభలో అతడు నిశ్చేష్టుడై నిలువబడి యుండెను. కమలములవంటి అతని నేత్రముల నుండి నీరు కారుచుండెను. "చెప్పవలసిన వన్నియును మునివర్యులే చెప్పిరి. నేను ప్రత్యేకించి చెప్పునదేమున్నది? నా రాముని స్వభావము నాకు తెలియును. అపరాధము చేసిన వారిని సయితము తాను కోపించడు. వారికి నా మీద అమితముగా వాత్సల్యము కలదు; దానిని కాదనను. అనురాగముచేతను, సిగ్గుచేతను నేనింత వరకూ వారి ఎదుట నిలిచి, వారితో నొకమాట చెప్పియుండలేదు. అనురాగముచే వారిని చూడ గోరుచుండిన నా నేత్రములింత వరకూ వారిని చూచినను తృప్తి బొందలేదు.

నా అనురాగమును చూచి, బ్రహ్మ భరించలేక నా తల్లిద్వారా నాకీ కష్టము తెచ్చిపెట్టెను. ఈ మాట చెప్పుటచేత నాకు ఘనత లేదు. నా తల్లిపై నేరమును మోపుటచే నాకేమి గొప్ప గలదు? ఎవరికి వారు నిర్దోషినని చెప్పుకొనుట వలన నిర్దోషి అగునా? నా తల్లి మందమతి అనియూ, నేను సాధువుననియూ, బుద్ధిమంతుడననియూ చెప్పుకొనుటకు నా హృదయములో నాకే సందేహము పుట్టుచున్నది.

సరోవరములో నుండిన నత్త గుల్లలో ముత్యములు పుట్టునా? నా దుఃఖమునకు యితరులను దూషించుట యుచితము కాదు. సముద్రమువలె నా నిర్భాగ్యమపారము. ఇదంతయూ నా పాప ఫలము. నేను నలువైపుల మార్గము వెతుకుచుంటిని. ఒక మార్గము తప్ప మరియొకటి కానరాదు.

నా గురువులు వశిష్ఠులు, నా ప్రభువులు శ్రీ సీతారాములు. కావున పరిణామమున శుభము కలుగునని నా నిశ్చయము. నేను వేరు కోరను. కోరలేను. ప్రభూ! రామచంద్రా! నీ దాసుని వక ప్రార్థనను మన్నింపుము!

రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురు దశరథ మహారాజునకు కామపుత్రులే. తండ్రి ఆజ్ఞను శిరసావహించుట నలుగురికీ సమానమే. పుత్రవాత్సల్యము తండ్రికి సమానము, కాన తండ్రి ఆజ్ఞను వీరే పాలించవలెను, వారే పాలించవలెను, అను నియతికి స్థానము లేదు. కాన, తండ్రి ఆజ్ఞను పాలించుటలో నీ వింత వరకూ బాధ్యతను వహించితివి, ఇకపై సీతాలక్ష్మణ సమేతుడవై అయోధ్య చేరు. నీ భాగమును నేను, శత్రుఘ్నుడును అరణ్యమున మిగిలిన కాలమును గడుపుదము,'' అని పాదములపై వ్రాలెను.

భరతుని ఈ విజ్ఞానమును గమనించి, వశిష్ఠుల వారు ఆనందబాష్పములు రాల్చెను. శ్రీరాముడు, ఈ యుక్తికి చిక్కక, "భరతా! నీ ఆలోచన అంత సముచితమైనది కాదని నాకు తోచుచున్నది. నీవిది తప్ప అన్యమైనదేదైనను కోరుమని సెలవిచ్చెను. అంత, భరతుడు,

"అన్నా! అటులయిన తమ్మునితో పాటు నేను కూడా [illegible] ఈ పవిత్ర వనవాసమును అనుభవించుటకు అనుజ్ఞ [illegible] హస్తా [illegible] ప్రభూ! నాకు నీవు తండ్రి ఆజ్ఞ [illegible] [illegible] ఇచ్చిన [illegible] [illegible] [illegible]" అని [illegible] సాష్టాంగ[illegible]ము చేసి ప్ర[illegible] [illegible] ఆమోదించి నీవు ధర్మ[illegible] నాకు అనుమతించిన రాజ్య పాలన నేను [illegible] ఆచరింతును,'' అని మారు మాటాడుటకు చోటులేక ఆజ్ఞాపించెను.

### భరతుని విలాపము

అంత భరతుడు భరించరాని దుఃఖముతో, ఏ నా తల్లి శ్రీ సీతారామలక్ష్మణులను [illegible] బాధించెనో ఆట్టి తల్లి కుమారుడయిన నన్ను భగవంతుడు విడచిపెట్టి, మరి యొకనిని సహింపరాని దుఃఖముల పాలు పెట్టును.

అన్నా! శ్రీ సీతారామలక్ష్మణులు వనవాసము చేయుచున్నారని వినినను, పాదరక్షలు లేకయే పాదచారులై వనము వెళ్లిరనియు శూలముల వలె తగులుచుండిన ఈ సమాచారములు వినినను నా ప్రాణములు నిలిచియుండెను. వీనికి నేను కారకుడు కానియెడల నే నిత[illegible] పూర్వమే శరీరమును విడచియుందును. నేను రఘురామునికి శత్రువని తలచి, స్నేహము[illegible], నిషాదపతి నాతో యుద్ధము చేయుటకు సిద్ధపడి

నపుడు కూడా నా ప్రాణములు పోలేదు! వజ్రముకంటే నా హృదయము కఠినము కనుక వ్రక్కలు కాలేదు!

నేను వినియుండిన సంగతులను ఇపుడు కన్నులార గాంచుచున్నాను; అయిననూ నా జీవితము కష్ట జీవితము కనుక యింత దుఃఖమును సహింప గలిగెను. యే నా తల్లిని చూచి సర్పములు, వృశ్చికములు వాని వాని విషమును విడిచిపెట్టునో అట్టి తల్లికి కుమారుడైన నన్ను భగవంతుడే విధువన్ను?" అని తనను తాను నిందించుకొనుచు, తన జీవితమునే అసహ్యించుకొనుచున్న భరతుని మాటలను వ్యాకులమును, దుఃఖమును, వినయమును, అనురాగమును, చాతుర్యమును సభికులూ, రాణులూ విని తుషారముపై పడిన కమలములవలె శోకసంతప్త మానసులయిరి. అనేక పురాణ కథలను చెప్పి ముని భరతునికి బోధించి వోదార్చెను.

అంత రామచంద్రుడు, తమ్ముడా! వ్యర్థముగా నీవు విచారింపనేల? కర్మగతులను అనుభవింపక తప్పదు. త్రికాలములలోను, త్రిలోకములలోనూ వుండిన పుణ్యశ్లోకులందరు నీ అధీనులని నా అభిప్రాయము. నీవు కుటిలుడవని దూషించువారు ఇహ పరలోకములకు దూరస్థులు కాగలరు. సాధు సమాజములో కాని, గురువుల వద్ద కానీ శిక్ష బొందని మూర్ఖుడే మన తల్లిని దూషించును. నీ నామమును స్మరించిన మాత్రమున సకల దుర్గుణములూ దూరమగును. నీ వీ లోకానికి కీర్తియు, పరలోకమునకు సుఖమును అందించుదువు.

ఈ భూమి నీ వలననే నిలువబడుచున్నది. వైరమూ ప్రేమయూ దాచియుంచిననూ దాగియుండవు. నీ సంగతి నాకు బాగుగా తెలియును. సత్యవాక్యమును నిలబెట్టుటకు రాజు నన్ను విడచిపెట్టెను. నా యందు గల ప్రేమచేత వారు ప్రాణములు కోల్పోయిరి. అట్టి ప్రియమైన తండ్రి వచనముల నుల్లంఘించుట నీకోటి నాకోటి పుత్రులకు భావ్యముకాదు. నీవు సంశయించక చెప్పవలసిన మాటలేవో చెప్పి, అడుగవలసిన విషయములను అడిగి, నీవు నీ బాధ్యతను నిర్వర్తించుట మంచిదని గట్టిగా తెలిపెను.

కడపటి కోరిక

మాటాడుటకు వీలు లేక కడపటి కోరికగా వకదానిని కోరుటకు భరతుడు నిశ్చయించుకొని, "రామా! ఏ రాజ్యము నిన్ను అడవికి పంపెనో, యే రాజ్యము నన్ను అపకీర్తులకు గురిచేసెనో, ఆ రాజ్యము నీ కక్కరలేదన్న, నాకునూ అక్కరలేదు. నేను నీ ఆజ్ఞను, నీ సంకల్పమును, యే నాటికినీ కాదనను, కాదనలేను. మీ చిత్తమునకు క్షోభ లేకుంత నన్ను కటాక్షించి నట్లయిన నేనెంతయో ధన్యుడను.

ఇంత కాలము తమ సేవ జేసి ధన్యతయు నాడు కనుక, లక్ష్మణుని శత్రుఘ్నుని అయోధ్యకు పంపి, నన్ను తమ పాదముల చెంత వుంచుకొనుడు. అపుడు ఇరువురికి సత్కీర్తి, లక్ష్మణుడు పరిపాలనాదక్షుడు. కనుక, అన్ని విధములా తండ్రిగారి ఆత్మకు తృప్తి కలుగునట్లుగ అయోధ్యను పాలింపగలడు. ఈ కోరిక మన్నించి, కాదనక నన్ను కాపాడుమని ప్రార్థింతును, అవి పాదముల పై [illegible]

మీరు సీతా సమేతులై అయోధ్యలో వుందురు ; మేము మువ్వురన్నదమ్ములము వనమునందు నివసింతుము. ఏ ప్రకారము మీ చిత్తమునకు సమాధానమగునో ఆ ప్రకారము వ్యవహరింతుము. ఇంత భారమును నాపై మోపిన నేను జీవించలేను. తమ పాదముల చెంత వుంచుకొని, ఇంతకు వేయి రెట్లు భారమును నా శిరస్సుపై మోపినను నేను ఆనందముగా అవలీలగా భరించగలను.

రాజధర్మముగాని, న్యాయశాస్త్రమును గాని, నేనెరుంగను, దుఃఖములో మునిగినవానికి జ్ఞానము శూన్యమన్న విషయము తమకు తెలియనిది కాదు. ప్రత్యుత్తరమిచ్చు సేవకుని చూచి సిగ్గు కూడా సిగ్గుపడును! ఓ రామచంద్రా! నేను హృదయమును విప్పి పలుకుచున్నాను. లోకమునకు మంగళమగుగాక, మీరు సందేహమును వీడి, ప్రసన్నులై తెంపరికి యే విధమైన ఆజ్ఞ చేతురో ఆ విధముగ మేము తమ ఆజ్ఞను శిరసావహింతుము."

భరతుడు ఆడిన యీ మాటలు సభికులకు పరమానందము కలిగించెను. హృదయములను కరిగింపజేసెను. భరతునకు రామునియందు గల ప్రేమ, భక్తి విశ్వాసములు, వేనోళ్ల కొనియాడిరి. ప్రజలందరూ ఒక్కసారి, "ఓ రామచంద్రా! భరతుని ప్రార్థనను మన్నింపుము. ప్రాచీనమగు కులమంతయు దశరథ మహారాజు మరణముతోనే గతించెను. అందుచేత లోకము అనాథయయ్యెను. అయోధ్యానగరము విశ్రాంతిలేనిదై విలపించుచున్నది. నాథుడు లేని పతివ్రత వలె దుఃఖించుచున్నది," అనిరి.

ఇంతలో, కైకేయి నేనేమి చెప్పగలను, ఎవరిపై దోషమును నిరూపించగలను, అని కుటిలురాలగు రాణి లోలోన విచారించి రాముఁడు ఒంటరిగా చిక్కిన తన పాపమును మన్నించుమని కోరుకొనుటకు యెన్నో విధముల వేచెను. రామునకు ముఖము చూపుటకు కూడా సిగ్గుపడెను. తన కొమారుని కంటే అధికముగా రాముని ప్రేమించుచుండిన కైక ఈ విధమైన విపరీత వాంఛ పుట్టుటలో తన లోపము కాదనియూ ప్రాణసమముగా ప్రేమించిన రాముని ఇన్ని విధములైన బాధలకు గురిచేసినది యేదో ఒక శక్తి తనలో చేరి చేయించినదే కాని తాను కాదని దృఢముగా తెలిసికొని, తానెంత ధైర్యమును తెచ్చుకున్నను, లోకులు నామాటలను నమ్మరు కదా, అని తనలో తాను సంశయించుచూ, ముందుకు పోలేక, వెనుకకు తిరుగలేక కృంగి కృశించి పోవుచున్న కైక మనసును గమనించి, రామచంద్రుడు సమయమును చూచి కైకకు నమస్కరించుటకు వెళ్లెను.

అదియే సమయమని తలంచి, కైక రాముని పాదములు పట్టి "నాయనా! నీవు నాకు చిన్నవాడవు, కుమారుడవు, అయినను గుణములలో, జ్ఞానములో, లోకమునకే అధికారివి! ప్రభుడవు! కాన నీ పాదములు పట్టినను దోషము లేదు. నా పాపమును క్షమించి, నీవు అయోధ్య నేలుము. నాకు సంప్రాప్తమైన ఈ అపకీర్తిని నివారింపుము ; లేదా భరతుని నీతో వుంచుకొని నీ పాదసేవా భాగ్యము నొసంగుము! నేనిక జీవించక పోయినను నాకు మనశ్శాంతి లభించును.

మహా కిరాతకులు కూడనూ కోరని కోరికను నేను కోరితినన్న వాకే ఆశ్చర్యముగనున్నది. నిజముగా నేను కేకయ రాజపుత్రినై కోరితినా? లేక యేదైనా గ్రహమావరించి నానుండి ఆ పలుకులు పలికించెనా? నాకు తెలియకున్నది." అని రెండు చేతులు పట్టుకొని కైక విలపిల్లు చుండుట రాముని గుండెలను నీరు గావించెను. అంత శ్రీరాముడు "అమ్మా ఇందులో నీదే మాత్రము తప్పులేదు. లోకులు కాకులు. సత్యమును గుర్తించక పలువిధముల పలుకుదురు. నీవు బుద్ధిపూర్వకముగా కోరిన కోరికలు కావు.

నా సంకల్పమే ఈ రీతి గావించినది. నే నవతరించిన కార్యమునకు నే సంకల్పించిన పనికి, మీ రెంతయో ఉపకార మొనర్చితిరే కానీ అపకారము కాదు. ఇందుకు నేను మీకు కృతజ్ఞత చెప్పవలసినది పోయి, మీతో నే నింతగా అడిగించుకొనవలసి వచ్చినందుకు నేనెంతయో చింతించుచున్నాను! మీరు దుఃఖించిన నా కార్యము అశుభమగును. కాన నన్ను అనుగ్రహించి, నా పై వాత్సల్యమును చూపుచు, ఆశీర్వదింపుము" అని రాముడు కైకేయి పాదములకు నమస్కరించెను.

రాముడట్లు చెప్పుటచేత కైకేయికి కొంత శాంతి కలిగెను. వారిరువురి సంభాషణను చెంతనే వుండి వినుచున్న కౌసల్య సుమిత్రలు ఇందులో కైక దే మాత్రము దోషము లేదనియూ ఇది దైవ సంకల్పమేననియూ గ్రహించి చెల్లెలైన కైకను అనేక విధముల ఓదార్చిరి. అయినను కైక పట్టు విడువక "రాముడు మహారాజు, సీత మహారాణి కాక తప్పదు. నా కొమారులు భరత శత్రుఘ్నులు, లక్ష్మణ సమేతులై సీతా రాములకు సేవలు చేయుచుండ ఈ కన్నులతో చూచి ప్రాణము విడువవలె" నని పదే పదే పలుకుతూ వచ్చెను.

## ప్రజల దృఢ నిశ్చయము

ఈ విధముగ, ఒకరినొకరు వోదార్చుకొనుచూ విలపించుచూ, రాముని అయోధ్యకు రమ్మని ప్రార్థించుచూ రేయిం పగలనక రామ పాదముల చెంత అడవిలో అయోధ్యావాసులు నాలుగు దినములు కాలము గడిపిరి. కడకు రాముడు అయోధ్యావాసులను అయోధ్యకు తీసుకొని పొమ్మని గురువునకు, భరతునకు ఆజ్ఞ చేసినటుల ప్రజలు, స్త్రీ పురుషులు, పండితులు విని, భరించలేని బాధతో, "మనము సీతారాములను అయోధ్యా నగరమునకు తీసుకొని వెళ్లిన గాని వుచితముగ నుండును; లేక, సీతారాములతో కూడి వనవాసము చేయుటయే కోటి స్వర్గములకంటే సుఖదాయకము. యెట్టివారైనను సీతా రామ లక్ష్మణులు అను విడచి నగరమునకు వెళ్ల నిచ్చగించరు. అట్లు ఇచ్చగించిరేని వారియెడల విధాత ప్రతికూలుడు గా నుండెనని తలంచవలెను. అహా! మందాకినిలో స్నానము, మధురమైన ఫలముల ఆహారము, కన్నులకింపైన సీతారాముల సుందర దర్శనము, అంతకంటే వేరు స్వర్గ మెందుకు అని ప్రజలతో వకరికొకరు చెప్పుకొనుచు, రాముని అయోధ్యకే గొనిపోవలెనని దృఢము చేసుకొనిరి.

## -: నీ దివ్య సన్నిధిన్ :-

సీ ॥ కామదాసుల నెల్ల । రామదాసుల జేయు
నీ దివ్య సన్నిధి । నీరజాక్ష
కంగారు పడు జనుల్ । బంగారు లయి యుంద్రు
నీ దయాదృష్టినే । నిర్మలాంగ ;
దుష్టులౌ జనులును । శిష్టులై జనుచుంద్రు
నీ కృపాదృష్టినే । నీలకంధర ;
ఆర్తులార్తులున్ । ఆనందమును గొందురు
తవ దివ్య సన్నిధిన్ । అభయ పదవ ;

తే ॥ దుర్భరంబగు సంసార । దుఃఖములును,
జనన మరణాది సంకటు । జాడ్యములును,
స్వామి ! నీ దివ్య సన్నిధిన్ । అంతరించు,
సత్య సాయీశ, సర్వేశ, సద్గుణాయ !

సీ ॥ శత్రులార్వురు లోన । మిత్రులైయుందురే
నీ దివ్య సన్నిధిన్ । నిర్వికార ;
యిహలోక వాంఛల । యిచ్ఛయే గలుగదు
నీ దివ్య సన్నిధిన్ । నిర్మలాత్మ ;
అష్టసిద్ధుల సాధ । నంతరిక్షము చేరు
నీ దివ్య సన్నిధిన్ । నిగమవేద్య ;
శబ్దంబు లెల్లవి । నిశ్శబ్దమె యుండును
నీ దివ్య సన్నిధిన్ విశ్వాత్మ
సకల కళాన్విత । సద్విద్య లెల్లను
వెలయు నీ సన్నిధిన్ । వెడపుకుప !

పావనంబయ్యె ప్రభు ! నీదు । పర్తిపురము ;
యిలను నీ దివ్యలీలన్ । యెన్నొ జూప
దివిజ గంగయె యందున । దిగుచు బాఱు,
పడియే దేవేంద్ర నగరమై । యద్భుతముగ
అవని భక్తులు నీ కతి । యమరు లగుచు
శాంతి నిలయంబు స్వర్గమై । యలరె గాదె !

# మన పుణ్యావిశేషము

'సర్వదేవతా స్వరూపమే స్వామి నిజ స్వరూపము' అన్నారు స్వామి బొంబాయి ధర్మ క్షేత్ర సభలలో. సర్వ దేవతలూ అంటే మనము పూజా పీఠాలలో అర్చించే దేవతలు రాముడూ, కృష్ణుడూ, లింగాలు సుబ్రహ్మణ్యస్వామీ, దత్తాత్రేయులూ విఘ్నేశుడూ, శక్తి ఇత్యాదులు. ఈయనలో వారి గుణాలున్నాయా? సర్వదేవతా స్వరూపము అంటే ఆ దేవతల గుణాలున్నాయనే కదా ? వారి మాటలలో 'రాముడు సత్య ధర్మ శాంతి స్వరూపుడుగా వచ్చాడు. ఇప్పుడు ఈ నాలుగూ (సత్య ధర్మ శాంతి ప్రేమలు) స్వరూపము దాల్చి వచ్చినవి'. శివరాత్రినాడు బాబాగారు స్ఫటికలింగాలూ, సువర్ణలింగమూ, బ్రహ్మాండ లింగమూ తన కడుపులో నుంచి తెప్పించి భక్తులకు ఇచ్చారు. వారు ప్రతిదినమూ అభిషేకము చేస్తున్నారు. మాతృభూతేశ్వరుని వలె భక్తురాలి పురిటికి సహాయమూ, భక్తుల ఇళ్లలో విభూతి ప్రదానమూ వంటి శివలీలలెన్నో వీరి కథలలో ఉన్నవి. సుబ్రహ్మణ్య స్వామి పరమశివునకు వలె ఈయన తన వయసుకు మించినవారి కెందరికో జ్ఞానోపదేశము చేస్తున్నారు. పరమార్థ సాధకులైన సన్యాసులు సత్యానంద భారతి, అభేదానంద వంటి వారు స్వామి [illegible] వచ్చి [illegible] చేస్తున్నారు. విఘ్నేశ్వరుడు [illegible] [illegible] ఎందరెందరో [illegible] [illegible] వల్ల [illegible] తున్నారు. ఈ కోరికలు వినాయకవ్రత కల్పములో చెప్పినవాటి వలె లౌకికములు మాత్రమే కాదు, ఆధ్యాత్మికములు కూడాను. ఈయనను సందేహించినవారు ఎందరెందరో తమ మనస్సులోని చెప్పడము వల్ల నైతేనేమి కలలో కనపడడము వల్ల నైతేనేమి అసాధ్య రోగాలు పోగొట్టడము వల్ల నైతేనేమి, నమ్మి నమస్కారములు చేసి భక్తులౌతున్నారు. తమ అలవాట్లకు వ్యతిరేకముగా నగర సంకీర్తనాదులు చేస్తున్నారు. 'అవతారములలో....శ్రీ కృష్ణునకు మాత్రమే ఇట్టి అనంతములగు లోకోత్తర శక్తులు వినవచ్చుటచే శ్రీ బాబాగారు అవతారపురుషులుగా విశ్వసింప దగియున్నారు' అని బ్రహ్మ శ్రీ ఉప్పులూరి గణపతి శాస్త్రిగారు. 'ఆవరణమును నడుగిడినది మొదలు మనో వృత్తులు యథాపూర్వముగా కాక కేవల సాత్త్వికములగుటచే నా స్వామి కేవల భగవన్మూర్తియే... అని నిశ్చయింప బడుచున్నది' అని శ్రీపాద లక్ష్మీనారాయణ శాస్త్రిగారు. 'భగవంతునకు కార్యకారణములతో నిమిత్తము లేదు....భగవంతునకు జ్ఞానబల క్రియలు నైసర్గికములు. బాబాగారి మహిమలను... చూచి...[illegible] వీరి అవతార స్వరూపము స్పష్టపడినది. సంకల్పమాత్రమున ఇట్టి చిరకాలమందు వట్టి శ్రీ బాబాగారి మహిమలు సత్యములు. సర్వభూతములయందును దయ, తితిక్ష, అసూయలేకుండుట, శౌచము, అనాయాసము, మంగళము, అకార్పణ్యము, అస్పృహ అను నీ ఎనిమిది ఆత్మ

గుణములు శాణాగారి యందు గనిపించుచున్నవి....
వీరి ఉపన్యాసములందు శాస్త్ర విరుద్ధమయిన విష
యము కాని శాస్త్రసమ్మతము కాని విషయము కాని
లేదు. విమర్శించు ధోరణి శాస్త్ర సమ్మత మధురతి.
మాటలలో పొరపొచ్చెములు కాని....స్తుతి నిందాదులు
కాని ఉండెడివి కావు. ప్రతి పనియందు అణకువ,
భక్తుల యెడల అఖండ మగు ప్రేమ, ఈ యుత్తమ
గుణములన్నియు వీరి భగవదవతార స్వరూపమును
రుజువు చేయుచున్నవి' అని మల్లావఝుల వేంకట
సుబ్బరామ శాస్త్రిగారు. 'స్వామి నవధాన్యాలు
హస్తంతో ఎత్తి పళ్లెములో జార విడిచినారు. అవన్నీ
మంచి ముత్యాలే, బంగారు పూవులే. అగ్నిదేవునికి
సమర్పితములయినాయి. నాలోని సందేహము తీ
పూర్ణాహుతి యందాహుతి అయినవి' అని కల్లూరి
వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారు. "చరణ
పద్మముల సన్నిధిని" అన్న ఇంగ్లీషు పుస్తకములో
పలువురు ఇతర రాష్ట్రముల వారూ ఇతర దేశాల
వారూ తమ అనుభవాల్ని విశ్వాసాల్ని చెప్పినారు.

స్వామి ఏమంటున్నారు: 'ఇక్కడికి భక్తిని తెచ్చి, ఉంచి, ఇక్కడినుంచి శక్తిని తీసుకు వెళ్లండి.' సత్కర్మలు సమర్పించి చేతులూ హృదయాలూ కాళీ చేసుకుని రండి. నేను వాటిని కానుకలతోనూ కటాక్షముతోనూ నింపుతాను. మీ చేతులు కామసంకల్ప పూరితాలైతే వాటిని దేనితో నింపనూ?' 'మీలో వున్న చెడుగు నంతా తీసుకురండి, నా దగ్గరున్న ప్రేమను తీసుకు వెళ్లండి; 'నన్ను మీరు పొగడవద్దు. నా మీద ఆధారపడండి, చాలు నాకు.' 'నేనుండగా మీకు భయమెందుకు? మీ చింతలన్నీ నాతో వదలండి. మీ భారము నేను వహిస్తాను.' 'నేను సదా మిమ్ము అను మార్గదర్శిగా [illegible] తెలుసుకొండి. ఆ [illegible] సన్నిధిలోనే మీరు [illegible]' 'మనశ్శాంతిని కోరేవారికి మనశ్శాంతి, అధైర్యమున్న చోటికి హృదయ స్థైర్యమూ, పరస్పర విశ్వాసము లేని చోటికి విశ్వాసమూ పంపుదును. ప్రతి హృదయమునకూ ప్రేమజ్యోతిని వెలిగించడమే నా యభీష్టము.' 'నా పనులనుంతే మీరు నన్ను అర్థము చేసుకోగలిగేది. అందుకే, నేనెవళ్లో తెలుపుటకు గాను నా విలాసమును ఒక్కొక్క పరి మాపుతును. దానిని 'లీల' అంటారు మీరు. ఆ మర్మము తెలుసుకుని నేనిచ్చే కర్మను చెయ్యండి' 'నేను మీ వాడను; మీరు నా వారు. మన బంధము ఆత్మలోతులలోనిది. కనుక నాకు స్వాగతము కాని ఆహ్వానము కాని అవసరము కాదు.' అంటున్నారు దైవము అనే రీతిగా. అంతే కాక గురువు వలె, 'ప్రభువును మీ హృదయములలో ప్రతిష్ఠించి మీ కర్మ ఫలాన్నీ మీ ఊహల్నీ భావాల్నీ సమర్పించండి.' 'మీ శక్తి సామర్థ్యాలు మిమ్మల్ని తీసుకు వెళ్లగలిగినంత వరకే వెళ్లండి.' మీరు అశాంతికి అసత్యానికి కేంద్రాలు కానే కారు. మీ రక్తనాళాల్లో ప్రసరించేది ప్రేమ. మీ స్వభావమే ఆనందము. 'కృష్ణా అని నామమును పెదిమలతో పలుమార్లు అని లాభము లేదు. కృష్ణుహస్సు మీ మనసులు నిండి మీ శీలాన్ని పవిత్రము చెయ్యాలి.' అహంకార మేఘములు విచ్చినప్పుడే ప్రభువి కాంతి కిరణాలు మీ హృదయము మీద పడును.' 'అక్షరమాలలోని కొద్ది అక్షరములతోనే లక్షలాది గ్రంథాలు లిఖించబడ్డాయి. అయితే, చూడవలసినది ఈ నాటక సూత్రధారుడైన భగవంతుని' 'హృదయపూర్వకముగా రోజుకొక మాటైనా నామము చేస్తే. గుహలు గృహములు కాగలవు.' 'ఆహసంపదల నన్వేషిస్తూ [illegible] కాలంలో ఎంతకాలము విహరించినా నిత్యస [illegible] ప్రభువి కరుణను పొందవలసినదే, [illegible] భూమికి చేసే పిట్టలాగ.' [illegible]

త్రిస్తాడు. అపవిత్రమైతే, మీరు బ్రతికియుండగనే, వాడు దూషిస్తుంటాడు

జగత్తులో ఏది ప్రధానం ? 'సత్యాన్నాస్తి పరో ధర్మః' సత్యమనే పునాదిపైనే భువనమనే ఈ భవనము నిలబడును. మీరంతా సత్యసాయి సంస్థల సభ్యులు, కనుక మీరు దానిలోని 'సత్య' అనే నా పేరును మీ హృదయమందు ముఖ్య స్థానమునివ్వాలి.

పరమ పవిత్రమైన సత్యమునే జీవిత ధర్మముగా ఆదరించి ఆనందించిన ఒక మహారాజు (సత్యవ్రతుడు అనేదే ఆయన పేరు) ఒకానొక శతాబ్దములో భూమిని ఏలుచుండేవాడు. ఒకనాడు ఆయన బ్రహ్మ ముహూర్తములో లేచి, ఆ దినము ఏదో పండుగ, పర్వ దినము కాబట్టి, సముద్రస్నానము నాచరించుట కొరకు, తన పట్టణముయొక్క సింహద్వారము దాటి వెళ్లుచున్న సమయమున, సర్వాంగ సుందరియైన ఒక స్త్రీ వెలుపలకు వెళ్లి పోవుచున్నదని కనుగొన్నాడు. వెంటనే, "మీరెవరు ? ఈ వేళకాని వేళయందు ఏకాకినిగా ఈ నగరమును విడచి వెళ్ళుటకు కారణమేమి ?" అని ప్రశ్నించినాడు. ఆమె దానికి సమాధానమందించుటకు పూనుకొన్నది. "నేను ధనలక్ష్మిని ! ఒక చోటుండటానికి నాకిష్టముండదు ; నీ భవనమును వదలి నేను వెళ్ళిపోవుచున్నాను" అన్నది. సత్యవ్రతుడు తప్పక వెళ్ళిరా అని అనుమతినిచ్చి, ధనలక్ష్మిని పంపినాడు కొంత సేపటిలో ఒక సుందర పురుషుడు అదే ద్వారము నుంచి వెళ్ళుచున్న విషయము గమనించి, మహారాజు ఆ వ్యక్తిని కూడ ప్రశ్నించినాడు ;" నువ్వెవరు ? ఏ కారణముచే, నగరమును వదలి పోవుచున్నావు" అని. "నా పేరు దానము; ధనమే లేక, నేనిక్కడ ఉండి కూడ ప్రయోజనమేమి ?" అని ఆయన జవాబిచ్చాడు. "సరే ! వెళ్ళు" అని దానమునకూ అనుజ్ఞ ఇచ్చాడు మహారాజు. కొంత లోపల, మరొక సుందర పురుషుడు బయలుదేరినాడు. వాని పేరు సదాచారము ! "ధనమూ దానమూ లేక సదాచారము ఎట్లు జరుగును, అని ఆయన ప్రశ్నించినాడు, అట్లనే, మరొకడు యశస్సు "నాకూ ఇక్కడ స్థానము లేదు" అని సింహ ద్వారమునుంచి బయట పడ్డాడు. "ధనమూ లేదు, దానమూ లేదు. సదాచారమూ పోయింది. ఇంక యశస్సుకు మాత్రము స్థానమెక్కడ ?" అని ఆయన వాదించినాడు. అప్పుడు, ఇంకొక మహాపురుషుడు కూడ, ఆ ద్వారమందు కనబడితే, మహారాజు గారిని "మీ పేరేమి అని" అని అడిగిరి. "నా పేరు సత్యము" అని వాడు జవాబిచ్చెను. మహారాజు వారి కాళ్లకు మ్రొక్కి, మీరు నా రాజ్యములో నా నగరములో నా భవనములో సర్వకాలము స్థిరముగా వుండాలి, బయలుదేరకూడదు," అని ప్రార్థించినాడు ఆ ప్రార్థనను మన్నించి, సత్యము బయలుదేరక, రాజ భవనమునకే వెళ్ళిపోయినాడు. దానిని గమనించిన యశస్సు, సదాచారము, దానము, ధనము వీరందరూ, సత్యముతో కూడినప్పుడే మాయందరికీ విలువ, అని నగరములోనికి వచ్చిరి. సత్యవ్రతుని రాజ్యములోనే ఆనందముగా నిలచిరి.

వాళ్లందరూ సత్యముతో కూడినట్లుగా, మీరూ ఈ సత్యసాయితో చేరి, ఆదర్శవంతమైన జీవితమును జరుపుచూ సంస్థల పవిత్ర ఆశయములకు తగినట్లుగా నిత్యము మెలగాలి.

హైక్లాసు అని పేరు ; ప్రవర్తనలు చూచితే, లో క్లాసుగా వుండకూడదు. గ్రద్దలు పైకి యెగిరి, ఆకాశములోనే సంచరించును. అయినను, దృష్టి మాత్రము క్రింద దృష్టిగానే వుండును. పై నుంచి క్రింది

రావటానికి ప్రయత్నము చేయకూడదు. మానవత్వమునుంచి దానవత్వమునకు, పశుత్వమునకు దిగజారకూడదు. మానవుడు మాధవుని రూపముగా తయారు కావా

మాధవుడు ఎవరు? Truth is God. Love is God. Peace is God. (సత్యమే దైవము, ప్రేమే దైవము, శాంతియే దైవము) కాబట్టి, మానవుడు సత్యమార్గమును, ప్రేమ మార్గమును, శాంతి మార్గమును పట్టితే, మాధవ స్వరూపుడుగా మారుటకు వీలగును. నీరు తైలముతో చేరదు; నీరులోనే చేరును. అట్లే, సత్యము అసత్యముతో చేరదు, సత్యముతోనే చేరును. మాధవత్వమును అనుసరించు సమయములో నాది నేను అనే భావములకు యే మాత్రము అవకాశముండదు. ఈ వస్త్రము నా హస్తమందున్నది. దానిని హస్తమే భద్రపరచక పోతే, అది క్రిందపడుతుంది, కర్త భర్త యజమానుడు అయిన భగవంతుని ఆధీనమందున్నంత వరకు సకలమునకు భద్రత! ఆధీనమునుంచి బయట పడితిరా, అధోగతే,

స్వార్థపరమైన సంసారమును కృతజ్ఞతతో పోషించేది సంస్కారము కొరకు, అని జ్ఞాపకముందుంచుకోవాలి. సంసారములో కూడ సర్వేశ్వర భావములో సర్వేశ్వరుని ప్రీతికై, సర్వేశ్వరుని చింతనతో, మెలగాలి. మీ జీవితములు ఆత్మకు అర్పితము కావాలి, అన్యానికి అర్పితము కాకూడదు. ప్రతి ఒక్కరూ పవిత్ర ఆదర్శములను ఋజుపరచుకొని, ధైర్యసాహసములతో, పొంగక క్రుంగక, సేవ నందించుటకు తయారు కావాలి.

శ్రీవారి దివ్యబోధ, 4–1–74

# బ్రహ్మచర్యము

" సత్యం వద । ధర్మంచర । స్వాధ్యాయాన్మా ప్రమదః ।
ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః

అనగా సత్యమును పలుకుము, ధర్మము నాచరింపుము, అధ్యయనమును గూర్చి ప్రమాదము పొందకుము, ఆచార్యుని కొరకు ప్రియమైన ధనమును తెచ్చి ఇచ్చి అతనిచే ననుజ్ఞాతుడవై గృహస్థుడై సత్ సంతానమును పొందుము.

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్యాసాశ్రమములందు బ్రహ్మచర్యము ప్రధానమైనది, జీవితమునకే ఇది పునాదివంటిది, మానవునియందు గల సర్వ శక్తులకు కేంద్రమువంటిది.

ఇది మానవుని నీతి రీతులతో నడిపెంచి మానవజాతినే నిలబెట్టు ప్రధానపు మెట్టు! సదాచారము నలవరచు సరళమైన పట్టు! భగవదనుభూతిని అం

# కర్మసు కౌశలం

అహంకార రహితుడవై, ఫలాసక్తిని త్యజించి, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మము నాచరించుటను భగవద్గీతలో కర్మయోగమని చెప్పబడినది. మరల అదే ధర్మమును ఇప్పుడు, ఈ యుగమున శ్రీ సత్యసాయి బాబాగా అవతరించి, భగవంతుడే స్వయముగా ఆచరించు చున్నారు. బాబా తరచు అంటూవుంటారు 'My Life is my Message'. (నా జీవితమే నా సందేశము) అనగా అర్థమేమి? వారు విరామం లేకుండ, నిరంతరం కృషి చేస్తూవుంటారు. వారు చేయు కర్మలు ఏమిటో తెలుసా? ధర్మ సంస్థాపన, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, మనందరి యోగక్షేమాలు చూసుకోవడం. వారిని శరణుజొచ్చి, వారినే సదా స్మరిస్తూ ఉండేవారి విషయాలన్నీ వారే స్వయంగా చూసుకొంటూవుంటారు.

కర్మమును కౌశలముతోను, శాస్త్రదృష్టితోను చేయవలెను. కర్మచేయుటకే గాని, దాని ఫలమునాశించుటకు మనకు అధికారము లేదు. బాబా పదేపదే అంటూవుంటారు. "పనిచేయి, ఫలమువదలు" అని. బుద్ధిపూర్వకముగ ఫలాశక్తిని వదలివేసిన కర్మనే నిష్కామకర్మ అని అందురు. అదే బుద్ధియోగం. బుద్ధినిర్మలముకానిదే ఫలాసక్తి వదలేందుకు వీలుపడదు. దానినే యోగబుద్ధి అనికూడ అందురు. యెల్లపుడును మనము కర్మచేస్తూనే యుండాలి. కర్మచేయకుండ మనము ఒక్క క్షణంకూడ యుండలేము అన్న విషయం అందరికి తెలిసిందే. ఫలాపేక్ష రజోగుణము; ఫలముకోరని పనిని మానిన తమోగుణము; పనిచేసి ఫలము వదలిన అది సత్వగుణము.

సమస్త యోగములకు వైరాగ్యమే మూలాధారము. ఈ వైరాగ్యసాధనకు కర్మఫలములు భగవంతునికి సమర్పించి సంగరహితమై కర్మ మొనర్పవలెను. ఏది స్వార్థపరమో అదియే అకర్మము, అనీతి; స్వార్థ రహితముగనుండేదియో అదియే ధర్మము, నీతి.

వ్యక్తిగతమైన సత్కర్మాచరణ మూలమున మోక్షమును బొందుటకేర్పడిన ధర్మశాస్త్రమే కర్మయోగము. కర్మయోగికి సంఘబుద్ధికంటే సమబుద్ధి ప్రధానము. సంఘబుద్ధి అనగా కర్తృత్వ బుద్ధి. "ఈచేసే కర్మ ఫలం నాది; ఈకర్మకు కర్తను నేనే", అనునది బంధ హేతువు. కనుక అనాసక్తులమై మెలగవలెను. బాబా భగవద్గీతలో అన్నారు, "నీవుచేసే దానం, హోమం, తపస్సు, కర్మములు, నీవు భుజించువాటిని నా కర్పింపుము. భక్తుడు, పవిత్రహృదయంతో, పత్రాన్నో, ఫలాన్నో, పుష్పాన్నో, నీటినో దేనిని అర్పిస్తే దానిని నేను ప్రేమతో స్వీకరిస్తాను" అని.

బాబా భగవద్గీతలో సర్వధర్మాలను త్యజించి, వారొక్కరినే శరణు బొందమన్నారు. కాని సర్వకర్మలను త్యజించమని చెప్పలేదుకదా. బాబా గీతావాహినిలో యీ క్రిందివిధంగా చెప్పారు. "శ్రీకృష్ణుడు చెప్పిన యీ సూత్రమును ఆధారము చేసికొని కొందరు శుష్కవేదాంతులు, సోమరి భక్తులు, వాళ్లు

చాచుకొని, కన్నులు మూసుకొని, కంఠమాలలు వేసుకొని. చేయవలసిన సత్కర్మలు చేయక, వేళవేళకు తినటము, నిద్రించుటము, తిరగుట . ఇదే మంచి పని చెడ్డ అని విచారించక ప్రవర్తించడము, 'యేమిరా నాయనా, నీధర్మమును నీవు ఆలోచించక యీరీతిగ ప్రవర్తించుచున్నావే' అని యింటిలోని పెద్దలో, చేక అనుభవజ్ఞులైన మహనీయులో ప్రశ్నించిన, 'యేమండీ, మీరుకూడ యిట్లా పొరబడుచున్నారు. గీతలో పరమాత్ముడు చెప్పినది మీకు తెలియదా? 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య' అని, భగవంతుని మాటలను నేను అధారము చేసుకొందును గాని, అన్యులమాటలు నాకక్కరలేదు, అని. పరమభక్తునివలె పరమాత్ముని ఆజ్ఞలను శిరసావహించు వానివలె ప్రగల్భములు పలుకుచుందురు. ఇట్టివారు అవసరమైన పదములనే గట్టిగాపట్టుకొని వాదింతురు. కాని ఆ పదములకు అటు, ఇటు ఉన్న పదములు పరమాత్మచెప్పినవి కావా? వాటినిమాత్రమెందుకు అంగీకరించరు? ఆచరణయందు పాటించరు? ధర్మ విచారణ చేయక, భగవత్ప్రీతిగా, ఆజ్ఞారూప ధర్మ కర్మలను చేయవలెనని ఆ శ్లోకానికి అర్థము.

తన తన ధర్మమును శ్రద్ధతో ఆచరించు ప్రతివాడునూ మహనీయుడే అని గీతలో చెప్పబడియున్నది.

పవిత్ర గీతలో బాబా చెప్పారు, "జ్ఞానయోగ, కర్మయోగాలు అని రెండు విధములైన నిష్ఠలను సనాతనముగ, నేను బోధిస్తూ వస్తున్నాను. కాని అవి రెండు వేర్వేరు అనుకోవడం తెలియని తనమే." సంగ రాహిత్యము నవలంబించుకొనుటకు, మొదటి మార్గము, హేతువాదమును జిజ్ఞాసను గైకొనుచున్నది. రెండవ మార్గము, కర్మయోగమునను అనుభవమూలమునను, సంగరాహిత్యము సాధింపనెంచుచున్నది. మొదటిది కర్మలనన్నియు నిరాకరించునట్టి జ్ఞానయోగము, రెండవది కర్మను నిష్కామ యాచరించునట్టి కర్మయోగము కర్మత్యాగమనగా. కర్మఫలత్యాగము. కర్మసన్యాసమనగా కర్మయోగము ఎంతో శ్రేష్ఠమైనది. యజ్ఞ, దాన, తపో మొదలగు కర్మములను త్యజింపరాదు. వాటిని ఆచరింపవలసినదే.

బాబా తరచు చెప్తూయుంటారు. 'Work is Worship; Duty is God' అనగా కర్మమే దైవము; కర్మమే ఆరాధన. స్వధర్మమును ప్రీతితో ఆచరించుటయే దైవారాధన అని అర్థము.

నిస్వార్థసేవ, దేవుని భక్తి, పెద్దలయెడ గౌరవ భక్తి, ప్రేమించు గుణము, తల్లిదండ్రులను గౌరవించుట ఇవన్నీ కర్మయోగ పద్ధతులని చెప్పవచ్చును. కర్మయోగి త్యాగబుద్ధి కలిగివుండి ఆ పరుడు ప్రేమ కలవాడై వుండును.

భగవద్గీతలో శ్రీకృష్ణభగవాన్ అర్జునుని జ్ఞానము మోహముచే కప్పబడినందున, అతనిని పిరికిపంద యని, కటువుగా మందలించి జ్ఞానమును బోధించి, మోహమును తొలగించి గొప్పకర్మయోగ నిష్ఠాపరునిగ తయారుచేసి, యుద్ధమున జయమును కల్గునట్లు చేసినాడు. బాబా యెప్పుడూ అంటూయుంటారు, 'ఫలాపేక్షతో పని చేయువాడు కూలివాడు; ఫలాపేక్షరహితుడు ఇంటి స్వంతదారుడు' అని.

టి. గోవర్ధనరావు.

---

# ముఖ చిత్రము

సాయి వచ్చిన వేళ, సాయి ఉండంగా
చెట్టులే చిగిరించు, పూవులే వికసించు
ఎచ్చోట చూచినా పచ్చ దనమే॥

పిల్లలందరు చేరి ఆనందమూర్తులై
కేరింతలు కొడుతారు, జేజేలు చెబుతారు
ఆదిత్య తేజంబు ప్రసరించగా రాళ్లు
వజ్ర సన్నిభ కాంతి వెలుగసాగినవండి

తంబురలు మీటంగ, మద్దెలలు వాయించ
దేవతల వేషములు ధరియించి బాలకులు
నాటకములాడారు నటనధురీణులై ;
నాటకాంతమునందు నటరాజు కానుకకు
ఆకాంక్షతో వారు అర్రెత్తి చూస్తారు.
సాయి వారిని గాంచి చిరునవ్వు చిందించి
ప్రేమాతిశయముతో పూవులే చరిచితే,
వారందరప్పుడు స్వామి పాదంబులకు
భక్తితో రక్తితో ప్రణమిల్లుతుంటారు ;
అవియె వారందరను ఆశించు కానుకలు.

సాయి వచ్చినయపుడు. సాయి ఉండంగానె
యువకులందరుకూడ ఎదిగెదిగి ఉంటారు,
ఛాతి విరుచుక వారు ఠీవిగా తలలెత్తి ;
మనసులో కోరికలె మారిపోవును సుమ్ము॥

పారవశ్యముతోడ హృదయాలు స్పందించ
పరవళ్లు త్రొక్కింది పట్టణంబంతా.
అందరిని ప్రేమించు. అందరిని సేవించు.
నిశ్చయము విశ్వాసముల తోడ సాగండి
అను స్వామి వాక్యమును పవన బాలికలెల్ల
పరచె దిక్కులలోన పరువంబుతోడుగా.

శిష్టుడుండు ' శివము ' నకు అన్నియూదారులే:
వచ్చారు భక్తాళి వేవేల సంఖ్యలో ;
తెచ్చారు తమకున్న బాధలన్నింటిని
తీరునను దృఢమైన నమ్మకము వెంటరా.

అలవోకగా స్వామి అందరిని చూస్తారు ;
మృదువుగా కొందరిని మందలిస్తారు.
ప్రేమతో కొందరిని ప్రేమించి లాలించు ;
స్పర్శతో రోగముల్ సమసిపోవుట చూడ
అది ఎంత మృదువైన స్పర్శనమో ఏమో !

ఆ మూలనున్నాడు. ఈ మూలనున్నాడు.
ఏ మూల చూచినా సాయియే కనిపించు ;
పవనమ్మె పరిమళ భరితమై పోయెగా
నిర్మలాంబరమంత నిగనిగా మెరయంగ,
ఆనందవారితో నయనంబులన్ని మునుగ
తళతళా మెరిసేటి తరళంబు గాను,
సాయి వచ్చినయపుడు, సాయి ఉండగానె.

— తారక్

# దివ్య లేఖ

[నేను భద్రముగ దాచియుంచుకొన్న పత్రములయందు గన్పట్టిన శ్రీ భగవాన్ సత్యసాయీశ్వరుల పత్రమొకటి, చదువుకొనగా నది శ్రీసాయి భక్తబృందముదృష్టికి గొనివచ్చిన బాగుండునను తలంపుగల్గి దానికి నకలు వ్రాసి పంపుచున్నాను. శ్రీ సత్యసాయిదేవుని ప్రవచన ప్రబోధములు నిత్యనూతనములు అంతియేగాక ప్రతి ప్రబోధమును దానికదిగా నొక ప్రత్యేకత గల్గియుండుటగాంతుము. ఆలేఖ యథాతథముగ నిట్లున్నది.]

కె. రామచంద్రారెడ్డి

"సాగరము అపారము. తెలియనిది. అనేక సుడిగుండములతోను, కల్లోలములతోను కూడియుండును. అట్టి సాగరమును దాటతలంచువారు దృఢమైన ఓడనెట్లు ఆశ్రయింతురో, అటులనే సారమే తెలియక జనన మరణ వ్యాధులగు ఘోరదుఃఖములకు స్థానమై సంకల్పములనెడు తరంగములతో, రాగద్వేషాది దుష్ట జంతువులతో సంశయములనెడి సుడిగుండములకు, ఆలవాలమైన సంసారమును దాటుటకు, గమ్యము చేర్చుటకు దైవారాధన క్రమాచరణలు, దృఢమైన నావలైయున్నవి. భగవత్స్వరూప సాన్నిధ్యమును గమ్యముచేరు అనుభూతలు కావలెను ప్రతి మానవుడును. ఆచరణ అత్యవసరము

దీనికి చిత్తసంస్కారము ప్రధానము. కాలమే భగవత్స్వరూపము కనుక సదాచారముతో సర్వేశ్వర చింతనతో కాలమును వినియోగించిన చిత్తస్థైర్యము చేకూరును. మానవుడు మాధవత్వమును పొందుటకు చిత్తసంస్కారమే ఆధారము. సర్వ మానవులకూ బ్రహ్మజ్ఞానమునుపొంది బ్రహ్మానందమును అనుభవించుటే నిజమతము. సర్వ మతములకు పునాది భక్తియే. అన్ని మతములకూ మూలసూత్రములు యేకమైయున్నవి. ఆచరణలు అనేకములైననూ లక్ష్యము సత్కృతియే. సత్యాన్వేషణే మానవుని సుత స్వభావము. ఇట్టి నీతిని పోషించుటే మానవజాతి మర్మము.

మానవుడు తన యదార్థమును మరచుటచే అనేక కష్ట నష్ట దుఃఖములకు గురియై అజ్ఞాన అహంకార మమకారములతో మసలుచున్నాడు. నిజముగా మానవుడు సత్య ధర్మ శాంతిస్వరూపుడు. లౌకిక భోగానందమును కోరుటచేతనే, అన్యాయ, అసత్య, అనాచారములను రోగములకు లోనగుచున్నాడు. త్యాగ యోగములే ఈరోగములకు తగిన మందులు

పాలలో సర్వవ్యాపియైయుండు వెన్న మథించగా యెట్లు తన స్వరూపమును ధరించునో, అట్లే జగత్తునందు సర్వవ్యాపియైయుండు పరమాత్మ ప్రేమ, స్మరణలతో రూపముధరించి సాక్షాత్కరించును. అట్టి స్వరూప సాక్షాత్కార మందిరములే గ్రామము

దైవత్వమును గుర్తించి, తనలోనూ అందరిలోనూ అదే శక్తి అదే చైతన్యము ప్రవహించుచున్నదనే సత్యమును తెలిసికొని, ఆనందమొందవలెను. అదే జీవితమునకు సార్థకత. భగవదనుగ్రహము అయస్కాంతము వంటిది ; అవి సహజముగానే ప్రతి జీవిని ఆకర్షించును ; అయితే, జీవియను ఇనుప ముక్కపై విషయవాసన అనే కల్మషము చేరియుండిన, ఆ అనుగ్రహమును అందుకొనుటకు వీలుండదు

మీ యొక్క కష్ట జీవితమే, నిజముగా నిశ్చింత జీవితము. దేశముయొక్క క్షేమము కల్యాణము మీ శ్రమవలనే అభివృద్ధి చెందును. మీరు శ్రమకోర్చక వుంటే దేశమే స్తంభించును. మీరింతవరకూ నిర్మల భావముతో నిశ్చల ధైర్యముతో దేశసేవ చేసిన, భగవంతుడు మీపై అనుగ్రహ వర్షమును కురిపిస్తాడు. ధనవంతులకు చింతలెక్కువ, భయము బాధలు యెక్కువ. వారికి నిద్రయే రాదు. మీరు దినము పూర్తిగా కష్టపడి రాత్రి హాయిగా నిద్రపోవుచున్నారు ; మీ రందరూ ప్రకృతిలోని సహజ సంపత్తుపై ఆధారపడి, దానివలన ఉపజీవించువారు. ప్రకృతి పరమాత్ముని సొత్తు; భూజాత అయిన సీతాదేవి శ్రీరామచంద్రుని సొత్తు; రావణుడు శ్రీరామచంద్రుని అలక్ష్యము జేసి, సీతాదేవిని వాంఛించినందువలననే సర్వనాశనము ననుభవించినాడు. భూమినుంచి సుఖసంపత్తుల నాశించి అర్థించువారు భూమిజా పతి, భూదేవి పతి అయిన పరమాత్ముని ఆరాధించి అనుసరించి ఆయన ఆజ్ఞాను వర్తులుగా మెలగవలెను.

దినమూ సాయంకాలమూ, మీరు మీ మీ కుటుంబము వారితో సహా, గుమిగూడి కొంతసేపు భజనలు చేసి, పరమాత్మ చింతన చేసి, శ్రద్ధాభక్తులతో కృతజ్ఞత నందించాలి. భగవంతుడు ప్రేమ స్వరూపుడు ; కాబట్టి, మీరు కూడ ఆయనను ప్రేమపుష్పములచే పూజించవలెను. సహన సంతోషములతో నడిచే సంసారమే స్వర్గము ; శాంతి భద్రతలతో జరిపే కర్తవ్యమే కైలాసము ; ధర్మాచరణ వలన చేకూరే ఆనందమే, వైకుంఠము. అట్టి వారి హృదయమే పవిత్రమైన దేవమందిరము. అది యెప్పుడూ యెట్టి పరిస్థితులయందూ శిథిలము కాని సుదృఢమైన మందిరము.

ఈ వాతావరణము ప్రశాంతముగా నున్నది ; దీని పేరే శివగిరి ! ఋషులు అట్టి అరణ్య ప్రదేశమును తపోవనముగా భావించి ఎంచుకొందురు, ఇచ్చట మీరు కర్మసిద్ధాంతము ననుసరించే కర్మవీరులుగా నాకు కనుపించుచున్నారు. మీరందరూ ఆయురారోగ్యముతో శాంతి సమాధానములతో సంతోషముగా మీ మీ కర్తవ్యములను నిర్వహించవలెనని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

**శ్రీవారి దివ్యబోధ**

# ప్రేమయోగము

"హఠయోగము క్రియాయోగము రాజయోగమువంటి పద్ధతులవలన ఆత్మసాక్షాత్కారము లభించుతుందని కొందరు వీటియందెంతో ఆసక్తి కలిగిఉంటున్నారు. కానీ, వీటిలో ఏ ఒక్కటీ భగవంతుని అభివ్యక్తము చేయదని చెబుతున్నాను. ప్రేమయోగమొక్కటే మిమ్ము భగవంతుని సాన్నిధ్యమునకు తీసుకొనివెళ్ళగలదని గట్టిగా చెబుతున్నాను," అని బాబా చెప్పుచున్నారు.

బాబాయొక్క అనేక ప్రవచనములలో ఇది చాలా శ్రేష్ఠమైనదని నా అభిప్రాయము. ఆధునిక కాలములో చాలామంది, ముఖ్యముగా పాశ్చాత్యులనేకులు, ఏదో ఒక పద్ధతికొరకు అన్వేషించుతూ, తరుచుగా ఒకదాని తరువాత మరొకటి తెలిసిన పద్ధతులన్ని, ఎంతో వ్యయ ప్రయాసలకులోనై చాలాధనము వెచ్చించి, ఆచరించ పూనుకొనుటచేత, యీ ప్రవచనము చాలా శ్రేష్ఠమైనదని భావించుచున్నాను

కానీ, యీవిధానములేవీ దైవానికి సంబంధించినవి కావు. దైవముయొక్క ఉపస్థితినే యివి అంగీకరించవు! ఆసనాలు, ప్రాణాయామం మొదలగు వాటిని ఆచరించి ధ్యానించేవారిని గురించే నేను చెప్పేది.

సుమారొక సంవత్సరము క్రితమువరకు, లండనులో నిర్వహించబడుతున్న "ఆత్మోద్ధారణ కేంద్రము" నకు నేనొక డైరెక్టరును. ఆకేంద్రమొక చిత్రదర్శిని వంటిది. "అభివృద్ధికేంద్రముల" (గ్రోత్ సెంటర్సు) యొక్క నమూనామీద యీ కేంద్రము తయారైనది. లక్షలాదిప్రజలు ఇక్కడకువచ్చి ధారాళంగా ధనము ఖర్చుచేస్తారు. వారందరు ఆనందముకొరకు ఆరోగ్యముకొరకు, ప్రయోజనకారులుగా, ప్రేమాస్పదులుగా ఉండేలందుకు వస్తుంటారు. కొందరు సాంఘిక కారణాలవల్ల, నూతన పరిచయములకొరకు లేక కాలక్షేపముకొరకుకూడా వస్తుంటారు.

ఈ వ్యవహారములో నిమగ్నుడై ఉన్నప్పుడు ఏన్నో విధానాలతో పరిచయమైనది—రోల్ఫింగ్, అక్యుపంక్చర్, బయో ఎనర్జటిక్సు, సియో-రిష్మియన్-బాడీ కాంటాక్టు థెరపీవంటివి ; ఎన్నోరకాల అంగసంవాహనాలు, చికిత్సావిధానాలు.

ఈ అభ్యాసములే కాకుండా, వారందరికి అనేక విధానముల ధ్యానము చేయడము బోధించేవారు— జాజెన్, విపాసన, తాయ్-చి-చువాన్ మొదలైనవి. ఈపద్ధతులన్నీ చాలా మంచివే కానీ, ఎప్పుడెప్పుడు విముక్తి లభించుతుందా, పరిపూర్ణమానవత్వము పొందగలమా, ఉబికివచ్చేటటువంటి శక్తివంతులు కాగలమా, అనే తొందరలో ఆ క్షణముకొరకు వారొక పద్ధతిలోనుండి మరొక పద్ధతిలోకి మారుతుండేవారు.

మాలో చాలామందికి ఆ 'క్షణము' లభించనేలేదు; బహుశా మేము భగవంతునికొరకు వెతికినాముకాని, బాబా బోధించినట్లు భగవంతుడున్నచోటు మానవ హృదయములో—వెతకిఉండము

నాజీవితములో ఒక పెద్ద క్లిష్టమైనస్థితిని దాటిన తరువాత నేను బాబావద్దకు వచ్చినాను. అంతవరకు నాజీవితము నిరుపయోగంగా శూన్యంగా ఉన్నది. ఇది మొదటిసారిగా నాజీవితము వికసించుతుందని భావించ లేని స్థితి. అప్పుడు నావయస్సు 43 సంవత్సరములు. అప్పటివరకు ఆత్మోన్నతికొరకు చేసిన ప్రయత్నా లన్ని భౌతికంగానేగాక, అన్నివిధాలా, ముఖ్యముగా బావైక్యత పొందుటలో, స్వీయాభివృద్ధికి పనికి వచ్చినది.

కానీ, ఆత్మోన్నతికన్న ఆత్మవిస్మృతి చాలా ముఖ్య మని యిక్కడ బాబా చెప్పుచున్నారు. 'నేను' (అహం) ను కొట్టివేయండి; నీవు విముక్తుడవౌతావు! ఈ 'నేను' ను ఏవిధంగా నశింపచేయాలి? 'నేనుకాదు మీరే' అని స్మరించుతూ, ఆ 'నేను' ను భగవంతుని పాదార విందములవద్ద అర్పించాలి. అప్పుడు నిన్ను అణచి వేసే భారమునుండి విముక్తుడవుకాగలవు. ఈ భావా నికి, నేను మరొకచోట చదివిన భావానికి సామ్యము కనిపించినది.

టావో-టె-చెంగ్‌లో నేనిట్లా చదివినాను: నన్నుగురించి నాలోని స్వార్థముగురించి, చాలా బాధపడినాను నాలో స్వార్థము లేకున్నట్లయిన, ఎంత బాధ భరించి ఉండకలిగేవాడను? ఎక్వేరియన్ సువార్తలో జీసస్ యీవిధముగా చెప్పినాడు: "నన్ననుసరించ తలంచినవారందరు, స్వార్థపూరిత వాంఛలన్నిటిని విసర్జించి. తనప్రాణమును కాపాడుకొనుటలో దానిని వదలుకోవాలి. దారితప్పినవారిని రక్షించేటందుకే నేను వచ్చినది. తననుండితాను రక్షించుకొనినప్పుడే మానవుడు రక్షింపబడుతాడు."

ఒకరాత్రి పుట్టపర్తిలో నేను ధ్యానముచేస్తూ, "బాబా నేనేమిచేయవలెనొ చెప్పండి. అనుగ్రహించి నా కర్తవ్యాన్ని బోధపరచండి" అని ప్రార్థించినాను. ఎంతో ఆవేదనతో ప్రార్థించినాను. హఠాత్తుగా నాకు జవాబులభించినది: నేను చేయవలసినదేమీ లేదని.

ఆ భావాన్ని బాబాయే నామనస్సులో ప్రవేశపెట్టి నారా అన్న భావము కలిగింది. లేక అంతరంగిక గురువైన నాహృదయములో నుండే ఆభావము నిర్గ మించి ఉండవలెను. ఏదైనా ఒక్కటే. తాను నిరం తరము మనహృదయములందే ఉన్నానని బాబా చెప్పిఉన్నాడు కదా. అందుచేత అక్కడ పైనుండే వారికి, ఇక్కడలోనుండే దీనికి, వాస్తవములో ఏమి తేడా ఉంటుంది? కానీ, ఎన్నింటినో శోధించి, ఎంతగానో శ్రమపడి ఉన్నందున, నా అంతర్దృష్టి చాలా నిశితంగా ఉన్నది విపరీతమైన ఉపశమనాన్ని అనుభవించి హాయిగా ఊపిరితీసుకొని, ఆనంద ముతో, కృతజ్ఞతతో కన్నీరు కార్చినాను. నేను నిష్క్రియునిగా ఉండవలసిందని మరేమి చేయవల సిందిలేదని నా హృదయములోని బాబా చెప్పి నట్లయినది.

బాబా మననుండి పుష్పములు కాని, నివేదనలుకాని, సేవలుకాని కోరుటలేదు. ఇచ్ఛికము కాకుంటే, ఇతరులను సేవించుట కూడా వద్దనినారు. 'పర' అనే భావముతో కాక, నిన్నే అనుకుంటే, నీవు చేసే సేవను ఉత్తముగా, సమర్థవంతంగా నిర్వహించ కలుగుతావు బాబాకు మన సేవలు కూడా అవసరము లేదేమో అని నా సందేహము.

జీసస్ యీ విధంగా చెప్పినాడు: "మానవులు నన్ను క్రీస్తు అని పిలుస్తున్నారు: కానీ క్రీస్తు నా పేరు కాదు. క్రీస్తు అంటే సర్వ వ్యాపకమైన ప్రేమ స్వరూపము. ప్రేమయే ప్రభువు,.........నీయందే ఉన్న క్రీస్తును చూడు, నాయందున్నట్లే ఆతడు మీ

అందరియందున్నాడు. మీ హృదయాలను పరిశుద్ధము చేసికొనినప్పుడు, ప్రభువు వాటియందు ప్రవేశించుతాడు అప్పుడాతనిని మీరు చూడగలరు'' పద్ధతిలో తేడా తప్ప, పలుకులన్నీ బాబా పలుకులే.

ప్రత్యేక సంభాషణ కొరకు కొంతమందిని బాబా కలిసికొనినప్పుడు వారిలో నేను కూడా ఉన్నాను. అప్పుడొక అమెరికన్ యువకుడు బాబా నిట్లు ప్రశ్నించాడు : "నేను నా హృదయాన్ని యితరులకే విధంగా విప్పిచూపగలను ?" దానికి బాబా "నీ హృదయమును బహిర్గతము గావించినప్పుడు నీ వింక ఉండవు'' అని చెప్పినారు.

అప్పుడామాటలయొక్క అర్థమెవ్వరికి తెలియలేదు. అందులో ఏదో అపార్థమున్నదని మేము భావించినాము. కానీ, మరునాడటువంటి దేమీలేదని తెలిసికొనినాము 'అహం' అనె నీవు ప్రేమించనే లేవు ప్రేమ హృదయమును తెరచినప్పుడు 'అహం' నశించుతుంది, అని బాబా చెప్పినారు.

ఈ ప్రబోధము జీర్ణించేటప్పటికి చాలా కాలము పడుతుంది. సాయిబాబాను గురించి ప్రజలలో ప్రబోధించుటకుగాను చాలాసూపము లిక్కడలేను: వారి లీలలను గురించే ప్రధానంగా చెప్పినానని గ్రహించినాను కానీ, నేను మాట్లాడినవారిలో చాలామందికి యీ లీలలతో నిమిత్తములేదు వాస్తవములో అంతే. వారికి కావలసింది, ప్రబోధమో, ఏదో ఒకవిధమైన ధ్యానమును గురించి బోధించెవారో లేక గనీసము నేరుగా ఒక మంత్రమేదైనా బోధించేవారో. "సాయిబాబా ఒక అద్భుత వ్యక్తిగామాత్రమే మేము భావించుచున్నాము. నీతో అతడు మాట్లాడకపోయినా ఉండలేదుకదా, అతడు దేవుడని నీవెట్లు భావించుచున్నావు? అని అడిగినారు.

తిరిగి బృందావనములో బాబాను చూచేటంత వరకు నాకీ ప్రశ్నకు జవాబు కనిపించలేదు ఒకనాడు దర్శన సమయములో, ఇదివరలో చూచినట్టి బాబాను చూచినట్లుగా అనుభూతి కలిగినది—నేనంత వరకు అనుభవించని అనురాగము వారిలోనుండి వెలుపగా ప్రవహించసాగింది. బహుశా, ఒక క్షణకాలము నావంక చూచిఉంటారు. నన్ను పూర్తిగా పరికించినారని, నాయందెంతో ప్రేమతో ఉన్నారని నాకు తెలిసిపోయింది

"నేను బాహ్యక్రియలమీద, అభివ్యక్తీకరణము మీద ఆధారపడి ఉండలేదు. అంతర్గత ప్రేమ సూత్రముతో నేను నీకు సంబంధించిఉన్నాను. ఒక హృదయము మరొక హృదయానికి పంపే ప్రేమ సందేశమే, వేలసంఖ్యలో మిమ్మిక్కడకు పిలుచుకొని వచ్చింది. ప్రేమయొక్క విలువను, సంయుక్తికత్వమును, మీరే రుజువు చేసినారు. ప్రేమ నా శక్తులన్నింటిలో బలవత్తరమైనది'' అని బాబాయే చెప్పిఉన్నారు.

—విలియం గ్రాస్‌మన్

# చంద్రబింబము

1973 డిసెంబర్ 8వతేదీ ఉదయము స్వామి ప్రశాంతినిలయమునుండి బృందావనానికి బయలు దేరినారు. షుమారొక గంటసేపు ప్రయాణము చేసిన తరువాత, వెంటవచ్చే మూడుకార్లను, దారిప్రక్కనే ఉన్న అడవిప్రదేశములో జనవాసం కానిచోట, నిలపమని బాబా ఆదేశించినారు. అంతా బండ్లు దిగినాము. స్వామి చాలా ఉత్సాహంగాఉన్నారు; ఛలోక్తులు విసురుతూ భక్తులమధ్య తిరగసాగినారు.

మేమందరము దీనచోటుకు దగ్గరలో ఒక వెలగ చెట్టున్నది. దాని పైకొమ్మలమీద పెద్దపండ్లు కొన్ని కనిపించగా, మాలో కొందరము పండ్లకొరకు రాళ్లు విసరినాము కానీ లాభములేకపోయింది. అయినప్పటికి, ఒక అంగుళము వ్యాసముగల పండొకటి క్రిందకు రాలితే, స్వామి దానిని తీసుకొనినారు.

దానిని తన బొటనవ్రేలు, చూపుడువ్రేలు మధ్య పట్టుకొని, "ఇదిగో చంద్రబింబము" అని బాబా పలికినారు. ఆ చిన్నపండును ఒకక్షణము తన గుప్పెటలో మూసి చేయి తెరచేటప్పటికి పండుమాయమై అత్యంత అపూర్వమైన వస్తువు వారిచేతిలో ఉన్నది.

స్వామిచేతిలోని వస్తువు నిగనిగలాడుచూ, పారప్రకాశముకలిగి, మధ్యవందముగాఉండి, అంచులందు పలచగా ఉన్నది. అది వెలుగుకిరణాలను చాలా ప్రకాశముతో ప్రతిఫలించుచున్నది. దాని ఉపరితలమంతా మిట్టపల్లములతో నిండిఉన్నది. రకరకాల నల్లని మచ్చలున్నవి. అనేక ఖనిజవర్ణములలో, పొట్టివి పొడుగువి అయిన చారలు మెరుస్తూ కనిపించుచున్నవి. సూర్య రశ్మిలో తళతళమెరసే నలకలవంటివి ఉన్నవి. మొత్తముమీద ఆ గుండ్రని కటకము చాలా అందముగా ఉన్నది.

ప్రతివారు దానిని అమితాశ్చర్యముతో, కుతూహలముతో, తేరిచూడసాగినారు, అది చిన్నసైజు చంద్రబింబమని, చంద్రలోకములోని పదార్థముతో తయారైనదని బాబా మాతో చెప్పినారు. వారుచెప్పిన దేమిటో ఎవరికి అర్థముకాలేదు. చివరకు ఆ వృత్తాకారపు కటకము చిన్నసైజు చంద్రబింబముయొక్క రెండుప్రక్కలని, అది చంద్రునిలోని పదార్థముతో ఖనిజములతో తయారుచేయబడినదని గ్రహించినాము. ఆ కటకమున కొకప్రక్క మనకు కనుపించే చంద్రోపరి తలమని, రెండవప్రక్క మనకు కనిపించని ఉపరితలమని తెలిసింది. రెండుప్రక్కలను ఫోటోగ్రాఫిక్ ప్లేటుమీద గుండ్రని బిళ్లలుగా ఫొటోలు తీయవచ్చును. అనగా, పారప్రకాశము కలిగిన కటకమున కొకప్రక్క చంద్రుని అర్ధభాగము ప్రతిఫలించుచున్నది. దాని రెండవప్రక్క, మనకు కనిపించని అర్ధభాగము ప్రతిఫలించుచున్నది. డిస్కు పైభాగముమీద ఉన్న నల్లని మోకపల్లములు చంద్రోపరిభాగముయొక్క ముఖ్యమైన ఆకృతులు; బాగా

ప్రకాశించే చిన్నచిన్న నలకలవంటివి పర్వతములు; చిన్న పర్వతశ్రేణులు; రంగురంగుల పొట్టి పొడవు చారలు చంద్రునిమీది ఉతర లక్షణములు.

నిజానికి, కటకములో అల్లిబిల్లిగా కనిపించే మార్పులను మేము వెంటనే అర్థము చేసికొనలేక పోయినాము. కటకముయొక్క ప్రకాశవంతమైన లక్షణములన్నీ ధాతుసూపములోఉన్న చంద్రగ్రహములోని ఖనిజము లేనని, కటకము పంచధా పార్శ్వప్రకాశము కలిగి ఉండటముచేత అవి కనిపించుచున్నవని, ఇవే ధాతువులు చంద్రునిలోకూడా ఉన్నవని బాబా చెప్పినారు. ఈ అతిచిన్న చంద్రబింబము కచ్చితముగా, కరారుగా ఉన్నదని, దీనిని పెద్దదిగా విస్తరింపజేసినట్లయిన, శాస్త్రవేత్తలు తమకు పరిచయమైన నైసర్గిక లక్షణము లన్నిటిని గుర్తించగలరనికూడా చెప్పినారు

ఆ చిన్న చంద్రబింబాన్ని ఎవ్వరికి ఇవ్వనని, అది ఎక్కడినుండి వచ్చినదో, అక్కడికే దానిని తిరిగి పంపుతానని బాబా మాతో చెప్పినారు. అది వచ్చిన మూలస్థానమేదో బాబా వివరించలేదు; ఎవ్వరూ వారిని అడుగలేదు.

అప్పటికి ఆ కార్లలో తెచ్చిన ఆహారపదార్థాలన్నీ క్రిందికి దించినారు. మావెంటవచ్చిన స్త్రీలు కమ్మని అల్పాహారము సిద్ధపరిచారు. చంద్రకటకము నా చేతిలో ఉన్నందున దానిని నా జేబులో అల్పాహారము పూర్తిచేసేవరకు ఉంచుకొని, తరువాత దానిని స్వామికి యిచ్చినాను. దానిని స్వామి సూర్యునిదిక్కుగా ఎత్తి పట్టుకొనగా, ఆ కటకము అంచుచుట్టూ పరిమితంగు కాంతి కనిపించింది. "చూడండి; సూర్యోదయము"! అని స్వామి పలికినారు.

అందరము ఆ బంగారు కాంతిని ఆశ్చర్యముతో చూచిన తరువాత, స్వామి దానిని తన అరచేతిలో ఉంచుకొని, ఆ అరచేతినిమూసి తెరచేటప్పటికి, ఆ కటకము మాయమై, వెంకటి చిన్న వెలగపండు కనిపించింది.

ఆసమయానికి కొందరు మనుష్యులెక్కడినుండో మాదగ్గరకు రాగా, స్వామి మిగిలిన ఆహారపదార్థాలు వారికి పంచిపెట్టించినారు. స్త్రీలు భోజనమువేసిన స్థలమును శుభ్రపరచిన తరువాత, అందరము కార్లలో బాబా అనుగ్రహించిన అల్పాహారముతో ఎంతో ఆనందించుతూ, బృందావనానికి తిరిగి ప్రయాణమైనాము.

—హిస్లాప్

వచ్చినచో పోనట్టిది జ్ఞానము, పోయినచో రానట్టిది మాయ, రాక పోకలు లేనట్టిది బ్రహ్మము.

వేద వేదాంగములచే, యుక్తి ప్రయుక్తులచే తెలిసికొను తెలివి పరోక్షము, అది అనుభవసిద్ధమైనప్పుడు అదియే అపరోక్షము.

—బాబా

# ఆధ్యాత్మిక తరగతులు

భారతీయ సంస్కృతిని ఆధ్యాత్మిక తత్వమును యువజనులకు ప్రబోధించేటందుకు గత రెండు సంవత్సరములలో తరగతులను జరిపినట్లుగా యీసంవత్సరముకూడా, మే నెల 20తేదీన ప్రారంభించి నెల దినములు జరుగునట్లుగా నిర్ణయించబడినది. ఈ నెల దినములు భారతీయ సంస్కృతికి, ఆధ్యాత్మిక చింతనకు సంబంధించిన అనేక విషయాలు విద్యార్థులకు ఆయావిషయాలలో ప్రసిద్ధులైన వారు బోధించటమే కాక, భజనలు, నగరసంకీర్తనలు, గ్రామసేవ, యోగాసనములు మొదలగువాటిని కూడ పాఠ్య క్రమములో బాబాగారు చేర్పించినారు.

ఈ నెలదినములు నిత్యము సాయంకాలము బాబాగారు తమ దివ్యసందేశములను విద్యార్థులకేకాక, యితరులనేకులకు కర్ణపేయముగా అందించుతారు. ఈ కార్యక్రమములో పాల్గొనుటకు అమెరికా విశ్వవిద్యాలయములకు చెందిన కొందరు ప్రత్యేకముగా వచ్చినారు.

మే నెల 20వతేది ఉదయము గం 9-30లకు కర్నాటకరాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ యం. వై. ఘోర్పడె గారు యీ కార్యక్రమాన్ని ప్రారంభించినారు. ఈ కార్యక్రమమునకు ప్రధాన దర్శకుడుగా నిర్వహించుచున్న డా॥ వి.కె గోకాక్‌గారు అభ్యాసితులకందరికి స్వాగతముచెప్పి యీ తరగతుల ప్రాశస్త్యమును గురించి చెప్పుచూ నేటి విద్యావిధానములోని, విద్యార్థులలోని లోపములను ఎత్తి చూపించినారు. ఈ కార్యక్రమమంతా ఒక యజ్ఞమువంటిదని, దీనికి కర్త, యజమాని, బాబాగారేనని, యజ్ఞమునకు కావలసిన పవిత్రాగ్ని కూడ వారేనని తెలిపినారు. నేడు కళాశాలలలో విద్యార్థులకు ఏవో కొన్ని విషయములను గురించిన వివరములు తెలియచేస్తున్నారేకాని, సంపూర్ణమైన ఆనందదాయకమైన జీవితమునకు కావలసినదేమీ బోధించుటలేదను బాధను వెల్లడించినారు. విద్య మానవుని చేతిలో స్వార్థమునకు పనికివచ్చే ఒక ఆయుధముగా కాక, మానవులలో ఉపస్థితుడైన పరమాత్మను ప్రకటించ కలిగి ఉన్నప్పుడే సార్థకమౌతుందని, సద్విద్య మానవుని పశుస్థితిలోనుండి పశుపతిస్థితిలోనికి తీసుకు వెళ్ళాలెనని చెప్పినారు.

మంత్రిగారు సాకారరూపముతో 'సాయి' గా ఉన్న బాబా దివ్యసమక్షములో నాలుగుమాటలుచెప్పే అవకాశము లభించినందుకు కార్యకర్తలకు తన కృతజ్ఞత తెలుపుకొనినారు. ఈ కార్యక్రమములో పాల్గొని లాభము పొందవచ్చిన విద్యార్థులను, ఉపాధ్యాయులను అభినందించినారు. సుఖజీవనము, ఆనందము ప్రతి మానవునికి లభించే మార్గము విద్య చూపించవలెనని, శరీరము మనస్సు బుద్ధి సమపాళ్లుగా వికసించినప్పుడే మానవుడు వీటిని పొందగలుగుతాడని చెప్పినారు.

మానవునిలో ఆధ్యాత్మికచైతన్యము ఒకరు బోధించితే లభించేదికాదని అది తర్కముతో లభ్యముకాక, జీవితాంతమువరకు కృషిసల్పి పొందవలసినట్టిదని తెలిపినారు. మానవునిలో యీ చైతన్యము సక్రియైన

సమయములో లభించిన ప్రబోధమువలన ప్రారంభము కావచ్చును. గురువు ఒక్కడే మానవుని మనస్సు నావరించి ఉన్న తెరలను తొలగించి, పరిపక్వము చెందినపళ్లలో సరియైన మంత్రోపదేశముతోనో, సలహాలతోనో, వానిని సచేతనునిగా చేయగలవాడు.

ధర్మము సాంఘిక ధర్మముగా ఉండి అన్ని కాలములలో, అది మానవాళికంతకు ఉపకరించేటట్లుగా ఉండాలి అని చెప్పినారు. సాంఘిక సేవ ఉత్తమ సేవగా మంత్రిగారు ప్రస్తుతించినారు భూమినుండి పెకలించినందున వృక్షమునకు విముక్తి లభించదని, అట్లే, సంఘములో పుట్టి పెరిగిన మానవుడు సంఘమును కాదనలేడని చెప్పినారు, ఉన్నత ధ్యేయములను నిర్ణయించుకొని, వాటికొరకు నిరంతరము నిష్కామ బుద్ధితో కృషి చేయవలెనని అప్పుడే ఆధ్యాత్మికమైన నైతికమైన ఆనందము లభించుతుందని చెప్పినారు. ప్రతివాడు గమ్యము చేసే బాణమువలె ఉండవలెనని సందేహములుండరాదని, చెప్పి విద్యార్థులకు త్రేజము కలిగించినారు

సరిగా 11-30 గంటలకు భగవాన్ శ్రీ సత్య సాయి బాబా జ్ఞానజ్యోతిని వెలిగించగా, ప్రతివాని హృదయమందు ఆ జ్యోతి వెలిగినట్లయినది. తరువాత బాబా విద్యార్థులనుద్దేశించి, తమ దివ్య సందేశమును హృదయములలో హత్తుకొనునట్లుగా, అందించి అందరిని ఆనందింపచేసినారు.

## శ్రీవారి సందేశము

ఇది ఒక పవిత్రమహాయాగము. దాని లక్ష్యము ప్రకృతి ఈశ్వరుడు జీవి వీటి నిజసంబంధమును స్వరూపమును తెలుసుకోవటమూ, మరియు, ఆధ్యాత్మిక చరిత్రను పవిత్రతను సందర్శించుకోవటము, ఇవిరెండే. ఈ క్రతువులో విద్యార్థులూ విద్యాధికారులూ అనుభవజ్ఞులైన విద్యావంతులూ ఋత్విక్కులై తమ భాగమును ఆచరించుచున్నారు. ఈ యజ్ఞహోమమునందు దురహంకారమునూ స్వార్థమునూ ఆహుతి చేసి, పరార్థమునూ విశాల భావమునూ అభివృద్ధి చేసుకోవటమే మీరు చేయవలసిన కర్మము.

జీవితము అనేది, 'నేను' అనే స్థానమునుంచి 'మనము' అనేస్థానమునకు మానవులు చేయు ప్రయాణమునకు ఒక పేరు భిన్నత్వభావమును దూరము చేసి, ఏకత్వమునుంచి అనేకత్వమువరకూ ప్రయాణముచేసినచో ఆనందమైన అద్వైత ప్రదేశమును చేరవచ్చును. అనేకత్వముయొక్క స్వరూపమైన ప్రకృతినుంచి ఆత్మలో ప్రవేశించకూడదు; అట్లు ప్రవేశించిన ఆత్మకూడ అనేకముగానే కనబడును. ఏకత్వమైన ఆత్మను ప్రప్రథమముగా సాధించుకొని, ఆత్మభావము లోనే స్థిరముగా నిలిచికొని, అనేకత్వముయొక్క స్వరూపమైన ప్రకృతిలో దిగినపుడు యే అపాయము సంభవించదు. అపుడు, ప్రకృతిని పరమాత్మ స్వరూపముగా విశ్వసించుటకు వీలగును.

ధనార్జన విద్యయొక్క లక్ష్యము కాదు; పశుపక్షి మృగాదులు కూడ పుట్టినది మొదలు జీవితముయొక్క అంతమువరకూ అనేక రకములైన ఆహారమును ఆర్జించుకొని, అటుఇటు సంచరించుచూ, దానిని భోగుచేయుచూ, తిండి నిద్రాదులకే జీవితమును అంకితము చేయుచున్నవి. అవి ఆహార నిమిత్తమై శక్తిసామర్థ్యములను విద్యావిజ్ఞానములను వినియోగించుచున్నవి. అయితే, దివ్యత్వము పవిత్రతను అందు కొన్న మానవులు వాటినే లక్ష్యముగా అంగీకరించకూడదు. గుణార్జనే విద్యయొక్క ముఖ్యలక్ష్యము. అన్నము నిమిత్తమై జీవితమును అంకితముచేసి మాన

పుడు ఆత్మకు దూరమైపోతున్నాడు. ఆహారముకొరకు మానవునికి ఎన్నో ప్రాణులు ఆహుతి అయిపోతున్నవి —చెట్లు, పుట్లు, గడ్లు, మేకలు, కోళ్లు, గొర్రెలు మొదలైనవి. ఇవన్నీ మానవునియందు చేరటముచేత వాటికి మానవత్వమే తిరిగి ప్రాప్తించును. కాబట్టి, జనాభా విపరీతముగా పెరుగుచున్నది. కానీ, వాటికి పైకి పోవటానికి కావలసిన టికెట్లు పాస్‌పోర్టుల అర్హత లభించటము లేదు.

మానవులుకూడ తిరిగి తిరిగి తల్లిగర్భముచేడుతూ, అప్పటినుంచి బయటకు వచ్చుచూ, అదే మానవత్వమునే తిరిగిపొందుతూ పరితపించుతూ, ఇట్టిబానిసలవలె జోహుకుంటవలె, స్వాతంత్ర్యములేక, జనన మరణ శృంఖలములలో బంధింపబడి బాధ ననుభవింతురు. మీరు బానిసలు కావటానికి ప్రయత్నముచేయకూడదు; భాగ్యస్థానమైన జ్ఞానభాస్కరుని చేరటానికి ప్రయత్నించవలెను.

ఈనాడు మానవుడు తన ధర్మము లేమి, తన మతమేమి; తనదృష్టి ఎట్టిది, తన జీవితములో తాను సాధించిన ఘనకార్యమేమి, ఇతరుల ఆదర్శములకూ తన ఆదర్శములకూ తారతమ్యమేమి, అని వివేకముతో పరీక్షించి ఉత్తమ మార్గమును అనుసరించుటలేదు. మన పూర్వీకులు సాధించిన సత్కర్మలు, బోధించిన సన్మార్గములెన్నియో ఉన్నాయి. వాటిని మరచినా, లేక ఉలక్ష్యముచేసినా, మానవత్వమే వ్యర్థమనిపించును. పురాతన భారతీయ సంస్కృతిని అనేక విధములుగా పరిహసించువారు ఇట్టి తారతమ్యాలను వ్రేలు పెట్టి చూపునపుడు, వారు దానిని హేళనముచేయునపుడు, మీరు ఊరకేఉండటము సమంజసముకాదు. ఆ సంస్కృతిని వినియోగించి దానివలనే సుఖశాంతులను అందుకొని, ఇట్టివాటిని సహించి, వ్యాఖ్యానము సలుపువారిని ప్రశ్నలడిగేవారిని, నోరు మూయించే శక్తిసామర్థ్యములు యువకులలో లేకపోవటము చాలా విచారకరము. ఈ పరిస్థితికి కారణమేమిటి? భారతదేశముయొక్క పవిత్ర చరిత్రను సనాతనమైన ఆత్మవిద్యను మీరు యేమాత్రమూ పరిచయము చేసుకొనక మీ కాలేజీ విద్యాభ్యాసమును పూర్తిచేసుకొంటున్నారు. భారతీయ సంస్కృతిని సరిగా అర్థముచేసుకొని, దేశముయొక్క అభివృద్ధికి కీర్తికి ఆధారమైన మీరు, ఆ ఆధారములైన తత్వములను అర్థముచేసుకొని, భారత ధర్మాన్ని ఆచరణరూపములో ప్రబోధించుటకు పూనుకొనవలెను. ఎవరో కొంతమంది, యేమీ తెలియని వారు, భారతీయ చరిత్రయొక్క పవిత్రతను తిరస్కరించి, దాని విలువను నశింపచేయుచున్నారు. మీరు కూడ, ఆ సంస్కృతియొక్క సారమును గ్రోలక దాని అంతరార్థము తెలియనటువంటి వారితో సంబంధము కలిగించుకొని, భారతదేశమునకే ద్రోహము చేయుచున్నారు.

ఉదాహరణకు, మేరీ అవివాహితగా ఉన్నపుడు క్రీస్తు జన్మించినాడు అంటే, అది దైవశక్తివలన మహా పవిత్రాత్ముడు పుట్టినాడు అని విశ్వసించి, ఆ పవిత్రత ననుభవించి ఆనందముగా ఆ విషయమును దాని మహత్వమును ప్రచారము చేసే మీరు, కుంతీదేవి అవివాహితగా ఉన్నపుడు ఆమెకు కర్ణుడు కుమారుడుగా జన్మించినాడు అనే మహా భారతములోని విషయమును ఎందుకు అదే రీతిగా అర్థము చేసుకొనరో అర్థము కాని విషయము! భారతము రామాయణము భాగవతము మొదలైన దివ్య గ్రంథములను సరిగా అర్థము చేసుకొనక, భారతీయులు అపార్థమునే కల్పించుకొని, నానా అర్థములలో పడి, అనర్థమునే హృదయమందుంచుకొని జీవితమునే వ్యర్థము చేసుకొనుచున్నారు. ఈ నెల అంతా, అనుభవజ్ఞులైన విద్యావంతులు మీకు వివరించు బోధించు భారతీయ

సంస్కృతియొక్క తత్వములను మీరు ఆరగించి ఆస్వాదించి అనుసరించి ఆనందించి ఆచరించి, వానిని గురించి ఇతరులకు ప్రబోధించుటకు సమర్థులౌతారని ఆశిస్తున్నాను.

మినిస్టర్‌గారు సైన్సుకూ ఆధ్యాత్మిక మార్గమునకూ ఉండవలసిన సామరస్యము సమన్వయములను గురించి చెప్పినారు. సైన్సునుంచి లోకమునకు చాలా ఫలితాలు లభించినవి కాబట్టి అది అభివృద్ధిగా చెప్పవలసినదే. అయితే, సైన్సుచే లభించిన తెలివిని వినియోగించే విధానములలో చాలా తప్పులున్నవి. తెలివి పైకి పోయే కొద్ది, గుణములు చాలా లోతుకి దిగజారుచున్నవి. ఇంద్రియ నిగ్రహము లేక, సైన్సువలన లభించే అనుకూలములను మానవుడు సరిగా అందుకోవడానికి వీలుండదు. ఈ నెల లోపల మీకు యోగాభ్యాసమును కూడ దీనికొరకు నేర్పించు చున్నాము. దేహబలము ఇంద్రియ బలము మనోబలము ఇవన్నీ పుష్టికరముగా నున్న ఈ వయస్సునందే మీరు యోగ మార్గమును చక్కగా అనుసరించవలెను. వృద్ధులైన తరవాత, అది సాధ్యముకాదు. ఇంద్రియములను విచ్చల విడిగా సంచరింపనీయక, సరైన మార్గమునందే ప్రయాణము సలుపుటకు పూనుకోవాలి. ఇంద్రియముల ఉద్రేకము మానవత్వమునే భగ్నము చేయును.

శీలము సౌజన్యము, పవిత్రత, నిజాయితి సహనము సత్యము ధర్మము ప్రేమ ఇవన్నీ లేకపోతే, మానవాకారమును ధరించి తిరుగుచున్ననూ, మానవత్వము శూన్యమే. మానవత్వములో దివ్యత్వము చేరియున్నది. అవి రెండూ నెగటివ్ పాసిటివ్ వలే సమముగా ఏకత్వమును ప్రకటించుచూ వెలుగవలెను. అట్లుగాక, మానవులు తమలోని దివ్యత్వమును గుర్తించక దానికి తగినట్లు ప్రవర్తించక పోతే, జీవితమే నిష్ప్రయోజనము.

కొంత మంది విజ్ఞాన శాస్త్రములందు ఆరితేరినవారు దురహంకారముతో విర్రవీగి భగవంతుడు లోకమందున్నాడా? లేడు! ఉండినను అతనికి నా హృదయములో స్థానమీయను, అని అంటారు. భగవంతుడు జ్ఞానస్వరూపుడు కాబట్టి తన హృదయమునందు భగవంతునికి స్థానం లేదన్న తాను విజ్ఞాని కాదనే స్పష్టపరచుకొనుచున్నాడు. భగవంతుడు లేడనిన తానే లేను అని అనడమే! నా తల్లి గొడ్రాలు అని చెప్పుటమే; నేను మూగ, నాకు మాటలు రావు, అని గట్టిగా వాదించుటమే!

ఇవన్నీ తప్పుడు మార్గములు: సార్థకమైన పద్ధతులు కావు. మీరంతా భారతీయ సంస్కృతియొక్క పవిత్ర మార్గమును గుర్తించుకొని, సత్యంవద ధర్మంచర మాతృదేవో భవ. పితృదేవో భవ, ఆచార్యదేవో భవ అనే వేదోపదేశమును మీ పంచప్రాణములుగా విశ్వసించి వాటిని మీ జీవితాధారములుగా అభివృద్ధి చేసుకోవలెను. భారతీయ చరిత్రయొక్క విశిష్టతను మీ పూర్వీకులు ఆర్జించి, మీ కొరకు వేదశాస్త్ర ఇతిహాస పురాణములందు దాచియుంచిన అమూల్యరత్నములను అందుకొని, ఈ సమ్మర్ క్లాసులలోని అనానుకూలములనూ ఆహార విహారములలోని కట్టుబాటులను లెక్కచేయక ఏకాగ్రత వహించి, వాటన్నిటినీ సహించుకొని, మీ ఉన్నతిని సాధించుటకు తగిన ప్రయత్నములకు పూనుకొందురని ఆశిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను"

# పుస్తక సూచి

పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజిస్ట్రేషను ఛార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

జాబితాలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జిలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 1-25 తో వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

తెలుగు:—

| | | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-65 |
| [illegible] | ,, ,, (2) | 4-00 | 0-75 |
| 3 | [illegible]మాల | 1-[illegible] | [illegible]-25 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-45 |
| 5 | అర్పణ | 1-00 | 0-15 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0 25 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-25 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-65 |
| 9 | వచనామృతము | 4-00 | 0-45 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 1-65 |
| [illegible] | దివ్యోపన్యాసములు | 1-50 | 0 35 |

కన్నడ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం[1] | [illegible] | [illegible] |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-25 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 9 | జ్ఞాన వాహిని | 1-50 | 0-15 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-45 |

మలయాళము:—

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0 55 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-15 |
| 3 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-65 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-15 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0 15 |

ఇంగ్లీషు:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజన సాంగ్స్ (ఇండియన్ ప్రకటన) | 1-50 | 0-25 |
| 2 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-55 |
| 3 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-65 |
| 4 | ప్రశాంతవాహిని | 2-00 | 0-25 |
| 5 | జ్ఞానవాహిని | 2-00 | 0-25 |
| 6 | నామ సంకీర్తన్ | 1-50 | 0-15 |
| 7 | ధ్యానవాహిని | 2-00 | 0-25 |
| 8 | సమ్మర్‌షొవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0 65 |
| 9 | ,, 1973 | 6-50 | 0-50 |
| 10 | సందేహ నివారిణి | 3-00 | 0-25 |

అరవం:—

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-25 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-65 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-65 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-45 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-55 |
| 6 | భజనావళి | 1-00 | 0-35 |
| 7 | సాయిమాతా | 1-00 | 0-15 |
| 8 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 9 | సందేహనివారిణి | 2-00 | 0-35 |
| 10 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 11 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-25 |
| 12 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-15 |

హిందీ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-15 |

గుజరాతి:—

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0 15 |
| 2 | కథాసుధ | 2-00 | 0-35 |
| 3 | గీతావాహిని | 4-00 | 0 55 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0 55 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-15 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0 25 |

అస్సామి:—

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారధి [పార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0 15 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కథ | 0-25 | 0 15 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0-50 | 0 15 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0 45 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-25 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0 15 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0 15 |

ఒరియా:—

| | | | |
|---|---|---|---|
| 1 | గితావాహిని | 5-00 | 0-25 |

## పత్రికల చందాలు. పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతి నిలయము నుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5 ఒక సంవత్సరమునకు తక్కువకాని 5 సం॥ ల కెక్కువ కాని చందాలు స్వీకరింపబడవు.

2 చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5 పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను.

M.O. ద్వారా పైకమును పంపి చువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియ జేయవలెను.

6 పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరముపరకు అని-మి చందారసీదు కార్డులోను, మికు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు .7/-74 అని యుండిన, మి చందా జూలై నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) జూలై నెల 8.వ తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —: శ్రీవారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు ఎడిటర్, 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యే., బి. యల్

Regd. No. KRN/A-67

June 1974

ఇనుపకడ్డీ నీటిలో మునుగుతుంది కానీ, దానిని ఒక పళ్లెముగా తయారు చేస్తే. అది నీటిలో తేలటమే కాక, కొంత బరువును కూడా మోస్తుంది.

అదే విధంగా మానవుని మనస్సు సంసారసాగరములో సులభముగా మునిగిపోతుంది. దానిని భగవన్నామమనే సమ్మెటతో పొల్లగా చేయండి; అప్పుడది సంసారసాగరములో తేలుతుంది.

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 జూలై, 1974 సంచిక 5

## విషయానుక్రమణిక



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా



## 54

### వృద్ధ బ్రాహ్మణుడు

ఈ ప్రకారము ప్రేమపూర్వక మగు వచనములతో, వారి వారి మనోరథములు చెప్పుకొని, ఈ అరణ్యములో శ్రీరామ సన్నిధిలో ఇట్టి శుభము, ఇంతటి సుఖము అనుభవించుటకు మనకు యోగ్యత యుండిన, భాగ్యముండిన, రామచంద్రుడు మన అభీష్టము నంగీకరించును; అట్టి ప్రాప్తియే లేకున్న, మన దురదృష్టమే రామచంద్రుని మనసును కఠినపరచి. మనలను తిరిగి అయోధ్యకు వెళ్లగొట్టును. రాముడే అనుగ్రహించకున్న, ఇక అనుగ్రహించువారెవరు? ఆతని చెంతనే కాలము గడుపని జీవితం, మరెక్కడుండిననేమి ? యేమైననేమి ? బ్రతికి చచ్చినవారలతో సమము, అని ఒక పెద్ద వృద్ధ బ్రాహ్మణుడు పలికిన ఈ పలుకులకు అందరూ "నిజమే. నిజమే ! ఈ మాటలు పరమ సత్యములు" అని బలపరచిరి......

### సీతాదేవి తల్లి

కులగురువైన వశిష్టుడు పంపిన దశరథుని మరణవార్త, జనకునికి అందిన క్షణమే, మహారాణి సమేతుడై అయోధ్యకు వచ్చెను. అక్కడ విషయములన్నియూ విశదమాయెను. ఇంతలో భరతుడు వచ్చి, రాణులు గురువు, ప్రజల సమేతుడై, చిత్రకూట పర్వతమునకు రామ సందర్శనము గావించుటకై వచ్చుచుండగా, వారితో జనకుడు తన రాణితో చిత్రకూటమునకు వచ్చెను. సమయమును చూచుకొని, సీతారాములతో మాట్లాడ వేచియుండిరి.

ఇంతలో సీతాదేవి తలి చెలికతెను పిలిచి కౌసల్యాది మహారాణుల సమయమును చూచి

తమ్ముని పంపెను. అంత చెలికత్తె కౌసల్యాది రాణులను చూచుటకు వెళ్లెను. జ్యేష్ఠ శుద్ధ యేకాదశనాడు మహారాణులు కలుసుకొనిరి. కౌసల్యాదేవి జనకమహారాజు భార్య అయిన సునయనను సన్మానించి. ఆదరించి సముచితముగ ఆసనపై కూర్చుండబెట్టెను.

ఆ మహారాణులను సునయన చూచుట మొదటి సారి కనుక, అనగా సీతాకల్యాణ సమయమున రాణులెవ్వరునూ మిథిలాపురమునకు వెళ్లలేదు; మిథిలాపుర రాణి అయోధ్యకు రాలేదు. అందుచే వారిరువురూ ఒకరి నొకరు గుర్తించుటకు వీలు లేక పోయెను. అయోధ్యానగర రాణులైనకౌసల్య, సుమిత్ర, కైకేయిలను చూచినదే, వారల సరసోక్తులను, సౌశీల్యమును. స్నేహమును చూచి కఠినమగు వజ్రము సహితము నీరగును. వారి శరీరములు పులకరించి శిథిలమయ్యెను. వారు కన్నీరు కార్చుచూ నేలను చూచుచూ దుఃఖించు చుండ, సీతారాముల గుణగణములను వారు వర్ణించుచూ పొంగివచ్చు దుఃఖమును ఆపుకొనలేక భోరున యేడ్వసాగిరి.

అంత సునయన, యేమి చెప్పుటకు తోచక అమ్మా, విచారించి ప్రయోజనమేమి; విధాతబుద్ధి వక్రమముగా వెళ్లెను. పాలనురుగును భేదించుటకు వజ్రమును వలె ఉపయోగించెను. అమృతమును వినియున్నాము కాని చూచియుండలేదు; గరళమునే చూచుచున్నాము. కాకులు, కొంగలు, గ్రద్దలు. గుడ్లగూబలను మాత్రమే చూచుచున్నాము కాని, మానస సరోవరములో రాజహంసలు కలవని వినుచున్నాము. దేవీ! విధి కృతములు విపరీతములు, విచిత్రములు, విధికృతములు బాలుని చర్యల వలె వున్నవి, అని సునయన ఓదార్పు మాటలతో తాను కూడనూ దుఃఖింపదొడగెను.

అంత కౌసల్య, "అమ్మా! సునయనా! ఇది యొకరి దోషము కాదు సుఖదుఃఖములు, లాభనష్టములు కర్మాధీనములు. (అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం) కఠిన కర్మగతులు తొలగించుటకు వీలుపడదు. శుభాశుభ కర్మలను లేదన మనమెవరము. ఈశ్వరాజ్ఞ యెటులున్నదటులే జరుగును. దేవీ మోహమున ఈ వస్తువులపై వ్యర్థముగా విచారింతుమే కాని మన పూర్వ జన్మ పుణ్య పాపములు యెందుకు దయ తలచును. అనాది కాలమునుండీ ఈ ప్రకారము జరుగుచున్న సృష్టిక్రమము మన కొరకై మారునా? పిచ్చి," అని నిట్టూర్పులు విడచెను.

అపుడు సునయన "అమ్మా మీ రెంతయో పుణ్యాత్ములు. లోకమున దశరథునికి మించిన పుణ్యాత్ముడు మరొకరు కనుపించరు. అట్టి దశరథునకు అర్థాంగులై, ధర్మమూర్తి, ప్రేమమూర్తి, విశాల హృదయుడు. సుగుణశీలుడు అయిన శ్రీరాములకు తల్లులై, లోక ఖ్యాతిని అందుకొంటిరి. మీమాటలు పరమ సత్యములు. ఎట్టి వారికైనా కష్టసుఖములు కావడికుండలు. కష్టమే లేకున్న సుఖముయొక్క సుఖము తెలియదు కదా. "న సుఖాల్లభ్యతే సుఖం" సుఖము నుండే సుఖము రాదు. లేదుకదా" అని బదులు చెప్పెను.

భరతునిచూచి భయం

"సీతారామ లక్ష్మణులు వనవాసము చేసిన యెడల నంతమున శుభములు కలుగును, కానీ

రాముని వియోగము భరించలేము. భరతుడు జీవించలేడు. సీతా రామ లక్ష్మణులకంటే, భరతునిచూచి నాకు మరింత దుఃఖము అధిక మగుచున్నది, భయమగుచున్నది,'' అని కౌసల్య గద్గదస్వరముతో పలికెను. ఆ మాటలు విని సుమిత్రాకైకేయిలు ''నిజము! నిజము!'' అని వారునూ దుఃఖించిరి.

అంత సుమిత్ర అక్కా! మీ ఆశీర్వాదముతో మన కొడుకు కోడళ్లును, గంగవలె నిర్మలులు. ఇదివరకు రాముడు తోడని చెప్పియుండలేము, ఇపుడు రాముడు తోడని సత్స్వభావముతో చెప్పుచున్నాను. భరతుని గుణశీలమును, వినయమును, వుదారబుద్ధియు, భ్రాతృవాత్సల్యమును, భక్తి శ్రద్ధలను, ధైర్య స్థైర్యములను సంపూర్ణముగా వర్ణించి చెప్పుటకు సరస్వతి సహితము సంశయించును. రత్నగుల్లలు సముద్రమును తరచవగునా? సదా భరతుడు కులదీపకుడని తెలిసికొనుట అందరికీ సాధ్యము కాదు,

పరీక్షవలన రత్నములును, పారదమణి వలన బంగారమును వలే సమయము వచ్చినపుడు మనుజుని పరీక్షింపవలెను. ఈ సమయమునవే ఇట్లు పలుకుట మంచిది కాదు. శోకము చేతను, పుత్రవాత్సల్యము చేతను నా బుద్ధి తక్కువయ్యెను, అని కన్నుల నీరు తుడుచుకొనుచుండ, సునయన, ''అయోధ్యారాణులు, ఒకరికంటె మరొకరు మహా పవిత్ర హృదయులనియూ, నిజముగా తమ స్వంత కొమారులనైనా వర్ణించక, సవతి బిడ్డలను ఇన్ని విధముల వర్ణించి మెచ్చుకొనుట లోకవిరుద్ధము. బాధా రహితులయిన ఈ రాణులు లోకమునకు ఆదర్శ గృహిణీమణులు, అహా యెంత విశాల భావములు, యెంత నిస్వార్థ పలుకులు'', అని తనలో తాను ఆశ్చర్యపడుతూ ఆనందించుచుండెను

కౌసల్య కోరిక

అంత కౌసల్య ధైర్యము తెచ్చుకొని, ఓ మిథిలా దేశపు మహారాణీ! జ్ఞానసముద్రుడైన జనక చక్రవర్తి భార్యవు నీవు. నీకు యెవరు వుపదేశించ సాహసింతురు. మా పలుకులు అజ్ఞానపు పలుకులు. అయినను. మా మాటలు క్షమించి సమయమును జూచి చక్రవర్తితో ఈనామాటను జెప్పుము. యేమన, లక్ష్మణుడు ఇంత కాలము రామునితో నివసించెను కనుక, కొంత కాలము భరతుని రామునితో నివసించునట్లును, లక్ష్మణుని అయోధ్యలో పనులు చూచుకొనునట్లును లక్ష్మణునకు శత్రుఘ్నుడు తోడుగా వుండునట్లునూ నా ప్రార్థనగా చక్రవర్తి రామునకు నచ్చజెప్పుమనుము. ఈ మాటలకు సమ్మతించిన యెడల మిగిలినవి అన్నియూ వాటికవే సరిపోవును.

భరతుని విషయములోనే నాకు చాలా భయముగా వున్నది. భరతుని ప్రేమ గంభీరమైనది. రాముని విడచి జీవించనొల్లడు, చక్రవర్తి స్వర్గస్థులయిరి, రాముడు వనవాసము వీడడు. భరతుడు యేమైనా రామవియోగమును భరించుకొనలేక గతించిన దేశమే జీవచ్ఛవము కాగలదు. మున్ముందు యేమి ప్రమాదము రానున్నదో నాకు చాలా ఆందోళనగా వున్నది. అని సునయన చేతులు పట్టుకొని జనకమహారాజును తగిన రీతిగా నచ్చ చెప్పి ఈ పని యెట్లయిననూ నెరవేరునట్లు చేసి మమ్ములనానందపెట్టుమని ప్రార్థించి సటుల చెప్పెను.

కౌసల్యయొక్క స్నేహధర్మమునకు సంత సించి, సునయన, దేవి, వినయములు, సుగుణ ములు, నీ కుచితములు. అగ్నిధూమమును ధరిం పదా ? పర్వతములు తమ శిరస్సుపై తృణ షులను ధరింపవా ? మనోవాక్కర్మములచే చక్రవర్తి మీ సేవకుడు మీకు సదాసహకారులు! దీపవు సహాయమున సూర్యునకు శోభ కలుగునా ?

దేవకార్యమును సాధించుటకు రాముడు వన మునకు వచ్చెను ఆతడు తిరిగి వచ్చి అయోధ్యా రాజ్యమును నిశ్చలముగా పరిపాలించును ? రాముని బాహుబలముచే నర, దేవ, నాగులు సుఖించి, వారి వారి నిజస్థానముల పొందగలరు. ఇవన్నియును మున్నే యాజ్ఞవల్క్య ఋషి చెప్పి యుండెను. ఋషివాక్యములు యేనాటికి అసత్య ములు కావు, అని విన్నవించి. కౌసల్య పాద ములకు నమస్కరించి సెలవు గైకొని సీతను చూచుటకు పర్ణశాల దిశకు వెళ్లతగిన యేర్పాట్లు గావించు కొని వెళ్లెను. తల్లి లోనికి వెళ్లి కూతురు సీతను చూడగనే పట్టలేని దుఃఖమును ఆపుకోలేక కౌగిలించుకొని భోరున యేడ్వసాగెను. సీత తల్లిని అనేక విధముల ఓదార్చి ధైర్యవచన ములు బోధించి, తల్లి పాదములకు నమస్కరించి నిలుచుకొనెను. జానకి ధరించిన తపస్విని వేషమును చూచి సాక్షాత్ పార్వతీదేవిగా కను పించిన సీతతో, అమ్మా నీవు నా సీతవా లేక సాక్షాత్, శంకరుని ధర్మపత్నివా ? అని ప్రశ్నించి, ఆశ్చర్యముతో ఆమెను యెగాదిగా చూచి పరమానంద పరవశముతో ఇట్లు ప్రారం భించెను.

ఓ సీతా ! నీ మూలమున తల్లిదండ్రుల వం శము, అత్తమామల వంశము రెండునూ పవిత్ర మయ్యెను. నీ కీర్తి లోకవ్యాప్తి కాగలదు తల్లీ, నీ కీర్తి అను నదికి పైరెండు వంశములును రెండు గట్లు గంగానదికి భూలోకమున మూడు పుణ్యతీర్థములు మాత్రమే కలవు: హరిద్వారము, ప్రయాగ, సాగరసంగమము. అయితే నీ కీర్తి బ్రహ్మాండ ప్రవాహమై సర్వుల హృదయ క్షేత్రములందూ తీర్థరూపమున సార్థకమును గావింతువు గాక అని ఈ విధముగ వాత్సల్యము చే పలికిన తల్లి సత్యవాక్కులను సీత విని సిగ్గు పడినటుల నటించుచు, తల్లీ ! యెంతటి మాట, యెక్కడి సంబంధము ? పవిత్ర గంగకూ నాకూ పోలిక యేమిటి ? అని భక్తి శ్రద్ధలతో గంగకు నమస్కరించునటుల ప్రదర్శించి నిలి చెను. అంత తల్లి కౌగిలించుకొని శిరస్సును ముద్దాడి, సీతా ! నీ గుణములు లోక గృహిణీ మణులకు ఆదర్శములు. అని చెప్పుచుండ, సీత, అమ్మా నేను కాలమును అధికంగా మీతో గడుపుటచే రామచంద్రుని సేవాకార్యములు కొంత తడవు కావచ్చును. కాన నేనిక సెలవు తీసుకొనుటకు అనుజ్ఞ ఇమ్మనెను. అంత తల్లి జానకి మనసును కనిపెట్టి సీత మనోభీష్టమునకు అడ్డు తగులుట మంచిది కాదని తలంచి అనేక పర్యాయములు సీతను ముద్దాడి, అమ్మా నీ ఇష్ట ప్రకారము శ్రీ రామ సేవకై వెళ్లుమని సెల విచ్చెను. అంత సీత తల్లికి నమస్కరించి రామ సన్నిధికి వెళ్లెను.

సునయన తన కొమార్తెయొక్క పతిభక్తిని ఆమె గుణములను తనలో తాను స్మరించుచూ ఆనందించుచూ సీతనే చూచుచూ ఆమె లోనికి వెళ్లునరకూ అక్కడే నిలిచియుండెను. ఇంతలో సునయన చెలికత్తె అమ్మా సీతమ్మగారు లోనికి

వెళ్లిరి మనమిక మన స్థానమునకు వెళ్లుట మంచిదని హెచ్చరించగనే, సునయన కంటి ధారలు తుడుచుకొనుచూ, ఇక విధిలేక అక్కడ నుండి వెనుకకు తిరిగి తన విడిది స్థానమునకు చేరినది. ఇంతలో సూర్యాస్తమము కావటముచేత, రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు, స్నాన సంధ్యాది కర్మనిష్ఠలను ఆచరించుటకై నది కేగుచున్నారని పండితులు, విప్రులు, రాజులు, మంత్రులు అందరూ వారలతో నదీతీరమునకు వెళ్లి స్నాన సంధ్యాదులు ఆచరించి కంద మూలాది ఫలములను భుజించి వారి వారి విడిది వృక్షముల క్రింద నిశ్చింతగా నిద్రించిరి.

భరతుని కుతూహలము

తెల్లవారి నిత్య కార్యక్రమములు ముగించుకొని అందరూ పర్ణశాల చుట్టూ చేరిరి. శ్రీరామచంద్రుడు వారలందరినీ చూచి చిరునవ్వుతో వారల యోగ క్షేమములు విచారించుచూ రాగా, భరతుడు రామునకు నమస్కరించి, స్వామీ! నా మనస్సున నొక అభీష్టము మొలకెత్తినది, భయము చేతను, సంకోచము చేతను. దానిని చెప్పుకొనలేక పోవుచున్నా ననెను. అంత శ్రీరాముడు అతని తల నిమురుచు నా చెంత సంకోచ మెందుకు, తప్పక తెలుపుమనెను.

అన్నా! ఈ చిత్రకూట పర్వతమున గల ఋషి ఆశ్రమములను, పవిత్ర తీరములను, వనములను, వన మృగములను, సరోవరములను, సెలయేళ్లను జలధారలను సందర్శించ కుతూహల పడుచున్నాను. అందుచే తమ పాద చిహ్నములను దర్శించి రావలెనను కుతూహలము అయోధ్యా వాసులను సహితము రేకెత్తించినది అని ప్రార్థించెను.

అంత రాముడు, "తమ్ముడా నీ అభిరుచి చాలా ఉత్తమమైనదే కాని, నీవు అత్రిమహాముని అనుజ్ఞ గైకొని నిర్భయముగ వనములో సంచరించ వచ్చును" అని చెప్పెను. రాముని వచనములను భరతుడు విని సంతసించి ముని చరణములకు నమస్కరించి, రామునకు నమస్కరించి, శత్రుఘ్నునితో పాటు మంత్రులతో పాటు వనసంచారము, ఆశ్రమ సందర్శనము, గావించెను.

అట్లు సందర్శించుచూ రాగా పర్వతసమీపమున నొక కూపము కనుపించెను. సకల పుణ్య తీర్థముల పవిత్ర జలములు దానిలో గలవు. ఆ జలము నిర్మలము. అక్కడికి వెళ్లెను. అక్కడ అత్రిమహాఋషి శిష్యుడు భరతునకు ఆ పవిత్ర జలమును గురించి వివరించెను. అంత భరతుడు ఆ పవిత్ర జలమును శిరస్సునందు ప్రోక్షించుకొని, నమస్కరించి అందులో పడిన చెత్తనూ మట్టినీ తీసి ఆ స్థానమును తన స్వహస్తములతో పరిశుభ్ర పరచెను. అదే నేడు "భరత కూపము" అను పేరుతో నిలిచి లోక ఖ్యాతి నందుకొనుచున్నది.

(సశేషము)

# మనోనిగ్రహము

భక్తుడు : బాబా, ఏకాగ్రత అనగా నేమి ? దాని అర్థమేమి ? దానికి, ధ్యానమునకు గల భేదమేమి ?

శ్రీ సత్య. సా : ఏకాగ్రతయనగా, ఒక బిందువు పై గాని, ఒక పని పైన గాని, ఒక ఆలోచన పైన గాని, ఒక విషయము పైన గాని మనస్సును కేంద్రీకరించుట; ఇంద్రియముల కతీతమై, కోర్కెలన్నిటిని నిగ్రహించి నపుడు ధ్యానము కల్గును. ధ్యానములో నీవు, భగవంతుడు మాత్రమే యుందురు. దృఢ విశ్వాసము, పూర్తి చింతనవలన సక్రమమైన ధ్యానము కలుగును. రామకృష్ణ పరమహంస, అట్టి ధ్యానమును, సాధనను కలిగియుండెను. మర్కట రూపములో భగవంతుడైనటు వంటి హనుమంతుని ధ్యానిస్తున్నపుడు ఆయనకు తోక గూడ పుట్టెను.

భక్తుడు : అది మనుష్యునికి సహజముగ వచ్చునా ? లేక దానికేదైనా మార్గము కలదా ?

శ్రీ స. సా : ఏకాగ్రత మనుష్యునికి సహజముగ కలుగును, కాని ధ్యానము అట్లు కాదు. దానికి ఒక మార్గము కలదు. రామకృష్ణునికి, వరుసగ కొంత మంది గురువులు మార్గము చూపిరి

భక్తుడు : 'నేనెవరు' అను విచారణయే ధ్యానము.

శ్రీ స. సా : దానిని, జ్యోతిపైన గాని, శబ్దము పైన గాని, 'ఓం' పైన గాని ధ్యానముతో జతపర్చ వలెను. నీలో నున్న 'అరణ్యము' Forest లోనికి పోవలెను. అది for rest. లోనికి పో — అదే ఆహ్వానము.

భక్తుడు : స్వామి మనుష్యులను 'లోనికి పో' అని అపుడపుడు ఆదేశిస్తూయుంటారా ?

శ్రీ స. సా : ఉదయపు వేళ చక్కని టైము, మనసు నిర్మలముగ ఉండును. అపుడు బాధ్యతల ఒత్తిడి యుండదు ; పగటి వేళ కష్టము ; చుట్టూ జనం ఉంటారు ; పనులు చక్కబెట్టుకునే టైము

భక్తుడు : స్వామి ఒకసారి చెప్పారు, 'ఊపిరి పీల్చేటపుడు మనం ఉచ్చరించే సోహం' కు మనం తగు విలువ నివ్వడం లేదని. అది యెట్లు జరుగుచున్నది ?

శ్రీ స. సా : 'స' అనునది 'అతడు' దైవం 'హం' అనునది నేను. ఎవరో ఒక యోగి నిన్ను 'స', అను అక్షరమును మాత్రము 24 గంటలూ జపించమని చెప్పాడు ; అతని ప్రకారం, 'హం' అను దానిని ఉచ్చరించుట లేదు కనుక 'నేను' అనునది దాని కదే అణగిపోవును అని. అది చాల కష్టతరము, నిద్రలో అది అసంభవము.

భక్తుడు : తానారీతిగా చేస్తున్నానని ఎవరో యోగి చెప్పాడు,

శ్రీ స. సా : అతను చేయలేదు, ఆ విధమైన సాధనతో సతతముండుట వలన ఏమి ఉపయోగము ?

భక్తుడు : ఆ యోగి మాట అటుంచి, మీ వల్ల హంసు నేను పాటిస్తాను. ప్రతి ఉచ్ఛ్వాస, నిశ్వాస ములతో "సోహం" ఉచ్చరిస్తూ యుంటాను, దాని ననుసరించు క్రమమేమి ?

శ్రీ స. సా : నీవు ప్రతిసారి ఉచ్ఛ్వాస నిశ్వా సములతో 'సోహం' చెప్పనక్కరలేదు, దానిని ఊపిరే చెప్పుచున్నది అను విషయమును గుర్తించుకో. అంతే చాలు. అది అచటనున్నది అను భావనను పొందుము. రాత్రి నిద్రించే సమయంలో, 'నేను' 'అతడు' "స" "హం" అను ద్వైతభావన లేనపుడు, ఊపిరి "ఓం" ను జపిస్తున్నది, అంతే.

భక్తుడు : 'స' అనునది 'అతడు', 'హం' అనునది 'నేను'; 'నేను' లేక 'ఆత్మ' అను దానిని ధ్యానించుటకు, దేహంలో యేదైనా ఒక ప్రత్యేకమైన బిందువు గలదా? ఆత్మ ఎచటనుండును?

శ్రీ స. సా : ఆత్మ అంతటా యుండును. కానీ, ధ్యానము విషయములో 'జీవాత్మ' అనునది నాభికి 10 అంగుళముల పైన, గుండె మధ్యభాగములో యుండునని చెప్పవచ్చును.

సాధనకు ఉపకరించు మనస్సు అను ఇంద్రియము మనలను మాయలోకి గూడ త్రోయ గలదు, కాన అది చాల ప్రమాదం; ఏమందురు ?

శ్రీ స. సా : మనస్సు ఇంద్రియాలతో కలియ కూడదు, దానికి వేరే ఇంద్రియాలు కలవు, వాటితో అది చేరవలెను. అట్టు జరిగినయెడల యే విధమైన ప్రమాదము ఉండదు. అది ఏమనగ, సత్యము, చేతనము, శాంతి క్షేమ, ఆనందము, మనస్సు వీటితో చేరినపుడు, అంతయు సరిగానేయుండును, కాని మనస్సు 'సినిమాకు వెళ్లవలెనని అనుకున్న వెంటనే శరీరమును దానియొక్క అన్ని ఇంద్రియాల చేతన తోను మెలకువతోను సినిమాకు తీసుకు వెళ్లుతూ యున్నది, అపుడు అది, ఆ సినిమా, ఆ మనుష్యులు, ఆ బావాలతోను, ఉద్దేశాలతోను కలుస్తూయున్నది. శాంతి పోయినది. మనస్సు శరీరేంద్రియాలతో కలవకూడదు. శరీరేంద్రియాలే శరీరానికి కావలసిన అవసరాలను చూసుకుంటూ యుండాలి.

భక్తుడు : స్వామి, అన్ని కష్టాలు ఈ మనస్సు నుంచే వస్తాయటాండు.

శ్రీ స. సా ; ఇంకా సరిగా చెప్పాలంటే, కోరిక లనుంచి అనవలెను.

భక్తుడు : అనగా మనుష్యుడు, వాని ఆలోచన లను కట్టడిలో పెట్టుకొనవలెను.

శ్రీ స. సా : ఆలోచనలు, కోరికలు, రెండూ ఒకటే కాదు. కోరికలు కానివి, యెన్నో ఆలోచనలు ఉండవచ్చును, కోరిక యున్నదంటే, దానికి ముందు ఒక ఆలోచన ఉండియుండాలి, కాని అన్ని ఆలోచ నలు కోరికలు కావు. నల్లని మబ్బులు వర్షాన్ని కురి పిస్తాయి, కాని వర్షాన్ని కురిపించని మబ్బులు కూడ ఉండును. భగవంతునిపై దృఢమైన కోరికయున్న పుడు, చెడ్డ కోర్కెలు కలిగి నప్పటికి, అవి మనస్సు లోనుండిపోవును, దానిని అంటియుండవు.

భక్తుడు : స్వామి, ఆలోచనలు, ధ్యానమును కుదరనీయవు; ఆలోచనలను పోగొట్టుకొనుట యెట్లు ?

శ్రీ స సా : ఆచించుట అనే అలవాటు చాల పాతది. దానిని నిర్మూలించినప్పటికిని కొంత కాలం వరకు ఆలోచనలు ఉంటూనే యుండును. కరెంటు ఆపు చేసినప్పటికిని పంఖా కొంచెం సేపటి వరకు తిరుగుతునేయుండును. అవునా ? మనస్సుకు ఆధ్యాత్మిక గమ్యానికి —పూర్ణత్వము, భగవంతుడు, రాముడు, మొదలగు విషయములను చేరుటకు, తరి ఫీదు నిచ్చుట సరియైన పద్ధతి.

భక్తుడు : అనగా మన చిత్తములో యెప్పుడూ రాముడు ఉండవలెను.

శ్రీ స సా : నీలో 4 దశలైన చిత్తమున్నది ఆచేతనలో యేమి ఊహలు యుండవు ; లోతైన చేతనలో ఊహలన్ని గజిబిజిగా యుండును ; చేతనలో యున్నదానికి, సందేహాలు సందిగ్ధాలు, చేయవచ్చునా చేయకూడదా. మొదలగు మానసిక ఘర్షణ కల్గుచుం డును. దైవిక చేతనలో లేక అతీతమైన చేతనలో ఆ అద్వితీయుని భావనయే యుండును.

భక్తుడు : పూర్తిగా దైవ చింతనలోనే నిమగ్న మైతే, దేహానికి పోషణయెట్లు ?

శ్రీ స. సా : నీవు గాఢనిద్రలో యున్నపుడు నీ దేహాన్ని ఎవరు కాపాడుచున్నారు ? భగవంతుడు కాపాడుచున్నాడు. అదే రీతిగ యితర సమాయాలలో కూడ, దేహం అర్ధభాగమునకు పక్షవాతం వచ్చినపుడు ఆ భాగమును కదుపగలరా లేక ఆ భాగము పని చేయగలదా ?

భక్తుడు : మంత్రమును జపించుట, ధ్యానిం చుట వలన యేమైనా లాభముండునా ?

శ్రీ స. సా : అవును. పశ్చిమ దేశవాసులు కూడ, గాయత్రీ మంత్రంలో గొప్ప శక్తి కలదని కనుగొన్నారు. అది ఆధ్యాత్మిక జీవితము, సాధనలలో తగు అనుభవము గలవారు చేయవలెను.

భక్తుడు ; స్వామి, మీరు సాధకులకు, మంత్రో పదేశము చేయరు. వారికి మంత్రోపదేశము కావలె ననిన మిమ్ముల నడుగవచ్చునా ? లేక, స్వామియే వారికి తగు సమయమున ఉపదేశింతురా ?

శ్రీ స. సా : అవతారములు ఎన్నడు సాధ కులకు మంత్రోపదేశములు చేయలేదు. మనుష్యుని మోక్ష ప్రాప్తికి, వారు ఎటువంటి సూత్రములను చెప్పలేదు. అవతారముల దర్శన శ్రవణములు, వారి మహిమలను గుర్తించి, వారు బోధించిన రీతిని నడచు కొనుటయే ఒక మంత్రము. అర్జునునికి శ్రీకృష్ణుడు ఎట్టి మంత్రోపదేశమును చేయలేదు ''ఇట్లు చేయుము'' అన్నారు. అర్జునునికి వినిన రీతిగ చేసిన పిమ్మట విజయము సిద్ధించినది.

భక్తుడు : ఈ ప్రపంచమున సూటియైన, ధృఢ మైన భగవదనుభవము గల మహా పురుషులు లేరన గలరా ?

శ్రీ స. సా : ఏల అట్లు అడిగెదవు ? ఈ రోజుల లో కూడ, ఆత్మ సాక్షాత్కారమును పొంది, భగవంతు ని సాక్షాత్కరించుకొన కల్గినవారు గలరు. కాని. వారు, ఇక్కడ, అక్కడ తిరుగుచూ, శిష్యులను ప్రోగు చేసుకొనుచు యుండరు. అటువంటి వారిని నీవు కలసి నప్పుడు, వారిని యేదైన సలహా అడిగిన యెడల, నీపై యెట్టి శ్రద్ధను చూపరు. ఇక ఈ తిరుగుచుండెడి "గురువులు" నీవు యెంత బురదలో నున్నావో,

వారు. అంతే; వారికి అనేక కోర్కెలు గలవు, అందు వలన వారికి అనేక సమస్యలు గలవు. వారి జ్ఞాన మంతా, యితరుల దగ్గర నుంచి, పుస్తకాలనుంచి సేక రించినదే. వారికి నిజమైన భగవదనుభవము లేదు. అటువంటి వారు నిన్ను ఎట్లు ఈ బురదలోనుంచి పైకి లాగ గలరు ? భగవంతుడు ఒక్కడే సరియైన గురువు. వారిని అడుగము, వారు నీకు మార్గము చూపుదురు. వారు నీ హృదయములోనే యున్నారు. వారు నిన్ను రక్షించుటకు, నీకు మార్గము చూపు టకు, నీకు సహాయము చేయుటకు, సర్వదా సం సిద్ధులే.

భక్తుడు : బాబా ఉపదేశములలో సత్యమున్నది; వారి మాటలు, వాటికవే కార్యాచరణకు దారి తీయును. స్వామి అవతారమో కాదో అను ప్రశ్న కూడ అవసరము లేదు.

శ్రీ స. సా : స్వామి అవతారము అనుటలో సందేహము వద్దు.

భక్తుడు : మనస్సు యేమీ పనిలో మునిగి యుం డనపుడు, 'సాయిరాం' జపిస్తున్నాను, ఇది సరియా ?

శ్రీ స. సా : చాల మంచిది.

**ఒక అమెరికన్ నోటుపుస్తకములోనుంచి సంగ్రహించినది.**

## ఎన్నటికీ చెప్పను !

బావమునే పరిశుద్ధము — చేయువింత సంఘటనతో
మనసులోని మాలిన్యము — బుద్ధిలోని చాపల్యము
కడిగివేసి నట్లయినది—
స్వామి పాదపద్మములను — ప్రణమిల్లుచు తాకినంత
మధురమైన జలదరింపు — యొడలంతయు పులకరింప,
భ్రమపెట్టిన ఆలోచన — దురదృష్టపు జీవితమ్ము
క్షణములోన సంస్కరింప — బడినవహో ! ఆశ్చర్యము !!

అంధకార జీవితమ్ము — ఆ క్షణమే తొలగిపోయె
ప్రేమ, బలము, నిచ్చునట్టి వెలుతురు నే కనుగొంటిని !
చెప్పను నేనిక చెప్పను — ఎన్నటికి నే చెప్పను
అంధుడనని నే చెప్పను, చెప్పను నే నంధుడనని—

**ఆశ్వనీ కుమార్, 'అష్రఫ్'**
అంధ విద్యార్థి, వేసవి విడిది, 1974

# సందేశము

ప్రేమస్వరూపులారా !

మతమంటే ఒక మూర్ఖ పెడవాదముతో కూడుకొనిన అంధ విశ్వాసము కాదు. మానవుడు తన గమ్యస్థానమైన పరమాత్మ సాన్నిధ్యమును చేరుకొనునట్టి మార్గమే మతము. మరియు, పరిపూర్ణతను పొందుట కొరకు మానవుడు చేసే అతి దీర్ఘమైన ప్రయాణములో, అత్యంత అవసరమైనట్టి ప్రవర్తనే మతము. అందుచేతనే, పైకి వివిధ విరుద్ధ సిద్ధాంతములు కలిగి ఉన్నట్లుగా మతములు కనిపించునప్పటికి, వాస్తవములో అవి ఒకదాని నొకటి ధిక్కరించుట కానీ, ఒకటి బోధించిన ధర్మము మరొకటి కాదనుట కానీ, పరస్పరము ఖండించుకొనడము కానీ, చేయవు.

మానవులు నిత్యజీవితములో, తమ తమ స్వభావములకు, పద్ధతులకు అనుగుణ్యముగా, సంపూర్ణతను చేరుకొనవలెననే ఒకే ఒక అభిలాష కలిగివుంటారు. ఈ అభిలాష సాఫల్యము కొరకు అనుసరించే పద్ధతులు వారి వారి స్వభావముల ననుసరించి ఆచరించే విధానములు భిన్నముగా ఉండుట చేతనే నేడిన్ని మతము లేర్పడినవి.

ఈ విధముగా మనము మతములందు పైకి కనిపించే వైరుధ్యములను చక్కగా అవగాహన చేసికొని అన్వయము చేసుకొనినట్లయిన, మానవుడనుభవించటానికి మతము చూపించే స్వేచ్ఛ కాక, మరొక స్వేచ్ఛకు అవకాశమే లేదని చెప్పవలెను.

మతమనగా మరేమీ కాదు ; మానవునకు భగవంతునియందున్న భక్తి ప్రపత్తుల వైఖరే మతము. ఈ వైఖరి మానవునకు భగవంతునకు మధ్య ఏర్పడిన సంబంధము మీద ఆధారపడి ఉంటుంది. జ్ఞాని వైఖరి ఒకటి. కర్మపద్ధతి ఒకటి. భక్తిమార్గము మరొకటి. భక్తి అనేది భిన్న వ్యక్తులలో భిన్నరూపములు తాలుస్తుంది.

ఈ వ్యత్యాసములకు కారణము మానవుడు తనకు భగవంతునికి మధ్యనున్న సంబంధమును గురించి భావించుటలో, కల్పన చేసుకొనుటలో, అనుసరించు మార్గములో, భిన్నత్వము కలిగియుండుటే. ఏ మార్గమునైనా, నిష్కల్మష హృదయముతో, నిర్మలభావనతో, శరణాగతుడై మానవుడనుసరించిన యెడల గమ్యము చేరుకొనుట తథ్యము.

**ఆశీస్సులతో — బాబా**

# ధర్మో రక్షతి రక్షితః

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రములో కౌరవులందరు ఒక వైపున, పాండవులందరు మరొకవైపున యుద్ధానికి సంసిద్ధులై ఉన్నారు. వారందరు యుద్ధానికి సంబంధించిన దుస్తులు ధరించినారు ; కవచములు ధరించినారు ; సర్వ అయుధాలు ధరించినారు. ఇంక శంఖములు కూడా పూరించుతున్నారు ; తప్పెటలు మ్రోగుచున్నవి. ఇంకా యుద్ధ సంబంధమైన భేరీ, కాహళము మొదలైన వాద్యములన్నీ మ్రోగించుచున్నారు.

పాండవుల రక్తము ఉప్పొంగి పోతున్నది. అటువంటి సమయములో, ధర్మరాజు అవలి ప్రక్కకు చూచినాడు. చూచిన తక్షణమే గురువులైన ద్రోణాచార్యులు, పితామహుడైన భీష్ముడు, కంటికి కనుపించినారు. వెంటనే తాను ధరించిన దుస్తులు విప్పివేసినాడు ; కవచము తీసివేసినాడు, చేతులు కట్టుకొని, వినీతమతిగా, పాదచారియై ద్రోణుని దగ్గరకు బయలుదేరినాడు. ఇది చూచిన కౌరవులు మహదానందము చెందినవారైనారు. ధర్మజుడు శరణాగతుడై వస్తున్నాడని ఉప్పొంగినారు.

కానీ, యీ దృశ్యమును చూచిన పాండవ సోదరులు, “ ఏమీ ! అన్నగారైన ధర్మజునితో మొదటి నుండి కూడా యీ విధమైన బాధలే వస్తున్నవి. యుద్ధమునకు సన్నద్ధులమై ఉన్న యీ సమయములో యిలాంటి పరాభవము మాకు కలిగించటము న్యాయమా ?” అని వాపోయినారు, భీముని కండలు కదలినవి. అర్జునుని కన్నులందు చాలా కోపము విజృంభించినది. పాపము నకులసహదేవులు ఏమీ చేయలేక ఊరకే ఉండిపోయినారు.

తక్షణమే కృష్ణుడు, పాండవుల పక్షము వాదు కాపటము వలన, భీమునికి అర్జునునకు సైగ చేసినాడు. “ తొందరపడవద్దు, ఇంతవరకు అన్నింటియందు మీరు ధర్మజుని అనుసరించినారు. కనుక, ఏ మాత్రము సందేహమునకు తావు ఇవ్వక, ఈ విషయములో కూడా అనుసరించమని ” బోధించినాడు.

ధర్మరాజు అర్థము లేని కార్యములు కాని, వేద విహితములు కాని కర్మలు కాని, ఛందోబద్ధములు కాని క్రియలు కాని ఏ మాత్రము చేయడు. సకల ధర్మములు ఎరిగినటువంటివాడు. అందుకనే ఆతనికి ధర్మజుడనే సార్థక నామము వచ్చినది. వెళ్లిన తక్షణమే పితామహుడైన భీష్మునికి నమస్కరించి, ఆశీర్వదించమని ప్రార్థించినాడు. “ పితామహా ! మా తండ్రి ఎప్పుడు గతించినాడో, ఆ విషయము మా కేమాత్రము తెలియదు. పసిబిడ్డలుగా తమను చేరినప్పుడు, మీరు తండ్రి స్థానము వహించి, అనేక విధములుగా పెంచి, మమ్మింత వారినిగా చేసినారు. కనుక, పవిత్రులైన తండ్రితో సమానులైన మీతో యుద్ధము చేయుటకు మా కేమాత్రము అధికారము లేదు. కాబట్టి మీతో యుద్ధము చేయడానికి మాకు తగిన అనుమతిని ఇవ్వ

వలసిందిగా ప్రార్థించుచున్నాను." ఇటువంటి కోరికను కోరిన ధర్మజునియొక్క ధర్మనిరతిని భీష్ముడు గుర్తించినవాడై, కంటి వెంట నీరు ధారగాకార, ఆనందముతో, "నాయనా, ధర్మజా! ఇటువంటి భయంకర పరిస్థితులలో కూడా నీవు ధర్మము నుల్లంఘించకుండా, దానిని అనుసరించి వస్తున్నావు. నాయనా, ధర్మో రక్షతి రక్షితః; నీ ధర్మమే నీకు విజయము చేకూర్చుతుంది," అని అతనిని ఆశీర్వదించి పంపినాడు.

తరువాత ధర్మజుడు గురువుగారైన ద్రోణాచార్యులను సమీపించి, "గురూత్తమా! మేము తమ శిష్యులము. శిష్యులమైన మేము తమతో యుద్ధము చేసే అధికారము మాకు లేదు. ఈ విధమైనటువంటి విపరీతమైన కాలాంతరము మాకు ప్రాప్తించినది. కనుక, మీతో మేము యుద్ధము చేయడానికి మీరు మాకు అనుజ్ఞను దయచేయవలసినది" అని ప్రార్థించి నమస్కరించినాడు. ఈ మాటలు విని ద్రోణాచార్యులు మనిషంతా కదలిపోయినాడు. అయ్యో! ఇటువంటి భీకర సమయములో కూడా ధర్మజుడు తన ధర్మమును ఏ మాత్రము ఉల్లంఘించక అనుసరించుకొని వస్తున్నాడే అని సంతసించి, ధర్మజుని కౌగలించుకొని, "నాయనా! నా పుత్రుడు అశ్వద్ధామ కేవలము కామపుత్రుడు. మీరందరు నాకు ప్రేమ పుత్రులు. కనుక మీకు మీ ధర్మమే విజయము చేకూర్చుతుంది" అని వారిని ఆశీర్వదించి పంపినాడు. సర్వ ధర్మములను ఎరిగిన ధర్మజుడు యీ విధముగా గురువులనూ, పితామహులనూ తగిన రీతిగా గౌరవించుటచేత, వారిని ప్రసన్న హృదయులుగా చేసుకొనుట చేత, పాండవులు విజయమును పొందగలిగినారు. లేకున్న, భీష్ముని జయించే వారున్నారా? ద్రోణాచార్యుని జయించేవారున్నారా? వారిని జయించే వారెవ్వరూ లేరు. కానీ, వీరి ధర్మమే అటువంటి మహా దిగ్విజయము సంపాదించే, ఎవ్వరూ జయించ లేనటువంటి మహావీరులను కూడా, ఒక్క ధర్మముతో పాండవులు వశము చేసికొన గలిగినారు.

తల్లిదండ్రుల పైన, దైవము పైన, కేవలము విరుద్ధమైన భావములను అనుసరించినవారు కౌరవులు; పాండవులు కాదు. వారి తల్లియైన గాంధారి ఎన్నో విధములుగా కుమారులకు బోధించినప్పటికి, కౌరవులు వినలేదు; అంధుడైన ధృతరాష్ట్రుడు ఎన్నో విధముల బోధించినప్పటికి వారు వినలేదు; గురువైన ద్రోణాచార్యులు బోధించినప్పటికి వినలేదు. సాక్షాత్ శ్రీ కృష్ణుడంతటివాడు, రాయబారము నెరపి, వారికి అనేక విధములుగా ఎంత చెప్పినప్పటికి, వినక, కట్ట కడపట శ్రీ కృష్ణునే బంధించి నిందించుటకు పూనుకొనినారు.

ఇటువంటి దుష్టులు, దుర్మార్గులు, ధూర్తులు అయిన కౌరవులయొక్క తత్వమును మనము నేడు అనుసరించుచున్నాముంటే, ఆ కౌరవుల కే విధమైన పరాభవము కలిగిందో, మనకు కూడా అదే పరాభవము తప్పదు.

పంచప్రాణ, పంచకోశ, పంచేంద్రియ స్వరూపమైన దివ్యత్వమును పంచపాండవులుగా విశ్వసించి, మన కర్తవ్యాన్ని, ధర్మాన్ని నిర్వహించటములో దోషరహితమైన మంత్రముగా దైవత్వమైన బ్రహ్మత్వముగా గుర్తించుకొని, తద్వారా మనయొక్క మానవత్వమును సార్థకము చేసికొనుట చాలా అవసరము

**—శ్రీవారి దివ్యోపన్యాసము నుండి.**

# సందేశము

దివ్యాత్మ స్వరూపులారా !

సత్యమును ప్రతిబింబించుటకు నిర్మలహృదయమే సర్వశ్రేష్ఠమైన దర్పణము. ఈ అనుశాసనములన్నీ హృదయమును పరిశుద్ధపరచి పవిత్రముగా ఉంచుటకొరకే. హృదయము పరిశుద్ధమైన వెంటనే ఒక్క క్షణములో అన్ని సత్యములు దానిలో ప్రకాశమానమౌతవి. నీవు పూర్తిగా నిర్మల మనస్కుడవైతే, యీ విశ్వమందలి సత్యములన్నీ నీ హృదయ ఫలకము మీద ప్రత్యక్షమౌతవి.

అందరూ మనయొక్క సహయాత్రీకులే, సహప్రయాణీకులే. మానవులు మాత్రమే మన బంధువులు కారు; సమస్త ప్రాణికోటి, వృక్షములు, జంతువులె కాక, మంచివారు, చెడ్డవారు, సాధు మృగములు, క్రూరమృగములు, ధార్మికులు, ధార్మికులు కానివారు, అందరు ఒకే గమ్యమునకు ప్రయాణము చేస్తున్నారు ; అందరూ ఒకే ప్రవాహములో యీదుచున్నారు. ప్రతి ఒక్కడు త్వరితగతిని మోక్షప్రాప్తి కొరకు పరుగులెత్తుచున్నాడు.

పరిస్థితులు కఠినమై, పరిసరములు ఆయాసపూరితములై ఉన్నప్పుడు వీటిలో నుండి బయటపడ గలిగినవాడే బలవంతుడు. అందుచేత ఈ బాహ్య విపత్తులను, ఆందోళనలను ఆహ్వానించండి.

30-3-74

ఆశీస్సులతో,
సత్యసాయిబాబా.

# శాన్ డీగో లేఖ

ఇంద్రాదేవి యొక్క ఉపన్యాసము కొరకు, ఆమె భారత దేశమునుండి తీసికొనివచ్చిన యీ యుగ అవతార పురుషునిపై తీసినట్టి చలనచిత్రాన్ని ప్రదర్శించుట కొరకు ఏర్పాటు చేయబడిన బహిరంగ సభలో, డా॥ శామ్యుల్ శాండ్‌వెయిస్, డా॥ ఎరల్ గెర్లిపిన్‌లు సాయిబాబాతో వారికి కలిగినట్టి అనుభవములను గురించి ముచ్చటించినారు.

ఆ సభలోనే డా॥ డిగ్రెపైడ్ సావర్ కూడా మాట్లాడినాడు. అతడిట్లా చెప్పినాడు: మేము బాబాను సందర్శించటానికి పుట్టపర్తికి వెళ్లి అక్కడ కొంతకాలము గడపటమే నిరంతరము గుర్తించుకొనవలసినట్టి ఒక మహదనుభవము. అందరము మందిరము ఎదుటనున్న ఇసుకలో అర్ధచంద్రాకారములో కూర్చొని స్వామి దర్శనము కొరకు వేచి ఉన్నాము. బాబా ఆగమన నిరీక్షణలో వాతావరణమంతా నిశ్శబ్దముతో, నిర్మలత్వముతో నిండి ఉన్నది. కొంత సేపటికి బాబా మందిరములో నుండి వెలుపలకు అడుగులు వేస్తూ, అక్కడ కూర్చొనిన భక్తుల మధ్యగా నెమ్మదిగా కదులుతూ, జారివచ్చునట్లుగా, భూమిమీద తేలుచున్నట్లుగా వచ్చినారు. వారినొక పవిత్రమైన దీప్తి వలయము ఆవరించినట్లు, మూర్తి అంతా ప్రేమమయమయినట్లుగా కనిపించినది. తన మృదువైన సూచనలతో, ఆ భక్త సందోహములో ఆ నాడు తాను ప్రత్యేకముగా మాట్లాడి ఆనంద పరచ దలచిన వారిని, పిలిచినారు.

ఆ విధముగా పిలచిన వారిలో నేను కూడా ఉన్నాను. కొన్ని నిమిషముల అంతరంగిక సంభాషణానంతరము —ఆ సంభాషణ వివరములు రహస్యములు—బాబా నన్ను దోసిలిపట్టమని చెప్పినారు. దానిలోనికి, నెమ్మదిగా, ఒకటి తరువాత ఒకటిగా, తెల్లని పచ్చని మాత్రలు జారవిడిచినారు. తరువాత అవి తెల్లని వెన్న పూసలని బాబా వివరించినారు.

నేను భారత దేశము వదలి పెట్టే ముందు, బొంబాయిలోని ధర్మక్షేత్రములోని ఒక అతిథులు కూర్చొనే గదిలోనికి బాబా నన్ను పిలిపించినారు. అప్పుడక్కడ బాబా ఒక్కరే ఉన్నారు. బాబా తన అరచేతులను చిన్న చక్రాకృతిలో త్రిప్పి, వాటిని పైకి త్రిప్పగా, వాటిలో ఒక విధమైన ద్రవము ఊరటము చూచినాను; 'తైలము' అన్నారు బాబా; అది దివ్యమైన సువాసన కలిగివున్నది. వారు తన రెండు చేతులు రుద్దుకొని, ఆ తైలము నా తలకు పూసినారు. కృతజ్ఞతతో నేను వారి పాదములు పట్టుకొన బోవ, నన్ను వారించినారు. వారి అనుగ్రహముతో అక్కడ జరిగినదంతా చెప్పడానికి కాని, వర్ణించటానికి కాని నాకున్న భాష చాలదు. సాయిబాబా ప్రకటించే దృగ్విషయములు విశ్వసించటము చాలామందికి చాలా కష్టమైన విషయము; దీనికి కారణము, వారందరు తమ బుద్ధి బలముతో యీ స్థూల ప్రపంచానికి బద్ధులై ఉండుటే. వీరికి ప్రతిదీ భౌతికమైన ప్రతిఘాతము యొక్క పరిణామముగా కనిపించుతుంది.

వారి మేధాశక్తి వారి అంతర దృష్టికి అడ్డు తగులు చున్నది ; దైవత్వము సత్యమనే విషయము పూర్తిగా విస్మరించబడినది. కాని దైవత్వము ప్రతి పదార్థము యొక్క ఆదిలోనే ఉన్నది. ఒక మహా ప్రేలుడు వలన, మానవునితో సహా సృష్టి అంతా యాదృచ్ఛికముగా జరిగినదనే సిద్ధాంతములో వారు విశ్వాసము కలిగి ఉన్నారు. కానీ, దైవత్వము పరమసత్యము ; అదే సృష్టి ఆదియందున్నది ; అది శాశ్వతమై, అన్ని కాలములందున్నట్టిది.

ఈ భౌతిక మయినదంతా దైవత్వము యొక్క సంగ్రహ స్వరూపమే. ఈ సత్యము మన కరగతము చేయడానికి సాయిబాబా మన మధ్య అవతరించినాడు. దైవశక్తిని సరియైన విధానములో వినియోగించుకొనగ్గలిగితే, నేడు కూడ నూతన సృష్టి సంభవమే ; భౌతికము కాని లోకములో మనము కూడా సృజనాశక్తిని అనుభవము చేసికొనగలము. దైవతత్వమును సాయిబాబా యీ భౌతికలోక స్థాయికి కొనివచ్చినారు. అందుచేత, అందరూ దైవత్వమును సాక్షాత్కరించు కొనగలుగుతున్నారు. వారు సంకల్పించినప్పుడు, శాస్త్రజ్ఞుడు కూడ దైవత్వము యొక్క వాస్తవమును అంగీకరించుతాడు ; అంగీకరించక తప్పదు

ఈ పాంచభౌతిక పిండము ఆ ప్రభువు ప్రేరణ లేక ఏమియూ చేయజాలదు.

దానికి భగవదనుగ్రహము తోడు కావలెను. అట్టి అనుగ్రహమును ప్రసాదించునట్టి ఇచ్ఛ పరమాత్మునకు కలుగవలెనన్న జపధ్యానాదులు ముఖ్యావసరము.

భగవంతుని అనుగ్రహాన్ని సంపాదించితే చాలు, ఏ గ్రహమూ ఏమీ పని చేయలేదు.

భగవంతుని అనుగ్రహము కలిగిన అన్ని గ్రహములు మీ వశమై పోతాయి,

భక్తుల భావదోషములు తప్ప భగవంతుని అనుగ్రహ లోప మేనాడూ లేదు.

- బాబా

# అఘోరేభ్యోథ ఘోరేభ్యః

"యాతే రుద్ర శివాతనూరఘోరాపాపనాశినీ !" వేదపురుషుడైన ప్రజాపతికి రెండు విధములైన స్వరూప స్వభావములు ఆకార విశేషములు ఉన్నవి. ఘోరమైన రూపమునకు రుద్రమనియూ అఘోరమైన దానికి శివం అనియూ పేర్లున్నవి. స్తంభమును భేదించుకొని నరసింహుడు బయలు దేరినపుడు ప్రహ్లాదుడు, ఆ సుందరాకారమును చూచి, ఆనందోన్మత్తుడైనాడు; దైవ విరోధి అయిన హిరణ్యకశిపునకి అది రుద్రాకారముగా కనపడి భయాందోళనములను కలుగజేసినది. అంటే ఏకత్వమైన దివ్యత్వములోనే రుద్రము, అరుద్రము, ఘోరము అఘోరము మానవుని మనస్తత్వము ననుసరించి, గోచరమగును అనేది స్పష్టమగుచున్నది.

ఇంతే కాదు; ఈ రెండు రూపములే సృష్టిస్థితి లయములకు ఆధారముగా పేర్కొనబడినవి. లోక కల్యాణ నిమిత్తమై ఆ పరమాత్ముడే శివముగానూ రుద్రముగానూ తన స్వరూప స్వభావములను నిరూపించుకొంటున్నాడు

ఘోరము, అఘోరము లోకమునందు సర్వ సామాన్యములు. భోగ్యవస్తువులను ఆరగించునపుడు, దాని వలన కలిగే తుష్టి పుష్టి సంతృప్తి ఆరోగ్యము, అఘోరము, శివము. అదే వస్తువులను మితము తప్పి భుజించిన, అవి ఘోరాకారమును ధరించి, మృత్యువునకు అతి సమీపముగానే తీసుకొని వెళ్ళును! అంటే, ఆనందమునకు అభ్యంతరము కలిగించే విషయములు అనుభూతులు సన్నివేశములు సంఘటనలు ఇవన్నీ ఘోరము; హద్దులను పాటించిన మితాహారము అఘోరానందము నందించును; అమితాహారము ఘోరత్వమనే రోగతత్వానికే దారి తీయును.

ఇట్టి పరిస్థితులకు అన్నము కాదు, కారణము! మానవుని భ్రాంతులే, వాని ఇచ్ఛాశక్తులే, వాని మనస్తత్వమే వీటికి పునాది. పదునుగల కత్తికి సమానము, మనస్సు. దానిని చేతిలో పట్టుకొని. పండ్లు కోసి తినవచ్చును, లేక, రౌద్రస్థితియందు ప్రాణమునకే హాని కలిగించవచ్చును. మంచివాని చేతిలో అది ఉపకారము చేసే ఉపకరణము! హంతకుని హస్తమందు ప్రాణహాని కలిగించు ఆయుధముగా మారును. మన యేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః. మనస్సు బంధము వైపు లాగితే, ఘోరము; మోక్షము వైపు లాగితే, అఘోరము.

సర్వాంతర్యామి సర్వభూతాంతరాత్మ తన మనస్సులోనూ ఉన్నాడు కాబట్టి, ఆయనకు ఘోర అఘోర అనే పేర్లు వచ్చుట సహజము. సుఖము కలిగినపుడు అఘోరము: దుఃఖము కలిగినపుడు ఘోరము! అయితే, సుఖదుఃఖములు ప్రత్యేకమైన స్థితులు కావు. ఒకదాని అభావమునకే మరొకదాని పేరు, అంతే. సుఖము యొక్క అభావమే దుఃఖము; దుఃఖముయొక్క అభావమే సుఖము! వీటిని ప్రత్యేకముగా యెన్నడు చూడలేము.

ఇంకొక విషయము : పరమాత్ముడు ఘోర స్వరూప స్వభావములను తీసుకొనేది కూడ, లోక కల్యాణము నిమిత్తమే ; సమర్థుడైన డాక్టర్ చేతిలోని కత్తి రోగ చికిత్సకు ఒక ఉపకరణమై ప్రాణదానము నందించినట్లు, లోక చికిత్సకై దేవుడు ఘోర రూపమును దాల్చి, కఠిన చర్యలను తీసుకొంటాడు. మహర్షులు తాపసులు తపోనిరతులుగా వుండగా వారికి అవాంతరములను కల్పించుటకు దేవుడు పూనుకొంటాడు. దీనికి కారణము, కృత్రిమ బుద్ధి కాదు ; యుక్తి కాదు; ఏదో సాధించాలనే సంకల్పమూ కాదు. వాండ్లకు ఉత్తమ స్థానమును, వాండ్లు ఆశించిన పట్టము నందించుకొరకే, యీ పరీక్షలు

విద్యార్థులైన మీకు బాగా తెలుసు. సంవత్సరాంతమందు యూనివర్సిటీవారు పరీక్షలను పెడుతున్నారు. అదేమి? మీ పైన వారికేదైనా ద్వేషమా ? మిమ్ములను ఉన్నత స్థానమునకు పంపే కొరకే కదా? అట్లే, తపస్సాచరించే యోగులను పరమాత్ముడు టెస్టు చేస్తారు. భగవంతుడు టెస్టు పెట్టిన, స్వామీ ! మేము నెగ్గలేము, అని విసుగుతో, నిరాశతో ప్రార్థించుతారు! పరీక్షలను మానుమని గోలచేయుదురు. పరీక్షలను మానితే, ఉన్నత స్థానమును పొందే వీలులేదు. నావలు, ప్లేన్లు వీటిని నడిపే వారలకు సర్టిఫికేట్లు ఇచ్చేముందు టెస్టులు వుండాలి. ఉత్తమ స్థాయినందు కొనే నిమిత్తము పరీక్షలు అత్యవసరము. అవి వుండకూడదంటే, ఉన్న స్థానమందే ఉండవలసి వచ్చును. అట్టి వారిలో పవిత్ర భావములు లేవనే అర్థము.

చరిత్రలో దీనికి ఆదర్శమైన కథ ఒకటి వున్నది. శిబి చక్రవర్తి పరమ త్యాగియై తపోవంతుడై సిరి సంపదలను చక్రాధిపత్యమును వివేక వైరాగ్య విచక్షణలతో అనుభవించి ఆనందించు సమయమున, ఆయన ఇంద్రియ నిగ్రహము మనో నిగ్రహము తాత్కాలికమా, లేక, దృఢమైనదా చూద్దామని ఇంద్రుడు ఒక ప్లాన్ వేసినాడు.

అగ్నిదేవుడు పావురముగానూ ఇంద్రుడు ఒక గద్దగానూ వేషమును ధరించిరి. ఆ గద్ద పావురమును తరుముకొంటూ వచ్చినట్లుగా శిబి చక్రవర్తికి కనిపించినది. పావురము పరుగెత్తి వచ్చి, నన్ను రక్షింపుము అంటూ, చక్రవర్తి చెంత వ్రాలినది. శరణాగతుని రక్షణ చేసే దీక్షను వహించిన శిబి, ఆ పావురమునకు ప్రాణభిక్ష నందించినాడు.

తక్షణమే ఆ గద్ద అతని దగ్గరకు వచ్చి, తీవ్రముగా వాగ్వాదము చేసినది. "నాకు ఆ పావురమే ఈ పూటకు ఆహారము. నా ఆకలి తీర్చుకున్న, నీ తపస్సు నీ సత్కీర్తి, నీ సిరిసంపదలు నీ పేరు ప్రతిష్టలు ఇవన్నిటికి ఏమి ప్రయోజనము ? నేను నీ ఇంటికి అతిథిగా వచ్చినాను ; నా అభీష్టమును నెరవేర్చుటే నీ ధర్మము," అని చెప్పినది.

"నేను ఆ పావురమున కభయమిచ్చాను, దానికి ప్రాణభిక్ష నందించినాను, నీ ఆహారము కొరకు నా దేహమునైనా ఇస్తాను కానీ, ఆ పావురమును నీయను. ఆ పావురమునకెంత బరువు గలదో అంత మాంసమును నీ కిపుడే నా కండలనుండి కోసి ఇస్తాను" అని శిబిచక్రవర్తి చెప్పినాడు. గద్ద చూస్తూవుండగనే, ఒక తక్కెడను తెచ్చి, పావురమును ఒక వైపు కూర్చొ పెట్టినాడు ; మరొక వైపు తన దేహమునుంచి కండలను ముక్కలు ముక్కలుగా కోసి తానే పెట్టినాడు. అయితే, ఆశ్చర్యమేమనగా, పావురము కూర్చొన్న సిబ్బె కొంచెము కూడ లేవలేదు ! ఇంక చేయునది లేక, సత్యవాక్య పరిపాలకుడైన శిబిచక్రవర్తి తానే ఆ సిబ్బెలో ఆసీనుడై, ఈ దేహమునే ఆరగించి నీ ఆకలిని తీర్చి తృప్తి పొందుమని వేడుకొనినాడు !

"న కర్మణా న ప్రజయా ధనేన, త్యాగేనైకే అమృతత్వ మానశుః." త్యాగమువలననే అమృతత్వము సిద్ధించును, కదా ?

అపుడు, అగ్నిదేవుడు, ఇంద్రుడు ఇద్దరూ స్వ స్వ రూపములను ధరించి, శిబి యెదుట ప్రత్యక్షమైరి. "నీ తపస్సు సార్థకము, నీ కీర్తి శాశ్వతమైనది" అని శిబిని అనుగ్రహించి, ఆయనకు పలురీతులు ప్రబోధించి స్వస్థానములను చేరిరి.

ఇట్టి టెస్టులు అనుగ్రహ నిమిత్తమే కాని ఆగ్రహ నిమిత్తము కాదు.

మహా భారతమందు కూడ ఇట్టి ధర్మస్వరూపము అనేక రీతులుగా విశదీకరించబడియున్నది. దాని వలననే మహా భారతమునకు పంచమ వేదమనే పవిత్రమైన పేరు కూడా వచ్చినది. పాండవులు అశ్వమేధ యాగము నాచరించునపుడు, యజ్ఞాశ్వమును మయూరధ్వజుడనే మహారాజు పట్టుకొనినందున, అతనిపై అర్జునుడు దండెత్తి వెళ్ళవలసి వచ్చినది. యుద్ధమందు అతనిని ఓడించి అశ్వమును సురక్షితముగా పొందటము రాజధర్మమే కాక, యజ్ఞముయొక్క ధర్మము కూడ. అయితే, మయూరధ్వజుడు కృష్ణ భక్తుడు, ధర్మపరుడు, సత్యశీలుడు. కాబట్టి ఆయనతో యుద్ధము చేసి విజయము సాధించుట కష్టతరమని కృష్ణుడు బోధించినాడు. ఆయన అన్ని కర్మలలోనూ శ్రద్ధా భక్తులను నింపును ; ఆశ్రమ నియమములను చక్కగా పాలించును ; ఉపాసనా మార్గమందు ఆయనకు దృఢ విశ్వాసమున్నది; జ్ఞానము గలవాడు; అసూయలేనివాడు; అని ఈ విధముగా కృష్ణుడు మయూరధ్వజుని గురించి వర్ణన చేయగా, అర్జునునకు ద్వేషాసూయలు బయలుదేరినవి.

ఇది గ్రహించిన కృష్ణుడు, ఆయనను సరిదిద్దుటకు గాను, మయూరధ్వజుని గొప్పతనమును ప్రపంచమంతట చాటుటకుగాను, కృష్ణుడు ఒక ప్లాన్ వేసినాడు. ఆయన అశ్వమును పట్టిన వుద్దేశమేమిటో తెలుసుకొంటాము అని చెబుతూ, ఇద్దరూ రాజ ఠీవిని వదలి, బ్రాహ్మణ వేషములు ధరించి, భోజన మారగించవలెనని రాజభవనములోనికి వెళ్ళిరి. రాజు వారిని స్వాగతించి ఆనందముగా ఆదరించినాడు. తానూ వారితో భోజనమునకు కూర్చొనినాడు. అయితే కృష్ణుడు ఆ సమయానికి సరిగా ఒక నాటకము ఆడినాడు

నా స్నేహితుడైన ఇతని కుమారుని మార్గ మధ్యమున ఒక బెబ్బులి పట్టుకొని సగము దేహమును మింగినది, మేమిద్దరము ఆ బాలుని జీవసహితముగా విడుదల చేయుమని ఎంత విలపించి ప్రార్థించిననూ బెబ్బులి వినలేదు. మయూరధ్వజుని ధర్మ దేహముయొక్క అర్థ భాగమును నాకు తెచ్చి పెట్టి ఆహారముగా మీరు అర్పించిన తక్షణమే ఆ బాలుని మీ కందించెదను అని వాగ్దానమిచ్చినది. మీరు దానికి సమ్మతించిన, ఇక్కడ ఇప్పుడు ఈ భోజనము నారగించెదము, అని ఇద్దరూ పలికిరి.

మయూరధ్వజుడు దానికి సంతోషముగా సమ్మతించినాడు. అర్జునుడు అతని త్యాగబుద్ధి చూచి ఆశ్చర్యములో మునిగినాడు. భోజనానంతరము, మహారాజు ఒక రంపమును తెప్పించి, వారిద్దరి సమక్షమున, తన భార్యను కుమారుని పిలచి, తన దేహమును కొయ్యమన్నాడు. కొంత సేపు గడచిన తరువాత, రాజు యొక్క వామనేత్రమునుంచి నీటిబిందువులు రాలుటను చూచి, కృష్ణుడు, "నీవు సంపూర్ణ సంతుష్టితో నిండు హృదయముతో, నీ దేహమును దానమిచ్చుట

లేదు; దీనిని స్వీకరించము" అని అన్నాడు. అపుడు రాజు, "రెండు నేత్రములలో, ఒకదాని నుంచి మాత్రమే కదా, అశ్రువులు పడటము? కుడి ప్రక్క మాత్రమే మంచి కార్యమునకు ప్రయోజనకరమైనదే? వామభాగమునకు ఆ భాగ్యము లేక పోయినదే? అని ఎడమ కంటినుంచి నీరు కారుచున్నది" అని సమాధానమిచ్చిరి. "చూచితివా అర్జునా!" అని కృష్ణుడు ఆక్షణమే ఆగమని ఆజ్ఞయిచ్చి, శంఖ చక్ర గదా పద్మధారియై సాక్షాత్ నారాయణ స్వరూప దర్శన భాగ్య మొసరించి, పరమాత్మని హృదయమునందు సదా నివసించుము, అని అనుగ్రహించినాడు.

భగవంతుని ఘోర స్వభావము నిజముగా ఘోరము కాదు. రసోవైసః — భగవంతుని అన్ని రూపములు అన్ని చర్యలు అన్ని లీలలు రస స్వరూపమే. భగవంతునియందు వికృతులు ప్రకృతులు వుంటే కదా, వాటిని గురించి భయపడేది? బ్రహ్మతత్త్వము శుద్ధమైన అద్దమువంటిది. అది నిర్గుణము, నిరాకారము. దాని ముందు నీవు నిలచిన ప్రతిబింబము గనుపించును. నీవు ఘోరమైతే, ప్రతిబింబము ఘోరమగును; అఘోరమైతే అఘోరమగును. దైవమందు దోషమును నిరూపించుటకు వీలులేదు. మీకు అనుగ్రహము లభించితే దైవము దగ్గరకు వచ్చినాడు, అని సంతసించేది, లభించకుండిన, దూరమయినాడు, అని దుఃఖించేది, అలవాటు. ఇది అర్థము లేని ఆర్తనాదము. భగవంతుడు వెంటనే వున్నాడు, దగ్గరకు రాలేదు, దూరముగా పోలేదు. ఆయనలో ఘోర రూపమూ లేదు, అఘోరరూపమూ లేదు.

శ్రీవారి దివ్యబోధ, 30–5–74.

అణుడవొ, మహావిభుండవొ
కనలేముగ నీ మహిమను కరుణామూర్తీ!
అనవరతము నీ నామము
మనమున జపియింతు, సాయి! పర్తిపురీశా!

చాలనట్టి భాష, చలియించు హృదయంబు,
లోకమంత తిరుగు లోచనములు,
కాంక్షలెన్నొ మదిని కలగించుచుండంగ
సయిపుమయ్య తండ్రి! సత్యసాయి!

ధర్మమూర్తివీవు; దయజూపు మా మీద
మర్మమెరిగినట్టి మహితవర్య!
భక్తజనుల పాలి భవబంధముల ద్రుంచి
సర్వజనుల బ్రోచు సాయిరామ!

# కవి

మంత్రబ్రాహ్మములను తెలిసికొని, సమచిత్తమును కలిగిన ఋషులు మాత్రమే కవులుగా పూర్వము ప్రసిద్ధి పొందినారు. ఋషులైన వారిని కవులను చెప్పుట సార్థకము కాని కవులుగా ఉండేవారిని ఋషులని చెప్పుటము కేవలము అవివేకముగా ఉంటుంది. పూర్వము ఋషులు కావటము చేత, వారు నిర్మల నిశ్చల నిస్వార్థ పర తత్వమును పొందినవారు కావటము చేత, వారి వాక్యములు క్రాంతిదర్శనము చెందినట్టివి. భూత వర్తమాన భవిష్యత్తులను చూడగలిగినవారే క్రాంతిదర్శకులు అని సార్థకనామము. అనగా త్రికాల, త్రిలోక, త్రిగుణములలో వారు ఏకత్వమును అనుభవించినటువంటివారు.

ఇక్కడ త్రికాల జ్ఞానము, త్రిలోక చింతనము, త్రిమూర్తి భావమును ఋషిత్వమునకు సార్థక నామముగా గుర్తించుకొనవలెను, ఇటువంటి పవిత్రమైన హృదయములు కలిగి ఉన్నట్టి ఋషులు వ్రాయగలిగియుండుట చేతనే, ఇతిహాస, పురాణ, శాస్త్రములు లోక ప్రసిద్ధిని అందుకొనినవి.

వాల్మీకి, వ్యాసుడు మొదలైన మహనీయులు ప్రారంభములో ఋషులుగా ప్రసిద్ధులై ఆ ఋషిత్వమును పూర్తిగా అనుభవించి. ఆ తరువాతనే వారు కవులై తమ కవితను వ్రాయుటకు ప్రారంభించినారు. అయితే వారు కవులెందుకు కావాలి ? దైవతత్త్వమును అనుభవించి నటువంటివారు కవిత్వమెందుకు చెప్పాలి? అని మనము ప్రశ్నించ వచ్చును. లోక కళ్యాణ నిమిత్తమై, అగమ్యగోచరమైన దైవ తత్త్వమును, అతీతమైన దివ్యత్వమును గురించి లోకములో చాటటానికి పూనకొని, వాక్స్థానములోని సరస్వతిని ఆధారము చేసికొని, లోకము నుద్ధరించుటకుగాను యీ విధమైన ఆదర్శమునందించినారు. పూర్వ ఋషులు, పరమాత్మయొక్క ఆనందమును పరబ్రహ్మ తత్వమును తమకు తాము అనుభవించటములో తృప్తి పడడమే కాకుండా, తాము అనుభవించునట్టి ఆ ఆనందమును లోకమున కందించవలెనని ఉత్సాహము కలిగి యున్నవారగుటచేత, భగవంతుని కరుణకు అర్హులై, ఇటువంటి కావ్య, పురాణ శాస్త్రములను మానవలోకానికి అందజేసినారు.

దీనిని పురస్కరించుకొనియే, 'స్వయం తీర్ణః పరం తారయతి' అని కూడా ప్రబోధించుతూ వచ్చినారు.

శ్రీ వాణి దివ్యబోధ.

# బంగారు బాబా

ముంగిటి చందమామ, కనుముంగిలి నందనసీమ, పున్నెముల్
పొంగిన పాలవెల్లి, విరబూచిన కమ్మని కల్పవల్లి, ముం
గొంగు పసిండి, రూపుగయికొన్న జగమ్ముల భాగ్యరాశి, శ్రీ
"బంగరు సత్యసాయి" మన పాలగలందు విచారమేటికిన్ ?

మంగళకైశికీ మధుర మంజులగీతిక, సర్వమంగళా
మంగళదేవతా భువనమంగళ మంగళసూత్ర సుప్రభా
రంగదపాంగవీక్షణ తరంగిత కాంతినికేతనంబు, శ్రీ
"బంగరు సత్యసాయి" మన పాలగలందు విచారమేటికిన్ ?

అంధుల కక్షులిచ్చి, విషయాంధుల మైకము దింపి, ద్వేషరో
షాంధుల చక్కదిద్దెడు, మహామహిమాత్ముడు, కాంతిభద్రతల్
సంధిలు సత్యసంధుడు, లసత్కరుణామృతసింధు, డీ జగ
ద్బంధుడు "సత్యసాయి" మన పాలగలందు విచారమేటికిన్ ?

ఏమి తపంబు చేసి పరమేశ్వరు నేమిటి పూజ చేసిరో !
రాముని తల్లియున్, పరశురాముని తల్లియు, భీము తల్లియున్,
కాముని కన్నతల్లియును, కంజదళాక్షు ననుంగు తల్లియున్,
స్వామిని "పుట్టపర్తి భగవానుని" గన్నవరాల తల్లియున్ !!

చల్లనివాడు, వేడిమిని చల్లనివాడు, దయామృతంబు పై
జల్లెడువాడు, మౌళి పరిసర్పి జటామకుటంబువాడు, మా
పల్లెకు వచ్చి మా హృదయపద్మములన్ గొనితెచ్చినాడు ; నే
డల్లన పుట్టపర్తిపురమా ! పరమాత్ముని జాడ తెల్పవే !

కన్నులు లేని భిక్షుకుని కంఠములో, బడిగంటలోన, ఆ
పన్నుల చూపులో, గుడులపై విహరించెడి పావురాలలో,

చిన్ని కుమారు చిర్న గవ్వుచిందెడి చెక్కులలో, తమస్సులో,
వెన్నెలలో, కృపీవలుల వెన్నులలో, నిను గాంచెదన్ ప్రభూ !!

ధరణీ గర్భమునందు తల్లడిలు మృద్ఖండమ్ములన్, కొల్మిలో
కరగంబెట్టి, పదారువన్నియల బంగారమ్ముగా మార్చి, ఆ
భరణశ్రీ సమకూర్చి, చేర్చికొను శిల్పస్వామి! "స్వారాట్ విరాట్
కరుణశ్రీ " చరణారవిందములకున్ గైమోడ్పు గావించెదన్ !!

స్మరియించినం జాలు " సత్య స్వరూప " మై
కోరిన కోర్కె చేకూర్చు స్వామి
దరిసించినంజాలు " ధర్మస్వరూప "మై
కష్టమ్ములెల్ల పోకార్చుస్వామి
చెంతచేరిన చాలు " శాంతిస్వరూప "మై
బ్రతుకు బాటలు తేటపరచు స్వామి
పిలిచినచో చాలు " ప్రేమ స్వరూప "మై
సిరి సంపదలు కటాక్షించు స్వామి

అఖిల మానసాంతర్యామియైన స్వామి
జాలిగుండెల స్వామి, వరాల స్వామి
లంచ మెరుగని స్వామి, ప్రపంచ చక్ర
వర్తి మన స్వామి ! శ్రీ పుట్టపర్తి స్వామి !

కరుణ శ్రీ.

# పట్టప్రదానము

బృందావనములో మే నెల 20 వ తేది నుండి భగవాన్ బాబావారి అధ్వర్యమున, వారి దివ్య సన్నిధిలో, భారతీయ సంస్కృతి, పరమార్థ తత్వములను ప్రబోధించుటకు నిర్వహించబడిన సమ్మర్ కోర్సు జూన్ 20 వ తేది తో పరిసమాప్తి అయినది. అన్ని రాష్ట్రములనుండి, వచ్చిన 500 మంది విద్యార్థులు, వారి వెంట వచ్చిన 40 మంది ఉపాధ్యాయులు, ఫిజీ అమెరికాలనుండి వచ్చిన కొద్ది మంది విద్యార్థులు భగవాన్‌యొక్క ఆశీస్సులు పొందు భాగ్యము కలిగిన వారైనారు. వీరందరికి బాబా యోగ్యతా పత్రములు పంచి పెట్టించినారు. విద్యార్థులందరికి నిర్మలత్వమునకు, పరిశుద్ధతకు, సూచకముగా ధవళాంబరములు బహూకరించినారు. విద్యార్థినులందరికి కుంకుమ రంగు చుక్కలు గల తెల్లని చీరెలు బహూకరించినారు.

ఈ విద్యార్థులు విద్యార్థినులు బారులు తీర్చి బృందావనములోని స్వామి నివాసము నుండి పట్టప్రదాన మైదానము వరకు ఊరేగింపుగా రావడము ఎంతో ఆహ్లాదకరముగా, కన్నులపండువుగా ఉన్నది. వేలాది ప్రజలు, స్త్రీలు పురుషులు బాలబాలికలు వీనులకింపుగా, కన్నుల పండువుగా భావించినారు. మార్గమంతా రంగురంగులపుష్పములతో రంగవల్లులు తీర్చినారు. ఇరువైపుల పచ్చని తోరణములు కట్టినారు. బాబాను, ఈ మాసము దినములు విద్యార్థులకు తమ అమూల్యోపదేశముల నందించిన పెద్దలు, వెంబడించి నడచినారు. వీరిలో జనరల్ కరియప్ప, డా॥ వి. కె. గోకాక్, డా ॥ యస్. భగవంతం, ప్రో॥ యస్. కె. ఛటర్జి, శ్రీ జి. పి, రాజరత్నం, కరుణశ్రీ, డా॥ దివాకర్ల వెంకటావధాని, శ్రీ నకులసెన్ మొదలగు పెద్దలున్నారు.

భగవాన్ యీ వేసవి తరగతుల విడిది నొక యజ్ఞముతో పోల్చినారు; అందిప్రబోధకులందరు ఋత్విక్కులైనారు. ఇందు పాల్గొనిన విద్యార్థులలో అంతర్గతముగా ఉన్న దైవత్వమును శోధించుటయే యీ తరగతుల ముఖ్యాశయము. యజ్ఞము పరిసమాప్తి - అనగా పూర్ణాహుతి అయిన దినమున, అవభృథస్నాన మాచరించవలసి ఉన్నదని వేదములు చెప్పిన దానికి తార్కాణముగా, ఊరేగింపుగా స్వామి బయలుదేరిన సమయమున, వరుణదేవుడు ఋత్విక్కులనందరిని తన వర్షములో స్నానమాడించినాడు ఈ సభాప్రాంగణమంతా భజనతో మారుమ్రోగినది. హాయిగొల్పు నాదస్వరము దిక్కులలో విరళమైనది.

ఈ వేసవి తరగతుల నిర్వహణాధికారియైన డా॥ వి. కె గోకాక్. తన నివేదికను సమర్పించినారు. ఈ సంవత్సరనిర్వహణలో మూడు నూతనమైన ముఖ్య విశేషములున్నవని చెప్పినారు [1] రాజమండ్రి సమావేశములో నిర్ణయించినట్లుగా, ప్రతిరాష్ట్రము దీనికి అనుబంధముగా వేసవితరగతులు 15 దినములు నిర్వహించ నిశ్చయించినది. బొంబాయిరాష్ట్రము వారప్పుడే నిర్వహించినారు; రాజస్థాన్ సమితివారు

భారతపూర్వలో అధ్యతన కాలములో నిర్వహించ మన్నారు. [2] ఈ సంవత్సరము కొందరు విద్యార్థులు, ఉపాధ్యాయులు అమెరికానుండి, ఇతరదేశముల నుండి యీ తరగతులలో చేరడానికి వచ్చినారు. [3] యోగాభ్యాసముతో పాటు, యీ సంవత్సరము విద్యార్థులు వేదపఠనములో కూడా పాల్గొనే అవకాశము కలిగించబడినది. షుమారు 60 మంది స్త్రీ పురుష విద్యార్థులు పురుషసూక్తము మొదలగునవి నేర్చుకొని నారు.

డా॥ గోకాక్ ఏడుగురు విద్యార్థులు, ఏడుగురు విద్యార్థినిల చేత పురుషసూక్తమును పఠింపచేసినారు. చక్కని, నిర్దుష్టవాచికముతో వీరు పఠించి సభా ప్రారంభము గావించినారు.

ప్రతి ఆదివారము జరిగిన వక్తృత్వ పోటీలలో పాల్గొని విజయము పొందిన ఐదుగురు విద్యార్థులకు శిబిరమునందు తమకు కలిగిన అనుభవములను గురించి ముచ్చటించే అవకాశము కల్పించినారు. పాట్నా కళాశాల విద్యార్థి, అంధుడు అయిన, అశ్వినీకుమార్ అష్రఫ్ తనకు కలిగిన అనుభవాలను హృదయమునకు హత్తుకొనునట్లు చెప్పినాడు ! "శారీరకముగా లోప మున్నప్పటికి, బాబా అనుగ్రహమే 1500 మైళ్ల దూరమునుండి నన్నిక్కడకు గొనివచ్చినది. ఎంతో పవిత్రమైన హృదయముతో నేను తిరిగి వెళ్లుతున్నాను. ఇక్కడ ఉపన్యసించిన పెద్దలు మన సంస్కృతిలోని మహత్వర విషయములు విశదపరచినారు. నేను బి.ఎ. మూడవ తరగతి వేదాంతశాస్త్ర విద్యార్థినే కానీ, వేదాంతమును గురించి నాకేమీ తెలియదు. ఈ మాస ములో నేను నేర్చుకొనినది పది సంవత్సరములు తీక్ష ముగా కృషిచేసినా వీలుకానట్టిది. భోజన సమయ ములందు బాబా నా దగరకు వచ్చినప్పుడు నా హృద యము పరమానందముతో నిండి నేను భూమిమీద నుండి పైకి లేచినట్లుగా భావించినాను. భగవాన్ యొక్క తదుపరి అవతారము ప్రేమసాయి అవతారమని వి న్నాను. కానీ, ఈ సాయి సత్యసాయియే కాక, ప్రేమ సాయి కూడా. నేను వారి సన్నిధిని విడచి వెళ్లుతు న్నానని విశ్వసించ లేకున్నాను. నా హృదయమును బాబా పాదపద్మముల వద్ద వదలి రేపు నా యీ శరీర మును మాత్రము పాట్నా తీసుకొని వెళ్లుచున్నాను."

వంగరాష్ట్ర విద్యార్థిని సుజాతరే యీ విధంగా చెప్పినది : ఇక్కడ పాల్గొనిన వారందరిలో ఒక విధ మైన క్రమశిక్షణ భక్తి ప్రపత్తులు, సాంఘిక సేవ చేయవలెననే కోరిక, అయత్నముగా ఉప్పొంగినవి. బృందావనములోని సత్యసాయి కళాశాల విద్యార్థి శ్రీ రాజన్‌పటేల్, "మేమందరము బాబాను విడిచిపోవు చున్నామని దుఃఖించు చున్నందున, సానుభూతిగా మా కన్నీటిని కడుగుటకో అనునట్లు దేవతలు వర్షమును పంపినారు" అని చెప్పినాడు. వంగరాష్ట్ర విద్యార్థిని కుమారి జయశ్రీ సరైయా, తాను బృందావనమునకు వచ్చినప్పుడు స్వరాష్ట్రములో నేర్చుకొనిన విద్యలో ఎన్నో లోపములున్నవని, అవే అనేక రంగములలో నిరాశానిస్పృహలకు కారణమని, తనకు తెలుసునని చెప్పినది. కానీ ఈ నెల దినములు నేర్చుకొనిన విషయములు ఆత్మ విశ్వాసమును నెలకొల్పినవని, యిక్కడి ప్రేమ పూర్ణ వాతావరణము, ఆశయములు తనకు ధైర్యమును, బలమును చేకూర్చినవని చెప్పి నది. శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థి శ్రీ శ్రీనివాస్, తన కొద్ది మాటలలో పాల్గొనిన అందరి భావములు ప్రకటించ కలిగినాడు. "మేమొక మాసము దిన ముల క్రితము, కర్మాగారములో రిపేరు కొరకు చెడి పోయిన వాహనములుగా వచ్చినాము. నేడు మా యీ వాహనములన్నీ చక్కగా బాగుపడి ప్రయాణానికి

సిద్ధముగా ఉన్నవి.'' ఈ తరగతులను మరి కొంత కాలము పొడిగించినట్లయిన, ఆధ్యాత్మికముగా పరిప్లుతమైన బృందావన వాతావరణములో, అత్యంత మనోహరమైన బాబా దివ్య సన్నిధిలో మరి కొంత కాలము ఉండగలిగే వారమని "బాధతో" చెప్పినాడు. "భగవంతుడు ద్వారము మూసినప్పుడు, గవాక్షము తెరచి ఉంచుతాడు, బాబా మా అందరిని ఆశీర్వదించి, సదా మా వెంట ఉంటానని చెప్పినారు'' అని ముగించినాడు

అమెరికా నుండి వచ్చిన ప్రో॥ హేమంత కులకర్ణి తాను వ్రాసిన పద్యము నొకదానిని స్వామికి అంకితమొనరించి సమర్పించినాడు. తరువాత, 18వ తేది జరిపిన పరీక్షలలో మొదటి ఐదుగురుగా ఉత్తీర్ణులైన విద్యార్థుల పేర్లు డా॥ గోకాక్ ప్రకటించినారు. మొదటి రెండు స్థానములు, శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థులైన అభిజిత్ రే, జలానీలకు లభించినవి; మూడవ స్థానము మహారాష్ట్రము నుండి వచ్చిన కుమారి సీతా భాస్కర్‌కు, నాల్గవ స్థానము కేరళ నుండి వచ్చిన శ్రీ టి. కె. నిత్యకు, ఐదవ స్థానము వంగరాష్ట్రమునుండి వచ్చిన శ్రీ డి. ముఖర్జీకి లభించినవి. వారందరు వేదికమీదికి రాగా బాబా వారికి చాలా అందమైన కానుకలను అందించినారు.

ఈ పట్టప్రధాన సభలో, ఒక క్రొత్త పద్ధతిని ప్రవేశ పెట్టినారు. విద్యార్థులందరి చేత ఒక ప్రమాణమును చేయించినారు. కృతజ్ఞతా పూర్వకముగా కన్నీరు కారుచుండగా, దానినందరు చాలా సంతోషముతో ప్రమాణం చేసినారు డిల్లీ కళాశాల ప్రిన్సిపల్ భట్నాగర్ ప్రమాణము చదువుచుండగా, విద్యార్థులందరు నిలబడి దానిని వాక్యము వాక్యముగా, తిరిగి పలికినారు. ఆ ప్రమాణ మీ విధముగా ఉన్నది.'' భగవాన్ శ్రీ సత్యసాయిబాబా సముఖములో, నేను సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసలకు విధేయుడనై ఉంటాను; నా నిత్యజీవితములో మనసా, వాచా, కర్మణా. యీ దివ్య శక్తులను ఆచరణలో పెట్టుతాను; ఆధ్యాత్మికముగా పరిణతి చెందిన ఈ మానవాళియొక్క, ధార్మిక సేవకు, వివిధరీతుల వృద్ధిపొందిన చైతన్యమునకు, నా జీవితము నంకితము గావించెదను; భగవాన్ బాబాయొక్క పాదపద్మములకు నాహృదయపూర్వక ప్రణామములు. ఓం సహనావవతు, సహనౌ భునక్తు, సహవీర్యం కరవావహై. తేజస్వినావధీతమస్తు; మా విద్విషావహై. ఓం శాంతిః శాంతిః శాంతిః''

బాబా, తన దివ్యసందేశములో, ఇప్పుడు బాగు చేయబడి ఏ లోపము లేకుండా క్రొత్తవిగా చేయబడిన వాహనములు, ప్రక్కదారులవెంట పరుగెత్తి దెబ్బ తినకుండా, సత్య ధర్మ శాంతి ప్రేమ అహింస అనే రాజమార్గములనే అతి జాగ్రత్తగా అనుసరించాలని, హెచ్చరించినారు. అనేక కష్టములకు వాహనము నడుపు సారథే కారణమని, అందరూ హర్షము ప్రకటించుచుండగా, తానే ఈ ప్రతి వాహనమునకు సారధిగా ఉంటానని చెప్పినారు. ఈ మాసము దినములలో వారు తెలిసికొనిన పవిత్ర విషయములన్నీ మనస్సునందు శాశ్వతముగా నిలుపుకొనవలెను. వాటిలో కొన్నింటినైనా ఆచరణలో పెట్టుటకు నిశ్చయించుకొనవలెనని, తాను 15 దినములు ప్రబోధించిన భారతదేశ ఔనత్యమును పునరుద్ధరించి పుష్టికలిగించవలెనని తెలిపినారు. 15 దినములు తాను "బ్రహ్మం" ను గురించి చెప్పిన విషయములన్నిటిని విద్యార్థులు తమ హృదయములలో జాగ్రత్తపరచుకుంటారని, ఆ బ్రహ్మమును అభివ్యక్తము గావించుకొని, అందువలన లభించిన పరమానందము ననుభవించగలరని, చెప్పి

నారు. తాను సదా వారియొక్క అంతర్గతచైతన్యముగా, మార్గదర్శిగా, ఉపదేశకునిగా ఉంటానని చెప్పి విద్యార్థులందరిని ఆశీర్వదించినారు.

చివరకు బాబా ఇంగ్లీషులో భజనగావించి అందరిని ఆశ్చర్యచకితులనుగా వించినారు. అక్కడ చేరిన వారందరూ తన్మయత్వముతో తిరిగి ఆ పాట పాడినారు. మరి కొన్ని భజనపాటలు బాబా పాడిన తరువాత, జనరల్ కరియప్ప భగవాన్‌యొక్క అనుమతితో, "సాయిరాం ధర్మమునకు జై, భారత్‌కు జై" అని అందరిచేత జయధ్వానములు గావింపించినారు.

# నేనెవ్వరు?

ఎందరో మహాఋషులు పరిశీలించి, ప్రయత్నించి, అంతఃప్రకాశములో భగవంతుని కనుగొన గలిగినారు; బాహ్యదృష్టికి నిరాకారుడైన పరమాత్మను శారీరకముగా వారు చూడగలిగినారు; చర్మమునకు శర్మమునకు గల వ్యత్యాసమును గుర్తించ గలిగినారు. శర్మమునకు ఆనందమని అర్థము. చర్మమనగా ఏమిటో మనకందరికి తెలుసు. చర్మ స్వరూపము, అనగా సాకార రూపము ఏదో కాలమును వ్యర్థము చేయుటకై రాలేదు; శర్మ స్వభావమును గుర్తించుటకు గాను ఎవరు చర్మరూపమును ఉపయోగించుకుంటాడో, అతడే మనుష్యుడని పిలువబడుతాడు. దీనిని తెలిసికొనినంత మాత్రమున, ఇది చిక్కదు, దక్కదు; ఆచరించి చూచినప్పుడే కొంత అందుతుంది. మట్టిలో వెతకినప్పుడే మాణిక్యము దొరుకుతుంది గాని, గాలిలో వెతకితే దొరకదు. మట్టిమయమైన యీ శరీరములో మాణిక్యము రూపమైన ఆత్మను తెలిసికొని సుఖించవచ్చును; ఇందుకొరకు తగిన ప్రయత్నములు చేయడమే మానవుని కర్తవ్యము.

అనేక వజ్రములను బంగారు పాత్రకు పొదిగి, దానిలో పనికిరాని పదార్థములు వండుకొనడానికి వాడుతున్నాము సారవంతమైన భూమిలో, బంగారు నాగలితో దున్ని, జిల్లేడు మొక్కలు నాటేవాడుంటాడా? తన యింటిలో మధురమైన పాయసము వండగా, యింటింట బిచ్చమెత్తు మూర్ఖుడుంటాడా? అదే విధముగా హృదయ స్థానములో సుఖము లభ్యమౌతుండగా, ఎక్కడెక్కడో తిరిగి వ్యర్థ ప్రయత్నము లెందుకు చేయాలి? ఏ సర్వజ్ఞుని, సర్వ వ్యాపకుని, సర్వేశ్వరుని మనము పరమేశ్వరునిగా భావించుచున్నామో, అతనిని మన హృదయస్థానములో వెతకకుండా అన్య ప్రదేశములలో వెతకుటకన్న అజ్ఞానము వేరేమున్నది.

పరమాత్మ ఇటువంటివాడు, అటువంటివాడు, అని పెద్దలు చెప్పిన విషయములన్ని వారి భ్రమలే కాని, సరిగా వర్ణించ కలిగినవారు లోకములో చాలా అరుదు. అంతటా, అన్నిటా తానై ఉన్న శక్తిని గురించి యిది అవును, యిది కాదు అని ఎవరు చెప్పగలరు? సర్వము భగవన్మయము, సర్వత్రా ఉన్నాడు, సర్వాంతర్యామి అని చెప్పుచూ, ఎక్కడో ఒక చోట ఉన్నాడని భావించటము వట్టి వెర్రితనము. వారందరు వారి యిష్టాయిష్టములను, భావములను పురస్కరించుకొని భగవంతుని గుణగణములు వర్ణించినారు.

భౌతికముగా, లోకములో, వ్యక్తమయ్యే వస్తువులను గుర్తించ కలిగినారే కాని, లోనికి చూడకలిగిన వారు లేరు. దైవ విషయమునందు మంచి కాని, చెడ్డకాని. మార్పు కాని, కూర్పు కాని, వాస్తవము కాదు; ఇవి భావములు మాత్రమే. గుణములకు లోనైన వ్యక్తి, గుణాతీతములైన వాటిని ఏ విధముగా గ్రహించగలడు? ఏ విధముగా వర్ణించగలడు? ఎవ్వరైనా ఏదైనా మాట్లాడిన, అవి వారి వారి భావములను బట్టి, ఊహలను బట్టి పలికిన మాటలై ఉంటవి.

విశాలమై అనంతమై అగాధమైన సముద్రములో, నీవు ముంచిన పాత్రను బట్టి నీరు లభించుతుంది. ప్రపంచమునందున్న మతములు కొన్ని హద్దులు నిశ్చయించుకొని, అవే విశాలమని భ్రమించుచున్నవి. ఈ కల్పించుకొనిన మతముల యొక్క భ్రమలు, పరిమితికి అతీతమైన తత్వమును కనుగొనుటకు అడ్డు తగులుచున్నవి. ఒకరు విష్ణువు గొప్ప అనగా, మరొకరు శివుడు గొప్ప అంటున్నారు. మరొకరు మరో రూపమును గొప్పగా భావించు చున్నారు. వీరందరొక్కటె అనే సత్యమును మరచిపోతున్నారు. వీరి వర్ణన అంతా గ్రుడ్డివారు ఏనుగు రూపమును వర్ణించినట్లుగా ఉన్నది. గ్రుడ్డివాడు ఒక్కొక అంగమును తాకి దానిని వర్ణించి అదే ఏనుగుయొక్క సమగ్ర రూపమని ప్రకటించినారు. విశ్వమతములోని ఒక్కొక్క భాగమును పురస్కరించుకొని, మత మీవిధముగా ఉంటుంది, ఆ విధముగా ఉంటుంది అని భావించుట గ్రుడ్డితనము. సర్వమత సమ్మిళితమైన స్వరూపమే విశ్వమతము. ఈ అంగములన్నిటిలో, ఒకే తత్వమునన రక్తము—ఒకే ప్రేమ, ప్రవహించుచున్న మాట పరమసత్యము. There is only one religion and that is the religion of love: ఒకే మతమున్నది; అది ప్రేమ మతము. ఇటువంటి అంతర్యామిని గుర్తించక, ఆచార కర్మలు, నియమ నిష్ఠలు గుర్తించుకొని, కక్షలకు తగాదాలకు దిగుచున్నారు.

బాహ్యదృష్టితో చేసే నిర్ణయములు వాస్తవములు కావు. అదే విధముగా, సాయి తత్వమును బాహ్య దృష్టితో చూచి, సాయి ఇట్టివాడు, అట్టివాడు అని అంటున్నారు. వీరు సాయిలోని పవిత్రతను, యథార్థమును, నిత్య సత్యమును ఏ మాత్రమును గుర్తించ లేకున్నారు. సాయిశక్తి అపారము, అనంతము; సర్వశక్తులు సాయి హస్తగతములు ఉన్నవి. విద్యావంతులైన వారు, పండితులు, కొందరు బాహ్యదృష్టి కలిగినవారై ఉన్నందున, వారు కేవలము పైకి కనిపించే యీ మహిమలు మాత్రమే చూచి, ఏదో వారి భావమునకు తోచినట్లుగా పలుకుచున్నారు కాని లోపలి సత్యమును చూడలేకున్నారు. మేమే విద్యావంతుల మనే గర్వము, అంతా తమకే తెలుసు ననే అహంభావము వారి బుర్రలలో నిండి ఉండగా, వారు బృందావనములోని సాయిని గుర్తించలేకున్నారు; సాయి తత్వమును తెలిసికొన లేక పోతున్నారు.

ఇటువంటివారు గ్రంథములతో పరిచయమున్నవారే కాని, పండితులని చెప్పబడరు. దైవత్వమును గుర్తించుట ఎవ్వరికీ సాధ్యము కాదు. నాటినుంటి నేటివరకు దైవత్వము తమ చెంతనే ఉన్నప్పటికి దైవము అతి సన్నిహితముగా దగ్గరకు వచ్చినా, అవతారముయొక్క సమకాలికులుగా ఉన్నప్పటికీ, దైవమును గుర్తించుకొనలేక పోవటము చాలా దురదృష్టకరమైన విషయము.

నా శక్తులకు హద్దులు లేవు: నా తత్వమునకే మాత్రము నియమము లేదు. అనంత శక్తి, అనంత

త్వము, అనంత వ్యక్తిత్వము నా చేతులందున్నది. దీనిని గురించి నాకు నేనుగా చెప్పవలసిన అవసరము వచ్చినది కనుక చెప్పుచున్నాను. ఏమీ తెలియని వారికి ఏమి చెప్పినా అర్థముకాదు. తెలిసినవారికి తిరిగి చెప్ప నవసరము లేదు. తెలిసీ తెలియని వారికి నా మహిమలనే విజిటింగ్ కార్డు నివ్వక తప్పదు.

ఈ విధముగా కృష్ణావతారము ఒక్కటే దైవత్వము నింత స్పష్టముగా ప్రకటించ కలిగినది. కానీ, ఆ అవతారమున కొక్కొక్క పర్యాయము అపజయ మనేది కలిగినట్లుగా మనకు తెలుసు. అది లోకమునకు చూపించుట కాడిన నాటకమే కాని వేరుకాదు. అనేక మంది రాజులు వచ్చి కృష్ణుని సమీపించి కురు పాండవ యుద్ధమును నివారించమని అభ్యర్థించగా, తన ప్రయత్నములన్నీ విఫలమైనవని కృష్ణుడు వారితో చెప్పినాడు. దీనిని బట్టి కృష్ణునికి యుద్ధము నివారించే శక్తిలేదని అర్థము చేసికొనకూడదు. దుష్ట శిక్షణకొరకాడిన నాటకమది. రాయబారమునకు వెళ్ల టము, కౌరవులు తన మాట కాదనటము, అంతా ఒక ప్రణాళిక ప్రకారము జరిగినట్టిదే.

దేశకాల పాత్రలననుసరించి దైవమునకు ఇటువంటి నాటకములప్పుడప్పు డాడవలసి వస్తుంది. కాని, యీ సాయి అవతారములో యిటువంటి నాటకములకు స్థానమే లేదు; పరాజయముల కసలే స్థానములేదు. నేను సంక ల్పించిన అది తప్పక జరిగితీరుతుంది. కాని సంకల్పిం చటము నాకనవసరము. ఈ సంకల్పమనేది భక్తుని యొక్క శ్రద్ధపైన, అభీష్టము పైన ఆధారపడి ఉంటుంది.

ఒక విధముగా నేను భక్త పరాధీనుడను. సామాన్య మాన వుని రూపములో మీతో కలసి మెలసి సంచరించుతూ ఆడుతూ పాడుతూ ఉన్నప్పటికి, మేధావంతులు, శక్తి వంతులు కూడా నా శక్తిని నా స్వభావమును అర్థము చేసికొనలేరు. మానవత్వమును ఏకత్వపరచి, ఆత్మ తత్వమును నిరూపించి, దైవత్వ స్థానములో చేర్చటమే నా లక్ష్యము. పరస్పరము మానవులకున్న సంబంధ బాంధవ్యములను ప్రచారము చేయుట కూడా నా విధి. మానవత్వములో దైవత్వము అంతర్భూతమై ప్రకటించ బడుచున్నదని అనుభవ రీతిగా అందించుట కూడా నా కర్తవ్యములలో ఒకటి. పాండిత్యము ప్రకటించి తేనే గొప్పకాదు, ప్రకటించనంత మాత్రాన అది తక్కువ కాదు. ఎంతటి కష్టమైన, క్లిష్టమైన, సమస్య లైనా క్షణములో నేను నివారించగలను.

నా శక్తులనేవి ఏనుగు ప్రమాణము కలిగి ఉంటే యీ మహిమ (మిరకిల్సు) లనేవి దోమ ప్రమాణము కలిగి ఉన్నవి. నా మహిమల నర్థము చేసికొనలేక నా మహిమలకు ప్రాధాన్యమిస్తున్నందుకు నాలో నేను నవ్వుకుంటున్నాను; ఇది నేనెవ్వరికి చెప్పను ? నాలో వున్నట్టిది, ఎటువంటి కొలతలకు అందనిది, పరిమాణ మునకు అతీతమైనది, పరిశోధనలకు గురికానట్టిది, ప్రేమ ఒక్కటే. అది యింత అంత అని ఎవ్వరూ చెప్పలేరు, ఈ ప్రేమ తత్వమును గుర్తించి, అను భవించిన వారు మాత్రమే నన్ను కొంతవరకు తెలిసి కొనగలరు.

**పరమాత్మను చేరుటకు ప్రేమ ఒక్కటే రాజ మార్గము :** ప్రేమ అనే మకరందము పరమాత్మ పాదపద్మములందే దొరకుతుంది. కమలము బురద లో పుట్టి నీటిలో పెరుగుతుంది. కాని కమలమీ రెం డింటికి అతీతముగా ఉంటుంది. దీనికి బురద అంటదు. నీరొక క్షణము లేకున్నా, కమలము వాడిపోతుంది ; కాని నీటిని తనలోనికి రానివ్వకుండా బ్రతుకుతుంది.

జన్మాంతరమనే బురదలో పుట్టి, సంసారమనే జలములో నివసించుతూ ఉన్నప్పటికి, యీ బురదను అంటుకొనక, యీ నీటిని చేర్చుకొనక ఉండటమే దైవత్వముయొక్క చిహ్నము.

భగవంతుని అన్ని అంగములు పద్మములే—ముఖ పద్మము, నయన పద్మములు, హృదయ పద్మము మొదలైనవి. అందుచేత, భగవంతుడేది చేసినా, విషయ వాసన అనే మాలిన్యము దానికంటదు. దోషరహిత మైన దృష్టి, నిశ్చలహృదయము, దైవత్వ చిహ్నములు. చేతులకంటుకొనిన జిడ్డు కడుగుకొనిన గాని పోదు; ఎంతటి జిడ్డు పదార్థములు భుజించినప్పటికి, నాలుక కా జిడ్డు అంటదు. అందుచేతనే పరమాత్మ నామమును చింతించుటకు నాలుక కొకదానికే అధికారమున్నది. అట్లే కన్నులకు కాటుక అంటదు. అటువంటి దృష్టి పవిత్రమైనదిగా ఉంటుంది. జ్ఞానమునకు దృష్టి అని కూడా అర్థమున్నది: "అద్వైతదర్శనం జ్ఞానం" అని. కాబట్టి దృష్టి జ్ఞానమయమైనదని చెప్పక తప్పదు, ఇది మరొక పాఠము చెప్పుచున్నది. ఎవరైనా ఎదుట నిలబడితే, వారి ప్రతిబింబము మన కన్నులలో, మన ప్రతిబింబము వారి కన్నులలో చూడగలుగుతాము. అనగా, ఇక్కడ నేత్రము అద్దమువలె ఉన్నది. అదే విధముగా భగవంతుని దర్శించుటకు జ్ఞాన నేత్రమును సంపాదించుకొనవలెను.

లోకములను చూడవలెనంటే కన్నులు తెరవాలి. దేవాలయములో దేవుని చూచి కండ్లు మూసికొని నమస్కరించుతాము. దీనిలోని అంతరార్థమేమిటి ? కర్మేంద్రియము వలన ప్రయోజనము లేదు, జ్ఞానేంద్రియములే భగవంతుని చూపగలవని. చర్మ చక్షువులతో చూచినది ప్రకృతీ అసత్యము : జ్ఞాన చక్షువులతో చూచినప్పుడే, సత్యస్వరూపమును గుర్తించుటకు మీకు వీలవుతుంది.

స్వామి అనుగ్రహము చిక్కినప్పుడు మీకు అనంత మైన జాగ్రత్త లభించుతుంది. పైపై విషయముల మీదికి బుద్ధిని మరలించవద్దు. అట్టివారు నాస్తికులుగా మారగలరు. అమూల్యమైన వజ్రమును నేనుండగా, తుచ్ఛమైనట్టి అశాశ్వతమైనట్టి వాటికొరకు ఎందుకు ప్రాకులాడుతారు ? మీరు నన్నే కోరండి. ప్రేమతో భక్తితో కోరినట్లయిన, నేను తప్పక లభించుతాను. స్వామి అనుగ్రహించి యిచ్చిన దానిని పుచ్చుకొనడములో దోషము లేదు ; అది అవసరము కూడా.

నా దివ్యతత్త్వములోని విషయములు కొన్ని మీకు చెప్పవలెననుకుంటున్నాను. అప్పుడప్పుడు నా దర్శనముకొరకు వచ్చిన భక్తులయొక్క మంచిచెడ్డలు విచారించి, వారికి నా మాటలతో శాంతిని అందించుతాను. దీనితోపాటు, ఉంగరములని, లాకెట్లని, పూసల దండలని ఎన్నో వారికి ఇస్తుంటాను. ఇవన్నీ నేను మీ వెంబడి ఉన్నాననే దానికి గుర్తులు మాత్రమే. వీటి విలువను మీరు మదింపు చేయరాదు. ఇవి లేకున్నా, నేను మీ వెంట, జంట, ఉన్నాను. అయితే వీటి ప్రయోజనమేమిటని మీరు అడగవచ్చు. ఇవి ఒక విధముగా, మీ కేదైనా ఆపద కలిగినప్పుడు ఈ చిహ్నములు తక్షణమే వాటిని నా దృష్టికి తీసుక వస్తవి. నేను వెంటనే మీ ఆపదలు నివారించుతాను. వీటిలోని రహస్యమిదే. ఇవి ఒక విధమైన, మీకూ నాకూ మధ్య 'లింకు' లవంటివి. ఈ రక్షలు అనేక లక్షల మందిని రక్షించుచున్నవి

అయితే, ఈ చిన్న చిన్న కార్యములు చేయడానికి కాదు నేనవతరించినది. ఎన్నో మహత్తర కార్య

ములు నిర్వహించటానికి; మానవ లోకాన్ని ఉద్ధరించటానికి; మానవులనందరిని సత్యధర్మ శాంతి ప్రేమ మార్గములో నడిపించి వారిని గమ్యస్థానము చేర్పించటానికి వచ్చినాను. ఈ నిర్వహణలో నేనెవ్వరికీ బెదరను; బెదరవలసిన అవసరము లేదు. సర్వమూ సత్యము మీద ఆధారపడి ఉన్నందున, నేను సత్యస్వరూపుడను కనుక నేనెవ్వరుకీ లొంగను.

మరియు సాయి అనగా స(ష్టస్)అయి; దివ్యమాత. బాబా అనగా పిత. కాబట్టి సాయిబాబా అనగా దైవిక మాతా పితలని అర్థము. నాయందు తల్లి గుణములు తండ్రి గుణములు రెండూ ఉన్నవి. ఈ రెండు స్వభావములు నాయందున్నందున, ఇది శివ—శక్తి స్వరూపము. నేను తల్లివలె లాలించుతాను, తండ్రి వలె ఆదలించి, బెదరించి, దండించి, శిక్షించి, సరైన ఉన్నత స్థానానికి తీసుకువెళ్లుతాను. లౌకిక తల్లిదండ్రులకు కొంతైనా స్వార్థముండవచ్చు, తమ బిడ్డలు పెద్దవారై తమకు అండగా ఉంటారనో, సహాయకులుగా ఉంటారనో అనుకోవచ్చు. కాని యీ సాయికి అటువంటి స్వార్థమేమీ లేదు. మీకేదైనా శిక్ష విధించినట్లయిన, ఆశిక్షను రక్షగా భావించండి. ఆరోగ్యవంతుడైన బిడ్డకు తల్లి అన్ని పదార్థములను పెట్టి తినిపించుతుంది. రోగిగా ఉన్న బిడ్డకు చేదుగా ఉన్న మందును రోగము పోగొట్టుటకుగాను ఇస్తుంది; తీపి పదార్థములు పెట్టదు. అనగా, తల్లికి ఎవరి పెట్టవలెనో, అదే పెట్టుట తెలుసును. తల్లికి బిడ్డలందరూ సమానమే; వారిని సమానముగానే ప్రేమించుతుంది. నా తత్త్వము కూడా అదే; దానిని మీరు అర్థము చేసుకొనండి.

ప్రపంచములో నాస్తికులని, ఆస్తికులని ఉంటారు. ఒకరు దగ్గరగా వచ్చిన మరొకరు దూరముగా వెళ్లుతారు. నాస్తికత్వమనేది ఒక రోగమువంటిది దేవుడు లేడనేవారు ఒక విధమైన మధుమేహముతో బాధపడే రోగులు. వీరికి తీపి తినవలెనని ఉంటుంది; కాని తీపిని దగ్గరకు రానివ్వరు. ఆ రోగమునకు తీపి సరిపడదు ఆ జబ్బు నయమయితే వారు కూడా తీపి తింటారు. అనగా దైవమును సమీపించుతారు. అట్లే మలేరియా రోగికి అన్నీ చేదుగా ఉంటవి; తీపి వస్తువులు కూడా చేదుగా ఉంటవి. జ్వరము తగ్గిన తరువాత వానికి రుచి తెలుస్తుంది.

వాస్తవములో నాస్తికులనేవారు లేరు. స్వార్థమువలన నాస్తికులవుతున్నారు. తనను తాను ప్రేమించుకొననివాడే నాస్తికుడు కానీ, అటువంటివాడెవ్వడుంటాడు? కాబట్టి మీరందరు నా తత్త్వమును మననము చేసికొంటూ ప్రేమతో మీ హృదయములను నింపుకొని, సాయుజ్యమనే మధురానందమును పొందవలసిందని ఆశించుతూ ఆశీర్వదించుచున్నాను.

(19—6—74 సాయంకాలము శ్రీ బాబా గావించిన దివ్యోపన్యాసమునుండి.)

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజిస్ట్రేషను ఛార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టరు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 1-25 తో వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

తెలుగు:—

| | పేరు | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-65 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-75 |
| 3 | మణిమాల | 1-00 | 0-25 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-45 |
| 5 | అర్పణ | 1-00 | 0-15 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0 25 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-25 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-65 |
| 9 | వచనామృతము | 4-00 | 0-45 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 1-65 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-35 |

కన్నడ:—

| | పేరు | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం[1] | 3-50 | 0-5 |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-2 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 6 | జ్ఞాన వాహిని | 1-50 | 0-15 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-45 |

మలయాళము:—

| | పేరు | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపశదేరత్నంగళ్ | 1-50 | 0 55 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-15 |
| 3 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-65 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-15 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0-15 |

ఇంగ్లీషు:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజన సాంగ్స్ (ఇండియన్ ప్రకటన) | 1-50 | 0-25 |
| 2 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-55 |
| 3 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-65 |
| 4 | ప్రశాంతివాహిని | 2-00 | 0-25 |
| 5 | జ్ఞానవాహిని | 2-00 | 0-25 |
| 6 | ధ్యానవాహిని | 2-00 | 0-25 |
| 7 | సమ్మర్‌షోవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0 65 |
| 8 | „ 1973 | 6-50 | 0-55 |
| 9 | సందేహ నివారిణి | 3-00 | 0-25 |

అరవం:—

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-25 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-65 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-65 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-45 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-55 |
| 6 | భజనావళి | 1-00 | 0-35 |
| 7 | సాయిమాతా | 1-00 | 0-15 |
| 8 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 9 | సందేహనివారిణి | 2-00 | 0-35 |
| 10 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 11 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-25 |
| 12 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-15 |

హిందీ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-15 |

గుజరాతి:—

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 2 | కథాసుధ | 2-00 | 0-35 |
| 3 | గీతావాహిని | 4-00 | 0-55 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-55 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-15 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0 25 |

అస్సామి:—

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారధి [పార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0-15 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కథ | 0-25 | 0-15 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్స్] | 0-50 | 0-15 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-45 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-25 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-15 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0-25 |

—o—

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2. చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయముననే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5. పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను. M.O. ద్వారా పైకమును పంపించువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియ జేయవలెను.

6. పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు . .8/-74 అని యుండిన, మీ చందా ఆగస్టు నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) ఆగస్టు నెల 8. వ తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు ఎడిటర్, 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్, ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్

Regd. No. KRN/A-67

భగ భగమని మండే మంటలో పడవేసి, గట్టిగా విసరినప్పుడే. బొగ్గు ముక్క కాలి వేడెక్కి, మంటయొక్క వర్ణమును తీసుకుంటుంది, ఆ మంటే పరమాత్మ, బొగ్గుముక్క జీవి, విసరుటే సాధన.

— బా బా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 ఆగస్టు, 1974 సంచిక 6

## విషయానుక్రమణిక



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 55

### భరతుని ప్రార్థన

ఆరవ దినం ప్రాతఃకాలమున స్నాన సంధ్యాదుల ననుష్ఠించి, శత్రుఘ్నునితో పరివారముతో భరతుడు సమావేశమై, రాముని ముఖ లక్షణములను గమనించుచు, దిగ్గున లేచి నిలువబడి, ధైర్యము నవలంబించి దండప్రణామమును చేసి చేతులను జోడించుకొని భరతుడు ఇట్లు విన్నవించెను. హే ఇక్ష్వాకుకుల తిలకా! అన్ని విధముల మీరు నా కోరికలు నెరవేర్చితిరి. నా నిమిత్తమై మీరు సకల దుఃఖములు పడుచుంటిరి, సకల కష్టములు పడుచున్నారు, ఓ నాథా; మీ ఆజ్ఞను దయచేయుడు. పదునాలుగు సంవత్సరముల వరకు మీ ఆగమనమును నిరీక్షించుచు నేను నగరములో మీ సేవ చేయువాడను. అవధి దాటిన తరువాత మీ చరణారవిందములను దర్శించుటకు మార్గము చూపుము. ఈ పదునాలుగు సంవత్సరముల వరకు నాకే విధమున ధైర్యము నిలిచియుండునో బోధింపుడు.

రామా; మీ పురజనులు, మీ కుటుంబము, ప్రజలు, అత్యంత సరసులు, పరమ పవిత్రులు, బ్రాహ్మణులు, పండితులు, మీ యందు బద్ధానురాగులై యుందురు. ఈ సంసార దుఃఖములను, తాపములను మీ నిమిత్తమై భరించువాడ. మీ పరోక్షమున పరమపదమైనను నాకు వ్యర్థము. మీ సేవకుల మనోభిప్రాయములు, వారి భావములు, వారి కోరికలు మీకు విశదము. ఉభయ లోకములలోను మీరే నన్ను నిర్వహించగలరు. ఇదియే నాకు గల మనోధైర్యము, అందుచేత నాకీ దుఃఖమంతయూ తృణప్రాయముగా కనబడును, ఇంతవరకూ నా దుఃఖమును పట్టలేక

నా తలకు తగనట్లు ప్రసంగించితిని. నా లోపా లోపములను క్షమించి వెనుదీయక తగినట్లు నన్ను శిక్షింపుము అని భరతుడు చెప్పిన విన్నపములను సభికులు విని హర్షించి, అమోదించి అతనిని కొనియాడిరి. నీరములనుండి క్షీరమును విభజించు హంసవలె అతడు సత్యము నసత్యమునుండి విభజించి చెప్పెను.

శ్రీరాముని హితవచనములు

నిర్మలాంతఃకరణముతో భరతుడు చెప్పిన మాటలు దీనబంధువు రాముడు విని దేశకాల సమయానుసారముగ అతనితో ఇట్లు చెప్పెను. తమ్ముడా, భరతా, గృహములో వున్న నీ యొక్కయు, వనములోయున్న మా యొక్కయు, సకల జన యోగక్షేమమును చూచుకొనువారు ఎవరో వారు చూచుకొనుచుందురు. లోకరీతిగా గురువులైన వశిష్ఠులవారును, జనక చక్రవర్తులును నీకు తోడుగా వుందురు. స్వప్నమందైననూ నీకును, నాకునూ కష్టములన్నవి కనుపించుటకు వీలు లేదు, కనుపించవు కూడను. మన తండ్రిగారి ఆజ్ఞను పరిపాలించుటయే పరమ పురుషార్థము, సర్వశ్రేయోదాయకము, శాశ్వత కీర్తి ప్రదాయకము, వేదసమ్మతము. ఎవరు గురువాజ్ఞను, తండ్రి ఆజ్ఞను, తల్లి ఆజ్ఞను మన్నించి సన్మార్గమున సంచరించెదరో వారి పాదములు తప్పు మార్గమున పడవు.

ఈ సత్యమును గుర్తించి దుఃఖమును దూరము త్రోసి ఆనందముతో నీతినిజాయితుల తోడ, పదునాలుగు సంవత్సరములు, రాజ్యమును నడుపుము. రాజు ముఖము వలె నుండవలెను; భోజన పానములు ముఖము చేయును. సకలాంగముల నది యథా విధిగ పుష్టిచేయును. అటులనే రాజులద్వారా రాజ్యాంగములకు పుష్టి వచ్చును. సకల మనోరథములు మనసులో నిమిడి యున్నటుల, సకల రాజధర్మములును రాజనీతులును రాజులలో దాగియుండును. ఈ ప్రకార మనేక విధముల రాముడు తమ్మునకు బోధించెను.

కాని మనసు నిలుచుటకు ఆధారములేక పోవుటచేత, భరతుని మనస్సునకు శాంతిలేక పోయెను. శ్రీరామునియందు గల ప్రేమకు వశ్యులై మంత్రులును గురువులును, తల్లులును, పండిత పామరులును, భరతుని వలె యేకాభిప్రాయులై సంశయించి యూరకుండిరి. అపుడు రామ ప్రభువు కటాక్షించి తన పాదుకలను తీసి భరతున కిచ్చెను.

పవిత్ర పాదుకలు

సాదరముగ భరతుడు పవిత్ర పాదుకలను తనహస్తములతో తీసుకొని శిరస్సుపై ధరించెను. రెండు నేత్రములనుండి గంగా యమునలవలే ఆనంద జలము ప్రవాహముగా కారదొడగెను. భరతుని నోట మాట రాలేక పోయెను. ఇవి కరుణాసముద్రుడు ధరించిన పాదుకలు కావు, సకల జనుల ప్రాణములు రక్షించు రక్షలు, భరతుని స్నేహరత్నమును కాపాడునట్టి సంపుటము, రఘుకులమును రక్షించు రెండు కవాటములు, ఇవి సుకర్మలు చేయునట్టి రెండు హస్తములు, ఇవే లోక నేత్రములు, ఈ రెండు పాదుకలు మన వెంట వచ్చు సీతారాముల చిహ్న

ములు, అని వర్ణించుచూ గంతులు వేయుచున్న భరతుని ఆనందమును యెవ్వరున్ను వర్ణింప లేకపోయిరి.

అందరూ వకపరి రామ పాదుకలకు నమస్కరించి, రాముని అనుగ్రహమును కొనియాడిరి. అంత రాములకు నమస్కరించి ప్రయాణమునకు సెలవివ్వమని ప్రార్థించిరి. రాముడు భరతుని తృప్తికి మెచ్చి వకపరి ప్రేమతో భరతుని గట్టిగ కౌగిలించుకొని తలనిమిరి విజయీభవ అని ఆశీర్వదించెను. శత్రుఘ్నుడు నమస్కరించెను. అతనిని రాములు కౌగిలించుకొని అతనికి చెప్ప వలసిన ధర్మసూత్రములను తెలిపి, భరతుని రాములుగా భావించి తోడుగా యుండి రాజ్య కల్యాణమునకు తగిన రీతిగా వించుమని తెలిపెను. అంత భరత శతృఘ్నులు లక్ష్మణుని కౌగిలించుకొని నీ భాగ్యమే భాగ్యము, నీ యంతటి అదృష్టవంతుడే లోకమునినూ వుండ డని లక్ష్మణుని కొనియాడి అతనినుండి సెలవును తీసుకొనిరి.

అంత లక్ష్మణుడు భరతశతృఘ్నులను చెంత చేర్చి రామచంద్రుని పాదుకలు సకల మంగళ ములకు మూలములు, కాన అట్టి భాగ్యమును అందుకున్న మీకంటే ధన్యులు మరొకరుండరని, అట్టి భాగ్యమును భద్రముగా కాపాడుకొనుటే, మీ కర్తవ్యమని హెచ్చరించెను.

తదుపరి భరతశత్రుఘ్నులు సీతాదేవి దగ్గ రకు వెళ్లి అమె పాదములపై బడి దుఃఖమును భరించలేక బోరున యేడ్చిరి.

ఆమె వారలను అనేక విధముల నోదార్చి రామ రక్షకంటే వేరొకటున్నదా లోకమున నా యనలారా! మీరు ధన్యులు, ఈ పదునాలుగు సం వత్సరములు పదునాలుగు నిమిషముల వలె అతి శీఘ్రముగా జరిగిపోయి. రామ ఆగమనముతో రాజ్యము కళ కళ, కిల కిల లాడును. ఓపికతో లామాజ్ఞను జవదాటక మీ అభీష్టములను ఫల సిద్ధి గావించుకొని ఆనందింతురు అని దీవించెను.

## జనకమహారాజు

అంత భరతశతృఘ్నులు నేరుగా జనక మహారాజు దగ్గరకు వచ్చి వారి పాదములకు నమస్కరించి, ఓ రాజా! మా పై గల దయా ప్రేమానుగ్రహముల చేత, తాము మా తండ్రి మరణవార్తయు, రామచంద్రుని వనవాస వార్త యు, విని అయోధ్యకు వచ్చి మా పరిస్థితులను స్వయముగా గుర్తించి, మమ్ములనేక విధముల నోదార్చి, ధైర్యమునకు తగిన సలహాలనందించి, మా అభీష్టమును పురస్కరించుకొని తిరిగి మీరు ఇన్ని శ్రమలకోర్చి మాతో అరణ్యమునకు కూడ నూ దయచేసి, రాములకు విన్నవించ వలసిన విషయములలో మా కెంతయో తోడ్పడి, కడకు మా దుఃఖ పరిహారమునకు తగిన సలహాల నందించి రామానుగ్రహమును పొందునట్టి వ్యక్తు లుగ మమ్ము గావించితిరి; మీ కనేక ధన్యవాద ముల నర్పించుచున్నాము. ఇంతకంటే మేమేమి చేయగలము, తమ ఆశీర్వాద బలమే మాకీనాటి కింత తృప్తి చేకూర్చెననిరి. భరతశతృఘ్నులు, వారి కృతజ్ఞతా పూర్వకమైన వందనముల నందు కొన్న జనకుడు ఆ పిల్లలయొక్క ప్రేమ వాక్య ములను హృదయపూర్వకముగ అందుకొని, వారల గుణములను తనలో తాను యెంతయో మెచ్చుకొని, వారలను చెంత చేర్చుకొని, శిరస్సు

లను ముద్దాడి నాయనలారా! రామచంద్రుని ఆజ్ఞానుసారము మీరు మెలగి అతని అనుగ్రహ పాత్రులగుదురు గాక నేనిక్కడనుండియే మిథిలకు వెళ్లుచున్నానని, తన పరివారము తరుపున తానే భరత శత్రుఘ్నుల చేత సెలవు పుచ్చుకొని, జనకుడు సతితో, తన పరివారముతో మిథిలకు ప్రయాణమయ్యెను.

### సెలవు తీసికొనుట

ఇక మంత్రులు, సామంతులు, ప్రజలు, బ్రాహ్మణులు, ఋషులు, ఒకరి తరువాత ఒకరు సీతా రామలక్ష్మణుల దగ్గర సెలవు తీసుకొని భారమైన హృదయంతో విడువ లేక విడువ లేక అయోధ్యకు తిరిగి వెళ్లుటకు అన్ని విధముల సిద్ధమయిరి.

సీతా రాములు తల్లులైన కౌసల్య, సుమిత్రా, కైకేయిల దగ్గరకు వెళ్లి వారలకు నమస్కరించి, వారల విషయమై మీరేమాత్రమునూ విచారించక, మీ మీ కర్తవ్యములను మీరు సక్రమముగా నిర్వర్తించుచూ, తండ్రియైన దశరథుని అభీష్టములననుసరించు ధన్యులగుదురని ప్రార్థించిరి. మేము ఎట్టి బాధలకు గురికాక ఆనందముగా పదునాలుగు సంవత్సరములు పదునాలుగు క్షణములు వలె గడిపి, తిరిగీ అయోధ్య చేరుకొందుమనియూ, తండ్రిగారి ఆజ్ఞను నెరవేర్చుటే పుత్రుని పరమ లక్ష్యమనియూ ఆ నిమిత్తమై మేము ఈ పవిత్ర వనమున ఆనందముగా కాలము గడుపుదుమనియూ, తల్లులకు ధైర్యము చెప్పిరి.

### కైక

అంత కైకకు నమస్కరించి, తాము అరణ్యమున నివసించుటకు ఆమె ఏ మాత్రమూ కారణము కాదనియూ, ఆమె మాకు నిరంతరము పూజనీయురాలే కాని కీడొనర్చినది కాదనియూ ఆమె మేలును మరువలేమనియు, మా నిమిత్తమై మీరే మాత్రమూ విచారించక భరతునికి తోడుగా ధైర్యము తెలుపుతూ అతనిని చక్కగ కాపాడుకొనుచుండవలెననియూ, యేదో ఉడుకు రక్తములో, తండ్రి మరణమును. నా వియోగమును భరించలేక తల్లియైన మిమ్ములను అనేక విధముల తూలనాడినాడనియూ, అది భరతుని తప్పుగా భావించక, అతని క్షమించవలసిన దనియూ సీతారాములు కైకను వేడుకొనిరి.

ఇట్టి పవిత్ర వచనములనుచున్న రాముని ముఖమును కైక సిగ్గుతో చూడలేక పోయినది. ఇంతటి విశాల భావమును పవిత్ర హృదయమును గల బంగరు వంటి నా రాముని నేనింతగా బాధ పెడితిని కదా, ఈ భయంకర అరణ్యమున జీవితము గడుపుటకు నేనే కారణము కదా, ఛీ. నేనెంత కిరాతకపు పని గావించితిని.

నిజముగా నేను చేసితినా లేక రామ సంకల్పమే నన్నీ రీతుల ఆడించెనా? ఏది ఎట్లయిననేమి. నేను మహా పాపిని అని తనలో తాను నిందించుకొని సీతను దగ్గరకు చేర్చి ఆ నాడు చేసిన నా తప్పును క్షమించమని కోరి. తన రెండు హస్తములు గట్టిగా పట్టి ఇంతటి పవిత్ర నారీమణికి పడరాని పాట్లు కల్పించిన నన్ను మీరు క్షమించుట న్యాయము కాదు అని కైక యెంతో విలపిం

చెను తన తప్పును తాను హృదయపూర్వక ముగ తెలిసికొని బాధపడెను.

ఈ విధముగా అందరూ వారి వారి స్థానముల ననుసరించి సీతారామలక్ష్మణుల చెంత సెలవు తీసుకొని వారి వారి రథములందు వారు ఆశీనులైరి. అంత సీతా రామలక్ష్మణులు ప్రతి రథము దగ్గరకూ వెళ్లి, అందరినీ మరొకతూరి పలుకరించి ధైర్యము చెప్పి ఒక్కొక్క రథమునే కదిలించుచూ వచ్చిరి.

వశిష్టులవారు

గురువగు వశిష్టుని వారి పాదములకు సీతారామలక్ష్మణులు నమస్కరించి తమకు తమ ధర్మపత్నికి మా వలన చాలా శ్రమగలిగెను. ఈ అడవిలో తమ సేవలు చేయవలసినంతగా చేయలేక పోయినందుకు క్షమించమని, వారిక విలచుటకు సెలవు దయచేయుమని ప్రార్థించిరి. అంతట ఋషి జ్ఞాని అయిన, బ్రహ్మఋషి అనే వశిష్టులవారికి కూడా వారి భక్తి శ్రద్ధలను, ధర్మ మార్గమును వర్ణించుటకు సాధ్యము కాలేక పోయెను. వారిని విడచి ముందుకు పోలేక పోయినారు. ముగ్గ్వురూ ఒక చోట నిలుచుకొని హస్తములు జోడించి కదలి పోవు రథములవారికి నమస్కరించుచున్న దృశ్యము ఎట్టి కఠిన బండలనైనా కరిగించ గలవన్నట్లు తోచినది, అరుంధతి వశిష్టులవారికి.

(సశేషము)

కర్మ చేతను జ్ఞానంబు కలుగుగాని
జ్ఞాని యొనరించు కర్మ అజ్ఞానికొరకె ;
పూజ్యులరసిన మార్గమ్ము పూనిరేని
ఆత్మ జ్ఞానంబె అలవడు నవనిలోన !

బహుళ విద్యలన్ని పాకశాస్త్రము బోలు
వంటకములు బోలు భక్తి ఒకటె ;
వంటకములు వీడి పాకశాస్త్ర మదేల
వినుడు భారతీయ యువకులార :

— బాబా

# విద్యార్థులారా!

నెలదినముల నుండి వేదవాక్యముల యొక్క అంతరార్థమును, భారతీయ సంస్కృతియొక్క మహత్వమును మీకు వివరించాను. మన లౌకిక మరియు పారమార్థిక జీవనములకు వేదమే ప్రమాణమని ఈ విద్యార్థి దశలోనే మీరు గుర్తించడము అత్యవసరము. వేద మంత్రముల, వేదములోని దేవతల, వేదమందలి స్తోత్రముల అంతరార్థమును గుర్తించిన, జీవితమందు వికాసము, శాంతి, భద్రతలు చేకూరును. ఆనందమును కోరేది, దాని కొరకు ప్రాకులాడేది, అన్ని జీవులకూ సహజమే. అయితే, భౌతిక వృత్తులలో శాశ్వతానందము లేదని గుర్తించటము కూడ అవసరమే. అది బయట పదార్థములలో లేదు ; హృదయ స్థానమందే వున్నది.

హృదయానందము నందించ లేని, మనస్సునందు శాంతిని నెలకొల్పలేని దైవత్వమును గుర్తింపలేని విద్య నిజమైన విద్యకాదు. విద్యవలన ఉన్నతా దర్శములు, హృదయ వికాసము, జ్ఞానజ్యోతియొక్క ప్రకాశము, ఇవన్నీ అభివృద్ధి కావలెను. ఈ నాడు, బ్రతుకు నిమిత్తమైన విద్యను మాత్రమే అందించుచున్నారు ; అది పొట్టి కూటి విద్య. ఈ విద్యను సంవత్సరాల కొద్దీ అభ్యసించక, దీనికోసము ధనవ్యయము కాల వ్యయము చేయకనే, విద్యాహీనులు అనే పేరుకు అర్హులైన వారెంతోమంది బ్రతుకుట లేదా ? ఆనందమునందుకోవటము లేదా ? కాబట్టి, ఇది కాదు విద్య. లౌకిక విషయములలో న్యాయాన్యాయ పరిశీలన సలిపి, పాపభీతి దైవప్రీతితో జీవించుట వినయ విధేయతలను పాటించుట, విజ్ఞానమును వికసింపజేయుట, మాతాపితరుల సేవలో సదా నిరతులైయుండుట, తమ కుటుంబము, గ్రామము, దేశము భాష వీటికి సేవ చేయుటలో తమ శక్తిసామర్థ్యము లన్నిటిని వినియోగించుట — ఇట్టి ప్రయోజనముల కనుకూలించని విద్య, దాని నభ్యసించిన దొరకే డిగ్రీలు, వట్టి తల భారమే కాని వేరు కాదు, ఇట్టి విద్యా పద్ధతుల వలననే, దేశమందెక్కడ చూచినా అన్యాయ అక్రమములు పెరుచున్నవి. విద్యావంతులలోనే ఈ నాడు స్వార్థము, ఆడంబరము, అహంకారము, అవినీతి కనుపించుచున్నవి ; వారివలన దేశమునకు కల్యాణము లేదు, క్షేమము లేదు. విద్యాభివృద్ధి వలన విశాలభావము చేకూరవలెను : విజ్ఞానము పెరిగే కొద్దీ వినయము కూడ పెరుగవలెను. ఎట్టి సమయమునందు కానీ, ఏ వ్యక్తికి కానీ, కష్టనష్టములు సంభవించినపుడు, సేవ చేయుటకు ఉత్సాహముతో సంసిద్ధులుగా నిలువవలెను. అయితే, బలహీనులను పరిహసించెడి, మాతా పితలకు సేవ చేయక, తమ చెడు నడవడికచే దుర్గుణ దుశ్చేష్టల వలన వారిని యేడిపించిన కొడుకు, లోకమును మాత్ర మే రీతిగా ఉద్ధరింపగలడు ?

పవిత్రాత్మ స్వరూపులైన విద్యార్థులారా ! మీరు అట్టి హీన దశలోనికి రాక, భారతీయ సంస్కృతి యొక్క కీర్తిని స్మరించి భారతదేశము యొక్క సౌభా

గ్యము. సౌశీల్యములను నిలబెట్టి, మనోవాక్కాయము లచే అన్ని విధాల బాహ్యసుఖముల నాశించక, సోమరి పోతులు కాక, కష్ట జీవులుగా జీవించుటకు ప్రయత్నించండి. శ్రమపడి కష్టముల కోర్చుకొని పనులు చేయుటకు ముందంజ వేయకున్న దేశము త్వరలోనే క్షీణించును.

విశ్వమనే కర్మాగారమందు వ్యక్తి ఒక పని ముట్టు. ఈ పెద్ద మెషీనులో ఒక పిన్ లేక ఒక చిన్న నట్ మాత్రమే అయిననూ, తన పాలిటి కర్తవ్యమును చక్కగా వంచన లేక నిర్వర్తించుటకు ప్రతి వ్యక్తి శ్రద్ధ వహించవలెను. వెనుకంజ వేసినట్లయిన నీకు నీవే భ్రష్టుడవు! దేశమున కపకారము చేసినవాడవు!

భారతీయ సంస్కృతి సోహం తత్త్వముపై ఆధార పడియున్నది; సోమరి తత్వముపై కాదు! నిజమైన విశ్రాంతి కావలెనన్న, నిరంతరము కర్మలు చేయవలెను. అదే నిజమైన రెస్టు! సోమరితనముతో రస్టు (తుప్పు) పెరుగును, అంతే. శరీరమును శ్రమ పెట్టక పోతే నిద్రరాదు; నిద్ర లేనివాడు క్షుద్రము పంచు కుంటాడు; పిచ్చి పిచ్చి ప్లానులు వేస్తూవుంటాడు. యువకులైన మీరు బాగా శ్రమపడి, మీ మీ ఇండ్లు గ్రామములు సమాజము దేశము వీటి పట్ల మీ మీ కర్తవ్యములను గుర్తించి ఆదర్శవంతమైన జీవితములను గడుపవలెను.

ప్రాచీన కాలపు వేదవిదులు ఎన్నో శ్రమలకోర్చి, సత్కర్మలు సదాచారములు ఆచరించుతూ సర్వేశ్వర చింతలో మునిగి, తోటి మానవులను సంతోషపరచుటకు పూనుకొనిరి. ఈ నాటి విద్యలు బోధించే ఉపాయ ముల వుపదేశముల వలన నిత్య జీవితములో శాంతి భద్రతలు లభించవు. ఆ నాటి విద్యకు స్వాధ్యాయమని పేరు. స్వ - తనకొరకు, అధ్యయనం = చదవు; అంటే, పరమ పురుషార్థమును అందుకోవటము, బ్రహ్మప్రాప్తిని పొందటము, అదే పరమలక్ష్యము. నేడు, ఈ ప్రాప్తిపై ఘనమైన అవిశ్వాసము పెరిగి, స్వార్థము, యశస్సు, ధనము, వీటిపై దృష్టి నిలచినది. వేదవిదుల కర్తవ్య లక్ష్యము, ఆత్మ ప్రాప్తి ఒకటే!

మానవ జీవిత కాలమును వసు - రుద్ర - ఆదిత్య అనే 3 భాగములుగా వేదవిదులు విభజించినారు.

మొదటి భాగమందు, కర్మనిష్ఠుడుగా వుంటాడు, తరువాత, ఉపాసనాస్థానము; స్వాధ్యాయము సాధనలో నిరతుడై ప్రేమతత్వము ననుసరించి అనుభవించి ఆనందిస్తాడు. మూడవ ఆదిత్య భాగమందు, జ్ఞాననిష్ఠుడై పరమపదవి నందుకొంటాడు. ఆదిత్యభాగమునకు భారతి అధిదేవత; రుద్రభాగమునకు సరస్వతి అధిదేవత; వసుభాగమునకు ఇడా దేవతయే అధిష్ఠానము.

ఈ రీతిగా జీవనమునే కర్మ భక్తి జ్ఞానమార్గము లందు ఒక పెద్ద తీర్థయాత్రగా మార్చి సాఫల్య పరచుకొనుట భారతీయుల ఆదర్శము. ఆ నాటి భారతీయులు సర్వమును త్యాగము చేసి, అవాఙ్మానస గోచరమైన దివ్యానుభూతులనందు కొనిరి. ఈ నాడు తెల్లవారి కోరిక మధ్యాహ్నముండదు; మధ్యాహ్నము వచ్చిన కోరిక సాయంత్రము వరకు ఉండదు. తలంచినది ఫలించినా, భక్తి! కోరిక శిథిలమైన, అవిశ్వాసము! ఆశయము నెరవేరిన, నెరవేరకపోయిన, భక్తిభావము ఒకే స్థితిలోనే నిలుపవలెను. దానికే అనన్యభక్తి, నిశ్చలభక్తి, సాయుజ్యమును అందించే భక్తి, ఆ విఫలమందే ఫలమున్నదని దృఢము చేసుకోవలెను.

ఒక వ్యక్తి తన్ను గొప్ప భక్తుడు అని ప్రపంచము వర్ణించవలెనని ఆడంబర ప్రవర్తనలు చేయుచూ దినము ఆ వూరులోని దేవాలయమునందు బ్రహ్మముహూర్త మునకు సరిగ్గా కూర్చొని, కన్నులు మూసుకొని జపము చేయుచూ 10 గంటల వరకూ లేచేవాడు కాదు. పాపము, ఆ పూజారి ఇంటికి వెళ్లుటకు వీని వలన నిత్యమూ ఆలస్యమగుచుండెను. వానిని లేపటమా ? ధ్యానములో మునిగినాడు. ఇంటిలో ఎన్నో కర్తవ్యము లున్నాయి. కడకు, ఈయన ఇట్లు గంటల తరబడి కూర్చుంటాడంటే, దీనిలో యేదో ఒక రహస్యముండ వలెనని ఊహించాడు. యదార్థమును గుర్తించవలెనని, ఒక దినము ఆ పూజారి దేవుని విగ్రహము వెనుక కూర్చొని, "భక్తా ! నీ జపతపములకు నీ భక్తి ప్రపత్తులకు చాలా మెచ్చినాను ! నీ ప్రాణమును నేను నాలో ఇపుడే లీనము చేసుకొని నీకు మోక్ష భిక్ష నందిస్తాను" అని గట్టిగా పలికినాడు. ఆ మాట లను విన్న తక్షణమే, వాడు లేచి పరుగెత్తినాడు !

మానవుల భక్తి ప్రపత్తులు ఇట్టివే. గమ్యమును చేరవలెను, ఐక్యత పొందవలెను, అనే లక్ష్యము దృఢము కావలెను ; దానికి సిద్ధము కావలెను. దైవ మును మరువక యెప్పటికప్పటికే సిద్ధముగానుండ వలెను.

భగవన్నామమును 10 పర్యాయములు, 25 100 పర్యాయములు పఠించుటకు వెనుకజ వేయు చున్నారు. అనవసరమైన పలుకులలో వాక్కులను నిరుపయోగము చేయుచున్నారు. పాతకాలపు సంస్కృతిలో పెరిగిన ఒక తండ్రి తన కొడుకును, "అబ్బాయి ! దినము గాయత్రి మంత్రమును శ్రద్ధతో 108 పర్యాయములు జపించు" అని కోరుతూ, నిర్బంధించినాడు. దానికి సమ్మతించి, ఆ అబ్బాయి పవిత్ర గాయత్రిని ఒక పర్యాయము చక్కగా పూర్తిగా ఉచ్చరించి, తరువాత, 107 పర్యాయములు దానినే ఆవర్తించక, కేవలము డిటో, డిటో డిటో అన్నాడు. పైచెప్పిన దాన్నే మరి మరి యెందుకు చెప్పాలి, అని వాదించి నాడు. "నా తలవ్రాత ! ఎటువంటి కుమారుడు పుట్టినాడురా !" అని ఆ తండ్రి చాలా బాధపడినాడు.

తరువాత, అబ్బాయి కాలేజిలో చేరి, తేజిగా చదివి విదేశములలోని విద్యా సంస్థలతో ఉత్తరప్రత్యుత్తరాలు పెట్టుకొని, అక్కడ సీటు దొరకించుకొన్నాడు తండ్రికి ఆనందమూ చింతా ఏకకాలమునందు వచ్చినవి. విమానము నెక్కేముందు కుమారుని ఒక దేవీ దేవాల యమునకు తీసుకొని వెళ్లి "సద్బుద్ధి సద్గుణము, సదాచార సత్సంప్రదాయములతో తిరిగి భారతభూమికి రప్పించుకోవమ్మ" అని ప్రార్థించమని చెప్పినాడు. తండ్రి ఒత్తిడికి కాదనలేక ఆ రీతిగానే కుమారుడు వేడుకున్నాడు. ఇష్టము లేక పోయినా, తండ్రి మాటలననుసరించి, ఆయన ఆజ్ఞను తీసుకొని, బయలు దేరుతామని అబ్బాయియొక్క ఆతురత !

అమెరికాలో దిగిన వ్యక్తి కొన్ని నెలలలో తెలుగు భాషను సంపూర్ణముగా అలక్ష్యము చేసి ఆ దేశ భాష ఆ దేశ సంస్కృతియొక్క వ్యామోహములో పడినాడు. రెండు సంవత్సరముల తరువాత, మన దేశానికి మళ్లి నపుడు, గంపెడాశతో తండ్రి విమానాశ్రయమునకు వెళ్లాడు. విమానమునుంచి దిగిన తక్షణమే, అతడు తండ్రితో ఇంగ్లీషులోనే మాటలాడినాడు ! ఏమిటయ్యా నాకు తెలియని భాషలో మాటలాడుతున్నావే, అంటే, నేను తెలుగు మరచిపోయినానన్నాడు ! మాతాపితరుల నైనా మరవకుండా వచ్చావే, అని కోపము కక్కుచూ, కుమారుని అదే దేవాలయమునకు తీసుకొని వెళ్లాడు. అయితే మనుష్యత్వమునకే మసిపూసినట్టు వాడు

బూట్లను తీయనని మొండి కెత్తినాడు. కొంత సేపు ప్రతిమాలిన తరువాత, వాటిని తీసి, లోనికి ప్రవేశించి, దేవీ విగ్రహమును చూచి, "హౌ డూ యు డూ మమ్మీ !" అని ఇంగ్లీషు పలుకుచూ, షేక్ హ్యాండ్ ఇవ్వటానికి పోయినాడు. అబ్బాయికి ఏదో పిచ్చి పట్టినది అని నిర్ణయించుకొని, తండ్రిగారు దేవసన్నిధి అయిననూ పరవా లేదని రెండు దెబ్బలు తగిలించినానాడు.

ఈ నాటి యువకులు ఈ రకముగా మాతృదేశమును మాతృభాషను మాతాపితరులను అవిధేయతతో అనాదరించి భారతీయ సంస్కృతిని అవమాన పరచుచున్నారు. ఆ నాటి తండ్రి, కుమారుని ప్రవర్తనకు కోపించి, ఖండించినాడు. అయితే, ఈ నాడు చాలా మంది తండ్రులు దానినే మెచ్చి, కొనియాడుచున్నారు ! భారతీయ సంస్కృతియొక్క తత్త్వములను తల్లితండ్రులు కూడ నేర్చుకోవటము అత్యవసరము, ఉపాధ్యాయులు కూడ సక్రమమైన మార్గములనవలంబించవలెను. విద్యార్థులు ఈ నాడు చెడినందుకు, తల్లి తండ్రులు, ఉపాధ్యాయులు, పెద్దలు, వీరే మూల కారణము. 'టాంకు' లో మంచి నీరుంటే 'టాప్'లో మంచి నీరు వస్తుంది. టాంకైన పెద్దలలో దుర్గుణములే నిండియుండిన, టాప్‌లో కూడ అవే వచ్చును. అందరూ దేశ సంస్కృతిని అర్థము చేసుకోవలెను ; భాషా తత్వమును కాపాడవలెను ; తల్లి తండ్రుల గౌరవ మర్యాదలను నిలబెట్టవలెను ; సమాజ క్షేమమును లక్ష్యమందుంచుకోవలెను. బాధ్యతను చేపట్టవలెను. అపుడే, అశాంతిని రూపు మాపి, అన్యాయమును చక్కపరచుటకు వీలగును.

మీ యందరికి స్వామిపైన ప్రేమ ఉన్నది, సరే. అయితే, స్వామికి నా పైన ప్రేమయున్నదా ? వారి ప్రేమను సంపాదించుట యెట్లు ? — ఈ రీతిగ యోచించాలి. సద్గుణము, సదాచారము, సత్ప్రవర్తన, సచ్చింతన, వీటిని అభివృద్ధి చేసిన చాలు. నేను వేరే ప్రేమను కోరను. వాటినే గుర్తించి ఆదరించి జీవిత భద్రతను నేనే అందిస్తాను.

శ్రీ వారి దివ్యబోధ, 17 - 6 - 74

---

## శుభకర

క ॥ స్పందించెను నా హృదయము
చిందించెను బాష్పధార, శ్రీ సాయిప్రభూ !
అందాలు చిందు నినుగని
సుందరవదనారవింద ! శుభకర ! సాయీ !

క॥ వెన్నను కడుపార తినగ
వెన్నగ హృదిమెత్తనయ్యె, విశ్వంభర ! నీ
కన్నను దయగలవాడిల
కన్నయ్యా ! లేడు వెదుక కారుణ్యనిధీ !

క॥ కోరను నిను భాగ్యములను
కోరను నిను నిన్ను మరచు గొప్పగు పదవుల్
కోరెద నిను నీ పదమును
కోరెదనిన్నెల్లవేళ కూర్మి భజింపన్.

వడిగొని తిరిగెడు జీవిత
సుడిగుండములోనఁ జిక్కి సుక్కుచునుంటిన్
విడిపింప నీదు మెత్తని
యడుగులు నా హృదిని నిల్పు మాత్మారామ

పలివెల సుబ్బరాముడు

# సాయి పఞ్చదశీ

1. కరిశం వరదం సౌమ్యం ముదితాస్యం దయార్ణవమ్।
భక్తానాం విఘ్నహర్తారం వందే సాయిగణాధిపమ్॥

2. దేవదేవం మహాదేవమాశుతోషం కృపాకరమ్।
కైలాసవాసినం నిత్యం వన్దేహం సాయిశంకరమ్॥

3. అయోధ్యాజానకీనాథం దణ్డకారణ్యచారిణమ్।
వాల్మీకికోకిలైర్గీతం సాయిరామం భజామ్యహమ్

4. భక్తాన్ పుత్రవదాలోక్య ప్రసన్నాం జగదంబికామ్।
దుర్గాం విశంభరీం దేవీం వన్దే సాయీశ్వరీం సదా॥

5. మథురాద్వారకాధీశం సుదామ్నః సహపాఠినమ్
గోపగోపీసఖం కృష్ణం సాయిశ్యామం భజామ్యహమ్

6. అజ్ఞానజం తమో ఘ్నన్తీం దిశన్తీం వచనామృతమ్
దివ్యజ్ఞానం దాపయన్తీం వన్దే సాయి సరస్వతీమ్

7. ప్రశాన్తినిలయావాసం పుట్టపర్తిపురీశ్వరమ్।
షిరడీసాయిరూపం త్వాం వన్దేహం సత్యసాయినమ్॥

8. అటన్ చిత్రావతీ తీరే కల్పయన్ కల్పపాదపమ్।
చారయన్ కృష్ణవద్గావః సాయిగోప! నమోస్తుతే॥

9. అన్యాయాక్రాంతి సంత్రాస దురాచార నివారణైః
భువో భారం హర్తుకామం సాయిరామం సదా భజే॥

10. అధ్యాత్మనాదగాంభీర్యం బోధయన్తం జనే జనే
నయన్తం తమసో జ్యోతిః సత్యసాయినమర్చయే ॥

11. స్వభక్త హృదయావాసం భక్తసంకట హారిణం
భక్తానాం శంకరం దేవం భజేహం సత్యసాయినం ॥

12. యే రోగా భిషజోవర్యైర్న శక్యా ఉపచారితుం
యత్కృపాతః క్షణే శాన్తాస్తం వందే భిషజాం గురుం ॥

13. యదిచ్ఛామాత్రతోమూల్యం రత్నం చోత్పద్యతే క్షణాత్
యః సర్వజ్ఞస్త్రికాలజ్ఞస్తస్మై లీలాత్మనే నమః ॥

14. ప్రాచ్యదర్శనప్రత్యర్థం వృందావన నివాసినం
శివశక్తిస్వరూపాయ సాయిబాబాత్మనే నమః ॥

15. సత్య ప్రేమ దయా శాన్తి శివ సున్దర విగ్రహమ్ ।
సత్యనారాయణం వన్దే వన్దే వన్దే పునః పునః ॥

ఖట్మండు
నేపాళదేశము

లేఖక :
సూర్యనాథ సువేదీ

తనకు తెలుసునంచు తత్త్వంబు సర్వంబు
విరవీగరాదు విబుధుడెపుడు
తెలిసికొన్నదంత ఆచరించుట చాలు
నీతిమార్గగములు నిత్యవిధులు.

బాబా

# వాక్య విభూతి

సత్యసాయి స్వామి వేదాన్నీ శాస్త్రాన్నీ సమర్థిస్తారు. అయితే వారి బలము శాస్త్రము మాత్రము కాదు; శాస్త్రానికి ఏది బలమో అదే వారి బలము. ఎంతో మంది శాస్త్రనిష్ణాతులు మాట్లాడిన తర్వాత వారి ఉపన్యాసాలు ఉపదేశాలు శాస్త్రసముద్రము మీద వెన్నెల వెలుగుల్లాగ మెరుస్తూనే వుంటే, వారి బలము శాస్త్రాని అదెట్లా వుతుంది? వెన్నెలదే అది ఆ వెన్నెలను మనకు మెరిపించేవి వారి వాక్యాలు. బాబా రచించిన గ్రంథాలలో నుంచి యాదాలాభంగా ఎంచితేనే, అచ్చయిన అయిదు వందలు కాక ఇంకొక మూడు వందల దాకా చేరేయి. వీటిలో వారి ఉపన్యాసాలలో కనబడిన వని చెప్పిన గుణములన్నీ వున్నాయి. ఇవి కాక శాస్త్రము చెప్పే సాధన, సంపత్తీ కర్మ భక్తి యోగముల జ్ఞానముల వివరణ కూడా వున్నది, స్వామి ప్రత్యేకముగా చెప్పే సత్యధర్మ ప్రేమ శాంతి తత్వాలు న్నాయి. అన్నిటిని మించి దేశికాగ్రజులైన బాబా గారి ఆధ్యాత్మిక సంస్కార ప్రబోధము, నది వేగము వలె, అంతటా ముందుకు నెట్టేటట్లు వున్నది. వారు తీసి ' ఇచ్చిన ప్రసాద విభూతి వంటిదే ఈ వాక్య విభూతి. వారి సాన్నిధ్యములో విభూతి చేసే పని, వారి ఉపన్యాసాలలో ఈ వాక్య విభూతి నెరవేర్చుతుంది.

ఈ వాక్యముల వెలుగును సత్యసాయి మేధా రాజ్య విభూతికి రాజధానిగా స్వీకరించుకోవడము, వారి బోధామృతము మనకు చెఱకు రసపు చూఱలుగా, ఉన్నది ఉన్నట్లుగానే, అందని నష్టమును కొంత భర్తీ చేసుకోవడమే ననిపిస్తుంది నాకు. ఆ నమ్మకము తోనే వాటిని వివరించే యత్నము చేసాను.

' జీవితముమూడు నాళ్ల ముచ్చట. ఒక రైలెక్కిన వాడు నిద్రపోతున్నా ప్రయాణము చేస్తూనే వుండేటట్లు మనము ఏమీ చెయ్యక పోయినా అయుః ప్రమాణము క్షణక్షణానికి తిరుగుతునే వుంటుంది—ఈ స్వల్పమైన ఆయుః ప్రమాణములోనే దివ్యసుఖమును చవి చూడవలెను ; అందుకు సామర్థ్యము మానవునికున్నదన్నారు. యేది జరిగినా జరగకున్నా చావు అనునది జరుగక తప్పదు; చచ్చువాడు పిడికెడు మట్టి అయినా వెంట తీసుకొని పోడు అన్నారు శ్రీవారు. నీవు ఈ దేహము కాదు : అందరిలోనూ వుండే పరబ్రహ్మమే. అందరిలోనూ నేను నేను అంటూ వుండేదే బ్రహ్మము. ' మానవునకు అన్నీ తెలియును కాని తానెవరో తెలిసికో లేకున్నాడు, అది తెలిసిన ఇక తెలిసికోగలిగినది వేరొకటుండదు. ఆలాగ సర్వేశ్వరుని పొందు భాగ్యము ఒక మానవునికే తప్ప వేరు ఏ ప్రాణికి లేదు. మానవుడు పుట్టడమన్నది మరి పుట్టకుండా వుండేందుకు, చచ్చేది మరి చావకుండ వుండేందుకు, మానవుడుగా వచ్చావు కనుక మాధవుణ్ని సాధించు ' అన్నారు.

' పరమాత్మని వదలి ప్రకృతి వెంట పోతే సర్వనాశమే సంభవిస్తుంది, పాండవులు కృష్ణపరమాత్మను కౌరవులు సైన్యమును కోరినారు. కృష్ణుని కోరినేనే

జయము ' అన్నారు. ' ఎక్కడ చూచినా కనిపించే వన్నియు పరమాత్మని స్వరూపమే ; ఏది విన్నను, అన్నియూ పరమాత్మని నామమే, ఏది అనుభవించినా అన్నీ పరమాత్మని శక్తులే: మానవ జీవిత లక్ష్యమే దీనిని తెలిసికోవటము. అయినా అహంకారమే ఆత్మ ప్రకాశమును మరుగుపరచుచున్నది. అహంకారము నశించెనా అన్ని బాధలు తొలగిపోవునన్నారు. మరచిన తన సత్యస్వరూపమును తిరిగి సంపాదించు కొని, మానవుడు సహజానందమును అనుభవించు మార్గమే సాధన మార్గమన్నారు. ' ప్రతి ఒక్క మానవుడూ పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందే తీరాలి. కొంత సామర్థ్యమును మనుష్యునకు పరమేశ్వరుడు ప్రసాదించినాడు' ' ఒక్కొక్కరికి ఒక్కొక్క శక్తి సామర్థ్యాన్ని ఇచ్చినాడు. దానిని సద్వినియోగము చేసుకొనే స్వాతంత్ర్యము వ్యక్తికి ఉన్నది. అ భగవత్ప్రసాదమును పాడు చేయ కూడద'న్నారు.

జీవుడు ఎప్పుడూ జీవుడుగానే ఉండిన, ఇంక సాధన (అన్నది) ఎందుకు ? జీవుడు - శివుడు, వీరి ఏకత్వమే సత్యము.' ఎన్ని జన్మములెత్తినా కట్ట కడపటికి జీవబ్రహ్మైక్యము అయ్యేతీరాలి. పిల్లి పిల్ల ఏడు చోటులకు మారితే గాని కన్నుతెరవదట మనిషి ఎన్ని గర్భవాసములు చేసినా కన్ను తెరవడు ; నిజము తెలియకుండా చచ్చిపోతే పునర్జన్మమే గతి. ఈ జన్మములోని మీ అనుభవములన్నియు పోయిన జన్మముల అనుభవాల వల్ల వచ్చినవే ?' అన్నారు. మీ దుర్గుణాలే మీకు కష్టములు తెచ్చిపెట్టేది, మీరు చేసే మోసాలు అనాచారాలు అసత్యాలు అక్రమాలు ఇంకొకరికి చెందక మీ వెంటనే వస్తాయి అన్నారు. ' కనుక అణాల కన్న గుణాలే ప్రధానము, జన్మ జన్మాంతరముల నుండి యెంతో కృషి చేసి దాటి వచ్చిన పశు స్థితికి తిరిగి దిగజార రాదు' అన్నారు. ' ఇహలోక జీవితము వంతెనపై ప్రయాణము ; ఎవరూ వంతెనపై ఇల్లు కట్టుకోరు, ' ప్రాపంచిక బంధములు అంటకట్టుతునాయి ' అంటాము పొరపాటుగా మనమే అంటకట్టుకుంటున్నాము' అన్నారు. మన ట్రాన్సిస్టర్ రేడియో మన చంకలోనే ఉండాలి, కైవల్యము మన ఒడిలో పడాలి అంటే పడునా ? అన్నారు చేప ఎల్లప్పుడు నీటిలోనే నివసించినా, దాని దుర్వాసన ఏమైన శుభ్రము చేసికొన్నదా? ' నాలుకతో చేయు నాలుగు పాపములు : అసత్యము, పరదూషణము, చాడీలు చెప్పుట, అమితముగా మాట్లాడుట, చేస్తూ పరుల తప్పులు వెతుకుచూ, లోని దేవుని మరచి సర్వాలంకారములు సర్వసేవలు దేహాలయమునకే చేసుకుంటూ, భోగమయ జీవితములో మునిగియున్నంత వరకు పరమాత్మ దూరముగానే ఉండును జనన మరణ చక్రములోనే తిరుగుతూ పశుస్థితికి దిగజారును' అని అన్నారు.

" ప్రాప్తి పై భారము వేసి వూరకుండుటలో ప్రయత్నలోపమున్నది. తిని మ్రింగు నట్టి కర్మను నీవు ఆచరించక, గుజ్జు నాకు ప్రాప్తి లేదని ఏడ్చుట ఎంత వెఱ్ఱితనము ? " ' కొండలో పడియున్న బండ భగవంతుని స్వరూపముగ మారి, దేవాలయములో ప్రతిష్ఠింప బడి లక్షల కొలది భక్తుల ఆరాధనకు ఆధారమవుతుంది 200, 300 రూపాయలు విలువగల గడియార మంతా ఒక రూపాయి వెల గల ఇనుము నుంచే చేసినారు. ఆ ఇనుప ముక్కకు సక్రమ రీతిగ సంస్కారములు జరుపడము వల్ల ఆది స్థితినుంచి గడియారముగ తయారైయినది.' అట్లనే పశుసమాన మయిన మానవుడైనా, సాధన అనే సంస్కారము వల్ల, పశుపతిగా మారును. మానవత్వమును మాధవత్వములో జేర్చు యత్నమే సాధన.

తర్కించి కాలాన్ని మీరు వృథా వ్యయము చేయ కండి. రేపు చేయవలెనను సాధన నేడే, నేడు చేయ వలసిన సాధన ఇపుడే ప్రారంభించవలెను. జీవిత ము నందు రాగములో పడితే రోగమే ఆవరించును. సాధనను ఎపుడైనా ఏ దినమైనా ప్రారంభము చేయ వచ్చు. ఎట్టి స్వభావములనైననూ ఊహలు అభ్యాస ముల మార్పువల్ల మార్చుకొనవచ్చును. మీరు చేయు ఏ సాధనయూ నిష్ప్రయోజనమని తలంచవద్దు, ఒక బండ ఇరువదవ సుత్తి దెబ్బకు పగులవచ్చు. అయితే ఆ ఇరువదవ ఏటుకు మాత్రమే బండ పగులలేదు. మొదట వేసిన పందొమ్మిది దెబ్బలు తుది విజయ మునకు తోడ్పడినవి. వివేక విచక్షణలతో సాధనను మొదలు పెట్టండి, భగవంతుని అనుగ్రహము మీ పైన అప్పుడే వెలుగుతుంది. తుప్పు పట్టిన ఇనుమును అయస్కాంతము ఆకర్షించన్ట్లు, తనలో మాలిన్యముం డిన భగవంతునిపై ఆవేదన పుట్టదు భగవంతుని పై దృఢ నమ్మకముంటే ఆవేదన కలుగుతుంది. భక్తితో పరమాత్మని తలంచువాడు ఎట్టి ప్రారబ్ధ సంచి తములైనా దాటగలడు. పరమాత్మను చేరుటకు వారి వారి సాధనా ప్రాప్తి ప్రధానము కాని, వేరే తెగలు అడ్డురావు. ప్రయత్న ప్రార్థనలు లేక, ప్రాప్తి దయా రెండునూ లభించునవి కావు. శ్రద్ధ, ఇచ్ఛ ఉండ వలెను గాని కర్తవ్యము నడచుకొనుట కష్టము కాదు. సాధకులలోని ప్రయత్నలోపములే కాని దేవునకు పాపులనీ, పుణ్యులనీ, జ్ఞానులనీ, అజ్ఞానులని భేదము లేదు. సాధనతో అన్నియును సమకూరును. యేకాంత ములోనే ఉండవలయునని యేమీ లేదు. అనేకాంత ములో కూడ యేకాంతమును అనుభవించవచ్చు.

భగవంతునియందు దృష్టిని నిలుపు శక్తి లేక పోయిననూ భగవత్ ప్రియమైన కర్మలను చేసి ధన్యుడు కాగలడు. ఈశ్వరుడు అందరియందు ఆత్మ స్వరూప ముతో ఉన్నాడు. ఎవరికి చేసిన సేవ అయినా ఈశ్వరుని సేవయే కదా? కర్తవ్యనిర్వహణమైన మానవ సేవ కూడా భగవత్ పూజయే. మీరు చేసే సత్కర్మలన్నియూ మీ సుఖసంతోష సంతృప్తికి కాక భగవంతుని ప్రసన్నుని గావించే నిమిత్తము కావలెను. ఏ పని చేసినా భగవంతునికి ప్రీతి అయ్యేటట్లు చేయ వలెను, స్వామిని ప్రసన్నుని చేసుకొనుటకు యెన్ని సత్కర్మలాచరించు చున్నాము, యెటువంటి నడవడి నడుచుకొంటున్నాము, అని చూడాలి. నేడే సత్కర్మలను సర్వేశ్వర సేవను ఆచరించాలి; రేపు మీది కాదు.

"చేతనైన పరోపకారము చెయ్యి. రోగుల సేవలు చెయ్యి. సరిసమానముగా వుండేవారికే సేవ చెయ్య లేకపోతే, సర్వేశ్వరునికి ఎట్లు చేస్తారు? దేశసేవ దేవుని సేవయే. అయితే పేరు ప్రతిష్ఠలకు సంఘ గౌరవములకు చేస్తే అది మాధవ సేవ కాజాలదు. దేహజ్ఞప్తితో మానవుడు ఏమి చేసిననూ స్వార్థము కాక తప్పదు. దేహ జ్ఞప్తితో నిస్వార్థ సేవ మానవుడు ఏ నాటికి చేయలేడు. ఏమంటే దేహజ్ఞప్తి వుంటే ఆ సేవాఫలమును గురించిన, చేసిన దానిని గురించిన యోచన ఉంటుంది. అందరు భగవంతుని బిడ్డలను భావమును స్థిరము చేసికొని, భగవంతుని సర్వ భూతాంతరాత్మగా దృఢపరచుకొని, అతనిపై సంపూర్ణ విశ్వాసము కలిగిన 'నిస్వార్థ' సేవ చేయునే కాని అవి లేనప్పుడు అహంకారము ఆడంబరము యెంత త్రోసిననూ అది అంత యూ కదలదు. పరులయందు పరమాత్మ భావముంచి సర్వ కర్మలు భగవదర్పితమనవలెను. అన్ని పనులను భగవంతుని యొక్క పనిగానే భావించాలి. కర్తవ్యకర్మలను భగవత్ప్రీత్యర్థముగా, భగవదారాధనగా నిర్వహించ వలెను. ఈశ్వరార్పణ చేయుట అనగా ఇదియే,? ఇవన్ని స్వామియొక్క వాక్యవిభూతులు.

# మార్గదర్శకులు

శంకరాచార్యుల వారు ప్రకృతి జీవుడు పరమాత్ముడు అంతయూ ఏకత్వముగా ఒక పరమాత్మ తత్వమే కాని వేరు వేరు కాదని నిరూపించినారు. ఒకే పదార్థము, ఒకే యదార్థము మూడుగా కనుపించును, అంతే, అని, స్పష్టము చేయుట కొరకు ఒక కొబ్బరి కాయను ఉదాహరణముగా తీసుకొన్నారు. పైన పీచు, లోపల చిప్ప, అంతర్భాగమునందు కొబ్బరి అని ఇవి మూడు కూడనూ ఏక రూపముగా నిలిచిననూ, కాయ ఒకటే. ఇంద్రియ విషయములైన, దృశ్య ప్రపంచము నందున్న, సకల చరాచరములు వస్తువాహనములు ఆస్తిపాస్తులు అన్నీ, పైనున్న పీచుకు సమానమే. పాంచ భౌతికమై, మలమూత్ర మాంసములతో చేరినవయిననూ, దివ్యత్వమున కాధార రూపమైన దేహము, చిప్ప! ఆత్మస్వరూపమై నిర్మలమై పవిత్రమై దాహమును తీర్చే శక్తిగల జల సహితముగానున్న కొబ్బరేపరమాత్మ. మూడూ బ్రహ్మత్వమే అని శంకరుడు వెల్లడించినాడు. ఏకమేవ, రెండు కాదు, లేదు, అద్వితీయం అన్నాడు. సర్వం బ్రహ్మమయం జగత్, అని ఉపదేశించినాడు. ఇదంతా ఏడవ శతాబ్దములో జరిగినది.

అయితే సామాన్య జనులకు అద్వైత తత్వము సరిగా అర్థము కాలేదు. వారి మనస్సులలో అది కొంత వికలత్వము చెందుచూ వచ్చినది. ఇంద్రియముల బంధనములో బాధపడే వారికి ప్రజ్ఞానం బ్రహ్మ, తత్వమసి, అహంబ్రహ్మాస్మి, అనే మహా వాక్యములు అర్థం కాలేదు. పదములనుచ్చరించుట, నేనే బ్రహ్మము అని చెప్పుకోనుట సులభము కానీ, ఆ సాయుజ్య పదవిని గుర్తించి గురినందుకొని ఆనందించుటము అతి కష్ట సాధ్యమయినది. ఇట్టి పరిస్థితులలో భక్తి ప్రపత్తులు క్షీణించుట సంభవమని భయపడి 11వ శతాబ్దములో రామానుజాచార్యులు విశిష్టాద్వైతమును ప్రబోధించిరి. అద్వైతమునకు వారు కొంత విశిష్టతను కల్పించిరి. జీవుడు బ్రహ్మము యొక్క అంశమని నిరూపించి, సారూప్య స్థానమును అన్ని సాధనల లక్ష్యముగా ప్రబోధించిరి. సాయుజ్యమనిన, నీటిలోనీరు, తైలమందు తైలము, లీనమైనట్లుగా జీవ బ్రహ్మైక్యము కావడము. సారూప్య ప్రాప్తియందు భక్తి ప్రపత్తుల వలన, జీవుడు అంగాంగ భావముతో, లీనమైననూ కొంత విశిష్టతతో వేరుగా నున్నట్టు వ్యవహరించును, అని బోధించినారు.

తరువాత, 13వ శతాబ్దమందు మధ్వాచార్యులు బయలుదేరి, జీవునికి దేవునికి సాయుజ్యము కానీ సారూప్యము కానీ యెన్నడూ కుదరదని, దానికి వీలు లేదని, ప్రకటించినారు. జగత్తు జీవుడు ఈశ్వరుడు వీటికి శాశ్వతమైన భేదములున్నవని, మానవత్వాన్ని పరిశుద్ధము చేసిన యోగులకు సాలోక్యమే పరమ లక్ష్య ప్రాప్తి అని, ప్రబోధించిరి. దీనివలన, చాలామందికి ఆధ్యాత్మిక మార్గము ననుసరించి తమ అభిలాషలను పొందుటకు మార్గ మేర్పడినది. ఈ దర్శనమునకు ద్వైత దర్శనమని పేరు.

అయితే, ఇవి మూడూ జగత్ కల్యాణము కొరకు, మానవోద్ధరణ కొరకు బయలుదేరినవే కానీ వేరు కాదు. కాయము కాలము కర్మము వీటిని పరిశుద్ధ పరచి, భావము చిత్తము అంతఃకరణము వీటిని ఉపాసనా మార్గమందు ఉపయోగ పెట్టవలెననునదే వారి ఉద్దేశ్యము. కాబట్టి, ఇవి పరస్పర విరుద్ధములు కావు. శంకరులు కూడ ఉపాసనా మార్గమందు ప్రజలకు ఉత్సాహము నందించి తద్వారా భక్తి ప్రవత్తుల నభివృద్ధి చేయుటకు దేవతాస్తోత్రముల నెన్నియో రచించిరి. వారు స్థాపించిన పీఠాధిపతులు కూడా దైవారాధన చేయుచు, ప్రజలకు మార్గదర్శకులుగా కర్మమార్గమును అనుసరించు చున్నారు. అద్వైత ప్రబోధలకు ఉపాసనా మార్గము కర్మమార్గములు తోడు నీడగా వుండునని వారి అభిప్రాయము.

శ్రీవారి దివ్యబోధ నుండి.

## అయితే—బాబా!

తమతమ రూపములందే రూపములేనట్టి
నిన్ను గాంచినవారలు ధన్యులు;
తవ పాదాంబుజ దివ్యస్పర్శమును
పొందినవారలు ధన్యులు నిక్కము!
మరి నీ వాగమృతధారల వీనులవిందుగ
గ్రోలినవారల ధన్యత ఎంతో!
తమతము బాధల భయములనన్నిటి
పరితాపములన్ తమకర్పణగావించుక
శాంత్యానందములను కానుకగా పొంది
వరసఖులే యైనవారు ధన్యులు కారా!!
తమ అవతార మర్మమును "మానుషం
తనుమాశ్రితం" బను రీతిని గ్రహియించిన
వారల పూర్వపుణ్యఫలమెంతో!!
కాని, బాబా! పుడమిపైగలరెందరో
సంశయచిత్తులు, అజ్ఞతావాదులు
అంధులు దూరదృష్టి లేనట్టివారలు,
దైవము లేదనువారలు, భీరులు,
దైవము దూరెడివారలు, దుర్బలులు,
ఆత్మ సత్యమునె అవలింపుగొనజాలని
వారలు గలరెందరో భూమికి భారముగా—
వారలనాదరమున పిలువవా?
మేలుకొనుటకే ధైర్యములేనట్టి స్వప్న
జాలములో వారలు చిక్కుకొందురా?
వారల 'మహతోభయాత్' నుండి
కరుణ జూపి దయతో కావగరావా?

డా॥ హరిపాద చక్రవర్తి

# నడవండి ముందుకు!

జులై నాల్గవ తేదీన 'పూర్ణచంద్ర' విశాలమందిరములో వేలాది భక్తులు క్రిక్కిరిసి కూర్చొని ఉండగా భగవాన్ బాబా వేదికనలంకరించి ఉన్నారు శ్రీవారి సమక్షములో మాజీ గోవా గవర్నర్ శ్రీ నకులసేన్ భక్తులనుద్దేశించి యీ విధముగా ప్రసంగించినారు.

"ఇది ఒక మహత్తర సన్నివేశము. ఈనాడు మనము గురుపూర్ణిమ జరుపుకుంటున్నాము ఇది వ్యాసుడు జన్మించిన దినము కూడ. నేడు మనము వ్యాసునే కాక, వారిద్వారా భారతదేశ సద్గురు కులము నంతా గౌరవించుచున్నాము. భారతదేశమున కొక్కటే మతము: అది ప్రేమ మతము. కాబట్టి వ్యాసుడు ప్రపంచ మంతటికి గురువు. ప్రపంచము కూడా యీ పరిణతికే త్వరత్వరగా సమీపించుచున్నది. ఈ కారణము పురస్కరించుకొని భగవాన్ శ్రీ సత్య సాయిబాబా ఈ ఉత్సవమును జరుపుచున్నారు. అందు చేతనే, మనము "గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః, గురు సాక్షాత్ పరబ్రహ్మ, తస్మై శ్రీ గురవేనమః" అని వర్ణించుచున్నాము.

భారత దేశములో జనించిన మహా యోగులలో వ్యాసుని స్థానము అత్యున్నతము. వ్యాసుడే కనుక మానవాళి అభివృద్ధికి మార్గమును, వారి ప్రవర్తనకు నియమనిబంధనలు నిర్ణయించకున్న, మన జీవితము లే విధముగా ఉండేవో ఆలోచించుటకే నా శరీరము జలదరించుచున్నది.

వైదిక విజ్ఞానములోని వైవిధ్యములన్నింటిని వ్యాసుడు సమన్వయము గావించినాడు. పండితులలో త్రయీవిద్యలో నిష్ణాతులైనవారు, చతుర్వేదములను నమ్మినవారు. అధర్వ వేదము కూడ సాంప్రదాయకమై పూజనీయమైనదని భావించువారు, దానికా స్థానము లేదు, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదములు మూడు మాత్రమే అధికారికమైనవని వాదించువారు ఉన్నారు, వ్యాసుడు ఈ వేద సాహిత్యములో ఉన్న స్తోత్రములు మంత్రములు, ప్రోగుచేసి, సరిచూచి, పరస్పర సంబంధము కనుగొని, వాటన్నింటిని నాలుగు వేదములుగా విభజించినాడు. అందుచేతనే అతనికి వేదవ్యాసుడనే సార్థక నామము లభించినది. వేదముల లోని అంతర్భాగములైన జ్ఞానకాండ ఉపనిషత్తుల లోని ప్రధానాంశములన్నింటికి, ఆయా సిద్ధాంతములకు ఉన్నత స్థితిని కలిగించి, వాటన్నింటిని సూత్రీకరించి బ్రహ్మసూత్రములుగా సంకలనము గావించిన మహా మేధావి వ్యాసమహర్షి.

పరమార్థ తత్వమును సులభముగా అర్థముచేసికొనజాలనివారి కొరకు, వ్యాసుడు మహాభారతము, భాగవతములనే భక్తి భరితములైన పురాణములు కూడ రచించినాడు. సర్వధర్మ, సత్యవేదాంత సారమైన భగవద్గీత మహాభారతములో వర్ణించబడినందున, వ్యాసుడు మానవాళికే సర్వోత్తమ ఉపదేశికుడైనాడు.

ఈ పుణ్య దినమున మనకిక్కడ, జగద్గురువు, సర్వ లోక రక్షకుడు, అనన్యుడైన భగవాన్ బాబా యొక్క

దర్శన భాగ్యము లభించుట చేత మనమందరము ధన్యులమైనాము భగవాన్ బాబా సర్వశక్తిమంతుడు. సర్వజ్ఞుడు, అనంత ప్రేమమూర్తి ; సత్యమే మానవుని జీవితసారమని బోధించుచున్నారు. బాబా సర్వ జీవులకు జీవనప్రదాత, కర్త, ధర్త, భర్త, బందువు, సఖుడు ".

గురుపూర్ణిమ దినమున గురువును పూజించి భక్తితో కొలుచుట విహితకర్మగా భావించబడినది. అందు చేతనే, భారతదేశమునందన్ని దూర ప్రాంతముల వారు. శ్రీలంక. అమెరికా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా ఇంగ్లాండు యూరపు ఖండవాసులు, షుమారు 15000 మంది భక్త జనులు, నేడిక్కడ సమావేశమైనారు. ఉదయ సమయమున, వీరందరు పూర్ణచంద్ర లో బారులు తీర్చి కూర్చొని ఉండగా, బాబా మెల్లగా ఆ పంక్తుల మధ్య సుందర సురుచిర దివ్య మందహాసముతో నడచుచూ వారందరికి లడ్డు ప్రసాదముగా పంచి పెట్టి, పాద నమస్కారముల నను్రగహించి నారు. భక్తులందరిని తృప్తి పరచునప్పటికి రెండు గంటలకు పైగా పట్టినది

సాయంత్రము ఐదు గంటలకు భక్తులందరు తిరిగి ఆ విశాల సభాస్థలిలో సమావేశమైనారు శ్రీ నకుల సెన్ పౌర్ణమియొక్క విశిష్టతను గురించి మాట్లాడినారు. 'బృందావనము' లోని శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థి కమల్ సహని, పెద్దల ప్రోత్సాహముతో, ఆ కళాశాలయొక్క ఆదర్శములను గురించి ముచ్చ డించినాడు బాబా విద్యార్థులందెంత అనురాగము కలిగి ఉన్నది వివరించంగా భక్తజనుల హృదయములు పులకించి పోయినవి. అతడీ విధముగా చెప్పి నాడు: 'నేడు మనకున్న కొరతలలో సద్గురువుల కొరత ముఖ్యమైనది. భారతీయ యువకుల నుత్సాహ పరచి, ప్రోత్సహించి, వారి ఉద్రేకముల కొక మార్గము చూపించి, వారి కోరికలను పరిశుద్ధ పరచి, వారికి గమ్యమును చూపించువారు చాలా అరుదైనారు. భగవాన్ బాబాయే భారత యువలోకానికి అన్నింట తోడునీడగా, తల్లి తండ్రిగా, బంధువుగా సఖుడుగా, ప్రభువుగా, పరమాత్మగా ఉన్నారు. మురికి కూపములలో కొట్టుకొని పోతున్న మా అందరికి దారి చూపించి, ప్రశాంతి లోకమునకు గొనిపోతున్నారు ఉత్తమోత్తమమైన శాంతి విశ్రాంతులు మాకు బాబా యొడిలోనే లభించినవి మేము పాదముల్తైతే, వారు మార్గము ; మేము భూలోకమైతే, వారు సురలోకము ; మేము కన్నులమైతే. వారందు లోని వెలుగు ; మేము కర్ణములమైతే, వారు దివ్య గానము. మాకింకెవ్వరూ అవసరము లేమి ; ఇంతకన్న ఉత్తమమైనది మరేమీ మాకు తెలియదు పరాయి సంస్కృతిని, వారి హావభావములను అనుకరించుట ఎంత అసంబద్ధమో మా కన్నులు తెరపించినారు. ఈ కళాశాల నన్నెంతగా మార్చినదంటే, నేడు నా తల్లి నన్ను చూచుకొని గర్వించుచున్నది. నే నీ కళాశాలకు రాకముందు నా భవిష్యత్తును గురించి, నా ప్రవర్తనను గురించి ఎంతో ఆందోళన చెందుతుండేది. భారతయోగి పుంగవులు నిర్మించిన సనాతన ధర్మ పథము వెంట బాబా మమ్ము నడిపించుచున్నారు. దీనితో మానవుడే మాధవుడని గ్రహించినాను '.

తరువాత భగవాన్ అక్కడ సమావేశమై ఉన్న వేలాది భక్తులను ఆశీర్వదించి, ప్రతివానియొక్క ఆధ్యాత్మిక భావములోని అంగము, సంగము, జంగము, లింగములను గురించి విశదీకరించుచూ మాట్లాడినారు; మానవాళి కల్యాణము కొరకు, శాంతి కొరకు ప్రార్థించమని చెప్పినారు : "సర్వం ఏకంసత్ " అన్ని రూపములు తానేననీ, తానే అన్ని రూపములని తెలియ జేసినాడు.

చివరకు భగవాన్ కొన్ని భజన పాటలు తన మంజుళగళ మెత్తి పాడగా భక్తులందరు తన్మయత్వముతో ప్రతిచరణము అందుకొని పాడి ఆనందించినారు.

5 వ తేది ఉదయము భగవాన్ విశాలసైకతస్థలిలో కూర్చొనిన భక్తుల వరుసల మధ్య తిరుగుతూ, రోగులను, ముదుసలులను, దుఃఖితులను, దీనులను తన అనుగ్రహ ప్రసాదముకొరకెన్నుకొనినారు. దీనము మూర్తీభవించిన ఒక ముదుసలి తల్లి యొడిలో 11 సంవత్సరముల వయస్సు గల బాలుడొకడు పడి ఉన్నాడు ఆమె అస్సాము రాష్ట్రములో యీశాన్య సరి హద్దు భాగమైన కచార్ ప్రాంతములో ఒక టీ ఎస్టేటులో పని చేసుకుంటున్నది. ఆ పిల్లవాని పేరు కమల్ కుమార్ పురోహిత్. అతని కండరముల బలహీనత వలన గత 6 సంవత్సరములనుండి లేచి నిలబడ లేడు. కొందరు సహృదయులు పుట్టపర్తియందు భగవంతుడు సత్య సాయి బాబాగా అవతరించినాడని, ఆతడార్తులను కాచి రక్షించి ఆదరించుతాడని, ఆ పిల్లవానిని ఆతడే రక్షించ గలడని ఆమెతో చెప్పినారు. వైద్యులు కూడా ఆ బాలుడు ఎంతో కాలము జీవించడని చెప్పినందున, ఆమె తన కుమారునితో, ఎంతో శ్రమపడి పుట్టపర్తి చేరి, భగవానుని దివ్య సమక్షమునకు రాగలిగినది.

బాబా వానికి చేయూతనిచ్చి లేపగా, రెండడుగులు కూడా వేయలేక పడిపోయినాడు. కొందరు స్వచ్ఛంద సేవకులు వాని సహాయమునకు ముందుకు రాగా బాబా వారితో ఆ బాలుని తాకవద్దని చెప్పి, ఆ పిల్లవానిని తన దివ్య హస్తముతో నిమిరి, వానిని 'వెళ్లు' అని ఆదేశించినారు. ఎటువంటి సహాయము లేకుండా ఆ బాలుడు 20 మీటర్ల దూరములో ఉన్న పంచలోనికి, పదివేల మంది భక్తులు చూచుచుండగా, ఏ తొట్రుపాటు లేకుండా నడచి వెళ్లి అక్కడ ఉన్న తోటివారితో కూర్చొనినాడు !! ఈ అద్భుత మహిమను కన్నులార గాంచి భక్తులు ధన్యులైనారు. తరువాత తల్లితో ఆ బాలుని స్వామి 'కోరికలగది' లోనికి పిలిచినారు. తల్లి వానిని ఎత్తుకొను అవసరము లేక పోయినది ! తల్లి భారము తీర్చి స్వామి వాని పాదముల మీదనే వాని భారముంచినారు ఇది మరువరాని సంఘటన. భగవంతుని ప్రేమ ఎంత అగాధమో భక్తులు గ్రహించ కలిగినారు.

బాబా మరి మూడు దినములు భక్తుల రోగములు కుదుర్చుతూ, వారిని ఓదార్చుతూ, ఉత్సాహ పరచుతూ సలహాలిచ్చుచూ గడపినారు. అజ్ఞానాంధకారము, అసమానత్వము, అన్యాయము లెక్కడెక్కడ నాటుకొని ఉన్నవో, వాటిని సర్వకాలములందు, సర్వప్రదేశములందు తొలగించుటకు అవతరించిన పరమాత్మయే అని, గురుపూర్ణిమనాడు స్వామిని దర్శించిన భక్తులందరికి వ్యక్తమయినది.

— సంపాదకుడు

# భగవదనుగ్రహము

మే నెల 11వ తేది ఉదయము 11 గంటల సమయము. ధర్మక్షేత్రమంతా హడావిడిగా ఉన్నది. వేలమంది భక్తులు అక్కడ నిర్మించిన పెద్ద పెండాలు అంతా నిండి ఉన్నారు. బాబా ఏతెంచే విమానము కొరకు తలలెత్తి చూపులు నిగ్గుడించి ఆకాశమంతా గాలించ సాగినారు. కొందరు తమ ఆశ ఫలించినట్లుగా ఆ విమానాన్ని గుర్తించ గలిగినారు. రైల్వే శ్రామికుల సమ్మెతో, యితర ఆందోళనలతో రాకపోకలు పూర్తిగా స్థంభించిపోయిన పరిస్థితిలో, ఇన్ని వేల మంది బొంబాయిలోని ధర్మక్షేత్రము నే విధముగా చేరుకొన గలిగినారు? హృదయమూ క్రోశించినప్పుడు యాత్రికుడు కొండలనైనా లఘించ గలడు, ఎంత దూరమైనా నడచి రాగలడు! అక్కడ వాతావరణమంతా పవిత్ర భజన ధ్వనితో నిండి ఉన్నది. హోయిగొలుపు సహనాయి ధ్వనులు సత్య దీప సానువులంతా వ్యాపించినవి.

సత్య సాయి సేవాసమతి రాష్ట్ర అధ్యక్షుడు శ్రీసింగే గారి కుమారుని వివాహ సుముహూర్తము వేళకు భగవాన్ అక్కడకు వేంచేసినారు. వధువు కొరకు బాబా మంగళ సూత్రములు సృష్టించి యిచ్చినారు; దోసిడి నిండా అప్పుడే వికసించిన తెల్లని పుష్పములు సృష్టించి వాటిని వధూవరుల శిరముల పై చల్లినారు. తరువాత అక్కడ భజన గావించే భక్తుల మధ్య కొంత సమయము మటు నిటు తిరిగి వారిని ఆనందింప చేసినారు.

ఆ రాత్రి బాలవికాస్ తరగతుల విద్యార్థులు బాబాకు తమ భక్తిని వెల్లడించినారు. స్వామి సన్నిధిలో కొన్ని నాటకలు ప్రదర్శించి, శ్రీవారి అనుగ్రహమునకు పాత్రులైనారు. అంబరీష, రామకృష్ణ పరమహంస జీవితములనుండి ఇతివృత్తములను తీసికొని నారు. శివతాండవము మొదలగు భక్తిపూరితములైన నాట్య ప్రదర్శనములు గావించి అందరి మన్ననలకు పాత్రులైనారు.

12వ తేదిన ధర్మక్షేత్రములో జరిగిన బహిరంగ సభలో బాబా తన దివ్య సందేశ శంఖమును పూరించి నైతికముగా, అధ్యాత్మికముగా అభివృద్ధి చెంది, తద్వారా మానవ జీవితముయొక్క పరమావధిని అర్థము చేసికొన వలసినదని ఉద్బోధించినారు.

13వ తేదిన శ్రీ పి. కె. సావంత్ మొదలయిన వారితో బాబా విమానములో రత్నగిరి వెళ్లి అక్కడ జిల్లాలోని అన్ని ప్రాంతములనుండి వచ్చి వేచి ఉన్న వేలాది భక్తులకు దర్శనమిచ్చి తమ అమృతోపదేశముతో వారినందరిని ఆనందింప జేసి, ఆ రాత్రికే తిరిగి బొంబాయి చేరికొనినారు.

14వ తేదిన భారతీయ విద్యాభవనములో, మహారాష్ట్ర సత్యసాయి ట్రస్టువారు ఏర్పాటు చేసిన భారతీయ సంస్కృతి, అధ్యాత్మిక తత్వమును బోధించు నట్టి వేసవి తరగతుల కార్యక్రమమును బాబాపాల్గొని, అక్కడి విద్యార్థుల శ్రద్ధాభక్తులకు వారిని ఆశీర్వదించినారు.

ఈ వేసవి శిబిరములో 4 మంది విద్యార్థులు, 28 మంది విద్యార్థినులు ఉన్నారు. వీరిలో 58 మంది బొంబాయి నగరములోని వారే. వారి పాత్ర

ప్రణాళికలో, గం॥ 4-30 నుండి 5-1 5 వరకు ప్రణవము జపించుట, ధ్యానము; గం॥ 6 నుండి 7 వరకు యోగాభ్యాసము. ఈమధ్య కాలములో నగర సంకీర్తనము. బోధనా తరగతులు ఉదయము గం॥ 9-30 నుండి 12-30 వరకు, సాయంత్రము గం॥3 నుండి 5 వరకు నిర్వహించబడినవి. స్వామి చిన్మయానంద మూడు దినములు భక్తి, జ్ఞాన, కర్మయోగములను గురించి బోధించినారు. గడిచిన దినము బోధించిన విషయముల సంగ్రహమును ఉదయము విద్యార్థులు తెలియ చేస్తుండేవారు. ప్రతి సాయంత్రము గం॥ 6 నుండి 45 నిమిషములు భజన గావింపబడినది. ఆ తరువాత, రోజు మార్చి రోజు భక్తికి సంబంధించిన లేక యాత్రలకు సంబంధించిన సినిమాలు కాని, లేక పరస్పర పరిచయములు కాని ఏర్పాటు చేయబడినవి.

భగవాన్‌కు సమర్పించిన నివేదికలో, మేము యీ ప్రథమ వేసవి తరగతులను, యీ సంవత్సరారంభములో రాజమహేంద్రవరములో జరిగిన సమావేశము గావించిన తీర్మానము ననుసరించి, మేము నిర్వహించినాము; ఇది ఒక ప్రయోగముగా చేసినాము. బృందావనములో నిర్వహించిన విధానములోనే దీనిని నిర్వహించుట మా ఆశయము. ఏ ప్రతిబింబము కూడ అసలు రూపమునకు సమానము కాజాలదని మాకు తెలియును; బృందావనములో, భగవానుని దివ్య దర్శనము, వారి నిత్య ప్రబోధములు, వారి అనుగ్రహ వాహిని, స్థూలముగా, బౌతికరంగములో నిత్యము దృశ్యమానమగుచుండును.

ఇక్కడ విద్యార్థులకు, భారతీయ సంస్కృతి మీద రెండు, యోగము యోగతత్వశాస్త్రము మీద మూడు, భారతీయ ధర్మశాస్త్రము, నీతి శాస్త్రముల మీద రెండు, హిందూ ధర్మశాస్త్రములను గురించి పదమూడు, హిందూ వేదాంతము మీద ఐదు, బౌతికశాస్త్రములు సాంస్కృతిక నిలువల మీద మూడు, ప్రపంచ మతములు, వాటిలో అంతర్గతముగా ఉన్న ఏకత్వము మీద తొమ్మిది, భారతదేశ మహా యోగులు భక్తుల మీద నాలుగు, ఉపన్యాసములు ఏర్పాటు గావించబడినాయి. ఈ వేసవి తరగతుల నిర్వహణాధికారి డా॥ బ్రహ్మానంద మావింతుర్వే ఏడు సార్లు, యీ ఉపన్యాసముల యొక్క సారాన్ని, తేలిక భాషలో విద్యార్థులకు తిరిగి సుబోధకముగా చెప్పుట ఒక ప్రత్యేకత. ఈ పదిహేను దినములలో బోధించిన విషయములలో వారికి కలిగిన సందేహములను తొలగించుటకు రెండు గంటలు ప్రత్యేకించబడుట మరొక విశేషము.

వారి నివేదికలో ఉపాధ్యాయులయొక్క విద్యార్థుల యొక్క అనుభూతులను గురించి కూడ తెలియచేయబడినది. "ఈ ప్రణాళిక మాకు నూతన జీవితము నిచ్చినది ; నేను తిరిగి యింటికి వెళ్లినప్పుడు మా కుమారుడు భారతీయ సంస్కృతిని, సాంప్రదాయమును తెలిసికొని నాడని నా తల్లిదండ్రులు సంతోషించుతారు; నేనిక్కడకు వచ్చినప్పుడు నాకు భగవంతునియందు విశ్వాసము లేదు, కాని యిప్పుడా విశ్వాసమును దృఢము చేసుకుంటున్నాను ; భగవంతుని గురించిన నా భావములు మారిపోయినవి ; ఇక్కడ నేర్చుకొనిన క్రమశిక్షణను అనుసరించుటకు ప్రయత్నించుతాను." —హాజరైన, ప్రిన్సిపలులు, ఉపన్యాసకులు, అచార్యులు, అందరూ తృప్తిని ప్రకటించినారు. "విద్యార్థులలో కనుపించిన శ్రద్ధాసక్తులు చాలా బాగున్నవి" అని ప్రొఫెసర్ మోఘీగారు చెప్పినారు. విద్యార్థులు అత్యంత సూక్ష్మమైన వేదాంత సూత్రములను కూడ అవగాహన చేసికొనగలిగినారు ; ఇది తప్పకుండా వారియొక్క ఆధ్యాత్మిక చింతనలో చక్కని పరివర్తనము తీసుకవస్తుంది ' అని వి. యస్. షేజి

గారు చెప్పినారు. రెవరండ్ ఫాదర్ జో ఆ్రబియా గారిట్లు చెప్పినారు;'' ఈ యువకులంతా, యిక్కడ వారు పొందిన ఆదరణ ప్రేమలతో ఉత్తేజితులుగా తిరిగి వెళ్లుతారని ఆశించుచున్నాను. వారు తమ జీవితములలో, ఇక్కడ నేర్చుకొనిన ఉన్నతాశయ ములను అచరణలో పెట్టి అందుల కనుగుణ్యముగా జీవించగలరని భావించుచున్నాను.''

దీని తరువాత తమ సంఘమువారు తీసుకొన వలసిన చర్యలనుగురించి కూడా నివేదికలో ముచ్చటించినారు. దీనితో, యీ యువకులంద రిని ఒక నిర్మాణాత్మకమైన కార్యక్రమములో పాల్గొ నునట్లు గావించిన యిక్కడ నేర్చుకొనిన ఉత్తమ ఆశీయములను సార్థకము చేసికొనగలరు.

భగవాన్ విద్యార్థులను చక్కగా ఉద్బోధించినారు. విద్యార్థి అనే పదము ఎంతో అర్థవంతమైనదని, సుఖ శాంతుల నివ్వకలిగిన జ్ఞానము కొరకు ప్రయత్నించి ఆవేదన పొందేవాడే విద్యార్థి అని చెప్పినారు. వారం దరు విషయ అర్థులు కాకుండా ఉండాలని చెప్పినారు. "బృందావనములో తొలకరివానలు" అను రెండు గ్రంథములను ప్రతి ఒక్క విద్యార్థికి అనుగ్రహించి నారు. వారందరు బాబా యొక్క దివ్యదర్శనముతో ఆనందపరవశులైరి. వారందరు, భారతీయ సంస్కృతీ ప్రచారమునకు యోగ్యులైన ఉపకరణములుగా మారినారు.

హిందూ పంచాంగమును బట్టి మాతృ శ్రీ ఈశ్వరమ్మ గారి మృతవార్షిక దినము మే నెల 14వ తేది. అందుచేత భక్తులు ధర్మక్షేత్రములో ఆ దినము అఖండ భజనను ప్రత్యూషమునుండి ప్రదోషము వరకు నిర్వహించినారు. బాబా జ్యోతి వెలిగించి యీ స్మృత్యర్థమైన భజనను ప్రారంభించినారు.

## సంచార వైద్యశాల

అదృష్టవశాత్తు, ఆ దినమందే, సత్యసాయి కేంద్ర ధర్మసంఘ సంస్థవారు, సంచారవైద్యశాలగా నిర్మించిన ఒకజీప్‌కారును బాబా ఆశీస్సులకొరకు తయారుచేయ గలిగినారు. దానికి బాబా యొక్క మాతృ శ్రీ నామము, 'ఈశ్వరాంబ' అని పెట్టినారు. ఆమెయొక్క దీన, దుఃఖితులపై గల దయ, అనునయము, ఆదరణ, ప్రేమ అందరకు తెలిసిన విషయమే. ఈ జీపులో, యక్సరే యంత్రము రోగనిదాన ప్రయోగశాల, ఆధునికమైన దంత పరీక్షా పరికరములు, నేత్రచికిత్సా పరికర ములు మొదలైనవన్నియు ఉన్నవి.

14 వ తేది సాయంత్రము గం॥ 4-45 కు బాబా విమానములో బొంబాయి వదలి బెంగళూరు వెళ్లినారు. బొంబాయి నగరవాసులు బరువెక్కిన హృదయములతో, తిరిగి బాబా మాటయిచ్చినట్లుగా త్వరలోనే దర్శన మిచ్చెదరనే ఆశవలన కలిగిన ఉత్సాహముతో, తమ తమ నిత్య కృత్యములలో నిమగ్నులైనారు.

# ప్రేమ భాష

తరతరాలుగా తండ్రి తాతల నుంచి వచ్చిన అను భవమును పురస్కరించుకొని, సరియైన ఋతువులో వర్షము రావచ్చుననే విశ్వాసముతో, రైతు భూమిని దున్నుతాడు. వర్షము కురిసి భూమి అంతా తడిసిన తరువాత, విత్తనములు నాటుతాడు. అవి మొలకలెత్తి భూమిని చీల్చుకొని పైకి వస్తవి. అతడాలస్యము చేసినా, ఆటంకపరచినా, పంటనెట్ల నురిపిడి చేస్తాడు ? పంటకోతకు సిద్ధమైనప్పుడు వాటిని నూర్చి మోపులు కట్టి యింటికి తీసుకవెళ్లకుంటే, ఆహారపదార్ధములతో వాని గాదెలెట్లా నిండుతవి ?

వర్షము భగవంతుని వరము. చిత్తశుద్ధితో మాన వుడు ప్రార్థించి, భగవంతుని సంతోషింప చేయగలడు, దున్నుట, విత్తనములు నాటుట, కలుపు తీయుట, కోయుట అనే సాధనల ద్వారా భగవదనుగ్రహమును దానికి కావలసిన బలమును పొందవచ్చును.

భగవంతుడు లేని జీవితము ఉపాధ్యాయుడు లేని పాఠశాల, కరెంటు లేని తీగ, ఆత్మలేని శరీరము వం టిది. చలనము లేనప్పుడు, ఏదీ కదలనప్పుడు గోచరము కాని గాలివలె, భగవంతుడు మనలో, మన వెంట, జంట ఉన్నాడు. ఆ విధముగా మనిషిలో, పశువులో, పక్షిలో, చెట్టులో పుట్టలో, ప్రత్యేకము కావటము చేత మనము భగవంతుని చూడగలుగుచున్నాము. ఇప్పటి వరకు విద్యుత్ శక్తి ఎందు కా విధముగా ప్రవర్తించు చున్నాదో, దాని స్వభావమేమిటో, దాని మూల మెక్కడో, ఆ రహస్య మేమిటో ఎవ్వరికి తెలియదు. అయినప్పటికి దానికి అనేక రకములైన ఉపకరణముల ద్వారా, వస్తువుల ద్వారా దానిని అనేక రకములుగా ఉపయోగించుకొని దాని ఉనికిని అనుభవించు చున్నాము.

అదే విధముగా భగవంతుడు సర్వ వ్యాపి ; కానీ మనకు గోచరమైన అంశను బట్టి భగవంతుని స్వభావ మును అర్థము చేసుకుంటున్నాము. పామరుడు భూమి స్థిరముగా ఉన్నదని ప్రమాణము చేసి చెప్పు తాడు. కావ్యములలో భూమి స్థిరత్వమునకు చిహ్నము. కానీ దానికి రెండు విధములైన భ్రమణములున్నవి. ఒకటి ఆత్మ ప్రదక్షిణ, రెండు సూర్యుని చుట్టు ప్రద క్షిణ. ఈ భ్రమణముల వేగము నమ్మశక్యము గానట్టివి. భూమి తన అక్షము మీద గంటకు వేయి మైళ్లపై వేగముతో ఆత్మ ప్రదక్షిణ గావించుచున్నది; సూర్యుని చుట్టు ఆశ్చర్యము కలిగించే టంతటి వేగ ముగా పరిభ్రమించుచున్నది. కానీ మనము చూడ గలుగుచున్నామా?

అదే విధముగా, భగవంతుడు వాస్తవమై ఉన్నప్ప టికి, ప్రతి జీవియందు నిరంతరము ఉపస్థితుడై ఉన్న ప్పటికి, మనము కనుగొనలేక పోతున్నాము. భూమి యొక్క భ్రమణము చూడలేకున్నా, భూమిని, చం ద్రుని, నక్షత్రములను, ఋతువులను, రాత్రిం బగళ్లను, ఆకాశమును చూచి గ్రహించినట్లుగా,

భగవంతుని కూడా, అతని అనుగ్రహ వైభవముల ద్వారా, ఉన్నట్లు మనము భావించవలసి ఉన్నది.

ఈ పరిమితమైన భూమిమీద నేర్చుకొనిన భాషతో అపరిమితుడైన భగవంతుని వర్ణించలేము. జీవియొక్క సారముగా తెలిసికొనుటలోని ఆనందము ననుభవించ వలసినదేకాని.వివరించలేము. మానవునిలో భయాశ్చర్య లక్షణములున్నవి. ఈ లక్షణములే మానవుని, కర్మ యోగిగా, లేక జ్ఞానయోగిగా, భక్తియోగిగా చేయ గలవు. అతడెప్పుడీ ఆశ్చర్యభావములను అణచివేసినా డో, నిరాకరించినాడో, ఆక్షణమే యీహాలౌకిక ప్రపంచము లోని వాంఛాజాలములో చిక్కుకుంటాడు. దానితో 'సత్యం శివం సుందరం' నుండి దూరమైపోతాడు గుప్పెడు బూడిదకొఱకు అమృతకలశమునే కాల దన్నుకుంటాడు.

ఈ నాడు కొందరు కవులు తమ కవిత్వమును మనకు వినిపించనున్నారు. కావున, వారి కళనుగురించి నాలుగు మాటలు చెప్పదలచినాను నేటి కవులు, భగవంతుడేనాడో చచ్చిపోయినాడని, బరువు భార ముగా భావించకపోయినా ఒక అలంకారముగా భావించువారిలో, ప్రథమశ్రేణికి చెందినవారు. చమ త్కారమైన పదజాలముతో, మనస్సునాకర్షించు సమాస ములతో, పైన పంచదారపులిమిన పిండి వంటలు పంచిపెట్టుచున్నారు. ఉన్నత జీవితాశయములను గానీ,లేక జీవితములోని శాశ్వతవర్ణనములను కానీ, వారెన్నడు లక్ష్యపెట్టుటలేదు; వారి కవిత్వము బాహ్య పదార్థములకు, ఇంద్రియ సుఖములకు, అల్ప ధనార్జనకు సంబంధించినట్టిది. అందులో లోతుగాని, సారముగాని కనిపించదు.

నిజమైన కవిత్వము పవిత్రమైన పదజాలములో ప్రకటించుచుంటూ, అంతర్యామియైన దైవత్వము యొక్క పిలుపులోనుండి నిర్గమించుచుంది. ఆ కవిత్వము కవికి పాఠకునకు శాశ్వతానందమునందించు తుంది ఆ కవిత్వము సృష్టిని, సృష్టికర్తను చిన్న చూపు చూడదు. పాఠకుడు పదేపదే చదువునట్లు ప్రేరే పించుతుంది; దానిని చదివి అర్థమును మననము చేసికొనినప్పుడు నూతన భావములు మనోఫలకము మీద ప్రకాశించుతుంటవి. అప్పుడే ఆ కావ్యము విశ్వశ్రేయముకొరకు అన్ని కాలములకొరకు రచించ బడినదవుతుంది.

కవులు తాము భగవంతుని యెదుట కనుగొని, వారందులో పొందిన ఆనందమును, దానికొరకార్తి చెంది యున్నవారందరికి పంచిపెట్టుతారు. ఈ ఆర్తి ఎవ్వని హృదయములో లేదు? ప్రతివాడు భగవంతునియందే ఉన్న స్వగృహముకొరకు బాధపడుచున్న నిర్వాసి తుడే.

సత్కవులు భగవంతుని దరిచేర్చు యాత్రను వేగ ముగా, నిరాటంకముగా, సురక్షితముగా చేయగలరు. కుంటివాడు కాని, గ్రుడ్డివాడు కాని స్వయముగా రేవు దాటలేడు. కుంటివాడు గ్రుడ్డివాని భుజములమీద కూర్చొని దారి చూపించుతూ, ఇద్దరు నదిని క్షేమముగా దాటగలరు. ఒకనికి కన్నులుంటే రెండవవానికి నడిచే సామర్థ్యమున్నది. కవి కన్నులలో అనుభవమున్న ది; వానికి దారి తెలుసు. దారిలోని మిట్టపల్లములను తొలగి వెళ్లుతూ ఇతరులకు కూడ మార్గదర్శకుడు కాగలడు; ఇతరుల కుత్సాహప్రోత్సాహము నివ్వ గలడు

ఇదే విధముగా మానవుడు తనకుతాను జ్ఞానమును సంపాదించుకొనలేడు; అంతరాత్మను కనుగొనలేడు. అటువంటి శ్రద్ధాళువైన సాధకునకు కవి గురువువంటి వాడు. ప్రాచీన ఋషులవలె కవి తన ఉన్నత

ప్రాత్రతను గుర్తించి ప్రవర్తించవలెను. ఈ ఉన్నత స్థానమునకు కావలసిన అర్హతను సంపాదించుకొనవలెను.

నేను మీతో మాట్లాడుచున్నప్పుడు, వ్యాకరణసూత్రములు పాటించుచున్నానా, లేదా, అని చూడను. నా మాటలు హృదయములోనుండి ప్రేమతో ప్రవహించుచున్నవి. హృదయమే ప్రతి మాటను మృదుమధురముగా చేయగలదు. మధుర భావములు, మధుర భాష, మధుర ప్రవర్తన మధురమైన ఫలమునే అందించును. కాబట్టి హృదయమును ప్రేమతో నింపుకొనుము. అప్పుడు హృదయమునుండి నిర్గమించే ప్రతి శబ్దము తేజోబలములతో నిండి ఉంటుంది. ప్రేమను మించిన శక్తి మరొకటి లేదు. ప్రేమవ్యాకరణము శ్రోతల హృదయములలో ప్రవేశించి, వారిని ఆహ్లాదపరచి, వారిచేత అంగీకరింబడి, వారిని కార్యోన్ముఖులుగా చేస్తుంది.

పసివాని తొక్కు పలుకులలో ఏ వ్యాకరణమున్నది? కానీ వాని మాటలు తల్లి ప్రేమకు పాత్రమౌతవి. రామకృష్ణ పరమహంసకు 'పెన్షన్' అనే పదము తెలియక 'పెన్సు' అని పలికినాడు, స్వామి వివేకానందుడు సరియైన పదము నందించగా, రామకృష్ణ పరమహంస, "మాటలలో ఏమున్నది, చెప్పదలచుకొనినది చెప్పినప్పుడది అర్థమయిన చాలు" అని చెప్పినారు. భావము ప్రధానము; భాష పై మెరుగువంటిది. మీరు భావమును జీర్ణించుకొనండి. కవులు కూడ, అందమైన భాషను కాక, నిర్మలమైన భావమును అలవరచుకొనాలి.

నేనందించే భావమును మీరు చక్కగా అర్థము చేసుకొనగలిగిన, మీరు నిజమైన భక్తులుగా, సాధకులుగా తయారు కాగలరు; ఆత్మాభివ్యక్తము గావించుకొనగలరు; నేడు భక్తులనే వారలు లక్షోపలక్షలు! అసంఖ్య రోజురోజుకు పెరిగిపోతున్నది. 'బాబా'ల సంఖ్య కూడా మీరు చూస్తున్నారు. కొందరు నాతో సన్నిహిత సంబంధము కలిగి ఉన్నామని, వారిని నే నమితముగా ఆశీర్వదించినానని, భక్తుల మధ్యకు వెళ్లి ప్రాముఖ్యమునో, ధనమునో సంపాదించుకొనుట కనుమతి పొందినామని చెప్పుకొనుచున్నారు.

నిజమైన భక్తుడటువంటి అసంగతమైన ప్రకటనలు చేయడు; అటువంటి ప్రకటనలు వినడు. భౌతికమైన సుఖములతో నిమిత్తము లేకుండా, నిజమైన భక్తుని విశ్వాసము స్థిరముగా ఉంటుంది. అట్టి భక్తుడు పదార్థము (లౌకికానందము) కొరకు కాక పరమార్థము (ఆధ్యాత్మికానందము) కొరకు ప్రార్థించుతాడు. పాండవులటువంటి భక్తులు. అందుచేత శ్రీ కృష్ణుడు పాండవుల హృదయములందు, వారి రాణి అయిన ద్రౌపది హృదయమందు నివసించితినని ప్రకటించినాడు. ఈ కలియుగములో పాండవులు మానవాళికి చక్కని ఉదాహరణ. మీరందరటువంటి ప్రేమకొరకు కృషి చేయుమని ఉద్బోధించుచున్నాను. నేను ప్రేమావతారమును; మీరు ప్రేమను ప్రకటించునప్పుడు, మీ హృదయాంతరము లందున్న నన్నే మీరు ప్రకటించుచున్నారని అర్థము.

-'శివం' లో శ్రీ బాబా వారి దివ్యబోధనుండి జనవరి 74,

# సుఖినో భవంతు

అనంతమైన జంతువులలో అసంఖ్యాత ప్రాణికోటిలో మానవులు అగ్రగణ్యులనునది అందరికీ తెలుసును ; అయితే, మానవులు జంతువులుగా పశు సమానముగా వున్నంత వరకు పరమాత్ముని సాక్షాత్కరించుకొని జన్మ సార్థకతను పొందుటకు వీలులేదు. మానవుడుగా జన్మించి మాధవుడుగా జీవించి, దివ్యత్వమును సాధించి సంతోషించుటయే, మానవుని లక్ష్యము.

పవిత్రమైన మానవత్వమును సంపాదించి, ఆ విశిష్టతను విశ్లేషమార్గమునందు ప్రవేశ పెట్టడము ప్రథమ అజ్ఞానము. దానిని సాధన మార్గమందు జరిపించి సత్యమును గుర్తించి భయమును దాటుటము అత్యవసరము.

కర్మ తత్త్వము బాగా తెలిసిన వాడు తాను చేసే అన్ని పనులకు ఆ పదమును వాడడు. మొట్ట మొదట, మోహ కర్మములందు మునిగి, తరువాత ధర్మకర్మముల నాచరించి, బ్రహ్మకర్మములో లీనమై ఆత్మ కర్మను, కనుగొనునదే ఉత్తమ జీవితమునకు గుర్తు.

మానవులందు చైతన్యము కలిగియున్ననూ, ఆ చైతన్యము బహురూపములుగా వెలువడిననూ, ప్రేమ యొక్క ప్రకాశమే ఆ చైతన్యమునకు మూలాధారము. ప్రేమ అట్టిది ఇట్టిది అని నిర్ణయించుటకు యెవ్వరి తరము కాదు. అయితే, అంతో ఇంతో ప్రేమలేనివాడు మాత్రము లోకమందు లేడు. మార్గము, వ్యక్తిత్వము, విషయము, వీటిని అనుసరించి, ప్రేమ వివిధ విధములుగా వ్యక్తము కావటము సహజము. అయితే ప్రేమ ఒక జన్యగుణము కాదు ; అది స్వతస్సిద్ధము. దానిని విసర్జించటము సాధ్యము కాని పని ! అది ఆత్మయొక్క పరిశుద్ధ ప్రకాశము. సామాన్యమైన వ్యావహారిక భావ సంబంధములను 'ప్రేమ' అనుట పొరపాటు.

తల్లిదండ్రులు పిల్లలపై, పిల్లలు తల్లిదండ్రులపై చూపు ప్రేమకు వాత్సల్యమనునది సరైన పేరు. భార్యా భర్తల ప్రేమకు ఆ పేరు చెల్లదు ; మోహ మనుట సరియైన పదము. మిత్రులు బంధువులు వీరిలోని ప్రేమ, నిజముగా అనురాగమే కాని, ప్రేమ కాదు. పదార్థములపై వస్తువాహనాల పై పెరిగే ప్రీతి వ్యామోహములకు ఇచ్చు అనవలెను. పరమాత్మునిపై కలుగు పవిత్ర భక్తికి మాత్రమే ప్రేమ అనే పేరు సార్థకము. కానీ, ధనముపై పుత్రులపై, పేరు ప్రతిష్ఠలపై పుట్టే భావాలను ప్రేమగా భావించటము మూర్ఖత్వమే. భగవంతునిపై కలుగు నట్టి ప్రేమయే పరమ పవిత్రము ; అది యెట్టి సమయమునందు కూడ మార్పుచెందనిది. సుఖము. దుఃఖము, ఆనందము ఆదాయము, నిందలు పొగడ్తలు, బాధలు, ఏది వచ్చినా పోనీ. అది క్రుంగదు, తగ్గదు.

కష్టనష్టములను మానవులు పవిత్ర మిత్రులుగా భావించాలి "న సుఖాల్లభతే సుఖం" వెలుతురులో వెలుతురుకు ఏ మాత్రమూ విలువ వుండదు చీకటి

లోనే వెలుతురును ఆశించి పొందుటకు ప్రయత్నించె దము. దుఃఖము తీరిన, అప్పుడు సుఖప్రాప్తి; సుఖము తీరిన, దుఃఖప్రాప్తి ఒకే అవస్థ ప్రారంభములో దుఃఖముగానూ అంతములో సుఖముగానూ తోచును, అంతే; ఒకే సూర్యుడు ఉదయించినపుడు, పగలు! అస్తమించినపుడు, రాత్రి!

మానవుడు ఏకత్వమును దూరము చేసి, భిన్నత్వ మును స్వాగతించి, విక్షేపమునకు విలువనిచ్చి విచార ములో మునిగి తేలుచున్నాడు. అనేకత్వముఉపాధుల వలన కనబడునే కానీ ఉండేదొక్కటే! అన్నిటిలోనూ ప్రవహించి పని చేయునట్టిది ఒక కరెంటే! అయితే కరెంటును ప్రత్యేకముగా చూచుటకు సాధ్యము కాదు, కరెంటు ఉన్నదా లేదా, అని ఉపాధుల ద్వారానే కను గొన వలసియున్నది. ఈ ఫాన్ నిలిచిన, కరెంట్ లేదు! తిరిగితే, కరెంటున్నది, బల్బు వెలిగితే, కరెంట్ ఉన్నది; వెలుగక పోతే, కరెంట్ లేదు. కరెంట్‌ను గుర్తించటానికి ఉపాధి అవసరము.

ఆ విధముగానే, అవ్యక్తమైన పరమాత్మ శక్తికి ఆధేయ భూతమైన ఉపాధి కావలెను; లేకపోతే గుర్తిం చుటకు సాధ్యము కాదు. ఫాన్ "నాకు నేనే తిరుగు చున్నాను" అని చెప్పితే, ఆ మాటను మూర్ఖత్వ మని ఖండించుచున్నాము. లోన ప్రవహించే అదృశ్యమైన కరెంటువలననే అన్ని కర్మలూ జరుగును అని మనకు తెలుసు. అదే రీతిగా, చూచేది కన్నులా? ఆలోచన చేసేది మెదడా? అవ్యక్తమైన దైవశక్తి వాటిలో చేరటమువలన వాటి వాటి కర్తవ్య కర్మలు జయప్రదముగా జరుగుచున్నవి కానీ. వాటికే మాత్రమూ వ్యక్తిత్వము లేదు

'ప్రేమ' అనునది ఆ దివ్య శక్తికి మరొక పేరు మాత్రమే. భిన్నత్వము కానీ భేదభావము కానీ మనస్సు నందు దాగియుండునంత వరకు, ఆ దివ్య ప్రేమ భావము చేకూరదు. ఏకత్వమైన ప్రేమ భావమును, దివ్యత్వమైన ఆత్మ తత్త్వములో లీనము చేయవలెను. అదే పరాభక్తియొక్క చివరి అనుభవము. ఏకత్వము దృఢమైన తరువాత, వేరొకటి లేదు కనుక, తన్ను తానే చూచుకొనుచున్నాడు, తనకు తానే మాటలాడును, తనకు తానే అన్ని కర్మలనాచరించును తనతో తాను కూడి ఆడి ఆనందించుచూ, అనుభవించుచూ వుంటాడు.

ఇట్టి స్థితిని పొందుటము అందరికీ సాధ్యము కాదు. సామాన్య మానవులకు, జ్ఞాననేత్రము లేని వాండ్లకు శ్రీ కృష్ణుడు చెప్పినట్లుగా, (అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితం) మనుష్య దేహము నాశ్రయించి వచ్చిన నన్ను మూఢులు తెలుసుకొన లేరు. ఆకారమును చూచి, మానవుడనే నిర్ణయించెదరు. అయితే నిజ స్వరూపము దివ్యత్వమే దేహతత్వమును గమనింతురు కానీ ఆత్మ తత్వమును గమనించరు. ఆత్మ తత్వమును అవగాహన చేసి కొనిన తప్ప, సర్వభూతాంతరాత్మయగు దైవత్వమును గుర్తించుట దుస్సాధ్యము.

దైవత్వము సులభ గోచరమగుటకు శ్రద్ధ, నిష్కామ కర్మ, మరియు జ్ఞానము, ఈ మూడూ అవసరము. వ్యక్తి భావముతో కర్మలలో దిగక, బుద్ధి చిత్తము అన్నీ ఆత్మాభిముఖము చేసి, కర్మలకు పూనుకో వలెను. కర్మవలన పుట్టు జీవుడు కర్మలద్వారా విడు దలను సంపాదించి కర్మలోనే చనిపోవాలి. కర్మతోనే బంధము; కర్మవలనే మోక్షము. కాబట్టి, కర్మ జిజ్ఞాసయొక్క ప్రథమ సోపానము. కర్మను పవిత్ర భావముతో పరోపకార బుద్ధితో దోషరహితముగా ఆచ రించిన, భవిష్యత్తులో సుఖ శాంతులు చేకూరును

శ్రద్ధ వహించి, ఫలాపేక్ష లేక, కర్మను దివ్య ప్రేరణ ల్లలన ఆచరించవలెను.

ఒక వ్యక్తి తాను సలుపరాని కార్యమునకు పూను కొని దానిలో ప్రవేశించినపుడు, కొన్ని క్షణముల తరువాత, అది సరికాదని, దానివలన పరాభవము అవమానము సంభవించునని శిక్షను పొందవలెనని, హృదయమునుంచి ఆదేశము వచ్చును. దీనిని గమ నించిన, లోపల ఇద్దరున్నట్లు అర్థమగును. చేయుమని చెప్పువారెవ్వరు ? కూడదనే వారెవ్వరు ? దీనిని పురస్కరించుకొని, అంగములో జంగమున్నదని నమ్మ వలసి యున్నది. ఆ జంగము సంగముతో సమూహ ములోనే వ్యవహరించును. నిత్యానిత్య పరిశీలనకు ప్రోత్సాహించునది జంగమే ; ఆ పరిశీలనకు సంగము తోడుగా వుండును

పుట్టపర్తికి పోవలెను అని ఒక కోరిక కలిగితే సంగములోని ఒక ధ్వని తక్షణమే పుట్టపర్తిలో స్వామి ఉన్నాడా, లేక బెంగళూరులోవున్నాడా, కనుగొని బయలుదేరితే మంచిది కదా అని పలుకును. అపుడే మూడవవాడు ఫలానివారికి ఫోన్ చేసిన తెలుసును అని సలహానందించును. నాల్గవాడు, ఏ మార్గముగా ప్రయాణము చేయాలి, బస్సులోనా, కారులోనా, రెయి లా, అని ప్రశ్నలు వేయును. అంగములో సంక ల్పము పుట్టటముచేత, సంగమందు సలహాలు, సందే హాలు, సమస్యలు బయలుదేరుతాయి. మరొకడు, తాను అతి జాగ్రత్తగావున్నట్టు "అక్కడకు పోయిన తరు వాత, స్వామి ఇంటర్వ్యూ ఇస్తారో ఇవ్వరో" అని యోచన చేసుకో, అని ఒక పెద్ద రాయినే నెత్తిన వేస్తాడు! అప్పుడు మరొకడు తనయందు భావస్వరూ పుడుగావుండి, నీవు చేసిన తప్పులను పురస్కరించు కొని, స్వామి పిలువరో, పిలువకుండానే పంపించెదరో అని భయము కలిగించుతాడు. తక్షణమే మరొకడు "స్వామి దయామయుడు కనుక యేమీ భయము లేదు; తప్పక పిలచి ఓదార్చి ధైర్యమిచ్చి పంపుతారు పో" అని సమాధానపరచుతాడు. ఈ విధముగా ప్రోత్సాహమును ధైర్యమును ఆనందమును హృదయ స్థానమునుండి అందించువాడే లింగస్వరూపుడు. ఆయ న కైలాసమందు లేడు, హృదయమందే నివసించి ప్రకాశమును జ్ఞానమును ఆనందమును అందిస్తాడు. అంతర్దృష్టిని అభివృద్ధిపరచినట్లయిన, అంధకారము నశించి అజ్ఞానము తొలగి ఆ లింగస్వరూపుని పొందవచ్చు.

ఈ దినము గురుపూర్ణిమ పండుగ; దీనికి సఫలత మనస్సు పరిపూర్ణస్థితిని పొందుటయే. ఆ పూర్ణత్వము లేక, ఎన్ని పూర్ణిమలు వచ్చినప్పటికి, అజ్ఞానమనే అంధకారము పోదు

గురుపౌర్ణమినాడు కొంత మంది, భౌతిక వ్యాపార ములలోనే కాలము గడుపుదురు. కొంతమంది గురు వుల పూజ చేయుట గురూపదేశము పొందుట ఇట్టి కార్యక్రమములను పెట్టుకొందురు. అయితే, పూజకు గురూపదేశమునకు ఒక సంవత్సరము కాలము వేచి యుండవలెనా? ఇది భక్తిప్రపత్తుల లక్షణములా? కాదు హృదయము ఏనాడు నిర్మలముగా పరి పూర్ణముగా విశాలముగా అపవిత్ర భావాలకు దూర ముగా వుండునో, అనాడే సార్థకత. మనస్సులో పవి త్రతను ప్రేమను నింపుకోవాలి. హృదయాకాశములో నామనక్షత్రములు ఎన్నివుండినా ప్రేమ అనే చంద్రు డు ప్రకాశించనప్పుడు వెలుతురుండదు! ప్రేమ వలనే ప్రకాశము.

సర్వజ్ఞుడు సర్వవ్యాపి సర్వశక్తిమయుడు మీ హృ దయములో నివసించునపుడు మీకేమి తక్కువ?

తల్లిదండ్రుల ప్రేమలో కొంత మమత కనిపించి స్వార్థము చేరి దానిని కలుషితము గావించును తల్లి దండ్రులు కూడ పిల్లలను ద్వేషించి దూరము చేసికొనవచ్చును; మిత్రులు బంధువులు దూరము కావచ్చును. చెరువులో నీరు నిండియుండిన, కప్పలు కోట్లకొలది చుట్టూ వచ్చి చేరును. చెరువు ఎండిన తరువాత, ఒక్కటి కూడా కనపడదు. అట్లనే ధన కనకవస్తువాహనాలున్నంత కాలము మిత్రులు బంధువులు చుట్టూ చేరుతారు; కానీ, అవన్నీ దూరమైతే, వారంతా పరిగెత్తి పోవుదురు. అయితే, నిరంతరము చెంత చేరి కంటి రెప్ప వలె కాపాడునది ఒక పరమాత్ముడే! ప్రేమస్వరూపుడైన జగదీశ్వరుడే!

స్వామిని దర్శించి జీవిత లక్ష్యమును పొందవలె ననే ఆశతో అనేక ప్రాంతములనుండి మీరందరూ ఎన్నో బాధలకోర్చుకొని ఇక్కడ చేరియున్నారు. అయితే, బాహ్యసాధనల కన్న, మీరందరూ రాను రాను అంతర్దృష్టిని అభివృద్ధి చేసుకోవలె ననునదే స్వామి ఆశయము.

నా దృష్టియందు నేను గురువు, మీరు- శిష్యులు, అనే భావమే లేదు, సర్వత్ర సర్వ కాలములందు ఏకత్వమే యున్నది అన్న తరువాత, ఇంక గురువెవరు? శిష్యులెవరు? గురువు తానే! శిష్యుడు తానే! వేరు వేరుగా భావించటము, అజ్ఞానము వలననే! కొన్ని మంత్రములను బోధించిన నంతనే ఆయన గురువు అవుతాడా? ఏదో ఉపదేశము పొందిన తక్షణమే ఈయన శిష్యుడవుతాడా? ఇరువురూ దైవాంశమే! ఇరువురిలోనూ ఆత్మ తత్వ మొక్కటే! గురు భావమున్నతమని గర్వించటము శిష్యభావము హీనమని ప్రసంగించుట ఎందుకూ చెల్లదు. అహంకారము దీనత్వము రెండూ వుండ కూడదు.

చెడ్డయందూ మంచియందూ దైవమున్నాడు. ఒకే దేహము ఆరోగ్యముగా చక్కగా పుష్టిగా వుంటే నీకెంత ఆనందముండునో, యోచించు! కాబట్టి, ఇన్ని దేహములూ నావే, అనే విశాల భావమును పెంచుకొని, అన్ని దేహముల ఆరోగ్యము పుష్టి తుష్టి కొరకు ప్రాకులాడి, వాటి ఆనందమును నువ్వే అందుకొన్న ఎంత హాయి! యెంత తృప్తి! ఎంత సంతోషము! యోచించు అపుడే విశ్వ విరాట్స్వరూపమును ఆరాధించి ఆనందించే అవకాశము కూడ దొరకుతుంది ఒకే స్థానము, ఒకే రూపము, అని భావించటము చాలా సంకుచితము, చిన్నతనము. పరమాత్ముని ఆ విధముగా పరిమితిలో పెట్టితే, ఆయన ప్రతిష్ఠను అపమాన పరచినట్లే! ఆయనను అల్ప స్వరూపుడుగా భావించకూడదు; విశ్వ విరాట్ స్వరూపము గానే భావించవలయును. నా స్వామి, నా పూజ, నా పూజా గృహములో నా స్వామి, నీ పూజా గృహములో నీ స్వామి అని వాదించుట తప్పు. భగవంతుడు సర్వ భూతాంతరాత్మ కాబట్టి, మీరు కూడ సర్వ భూతముల ఆనందాన్ని అందుకొనుటకు పూనుకోవాలి. ఎవరినీ బాధించక, హింసించక, దూషించక, జీవించుటకు ప్రయత్నించాలి.

ప్రేమభావమును పెంచుకొని, "లోకాస్సమస్తా సుఖినో భవంతు" అని హృదయ పూర్వకముగా నిత్యమూ, భగవంతుని ప్రార్థించండి. ఇదే నా గురు పూర్ణిమ సందేశము.

శ్రీవారి దివ్యబోధ, గురుపూర్ణిమ; 4–7–74.

# కస్తూరి తిలకం

శ్రీమత్ క్షత్రియవంశవర్ధనవిధుం, శిష్టేష్ట చింతామణిం
రాజీవాయతపత్రనేత్ర విలసద్రాకేందుబింబాననమ్
కారుణ్యామృతపూరితం, శ్రితజనానందానుసంధాయకం
శ్రీమత్పర్తిపురీశ్వరం, గుణమణిం శ్రీ సత్య సాయీశం భజే ॥

కస్తూరి తిలకం లలాటఫలకే శీర్షేజటాభూషణం
సర్వాంగే బహు భస్మరాగకలయం కంఠేచహారావళిమ్
భవ్యాపాదిత భద్ర ముద్రితకరం కారుణ్యనేత్రద్వయమ్
శ్రీమత్పర్తిపురీశ్వరం గుణమణిం శ్రీ సత్య సాయీశం భజే ॥

నానారూప విచిత్ర లక్షితతనుం నాదానుమోదాత్మకం
నానా వేదపురాణశాస్త్రవినుతం నానాజనైస్సేవితం
నానాదుర్భర రోగవారణప్రణిం నవ్యావతారం ప్రభుం
శ్రీమత్పర్తి పురీశ్వరం, గుణమణిం శ్రీ సత్య సాయీశం భజే ॥

జాటా జూట వినీలకుంతలధరం సన్మందహాసాంకురం
చిత్రాతీర పునీతసైకత విహారామోద సంధాయకం
లీలానిర్మిత చిత్రవస్తునికరం కైవల్య లక్ష్మీప్రదం
శ్రీమత్పర్తిపురీశ్వరం గుణమణిం శ్రీ సత్య సాయీశం భజే ।

సౌఖ్యానందకరైక కార్యరచనా సంకల్ప పూర్ణోదయం
నిత్యారాధక పాపనాశనకరం నిర్వాణసంధాయకమ్
తర్తుం సంసృతివారి భక్తతరణిం తత్త్వార్థ చింతామణిం
శ్రీమత్పర్తిపురీశ్వరం, గుణమణిం శ్రీ సత్యసాయీశం భజే ॥

# పుస్తక సూచి

పుస్తకముల వెలనూ పోస్టు మరియు రిజిస్ట్రేషను చార్జిలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

వెలువడియున్న పుస్తకములు వాటి పోస్టుచార్జిలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 1-25 తో వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| | తెలుగు:— | | |
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-65 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-75 |
| 3 | మణిమాల | 1-00 | 0-25 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-45 |
| 5 | అర్పణ | 1-00 | 0-15 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0 25 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-25 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-65 |
| 9 | వచనామృతము | 4-00 | 0-45 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 1-65 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-35 |

కన్నడ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం[1] | 3-50 | 0-55 |
| 2 | ప్రశాంతివాహిని | 1-50 | 0-25 |
| 3 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 4 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 5 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 6 | జ్ఞాన వాహిని | 1-50 | 0-15 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-45 |

మలయాళము:—

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపదేశరత్నంగళ్ | 1-50 | 0 55 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-15 |
| 3 | వాహోరత్నంగళ్ | 3-00 | 0-65 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-15 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0-15 |

ఇంగ్లీషు:-

| | | | |
|---|---|---|---|
| | భజన సాంగ్స్ (ఇండియన్ ప్రకటన) | 1-50 | 0-25 |
| 2 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-55 |
| 3 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-65 |
| 4 | ప్రశాంతివాహిని | 2-00 | 0-25 |
| | జ్ఞానవాహిని | 2-00 | 0-25 |
| | సమ్మర్‌షొవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0 65 |
| | ,, 1973 | 6-50 | 0-55 |
| 8 | సందేహ నివారిణి | 3-00 | 0-25 |

అరవం:—

| | | | |
|---|---|---|---|
| | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-25 |
| | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-65 |
| | ,, ,, ,, [2భా] | 4-00 | 0-65 |
| | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-45 |
| | ,, ,, [2భా] | 3-00 | 0-55 |
| 6 | సాయిమాతా | 1-00 | 0-15 |
| 7 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 8 | సందేహనివారిణి | 2-00 | 0-35 |
| 9 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 0 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-25 |
| 1 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-15 |

హిందీ:—

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-15 |

గుజరాతి:—

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 2 | కథాసుధ | 2-00 | 0-35 |
| 3 | గీతావాహిని | 4-00 | 0-55 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-55 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-15 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-25 |

అస్సామి:—

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారధి [షార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0-15 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కథ | 0-25 | 0-15 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0-50 | 0-15 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-45 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-25 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-15 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0-25 |

—o-

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరించబడవు.

2. చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5. పత్రికలుగాని పుస్తకములుగాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటి వివరములను పైకముతో పాటు తెలియ పరచవలెను.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు ..9/-74 అని యుండిన, మీ చందా సెప్టెంబర్ నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) సెప్టెంబర్ నెల 8. న తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

M.O. ద్వారా పైకమును పంపించువారు కూపను లోనే కావలసిన పుస్తకముల వివరములను తెలియజేయవలెను.

6. పత్రికకు గాని పుస్తకములకు గాని పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతన సారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50 పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును, వ్రాయని యెడల జవాబులిచ్చుటకు ఆలస్యమగును.

8. పోష్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### —: శ్రీవారి కార్యక్రమములు: —

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు మేనేజరు 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెరువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్

ఏకత్వ జ్ఞానమును బోధించునట్టిదే అద్వైతమనియు; ప్రేమించువాడు జీవుడు, ప్రేమింపబడునట్టివాడు బ్రహ్మము అనే తత్త్వము ద్వైతమనియు; ప్రేమ, ప్రేమించువాడు, ప్రేమించబడునట్టివి ప్రకృతి జీవుడు బ్రహ్మ (మూడూ వేరైనా విడదీయలేము) అన్న తత్వమును ఆచరించునదే విశిష్టాద్వైతమనియు చెప్పనగును.

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 సెప్టెంబర్, 1974 సంచిక 7

## విషయానుక్రమణిక

# దసరా మహోత్సవము

స్వస్తి శ్రీ ఆనంద నామ సంవత్సరము, ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి (16-10-74) మొదలు విజయదశమి (25-10-74) వరకు, ప్రశాంతినిలయమున, భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యసన్నిధిలో, మహా పవిత్రమైన దసరా మహోత్సవము, వేద పురుష సప్తాహ జ్ఞాన యజ్ఞముతో, అఖిలభారత ప్రశాంతివిద్వన్మహా సభలతో, మహావైభవముగా జరుగును.

ఉదయాది స్వస్తి, ప్రణవకీర్తనము, మంత్రానుష్ఠానములు, హోమము, ఏకాదశ రుద్రాభిషేకము, వేదపారాయణము, శ్రీమద్రామా యణ శ్రీమద్భాగవత శ్రీ దేవీభాగవత పారాయణములు జరుగును.

నిత్యమూ సాయంత్రము 4 గం॥ నుండి 7 గం॥ వరకు ఆధ్యా త్మిక ప్రసంగాలు, రాత్రి 8 గం॥ నుండి హరికథ పాటకచేరి నాటకములు బుఱ్ఱకథ ఇత్యాది కళాప్రదర్శనములు జరుగును.

కావున, ఆస్తికులూ భక్తులూ సహృదయులూ తప్పక విచ్చేసి, ప్రశాంతినిలయ దివ్యవాతావరణమున క్రమశిక్షణలను పాటించుకొని, మహాసభలలో పాల్గొని, శ్రీవారి దివ్య దర్శనానందము నందుకొని, వారు అనుగ్రహించు సందేశములయొక్క అమూల్యలాభమును సంగ్రహించు కొని త్రికరణశుద్ధితో ఆచరణకుశలురై ఇతోధిక అభ్యుదయశ్రేయముల నొందుదురు గాక.

(ఆయా రోజుల కార్యక్రమ వివరాలు ప్రశాంతినిలయమందు ప్రచురింప బడును.)



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 56

### జనక మహారాజు బోధ

తదుపరి నిషాదపతిని అతని పరివారమును చూచి శ్రీరాముడు అతనిని సోదరునికన్నను మిన్నగా కౌగలించుకొని అతని వియోగ దుఃఖమును అనేక విధముల వోదార్చుచూ బోధను గావించి నంత గుహుడు చేయునది లేక రామ పాదములకు నమస్కరించి గుండెలను బండలుగా చేసుకొని వెనుకకు తిరుగుచూ పయనము గావించెను

వారందరు వెళ్లువంతవరకు సీతా రామలక్ష్మణులు ఒక వృక్ష చ్ఛాయ యందు నిల్చొని వుండిరి. ఇంతలో జనక మహారాజు తన పరివారముతో వారునూ బయలుదేరిరి. అంత రామలక్ష్మణులు, అత్తమామలకు నమస్కరించిన తోడనే, సీత తల్లిదండ్రులకు నమస్కరించెను. ఆమెను తల్లిదండ్రులు కౌగిలించుకొని శిరస్సును ముద్దాడి, "అమ్మా నీ సాహసము, నీ పతిభక్తి మాకు కీర్తి తెప్పించినవి. నీ వలననే మా వంశము పావనమైనది, ఇట్టి పుత్రికను కన్నందుకు మేమే జన్మమున యే నోము నోచితిమో దాని ఫలమే ఈ నాడిట్టి కీర్తిని అందుకోగలుగుచున్నా"మని ఆమెను అనేక విధముల వర్ణించి, "నీ కెట్టి కొరతయూ వుండదు. రామచంద్రుడు నీకు ప్రాణము. అతని ఛాయయందుండు నీ కే కొరతయూ వుండదని మాకు తెలుసు. అయినను ఉపాధి భేదముచే ఇట్టి సమస్యలు అప్పుడప్పుడు కలుగుట దైవలీల," అని అనేక విధముల వేదాం

తమును బోధించి, వారునూ, వారి పరివార మును బయలుదేరిరి.

### చిత్రకూటమందు

ఈ వచ్చిన రెండు రాజ్యముల పరివారములు పూర్తిగా బయలుదేరి కొంత దూరము పోవు వరకు నూ సీతా రామలక్ష్మణులు ఆ వృక్ష చ్ఛాయయందే నిలుచుండి వారు అక్కడ నుండి పర్ణశాలకు వచ్చి చేరి భరతశత్రుఘ్నుల భక్తి శ్రద్ధలను వారి ప్రేమ ఆదర్శములను గురించి, ప్రజల యొక్క అభిమానములను గురించి అనేక విధము లుగా రాములు చెప్పుచుండ, సీతా లక్ష్మణులతి శ్రద్ధతో ఆలకించుచూ వారి మెడబాటునకు కొంత యోచించుచూ మధ్య మధ్య తమ తండ్రియైన దశరథుని మరణవార్తను హెచ్చరించుచూ, కొంత కృతజ్ఞతా రూపమైన ప్రేమను అర్పించుచూ కంట నీరు పెట్టుచుండిన సీతా, లక్ష్మణులను చూచి, రాములు చిరునవ్వుతో వారలకు జీవిత రహస్యములను బోధించుచూ ఈ రీతిగా ఆ నాడు కాలమును గడిపిరి.

### తిరుగు ప్రయాణము

మునులు, బ్రాహ్మణులు, ఋషులు, భరత శత్రుఘ్నులు, కౌసల్యా, సుమిత్రా, కైకేయాది రాణులు, మంత్రులు, ప్రజలు, రాముని వియోగ మును సహించలేక చింతాక్రాంతులై గడచిన అయిదు దినములలో రామలక్ష్మణ సీతాది త్రిమూర్తులు చూపిన ఆదర్శమును, వారి ప్రేమ, కరుణ, దయారసమును, వారి వాగామృతమును తలంచుకొంటూ, ఆహార నిద్ర లన్నది మరచి రాత్రి పగలని తలంచక మార్గమునందెందునూ నిలుపక ప్రయాణము సాగించుచూ, రెండవ దినమున గంగా నదిని దాటిరి.

అక్కడ నిషాదపతి, ఆ పరివారమునకు తగిన భోజనాదులు యేర్పాటు చేసెను. కానీ రామ లక్ష్మణ సీతా వియోగమున దుఃఖించుచున్న వారగుటచే యెవ్వరునూ యేమీ ఆరగించలేదు. ఏదో గుహుని తృప్తి నిమిత్తమై అందరూ ముట్టి పార వేయుచూ వచ్చిరి.

కడకు గుల్మములు సహితము మేత మేయ లేదు, నీరు త్రావలేదు. ఈ దృశ్యమును గమ నించిన వశిష్ఠుల వారు, శ్రీరాముడు సర్వ భూతాంతరాత్మ, తానే సర్వ భూతములందు ప్రజ్ఞాన స్వరూపుడై చైతన్యము నందించు చున్నాడని అందరికి బోధించుచూ వచ్చెను.

తిరిగి వారెక్కడను విశ్రాంతి తీసుకొనుటకు అంగీకరించక సరాసరి అయోధ్యకు చేరవలెనని భరతుడు సంకల్పించుట చేత, రామచంద్రుని పవిత్ర పాదుకలను ప్రజలకు చూపి ధన్యులను గావించవలెనను ఇచ్ఛచేత ప్రయాణమును కొన సాగించిరి. మూడవ దినము సరయూ నదినీ, గోమతిని దాటి నాలుగవ దినము అయోధ్యా నగరమును సమీపించిరి.

### అయోధ్యావాసుల ఆతురత

ఎప్పుడు భరతశత్రుఘ్నులు, రామలక్ష్మణ సీతాదేవి సహితముగ అయోధ్యను ప్రవేశింతురా అని కన్నులు కాయలు గాచినట్లు కాచుకొన్న ముసలి బ్రాహ్మణులు, స్త్రీలు, పిల్లలు, వారి రక్ష

ముల శబ్దములు వినగనే వీథులలో ప్రవేశించి "రామచంద్ర ప్రభు వెక్కడ, యెక్కడ" అని ఆతురతతో అన్ని రథములనూ చూచుచూ వచ్చిరి. కాని కొంత చీకటి పడటము చేత, తెల్లవారి చూడవచ్చునను ఆశతో కొండంత ప్రేమతో కాచుకొని యుండిరి. తెల్లవారి లేచిన తోడనే సీతా రామలక్ష్మణులు రాలేదనియూ వారి పాదుకలు మాత్రమే అయోధ్యను చేరినవనియూ విని కొంత ఆశ, కొంత నిరాశలకు గురి యయిరి.

ఇంతలో భరతుడు గురువు గారిని మంత్రులను రప్పించి రాజ్య సూత్రముల నప్పగించి తగిన రీతిగ వారికి నచ్చ చెప్పి, శతృఘ్నుని పిలిచి తల్లుల సంరక్షణార్థం, నీవు తగిన చర్యలు తీసుకొనవలెనని బోధించెను. బ్రాహ్మణులను, పండితులను పిలిపించి చేతులు జోడించుకొని నమస్కరించి, "మీ ఆజ్ఞ ప్రకారము నేను నడచుకొందును, గొప్పవయినను చిన్నవయినను మీరు శంశయించక మీ కోరికలను తెలుపుడు, వాటిని నేను నెరవేర్తును," అని తెలిపెను.

పాదుకా పట్టాభిషేకము

ప్రజలను పిలిపించి దేశీయులను సమావేశ పరచి తగినట్లు వారికి తెలిపి, రాముని సంభాషణల సారాంశమును ప్రజలకు వినిపించి ఈ పదునాలుగు సంవత్సరములు మనము రామ పాదుకలే మన అందరి రక్షగా భావించి, పాదుకలే పరిపాలన చేయుచున్నవన్న లక్ష్యమును అందరి హృదయములందు తలంచి మనము రామ చింతనతో జీవించవలెను. తదుపరి శ్రీరాముడు మనకు ప్రభువుగా నిలచి ప్రత్యక్ష పరిపాలన కొనసాగించును, ఆ ప్రియ దినమునకై మనము కాచుకొనుటే మన కర్తవ్యమని తెలిపెను. గురువు, పండితులు, ఋషులు, పురోహితులు, మంత్రులు, పుర ప్రముఖులు, ప్రజలు అందరి ఆనందమును పురస్కరించుకొని అందరి అభిప్రాయములను అందుకొని రామ పాదుకలను సింహాసనమున ప్రతిష్ఠించుటకు తగిన ముహూర్తమును నిర్ణయించుకొని ఆ ఉత్సవమునకు తగిన యేర్పాట్లు మహా వైభవముగా గావించెను. ఆ వైభవమును పూర్తి చేసుకొని తల్లులైన కౌసల్యకు, సుమిత్రకు, కైకకు, నమస్కరించి, పాదుకలను శిరస్సున దాల్చి, తన సర్వ బాధ్యతలు పాదుకలే పరిపాలించునని నమస్కరించి, గురువు అనుమతిని పొంది, నంది గ్రామమునకు వచ్చెను.

నంది గ్రామము

ఆ ధర్మధురంధరుడు, ఆ ధైర్యశాలి ఆ గ్రామములో ఒక చిన్న పర్ణశాలను నిర్మించుకొని, రామలక్ష్మణులు ధరించినట్లుగా జడలను ధరించి మునుల వల్కలను ధరించి భూమిలో ఒక చీకటి బిలమును త్రవ్వుకొని ఆహారపానీయము లందును, వస్త్రధారణయందును, మునుల వలె కఠిన వ్రతమును పూనెను. దేవేంద్రుడు కూడ కొనియాడెడి అయోధ్యా నగర భోగములను, కుబేరుడు కూడ కొనియాడెడి భాగ్యమును, తృణప్రాయమని తలంచి భరతుడు వైరాగ్యముతో ఆ పల్లెయందు ఆ పర్ణశాలలో ప్రకాశించి పరులకు కనుపించక, రామచంద్రుడు అయోధ్యను చేరు వరకు తానెవ్వరిని చూడనని ప్రతిజ్ఞ పూని రామచంద్రుని రాకకై తాను రామ చింతనే

చేయుచు కాలము గడుప జొచ్చెను. ఆతని దేహము అను దినము దుర్బలమయ్యెను. అతని తేజస్సు, బలము అధికమయ్యెను. ముఖ వర్చస్సు దేదీప్యమాన మయ్యెను. రామ భక్తి దిన దిన ప్రవర్ధమాన మయ్యెను. మనస్సు పరి శుద్ధమైన పాలుగా మారెను. తారాగణములు హృదయాంతరాళమున ప్రకాశించెను.

## జయంతుడు

భరతుడు ఈ రీతిగా నంది గ్రామమున రామ చింతనాయత్తుడై యుండ, చిత్రకూట పర్వతము పై నివసించుచున్న సీతా రామలక్ష్మణులు, భరతుని భక్తి ప్రపత్తులను కొనియాడుతూ కాలము గడుపుచుండిరి. ఇట్లుండ, చీమ సము ద్రపు లోతును చూడవలెనని ఆశించినట్లుగా, ఒక మూర్ఖుడు జడుడు అయిన జయంతుడు రామ చంద్రుని శక్తిని కనిపెట్ట వలెనని ప్రయత్నించి, కాకి రూపమును దాల్చి, రామచంద్రునికి సమీప మున కూర్చొని ప్రకృతి సౌందర్యమును తిల కించుచున్న సీత పాదమును సూటిగా ముక్కుతో పొడిచి గాయము చేసెను. అంత సీత పాదము నుండి రక్తము కార ప్రారంభించెను. దీనిని చూచి రాముడు, ఒక గరిక పోచను పెరికి ఆ కాకి పై విసరెను.

అపరాధము లేక రాముడొకరికి హింస చేయడు. సమయ మొచ్చినపుడు రాహువు చంద్రుని కూడా మింగును. కాని, రాముడు నిరపరాధుల నే వా డును హింసించడు. ఆ విసరిన గడ్డి పోచ, మహా అగ్ని రూపముతో జయంతుని పై బడెను. అతనిని వెంట తరుముచూ పోయెను. అంత జయంతుడు భయపడి నిజరూపమును ధరించి "రామా, కాపా డుము" అని పాదముల పై బడి ప్రార్థించెను. రాముడు రక్షించెను. ఆ జయంతుడు ఇంద్రుని కొడుకు. తన కుమారుడు రామద్రోహి అని తెలిసి తండ్రి కూడను చాలా విచారించెను

జయంతుడు రామపాదముల పై బడి నేనొక మూర్ఖుడను, నన్ను క్షమింపుము అని ప్రార్థిం చగా రాముడు వాని దైన్యమును చూచి జాలిపడి వానిని యేకాక్షునిగా జేసి విడిచిపెట్టెను. అగ్ని రూపమైన ఆ గడ్డిని తాను ఉపసంహరించు కొనెను. రామచంద్రుడు అల్ప శిక్షతో తనను వదలెనను కృతజ్ఞతను చూపుచూ ఆ జయంతుడు చాలా కాలము సీతా రామలక్ష్మణులు నివసించు చిత్రకూట పర్వతము పైననే నివసించుచూ వచ్చెను. రాముడు మార్గ శీర్ష శుద్ధ దశమినాడు ఆ జయంతుని పిలిచి, దక్షిణ దిశకు ప్రయా ణము కమ్మని ఆజ్ఞ చేసెను.

## అత్రిమహర్షి ఆశ్రమము

అంత సీతా లక్ష్మణులు రామాజ్ఞ శిరసా వహించి, ముగ్గురు చిత్రకూట పర్వతము విడచి అత్రి మహాముని ఆశ్రమము చేరిరి. అంత వీరి రాకను శిష్యుల ద్వారా తెలుసుకొని అత్రి మహా ముని యెదురేగి వారిని తన ఆశ్రమమునకు తోడ్కొని పోయెను. రామ ఆగమనముతో అత్రి మహాఋషి, ఆనందమును భరించలేక కంటధారలు కార్చుచూ తనజన్మ పావనమైనదని అనేక విధముల చేసిన తపస్సు నేటికి ఫలించిన దని ప్రార్థించి, రాముని స్తుతించెను,

ఆ నాటి సాయంకాలము అత్రి మహాఋషి తమ శిష్యులను చేర్చి, రామునకు ఉన్నత

ఆసనమును యేర్పరచెను. అత్రిమహాముని భార్య అనసూయ సీతకు తగిన యేర్పాట్లు గావించి సీతకు తగిన సేవలు చేయుచు యేనాటి నోమో నేటికి పండినదని తాననూ ఆనందించగా అచట కూడిన శిష్యులకు అత్రిమహాముని సీతా రామ లక్ష్మణుల పవిత్ర శక్తులను, అవతారములను, వర్ణించి ప్రబోధించెను.

అంత అనసూయ తన పతిభక్తిని, స్త్రీ ధర్మ మును అనేక విధముల సీతకు తెలుపుతూ ఆమె ఆదేశములను అందించమని ప్రార్థించుచూ, సీతయొక్క గుణగణములను వేనోళ్ల కొని యాడెను. అంత సీత లోకమున జన్మించిన ప్రతి ప్రాణి, ప్రతి జీవి, ప్రతి భూతము స్త్రీ తత్వము కలవారనియూ, జగన్నాటక రంగ మునకు స్త్రీ పురుషులుగా కనుపించిననూ బల తత్వాలలో, భావరాగాలలో, కష్టసుఖాలలో అందరూ స్త్రీలేననియు, తన భర్తయైన రాము డొక్కడే పురుషుడనియు. ఆయన యందు ద్వంద్వ భావములు యేనాటికి లేవు, రావు అనియు, అతడు అభయ స్వరూపుడనియు, ప్రకృతికే పురుషుడై ప్రకృతిని వరించినాడ నియు వివిధ నామరూపములతో గోచరించెడి ఈ జగత్తు యేకాత్మ స్వరూపమే ననియూ అనసూయ కు రామ తత్వమును చక్కగా ఉపదేశించెను.

(సశేషము)

## గొలుసు ఉత్తరాలు

కొందరు బుద్ధిహీనులు భక్తులను బెదరించుతూనో లేక వంచించటానికో గొలుసు ఉత్తరాలు వ్రాస్తుంటారు. హృదయదౌర్బల్యమువలన కొందరు వాటిలో చెప్పినట్లు తిరిగి వ్రాస్తుంటారు. బాబా పేరుతో వచ్చే అటువంటి ఉత్తరాలను విస్మరించవలసినదని చాలా సార్లు మేము లోగడ ప్రకటించి ఉన్నాము. కొన్ని ఉత్తరములు వ్రాసినంతమాత్రాన భగవదనుగ్రహము లభించదు; వ్రాయకున్నంతమాత్రాన లభించకపోదు. కొందరు పాఠకు లిటువంటి ఉత్తరములు మాకు పంపి మా సలహా అడుగుతున్నారు. ఇటు వంటి ఉత్తరాలకొక్కటే జవాబు—వాటిని చించి చెత్తబుట్టలో పారవేసి ఇతరులకు కూడా అదే సలహా యివ్వండి.

—సంపాదకుడు

# పూజా పుష్పాలు

భక్త మందార ! వందనావాహనముల
సుందరానంద హృదయారవింద మందు
నిన్ను కూర్చుండ బెట్టి గుండె పులకింప
పూజ చేసికొందును చిన్ని పూల తోడ !

[భూపాల]

ధ్యానము :—

వందే సత్య శివ స్వరూపం జనగురుం వందే విభూతి ప్రదం
వందే దివ్య దయానిధిం గుణవిభుం వందే ప్రశాంతి ప్రభుం
వందే మౌళి జటాధరం శుభకరం వందే మహాదేవదం
వందే భక్త వర ప్రదం భవహరం వందే మహా మోక్షదం ॥

[శంకరాభరణం]

ఆహ్వానము :—

శ్రీ పుటపర్తి పట్టణ విశిష్ట కళా మధుర ప్రశాంతి సౌ
ధో పరివాస ! మంత్ర రుచిరోజ్వల కాంతి విలాస ! షిర్డికా
య్యాపర దివ్యసుందర మహా మహిమోచిత మందహాస ! లో
కోపకృతి ప్రభాస ! కయికొమ్మవె మంజుల స్వాగతాంజలుల్ !!

[వసంత]

రత్న సింహాసనం :—

ఓ సుకుమార సుందర శుభోదయ నవ్య శిరీష పేశల
శ్రీ సఖ కోమలాంగ ! దయసేయుము ! నీ కరుణాకటాక్ష వి
న్యాస విలాస భాసురత లందము చింద — రవంత రమ్ము సిం
హాసన మేర్పరించితి మనోజ్ఞమునన్ ప్రభు ! విశ్రమింపగన్ ॥

[భాగేశ్వరి]

అమల పాద్యము :—

నేటికి పండె నా తపము — నిండె మనోరథముల్ కృపాబ్ధి ! ఆ
నాటి గుహున్ వలెన్ కరుణ నాపయి నింపుము గోరువెచ్చ క
న్నీటి మరంద బిందువులనే వడగట్టి త్వదీయ పాదముల్
వాటముగా ప్రభూ ! కడిగి వైచెద గుండెలు పుల్కరింపగన్ ॥

[వలజ]

విమల అర్ఘ్యము :—

భక్తుల వీపులన్ నివిరి భవ్య సుఖం బొనగూర్చి — వెన్నలా
సక్తిగ బెట్టి — వేణువు హుషారుగ బట్టి — మహాత్మకోటికిన్
ముక్తినను గ్రహించి అనుమోదము గూర్చు జనాళికెల్ల అ
వ్యక్త సుఖాస్పదం బభయ హస్తమునన్ విమలార్ఘ్యమిచ్చెదన్

[కాఫీ]

శుద్ధాచమనము ; ..

నాకధునీ మనోజ్ఞ నళిన వ్రజ గంధ జలమ్ము కంటె – సు
శ్లోక యశస్వి కామ గవి చూచుక దుగ్ధము కంటె మోహినీ
శ్రీకరలగ్న భాండ మధు శీకర పంక్తుల కంటె హే ప్రభో
నా కవితా సుధా రసము నవ్యము ఆచమనమ్ము సేయుమా !

[హంసనాదం]

అమృత స్నానము :—

పావన జీవన వ్రతలు పద్మముఖుల్ – కవిగాత్ర – లాయతేం
దీవర నేత్రలున్ – మృదుల నీరజ హస్తలు బ్రహ్మపుత్ర గో
దావరి నర్మదాది వనితల్ కవితామృత ధారతోడ చి
త్రావతి నంటి వచ్చిరిక తానము లాడుడు హర్షవారిధిన్ ॥

[అమృతవర్షిణి]

అరుణ వస్త్రము :—

" దక్షత కల్గి పౌరసభ ధర్మ మెరింగి మదీయ మానసం
రక్షణ సేయ నెవ్వరును రారు కృపాకర ! బ్రోవు" మన్న నీ

వక్షయ వస్త్ర పంక్తి ద్రుపదాత్మజకిచ్చితివయ్య - దేవతా
ద్యక్ష ! వినూత్న రత్న విమలారుణ వస్త్రములన్ గ్రహింపుమా
[సింహేంద్ర మధ్యమము]

యజ్ఞోపవీతము :—

వేద మహార్థములో తెలిసి విశ్వరహస్య మెరింగి చేయు య
జ్ఞాదుల హోత ద్రష్ట స్రుక్ స్రువము యజ్ఞము హోమ హవిస్సు సర్వమున్
నీదరహాస కాంతులచే నివ్వటిలెన్ పుటపర్తి సాయి ! నీ
కేదయినన్ మహాభరణమే ! ఒక జంధ్యమలంకరించెదన్ ॥
[మోహన]

శ్రీగంధము :—

సింధు కుమారికా రచిత సింధుర చందన కుంకుమ ప్రభా
బంధుర హైమతీర్థయుత పాకము కంటె - హిమమ్ము ఓ జగత్
బాంధవ ! నా కవిత్వ ప్రసవ ప్రభ నామల వాసితంపు శ్రీ
గంధ సమర్చ చర్చ - కరకంజములన్ కయి సేతునా ప్రభూ !
[శ్రీరాగము]

పుష్పము - అక్షతలు :—

నందన పారిజాత సుమన వ్రజమందు శచీ పురందరా
నందకర ప్రసూనములు - నామధు మానస సాహితీ వనీ
కుందసుమమ్ములున్ పసుపు కుంకుమ గంధసితాక్షతల్ ప్రభూ
అందము చిందు నీ కువల యాంఘ్రుల కర్చన సేయుమందువా !
[చక్రవాకం]

సుధూపము :—

త్రాణము నీవ ! జంతు నికరంబుల కెల్ల మహానుభావ ! నా
ప్రాణములన్ ప్రభూ ! అగరు వత్తులుగా నొనరించి నీదు క
ల్యాణ పదాంఘ్రి వేదితలమందు రగిల్చి సుధూపమిత్తు - ఆ
ఘ్రాణము సేయుమయ్య కనికారమునన్ జని ధన్యమౌనటుల్ ॥
[సింధుభైరవి]

అఖండ దీపము :—

నీయనుకంప రూపమగు స్నేహము నిండిన నా మనస్సులో
తీయని అందమున్ చిదిపి దీపము పెట్టుదు ఆ వెలుంగులో
మాయయు మోహమున్ మదము మర్మ తమిస్రము లంతరింప వేం
చేయుము మానసమ్మున వసింప దయానిధి ! ప్రేమమూర్తివై ॥

[హిందోళ]

మహా నైవేద్యము :—

సేద్యము సేసి మానసము చెంత భవత్పద భక్తి బీజముల్
హృద్యవసంత వేళ మొలకెత్తి ఫలింపగ చేసినాను – ఆ
పద్య ఫలమ్ము లివ్వి గొనివచ్చితి తీయ్యని వెంచి మంచి నై
వేద్యము పెట్టుదున్ శబరి విందు తలంపున తెచ్చునట్లుగన్ ॥

[చంద్రకోస్]

కర్పూర తాంబూలము : —

బాల తమాలలోల నవ పల్లవ రూప మదీయ భావనా
జాలము – పోక చూర్ణ ఘన సార గుణోత్కర సారభంబు – ము
త్యాలను కాల్చి చేసిన సుధా కవితా రుచి మేళవించి తాం
బూలము చుట్టి యిచ్చెద ప్రభూ ! అనురాగముతో గ్రహింపుమా !

[శివరంజని]

ఆనంద నీరాజనము :—

ఓ జనమానసాబ్జ విమలోదయ సుందర బాలభాస్కరా !
నా జననమ్ము ధన్యము సనాతన సత్య పథానురాగ వి
భ్రాజిత మూర్తి చూపితి వపార ముదమ్మున — నాకవిత్వ నీ
రాజన మిచ్చెదన్ బహు పరాకులు భక్తులు పల్కుచుండగా

[ఆనందభైరవి]

సువర్ణ మంత్ర పుష్పము :—

అంబురు హాసనాది మహితాత్ములు నీ మహనీయ సత్య త
త్వంబు నెరుంగ జాలరు గదా ! పరమేశ్వర ! ధర్మయజ్ఞ దీ

క్షౌంబర ధారి ! శాంతి నిలయా ! దయజూపి సువర్ణ మంత్ర పు
ష్పంబు గ్రహింపుమా ! విజయ సారథివై మము నుద్ధరింపుమా

[రేవతి]

ఆత్మ సమర్పణ :—

నామది పూచినట్టి సుమనాలు సమర్పణ చేసినాను ని
కోమల పాద పద్మముల గోప్యముగా శతవందనాలతో
ప్రేముడి స్వీకరించిన సరే ! అటు కాక తదన్యమైన నా
కేమి ! దయా పయోధి ! ఒనరించితి నేనను కొన్న కార్యముల్

[మధ్యమావతి]

**జంధ్యాల వెంకటేశ్వర శాస్త్రి, "శాంతిశ్రీ"**

భగవంతుడే పవరు హౌసు. అక్కడ నుంచి పవరును దేహము అనే మీ ఇంటికి తీసికొని రావలెనన్న క్రమశిక్షణ అనే స్తంభాలను, పరిమిత కాల ప్రమాణము తప్పకుండ సరిగ్గా నాటుతూ రావాలి. దాని మూలకముగా నిష్కామ కర్మాచరణ అనే వైరును లాగాలి. తరువాత శుద్ధ మనస్సు అనే బల్బును తగిలించి శరణాగతి అనే స్విచ్‌ని ఆనుచేస్తే జ్ఞానమనే దివ్య జ్యోతి వెలుగుతుంది, స్వస్వరూపము తెలుస్తుంది.

—బాబా

# శ్రీవారి ఉపదేశములు

" భగవన్నామస్మరణ చేస్తూ ఉంటే మనస్సులో మాలిన్యము చేరకుండా వుండును, ఆలోచనల అలజడి తగ్గుటకు నామము నుచ్చరించుము. మనోవేదన సమయమందు ఏకాంతముగా కూర్చొని నామస్మరణ చేయుము. పరమాత్మపై దృష్టివుంచి, మనస్సును నామ స్మరణలో ఉంపుట సూర్యకిరణములను భూతదర్పణ మున ప్రవేశపెట్టి ఏకాగ్రత గావించుటవంటిది,

ఎవరైన మాలిన్య పదార్థము పేరు ఉచ్చరించిన కడుపు త్రిప్పును. పుల్లనిపదార్థపు పేరు పలికిన నాలుక నోరూరును. తుచ్ఛమైన వీటి నామములకే ఇంత ప్రభావముంటే ఇక పరమాత్ముని నామములు ఎంత మార్పు చేయించును ?

మీకు ఆత్మానందము నందించే యే భగవన్నామ మైన సరే శ్రావ్యముగా హృదయములోని ఆవేదనతో ఉత్సాహముతో పాడండి. నామముతో భావము కూడా చేరినప్పుడే ఆనందము భగవంతుడు. భావప్రియుడు కానీ బాహ్య ప్రియుడు కాడు

ఇంటి లోపల ఇంటి బయట వెలుతురు కావాలంటే దీపమును గడప మీద పెట్టుతాము కదా ? అట్లనే ఆత్మ కల్యాణము లోక కల్యాణము రెంటిని సాధించా లంటే జిహ్వాగ్ర కవాటములో పరమాత్ముని నామము పెట్టాలి. నీ కిష్టమయిన రూపనామములనే పూజించు. ఇతరుల నిర్బంధములకు గానీ ఇతరుల తృప్తికి గానీ వానిని మార్చకుము. అంత్యకాలములో కాపాడేది భగవన్నామమే. ఈ నాటినుంచి చేసిన కదా అంత్య నిమిషములో ఆ నామము స్మృతికి వచ్చేది ? చిన్న దీపమొకటి పెట్టుకుని చీకటిలో అరణ్యము దాట వచ్చును, సముద్రాన్ని చిన్న తెప్పతో దాటవచ్చును. భవసాగరము నామస్మరణ అనే చిన్న తెప్పతో దాట వచ్చును.

" రామా కృష్ణా అని ఉచ్చరించినంత మాత్రమున లాభం లేదు. దానితో భావము కూడా చేరవలెను. సంవత్సరాల కొద్ది సామాన్య భక్తిలోనే మునిగియుండి విశేష భక్తిని సంపాదించక పోతే వ్యక్తికి అవమానమే. భక్తి అనగా భగవంతునిపై ప్రేమ. అన్నిటికంటె భగవంతుని యెక్కువగా ప్రేమించుటే భక్తియగును. భగవంతునిపై పరమాభిమానము, పరమానురాగము భక్తి లక్షణము. మర్కటకిశోరన్యాయముగా నాచ రించు దానిని భక్తి అనియు, మార్జాలకిశోర న్యాయమైన దానిని ప్రపత్తియనియు చెప్పుదురు.

ఈ ప్రపత్తిలో మూడు విధములు కలవు. ' నేను నీవాడనను మార్జాలకిశోర న్యాయము, నీవు నావాడ వను భక్త స్వాతంత్ర్య భక్తి, నీవే నేను అనే అవిభక్త మైన భక్తి. మీకు భగవంతునిపై భక్తి యున్నదను కొనుట చాలదు భగవంతునికి మీపై ప్రీతి యున్నదా ? ఆజ్ఞను పాలించిన వారికి అనుగ్రహము ఖండితముగా దొరుకుతుంది. అసలు సాధకుడు

దేనిని సాధించవలెనన్నను ప్రార్థనే మూల సాధనము. భగవంతుని అనుగ్రహము సంపాదించితే చాలు, ఆ గ్రహమూ ఏ పనీ చేయదు.

"సగుణ భక్తి నిర్గుణ భక్తి కుడి ఎడమ పాదముల వంటివి. నడచునపుడు నేల పై కాళ్ల వలె రెండూ ఒక టైములో ఉండవు. భక్తియొక్క గమ్యము జీవ బ్రహ్మ ఐక్యమే. అదియు అనుభవముతో చేరినట్టి ఐక్యము. ఇరువది నాలుగు గంటలూ విడదీయక ముప్పై దినములు ఆ పరమాత్ముడే మీ చింతనలో నిండియుండిన తప్పక సాక్షాత్కారము లభించును."

ఇవన్నీ శ్రీవారి ఉపన్యాసాలలోని వాక్యములే. ఈ ఉపన్యాసాలు అన్నీ ఒక చోటివి కాదు, ఒక నాటివి కాదు. స్వామి ఫలాని విషయాన్ని గురించి ఉపన్యసించెదనని చెప్పరు. ఎవరెవరో పండితులూ ఆంగ్ల విద్యాధికులూ ఉపన్యాసాలు చెప్పిన తరువాత చివర మాట్లాడుతారు స్వామి. అంతకు ముందటివారి ఉపన్యాసాలలోని ఒక వూహనో శ్రుతివాక్యమునో పట్టి స్వామి మాట్లాడుతారు.

వారి ఉపదేశాల వలె ఈ వాక్యాలు కూడ ఉరువులే. వారి ఆశయాన్ని పలుమారులు సభలలో చెప్పినారు. 'వేద శాస్త్రాభ్యాసమునకు విలువ గౌరవ మర్యాదలను స్థాపిద్దాము. నేను వచ్చినదే ఆ పనికి' అన్నారు. 'నా విషయము మీకు కొంచెమేనా తెలియవలెనంటే శాస్త్రాభ్యాసమే త్రోవ చూపేది' అన్నారు. "శాస్త్రాభ్యాసమే జ్ఞానదృష్టి సంపాదనకు ఏకైక మార్గము. మానవులకు శాస్త్రమే నేత్రము. శాస్త్రదృష్టిని నేత్ర దృష్టిలో ఉంచుకొని ధర్మమార్గములో బ్రహ్మ మార్గమును ఆశ్రయించుటే మానవుడు చేయవలసిన ప్రయాణము. ఐక్యానుసంధానము కావలెనన్న ఆత్మ విశ్వాసము శాస్త్రవిశ్వాసము రెండూ సర్వవేళలందు ఉండవలెను" అన్నారు.

అయితే "శాస్త్రములు కఠిన భాషలో ఉండటము వలన సామాన్యులకు అర్థము కాక నిష్ప్రయోజనముగా ఉన్నవి. అర్థము చేసుకొనుటలో నానార్థములు చేసుకొన్నచో యదార్థము చెడిపోవును. అనర్థము చేసుకొన్న అసలే చెడిపోవును. యదార్థ శాస్త్రమును అందరికీ అందుబాటులో వున్న భాషలో, సులభమై ఆచరించు విధానము లోనికి మార్చినచో అనుకూలముగా నుండును. శాస్త్రము, వేదము, ఇవి రెండూ భారత దేశానికి రెండు నేత్రముల వంటివి," అన్నారు శాస్త్రవిజ్ఞానాన్ని తాము సర్వత్రా ఉపన్యసిస్తున్నారు.

ఏ సభలోనైనా, అప్పటి సందర్భాన్ని బట్టి, బహుశా ఆ నాటి సభ్యుల సంస్కారాన్ని బట్టి, వారికి ఏది అందించవలెనను కుంటారో దానిని చెపుతున్నట్లున్నారు స్వామి. 'అందరికి ఒకే విషయము చెప్పేందుకు వీలు లేదు కదా?' అన్నారు ఒక మారు నాతో. అందులోనూ గాలి లాగ సంచారము చేస్తున్నప్పుడు, ప్రజల హృదయ మందిరాల తలుపులు తట్టేటప్పుడు, వారి నెత్తిమీద ఎగిరిపోయే సత్యాలు చెప్పితే వారు పట్టించుకోరు. స్థూల మానవులకు స్థూలాధారముతోనే క్రమ క్రమముగా భగవద్విషయములు తెలుపవలెను' అన్నారు స్వామి. వారు ఇచ్చే ప్రసాదము అందరికి ఒకటే కాదు గదా? అలాగే వివిధస్థలాలలో చేసే ఉపదేశ ప్రసాదమున్నూ.

"ఫలము సర్వేశ్వరుని అనుగ్రహము పైననే వేసిన సాత్విక సాధనే ధ్యానము. స్మరణకైతే ఎన్ని నామములు నీకు రుచి అగునో అన్ని నామములు స్మరించు. ధ్యానమునకు ఉపదేశ నామమే ధ్యానించవలెను. భగవంతుని యందుగల గాఢ ప్రేమ

విశ్వాసములే ధ్యానము. ధ్యానసంపద కలుగు నంత వరకు, నిర్ణీత ఆసన క్రమములను అవలంబింప వలయును మనోబుద్ధులు వశమైయున తరువాత, ఎచ్చటైనను ధ్యానము సలుప సాధ్యమగును. తన ఉపాస్య దైవముపై అవధానమును ఉద్దేశపూర్వకముగా నిలుపుటనే చిత్తైకాగ్రత అని అందురు. విషయములను తలంచుచూ ఫలమింకా లేదే అని యోచించు చుండిన అవి కేవలము ఫలాపేక్ష జపము లగును.

చిత్తముయొక్క నిశ్చల భావమే ధారణయని చెప్పుదురు. మనస్సూ మనోవృత్తులూ ఒకే వస్తువుపై కదలక మెదలక కేంద్రీకరించు స్థితి ధారణ అన బడును ధ్యాన శిఖరమును చేర గలిగినపుడు తన జ్ఞాపక శక్తి దట్టమై తన నైజ స్వరూపమునే ధ్వంసము చేసి భస్మము చేయును.

ధ్యానించే రూపము మరుగయి నిన్ను నీవు మరచిన, దానిని సమాధియందురు, అట్టి సమయమున ఒకే భావము కల్గియున్నప్పుడు సవికల్ప సమాధి అనియందురు. ధ్యానము చేయువాడు తనను తన ధ్యానమును మరచిపోవుటే సమాధి. బాగుగా ముదిరిన ధ్యానమే సవికల్పము. ఇందు జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అను త్రిపుటి భావము వదలదు. ఈ భావముతోనే నిరంతరము చిత్తము బ్రహ్మమందు నెలకొనియుండును. జ్ఞాత జ్ఞానము జ్ఞేయము బహ్మమే అని వుండునది సవికల్పము. నిశ్చల చిత్తముతో నిర్మల భావముతో అన్య చింతలకు చోటివ్వక భజించిన అదియే భావ సమాధి అగును,'' అన్నారు స్వామి.

ఈ ధ్యానము ఇష్టదైవముయొక్క నామ ధ్యానము, తద్వారా రూపధ్యానముగా మారి చివరకు రూపము మరుగయి సవికల్పమునకు దారిచేయును.

"ప్రణవోచ్చారణముతో భజనను మొదలు పెట్టి దానితోనే ముక్తాయ పరచిన తరువాత, అదే స్థలములో నైనా లేక మరే ప్రశాంత స్థలములోనైనా, కొంత సేపు ధ్యానము చేయవలెను. ఒకజ్యోతిని వెలిగించి ఉంచుకొని చక్కగ దానినే ధ్యానించి, భ్రూమధ్యమునకు, నేరుగా హృదయ కమలము లోనికి దానిని ప్రవేశ పెట్టవలెను, తరువాత ఆ కమలము వికసించునట్లు గానూ, లోని ప్రకాశము వ్యాపించి అంధకారమును నాశనము చేసినట్లును భావించుకొనవలెను. ఆ జ్యోతిని సర్వాంగములకూ అందించి,వాటిని పవిత్రము గావింపవలెను, జిహ్వపై జ్యోతి వెలిగినపుడు దుర్భాష అతి భాష చాడీలు అనృతము మొదలైన గబ్బిలములన్నియూ పారిపోవలెను, నయనములలో జ్యోతి వెలిగినపుడు చెడు దృష్టి నాశనమగును. శ్రోతముల నుండి అది చెడ్డ విషయాలపై నున్న వాంఛను అణగద్రొక్కను. ఇట్లనే జ్యోతి అన్ని ఇంద్రియములనూ పవిత్రము చేసి దేహము లోపలా బయటా వ్యాపించి, యావ జీవకోటిని కూడ ఆవరించి, శత్రు మిత్ర భేదమును తొలగించి 'వాసుదేవస్సర్వమిదం' అనే మహా సత్యాన్ని నిరూపణము చేయును;'' అన్నారు జ్యోతిని ఇది ఆధారముగా చేసుకొని సాధించే యోగము.

ఇట్లే ప్రణవ నాదమును ఆధారము చేసుకొని సాధించే నాదయోగమూ ఉండగలదు. పంచ భూతాలలో దేనిని ప్రముఖంగా అనుభవించగలిగితే దానినే ఆధారము చేసుకొని ఈ ధ్యానయోగమును సాధన చేయవచ్చునన్న మాట. సంప్రదాయ యోగము నామ రూపములను ఊత కర్రగా సమాధిని సాధించమంటుంది. స్వామి దానిని చెపుతూనే, — 'నేను సాయి నామమునే జపించమని చెప్పను, మీ కేది రుచించునో ఆ నామమే చెయ్యండి' అని చెప్పినట్లు

గానే—నామ రూపములకు బదులు జ్యోతి, నాదము వాయువు, జగత్తు, ఏది బృహత్ క్రియయో దానినే అధారముగా గ్రహించుకోవచ్చును, అన్నారు

చిరపరిచయమైన సంప్రదాయాన్ని అనుసరించడమే తేలిక. స్వామి సంప్రదాయ యోగ పరి భాషకు తేటగా వుండే అర్థములు కూడా చెప్పినారు. " శబ్దమును విన్నంత మాత్రమున మనసులో స్వరూపము తోచడము ధ్యాస భగవద్ధ్యానములో లీనమగుటయే ఉపాసన అస్తి భాతి ప్రియము అంటే సచ్చిదానందము. చిత్తముయొక్క అంతర్ముఖ భావము ప్రత్యాహారము. సందేహమనను నీవు తేక అవి రాక, అట్లు రెండూ ఒక సమయమున కలుగుటను ఏకాగ్రత అందురు ! ఆత్మ స్ఫూర్తియే మౌనము, ఆత్మ సంయమనమే నిధి ధ్యాసము, అని వివరించారు. సాధన దగ్గరనుండి కర్మభక్తియోగ జ్ఞాన ఆధ్యాత్మిక మార్గము పొడుగునా వచ్చే కష్టమైన పదములు కూడా మనకు అర్థము కావడానికి గాను విప్పి పెట్టినారు స్వామి. అన్నిటియందు దైవికమైన భావనను సృష్టించుకోవడము వలన ఏ వస్తువు రూపనామములనైనా వదలటమే వైరాగ్యమంటే. బ్రహ్మతత్వము కలవాడే (నట)బ్రాహ్మణుడు. భగవత్సంకల్పమే (మన) కర్మ రూపములో ప్రవహిస్తున్నదట అహంకారము అంటే అహము యొక్క ఆకారమట! చావంటే అహంకృతి నశించడమే నట. మోహక్షయమే మోక్షము. బ్రహ్మ ప్రాప్తి, నిత్యసుఖము, కైవల్యము, మోక్షము, అన్నీ ఒక్కటే. విద్య అవిద్యలూ, జ్ఞాన అజ్ఞానములు, శుద్ధ సత్త్వ మలిన సత్త్వములు, అన్నియు ఒకటే భావము, వాక్కుతో వేదాంత శాస్త్రము చదవడము విచారణ కాదు. తత్ అనినను జ్ఞేయము ఆత్మ, క్షేత్రజ్ఞుడు పరబ్రహ్మ, అనినను ఒక్కటే.... మోక్షము గురించిన దశలు వివరించుతారు వినండి.

భగవత్సాక్షాత్కారము నందు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములని నాలుగు సోపానములు

సాలోక్యము: ఒక మహారాజు పరిపాలనలో ఉండే ప్రజలందరూ వారి సాలోక్య భాగ్యమును పొందువారే. రాజగృహములో, వారి పరిచర్యను నెరవేర్చు నౌకరులకు సాలోక్యస్థితి లభించవచ్చును. భగవంతుని ప్రభు వనియూ తాను వారి దాసుడననియూ తలంచి, త్రికరణశుద్ధిగా శరణాగతిని మనోభావముతో జరిపితే, అది సాలోక్యముక్తి.

సామీప్యము: మహారాజు సమీపవర్తిగా ఉండి ఆయన సేవను దగ్గరనుండి చేసే భాగ్యము కలవారికి సామీప్య భాగ్యము లభిస్తుంది. పాదసేవాది పుణ్యావకాశములు కూడా వారికి దొరుకుతాయి.

సారూప్యము: మహారాజు సోదరులకు, రాజయోగ్యమైన దుస్తులు ధరించి, అదే రూపాలంకారములతో విరాజమానులయ్యే అవకాశమున్నది. అట్లు బాంధవ్యమును సంపాదించినవారు సారూప్యముక్తిని పొందుతారు. ఆఖరు సోపానమే సాయుజ్యము; మహారాజు జ్యేష్ఠకుమారుని స్థానము. ఆయనకు సమానమైన హక్కున్నది.

ప్రజ, సేవక, సోదర, కుమార అనే సంబంధాలు ఈ నాలుగు సోపానములబు.

జ్ఞానమునకు బాబా ఆత్యంతిక స్థానము నిచ్చారు. ' పరమాత్మ ప్రకృతిగా మారనేలేదు. అజ్ఞానము వలన పరమాత్మ ప్రకృతిగా కనిపించుచుతుంది. పరమాత్ముని నిజస్వరూపము తెలిసిన ప్రకృతి కనిపించదు ' అన్నారు. 'ప్రకృతికి అస్తిత్వమే లేదు, అన్నారు 'జ్ఞానముతో తప్ప మరే మార్గమునసూ ఆత్మను తెలిసి

కొనుట వీలుకాదు' అన్నారు. 'అన్ని మార్గములు విచారణ మార్గమునందే అణగియుండును,' అన్నారు. అంతా తనదే అను గొప్ప భావము పెంచుకొనిన ఏ బాధయూ ఉండదు అన్నారు.'

## స్వామి బోధ

ప్రశ్న :—బాబా, సాధ్యమైనంత వేగముగా గమ్యము చేరే విధానమేది?

ఉత్త :—సత్యమున కడ్డుదారులు లేవు. అడ్డుదారి ఎప్పుడూ దీర్ఘమైనదే. అది ఆకర్షించి మోస గించుతుంది. అన్ని కాలములలో, అన్ని దేశములలో రెండు మార్గములనే మానవుడు శోధించి తోటివానికి బోధించినాడు ; (1) అహంభావమున నంతమువరకు విస్తరింప చేయుట; (2) లేక దానిని సంపూర్ణముగా నశింప చేయుట మొదటిది జ్ఞానమార్గము. ఇక్కడ, నేను సర్వవ్యాపకమైన సత్యమును, సర్వము నేనే, నా సంకల్పమే అని జ్ఞాని చెప్పును. రెండవది భక్తిమార్గము. ఇక్కడ సాధకుడు 'నాదేమీ లేదు, అంతా భగవన్మయము' అని చెప్పును. ఈ రెండు విధానములందూ అహంభావము నశించుతుంది. భక్తుడు తన అస్తిత్వమేమీ లేదనుకొని, సంపూర్ణముగా భగవంతుని రక్షణయందుంటాడు.

ప్రశ్న :—నేను చేసే సర్వకర్మలకు భగవంతుడే కారణమైన నేను చేసే ప్రతికార్యము మంచిదే కదా?

ఉత్త :—నిస్పందేహముగా. భగవంతుడే నీయందు ప్రవేశించి చేయుచున్నాడనే చైతన్యము కలిగి ఉన్నప్పుడు నీవు చెడు నెట్లు చేయగలవు? భగవంతుని మరచిపోయి, నీవే కర్తవని భావించినప్పుడే చెడు చేయగలవు. అంతర్యామియైన భగవంతుడనే జ్యోతి మార్గము చూపించుచుండగా, సత్య ధర్మ మార్గమందే సంచరించగలవు.

ప్రశ్న :—బాబా, భగవంతునియందున్న ప్రేమనే భక్తి అంటారు కదా, భగవంతు నే విధముగా ప్రేమించి వృద్ధి చేసుకొనవలెను?

ఉత్త : - వాస్తవములో నీవు భగవంతుని ప్రేమించనవసరము లేదు. భగవంతునికి నీ ప్రేమతో అవసరము లేదు. ప్రేమస్వరూపుడైన భగవంతుడు నీ హృదయమందే ఉన్నాడని గుర్తుంచుకొని, మనసా వాచా కర్మణా ఆ ఉనికిని ఋజువు పరచుకొనుటే నీవు చేయవలసిన కార్యము. భగవంతుని ప్రేమ నీ ద్వారా ప్రసారము కావలెను. అప్పుడే నీవు ప్రేమతో చూడగలవు, వినగలవు, పలుకగలవు, ఇవ్వగలవు, స్వీకరించగలవు. అప్పుడు నీవొక ప్రేమదైనమో కాగలవు.

ప్రశ్న :—మాయందే ఉండి ప్రేమను మా ద్వారానే ప్రసారము చేయుమని ప్రార్థించవచ్చునా?

ఉత్త :—మూర్తీభవించిన ప్రేమస్వరూపునితో సంసర్గము పొందుటకు మరొక పేరు ప్రార్థన. భగవంతుని సర్వ శక్తులను నీయందు ప్రవహింపచేయు మార్గమే ప్రార్థన

ప్రశ్న :—ప్రత్యేకముగా వరముల కొఱకు ప్రార్థించవచ్చునా?

ఉత్త :—తప్పకుండా. కానీ మానవుని చంచలమైన మనస్సు ప్రాపంచిక పదార్థములతో శాశ్వతముగా తృప్తి చెందదని గుర్తుంచుకో దొరికిన కొలది ఇంకా కావలెనని ప్రాధేయపడుతుంది. ఈ కోరికలు, లాభించినా లేకున్నా, మిమ్ము అధికాధికముగా ఇంద్రియము లందు, లౌకిక ప్రపంచమందు చిక్కుకొనునట్లు చేయగలవు. అభ్యంతర విలువలందు కాక, బాహ్యవిలువలందు దృష్టి నిలుపుతావు. ఈ క్షణమందు నీకిష్టమైనది మరు క్షణమందు ఇష్టముండదు కాబట్టి మీరొకే వరము కోరవలెను; "స్వామీ! అన్ని కోరికలను నశింపచేయునట్టి వరము ప్రసాదించండి" అని, భగవత్ సంకల్పమునకు శరణని, సర్వము వారికే వదలండి

ప్రశ్న :—భగవదనుగ్రహము లభ్యమైనదని మాకేమి తార్కాణము?

ఉత్త :—భగవదనుగ్రహము లభించిన వెంటనే మీలోని యీర్ష్యాద్వేషములు నిన్ను వదలిపోవును. ఎవ్వరినీ ద్వేషించలేవు అందరియందు ప్రేమానురాగములతో ఉండగలవు. వినూత్నమైన ఆనందపారవశ్యము ననుభవించగలవు.

ప్రశ్న :—బాబా, అనుగ్రహమునకు సరియైన అర్థమేమిటి?

ఉత్త :—అది మనయందు ప్రకాశించే దైవత్వము; అందరియందున్న ఆ పరతత్త్వమును గుర్తింపచేస్తుంది అంతటా వారి ఉనికిని అనుభవించి సర్వప్రాణుల నొకే విధముగా ప్రేమించగలము

ప్రశ్న :—భగవంతుడు ప్రేమస్వరూపుడైతే యీ దుఃఖమునెందుకు సృజించినట్లు?

ఉత్త :—దుఃఖము నిన్ను భగవంతునికి సన్నిహితుని చేస్తుంది. అది వారి జాలికి చిహ్నము అజ్ఞానాహంకారములనే రోగపీడితులకు యిచ్చేటటువంటి చేదుమాత్రలు ; దుఃఖములు సత్యమును కనుగొను మార్గములోని అవరోధములను తొలగించుతవి.

ప్రశ్న :—సత్యమనగా ఏమిటి? చాలా మంది యీ అతి సాధారణమైన ప్రశ్నకు జవాబు చెప్పుటలో విఫలులైనారు. ఎన్ని గ్రంథములు దీనిని గురించి వ్రాసినప్పటికి, యీ విషయము పూర్తిగా స్పష్టము కాలేదు. బాబా, సత్యమంటే ఏమిటి?

ఉత్త :—నీయొక్క స్వస్వరూపమే సత్యము: మిగిలినదంతా అసత్యము, అనిత్యము, మార్పు చేర్పులతో కూడినదై నశ్వరమైనట్టిది

**ఒక శ్రీ లంక భక్తుని డైరీ నుండి**

# గురుదక్షిణ

మరొక గురుపూర్ణిమ పండుగ సందర్శించి మేమింటికి తిరిగి వచ్చినాము! ఇంటికి అని చెప్పితినా? కాదు లౌకిక ప్రపంచమనే పాఠశాలకు తిరిగి వచ్చినాము. తల్లిదండ్రులను చూచునిమిత్తము వారాంతములో యింటికి వెళ్లు విద్యార్థులవలె వెళ్లినాము. కానీ, మేము దర్శనము చేసికొనుటకు వెళ్లిన బాబా ఒక్క తల్లి తండ్రియే కాక గురువు కూడా. తన ఉపదేశముతో అనుభవ పాఠములు నేర్చుకొనుట కీ విశాల ప్రపంచములోనికి మమ్ము పంపినారు. సాంప్రదాయకముగా గురువును పూజించు యీ పవిత్ర దినమున శ్రీ బాబా సాన్నిధ్యములో ఉండే మహదవకాశము కలుగుటకు మేమెంత అదృష్టవంతులమో, వెనుకకు దిరిగి యోచించితే అర్థమైనది గురువునొక ప్రత్యేక దినమునందు కాక, ప్రతిదినము పూజించవలెనని బాబా తరచు బోధించుచుండేవాడు నిజమే, మరి యీ గురువునో! ఈతడు సాధారణుడా? బ్రహ్మ విష్ణుమహేశ్వరులందరొక్కరుగా రూపము ధరించి వచ్చిన పరబ్రహ్మమే అని గ్రహించకలిగినామా?

మీరెన్ని సార్లు అక్కడకు (పర్తికి) వెళ్లినది. ఎన్ని సార్లు బాబా దివ్యబోధల నాలకించినది గుర్తున్నదా? ఆ లెక్క నేను మరచినాను. ఆనంద పారవశ్యముతో ఆ దివ్యోపన్యాసముల నాలకించుటలో ఏమైనా తేడా వస్తుందా? ప్రాథమిక పాఠశాలయందు చదువుకొను దినములలో ఉపాధ్యాయుని బెత్తము సంగతి ఇప్పటికీ గుర్తు ఉంటుంది. కానీ, బాబాఎటువంటి గురువు! మొదటి తరగతి దాటి వెళ్లుటకు నిరాకరించినా, యీ గురువొక్క కఠినమైన మాట కూడ పలుకడు. ఓనమాలు దాటి నేర్చుకొనుటకు నిరాకరించినా, తిరిగి తిరిగి బోధించుట కీ గురువునకెంత ఓర్పు! చిన్న పిల్లలవలె వారు చెప్పే నీతికథలు విని ఆనందించుచున్నాము కాని, ఉపన్యాస సారమును మరచిపోతున్నాము.

"నేను మీకిచ్చేవి లెక్చర్లు (ఉపన్యాసములు) కావు; మీ మానసిక రోగములకు, నైతిక బలముకొఱకు నేనిచ్చే మిక్చర్లు (ఔషధము)" అని బాబా చెప్పుతారు. వెనుకటి సారి వెళ్లినప్పుడు బాబా మాకు పంచదార పూతగల మాత్రలనివ్వగా, తెలివితక్కువ పిల్లల మాదిరి పైనున్న పంచదారను చప్పరించి, మాత్రను మింగుటకు నిరాకరించినాము. కానీ బాబా తన ప్రయత్నము మానలేదు. మేమేమి చేయవలెను? మమ్ము క్షమించి మా కుపదేశించుట మానవద్దని మాత్రమే ప్రార్థించగలము.

సోదర విద్యార్థులారా! రోగము నయమయ్యే ముందే డాక్టరుకు ఫీజు చెల్లించవలెనని చెబుతారు. అటాగే, చదువుచెప్పినందుకు గురుదక్షిణ యిచ్చుకొనవలసి ఉన్నది. "రిక్తహస్తములతో నా వద్దకు రండి" అని చెప్పుచుండే యీ గురువున కేమి గురుదక్షిణ యివ్వగలము! ఉన్నది; వారికి సమర్పించగలిగిన గురు దక్షిణ ఒకటి ఉన్నది. జాకబ్ బావి వద్ద జీసస్‌ను కలిసికొనిన సమరియా గ్రామ స్త్రీని

గురించి విన్నారా ? జీసస్‌తో మాట్లాడిన తరువాత, ఆమె "రండి, చూడండి. దేవదూత క్రీస్తు వచ్చినాడు" అని అరచుకుంటూ గ్రామములోనికి పరుగెత్తినది. అనేక మంది జీసస్‌ను దర్శించుటకు వచ్చినారు వారందరికి ఆ స్త్రీ ఎటువంటిదో బాగా తెలుసు. ఆమె ఐదు సార్లు వివాహమాడినది. ఆ సమయములో పెండ్లి చేసికొనకుండా మరొకనితో ఉంటున్నది. అటు వంటి స్త్రీ మాటలు వారేవిధముగా నమ్మినారు ? వారందరామెలో ఏదో పరివర్తనము చూచినారు ; అది ఆమె కన్నులలో మెరసినది అందుచేత వారామె మాటలు విశ్వసించినారు. ఆ సమరియా కాంత వలెనే మా కెన్నో లోపము లున్నవని మాకు తెలుసును. కాని, మా యీ సాయి పరమాత్మని తోటి సమావేశమే. మాయందు కూడ అటువంటి పరివర్తనమే కలిగించి. దాని వెలుగును మా కన్నులలో చూచి ఇతరలు స్వయముగా ఈ జగద్గురువును దర్శించవచ్చును. ఈ మార్పునే యీ పరమ గురువు ఉత్తమ గురు దక్షిణగా మననుండి ఆశించేది. ఈ మార్పు వారి నిరంతరానుగ్రహము వలననే సాధ్యము. కావున, రండి, స్వామిని ప్రార్థించుతాము :

"పరమాత్మా ! మీ దివ్యోపదేశమును గ్రహించు శక్తిని ప్రసాదించు. మా హృదయములందే నిరంతరము నివసించెదనని వాగ్దానము గావించినారు. మా లోపములను మన్నించి మాకు బోధించుచునే ఉండండి. చురుకుదనము లేదని మమ్ము వదలవద్దు. వెంటనే కాకున్నా, ఒకానొక నాటికి పై తరగతికి చేరుకొను యోగ్యతను పొందగలమని వాగ్దానము చేస్తున్నాము, ఏ నాటికి మీ పవిత్ర హస్తముల నుండి డిగ్రిని పొందెదమో తెలియదు కాని, కనీసము ఉన్నత పాఠశాలలో నైనా ప్రవేశించుటకు ప్రయత్నించెదము."

"బాబా ! కృష్ణార్జునుల కథ చెప్పినారు. ఆకాశములో ఎగిరే పక్షి నొకదానిని చూపించి శ్రీ కృష్ణుడు దానిని పావురమనగా అర్జునుడు కూడా పావురమే అని తిరిగినాడు. శ్రీ కృష్ణుడు దానిని డేగ అనగా, అర్జునుడు కూడ డేగ అనినాడు. శ్రీ కృష్ణుడది కాకి కావచ్చుననగా, పార్థుడు కూడ ఔనని పలికినాడు. పరమాత్మా ! మాకు కూడా మీ పలుకులందంత తిరుగు లేని విశ్వాసముండునట్లుగా ఆశీర్వదించండి. దానితో ఆధ్యాత్మిక విజయపథమందు మేము ప్రవేశించగలము."

"స్వామి ! గత జన్మలందెన్నిసార్లు తమ పాదారవిందముల వద్ద ఉపదేశమును పొందు అవకాశములు లభించినవో మాకు తెలియదు. కానీ యీ జన్మలో మీ సాన్నిధ్యము నందుండి మీ దివ్యబోధ విను భాగ్యమబ్బినదని తెలుసును. మే మందరము యోగ్యులయిన శిష్యులగునట్లుగా మమ్మనుగ్రహించండి."

"ప్రభూ ! మీకు సన్నిహితులమైన కొలది మాకు పరీక్షలధికమగునని మాకు చెప్పుచుండేవారు ఈ పరీక్షలంటే భయము వేసినప్పటికి, పై తరగతికి చేరవలెనన్న, యీ పరీక్షలన్నిటిలో ఉత్తీర్ణులము కావలసి ఉన్నదని అర్థమయినది. ఈ పరీక్షలందు ఉత్తీర్ణులై తమకింకా సన్నిహితులగునట్లు మాకు ధైర్యము ప్రసాదించండి."

"స్వామీ ! మీ సన్నిధికి వచ్చిన ప్రతిసారి, తగిన ఔషధమును, దానికి తగిన పథ్యమును మీరు నిర్ణయించుచున్నారు. మధుమేహపు రోగి రోగము తిరగబెట్టినప్పుడెల్ల వైద్యుని వద్దకు వెళ్లినట్లుగా, మేము ప్రతి

సారి పొరపాట్లు చేస్తునే ఉన్నాము. మీ సలహా పై శారీరక మానసిక ఆరోగ్యముతో మీ సన్నిధికి తిరిగి వచ్చునట్లుగా మాకు చేయూత నందించండి ''

" జగద్గురూ ! ఒక్కొక్క దళమె నెమ్మదిగా విచ్చుచున్న కొలది పుష్పము నిశ్శబ్దముగా వికసించి, తన సౌరభమును క్రమముగా వెద జల్లుచున్నట్లుగా, విద్యాభ్యాసము చాలా నెమ్మదిగా జరుగుతుందని మీరు చెప్పి ఉన్నారు. ఈ పుష్పమెప్పటికి సంపూర్ణముగా వికసించునో వాకు తెలియదు. కానీ, వికసించుట మొదలై సుగంధము వ్యాపించునట్లు, అనుగ్రహమును దయ చేయించండి ; మొగ్గగా ఉన్నప్పుడే అది వాడి పోకుండా కాపాడండి.''

" ఒకానొక దినమున యిది పూర్తిగా వికసించి, తమ దివ్య పాదారవిందముల నలంకరించు గాక ! "

యం. బాలసుబ్రమణ్యం.

సత్యమంటే ఇతరులకు ఖేదము గాని బాధగాని హింసగాని లేనిదే సత్యం.

ఏది త్రికాలములందుండునో, ఆద్యంతములు లేవో చలన రహితమో, ఏకరసఏకరూపము కలదో అదియే సత్యమనబడును.

సత్యము : బాహ్యేంద్రియము నిగ్రహము అంతరింద్రియ నిగ్రహము యమనియమములు, వాటిని ' య ' కారము సూచించును. మానసిక చలనమును నిగ్రహించి చక్కని ప్రవర్తన కలిగి సీమాతీతమైన తదనంతర తత్త్వమును గూర్చి తపించుటయే తపస్సు. దానిని ' త ' కారము సూచించును. మానవ జీవిత చరమలక్ష్యమగు సర్వేశ్వర సాక్షాత్కారమునే ' స ' కారము సూచించును.

సత్యమే తాను. సత్యమును తెలిసికొంటిమి (అన్న) సర్వేశునే తెలిసికొంటిమి (అన్న మాట)

సత్యమే సర్వుల రక్షించు సర్వేశ్వరుడు.

— బాబా

# వార్షికోత్సవము

అనంతపురములోని భగవాన్ శ్రీ సత్యసాయి స్త్రీల కళాశాల వార్షికోత్సవము గోవా మాజి గవర్నర్ శ్రీ నకులసేన్ గారి అధ్యక్షతన గత జూలై 8వ తేదీన వైభవముగా జరిగినది. ఆ ఉత్సవమునకు కళాశాల పాలక సంఘ సభ్యులైన డా॥ ఎస్. భగవంతం ప్రభృతులే కాక, భగవాన్ శ్రీ బాబా విచ్చేసి అందులో పాల్గొని, అచ్చటి వారికి తన దివ్య దర్శనభాగ్యము కలిగించుట ముఖ్యమైన విశేషము.

కళాశాలలో ఆంధ్రభాషా విభాగముయొక్క ప్రధానోపన్యాసకురాలు, డా॥ జె. హేమలత గారు భక్తి భరితమైన భాషలో ఆహుతులైన వారందరికి స్వాగతము చెప్పినది :

జగన్నాటక సూత్రధారి

(1974 సం॥ జులై 8వ తేదీన జరిగిన శ్రీ సత్య సాయి మహిళా కళాశాల, (అనంతపురం) వార్షికోత్సవ సందర్భమున ఇచ్చిన స్వాగతోపన్యాసము).

"పాత్రధారులమై కళాక్షేత్రమందు
అడుగు తడబడుచుండ మేమభినయింప
సూత్రధారుండవై పైనఁ జూచుచున్న
ఓ జగన్నాట్య సందర్శకా జయోస్తు"

భగవాన్ బాబా వారికి ప్రణామములు. పూజ్యులు శ్రీ నకుల్ సేన్ గారికి, డా॥ భగవంతం గారికి, గౌరవనీయులైన మా కళాశాల పాలకవర్గ సభ్యులకు, విజ్ఞులైన పెద్దలకు నమస్కృతులు ; మా హృదయపూర్వక ఆహ్వానము. సహాధ్యాపకులకు విద్యార్థినులకు శుభాకాంక్షలు.

భరతవాక్యము వినపడని అనంతమైన ఈ జగన్మహానాటకంలో జగన్నాటక సూత్రధారియగు భగవానుని ప్రత్యక్ష సమక్షంలో జరుగుచున్న ఒక వినూత్న చైతన్యరంగ మీనాటి ఉత్సవము. ఇది మన కళాశాల వార్షికోత్సవము. ఆత్మీయత అలరారుచున్న ఒక కుటుంబములో జరుపుకొను పండుగవంటిది. మనకు తల్లి, తండ్రి, గురువు, దైవము, సమస్తము అయిన శ్రీ స్వామి జగత్కుటుంబమునకే తల్లి అయినా, మన పూర్వ జన్మ సుకృతమదెట్టిదో కాని, భౌతికంగ, ప్రపంచేతర మానవాళికంటె మనము కొంతవఱకు స్వామి సన్నిహితులముగ ఉండే అదృష్టము పొంద కలిగినందులకు ఆనందిస్తూ, ఈ అర్హత మనకు యావ జ్జీవితము నిలచి ఉండాలని భగవానుని ప్రార్థింతము. పిల్లలు వారి ఆటపాటలలో నిమగ్నులై కొంతకాలం గడిపినను, పర్వదినములలో నైనను, తల్లిదండ్రుల సమక్షములో గడపవలెనని వాంఛించుట సహజము. అదే విధముగ మన దైనందిన కార్యక్రమములు జరిగి పోవుచున్నను అప్పుడపుడు సాయి మాత సమక్షం లభ్యం కాకపోయినచో, తల్లి లేని పిల్లల జీవితం వలె మన జీవితం కూడ నిస్సారముగ ఉంటుంది అనుటలో సందేహము లేదు. భగవానుడే వచ్చి ఇచటి చిన్నారి విద్యార్థినుల ఆటపాటలను చూచి ఆనందించి మనలో

ఒకరుగ మెలగి మనలను ఆనందింప చేయుచున్న ఈ నాటి మన అదృష్టము వర్ణనాతీతము.

భారత దేశములోని ప్రతి స్త్రీ అంతర్గతముగ నైనను ఆధ్యాత్మిక భావనను కలిగి ఉంటుంది అనుటలో అతిశయోక్తి లేదు. మార్దవమైన ప్రకృతి ఆమెకు భగవంతుడు ప్రసాదించిన వరం. లాలి పాటలు మాత్రమే నేర్చిన తల్లి నుండి, తత్వ చింతనలో అగ్రగణ్యులైన గార్గి, మైత్రేయి వంటి విదుషీమణుల వరకు, అందరిలోను పరమాత్మయందలి పరమానురక్తి గోచరమగుచునే యుంటుంది. "కస్తూరి రంగ రంగా, మా యన్న కావేటి రంగ రంగా. శ్రీ రంగ రంగ రంగా, నిను బాసి నే నెట్లు మరచుందురా" అన్న పాటలో మాతృమూర్తియొక్క పుత్ర వాత్సల్యమే కాదు, పరమాత్ముని బాసి జీవాత్మ మనలేదు అనే సత్యము కూడ ద్యోతకమగును. తన సంతానములోను, ప్రతి ప్రాణిలోను, భగవన్మూర్తిని ఊహించి సేవచేసే స్త్రీ ధన్యురాలని స్వామి అనేక పర్యాయములు చెప్పుచున్నారు. ఆ సేవలో ఒక విధమైన తృప్తి ఉంటుంది. ఇదే విధముగ శిలా విగ్రహమును భగవంతునిగ భావించి పూజించి తరించ గల్గుట కూడ భారతీయులకే చేతనగును. షోడశోపచారములు మనము భగవంతునికి సమర్పించు చున్నామనిన, భగవంతునికి లేక మనమేదో చేయుచున్నామని అర్థము కాదు. ఈ విధముగ సాకారస్వరూపుని పూజించుట క్రమముగ నేర్చుకొంటే నిరాకార స్వరూపుని ధ్యానించుట అలవడుతుందనే ఉద్దేశం.

మందాకినీధరునకు స్నానము చేయించుట, కృత్తివాసునకు వస్త్రమొసగుట, రజతాద్రినిలయునకు రత్నాసనము పెట్టుట, భసితాంగునకు గందమలదుట, పరంజ్యోతి స్వరూపునకు దీపముంచుట, విషాశనునకమృతాన్న మిడుట, సకల చరాచర సృష్టికర్తయైన ఆ సర్వేశ్వరునకు సకలోపచారములు చేయ బూనుట ఒక విధముగ మన మౌఢ్యమునే సూచించునేమో! కాని నవరసభావ పూర్ణమైన ఈ నాటక వేదిక మీద మానవాళి సర్వస్వము గజ్జెకట్టి యొనరించే నటనలో అర్పించు నివాళియే ఈ పూజలు. మాయ అనెడు అవనికముందు నటించునంతవరకె కాని అనంతరము తెరకావల వేషము విప్పివేయగనే తరతమ భేదమే మియు లేక సమస్తము నొక్క రూపమై సర్వులయందు ఉండు ఆత్మ ఒకటియే అను పరమ సత్యమును తెలిసికొన్నవారు ధన్యులు. ఈ నాటకమునకు నాందిని పఠించిన మూలపురుషుడెవరో తెలిసికొనుట అసాధ్యము. ఆ పరంధాముని దర్శించుట కెన్ని వేషములు వేయవలెనో, ఆ దయామయుని మెప్పించుట కెన్ని విధముల నటింపవలెనో, ఆ నిరాకారుని సాక్షాత్కరింప చేసికొనుట కెట్టి కీర్తన చేయవలెనో, మనకు తెలియదు కదా! ఆ నాటి శ్రీరామచంద్రుడు. శ్రీ కృష్ణ భగవానుడు ఉన్న కాలమున మనమే రూపములలో నుంటిమో మనకు తెలియదు గాని, ఉత్తమమైన నర జన్మను మనకు ప్రసాదించి భగవానుడు తానును మానవాకారమును ధరించి వచ్చి మనలనుద్ధరించినాడు. కాని శ్రీ స్వామి వారమధ్య, ఇక తాము సులభ సాధ్యులము కామని హెచ్చరించుచున్న విధము చూచిన అత్యంతమైన మనఃక్లేశము కలుగుచున్నది. అట్టి శిక్షకు మనలను పాత్రులను చేయవద్దని వేడుకొందము. భగవత్సృష్టిలో స్త్రీ రూపము కంటె పురుష రూపము గంభీరమని స్వభావము కొంత కఠినమని అనెడు విషయము భగవదవతారముల యెడ సత్యమని యనుకొనిరేమో! భక్తులెందరో "నను బ్రోవమని చెప్పవే రామయ్యకు" అని సీతమ్మ తల్లినే

ప్రార్థించిరట. తండ్రికంటె తల్లి మనసు త్వరగ కరుగునని కాబోలు. కాని మనకు తలిదండ్రులిరువురు కూడిన అవతారమే మన అదృష్టవశమున ప్రత్యక్ష మైనది. సాయియే మనకు మాత; సాయియే మన పిత.

నీవైనం గరుణించి మా జనకుతో నీ భక్తురక్షింపుమం
చీ వేళైనను తల్లి చెప్పుమని మున్నెట్లేని ప్రార్థించిరా
దేవిన్ హైమవతిన్ దయామయి నికన్ దిక్కేది యా తల్లియున్
నీవే యైతివి తండ్రి! మమ్ముమననీ నీ చెంత సాయీశ్వరా!

మనము మరల నూతన విద్యాసంవత్సరము ప్రారంభింపనున్నాము క్రొత్త విద్యార్థినులు ప్రవేశించుట, పాతవారు ఉత్తీర్ణులై జీవితంలో ఉచ్ఛదశల నందు కొనుటకు ప్రయత్నించుట ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఈ ఇరువురికి, వారికి మార్గదర్శకులుగ ఉండే అర్హతను ప్రసాదిస్తూ అధ్యాపకుల మైన మాకు, స్వామి తమ దివ్యమైన ఆశీస్సుల నొసంగి కృతార్థులను చేయుగాక అని మన అందరి పక్షమున స్వామికి సవినయముగ విన్నవించుకొనుచున్నాను. ఇంతకు ముందు నేను చెప్పినట్లు నాటకంలో ఆంతర్నాటకం వలె ఇపుడు విద్యార్థినులు కొన్ని నాటక ప్రదర్శనలు చేయనున్నారు. పిల్లల తొక్కుపలుకులు, తప్పటడుగులు తల్లికిష్టమైనట్లే, వర్ధిష్ణువులైన ఈ విద్యార్థినుల ప్రదర్శనలకు స్వామి అనందింతురని ఆశిస్తున్నాను. ఈ నాడు మన ఈ కార్యక్రమమున కధ్యక్ష స్థానములో నుండి ఉత్సవమును జయప్రదము చేయుటకు దయతో నంగీకరించిన శ్రీ నకుల్ సేన్ గారికి, మాహార్దికమైన కృతజ్ఞతా పూర్వక అభివందనములనందజేయుచున్నాము. సాధారణముగ అధికారిక మైన పదవులలో నుండు వారి కాధ్యాత్మికజ్ఞాన మలవడుట అరుదు కాని శ్రీ నకుల్ సేన్ గారు భగవద్గీత పై నొసంగిన ఉపన్యాసములను విన్నవారికి వారెట్టి మేధావులో, అనుభవజ్ఞులో స్పష్టముగ తెలియును. వారిని అధ్యక్షోపన్యాసము నొసంగవలసినదిగను శ్రీ స్వామి వారిని తమ దివ్య సందేశమును ప్రసాదింపవలసినదిగను ప్రార్థించు చున్నాను.

జె. హేమలత,

తరువాత అధ్యక్షులైన శ్రీ నకులసెన్ గారీ విధము గా ఉపన్యసించినారు:—

భగవానుని లీలలు అగమ్యములు, రహస్యమయములు, అగాధములు, గుహ్యములు. భగవంతుడు తన సంకల్పముల ననేక విధములుగా నెరవేర్చు కొనును. కానీ, విశ్వాసము లేనివారికి ఇది అర్థము కానట్టిది. కానీ, వారు కొనివచ్చుచున్న మహా పరివర్తనముయొక్క సూచనలు విదితమే. యువజన సమస్యకు బాబా చాలా ప్రాముఖ్యము నిచ్చుచున్నారు. నేడు ప్రపంచమంతటా, యువలోకములో అన్నివిధములైన సందిగ్ధ పరిస్థితులేర్పడినవి. రాజకీయముగా, సాంఘికముగా, నైతికముగా, ఆధ్యాత్మికముగా వెనుకటి నియమములు ఛిన్నాభిన్నము కాగా, నూతన నియమములకొఱకు తీవ్రమైన శోధన జరుగుచున్నది. సర్వత్రా అధికారపదవులందున్న వారిలో మరియాద, నిజాయితి, గౌరవప్రదమైన ప్రవర్తన,

విశ్వాసములు కనిపించవు భగవంతుడనినా, మత మనినా, ఆధ్యాత్మిక చింతన అనినా అవిశ్వాసము పెరిగిపోయినది మానవాళి, అ తర్గత శాంతికొరకు స్థిరత్వముకొరకు, సందేహాస్పదమైన పద్ధతులలో పరుగు లెత్తుచున్నది

అద్యతన కాలములో దేశమునకు కావలసిన నాయకత్వమును సమకూర్చుటకుగాను భగవాన్ కళాశాల నొక ఉత్తమ ఆదర్శముగా స్థాపించినారు ఈ కళాశాలలో, సంఘము విచ్ఛిన్నమై ఛిన్నాభిన్నము కాకుండా రక్షించునట్టి ఆదర్శములు ప్రతిష్ఠితములగుట, మనమందరము చూచుచున్నాము నేడు విద్యార్థులందరికు బహూకరించబడిన భగవద్గీత జీవన యాత్రకు అనుష్టానదర్శన గ్రంథము; ఇది బాహ్యవాస్తవ స్థితిని, అంతర్గత సత్యమును సమన్వయముగావించి, యువజనులను నిర్మాణాత్మక కార్యక్రమములో పాల్గొనునట్లు ఉత్తేజపరుస్తుంది.

ఈ కళాశాల బాలికల అదృష్టమును గూర్చి చెప్పలేము; వారందరికి బాబాయే తల్లి, తండ్రి, స్నేహితుడు, భగవంతుడై మార్గమును చూపించుచున్నాడు. బాబానుండి ఒక మహామంత్రమును పొందుట కనేక సంవత్సరములనుండి కాచుకొని ఉన్నాను. దానిని భద్రపరచి, బాబాయొక్క ముఖ్య సందేశముగా అందరికి అందించవలెనని నా కోరిక. ఎట్ట కేలకు దానిని సంపాదించినాను. అది "మాం అనుస్మర యుధ్య చ' — ఈ సందేశమును కురుక్షేత్ర యుద్ధరంగములో శ్రీ కృష్ణు డర్జునునకు ప్రసాదించినాడు. వారినే ఉత్సాహముగా, అంతర్గత ఉపదేశకునిగా, సాక్షీభూతునిగా, మార్గముగా, గమ్యముగా కలిగి ఉండి, మీ మీ కర్తవ్యములను చక్కగా నిర్వహించుటలో, వారందించిన శక్తి, విజ్ఞానము, ప్రేమలతో, నిమగ్నులు కండి.

మీరందరు భగవదనుగ్రహమును సంపాదించి పెట్టు గుణములకొరకు కృషిచేయుటకుగాను, ఆ సందేశములోని మార్గము ననుసరించియుండుటకుగాను, మీరందరు శ్రద్ధాభక్తులను, శరణాగతి తత్త్వమును పెంపొందించుకొనుమని ప్రోత్సహించుచున్నాను. ఈ ఉపదేశమునే, భగవాన్ నిత్యము, సర్వత్రా, పిన్నలకు పెద్దలకు అందించుచున్నారు. శ్రీ బాబావారి ఉపదేశములను జీర్ణించుకొని వాటిని ఆచరణయందుంచగల శక్తి, ధైర్యము, స్థైర్యము మనకందరకు కలుగునటు భగవాన్ బాబా మనల నాశీర్వదించుగాక.

తరువాత భగవాన్ తన దివ్యసందేశము నీ విధముగా అనుగ్రహించినారు;

## బాబా దివ్యసందేశము

ఏకం సత్; విప్రా బహుధా వదంతి! ఒకే సత్యస్వరూపుడు, ఒకే ప్రేమస్వరూపుడు, అయిన ఆయనను ఆత్మజ్ఞులు అనేక రీతులుగా అభినందించుచున్నారు. ఇదే భారతీయ సంస్కృతియొక్క ప్రధాన ప్రబోధ.

జీవితమును దేహమయముగా గడిపిన, దుఃఖము; ఆత్మమయముగా మార్చిన, సుఖము. ఏకత్వములోనే సుఖము; అనేకత్వములో దుఃఖము. ఇది కూడ భారతీయ సంస్కృతియొక్క ముఖ్యమైన ప్రబోధ.

తా నెవరని గుర్తించక పోతే, మానవత్వమునకే కళంకము. ఆత్మ పరిశోధన, మానవుని ప్రప్రథమ

కర్తవ్యము. తన తత్వమునందున్న విశిష్టత యేమిటి, పవిత్రతయేమిటి, అని విచారణ సలిపి, దానికి తగినట్లుగా ఆచరణను అలవటించుకోవలెనని భారతీయ సంస్కృతి ప్రబోధించుచున్నది.

"అయం ఆత్మ బ్రహ్మ"! ప్రతి ఆత్మ కూడ ఆ యేకత్వముయొక్క ప్రభావమే, ప్రకాశమే. మిణుకు మిణుకుమని వెలిగే దీపకాంతి. అనేక దీపములను వెలిగించును కదా? ఆ దీపములన్నిటికి ఒక దీపమే ఆధారము అని ఒప్పుకొనక తప్పదు. ఒక ఆత్మజ్యోతి ద్వారా ప్రతి జీవుని హృదయ స్థానమందు ఆత్మజ్యోతిని వెలిగించ వీలగును. "ఏకోహం, బహుస్యామ్" అని శ్రుతులు చెప్పుచున్నవి. స్వస్వరూపము ఏకమే! అది అనేకముగా గోచరించుచున్నది, అంతే!

ఒక వాయువు మలయమారుతముగా, సుడిగాలిగా, వివిధములైన నామరూపములతో వ్యాప్తిగావించుట సహజము. రూపనామములు అనేకముగా ప్రకటించినను, ఏకమే సత్యము, ఏకమే ఆనందము, ఏకమే చిత్— అని ప్రకటించే మతము భారతదేశమందు తప్ప వేరెక్కడనూ కానరాదు. సనాతన మతమొక్కటే దీనిని నొక్కి బోధించును. ఏకత్వమునకు దూరమై, భిన్నత్వములో అభిరుచిని అభివృద్ధి చేసుకొనుట మానవునిలోని దోషమే కాని, సంస్కృతియొక్క దోషము కాదు. ఆ సంస్కృతిని నిర్దేశించి నిలబెట్టిన దోషరహితులయొక్క పవిత్ర హృదయములలో కూడ దోషములను ఆరోపించువారు ఈ నాడు భారత దేశములోనే బయలుదేరినారంటే, దేశమునకే అవమానము.

ఇట్టివారిని గీత అసూయాపరులని నిరూపించెను. 9వ అధ్యాయమునందు అనసూయా తత్వమును గీత బాగా ప్రబోధించినది. కృష్ణుడు అర్జునునికి శ్రేయో మార్గమును, ప్రేయోమార్గమును బోధించినాడు. అయితే, అర్జునుడు వాటిని గురించి యోచన సలిపి ఏ నిర్ణయమునకూ రాలేక, తిరిగి భగవంతుని అడిగినాడు! సర్వమానవులకూ ప్రతినిధి స్వరూపుడైన అర్జునుడు, సర్వభూతములకూ ఆధారమైన కృష్ణుడే ఉపదేశించిన దానిని తెలుసుకోలేక పోయినాడంటే, ఇక సామాన్య మానవుల విషయము చెప్ప నక్కర లేదు. కాదా?

దైవత్వాన్ని నిరూపించుటకు కృష్ణుడు అర్జునునికి అనసూయ తత్వమునే బోధించినాడు. దృష్టిదోషము శ్రవణదోషమువలన, ద్వేషము ఓర్వలేనితనము అసూయాది దుర్గుణములు పెరిగి, అశాంతి దుఃఖము నిరాశ నిస్పృహ అభివృద్ధి అయి, మానవ కులములన్ని దేశములలోనూ ఈ నాడు అధోగతుల ననుభవించుచున్నది. మానవుడు సర్వదేశములలోనూ ఈనాడు గ్రుడ్డివాడుగా తయారైనాడు. పరులయొక్క దోష గ్రహణము, దోషశ్రవణము, దోషములపై దృష్టి, దోషముల చర్చ వీటిలో మునిగి దోషమయుడై పోవుచున్నాడు. దోషములపైననే మనోబుద్ధులు ప్రసరించుటమువలన, దోషులకంటే దోషముల చర్చ చేయువాడు దోషి అయిపోవుచున్నాడు! ఇంక వీరికి అందరిలోనూ ప్రకాశించే ఏకత్వము ఏ రీతిగా అర్థమగును.

విద్యాస్థానము ఆ పేరుకు తగిన అర్హతను సంపాదించవలెనన్న, దోషదృష్టి అనే మాలిన్యమును నిర్మూలము గావించవలెను. విద్య అంటే విజ్ఞానస్వరూపము. ఏకత్వమును తెలుసుకొనునదే విజ్ఞానముయొక్క గుర్తు. పేరులు భిన్నమైననూ, వాటి అర్థము ఏకముగానే వున్నది. త్రికాలములందు, సృష్టి స్థితి లయములందు

నిత్యముగా సత్యముగావున్న స్వరూపమును సాధించు నదే విద్య. అట్టి పవిత్రమైన విద్యను ఈ నాడు అల్ప స్వరూపముగా అనుభవించుచూ దానినుండి అల్ప ప్రయోజనములను అందుకొనుచూ పాడుచేయుచు న్నాము. అంతస్తత్వమును ప్రకాశింపజేసుకొని, ఆ సౌభాగ్యమును గుర్తించి అభివృద్ధి జేసికొని తరించలేక పోతున్నాము. విద్యార్థులు విద్యాప్రబోధకులు విద్యా ధికారులు భిన్నత్వమును భేదత్వమును దూరము గావించి ఏకత్వమునే సాధించునట్టి క్రమములకు ప్రాధాన్యతనీయవలెను. కానీ, దురదృష్టవశాత్తు ఈ నాడు విద్య అనే పేరుతో, విచ్చలవిడిగా సంచరించే వికారములకు ప్రోత్సాహము దొరుకుచున్నది. తల్లిదండ్రుల పేరుప్రతిష్ఠలకు విరుద్ధముగా అవమాన కరముగా పిల్లలు వర్తించటమువలన, వారు తలయెత్తు కొని నడచుటకే వీలులేక పోతున్నది. శాంతిసుఖ ములను లోకమునకు అందించక నేటి విద్యావిధాన ములు, అశాంతి, భయము, దుఃఖము వీటిని అందించు చున్నవి! కౌరవులు అశాంతిని ప్రచారము చేసి, దోషదృష్టిని పెంచి, భిన్నభావమునే అభివృద్ధి చేయగా, కట్టకడపటికి చెలరేగిన అన్యాయ అక్రమములకు అంబుల వర్షమే తగిన చికిత్స అని శ్రీకృష్ణుడు ప్రకటించినాడు. కాబట్టి, మీకు మీరే ముందుగనే, తగిన క్రమములను విద్యావిధానములందు తీసు కొనుట అత్యవసరము. కలతలను, కల్లోలములను అణచుటకు, విద్యావిధానములను ఆలస్యము చేయక సంస్కరింపవలెను.

వృక్షమునకు వేరులు భద్రముగా నుండవలెను, కదా? అట్లే భవనమునకు పునాది భద్రముగా నుండ వలెను నేడు విద్యా సంస్థలు త్యాగభావమును, పటుత్వమును, ఆత్మవిశ్వాసమును కోల్పోవటమువలన, అవిద్యానిర్మూలము, సత్యప్రతిష్ఠ, ఇవి రెండూ ఆ సంస్థలద్వారా కాకపోవుచున్నవి. ఇది సత్యము, ఇది సక్రమము, ఇది న్యాయము, అని తెలిసియూ, వాటిని నిలబెట్టుటకు విద్యావంతులకు శక్తిలేకపోవుచున్నది. దీనికి కారణమేమి? సత్యాన్ని బలపరచే విద్యను ఈ సంస్థలలో ప్రబోధించటము లేదు నైతికముగా, ధార్మికముగా, ఆధ్యాత్మికముగా, సత్యాసత్యవిచారణ చేసే విధానములను ప్రబోధించినట్లయిన, అసత్యము అక్రమము అన్యాయము—వీటిని అరికట్టుటకు మీకు సాధ్యమగును. ఇప్పుడు ఆధ్యాత్మికమును ఏ మాత్ర మూ చేరనీయక, లౌకికమును, భౌతికమును మాత్రమే బోధించుచున్నారు. కాబట్టి, మీకు ఆ శక్తి, ఆ ఉత్సాహము, ఆ సామర్థ్యము లేకపోయినవి. ఈ నాటి విద్యా ప్రబోధము కేవలము గ్రుడ్డివాడు గ్రుడ్డి వానిని నడిపించునట్లుగా ఉన్నది. బలహీనుడు ఎట్టి చిన్న కార్యమునూ సాధించలేడు. "నాయ మాత్మా బలహీనేన లభ్యః" విశ్వాసము లేని వ్యక్తి శ్వాసము లేనివానితో సమ మని చెప్పవచ్చును.

నాకు నాపైన విశ్వాసమున్నది; కానీ, నాకు భగవంతుని పైన విశ్వాసము లేదు, అని చెప్పేవాడు, మూర్ఖుడు. ఎందుకంటే, భగవంతుని పై విశ్వాసము లేకున్న, తన పై విశ్వాసము లేనట్లే! తానంటే, పాంచభౌతిక దేహమా? కాదే. ఈ రూపనామములా? కాదే. తానే దైవము. అదే తన నిజస్వరూపము. ఇంక, అట్టివానికి యెట్టి అపజయమూ కలగడానికి వీలే లేదు. క్షణ క్షణము తానెవరు, తన భావమేమి, తన సంకల్పమే ఏ రీతిగా ఉన్నది అని నిత్యానిత్య పరిశీలనచేసికొనిన నిజతత్వము అర్థమగును, దృఢప డును. అడుగడుగునకు, తన సంకల్పములను విచారణ చేయుచూ వుండాలి. జరుగుచున్నదానికి రాబోయేదే అదర్శము, గడచినదే బలము! భూత భవిష్యత్

వర్తమానములు వెరు వేరుగా లేవు; భూతకాలము నందు చేసినవన్నీ వర్తమానమునకాధారము. వర్తమానమందు మంచిని చేయక, భవిష్యత్తులో మంచి ఫలిత మెట్లు దొరకును? పుణ్య ఫలము కావాలి అని ఆశించి, పుణ్య కర్మలకు వెనుకంజ వేసితే, యేమి లాభం? పాపఫలము వద్దని, పాప కర్మలను విస్మరించక వాటిలో జీవించిన, యేమి లాభం? ఇది పుణ్యము, ఇది పాపము అని తెలియును. అయితే, అహంకారము వలన, అజ్ఞానమువలన, అవిశ్వాసము వలన, పెడమార్గమును పట్టి జీవితమును మానవుడు పాడుచేసుకొనుచున్నాడు. కొంతమంది తెలిసియూ, తమ మార్గమునే సమర్థించుటకు ప్రయత్నము చేయుదురు. కానీ, తాను చేయు కర్మ తప్పా ఒప్పా అని తెలియనివారు చాలా అరుదు. దొంగకు తన పని తప్పని తెలిసియే కదా, తప్పించుకొనే వేషమును ఉపాయమును ఆశ్రయించుచున్నాడు.

విద్యార్థులారా! క్షణికమైన ఆనందముకొరకు పెడ మార్గమును పట్టితే, తరువాత దానికి వెయ్యారేండ్ల దుఃఖము ననుభవించక తప్పదు! చెడ్డ భావములు పిచ్చి భావములు, అనుసరించే సమయమందవి ఉల్లాసము నందించవచ్చును; అయితే, వాటి ఫలితములు మాత్రము భయంకరముగానుండును.

కన్నుండి కూడనూ గ్రుడ్డివారివలె నటించువారలను, కాలుండి కుంటివారివలె, మనస్సుండి ఉన్మత్తులవలె నటించువారలను, మీరు తీర్చి దిద్దాలి. శాంతిని చాటుతూ అశాంతిని బలపరచేవారికి మంచి గుణపాఠమును నేర్పించాలి. 'నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్' అన్నట్లు, మీరంతా ఈ పవిత్ర కార్యమందు, ధర్మ సంస్థాపనా కార్యమందు మంచి పనిముట్లుగా తయారు కావాలి.

ఈ కళాశాలను కేవలము డిగ్రీలు సంపాదించుటకు కాదు, స్థాపించటము. తద్వారా, త్యాగము, శీలము, సౌజన్యభావము, ఈ గుణములు అభివృద్ధి పొంది దేశక్షేమము, లోక కల్యాణములను నెలకొల్పాలి అనునదే మాయొక్క లక్ష్యము. రోగిష్టి బిడ్డకు మాత్రలిచ్చేటపుడు, ఒక అరటి పండులో దానిని పెట్టి, ఆ వుపాయముచేత అరుచియైన మందును తినిపించుటకు ప్రయత్నించుతారు కదా? ఆ రీతిగానే మీకు ఆధ్యాత్మిక ప్రబోధను సలుపుటకే ఈ కళాశాల స్థాపించటము జరిగినది. మీకు లౌకిక జీవితమును జరపుట కనుకూలముగా సాధారణ విద్యలను బోధించుచూ, దానితో పాటు శాంతిభద్రతలకు అత్యావశ్యకమైన ఆధ్యాత్మిక విద్యను కూడ మీ కందించుటకు ప్రయత్నించుచున్నాము. లౌకిక విద్యనందించు కళాశాల యొక్కటి స్థాపించి, దానికి లక్షల కొద్ది ధనమును వ్యయము చేయుటకు మన కే మాత్రమూ సమ్మతము కాదు.

ఈ కళాశాల దినదినాభివృద్ధి గాంచి, మన ఆశయములకు తగిన ఆనందమును మీరు పొంది ఇతరులకందించెదరని ఆశించుచున్నాము. మున్ముందు లోకమున కాదర్శవంతమైన జీవనమును మీరు ఆచరించుచూ, మానవజాతియొక్క బాధామారైన స్థితిని చక్కపరచుటకు మన బాలబాలికలు సంసిద్ధులుగా ఉండెదరని నమ్మటానికి కూడా వీలున్నది.

మీ ప్రవర్తనలు, మీ భావములు, మీ చిత్తములు సరైన స్థితిలో పరిశుద్ధముగావించుకొని, లోకమును చక్క చేసే కార్యమునందు మీరు కూడ సహాయముగా మెలగ వలెనని ఆశిస్తున్నాము. మీ మీ గృహములను, గ్రామములను, సమాజములను, ఈ దేశమును, సమస్త మానవ జాతిని, మీ త్యాగమువలన, మీ సౌశీల్యమువలన చక్క చేయుటకు మీరు పూనుకోవాలి.

విద్యార్థినులు ఇపుడు కొన్ని నాటకములను ప్రదర్శింతురు. అవన్నీ ధర్మ ప్రబోధక నాటకములే. ఆ యా రంగమును, కాలమును, భావమును, స్థాయిని పురస్కరించుకొని, కాలేజీ విద్యార్థులైన బాల బాలికలు నాటకములచేత, ఉపన్యాసములచేత, ఆటలచేత, మాటలచేత, పాటలచేత, ప్రవర్తనలచేత ఇతరులను సన్మార్గమునందు నడిపించి చక్క చేయుటకు ప్రయత్నించవలెను. ఇదే, పెద్ద సేవ.

మీరందరు ఉత్తమ చిత్తములు కలిగి, ఉల్లాసవంతమైన జీవితము గడిపి, పవిత్ర భావములను భక్తి శ్రద్ధలతో అభివృద్ధి చేసుకోవాలని ఆశీర్వదిస్తున్నాను.

ఈ దినము "కాలేజీ డే"; కొత్త విద్యార్థినులు ప్రవేశించటము, పాత విద్యార్థినులు పరీక్షలు ప్యాసు చేసుకొని బయలుదేరటము—ఈ రెండూ ఈ దినము జరుగుచున్నవని, డా॥ హేమలత చెప్పినది, సరే. అయితే, మన కళాశాలయొక్క విశిష్టత యేమి అనగా దీనిలో నిరంతరము ప్రవేశించటమే తప్ప, దీని విడిచి పోవటము విద్యార్థులకు సాధ్యము కాదు, మేము కూడ దానికి సమ్మతించము. మీరు ఇంకా ఉన్నత విద్యనార్జించుకొని, మరి ఈ కాలేజిలోనే అధ్యాపకులుగా ఏ నాడైనా రావచ్చు. తిరిగి ఇక్కడికి వచ్చి, మీ సద్భావములను ప్రబోధించుటకు మీకు యేనాటికైనా హక్కున్నది, అని నొక్కి చెప్పుచున్నాను.

# సత్యమేవ జయతే

దివ్యాత్మ స్వరూపులారా ! భగవంతుని పొందాలని, సందర్శించాలని, ఆరాటము, దాహము మీలో అభివృద్ధి కావాలి మీ అహంకారమును, ఆడంబర అదర్శములను, ఆయన పాద సన్నిధిలో అర్పించి, ఆనందములో మునగాలి ; ఆయన సాక్షాత్కారము నాశించి. ఆకలిని పెంచుకోవాలి.

కృష్ణావతారమునందు చేసిన మహత్కార్య మిదియే; పండిత పామరుల కేకరీతిగా భక్తి మార్గమును ప్రబోధించి, దాని అనుష్ఠాన విధానమును గోపికల చేత, పాండవుల చేత, లోకమునకు కృష్ణుడు అందింపజేసినాడు. ప్రేమ అనునది స్వార్థ రహితమైనది ; నిర్మలమైనది ; పవిత్రమైనది ; మధురమైనది ప్రేమోన్మత్తుడైన ప్రహ్లాదుడు, తనకు సంబంధించిన కష్టములు నష్టములు, నిందలు నిష్ఠూరములు, హింసలు బాధలు, అన్నిటిని మరచి, సర్వత్ర సర్వ కాలము లందు భగవన్నామ సంకీర్తన మందే ఆనందపరవశుడుగా జీవించినాడు. పవిత్ర హృదయము, నిష్కళంక భావము, నిర్మల విశ్వాసము, వీటిని అభివృద్ధి చేసుకొని. విజయము పొందినాడు. మీరా వలె మీరు కూడ జీవితములను పరమాత్మ సేవ కొరకే అంకితము చేసుకొని, భగవద్వియోగమును క్షణ మాత్రమూ భరించ లేక, వెక్కి వెక్కి యేడ్చుటకు ప్రయత్నము చేయవలెను. పవిత్ర ప్రవర్తన చేత,

ఆత్మానందము ననుభవించుచు, అనేక సాధువులు నేటికి తమ సర్వస్వము ను అర్పించి, భగవత్సాన్నిధ్యము నందు కొనుచున్నారు.

### ఆరాటము—ఆర్భాటము

కానీ, ఆ నాటి భక్తికి ఈ నాటి భక్తికి యే మాత్ర మూ సంబంధము లేదు. ఆ నాడది హృదయము నుండి ఉప్పొంగే అరాటము ; ఈ నాడు బాహ్యములో వ్యక్తపరచే ఆర్భాటము. అయితే, భగవంతుడు ఆర్భాటమునకు చిక్కడు. హృదయపూర్వకమైన ఆరాటమునకే దక్కుతాడు, చిక్కుతాడు! మూర్ఖత్వము నకు కానీ లోభమునకు కానీ పరమాత్ముడు చిక్కడు. సోమరితనమును కూడ పరమాత్ముడెన్నటికీ అంగీక రించడు. సర్వ భారము నీవే యని నమ్ముకొని ఊరకుండుట వలన ప్రయోజనము లేదు. అంత ర్యామియై తాను అందరితోనూ వుండటము వలన, మీ ప్రయత్నము కూడ అత్యవసరము. తనను తాను తన ఉద్ధారమునకై ఉపయోగించుకొని కృషి చేయవలెను ; అప్పుడు పరమాత్ముడు కూడ తగిన సహాయము చేయగలడు. పరమాత్ముడు సర్వత్రా ఉండిననూ, శక్తి స్వరూపుడై, హృదయస్థానమందు భాస్కర స్వరూపుడై, బుద్ధికి తేజస్సు నందించుతూ ఉంటాడు.

## దృష్టి—సృష్టి

ప్రేమ స్వరూపులారా ! అన్ని రాష్ట్రములలోనూ ప్రజలు శాంతి లేదని, భద్రత లేదని, అల్లకల్లోల ముతో అవస్థపడుచున్నారు. లోకమెప్పుడూ ఇంతే, ఇది లోక స్వభావము, అని యెంతో మంది చెప్పు దురు. కానీ, ఇది చాలా పొరపాటు. ఈ అశాంతి వ్యక్తికి సంబంధించినదే కావున లోకమునకు దానిని అంటగట్టరాదు. లోకము నిరంతరమూ శాంతి స్వరూ పమే. అశాంతి వ్యక్తి గతమైన మనోభావమే కానీ, లోకస్వభావము కాదు. శాంతి లేని వ్యక్తికి లోకమంతా అశాంతిగానే వుండును. శాంతి లోనుంచి ఉద్భవించేది కాని, బయట నుంచి వచ్చేది కాదు. ఏ కలర్ అద్దా లను పెట్టుకొంటారో, లోకమంతా ఆ కలరే కనుపిం చును ; ఇది సహజం. సృష్టి అంతా దృష్టి నాశ్రయించే వుండును. దృష్టినుంచే సృష్టి. ప్రేమదృష్టికి లోక మంతా ప్రేమమయమే.

విశ్వ ప్రేమను అనుభూతికి తెచ్చుకొనిన వ్యక్తి విశ్వేశ్వర స్వరూపుడౌతాడు ఇది సత్యము కాదని నిరాశ పడుట అనవసరము. దైవము ప్రబోధించేది, శాసించేది, అనుగ్రహించేది, ప్రేమనే ! అవతార ములు వచ్చునది కూడ ప్రేమయొక్క ప్రబోధ ప్రచారముల కొరకే ; ఆచరణ రూపమైన ప్రబోధము కొరకే ! జపము తపము యజ్ఞము యాగము పాండి త్యము ఇవన్నీ అహంకారమును పెంచి ఆడంబర మునకు దారి తీయును. అయితే, ప్రేమను సాధిం చుటకు ప్రయత్నించునపుడు, చాలా అటంకములు అడ్డు రావచ్చును. ద్వేషము అసూయ ఇవి ప్రకోపించి బాధనీయవచ్చు. గృహములో బంధువులే ద్వేషమును ప్రకటించి అడ్డు తెచ్చిపెట్ట వీలున్నది. మిత్రులు కూడ సహకరించక పోవచ్చును. వారు భగవంతుని పైన కూడ మీకు ద్వేషము జుగుప్స కలుగజేయ వచ్చును ! ఇవన్నీ మీ సత్వ పరీక్షకు పరికరములు గా భావించి ధైర్యముగా వాటిని జయించవలెను.

### నిందలు—నిష్ఠూరములు

మంచి కార్యమునకే అనేక రకములైన నిందలు నిష్ఠూరములు వస్తూవుంటాయి. చిన్న చిన్న అపోహలను

అసూయారోగ పీడితులైన అల్ప బుద్ధి గలవారు వ్యక్తి గతముగా ప్రచారము చేయవచ్చును. కృష్ణునికి కూడ అసూయాపరులు వ్యక్తిగతముగా దోషముల నారోపించినట్లు మీరు భారత భాగవత గ్రంథములలో చదివి యుండవచ్చును. కృష్ణుని ఎంతో మంది దుష్టులు, విరోధులైన రాక్షసులు దైహికముగా హింసించుటకు కూడ పూనకొనినారు. అయితే, సత్యమునకు ఎన్నడూ పరాజయము లేదు, రాదు. సత్యానికి ఎప్పుడైనా కొంత పరాభవము కలుగునేమో కానీ, పరాజయము మాత్రము ఎప్పుడూ యెచ్చటనూ రాదు. ఆ విధముగా అసత్యమును ప్రచారము చేసిన వారు, దానితో తమ పతనమునకే రాజబాటను నిర్మించుకొన్నారే కానీ, సత్యమును కదలించలేక, హింసించ లేకపోయినారు. ధృతరాష్ట్రుని సభలో శ్రీ కృష్ణుని బంధించి హింసించ వలెనని కౌరవులు చేసిన ప్రయత్నము విఫలమై, వారి నాశనమునకే మార్గమును సిద్ధము చేసినది.

కృష్ణుని హింసించవలెనని ఆ దుష్టులు చేసిన పన్నాగమును విని, ఆ నాడు భక్తులు చాలా పరితపించినారు. ఉదాహరణముగా, సహదేవుడు, "బావా! మీరు సుఖముగా తిరిగి వచ్చినారు! ఇదే మాకు పదివేలు! ఆ దుర్మార్గులు మనకు రాజ్యభాగమును ఇవ్వకపోయిన దాని వలన కలుగు నష్టమేమి!" అని, ఆతడు సంతసించినాడు. కౌరవులకు ఏ గతి పట్టినదో చూడండి! వారు చేసిన అన్యాయము వారినే బాధించినది అయితే, కృష్ణుడు నిరంతరమూ మంగళ స్వరూపుడే! దుర్మార్గుల కృత్యములు భగవంతుని సత్కీర్తిని ఏ మాత్రము తగ్గించలేదు; తగ్గించవు. వాటివలన భగవంతుని కీర్తిని జగద్వ్యాపక మగును!

ప్రహ్లాదునికి వచ్చిన కష్టనష్టములు బాధలు హింసలు అన్నీ ఆ బాలకుని భక్తి ప్రపత్తులను మరింత తేజోమయముగా వెల్లడించినవి, అంతే. ఇట్టి నిందలు నిష్ఠూరములు, విరోధ కృత్యములు, యుగ యుగముల నుండి అవతార పురుషుల వెంట వస్తూనే ఉన్నవి. అట్టివారి దుశ్చేష్టల వలన, భగవంతుని శక్తి ప్రకటించబడి కీర్తి ఇంక అధికముగా అభివృద్ధి పొందుతూ వచ్చినది తప్ప వేరు కాదు. ఈ నాడు కూడ ఇట్టి వారి కృత్యములు ఆ కీర్తిని విశ్వవ్యాప్తి గావించుటకు అనుకూలించు కృత్యములే!

## సత్యమేవ జయతే

భగవంతుని యెవ్వరు కూడనూ యే మాత్రమూ కదలించలేరనే సత్యమును మీరు గుర్తించి ఆనందముగా మీ మీ సాధనలను మీరు జరుపుకోవాలి, అని నేను ఆశిస్తున్నాను. యెవరెట్లు భావించినప్పటికీ, సాయిని యే మాత్రమూ కదలింపలేరని తెలుసుకొని మీ స్మరణ మీ ధ్యానములను మీరు సలుపుతూ వుండండి కొన్ని కుక్కలు తమ నీడను నీటిలో చూచుకొని, మొరుగును; అది సహజము. అది ఆ కుక్కల భ్రమ వలన జరిగినది. అయితే, ఆ కుక్కలు మొరుగునది విని, ఊర కుక్కలు మొరుగుట కూడ సహజమే కదా? ఆధారము లేని భ్రాంతులవలన కుక్కలు మొరిగితే, వాటిని విని మొరిగేవాళ్లంతా వాటితో సమానమే అనవచ్చు. కాబట్టి, మీరు మాత్రము మీ భక్తిని చలింపనీయక మీ ప్రేమను అభివృద్ధి చేసుకొని, అపవిత్ర భావములలో మనస్సును ఏ మాత్రము పడనీయక ధైర్యమును పెంపొందించుకొని, పటుత్వమును బలపరచుకొనండి.

ఈ నాడు కృష్ణజన్మాష్టమి కాబట్టి, ఇట్టి పవిత్ర సంకల్పమునకు ఈ నాడే కంకణము కట్టుకొమ్మని మీకు నేను ఉపదేశించుచున్నాను. కృష్ణుని జీవిత

మంతా ఇట్టి ఆదర్శములనే నిరూపించును. పుట్టిన క్షణమునుండి ఆయన తల్లిదండ్రులు, భక్తులు, ఇట్టి ఆపోహలను అపప్రచారములను విని, పరితపించినారు. ఇది చరిత్రలోని విషయమే. అయితే, ఏది జరిగినా, ఏ బాధ కలిగినా, సత్యమును గుర్తించే ప్రయత్నమును ధైర్యముతో సాహసముతో మీరు సాధించాలి.

భగవంతుని పై అన్ని భారములను వేసిన, మీకు క్షేమమును, ఆనందమును, స్థానమానములను అందింతును. భక్తిని పెంచుకొనవలెనన్న హింసతో బాధతో వీలు కాదు. సత్యమును గుర్తించుటకు భావపరిశుద్ధి ప్రేమాభివృద్ధి అత్యవసరము.

రామో విగ్రహవాన్ ధర్మః, అంటారు. అట్లనే, కృష్ణో విగ్రహవాన్ ప్రేమః, అని చెప్పవచ్చు. తాను ప్రేమస్వరూపుడు కాబట్టి, ఎప్పుడూ చిరునవ్వులతో చిందులు కులికేవాడు! ఆనందముతో ఉల్లాసముతో రాగములు తీయుచూ పాటలు పాడేవాడు. రుద్రభూమిగాని భద్రభూమిగాని ఏచోటనైనా సరే గానమే, గీతమే. యుద్ధ భూమిలో కూడ భయభీతులు తాండవమాడు సమయములో కూడ గీతను పాడినాడు. ప్రేమ ఉండిన ఆనందము సహజము; ఆనందముండిన గానము నృత్యము వెంటనే ఉండును. శాంతి భద్రతలు ప్రేమనుంచి లభించును. ప్రేమ లేనివారికి నిరంతరం అశాంతియే కాబట్టి, ఈ నదిలో తరించుటకు ఏకైక మార్గము ప్రేమ ఒక్కటియే. Love is God; Live in Love.

ప్రశాంతినిలయము.

బాబా: - శ్రీ కృష్ణ జన్మాష్టమి 10-4-74

సాయిరామయనుచు సాయికృష్ణాయంచు
సర్వేశునెవ్వడు జపము చేయు,
సర్వ కర్మలయందు సాక్షిభూతుండైన
పరమాత్మనెవ్వడు ప్రస్తుతించు,
విశ్వమంతయు తానె. తానె విశ్వంబయి
పరగువాని మిగుల భక్తి కొలుచు,
నిర్వికారుండైన నీరజాక్షునియందు
జీవులన్నియు కూడ చేరుననుచు,
తలచు మానవుండె, తనకున్నదంతయు
స్వాణంబు చేసి, ఆర్తితోడ
సత్య ధర్మ శాంతి చాటించి పాటించి,
సత్యసాయి జేరు సాధనమున.

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజిస్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 1-25 తో వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

తెలుగు:—

| | | వెల | పోస్టుచార్జీ |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-65 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-75 |
| 3 | మణిమాల | 1-00 | 0 25 |
| 4 | భాగవత వాహిని | 4-00 | 0-45 |
| 5 | అర్పణ | 1-00 | 0-15 |
| 6 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0 25 |
| 7 | సందేహ నివారిణి | 1-50 | 0-25 |
| 8 | గీతావాహిని | 4-00 | 0-65 |
| 9 | వచనామృతము | 4-00 | 0-45 |
| 10 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 11 | గీతాభావప్రకాశము | 15-00 | 1-65 |
| 12 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-35 |
| 13 | భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి వేసవి ప్రబోధములు | 2-50 | 0-15 |

కన్నడ:—

| | | | |
|---|---|---|---|
| 1 | ప్రశాంతివాహిని | 1-50 | 0-25 |
| 2 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 3 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 4 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 5 | జ్ఞాన వాహిని | 1-50 | 0-15 |
| 6 | గీతావాహిని | 4-00 | 0-45 |

మలయాళము:—

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపశదేరత్నంగళ్ | 1-50 | 0 55 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-15 |
| 3 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-65 |
| 4 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-15 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0 15 |

**ఇంగ్లీషు:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-55 |
| 2 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-65 |
| 3 | ప్రశాంతివాహిని | 2-00 | 0-25 |
| 4 | సమ్మర్‌షొవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0 65 |
| 5 | ,, 1973 | 6-50 | 0-55 |
| 6 | సందేహ నివారిణి | 3-00 | 0-25 |

**భారతం:—**

| | | | |
|---|---|---|---|
| | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-25 |
| 2 | సత్యం శివం సుందరం[1భా] | 3-50 | 0-65 |
| 3 | ,, ,, ,, [2భా] | 4-00 | 0-65 |
| 4 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-45 |
| 5 | ,, ,, [2భా] | 3-00 | 0-55 |
| 6 | సాయిమాతా | 1-00 | 0-15 |
| 7 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 8 | సందేహనివారిణి | 2-00 | 0-35 |
| 9 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 10 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-25 |
| | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-15 |

**హిందీ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-15 |

**గుజరాతి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 2 | కథాసుధ | 2-00 | 0-35 |
| 3 | గీతావాహిని | 4-00 | 0-55 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-55 |

**సింధి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-15 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-25 |

**అస్సామి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారథి [షార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0-15 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కథ | 0-25 | 0-15 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0-50 | 0-15 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0 45 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-25 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-15 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0 25 |

—o—

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2. చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లిషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4. చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియజేయవలెను.

5. గమనిక :— పుస్తకముల కొరకు పైకము నీక్రింది అడ్రసుకే పంపవలెను :

శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతినిలయం పోస్ట్,

అనంతపురంజిల్లా. 515134.

6. పత్రికకు పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతనసారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు మాత్రమే పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును. పత్రికలుగాని పుస్తకములు గాని V.P.P. ద్వారా పంపబడవు.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అటు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోష్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మి చందారసీదు కార్డులోను, మీరు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దాన్ని గమనించి, ఆ నెంబరు ..10/-74 అని యుండిన, మీ చందా అక్టోబర్ నెలకి అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) అక్టోబర్ నెల 8. న తేది లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —:శ్రీవారి కార్యక్రమములు:—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు మేనేజరు 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O. ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింపబడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యే., బి. యల్.

Regd. No. KRN/A-67

నారాయణుడు ధర్మ సంస్థాపన కొరకు అనేక రూపములను ధరించినాడు. ఆ రూపములలో ఏది గొప్పది, ఏది శ్రేష్ఠము అని భ్రమపడకుండా, అన్నింటికి మూలమైన ఏకస్వరూపమును తెలిసికొనవలెను. భగవంతుడు సాకారముగా వచ్చినప్పుడెక్కడలేని సందేహములన్నీ వస్తుంటవి.

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 అక్టోబర్, 1974 సంచిక 8

## విషయానుక్రమణిక



సంవత్సర చందా : రు. 5/-. ఇతర వివరములకు అట్ట లోపలి భాగములో చూడండి.



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 58

### ప్రబోధ

సీతారామలక్ష్మణులు అత్రిమహాముని ఆశ్రమమున ఆనందముగా కాలమును గడిపి, ఆశ్రమవాసులకు ధర్మమార్గమును ప్రబోధించి, మహాఋషి అనుమతిని తీసుకొని వనసంచారమునకు బయలుదేరిరి. ఆశ్రమవాసులు, రామచంద్రుని విడువలేక కంటిధారలు కార్చిరి. విధిలేక ఆశ్రమమున వుండవలసి వచ్చెనే కాని లేకున్న అందరూ రామచంద్రుని వెంటనే వుండుటకు అమితముగా ప్రయత్నించిరి. ఈ రీతిగా హృదయేశ్వరుడైన రాముడు సీతాలక్ష్మణులతో ఆశ్రమమును వీడి, అడవిలో ప్రవేశించెను

భీకరారణ్యమున క్రూరమృగముల గర్జనలు భయంకరముగా వినిపించుచుండ, వివిధ జాతులైన పక్షులు, విచిత్రములైన వినోదకరమైన, ధ్వనులు చేయుచుండ, అదొక విధమైన లోకముగా నుండెను. ఇట్లు ప్రయాణము సలుపుతూ సల్పుతూ ఉండగా. అందులో ఒక సుందరమైన మందిరముతో కూడిన ఆశ్రమమొకటి కంటబడెను. దానిని సమీపించుటకై నూతనమైన దారులు అడ్డముగా తిరిగి లక్ష్మణుడు ఆ పొదలను ముండ్లను కొంత చిక్కులు వదలించి సీతారాములకు కొంత అనుకూలపరచుచూ వెళ్లెను.

### నేత్రానందము

ఆశ్రమమును సమీపించుకొలది, నలువైపులా, రసాల సాల పున్నాగ పూలవృక్షములు, ఫలవృక్షములు ఉండెను. ఆ విధమైన ప్రకృతి

కాలేజీలు స్థాపించి, తద్వారా అనేక రకములైన సంస్కారములను వారలకు కలిగింప జేసి, భారతీయ సంస్కృతిని నిలబెట్టి, సర్వమత సమ్మతమైన సత్యాన్ని ప్రబోధించే నిమిత్తమై వారు గా సంకల్పించుకొన్నారు. దీని నిమిత్తమై స్వామియొక్క 50 వ సంవత్సరము పుట్టిన పండుగ అత్యంత వైభవముగా చెసుకోవాలని భక్తులయొక్క ఉత్సాహము చేత, వారు కమిటీలో కొన్ని నిర్ణయములు చేసుకొన్నారు.

అందువల్ల, కళాశాలలు స్థాపించే నిమిత్తమై దానికి, ప్రపంచములో ధనము లేక ఏ చిన్న కార్యము కూడ జరుగటానికి వీలుండదు కనుక, వారు ఒకొక వ్యక్తి జీవితమునకొక్క పర్యాయము 50 రూపాయులు ఇచ్చినప్పుడు, దానినంతా ఒక ఫండుగా చేసి విద్యాసంస్థలను, ఆరోగ్య సంబంధమైన సంస్థలను, అభివృద్ధి చేయవలెననే ఉన్నత భావాల చేత పవిత్ర హృదయాల చేత నిర్ణయించుకొనినారు. ఈ విధమైన నిర్ణయాన్ని కమిటివారు తెచ్చి నా దగ్గర పప్పగించారు.

దానికి నేను ఈ విధమైన జవాబు చెప్పినాను: నాయనా! ఒకరి కొరకు కేవలము ధనము వస్తుంది కదా అనే ఉద్దేశము చేత గుట్టుగా పనూలు చేయుటకు పూనుకొనకండి; బట్టబయలుగా చెప్పి, ప్రపంచానికి గానీ, ప్రభుత్వానికి గానీ, వ్యక్తులకు గానీ, ఎట్టి సందేహములకు కూడనూ అవకాశము లేని మార్గమును అవలంబించటము మంచిది అని నేను వారికి ప్రబోధించినాను. అందువలన, వారు ఆ నాడు (announcement) ఒక ప్రకటన చేసినారు.

దీనిని పురస్కరించుకొని, అనేక మంది, అర్థాలును కల్పించుకొని, కేవలము అనర్థాలనే కల్పించుకొని, స్వామియొక్క పుట్టిన పండుగ ఆచరించుటకు 50 లక్షలు ఖర్చు పెట్టుతారు అనే ఒక్క ప్రచారము కూడ కొనసాగించుకొనుచూ పోయినారు.

నిజముగా పుట్టిన దినమునకు గానీ మరే విధమైన వ్యక్తి సంబంధమైన భోగమునకు గానీ 50 లక్ష రూపాయలు వృథా ఖర్చు పెట్టుతున్నారంటే, అంత కంటే మహా పాపము మరొకటి ఉండదు. లోకములో అన్నము లేక, గృహములు లేక, అనేక అవస్థలు పడే మానవులు కోటానకోట్లున్న సమయములో, ఒక వ్యక్తి పుట్టిన పండుగ కోసము 50 లక్షలు ఖర్చు పెట్టుకొన్నారంటే, ఇంతికంటె మహా పాపము, ఇంత కంటే మహా దుర్వినియోగము మరొకటి ఉండదు ఈ లాంటిదానికి నేను ఏ నాడు కూడనూ పాల్పడను.

ఇంతియే కాదు, ప్రశాంతి నిలయములో జరుగే ఒక శివరాత్రికి గాని, నవరాత్రికి గానీ, మా ప్రశాంతి నిలయము తరపున కొంతవరకు కూడ దుర్వినియోగము ఏ నాడూ జరుగదు. దసరా మహోత్సవములో ఇక్కడ లక్షలు ఖర్చయినాయి అని అనేకులు అనుకోవచ్చు కానీ, అందరు కూడనూ హృదయపూర్వకముగా దేహరీతిగా ఆచరించే పనులు తప్ప, ఒక నయా పైసా కూడ మాకు ఖర్చు లేదు. వచ్చే ఋత్విక్కులు కానీ, ఇచ్చే ఉపన్యాసకులు కానీ, ప్రశాంతి నిలయమునకు కేవలము ప్రేమతో వచ్చినారు. ఇట్లు ఆచరించటము వలన, ఎవరికీ ఏ విధమైన అనుకూలము జరిపే దానిలో, వాటినంతి సేవాదళము వారు, సేవాసమితి వారు, వాలంటీర్లు హృదయపూర్వకముగా తమ దేహములను అర్పితము చేసి పనులు గావించటము తప్ప వారికి నయాపైసా కూడ ఏ మాత్రము ఖర్చు పెట్టటము లేదు. ఈ నాడు మా ప్రశాంతి నిలయములో ఇంత పరిశుద్ధ ప్రదేశముగా మీరు అనుభవిస్తున్నారంటే దీనికి యెవరు కారణము, యెంత మంది స్వీపర్లను పెట్టినాము? యెంత మంది కూలీలను పెట్టినాము? యే మాత్రమూ లేదు. యెవరెవరు వారి వారి స్థానములను ప్రదేశములను వారే పరిశుద్ధ

ప్రాప్తించెను. రామ బాణముచే వాని శాపము విమోచనమాయెను. ఆ వచ్చిన దివ్య స్వరూపము శ్రీరాముని పాదములపై బడి అనేక విధములుగా స్తుతించి, రామాజ్ఞ తీసుకొని స్వధామమునకు తిరిగి వెళ్లెను.

రామచంద్రుడు నేలకూలిన ఆ రాక్షస కళే బరమును భూమిలో పాతిపెట్టి అంత్యక్రియాలు గావించెను. ఈ రామచంద్రుని చర్యలకు దేవతలు కూడా ఆనందబాష్పములు విడిచిరా అన్నట్లు చల్లని వర్షబిందువులు పడెను.

శరభంగుడు

రామచంద్రుడు అక్కడినుండి శరభంగ మహాముని ఆశ్రమమును ప్రవేశించెను. అక్కడ దానికి పూర్వమే రావణుని గురించిన వృత్తాంతములు, సంభాషణలు జరుగుచుండెను, ఆ సమయమునకే సీతా లక్ష్మణ సమేతుడైన రామచంద్రుడు అక్కడ ప్రవేశించగనే ఋషులు సత్యమును గుర్తించిరి.

రాముని దివ్య మంగళ విగ్రహమును చూచి శరభంగుడు ఇది నిజమా లేక కలయా లేక ఒక విధమైన సమాధి స్థితియా అని భ్రమించెను. కొంతసేపటికి సాక్షాత్ రామచంద్రుడే అని గుర్తించి అమితానందముతో ముగ్గురినీ సత్క రించి, ఆదరించి, తమ తపఃఫలము ఈ రీతిగా సాక్షాత్కరించినదని భావించి, "రామా! ఋషి మానస సరోవరములందు సంచరించే రాజ హంసవు. ఆహా నేటికి నా జన్మ ధన్యమయిన ద"ని అనేక విధముల స్తుతించెను.

"రామా! నేనెట్టి సాధనలు యెరుగను. కేవల మొక్క ప్రేమతో మాత్రమె నిన్ను పొందగలిగి తిని. నిన్ను చూచిన ఈ నేత్రములు, మరొక దానిని చూడనొల్లకున్నవి. నీవు ఋషి అభీష్ట ములను నెరవేర్తునని ఆ నాడు మాట యిచ్చి యుంటివి. నీ ప్రతిజ్ఞను నీవు నిలబెట్టుకొమ్ము. నేను ఈ శరీరమును విడచిపెట్టు వంతవరకూ నీవు నా యెదుట నిలచియుండుము. నిన్ను చూచుచూ ఈ కాయమును చాలింతునని, క్షణ ములో క్షితి పేర్చి అందులో చిరునవ్వులు చిం దులు ద్రొక్క చెప్ప వాల్చక సీతారామ లక్ష్మణు లను చూచుచూ కాయమును భస్మమొనరించు కొనెను.

ఈ ప్రకారము శరభంగుడు రామ ప్రేమ రసమును హృదయపూర్వకముగ ఆరగించి రామచంద్రుని ప్రత్యక్ష ఆశీర్వాదములను అందు కొంటూ నీలమేఘచ్ఛాయను తన హృదయ సరో వరమున చేర్చుకొని అదృశ్యములోనే లీనమై పరమపదవిని చేరెను. ఆశ్రమవాసులు గురు వియోగమునకు చింతించిననూ, తరువాత తమ గురువునకు ఇట్టి పవిత్ర స్థితి చేకూరెనని, సాక్షాత్ శ్రీమన్నారాయణుడే సాకార రూపుడై వచ్చి గురు వును తనలో చేర్చుకొనెనని అమితానందముతో రాముని స్తుతించుచూ, తమ జన్మలు సార్థక మయినవని తలంచిరి. జయ, జయ ధ్వనులు సలుపుచూ తమ గురువు కళేబరపు భస్మమును నొసట ధరించిరి.

ఇంతలో ఈ వార్తను విని చెంతనున్న ఆశ్రమ వాసులు పరుగిడి వచ్చి, రామచంద్రుని పాదముల పై బడి, "హే నాథా, శరభంగు డెంతటి ధన్యుడో

కదా, మిగిలిన ఋషులు రాక్షసుల నోటబడి ప్రాణములు విడుచుచుండ, శరభంగుడు పరమాత్మ కంటబడి, కాయమును పరమాత్మకే అంకితము గావించుకొనెను. దేవా! మమ్ము లను రాక్షసుల బారినుండి కాపాడి, మా సాధనకు తపస్సునకూ యెట్టి ఇక్కట్లూ రానీయక అంత్య మున మా తపః ఫలితముగా తమ సాన్నిధ్య మును అనుగ్రహించుమ''ని ప్రార్థించిరి.

## సుతీక్ష్ణుడు

అంతలో సుతీక్ష్ణుడను ముని వచ్చి రామ చంద్రుని పాదములపై బడెను. అతను అగస్త్య మహాముని శిష్యుడు, రామచంద్రుని అమితముగా ప్రేమించినవాడు. ప్రేమ చేతనే పరమాత్మను బడయగలెనను సంకల్పము అతనిలో తీవ్ర ముగా నుండెడిది. అన్య రూపములను అతడు స్వప్నమందైనను వూహించేవాడు కాడు. అతడు రామ ముఖ పద్మమును రెప్ప లార్చక చూచుచూ, ఓ నాథా! నన్ను కటాక్షించుటకే ఇటు వచ్చితివా? నన్ను నీ ప్రేమలో చేర్చు కొనవా? ప్రత్యక్షముగా సాకారుడై కూడనూ, నన్ను నిరాకారారాధనలో వుండమనుట నీకిష్ట మా? ఎట్టి యజ్ఞ యాగాది క్రతువులూ నాకు తెలియవు. నీ ప్రేమ స్వరూపమును పొందగోరు పరితాపమే నా తపస్సుగా భావించి ప్రేమించు చున్నాను, ఇది చాలదా?

ఓ భవమోచనా! శ్రీవారిని ప్రేమతో సేవిం చుటకంటే అధికమగు భజనయొకటి లేదు కదా; నీ గుణగణములను గానము చేయుచూ, చింతిం చుచూ, ఆనందముతో పరవశమగుటకంటే వేరానందమున్నదా, అని మునీశ్వరుడు అనేక విధముల ప్రార్థించుచూ, యెక్కడ వున్నాడో యేమి చేస్తున్నాడో యేమి పలుకుచున్నాడో తెలి యని స్థితిలో అటూ ఇటూ దిక్కు తోచని రీతి పిచ్చివాని వలె కంటి ధారలు కారుచుండగ, సీతా రామలక్ష్మణులను చూచుచూ వుండ, శ్రీరాముడు అతని నిశ్చల భక్తిని కనిపెట్టి చెంత చేర్చి అనేక విధముల ఓదార్చి, ఆలింగనము గావించు కొన, మునీశ్వరుడు తనను తాను మరచి, రామ హస్తములో పరమానందముతో సమాధినిష్ఠు డాయెను.

ముని ఒక బొమ్మ వలె కదలా మెదలక నిలచి పోయెను. కొంత సేపటికి శ్రీరాముడు ఆ మునిని అనేక విధముల మేల్కొలుపగా, ముని ప్రజ్ఞ తెచ్చుకొని రాముల పాదముల పై పడి, సాష్టాంగ నమస్కారము సలిపి హస్తములు జోడించుకొని,

నాథా! మోహమనునట్టి దట్టమగు అరణ్య మును దహించుటకు నీవు పావకుడవు! సజ్జను లను నట్టి పద్మములను వికసింపజేయుటకు నీవు సాక్షాత్ సూర్యుడవు. రాక్షస కుంజరములను సంహరించుటకు నీవు మృగరాజువు. సంసార మనునట్టి పక్షి నెగుర గొట్టుటకు నీవు డేగ వంటి వాడవు. ఓ నాథా! నీ నేత్రములు రాజీవ ములు. నీ దివ్య మంగళ విగ్రహమును చూడ ఈ రెండు నేత్రములు చాలవు. జానకి నయన చకోరములకు నీవు చంద్రుడవు. ఋషుల మానస సరోవరములందు నివసించు రాజహంసవు. సంశయ సర్పములను భక్షించుటకు నీవు గరు త్మంతుడవు. కాష్ఠ వాదము విషాదము, కర్క శము నీ కటాక్షము వలన భస్మమైపోగలవు, అని

ఇంకా అనేక విధముల రామచంద్రుని వర్ణించుచూ, తనివి తీర రాముని దర్శించుచూ కాలము తెలియక కాయమును మరచి కంటి రెప్పలు అర్పక స్తుతించు మునీశ్వరుని చూచి రామచంద్రుడు లేవనెత్తి, సుతీక్ష్ణుడా ! నీవు సకల గుణ సంపన్నుడవు. నీ కేమి కావలెనో కోరుకొమ్ము అనుగ్రహింతును అని పలుక, ముని, ఓ దీన బంధూ ! సీతాలక్ష్మణులతో గూడి ధనుర్ధరుడవై నా హృదయాంతరాళమున సదా నివసించుచుండుము అని ప్రార్థించెను. తథాస్తు అని రాముడు సీతా లక్ష్మణ సమేతుడై మునిని వెంట బెట్టుకొని అగస్త్యుని ఆశ్రమమునకు ప్రయాణమయ్యెను.

## అగస్త్యుడు

కొంత దూరము నడువగనే ఒక నదీ శబ్దము వినబడెను. అంత ఆ నదిని వెతుకుచూ వెళ్లగా ఆ నదికి పై భాగమున ఎత్తైన పర్వతమొకటి కనిపించెను. ఆ రెండింటికీ మధ్యను సుందరమైన పూలతోటలు, వాటి మధ్య కొలను మధ్య నున్న తామర పుష్పము వలే అగస్త్యుని ఆశ్రమమును, చూచిరి. ఆ ఆశ్రమ మెంత మనోహరముగా కనుపించెనో చెప్ప వీలుకాక పోయెను. కొన్ని నిమిషములు దానిని చూచుచూ సీతారామలక్ష్మణులు స్తంభించిపోయిరి. ఆ వాతావరణము వర్ణనాతీతము. జలచరములు, భూచరములు సహజవైరమును విడచి అత్యంత మైత్రితో నివసించెను. సిద్ధులు, మునీశ్వరులు ఆ నదీ తీరమున నిశ్శబ్దముగా తపస్సు ఆచరించుచుండిరి.

ఆశ్రమమును సమీపించగనే, సుతీక్ష్ణుడు ముందుగా ఆశ్రమములోనికి పరుగెత్తి గురువు పాదములపై పడి నమస్కరించి ఓ దయాళూ ! అయోధ్యాపతి కొమారుడు, ఆ జగదాధారుడు, సీతాలక్ష్మణ సమేతుడై మన ఆశ్రమమును ప్రవేశించినాడు; మీరు దివారాత్రములు ఎవరిని ధ్యానించుచున్నారో, వారే ప్రత్యక్ష్యముగా మీ చెంతకు వచ్చుచున్నారు. ఆహా ! ఎంతటి సుదినము, యెంతటి భాగ్యము, అని మైమరచి సుతీక్ష్ణుడు ఉప్పొంగిపోయెను.

అంత అగస్త్యుడు దిగ్గున లేచి వెతక బోయిన తీగ కాలికే చుట్టుకున్నట్లు తనలో భావించి, వేగముగా వెలుపలికి నడచెను. ఎదురుగా వచ్చుచున్న సీతారామలక్ష్మణులను చూచి అగస్త్యుడు కంటిధారలు కార్చుచూ, నాథా నాథా! అని పరుగెత్తుక వెళ్లి రాములను గాఢముగా కౌగిలించుకొనెను. అట్లే కొన్ని క్షణములు వృక్షమునకు అల్లుకొనిన లత వలె నిలిచిపోయినాడు.

(సశేషము)

# ఇంటర్ వ్యూ

ఎక్కడ బాబా ఉంటె, అక్కడ జనము తండోప తండములుగా యింటర్‌వ్యూలకొరకు కాచుకొని ఉంటారు. చాలా మంది తమ గ్రామములు వదలక ముందే, అనేక గొప్పవారితో జరిగినట్లుగా, యీ యింటర్‌వ్యూలు ఎప్పుడు, ఎక్కడ, ఎంత సేపు లభించునో తెలుసుకొన కోరుతారు. అక్కడ గుమికూడి కూర్చొనిన జనసమూహమునుండి బాబా ప్రత్యేకముగా సంభాషించుటకు ఎన్నిక చేసుకుంటారు. అటువంటివారితో బాబా అనుగ్రహపూర్వకముగా సంభాషించుటకు యింటర్‌వ్యూ అని యిక్కడ అర్థము చెప్పకోవాలి.

ఒక సారి బాబా ఒక భక్తుని, "నీవు ఇంటర్‌వ్యూ అంటే సరియైన అర్థము తెలిసికొనినావా?" అని అడిగినాడు. కొంత తికమకపడి, ఆ భక్తుడు, "నేను చాలా కాలముగా యింటర్‌వ్యూకొరకు కాచుకొని ఉన్నాను; ఇంతవరకది లభించలేదు. అంతవరకే దాని అర్థము తెలియును" అని చెప్పినాడు. "అహా! అలాగా!" అని బాబా ఆ భక్తుని దయనీయ స్థితికి ఆశ్చర్యపడినట్లు నటించినాడు. తిరిగి, బాబా ఆతనితో "నిత్యము నీకు యింటర్‌వ్యూ అనుగ్రహించుచున్న సంగతి తెలియదా? నీవే నాకు యింటర్‌వ్యూ యివ్వటము లేదు" అని చెప్పినాడు.

ఈ పలుకులు విని భక్తుడు దిగ్భ్రాంతి చెందినాడు; పాపమతని నోటినుండి మాటపెగిలి రాలేదు. "ఇంటర్‌వ్యూ అంటే అసలు అర్థము తెలిసికొనినావా?" అని తిరిగి బాబా ప్రశ్నించినాడు. "నీవెంతో కాలముగా యింటర్‌వ్యూకొరకు వేచి ఉన్నట్లు చెప్పచున్నావు కానీ, నేనెంతో ఓర్పుతో, ఎంతో ఆశతో, శతాబ్దాలుగా నీవు నాకు ఇంటర్‌వ్యూ యిచ్చెదవేమో అని వేచి ఉన్నాను. ఇంటర్‌వ్యూయొక్క అసలు అర్థము ఎంటర్-ఇన్ వ్యూ [దృష్టిపథకములోనికి వచ్చుట] అని. అది నీవు బాహ్యములో తిరుగుచున్నప్పుడు కాక, నీ ఆంతర్యము లోనికి చూచినప్పుడు లభించే దృష్టి. నీవు నన్ను నీయందే చూడగలిగినప్పుడు, నన్ను బాహ్యములో కూడ నీవు తప్పక చూడగలవు." అని బాబా చెప్పినాడు.

శివపండిట్

# శిక్షకులకు శిక్షణ

చాలా దేశములలో విద్యాసంస్థలు తమ కర్తవ్య నిర్వహణలో విఫలమైనవి. సుప్రసిద్ధ అమెరికా గ్రంథకర్త ఆల్విన్ టోఫ్లర్ తమ దేశపు విద్యావిధానాన్ని తన గ్రంథములో నిశితంగా విమర్శించినాడు. ఇవాన్ ఇల్లిచ్ అను మెక్సికో దేశ గ్రంథకర్త తన దేశమును గురించి విమర్శించినాడు. పీలో ఫెయిరీ అనే గ్రంథకర్త కూడ యీ భావమునే వెల్లడించినాడు; వర్ధమాన దేశములలో, దళితవర్గములవారికి విద్య నొక విధముగా వారి నోరు మూయునట్టి పెద్ద ఆయుధముగా ప్రయోగించుచున్నారని చెప్పినాడు. మన దేశములో కూడా విద్యావిధానము మన ఆశలన్నిటిని వమ్ము చేసినట్లుగా ఎందరో పరిశోధకులు ప్రకటించినారు.

ఈ పరిస్థితులకు, ఉపాధ్యాయులు, రాజకీయవేత్తలు సాంఘిక ప్రణాళికావేత్తలు, విద్యార్థులు, పరస్పరము దూషించుకొనుచున్నారు. బీద తల్లిదండ్రులు ధనవంతులే ఉన్న అవకాశములన్నింటిని కాజేస్తున్నారని, విద్యాస్థాయి తగ్గుదలకు బీదవారే కారణమని ధనవంతులు, పరస్పరము నిందించుకొనుచున్నారు. నేటి ఉపాధ్యాయులు, విద్యార్థులు కలిసి రాజకీయపు ఎత్తులైన నినాదములు, సమ్మెలు, ఘేరావోలు, మొదలగు ఎత్తుపై ఎత్తులు నేర్చుకొనినారు. పెద్దలు, ఆధ్యాత్మికచింతన ఉన్నవారు, భారతదేశ వారసత్వమందు గౌరవభావమున్నవారు, విద్యా విధానములో ధార్మిక విషయ బోధను తొలగించి, వలసతత్వముతో కూడిన పాశ్చాత్య విద్యావిధానమును నేటి పాలకులు మనపై రుద్దుచున్నారని, వాపోతున్నారు. ఇంక ప్రతివారు ప్రజల బీదరికమే యిందుకు కారణమని ప్రచారము! సారాంశములో, కారణములను గుర్తించే బాధ్యతను లోపములను సవరించే కర్తవ్యమును విస్మరించుచున్నారు.

ఈలోగా విద్యావిధాన వైఫల్యమునకు ప్రధాన కారణమేదో, అది అట్లాగే ఉన్నది. సాంఘికశాస్త్రవేత్తలు, వ్యక్తికి సంఘమునకు గల సంబంధమును వీరిద్దరికీ విద్యతో గల సంబంధమును గురించి వివరించలేకుండుటే ఇందుకు కారణము. విద్య దానికదే స్వతంత్రముగా నిలబడగల విషయము కాదు; అది వేదాంతము, సాంఘిక శాస్త్రము, మనోవిజ్ఞాన శాస్త్రములందు ప్రధానముగా ఉన్న భావముల మీదనే ఆధారపడినది.

అన్ని కాలములకు ఆది గురువైన భగవాన్ బాబా వారి దివ్యోపదేశములు పఠించిన తరువాత నేను తెలిసికొనినది నా కెంతో ఆశ్చర్యము సంభ్రమము కలిగించినది. సాంఘిక శాస్త్రవేత్తలమైన మేము, సంఘముయొక్క వాస్తవ స్వభావమును గురించి తెలుసుకొనుటలో, ఎంతో అజ్ఞానములో గందరగోళస్థితిలో ఉన్నామని గ్రహించినాము. ఈ లోపమే, విద్యా వ్యవస్థలలో, సాంఘిక వ్యవస్థలలో, తీసుకొనిన నిర్ణయములందలి పొరపాట్లకు, ప్రధానకారణము.

చాలా కాలమునుండి, తల్లిదండ్రులయొక్క, ఉపాధ్యాయులయొక్క దృష్టిలో యీ చిన్న విద్యార్థి ఒక

భూతమో లేక దయ్యమో ! వాడొక పెద్ద సంకటముగా వారికి తయారైనాడు. వానిని సరియైన దారికి తేవలెనన్ని, వాని తెలివితేటలు పరీక్షించాలని తీసుకొనిన చర్యలన్నీ దీనిని వ్యక్తము చేస్తున్నవి. కానీ, యీ భావము పూర్తిగా తప్పు అని బాబా తిరస్కరించినారు. "మీరందరు అశాంతి అసత్యములకు కేంద్రము కాదు. మీరు మూర్తీభవించిన శాంతము; మీ రక్తము ప్రేమపూరితము; ఆనందమే మీ స్వభావము. దీనిని వాస్తమని గ్రహించండి" అని ప్రకటించినారు. "మానవుడు దివ్యాత్మ స్వరూపుడని తెలుసుకొనండి; అతడొక పవిత్ర కార్యముకొరకు జన్మించినాడు. తన జన్మ హక్కు అయిన శాంతిని యిప్పుడే, యిక్కడే సంపాదించుకొనవలెను" అని బాబా బోధించినారు.

నేటి సాంఘిక శాస్త్ర వేత్తలు, ప్రస్తుత అశాంతికి అనేక సిద్ధాంతములను ప్రతిపాదించినారు; ప్రతిపాదించుచున్నారు. దీనికంతకు వర్గసంఘర్షణ మూలమని కారల్ మార్క్స్ అభిప్రాయపడినాడు. కాని, యీ సిద్ధాంతములన్నీ వర్గసంఘర్షణలను గోరంతలు కొండంతలు చేయుటమీద ఆధారపడి ఉన్నవని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

ఈ సిద్ధాంతముల ప్రకారము ప్రపంచమునకు భగవంతునితో ఎటువంటి ప్రమేయము లేదు. ఇదే అశాంతికి, హింసకు, ఉద్రేకములకు, తదితర సాంఘిక అనైక్యతలకు మూలము ఈ సంఘర్షణలనుండి, ఉద్రేకముల నుండి భోగ లాలసత్వముతో కూడిన జీవితమునకు అలవాటు పడినాము. ఈ వమ కారములు మనల నే దిక్కుగా యీడ్చుకొని పోవునో ?

ఈ ప్రశ్నకు శ్రీ బాబా చాలా ఘాటైన జవాబు చెప్పినారు. ఢిల్లీలోని జాతీయ విద్యా పరిశోధన కేంద్రమునకు సంబంధించిన డా॥ గోయల్‌తో, "నేను నిన్ను కొన్ని సంవత్సరములు మార్క్సిస్టుగా, వారి తర్కమును, ప్రబోధ ప్రచారములను అవగాహనజేసి కొనుటకుగాను, చేసినాను. కానీ, యివి అన్నీ మానవ స్వభావమును గురించిన వారి అజ్ఞానమును ప్రకటించ లేదా? ఈ భావములను కలిగి ఉన్నంతవరకు ఎవ్వరూ వాస్తవములో ఆనందముగా ఉండలేరు" అని బాబా చెప్పినారు. ఈలోగా అనేక రూపములతో సామ్యవాద సిద్ధాంతములను విద్యా విధానములోనికి చొప్పించినారు. దీనికి భగవాన్ సూచించిన నివారణోపాయము స్పష్టముగా ఉన్నది. "సంఘములో దైవత్వమును చూడగలిగి దానివలన ఉత్తేజము పొందుట మానవుని కర్తవ్యము. తనయొక్క శక్తి యుక్తులన్నీ సంఘముయొక్క శ్రేయస్సుకొరకు ఉపయోగించవలెను"; అని బాబా చెప్పినారు. అందరు ఒకే ఆత్మయొక్క అంశములే అను భావమొక్కటే మానవ సౌభ్రాతృత్వమును వాస్తవిక ప్రాతిపదిక మీదికి తేగలదు. భగవంతుడొక్కడే సారథిగా ఉండి, గమ్యమైనప్పుడే, నిజమైన శాంతి ప్రేమ సత్యములు లభించగలవు

కుల, మత, ధన, పాండిత్య అంతస్థులను బట్టి తోటివారిని ద్వేషించవద్దని బాబా బోధించినారు దీనివలన, మనమందరము, ముఖ్యముగా విద్యార్థులు ఉపాధ్యాయులు, సాంఘిక వర్గ విభేదములను మరచి, నిర్మలమైన అహింసాయుతమైన సాంఘిక సంబంధములు, పాఠశాలలలో, కళాశాలలలో, తమ గృహములలో అభివృద్ధి పరచవలెను. అన్ని వాంఛలకు లైంగిక వాంఛ మూలమని, మానవుని చివరి కోరిక మరణమేనని ఫ్రాయిడ్ చెప్పగా, దీనికి పూర్తిగా విరుద్ధముగా, ప్రతి మానవుడు దైవత్వములో ఒక అంశమని, మానవుని ఒకే ఒక కోరిక

ఆ దైవత్వములో లీనమగుటే అని బాబా చెప్పుచున్నారు.

నేడు వ్యక్తులు స్వేచ్ఛగా తమ ప్రవర్తనలను, భావములను, కార్యక్రమములను నిర్ణయించుకొనలేకున్నారు. వానికి తెలియకుండానే సంఘము వానిని చుట్టుముట్టి, వాని ఆలోచనలను నిర్దేశించుచున్నది. ఈ విధముగా వ్యక్తియొక్క ప్రాముఖ్యత తగ్గిపోవుచున్నది. కానీ, దీనికి వ్యతిరేకముగా వ్యక్తియొక్క అంతర్గత ప్రేరణను గురించి బాబా నొక్కి చెప్పుచున్నారు. ధ్యానములో తన అంతర్వాణి ఏమి బోధించుచున్నదో, దానిని శ్రద్ధగా గమనించి, మానవుడు వివేకముతో బాధ్యతతో ప్రవర్తించవలెను. తాను ఇతరుల చేతిలోని పావుగా, దిష్టిబొమ్మగా ఉండుటకు నిరాకరించవలెను. "పరుల అభిరుచుల ననుసరించి ప్రవర్తనను దిద్దుకొనవద్దు. నీ అంతర్వాణి చెప్పు దానిని ధైర్యముగా, నిశ్చలముగా, ఆనందముతో అనుసరించండి" అని బాబా బోధించుచున్నారు.

నేటి సాంఘిక శాస్త్ర మొక విషయము మరిమరి చెప్పుచున్నది: సంఘమంతా ఒకే 'యూనిట్' అని, వ్యక్తి అవసరము సంఘమే నిర్ణయించుచుందని. ఈ భావములే రాజకీయ రంగములో ప్రవేశించినవి. అందుచేత వ్యక్తి తన వ్యక్తిత్వమును కోలుపోయి ఒక మూలకు నెట్టివేయబడినాడు. దీనితో అనేక అసమానతలు, ఘర్షణలు బయలుదేరినవి. "ఈ సాంఘిక రాజకీయ సైన్సు శాస్త్రములకు ఆధ్యాత్మిక శాస్త్రముతో కాని, ఆత్మవిచారణతో కాని ఏమి సంబంధము?" అని బాబా ప్రశ్నించుచున్నారు. మానవు డాత్మవికాసము పొందకుండా, ఏ సంఘమూ పరిపుష్టినొందజాలదు; ఏ ఆదర్శము నెరవేరదు. "వ్యక్తి, ఆతడు విశ్వసించిన ఆత్మసత్యములు మాత్రమే శాశ్వతముగా సాంఘిక సమైక్యతను సమకూర్చగలవు. మిగిలినవన్నీ చాలా పరిమితమై, మార్పులకు చేర్పులకు లోనగునట్టివి" అని బాబా నొక్కి చెప్పుచున్నారు.

ఆధునిక శాస్త్ర విజ్ఞానమునకు ప్రత్యక్షమే ప్రమాణము; ఇది వ్యక్తియొక్క స్వానుభవము మీద ఆధారపడి ఉన్నది. బాబా, వీరందరు అతి ప్రధానముగా భావించే భౌతిక సూత్రములను అధిగమించి, ప్రపంచమునే తికమకపెట్టినారు. ఈ శాస్త్రజ్ఞుల క్రమనిర్ణయమునొక ఊపు ఊపినారు. "నీవు చూచినదానితో పొరపడవద్దు. నీ కన్నులతో చూడలేనివి, వీటికన్న చాలా ముఖ్యమైన వెన్నో ఉన్నవి" అని అన్నారు.

శాంతిని, ఆనందమును, అనుగ్రహమును సంపాదించుకొనవలెనన్న, అహంభావమును పూర్తిగా అణచివేసి నశింపచేయవలెనని బాబావారి దివ్యబోధ. ఈ అహంభావము నణచి వేయుట, విద్యావేత్తల శాస్త్రవేత్తల పరిధికి మించినది అన్ని జీవితరంగములలో వర్గ నీడలు దట్టముగా ఆవరించి, ఈ 'అహం' భావము అమితముగా పెరిగి పోయినది. దీనికి బాబా బోధలే దివ్యౌషధము.

మన సాంప్రదాయములు, ఆధునిక ప్రవర్తనలు పరస్పర విరుద్ధములని కొందరి నిశ్చయమైన అభిప్రాయము. కానీ, యీ అభిప్రాయములోని హేత్వాభాసమును బాబా నిరూపించినారు. మన సాంప్రదాయములు సుఖ సంతోషములతో కూడిన సాంఘిక జీవనమును మన కందించెనట్లు బాబా తెలిపినారు. ఒక విధానము పూర్తిగా విసర్జించి, జాగ్రత్తగా ఆలోచించక, గ్రుడ్డిగా మరొక విధానము ననుకరించుట క్షేమము కాదని చెప్పినారు.

విద్యను గురించి విద్యావిధానములను గురించి మన ఆలోచనలు, భావములు, తప్పుదారి పట్టినట్లు స్పష్టమౌతున్నది. ఎంతో శక్తివంతమైన విద్య అనే ఉపకరణమును, అక్రమపద్ధతిలో ఉపయోగించి నందున, విద్యారంగమంతా అనేక లోపభూయిష్టమైన ప్రయోగములతో, పొరపాట్లతో నిండిపోయినది. కాబట్టి విద్యావేత్తలు తమ దృక్పథమును మార్చుకొనవలసిన సమయ మాసన్నమైనది. వారందరు బాబా యొక్క దివ్యదర్శకత్వము నపేక్షించి, విద్యావిధానమును పూర్తిగా పునర్వ్యవస్థీకరించవలెను.

నేటి విద్యావిధానమును పట్టి పీడించు జబ్బుకు కారణములను బాబా తరచు చక్కగా వివరించుతూ వచ్చినారు; ఈ రోగమును చక్కగా పరీక్షించి, చక్కని ఔషధమును నిర్ణయించి, మన బహువును తగ్గించినారు. ఉపాధ్యాయులలో, విద్యార్థులలో నేడు క్రమశిక్షణ పూర్తిగా నశించినది. సరస్వతీ నిలయములను లక్ష్మీదేవి పాలించుచున్నది. ప్రతిభా వ్యుత్పత్తులకు ఏ మాత్రము ప్రోత్సాహము లేదు. ఐకమత్యమును పోషించే సాంఘిక కార్యక్రమములు కనిపించవు. నిరంకుశులైన నాయకులను గుడ్డిగా అనుకరించుట ఘనతగా భావించుచున్నారు. ఆందోళనలను, ప్రదర్శనలను, ప్రకటనలను హర్షించి ప్రోత్సాహమిచ్చుచున్నారు. విద్యాలయములందు మోసము, అసత్యము, నిర్లజ్జలు సగర్వముగా తిరుగుచున్నవి. సత్ప్రవర్తన, వినయము, శీలములు పాతకాలపు భావములుగా పరిహసించబడుచున్నవి. అసహనమును ధైర్యముగా ఆత్మగౌరవముగా భావించుచున్నారు.

విద్యారంగములో ముఖ్య భాగస్వాములైన తల్లిదండ్రులు ఉపాధ్యాయులు, అధికారులు తరచుగా సమావేశమై పరస్పరము తమ భావములు తెలుపుకొనుటలేదు. పాఠ్యక్రమములో చాలా భాగము కాలమునకు పనికిరానిది. దీనిని తొలగించవలెను, లేక పూర్తిగా సంస్కరించవలెను. మానవునియొక్క మానసికమైన పునాదులకా ధారభూతమైన ప్రాచీన విజ్ఞానమును బోధించుట లేదు. అందుచేత నేటి విద్యార్థి ఎట్టి పునాదులు లేకుండా శూన్యములో తిరుగుచున్నాడు. ముఠా తగాదాలకు, ద్వేషములకు మురికి గుంటలుగా తయారైన నగరములకు పల్లెవాసులు వలస వస్తున్నారు. విద్యావిధాన నిర్ణాయకులందరు పాశ్చాత్య భావములందు గౌరవ భావము కలిగి ఉన్నవారే. చక్కని సాంఘిక వాతావరణములో పెరగవలెనని కానీ, నిర్మాణాత్మక పౌరసత్వము నవగాహన చేసుకొనవలెనని కాని, మన విద్యార్థులు కోరుటలేదు.

బాబా ప్రారంభించిన కళాశాలలలోని కార్యక్రమములు, వారు నిర్వహించుచున్న వేసవి ఆధ్యాత్మిక తరగతులు చూచినవారు, బాబా ఏ విధముగా నూతన విద్యావిధానమునకు రూపకల్పన చేయుచున్నది తెలిసికొనగలరు. ధర్మసంస్థాపనలో విద్యాసంస్కరణలు చాలా ప్రముఖ పాత్ర వహించునని బాబావారి విశ్వాసము. మనలనందరిని, చీకటినిపారద్రోలి ప్రేమ యుగములోనికి మార్గము చూపించు చిన్న దీపములుగా, ఉపయోగించుకొనునట్లు ప్రార్థించెదను.

**డా॥ సత్యపాల్ రుహేలావారి ఉపన్యాసమునుండి**

# శ్రీవారితో సంభాషణ

ప్రశ్న :—స్వామీ ! క్షమించండి. మీరు భక్తుల మధ్య తిరుగుతూ, కొందరిని మాత్రమే ప్రత్యేక సంభాషణలకు పిలిచినప్పుడు, మిగిలిన వారినెందుకు వదలివేస్తున్నారో, గమనించిన వారికి సంభ్రమము కలిగించుచున్నది.

శ్రీవారు :—నిజమే ; మీరు సంభ్రమము చెందటము కూడా సహజమే. బాహ్యము మాత్రమే చూడగలిగిన మీరు, ఎవరు ఆర్తులో, ఎవరు కాదో తెలుసుకొనలేరు.

ప్రశ్న :—వీరిలో కొందరు స్వామి తమను దండించినట్లు భావించుచున్నారు ; వాస్తవమా ?

శ్రీవారు :—కావచ్చు. దుష్ప్రవర్తనకు దండించి వారిలోపములను సరిదిద్దుకొనుమని స్వామి హెచ్చరించుచున్నాడు. బయటకు కఠినముగా కనిపించినా, అంతర్యములో అంతా ప్రేమమయము. ఒక్కొక్కసారి స్వామి చాటుగా మందలించుతారు ; అందుచేత స్వామి అభిప్రాయము తెలుసుకొనే అవకాశము లభించుతుంది నియములు పాటించుటలో స్వామి చాలా ఖచ్చితముగా ఉంటారు. అవతార మెన్నటికి సిద్ధాంతముతో రాజీపడదు. ఈ నిష్ఠురతే చివరకు సాధకునకెంతో ఉపకరించుతుంది.

ప్రశ్న :—నిజమే స్వామి, మీ సాన్నిధ్యములో ఉండేవారిలో లోపములుండ కూడదు.

శ్రీవారు :—స్వామికి 'దగ్గర'గా ఉండే వారి ప్రవర్తన, శ్రద్ధ, విశ్వాసము, ఋజువర్తనము, విధేయత లను బట్టి, ప్రజలు స్వామిని అర్థము చేసుకుంటారు. బాహ్యమునకు 'దూరము'గా ఉన్నవారినంత కఠినముగా మందలించుచున్నట్లు కనిపించదు. కానీ, బాబా వారిని కూడా గమనించుతూ, అనేక విధములుగా మందలించుతుంటారు. ఆయా పరిస్థితులలో నేను గులాబి రేకులంత మృదువుగానూ ఉంటాను, వజ్రమంత కఠినముగానూ ఉంటాను.

ప్రశ్న :—స్వామీ, మీరే కదా మానవుని ప్రేరణ శక్తి. దీనిని నేను పూర్తిగా విశ్వసించుతాను. మరి మానవులు పాపము లే విధముగా చేస్తున్నట్లు,

శ్రీవారు :-నీయందూ, ప్రతివానియందూ ఉపస్థితుడై ఉన్న 'అహం' నేనే. నిన్ను సంకల్పించునట్లు ఆలోచించునట్లు, కర్మలు చేయునట్లు ప్రోత్సాహించు "అహం" నా యొక్క ప్రతిబింబమే. ఎక్కడ ఉన్నా, ఎటువంటిదైనా, నీటిలో సూర్యుడు ప్రతిఫలించుతాడు. సూర్యుడు ప్రతిఫలించిన నీరు వేడెక్కుతుంది. మురికి నీటివంటి మనస్సులో ప్రతిఫలించితే, ఆ వ్యక్తి తామసిక గుణము కలిగి ఉన్నవాడని అంటాము. నిలకడలేని చిరుతరంగాలతో నిండిన మనస్సులో ప్రతిఫలించితే, ఆ వ్యక్తి రాజసిక స్వభావము కలిగిన వాడని అంటాము. నిర్మల నిశ్చల జలము వంటి మనస్సులో ప్రతిఫలించితే, అతడు సత్వగుణములు కలిగినవాడని అర్థము.

ప్రశ్న :—స్వామీ, చాలామంది ఉపదేశికులు, "అంతా భగవంతుని లీల ; నీదేమీ లేదు" అని బోధించుతారు. కాని, ఎవడు చేసిన దాని ఫలిత మతడే అనుభవించక తప్పదనే భావమంతటా ఉన్నది.

శ్రీవారు :—నీవు మానవుడనే భావము కలిగి ఉన్నంత వరకు, యీ భావము నిన్ను విడువ కుండా ఉంటుంది. కానీ, "నీవే దైవస్వరూపుడవు" అనే సత్యము ని భావమును మార్చలేదు.

ప్రశ్న :—మేము మానవులుగా ఉండ సంకల్పించము ; భగవంతునిగా కూడా.

శ్రీవారు :—మీరు సంకల్పించరు, సరే. ఇది కొంత కలవర పాటు మాత్రమే. ఇది భ్రమ. ప్రస్తుతము నీ యందు పంచ చైతన్య దశలున్నవి : పూర్తి అచేతన స్థితి, అంతర చెతన స్థితి, చేతన స్థితి, ఉత్తమ చేతన స్థితి, దివ్య చైతన్య స్థితి. నీ ఒక స్థితిలో నుండి మరొక స్థితిలోనికి అవరోహించుచున్నప్పుడు, నీవు మానవ మాత్రుడవనే భావము దానికదే మాయ మౌతుంది. భగవద్గీత ప్రారంభములో కర్మ చేయుమని బోధించుతుంది. తరువాత ఆ కర్మఫల సన్యాసమును గూర్చి బోధించుతుంది. ఆ తరువాత ధర్మ మొక్కటే నీ కర్తవ్యమని బోధించుతుంది ; ధర్మమునకు మోక్షమని వ్యాఖ్యానించి, చివరకు "మోక్ష సన్యాసము" ను ప్రబోధించుతుంది. "మామేకం శరణంవ్రజ" అనునదే గీత బోధించు ఆఖరి పాఠము. నీవు మానవుడవుగా ఉండ సంకల్పించలేదు, కానీ ఆ విధముగా నమ్మినట్లు తప్పు త్రోవ పట్టించినది.

ప్రశ్న :—ఇంచు మించు వ్యక్తి గతమైన ప్రశ్న అడుగుతున్నందుకు క్షమించాలి. స్వామికి చాలా మనోవృత్తులున్నవని మా కనిపించుచున్నది ; దీనికి అర్థమేమిటి ?

శ్రీవారు :—ఏ విధమైన ప్రశ్న నాకు బాధ కలిగించదు. మీ కేవిధమైన సందేహములుండరాదని నా కోరిక. స్వామి నిరంతరము ఆనంద స్వరూపుడని గుర్తించుకొనండి, అతడు మూర్తీభవించిన పరమానందము, ఎటువంటి వ్యవహారములు కానీ, వ్యాకులములు కానీ ఈ పరమానందము నేమీ చేయలేవు.

ప్రశ్న :—స్వామి తరచుగా 'అవును, అవును, అవును' అని అంటూ ఉంటారు.

శ్రీవారు : —మీ కిష్టమైనదానికి 'అవును' అని ఇష్టము లేనివానికి 'కాదు' అని పలుకుట మీ నైజము. స్వామి ప్రతి దానికి 'అవును, అవును అవును' అంటారు. కారణము ప్రతిదీ నాపనమే కదా. నా దృష్టిలో ఉన్న విషయములో, ఆ వ్యక్తికి, ఆ సమయములో, అంతా మంచిగానే ఉంటుంది.

ప్రశ్న :—స్వామీ. మీరు స్వీకరించిన కార్యభారమును బట్టి, మీరెల్లప్పుడు పరమానందములో ఉండుట ఆశ్చర్యము కలిగించుతున్నది.

శ్రీవారు :—నదిలో పడవ తేలుతూ పోతుంది కాని, నీటిని తనలోనికి రానివ్వదు. ఎప్పుడూ పెరిగే బరువు బాధ్యతలు స్వామి బుజముల మీద మాత్రమే ఉన్నవి—కోట్ల మానవుల సుఖదుఃఖములు, సలహా సంప్రదింపుల కొరకు వచ్చే లక్షలాది ప్రజలు, సంస్థలు, సంభాషణలు, ప్రార్థనలు, విన్నపములు, ఎన్నో. భగవంతుని వాంఛించు ప్రతివారి వెంట, మీకు తెలియని మానసిక స్థాయిలో, ఈ విపుల ప్రపంచములో వారెక్కడ ఉన్నా, తప్పక వారితో ఉంటాను.

సాధకులు, యోగులు, మహాత్ము లెక్కడ ఉన్న ప్పటికి, వారిని గమనించుతూ, సలహాలిస్తూ, భగవంతుని చేర్చు ప్రతి లక్షణమును ప్రోత్సాహించుతూ ఉంటాను. కాబట్టి నా యందున్న ఆనంద భావము స్థిరమైనది. నేను కోపముగా ఉన్నట్లు, ఓరిమి కోలు పోయినట్లు, తొలగి ఉన్నట్లు కనిపించినప్పటికి, బాహ్యముగా కూడా. నా యీ ఆనందము అచంచల మైనదని గుర్తించవచ్చును. ఏదో ఒక పరిస్థితిని చక్క బెట్టుటకు కోపము నటించుతాను; ఆయా స్థలము లందు, సమయములందు దూరముగా ఉన్నట్లు కని పించుతాను. నా ఆనందమెంత అచంచలమైనదో, నా ప్రేమ కూడా అంతే.

ప్రశ్న :—మునులు, యోగులు, మహాత్ముల వంటి వారు కూడా, మీ సలహా కొరకు ప్రార్థించుట అంటే యాచించటమే కదా ? మేము దేవతలమయి నప్పుడు, మమ్ము మేమే యాచించుతాము.

శ్రీవారు :—భగవంతుని దగ్గరనుండి ఏదేని కోరితే, దానిని యాచన అనరు. వారు మీకిచ్చినది స్వీక రించినప్పుడైనా, వారి స్థాయికి మీరు లేవవలెను. నీ తోటివాని వద్ద యాచించితే, నిన్ను నీవు తక్కువ పరచుకొని, అతనిని గొప్పగా భావించుట జరుగుతుంది. నీ కన్న తక్కువ వానినుండి యాచించితివా, నిన్ను నీవు చాలా హీనపరచుకొనినట్లే. కానీ, భగవంతుని యాచించుటలో, నీవు ఉత్తమ స్థితిని పొంది, ఆత్మ భావములో నీవు వృద్ధిని చెందినట్లే.

ప్రశ్న :—కానీ, భగవంతుడు సర్వజ్ఞుడు కాబట్టి, ఏ పరిస్థితినైనా సరిదిద్దుటకు తగినదని భావించిన దానికి తగినట్లుగానే సరిదిద్దునని నా భావము.

శ్రీవారు :—తప్పకుండా సరిదిద్దుతాడు. కానీ ఎట్టి మినహాయింపులు లేకుండా నీవు భగవంతునికి శరణుజొచ్చినప్పుడే; అప్పటివరకు....

ప్రశ్న :—నిజమే ; స్వామి ఒక ఉత్తరములో, "నీ ఆరోగ్యమును గురించి వ్యాకుల పడవద్దు. నీ దేవుడు, నీ వెంట, జంట, యింటనే ఉన్నాడు" అని నాకు వ్రాసినారు.

శ్రీవారు :—అదే సరైన విధానము. శరణాగతు లకు నే నొక సారి చెప్పినది చాలు. శరీరముతోటి అవినాభావమును తగ్గించుకొనవలెను. నేడు తలనొప్పి, రేపు కడుపునొప్పి; ఏమీ చింతించవద్దు. నీవు శరీ రము కావు, ఆత్మవు. ఈ శరీరమందుండే దివ్యు డవు. ఒక సారి మీరు విచార పడవద్దని నేను చెప్పిన తరువాత, దానిని గురించి మీరు తిరిగి అడగవలసిన పని లేదు. శరీరముతో గుర్తింపు వద్దు.

ప్రశ్న :—భగవంతుని ప్రార్థించు సమయములో, ప్రార్థించువాడు భగవంతుని స్థాయికి లేవగలడని చెప్పి నారు. అటువంటి ప్రార్థన గావించవలెనన్న మనస్సే స్థితిలో ఉండవలెను ?

శ్రీవారు :—ఏ ఒక్క ప్రత్యేకమైన ధ్యానస్థితి యందు మనస్సు నుంచవలసిన పని లేదు.

ప్రశ్న:—ప్రార్థించ తలచినప్పుడు, ఒక ప్రశాంత ప్రదేశమునకు వెళ్లవలెనని, ప్రశాంత మనస్సు కలిగి ఉండవలెనని మామూలుగా అంటూ ఉంటారు.

శ్రీవారు: —ఎక్కడ ఎప్పుడు భగవంతుని ధ్యానించ తలచినావో, అదే సరియైన స్థితి. కాలిఫోర్నియాలో నీవుండి, మధ్యాహ్నము ఒంటి గంట సమయ ములో, నేను భారత దేశములో ఆ సమయమందు నిద్ర పోతుంటానని, నా విశ్రాంతికి భంగము కలిగిం

చరాదని, అది అనుకూలమైన సమయము కాదని భా వించవచ్చును. ఆ విధముగా ఒకటి రెండు సార్లు నీవు భావించినట్లు నాకు తెలుసు నేను సర్వాంతర్యామిని. నా హద్దులు పరిమితములు కావు. నే నెప్పుడూ నిద్రించను. రాత్రి వేళ దీపము తీసివేసి మంచము మీద ఊరికే పండుకుంటాను దీపము కనిపించితే భక్తులు చేరుతారు. నాకు నిద్రతో అవసరము లేదు. కానీ, మీ అందరికి కనీసము 4, 5 గంటల నిద్ర అవసరము.

ప్రశ్న :—వీధుల వెంట వెళ్లేటప్పుడె తో పంది అటూ యిటూ తిరుగుతుంటారు; నా పనులను గురించి నేను ఆలోచించుతుంటాను. అటువంటి సమయము సరైనదేనా ?

శ్రీవారు :—ప్రారంభములో మనస్సును పరి శుద్ధము చేసికొనుటకు కొన్ని ప్రత్యేక పరిస్థితులు కావలసి రావచ్చును. కానీ, సర్వత్రా భగవంతు డున్నాడని తెలిసికొనిన తరువాత, నీవెక్కడ ఉన్నా ఒక్కటే. ప్రార్థన మనస్సులోనుండి బయలుదేరి భగవంతుని చేరుతుంది

ప్రశ్న :—స్వామీ! ధ్యానములో రూపభావమును వదలివేయుటకు ప్రయత్నించుమని చెప్పినారు. కానీ, మేము మీ రూపమునే ధ్యానించుట మా ఇష్టము. మేమా స్వరూపమునే ప్రార్థించుతాము.

శ్రీవారు :—అది మంచిదే. కానీ, తరువాత, రూప రాహిత్య స్థితిని పొందగలిగినప్పుడు, మీరింకా చేరు వకు రాగలరు. ఇప్పుడు మీరు నన్ను నేరుగా చూస్తున్నారు

ప్రశ్న :—స్వామీ ! కృష్ణుని మరణ వార్త విని అనేకమంది గోపికలు ఆ ఆఘాతమునకు తట్టుకొనలేక మరణించినారట. దీనిని బట్టి వారికి కృష్ణునితో గల సంబంధము రూపముతోనున్నట్లగపించుచున్నది కాదా ?

శ్రీవారు :—కాదు. గోపికలకు రెండు సంబంధ ములున్నవి. చాలా కాలము, చాలా సన్నిహితు లుగా ఉన్నవారగుటచేత, భౌతిక రూపముతో గట్టి సంబంధము కలిగి ఉన్నారు. కానీ, వారందరు శ్రీ కృష్ణుడే తమ అంతర్గత సత్య స్వరూపమని తమ మనస్సులందు తెలిసికొనినారు. లౌకిక కార్యములకు శారీరకముగా దూరమైనప్పటికి శ్రీ కృష్ణుడు వారితో నే ఉన్నట్లు వారి దృఢ విశ్వాసము.

ప్రశ్న :—శ్రీ కృష్ణుడంత గాఢముగా వారి మనస్సులందే ఉన్నట్లు భావముండగా, వారికెందు కా ఆఘాతము కలిగినది ?

శ్రీవారు :—శ్రీ కృష్ణుడు కూడ భౌతిక రూప ముతో ఉన్నందున, శారీరకముగా కొంత విలువ నుంచుటకు కారణమైనది; అంతవరకే. కృష్ణ నిర్యా ణానంతరము వారికి ప్రపంచముతోనే పనిలేదు.

ప్రశ్న :—ఆఖరి ప్రశ్న స్వామి! మీరు త్వర లోనే మా దేశమునకు వేంచేస్తారా ? అమెరికా దేశ వాసులుగా ప్రార్థించుచున్నాము.

శ్రీవారు :—అమెరికాలో సుస్థిరమైన పునాదులు ఏర్పడవలెను; అంతవరకు ఆగవలసి ఉంటుంది. అయినప్పటికి ఒక్క అమెరికాకే కాక, ఏ దేశము నకైనా, ఏ సమయమందైనా, అప్రకటితముగా నేను వెళ్లగలను. భక్తులు పిలువలెనే కాని, నేను తక్షణమే అక్కడ ప్రత్యక్షమౌతాను.

**జాన్ హిస్లాప్ నోటు పుస్తకమునుండి.**

# ఈ త్రృణసమానుడు

విశ్వాసమనే వస్త్రములో చాలా దారములున్నవి. నా దారమునకొక విపరీతముగా కనిపించే లక్షణము న్నది. నేను బాబా భక్తుడనే కాని, పూజలు భజనలు మొదలగువాటిలో అంతగా నమ్మకము లేనివాడను.

నేను చేసేది బ్యాంకి ఉద్యోగము. చాలా తక్కువ జీతముతో, తక్కువ స్థాయిలో ప్రారంభించినాను. పెద్ద జీతములే హోదాకు చిహ్నములనే వాతావరణ మది. చాలా కష్టముతో పని చేయవలసి వచ్చి నది. ఆ దినములలో భగవద్గీతా సందేశమే నన్ను నిలవ త్రొక్కుకొనునట్లు చేసినది.

కుటుంబ జీవితములో, సంఘజీవితములో, ఎన్నో బాధలనుభవించినాను. మామూలు కన్నా హెచ్చుగా కుటుంబ బాధలు అనుభవించినాను. మానవ సంబంధ ములలోని వైరుధ్యములు, ఆఘాతములు కూడా హె చ్చుగా అనుభవించినాను. చెప్పేదానికి, చేసేదానికి గల వ్యత్యాసము నాకు కనువిప్పు కలిగించినది. బాహ్యములో భక్తులుగా నటించేవారు ప్రచారము గావించే విగ్రహారాధనను నేను నిరాకరించినాను. ఇతర పూజా విధానములు కూడా, వాటిని ప్రచారము గావించే వారి ప్రవర్తనతో సంబంధము లేనందున, నాకు సమ్మతములు కాకుండెను

శీలములోని నిర్మలత్వమే నిజమైన మతమని భావించినాను. వేదాంత శాస్త్రాధ్యయనమునందు నాకు గల ఉత్సాహము కూడ, నేను కోరిన సమభావము నాకివ్వలేకపోయినది. నా నీతి నియమములు నాలో అసహనమును పెంచి నా ప్రవర్తనలో అనేక పొరపాట్లకు కారణమైనవి.

1948లో, కుటుంబములో సంభవించిన విపత్తులు నన్ను పూర్తిగా వివశుని గావించి, ఎంతగానో నిరా శకు కారణమైనవి. నే నంతవరకు చదివిన ధార్మిక గ్రంథము లేవీ నా కా సందర్భములో తృప్తియైన మార్గము చూపించలేక పోయినవి. నా నైతిక విశ్వా సములను బలపరచుకొనుట కాధారము దొరకలేదు.

1961 లో, అటు కుటుంబములో, ఇటు ఉద్యోగ ములో ఎన్నో వడి దుడుకులు అనుభవించినాను. ఒక వృద్ధ బంధువు శ్రీ సత్యసాయి బాబావారి ఉప దేశములు, జీవిత చరిత్రను చదువుమని ప్రోత్సా హించినాడు. ఆ గ్రంథములు నా మనస్సు మీద గాఢముగా పని చేసినవి. ఈ సృష్టియొక్క పర మావధిని గురించిన నా పొరపాటు అంచనాలు నాకు కనిపించినవి.

1964 లో, నన్నొక దక్షిణ కేంద్రమునకు బదిలీ చేసినారు. అప్పుడే బాబా దర్శనము కోరి పుట్టపర్తికి వెళ్ల గలిగినాను. నేనక్కడకు వెళ్లుట అంత కు ముందే నిర్ధారణ గావించబడినది! శ్రీ బాబాతో యింటర్వ్యూ జరిగినప్పుడుకాని నా కీ విషయము అవగతము కాలేదు.

బాబాయొక్క నిశితమైన దృష్టి, భావస్ఫోరకమైన సంభాషణ నా మనస్సులో అంతరాంతరములందు భద్రముగా దాగి ఉన్న భావములు ప్రకటింప చేయుటలో నాయందు చూపించిన అనుగ్రహము, నా ఉద్యోగ విషయములు, వ్యక్తిగతమైన అనుభవములు, వాటిలోని సాధక బాధకములు, ఏదో ఒక ప్రధాన కారణమువలననే ఆయా సమయములందు జరిగినట్లు బోధించినది.

ఆ సంభాషణానుగ్రహముతో, నా వ్యక్తిత్వము నా వృత్తి ఒక నూతన రూపములో గోచరించినవి. అవి వెనుకటికన్న దృఢమైన పునాదుల మీద నున్నట్లు తెలిసినది. అప్పటివరకు అస్పష్టముగా ఉన్న ధార్మిక విషయములు బాబా ఉపదేశముతో సుస్పష్టమైనవి. పరమోపదేశకుడు నాయందు చేరి, ఉపదేశములతో, ఉత్తేజము కలిగించుతూ, ఉన్నత పథాలకు గొనిపోవు కార్యక్రమమును ప్రారంభించినాడు నిరంతర మాతడు నన్ను కాచి రక్షించుచున్న భావమొకటి స్థిరపడినది. నాటినుండి బాబా నా నిత్య జీవన సారథ్యమును స్వీకరించినారు నా అంతర్దృష్టిని దృఢ పరచు కొనుటకు ప్రోత్సాహము లభించినవి. నా భావములలో నా చేతలలో ఎన్నో లోపములు కనిపించ సాగినవి. ఉద్యోగములోని ఉన్నతి, వేతనములోని వృద్ధి నాకిప్పుడు ప్రత్యేక ప్రాముఖ్యము కలిగించుట మానివేసినవి. వాటి విలువలు యాదృచ్ఛికములై లోతు లేనివి మాత్రమే.

నా లోపములు సరిదిద్దుకొనవలెననే అర్తి తీవ్రమైనది. అనవసర దోషారోపణ చేసే లక్షణము మంచితనముగా మారినది. కొన్ని సంవత్సరాలుగా ఒక ప్రశ్న నా మనస్సులో వేధించసాగినది.— " నే నెవ్వరు? ఈ కార్యకారణ విశ్వములో నా కర్తవ్య మేమిటి? " శ్రీ బాబాతో కలిగిన సంబంధమువలన బలపడిన విశ్వాసము నాకు సార్థకమైన మార్గమును సంపాదించి పెట్టినది. ఆధ్యాత్మిక రంగములో నేనింకా ప్రారంభదశలోనే ఉన్నాను. అయినా నా భావములు మీకు చెప్పనివ్వండి నా వరకు బాబా ఒక అప్రత్యక్షమైన మహాశక్తికి ప్రతిరూపము; ఇంతవరకే నా కర్థమయినది. ప్రతిక్షణము నా భావములను, చర్యలను ఎంతో శ్రద్ధగా చక్కదిద్దుతున్నాడనే నిరంతర విశ్వాసమే బాబాయందు నాకున్న భక్తికి ప్రధానాధారము. నాకు తెలిసినంతవరకు భజన ఒక సాంప్రదాయకమైన కర్మకాండ కాదు. అది నిశ్చలమైన, నిరంతరమైన ఆత్మవిచారణతో కూడుకొనిన ధ్యానము.

ఇప్పుడు జరుగుచున్న మనోవికాస విధానములో ఉచ్చనీచములు లేవు సాధనయందలి ప్రతి ఒక్క భాగమున కొక సార్థక్యత కలిగించ బడినది. ఈ జీవితముయొక్క పరమావధిని గురించిన నా పూర్వ అస్పష్ట భావములన్నీ యిప్పుడు బాబా అనుగ్రహ రసాయనముతో, ఒకే ఒక ప్రజ్ఞాన భావములో, సాఫల్యమును పొందినవి.

సాగు చేయుచున్న యీ విశాల ఆధ్యాత్మిక క్షేత్రములో, నేనొక అల్పమైన తృణసమానుడనని నాకు తెలుసు. కానీ, యీ తృణము కూడ ఒకరికంటె నందివ్వవలెనని వినయముతో ప్రయత్నించుచున్నది. మాటలలో కాక, మౌనములోనే అప్రత్యక్షస్వరూపుడైన, మహామహిమోపేతుడైన శ్రీ బాబాకు ప్రణమిల్లి, నా భావమును ఉత్తమ విధములో ప్రకటించగలను. బాబా అనంత కరుణామయుడు; అత్యంత విశ్వసనీయ దర్శకుడు. నా యీ మానసిక విశ్వాసాభివృద్ధిని గురించిన కథ వినిపించినందుకు సాధకులు నను మన్నించ కోరెదను. ప్రతిక్షణము, ప్రతి అడుగులో, బాబా అనుగ్రహము నాకు లభించుచునే ఉన్నది.

కె బి. శంకరరావు బొంబాయి.

# భవిష్యద్వాణి

ఈ దేశపు యువకులు ప్రతిచోటా క్రీస్తు, జీసస్, భగవంతుడు, రక్షకుడు, సత్యము, మొదలగువారిని ఎంతో ఆర్తితో ఆహ్వానము చేస్తున్నారు. అనేక సమాజములవారు క్రీస్తు తిరిగి వచ్చునని, లేక అవతరించునని బోధించుచున్నారు. వారిలో చాలా మందికి ఆతడేవిధముగా తిరిగి రాగలడనే దానిపై కచ్చితమైన భావములున్నవి. వెనుకటి రూపములోనే తిరిగి రాగలడనే అభిప్రాయము కూడా ఉన్నది. అటువంటి అభిప్రాయము కలిగి ఉన్నవారు, ఆ జీసస్ గత 48 సంవత్సరములనుండి మన మధ్యనే ఉన్నాడను సంభావ్యతను అంగీకరించుట చాలా కష్టము.

చెప్పుకో తగ్గ ఏ మతమూ పాటించనివారు, భగవంతునియందు వాస్తవమైన విశ్వాసము లేనివారు, బాబా ఆగమనమును గురించి అంగీకరించే అవకాశమున్నది. ఈ విశ్వాస అవిశ్వాస భావతరంగములు చూచుటకు చాలా ఆసక్తిదాయకములుగా ఉంటవి. వాస్తవములో, ఎన్నడో చెప్పిన విషయము ఈనాడు సంభవించుట చూచుచున్నాము. ఈ మధ్య అమెరికా దేశములో, ఈ భవిష్యద్వాణిని గురించిన ఆసక్తి బాగా కనుపించుచున్నది. నేడు ప్రపంచరంగస్థలములో సంభవించుచున్న అనేక సంఘటనలను గురించి యోగులు, జ్ఞానులు ఏనాడో తెలియజేసినట్లుగా అనేక ప్రాచీన గ్రంథములు నేడు పుస్తకశాలలలో లభ్యమౌతున్నవి.

తగినంత శ్రద్ధతో పరిశీలించినట్లయిన, ఏనాడో ప్రకటించిన యీ జీవితములందనేక అంశములు బాబాయందు చూడగలము. ఉదాహరణకు టిబెట్ దేశ విద్వాంసుడైన జ్వాల్ ఖుర్ యొక్క గ్రంథములలో (ఆతని లేఖకురాలు ఏలిస్ బెయిలీ సేకరించి వ్రాసిన వాటిలో) ని అనేక విషయములు సత్యసాయి బాబా అవతారమునకు సంబంధించినవిగా కనిపించుచున్నవి. వీటిలో ఒక గ్రంథమును పరిశీలించుతాము; దీని పేరు "వంశపారంపర్యముయొక్క ప్రత్యక్ష వాదము." ఇది 1957 లో ప్రకటించబడినది. ఇందులో, క్రైస్తవ మత విశ్వాసము ప్రకారము క్రీస్తు స్వర్గలోక మేఘ మండలము నుండి జరూసలముకు విజయుడై తిరిగి రాగలడనునదొక విధముగా సత్యమే అయినప్పటికి, రూపకల్పనలో స్థానము, విధానము, మాత్రము వారూహించినట్లుగా ఉండదని చెప్పబడినది. క్రీస్తు తిరిగి రావచ్చును కానీ, అందులో సూచించిన జెరూసలం పాలస్తీనా అనే ఒక చిన్న దేశముయొక్క రాజధాని కాదని, శబ్దార్థము ప్రకారము జెరూసలం అనగా శాంతిస్థానము (ప్రశాంతినిలయము?) అని శాంతితో కూడిన ప్రపంచమునకు స్వశక్తియొక్క కృషిఫలితముగా మానవ సంఘములో సత్సంబంధములు నెలకొల్పిన ప్రదేశమునకు చిహ్నమని, అర్థము. ఇక మేఘ మండలములోనుండి అవరోహించుచున్నారను దానికి ఆధునిక కాలములో, తన నిలయమునుండి, భూమి మీదికి, ఎన్నో తర

ములుగా మానవ సంతానమును పరిరక్షించుచూ, విమానముతో వచ్చునని అన్వయము చేయవచ్చును. ప్రతి కన్ను ఆతనిని చూడగలదు అనుదానికి, టెలివిజన్ ద్వారా, భూమి మీద ఏ మూలనుండియైనా అతనిని దర్శించవచ్చును అని అర్థము చెప్పుకొనవచ్చును.

ఆచారవంతులైన క్రైస్తవులీ వ్యాఖ్యానములో దైవ దూషణను చూడగలరని బెయిలీ చెప్పుచున్నది ఆధునిక పద్ధతులనవలంబించుటలో దైవ దూషణ ఏమున్నది? వెనుక క్రీస్తు భూమి మీదనున్నప్పు డట్టి సాంఘిక నియమములను పాటించినాడు కదా. మేఘములపై స్వారి చేయును అనే వాక్యము వినుటకు చాలా సుందరముగా ఉండి, దైవత్వమును ప్రకటించుచున్నది. కానీ, ఆ వెనుకటి దైవవాణిని ఛాయపరచుటకు, నేడు విమానము లుండగా, ఆ మేఘములనే ఎందుకు ఉపయోగించవలెనని యీ వ్యాసకర్త ప్రశ్నించుచున్నాడు.

ఆ గ్రంథములో కొన్ని చాలా భావగర్భితములైన వివరాలున్నవి. ''మానవ జీవితములో ప్రతి అంశమందు సత్యమైన సంబంధములను స్థాపించుటే ఆతని ప్రథమ కర్తవ్యము;'' " ఆతడు తిరిగి ప్రత్యక్షమై, మానవాళిసంతతిని మరొక నాగరికతలో, మానవాళి సౌభాగ్యముకొరకు సరియైన సంబంధ బాంధవ్యములను ఏర్పాటు చేయుటకు, చైతన్యము వంతము గావించును.'' బాబాయొక్క ధర్మస్థాపన కార్యమునకు అర్థమిదే కదా !

ఆ గ్రంథములో యింకా యిట్లున్నది; ''యోధుని వలె విజయుడై, సర్వశక్తివంతుడుగా, అప్రతిహతునిగా తిరిగి వచ్చునని అందరూ అంగీకరించిన భావమునకు తగిన ఆధారము కనిపించదు. ఆతడెట్టకేలకు తనవారిని (మానవాళిని) జరూసలములోనికి తీసుకొని వెళ్లుననునది నిస్సందేహము. కానీ యిక్కడ జరూసలమొక నగరము కాదు' ప్రశాంతిస్థలమని ఆ పదమునకర్థము''. తిరిగి ''ఆతడు క్రైస్తవులు కానివారిని కూడా గుర్తించి ప్రేమించును; కాని వారందరు వారి వారి మత స్థాపకులందు విశ్వాసము కలిగి ఉండవలెను. మతమేదైనను ఫరవాలేదు; ధ్యేయము భగవంతునియందు, మానవులయందు ప్రేమ ఉండవలెను. తన శిష్యులను కొన్ని శతాబ్దముల క్రింద వదలి వెళ్లిన క్రీస్తుకొరకు ఎదురు చూచుచున్నవారు. పునరాగమన స్థితియందున్న క్రీస్తుని గుర్తించుటలో విఫలులగుదురు. ఆతనికి మతావరోధములు లేవు. ఎవరే మతము ననుసరించినా ఆతని కభ్యంతరము లేదు.'' మరొక ప్రకాశవంతమైన వాక్యమున్నది ; ''క్రీస్తు తిరిగి వచ్చినప్పు డాతని ప్రధానాశయము బలప్రదర్శనము కాక, ఇదివరకే ఉన్నట్టి భగవంతుని రాజ్యమును అందరికి ఎరుక పరచుట'' ఈ వాక్యమును కూడా గమనించండి; వెనకటి సారి భూమి మీదకు వచ్చినప్పు డాతని నందరు సమ్మతించలేదు; ఈ సారి మరొక రీతిగా జరుగుతుందని పూచీ ఏమున్నది ?

ఈ భవిష్యద్వాణికి సంబంధించిన గ్రంథములు అధ్యయనము చేసే కాలములో, యీ వర్తమాన కాలములో సత్యసాయిబాబా యీ భూమిమీద తన ప్రణాళికనప్పుడే ఆచరణలో పెట్టినట్లుగా ఎన్నో తార్కాణములు నాకు లభించినవి. చూడ దలచుకొనిన వారందరు, యీ టిబెట్టు దేశీయుడు చెప్పిన విషయములు నేడు ఆచరణయందున్నట్లు తెలిసికొనగలరు. పునర్జన్మ పొందిన క్రీస్తు యీ విషయముల నన్నిటిని మానవులకు బోధించునని యీతడే చెప్పినాడు. ఈ విషయముల జాబితా చదివినప్పుడు బాబాయే యీ అవతారమని అతని మనస్సునందున్నట్లు భావించక

తప్పదు. అందులో కర్మ సిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతము, మృత్యువుయొక్క మాయ, అమృతత్వ మ్మేని సత్యము, ధ్యానముయొక్క పరమావధి, దైవ తత్త్వములు వివరించబడినవి. సక్రమమైన మానవ సంబంధములను గురించి బోధించుచుండగా, గ్రంథ కర్త అభిప్రాయములో, మానవ సౌభాతృత్వము, దైవ పితృత్వము, వాటియొక్క సారముగా తెలుస్తుంది.

ఇంతే కాక, తిరిగి వచ్చిన క్రీస్తు భగవంతుని సంకల్ప మనే కాక, భగవంతుని ప్రేమను గురించి కూడ ప్రక టించునని చెప్పబడినది. విద్యలో, మతములో, ఆర్థిక స్థితిలో, అన్ని లౌకిక జీవనరంగములలో ప్రశాంతత చేకూర్చుటే కాక, పునఃసృష్టిని గావించునని ఈ ప్రపంచమందలి అన్ని దివ్య క్షేత్రములను పున రుజ్జీవింప చేసి వాటన్నింటిని నూతన తేజముతో నింపునని కూడా ఉన్నది. కోట్ల కొలది మానవులు తమ హృదయములందు క్రీస్తుయొక్క పునరాగమ నానుభవము పొందగలరని, వేలకొలది మానవులు ఆధ్యాత్మికానందమనే జ్ఞాన స్నానము చేయగలరని వివరించబడినది.

సత్యసాయిబాబా దివ్య దర్శనము పొందినవారికి భవిష్యద్వాణి తెలియజేసిన యీ ఆగమనమును గురించి ఎటువంటి సందేహములు కలుగవు; అదే జరిగినది. ఈ అవిశ్వసనీయము, అద్భుతము, అత్యా శ్చర్యకరము అయిన జగన్నాటకములో మనమంద రము భాగస్థులమే అనునది అత్యంతాశ్చర్యకరమైన విషయము.

జై సాయిరామ్. డెనిస్.

# స్వామి కావలెను

భారత దేశములో, మహామహోపాధ్యాయ గోపీ నాథ కవిరాజ్‌గారి వద్ద నేను శాక్తేయుల తాంత్రిక విద్యలో పరిశోధనలు జరుపుచున్న దినములలో శ్రీ సత్యసాయి బాబా వారిని గురించి తెలిసికొనినను. వారణాసిలో ఉన్నప్పుడు, నా స్నేహితురాలు కుమారి ప్రియాసెన్ కుటుంబముతో బాగా పరిచయ మైనది. ఆమెయొక్క ఒక బంధువురాలి పూజా మందిరము చూచుట తటస్థించినది. అక్కడ అనేక దేవతల పటములతో పాటు బాబా పటము లుండుట చూచినాను. ఆ పటములన్నీ విభూతితో నిండి ఉన్నది! ఆ పవిత్ర చిత్రములందుండి అద్భుతముగా ఆవిర్భవించిన చిన్న చిన్న రజిత విగ్రహములు చూపించినారు. ప్రతివారము భజనలు చేసే సమ యములో సంభవించే అద్భుత లీలలను గురించి కూడా విన్నాను! ఈ అద్భుత లీలలు నా కెంతో ఉత్సాహము కలిగించినవి. అక్కడ ఉన్న కొన్ని

మాసములలో, మేము చాలా భజనలకు హాజరైనాము. ఇది కాక, హోవర్డు మార్ఫెట్ బాబాను గురించి వ్రాసిన గ్రంథము చదివినాను. బాబా దైవముయొక్క అవతారమని దృఢమైన విశ్వాసము కలిగి, బాబా యందు భక్తి హెచ్చసాగినది.

భారత దేశములో ఉన్నప్పుడు పుట్టపర్తికి వెళ్ల లేక పోయినందుకు మాకు చాలా బాధ కలిగించినది, చాలా విచారము వేసినది. మేము భారత దేశములో ఉన్న చివరి రోజులలో దక్షిణ యాత్రకు సంకల్పించుకొనినాము. కానీ, మాకున్న కొద్ది సమయము పరిశోధనలకే సరిపోయింది. కలకత్తాకు వెళ్లినప్పుడు, కొందరు మిత్రులు బాబా కలకత్తాకు వచ్చే అవకాశ మున్నదని చెప్పినారు. వారి గృహములందున్న పటములలో విభూతిని చూచినాము! కానీ, బాబా కలకత్తాకు రాలేదు. కొద్ది దినములలోనే మేము మా దేశమునకు తిరిగి వచ్చినాము.

బహుశా బాబా స్వభావమందలి లీలలు ప్రారంభములో నన్నాకర్షించి ఉండివుంటవి కానీ, బాబా దైవముయొక్క అవతారమనే నా ధృఢ విశ్వాసమును పూర్తిగా వివరించలేక పోయినాను. బాబా నెమ్మదిగా నా జీవితములో ప్రవేశించి, క్రమముగా ప్రభావితము గావించ సాగినాడు ; సాధనలో మొదటి పాదము నేర్చుకొనునట్లు ప్రోత్సాహించినాడు. చెప్ప లేనట్టి రీతిగా, కవిరాజ్‌ను జ్ఞానశక్తిగానూ బాబాను ప్రేమమూర్తిగానూ భావించసాగినాను. భౌతికముగా ఏ గురువు వద్ద శుశ్రూష గావించనప్పటికి, గురువులందరి బోధలలోని సారమైన ఏకత్వమును గురించి నేర్చుకొని, ఆ ఏకత్వము నభివ్యక్తము గావించు కొనుటకు సాధ చేస్తున్నాను.

పాశ్చాత్యులు సహజముగా సందేహ శీలురని, భారత దేశములో సంభవించు యీ వింత సంఘటన లను విశ్వసించరని నాకు తెలుసును. అయినప్పటికి పరిమితమైన నా పరిధిలో మన జీవితకాలమందే, పరమాత్మ అవతరించి వచ్చినాడనే సత్యమునకు సాక్షీభూతమైన ప్రేరణ నాకు కలిగింది

ఆచారవంతులైన క్రైస్తవులైనప్పటికి, నా తల్లిదండ్రులు బాబాను గురించి విని వారిని గురించి గ్రంథముల ద్వారా తెలిసికొనిన తరువాత, బాబాయందను రక్తులగుట చూచి నా కాశ్చర్యము కలిగినది ; ఎంతో ఆనందమయినది. క్రైస్తవులైనవారికి క్రీస్తును కాదని బాబాను అంగీకరించుట చాలా కష్టసాధ్యమైన పని. భగవంతుని కుమారుడు అప్పుడప్పుడొక సారి, తిరిగి భూమిమీద అవతరించుననే భావమును క్రైస్తవ సాంప్రదాయమును సులభముగా అంగీకరించనివ్వదు. కానీ, అవతార భావమును జిజ్ఞాసులైన వారంగీకరించుటలో ఎటువంటి అవరోధము లుండరాదు. క్రైస్తవ సంఘ పరిధికి వెలుపల శ్రీ బాబా సాక్షాత్కరించినప్పటికి, బాబా అవతారమని నా తల్లి దండ్రులు పూర్తిగా విశ్వసించినారు.

మేమందరము బాబాను గురించి తెలిసికొనుటకు చాలా ఉత్సాహముతో ఉన్నాము. జాన్ మోఫిట్ అనే గ్రంథకర్తను కూడా కలిసికొనినాము. ఈతడు బాబాను కొద్ది కాలము క్రిందటనే దర్శించినాడు. త్వరలోనే బాబాను గురించి ఒక గ్రంథము వ్రాయుటకు ప్రయత్నించుచున్నాడు. బాబాను దర్శించిన అనేకులను కలిసికొని బాబా విషయములు విన గోరుచున్నాము,

దురదృష్ట వశమున, మా దేశము లోని భారతీయ గురువులను హిప్పీలు, దారితప్పి పోయిన విపరీత

స్వభావములు కలిగినవారు, పరివేష్టించి ఉంటారు. అమెరికా భక్తులెంతగా ప్రార్థించినప్పటికి, బాబా అమెరికా రానందుల కిది కారణమని నే నర్థము చేసి కొనినాను. అత్యంత బాధ్యతతో చాలా జాగ్రత్తగా ఏర్పాట్లు గావించినప్పుడే వారీ ప్రాంతములకు రాగల అవకాశమున్నది ఇందుకొరకు, శ్రీ బాబా దివ్య బోధల నాలకించి వీటి ఫలితమును పొంద గోరువారందరు చాలా సావధానులై ఉండవలెను,

వర్తమాన కాలములో, పాశ్చాత్యులు తీవ్రమైన నైతిక ధార్మిక సంకట స్థితిలో మునిగి ఉన్నారు దీనివలన కొందరిలో సత్ప్రవర్తన కలిగినప్పటికి, మిగిలిన వారెందరో విపరీతమైన ప్రలోభములలో చిక్కు కొని ఉన్నారు. ఎందరో శీలవంతులు, గుణవంతులు సరియైన నాయకత్వము, దర్శకత్వము కొరకు ఆతురతతో వేచి ఉన్నారు. అంతగా పండితులుకాని వారి వ్యాఖ్యానములతో, రెండు వేల సంవత్సరముల నాడు జీసస్ అందించిన దివ్య సందేశము మరుగున పడి పోయినది; దానితో క్రైస్తవ సిద్ధాంతముల ప్రాముఖ్యము నశించినది. క్రీస్తు సందేశమును పునరుజ్జీవింప చేసి, ఆధునిక సమస్యల కన్వయము గావించ వలసి ఉన్నది. క్రైస్తవమత గురువులు కొంతవరకు ప్రయత్నించుచున్నప్పటికి, వారి ప్రయత్నములు దుర్బలములు,

వివిధ మతాచారములందున్న పాక్షిక అవిశ్వాసములను తొలగించి, మానవులందరి ఆధ్యాత్మిక ఆకాంక్షల నన్నిటిని సమీకరించి ఏకత్రమొనరించుట కొక అవతారము యొక్క అవశ్యకత, యీ ప్రస్తుత కాలములో, ఎంతైనా ఉన్నది. తద్వారా, యీ దైవ శక్తిని పరిపూర్ణముగా మానవ చైతన్యమును, ప్రకటించి ఒకే ఒక సామాజిక శక్తిగా రూపొందునట్లు చేయవలసి ఉన్నది ఇదే బాబా చేస్తున్న కార్యము.

అర్లీన్ ; వర్జీనియా.

పెదవులే కదలంగ పీయూష మొలుకు,
కన్నులే కదిలించ కరుణ స్రవించు,
అడుగులే వేయంగ ఆదరణ తోచు,
పిలచి మాట్లాడిన ప్రేమయు పొంగు.

ఆ రాముడే నేడు సాయీశుడాయె,
ఆ కృష్ణుడే నేడు అవతరించాడు;
మానవోద్ధరణకై మరల ఏతెంచె;
సత్యంబు ధర్మంబు శాంతి ప్రేమలను
పుడమిలో నెలకొల్ప పుట్టెను పర్తి;
భక్తితో రారండు ప్రభుని సేవింప,
ముక్తినే కొనిపొండు మురిపెమ్ముతోడ.

# ఆనందము నందరా పంచుకొనవలెను

ఆర్థిక స్థితి ఏదైనా, జాతి మత వర్ణ భేదము లున్నా, మనమందర మొక కుటుంబమునకు చెందిన వారమని బాబా చెప్పి ఉన్నారు; మానవుడు, భగవంతుని, తనను, తోటివారిని, సర్వ ప్రాణులను ప్రేమించవలెనని చెప్పినారు. ఈ ప్రేమను కనికరము, దయాళత్వము సేవలలోనే కాక, దాని నితరులతో పంచుకొని అనుభవించుటలో ప్రకటించవలెను. భారత దేశములోనూ, యితర దేశముల లోనూ, బాబాయొక్క అనుగ్రహమును పొందినందుకు కలిగిన ఆనందము నందరు పంచుకొను ఆశతో ప్రబోధింప బడియే యీ సాయి సమితులన్నీ స్థాపించబడినవి. బాబా మనకందించు సందేశ ములతో ప్రపంచమున కెంతో అవసరమున్నదని మనకు తెలుసు. మనయొక్క సత్య ప్రవర్తన, సోదర మానవులకు చాలా ఉపయుక్తముగా బాబాయొక్క అనుగ్రహమునకు సాక్షీభూతముగా, ఉండగలదని కూడా మనకు తెలుసు. బాబా అనుగ్రహమును సమష్టిగా పంచుకొని ఆనందించుటమే కాకుండా, మనకితరులతో ఉన్నట్టి సంబంధములను పతిష్టముగా వించుకొనవలసిన బాధ్యత మన జీవితములందున్నవి. సమితులయొక్క ఉద్దేశ్యము, ఉత్తేజము, బాధ్యత ఇందుకొరకే.

బాబాయొక్క అనంత శక్తి సంపదతో, సర్వవ్యాపకత్వముతో, యీ ఉద్దేశ్యము నెరవేరునట్లు, యీ ఉత్తేజము ఫలప్రదమగునట్లు, బాధ్యతను నిర్వహించునట్లు నేర్చుకొనగలము. అస్థిరమైన, దుర్బలమైన పునాదుల మీద ఉన్న పట్టణ జీవితములోకన్న, ఆనవాయితిగా వచ్చే పల్లె సీమలందే, మానవ సంబంధములలో అధికముగా సౌహార్ద్రత, ఆధ్యాత్మిక స్థిరత్వము ఉన్నదని, బాబా గ్రామ ప్రాంతములందలి సమావేశములందు చెప్పి ఉన్నారు. పట్టణములలో, పరిచయములేని, ఏకాకులైన వేరు చేయబడిన, అన్యోన్యత్వము లేని మనుష్యులు నివసించు చున్నారు.

అన్ని వర్ధమాన దేశములలో, ఉదాహరణకు నేను సింగపూరులో చూచిన దానిని బట్టి పట్టణములందు నూతన అధినివేశములలో నివసించుటకు వచ్చిన గ్రామీణుల సౌహార్ద్రతను, సన్నిహితత్వమును, రక్షణలను, యిరుగు పొరుగువారి మంచితనమును పోగొట్టుకొని బాధ పడుతున్నట్లు కనిపించినారు. వారందరు భయ భ్రాంతులుగా, పిరికివారుగా, అనుమానములతో నివసించుచున్నారు. సమాజబలము కోల్పోయి, నిస్సారముగా ఆందోళనలతో జీవించుచున్నారు. గ్రామ బలము అనుశ్రుతముగా ఉన్న నైతిక విలువలను నిలవరింప చేస్తూనే, సత్యసాయి సమితులు పట్టణములలో యీ విధముగా నిర్వాసితులైన వారి మధ్య తమ కార్యక్రమములు సాధించవలెను.

మానవుడు ప్రధానముగా దైవ లక్షణ మున్నవాడని బాబా హామి యిచ్చినారు. అందుచేతనే

బాబా దుర్బలులు రోగులు అంటే అత్యధికముగా దయా దాక్షిణ్యములు, కనికరము కలిగి ఉన్నారు సహకారము, అనురాగము, ప్రేమ మానవుని సహజ గుణములు వీటికి విపరీతమైన గుణము లప్పుడప్పుడు ఖలహీనులలో, దుష్టబుద్ధి కలవారిలో, కనిపించి మానవ సంఘముయొక్క సంక్షేమమునకు చాలా అపకారిగా ఉంటున్నవి.

భారత దేశ ధార్మిక ఉపదేశములు సుస్పష్టము ; ఆ ఉపదేశములన్నింటిని. ప్రపంచము కొరకు బాబా తనవిగా అంగీకరించినారు : " మీ మౌలిక స్వభావము, మీ ప్రాచీన సంస్కృతి మీ ఆధ్యాత్మిక సత్యములు అనుకూలమైన, ఆవశ్యకములైన పరస్పర సంబంధ సహకారము కలిగి ఉన్నవని, మానవుని ఆంతర్య స్వభావము ప్రేమమయము సహన, సేవాభావమయము, కౌటుంబికము అని ఈ విశ్వాసముతో ముందుకు సాగండి " అని చెప్పినారు.

భగవంతుని యందు ప్రేమ, తనయందు ప్రేమ, సర్వ ప్రాణములందు ప్రేమ, తోటి మానవుల యందు ప్రేమ ఇవన్నీ మానవ హృదయములో కలవని బాబా చెప్పినారు ప్రేమ సౌభాతృత్వములు కలిగి నట్టి నూతన శకము కావలెనని, అది అందరికి వెంటనే అందుబాటులో ఉండవలెనని కూడా బాబా చెప్పినారు. ఇటువంటి సంఘమును నిర్మించుట మన కర్తవ్యమని చెప్పి, మనలనందరిని సంఘ నిర్మాణ కార్యక్రమములో శిక్షణ పొందమని బాబా కోరుచున్నారు.

శ్రీ సత్యసాయి సమితులే మన మీ శిక్షణ పొందు పాఠశాలలు. ఈ ప్రేమను, యీ ఆనందమును తోటి వారితో పంచుకొనుటకు మనమేమి నేర్చుకొనవలెను ? ప్రథమములో, ఆత్మ విశ్వాసము కలిగి, నిన్ను నీవు తెలిసికొని ఉండవలెను. " నీయందు నేనున్నాను, నాయందు నీవు " అని బాబా చెప్పుటలో ఎంతో పరమార్థమున్నది. నేనొక సమితిలో సభ్యుడుగా ఉన్నప్పుడు నా ఆనందమును ఒక వ్యక్తితో కాక, సమితిలోని అందరితో పంచుకొను శిక్షణను నేను పొందవలసి ఉన్నది. నేను క్రమశిక్షణ కలిగి, విశ్వాసముతో, నిష్కపటముతో, ఋజువర్తనముతో ఉండవలెను అందరిని సమావేశపరచగలిగి, సాయి తత్వమును అందరిలో వ్యాపింప చేయ గలిగి ఉండాలి. సమితులకు రెండు ప్రధాన ధర్మములున్నవి : ఒకటి నిర్వహణ ధర్మము, రెండు కార్యాచరణ ధర్మము.

సాయి సమాజములలో ఉన్న వారందరు, తామందున్నందుకు తృప్తిని, ఆనందమును కలిగి ఉండేటట్లుగా వాటిని నిర్వహించవలెను కొన్ని నియమ నిబంధనల నేర్పాటు చేసుకొని, స్వవిషయములోని తృప్తిని తగ్గించుకొని, పరస్పర అవగాహనను వీలైనంతగా, వృద్ధి గావించుకొనవలెను. అధ్యక్ష కార్యదర్శులుగా నున్నవారు, అందలి సభ్యులందరు ప్రతి కార్యక్రమములో, ఉత్సాహముగా పాల్గొని ఆనందించునట్లుగా, బాధ్యతలు కూడా అందరితో పంచుకొనవలెను. అంతేగాని నిరంకుశముగానో, ఒక పీఠాధిపతిగానో ఉండరాదు; సభ్యులలో ఎక్కువ తక్కువ భావములు, అల్పాధికులను భావములు రాకూడదు. ఈ విధముగా నాయకత్వ బాధ్యతలు పంచుకొనుటతో, ప్రతివాడు తన శక్తి యుక్తులన్నిటిని వినియోగించి సమాజ సేవలో సేవకొరకే నిమగ్నుడు కావలెను.

ఇక సమితి అన్న తరువాత అనేక సమస్యలుత్పన్నములౌతవి. వీటిని సామరస్య భావముతో, అందరికి తృప్తిని కలిగించే విధముగా, అభిప్రాయ భేదములు సమసిపోవునట్లుగా, పరిష్కరించవలెను.

చేయబోవు కార్యములకు కావలసిన ప్రణాళికలు ముందుగానే ఆలోచించి, వాటి పూర్వాపరములు లోతుపాతులు, జాగ్రత్తగా పరిశీలించవలెను. ఈ ప్రణాళికలు కూడా అందరి సహకారముతో సమాజ గౌరవ ప్రతిష్ఠలు అధికమగు విధముగా ఆచరణ లోనికి తీసుకొని రావలెను.

ఈ విధముగా సమాజములు స్థాపించి అందరు అందరి ఆనందమును పెంచుకొని అనుభవించుటకు వీలైనప్పుడే, సత్యసాయి ప్రభువు సమ్మతించి మనల నభినందించుతారు.

ప్రొఫెసర్ రాబిన్, షికాగో.

# విద్యార్థులకు హెచ్చరిక

ప్రాచీన కాలములోని విద్యలకు యీ నాటి విద్య లకు ఉన్న తేడా మీరు జాగ్రత్తగా గుర్తించాలి. ప్రాచీన విద్యలు ప్రజ్ఞానమును బోధించునట్టివి; ఆధునిక విద్య లంధకారము పెంచునట్టివి. జాగ్రత్తగా విచారించితే, యీ నాటి విద్యవలన ఉన్నత స్థితికి వెళ్లుటకు బదులు, క్రిందికి జారుచున్నట్లు బోధ పడుతుంది. ఈ నాటి విద్యలు మానవులకు భౌతి కమైన సదుపాయము లందించునట్టివిగా ఉన్నవి కాని, ఆధ్యాత్మికముగా ఏ విధముగానూ ఉపయోగ పడలేకున్నవి. నూటికి తొంభై తొమ్మిది మంది అంగ్ల విద్యాభిమానులే కాని, ఆత్మ విద్యాభిమానులు కారు. శిల్పికి రాయి, సుత్తి ముఖ్యము కాదు. శిల్ప శక్తిని పెంచుకొనుట ముఖ్యము ఉపకరణములను ప్రోగు చేసికొని భద్ర పరచుట నేర్చుకొనుచున్నాము కాని, శిల్పశక్తిని భద్రపరచుకొనుట లేదు.

ఈ నాటి విద్య బహుళ గ్రంథ పరిచయముతో, విషయ సేకరణతో పూర్తి అవుతున్నది. కానీ, వీటి కేది ఆధారమో, ఆ దివ్యత్వమును గురించి మనము శ్రద్ధగా ఆలోచించవలెను. అనుభవమునకు రాని గ్రంథ జ్ఞానము మాత్రమే కలిగిన వ్యక్తి సంఘము నకు పనికిరాడు; హృదయ జ్ఞానమునకు ప్రాము ఖ్యము నిచ్చేవాడే సంఘమునకు కావలెను. ప్రాచీన కాలములో విద్యావంతుల సంఖ్య చాలా తక్కువ. కానీ, సంఘములో అనాడున్న శాంతి భద్రతలు, నేడు ఎన్నో విద్యాసంస్థ లున్నప్పటికి, ఎందరో విద్యార్థిను లున్నప్పటికి, ఎన్నో అవకాశము లున్న ప్పటికి, కనిపించుటలేదు.

ప్రాచీన కాలములో ఏ ఒక్కరో చదువుకొనిన వారున్నప్పటికి, ఆ నాడున్న శాంతి, ఆనందము రక్షణ, నేడింత మంది చదువుకొనిన వారున్నప్పటికి లేకపోవుటకు కారణమేమిటో మనము తెలిసికొనవలసి ఉన్నది. కేవలము పాఠశాలలలో, కళాశాలలలో చేరి ఒక డిగ్రీసంపాదించుకొనినంత మాత్రమున మన తెలివి తేటలు వృద్ధి అయినట్లు మనము భావించరాదు. మనము నేర్చుకొనవలసిన విద్య పాఠశాలలందు, కళా శాలలందే కాక, ఫ్యాక్టరీలలో, వీధులలో, దుకాణ

ములలో కూడా ఉన్నది విశ్వమునంతా ఒక విద్యాలయనుగా భావించవలెను ఏ ఒక్క విషయ మును గురించి మాత్రమే విద్యార్థి తెలిసికొనుట ఏ మంత బాగాలేదు. ప్రపంచములో అనేక విషయ ములున్నవి వాటన్నింటిని గురించి బుద్ధిని ఉపయో గించి తెలుసుకొనవలెను. ఈ నాడు మన దేశ మే స్థితిలో ఉన్నది? భయము ద్వేషములతో నిండి ఉన్నదన్న సంగతి మీకు తెలుసు. ఈ దుస్థితికి కారణమెవ్వరు అని యోచించితే, విద్యాధికులే కారణ మని తెలుస్తుంది. అంధకారమునకు, అభ్యాసమునకు, అజ్ఞానమునకు, అసూయకు నేడు విద్యావంతులే కారణముగా కనిపించుచున్నారు. ఈ దుర్గుణము లన్నీ విద్యాధికులలోనే ప్రకాశించుచున్నవి. దీనిని బట్టి చూచితే, విద్యలేనివాడే మంచివాడుగా కనిపించు చున్నాడు.

ఈ లోకమును పాలించేవారు విద్యావంతులే. కావున ఆ పరిపాలనలో వారి దోషములు కూడా ఉండక తప్పదు కదా. మిగతా రంగములలో విద్యా వంతులు అంతగా లేకున్నా, విద్యారంగములో విద్యా వంతులదే కదా ప్రాముఖ్యత కాబట్టి యీ రంగము లోని దోషములకు వారిదే బాధ్యత అంతా. అయితే, ఈ దోషములను గుర్తించే ముందు, అవి ఎక్కడ ప్రారంభించినవో, ఎక్కడ ఉన్నవో తెలిసికొనవలసి ఉన్నది.

వేరుకు చెదలు పట్టితే, దానికెంత నీరు పోసి ఏమి ప్రయోజనము? అదే విధముగా విద్యార్థులయిన మీలో సక్రమమైన పోషణ లేనప్పుడు, విద్యాసంస్థలనె వృక్షములు భద్రముగా పెరుగలేవు. విద్యార్థులుగా ఉన్నప్పుడలవడిన కొన్ని దోషములు, పెద్దవారైన తరువాత కూడా వెంబడించి, మనస్సులను పాడుచేసి, వృద్ధి పొందుతునే ఉంటవి, వేరున పట్టిన చెదలు వదలించవలెనంటె, పైనన్న కొమ్మలు కొట్టి ప్రయో జన మేమున్నది? వేరునుండి ఆ చెదలును వదలించి నప్పుడే ప్రయోజనము. వేరు దగ్గరకే వెళ్లి కారణము తెలుసుకొనవలెను,

ఆదర్శవంతులైన విద్యార్థులను తయారు చేయవలె ననే సంకల్పమే యీ కళాశాల స్థాపనకు ముఖ్య కారణము కాని, మరొకటి కాదు. లోక విద్యలు నేర్పు టకు దేశములో అనేక కళాశాలలున్నవి. అందుచేత అదే విద్య కొరకు యీ కళాశాలను స్థాపించవలసిన అవసరము లేదు. లౌకికముగా, ఎంత ఉన్నత స్థాయిని అందకొనినా ప్రయోజనము లేదు. ఫస్టు క్లాసులు లౌకికముగా అవసరము కావచ్చును. కానీ, జీవితములో శీలము ప్రధానము. అందుకు కావలసిన విద్యను యిక్కడ యీ కళాశాలలో బోధించుతారు. కాబట్టి, అటువంటి విద్య కావలసిన వారే యీ కళాశాలలో ఉండవలెను; ఫస్టుక్లాసునే పరమావధిగా భావించేవారు ఉండనక్కరలేదు

ఈ నాడు కష్టపడిన వారికే కాదు ఫస్టు క్లాసులు. కాపీ కొట్టినవారికి, డబ్బు ఖర్చుపెట్టిన వారికి కూడ ఫస్టు క్లాసులు వస్తున్నవి. కాబట్టి లౌకిక విద్యలందు మీరు చూపించే కృషి ఒక ప్రక్క, సత్య మార్గము ననుసరించే కృషి మరొక ప్రక్క. ఈ కృషి జీవితము లోని సుఖశాంతులకు చాలా అవసరము. ఇతరుల మీద ఆధారపడకుండా, స్వయం కృషితో, మీ శక్తి సామర్థ్యములను శీలమును పెంచుకొనవలెను జీవిత రంగములో మనకు ఉపకరించునట్టివాటికి పుష్టి కలి గించి, పోషించి, తద్వారా మనవిద్యావిధానమును కాపాడుకొనుట మన ముఖ్య కర్తవ్యము

సక్రమమైన మార్గములో మూడవ తరగతిలో ప్యాసైనా సంతోషమే; వక్రమార్గములో ఫస్టు క్లాసు

వచ్చినా ఆనందము లేదు. శీలము ఉండి ఏమి లేకున్న మంచిదే కాని శీలము పోయి అన్నీ ఉన్నా ఫలితము లేదు సక్రమమైన మార్గముల ననుసరించ వలెనన్న, మీ స్వబుద్ధిని, మీ స్వభావమును, మీ స్వశక్తిని అనుసరించవలెను కాని, యితరుల ననుసరించ కూడదు.

ఈ నాడు ప్రతివాడూ అధికార స్థానము కొరకు ప్రయత్నించే వాడే కాని, బాధ్యతలను గుర్తించి ప్రవర్తించే వాడు కనిపించడు, బాధ్యతల బరువును తెలిసికొనిన వారే అధికారములోనికి రావలెను. లేకుంటే అంతా అంధకారమే ; గ్రుడ్డివాని రాజ్యమే.

కళాశాలలలో యీ నాడు నాయకత్వము కోరే వారెవరు? ఈ నాయకత్వమునకు బాధ్యతలు తెలిసి కొని తగినట్లు ప్రవర్తించే మనస్సున్నవారే అర్హులు; మిగిలినవారు నిష్ప్రయోజకులని చెప్పక తప్పదు. ఈ నాయకత్వము కొరకు పోటీ పడుటకు ముందు, విద్యయొక్క ఆశయములు దేశముయొక్క స్థితిగతులు తెలిసికొనవలెను; ఆ తరువాతనే యీ బాధ్యతను స్వీకరించవలెను.

నేటి విద్యారంగములో అశాంతికి కారణమైన అనేక సంఘటనలు జరుగుచున్నవి. వీటన్నిటికి కారణ భూతులెవ్వరు? ఉపాధ్యాయులు, విద్యార్థులే. వీరికి విద్యయొక్క పవిత్ర ఆశయమేమిటో తెలియక పోవుటే యీ స్థితికి కారణము. ఇటువంటివారు కొందరు నాయకులు కావలెనని కోరుచుండుట చేతనే విద్యా సంస్థల కీ దుర్గతి పట్టినది.

కానీ, లోపములన్నీ విద్యార్థులవే అని చెప్ప లేము. ముఖ్యముగా విద్యావంతులైన ఉపాధ్యా యులయొక్క, పెద్దలయొక్క బాధ్యతా రహితమైన ప్రవర్తనే అని చెప్పవలెను. వీరందరు దేశకల్యాణము కొరకు విద్యార్థుల అభివృద్ధిని వాస్తవముగా కోరిన వారైతే, వారిటువంటి పనులు చేయరు. కొంద రేదో విధముగా ఉద్యోగము చేస్తున్నారు. వీరిలో ఎంత మంది తమ విద్యార్థులు తమ బోధలవలన సరియైన మార్గములో నడుచుకుంటున్నారో గమనించుచున్నారు? గంటల లెక్కన నిర్జీవముగా బోధించుచున్నారే కానీ, విద్యార్థుల మంచి కోరి చెప్పువారు చాలా తక్కువ. ఇటువంటి ఉపాధ్యాయులవలననే విద్యార్థులు చాలా నష్టపోతున్నారు. తరగతిలో పుస్తకము చూచి చెప్పే దేమున్నది? ముందే చదివి ఏమి చెప్పవలెనో ఏ విధముగా చెప్పవలెనో, ఆలోచించే ఉపాధ్యాయులు నేడు చాలా తక్కువగా ఉన్నారు. వారు చెప్పేది విద్యార్థులు విని శ్రద్ధగా వ్రాసుకుంటున్నారా, లేదా, అని విచారించే ఉపాధ్యాయులెంత మంది ఉన్నారు?

కొందరు విద్యార్థులు క్లాసులు జరుగుచుండేటప్పుడు బయట తిరుగుతుంటారు. దీనికి కారణ మేమి అని అడిగితే, పుస్తకములో ఉన్నది మేము చదువుకొన లేమా అని వారి జవాబు, ఈ విధముగా పాఠములు చెప్పే ఉపాధ్యాయులున్నా ఒక్కటే, లేకున్నా ఒక్కటే; వీరివలన ప్రభుత్వమునకు దండుగ తప్ప.

పిల్లల అభివృద్ధిని ప్రధానముగా భావించినప్పుడే ఏ ఉపాధ్యాయుడైనా ఆ పదవికి తగిన అర్హత కలిగి ఉన్నట్లుగా యీ కళాశాలలో భావించబడుతుంది. లౌకిక విద్యతో పాటు, ఆత్మ విద్యలో ఆసక్తి ఉన్న విద్యార్థులే యిక్కడ చదువుకొనవలెను. ఒక్క లౌకిక విద్య చాలు అని భావించే వారికి యిక్కడ స్థానము లేదు. క్రమ శిక్షణ లేని విద్యార్థులు, తమ వృత్తి యందు శ్రద్ధలేని ఉపాధ్యాయులు ఉండే స్థితిలో

కళాశాలనే మూసి వేస్తాము. లేకుంటే అప్పుడది ఒక బందెల దొడ్డిగా తయారౌతుంది. ఈ కళాశాలలో క్రమ శిక్షణ శ్రద్ధ ప్రధానముగా భావించబడు తున్నవి. ఈ రెండూ ఉన్నప్పుడు బాధ్యత తప్పకుండా ఉంటుంది. ఈ కళాశాలలోని ఉపాధ్యాయులు, విద్యార్థులు తమ జీవితములందు తప్పకుండా ఉన్నత స్థితికి రాగలరు. మీరందరు పవిత్రమైన, సున్నితమైన భావములు కలిగినవారు. మీయందు ఆధ్యాత్మిక చింతనను కలుగ జేసినట్లయిన, మీరు తప్పక వృద్ధిలోనికి రాగలరు. మీరు సుకుమారమైన లతలవంటివారు. ఈ లతలు శోభాయమానములుగా పెరగవలెనన్న ఉపాధ్యాయుడు బాగా దోహదము చేయవలెను. పరీక్షలలో మీరు పొందే క్లాసులు, మార్కులు, రాంకులు మంచివే కానీ వాటితో పాటు స్వామి ఆశయములు కూడా ఆచరణలో పెట్టినప్పుడే జీవితములు సార్థకములౌతవి. కాబట్టి లౌకిక విద్యతో పాటు ఆధ్యాత్మిక విద్యను జోడించి నేర్చుకొనవలెనని ఆశించుచున్నాను.

విద్యార్థులు, ఉపాధ్యాయులు బృందావన ఆశయములను తప్పకుండా పాటించి ప్రవర్తించాలి. కాకున్న, ఇక్కడ ఏమి చేయటానికైనా, ఎవ్వరికీ భయపడవలసిన పని లేదు. ఈ కళాశాల ధనార్జన దృష్టితో ప్రారంభించ లేదు. ఇది బాగా గుర్తుంచుకొనండి. సత్య మార్గము ననుసరించవలె నన్నదే మా ప్రధానాశయము. అవసరమని భావించితే, యీ కళాశాలను పూర్తిగా అధ్యాత్మిక సంస్థగా మార్చుటకు కూడా వెనుకాడము.

ఇతర కళాశాలలందలి విద్యార్థులు ఆ పేరుకు తగినట్లుగా ప్రవర్తించుటలేదు. మీరు వారి మాదిరి ప్రవర్తించకూడదు. మీ గ్రామములకు వెళ్లినప్పుడు కూడా, మీ ప్రవర్తనతో మీరు సరియైన విద్యార్థులని రుజువు చేసికొనవలెను. క్లాసు రూములోనే కాక, వెలుపల ఎక్కడ ఉన్నప్పటికి, మీ ప్రవర్తన ఆదర్శప్రాయముగా ఉండవలెను. వీధుల వెంట త్రాగుబోతుల మాదిరి అరచుకుంటూ తిరగకూడదు. మీ ప్రవర్తన, మీ మాటలు, మీ భావములు పవిత్రముగా ఉండవలెను. ఇంటిలో సరస్వతి పూజ చేసి యింటి వెలుపల దానికి విరుద్ధమైన ప్రవర్తనతో ఉండకూడదు. అందుచేత, సరస్వతీ దేవినే అవమానించి నట్లవుతుంది.

ఈ కళాశాలలో విద్య పూర్తి గావించి ఉన్నత విద్యలకు వెళ్లేవారు, వారు చేరే నూతన విద్యాసంస్థలలో, తోటి విద్యార్థులలో, బృందావన వాతావరణమును సృజించి, తిరిగి యిక్కడకు రావలెనని ఆశించుచున్నాము. వీరందరు వారికి యీ కళాశాలతో ఉన్న సంబంధము ఇంతటితో తెగిపోయినట్లుగా భావించరాదు. శారీరకముగా దూరమైనప్పటికి, మీరందరు మానసికముగా బృందావనములోనే ఉన్నట్లుగా భావించుకొని, ఎక్కడ ఉన్నప్పటికి, మీ హృదయములే బృందావనములుగా, ఆశయములే గోపికలుగా భావించండి.

నూతన విద్యార్థులు క్రమశిక్షణను చక్కగా పాటించవలెను. మొక్కగా వంగనిదే మ్రానై వంగదనే సామెత మీ కందరికి తెలుసును. మీ ప్రవర్తన ద్వారా మీ తల్లిదండ్రులకు గౌరవము సంపాదించి పెట్టి, వారికి గర్వకారణము కావలెను. ఆకలికి ఆహారము కాని రుచికొరకు జిహ్వ చాపల్యము తీర్చుటకొరకు కాదని గురుతించుకొనండి. మీ కేమైనా యిబ్బందులు కలిగినట్లయిన, వాటిని కూడా ఒక పాఠముగా భావించండి.

22-7-74 తేదిన శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థుల సభలో శ్రీ స్వామివారి ప్రసంగమునుండి.

# స్వామి సందేశము

[ఓణం పండుగ]

భారతీయుల పర్వ దినములు మాత్రమే కాదు, ప్రపంచములోని అన్ని జాతీయుల పర్వదినములు దైవ విశ్వాసమును దృఢపరచుట కొరకు, ధర్మాచరణను అభివృద్ధి చేయుట కొరకు, పాపభీతి పుణ్యముపై ప్రీతి వీటిని దృఢపరచుట కొరకు స్థాపితమైయున్నవి. ప్రతి యొక్కరూ ఈ పర్వదినముల నాచరించుచూ, తన స్థితిగతులను వీక్షించి పరీక్షించి, తన జీవితమును దివ్యత్వముగా మార్చుకొనే ప్రయత్నమందు తాను యెంత దూరము పయనించినాను అని చూచుకొని ముందంజ వేయుటకు పూనుకొనునట్టి దినములివి.

సంత్ తులసీదాసు 'రామచరిత మానస' కావ్యమందు తాను ఆ రఘునాథుని కథను "స్వాంత స్సుఖాయ" (స్వంత సుఖము కొరకు) రచించినట్లు వ్రాసియున్నాడు. పరుల మెప్పును ఆశించి తాను ఆ రామాయణమును రచించలేదట, పరమాత్ముని మెప్పు నాశించి కాదట; తన ఆనందము నిమిత్తమై, తన ఆత్మ తృప్తి కొరకే ఆ మహా కావ్యమును వ్రాసినాడట! నిజమే! జనులు గృహనిర్మాణము, ఉద్యోగ నిర్వహణము, అస్తిపాస్తుల ఆర్జనము మొదలగు ప్రయత్నములలో శక్తి సామర్థ్యములను వినియోగింతురు. అవన్నీ తమ తృప్తి, తమ సంతుష్టి కొరకే కదా! కోకిల యొక్క కూజితము పరుల మెప్పుకు కాదు; స్వశక్తిని ప్రకటించి స్వాంతస్సుఖమును పొందుటకే. గులాబి పుష్పము వికసించి, మధుర వాసనను సుందర స్వరూపమును, ప్రకటించుట 'స్వసుఖాయ' కానీ వేరు కాదు. ఒక తల్లి తన చంటి బిడ్డను ఒడిలో కూర్చుండ బెట్టుకొని దానితో ముచ్చటలాడేది కూడ ఆ బిడ్డ సంతోషమునుద్దేశించి కాదు; స్వసుఖము నిమిత్తమై, అనునదే నిజము. అట్లనే, ప్రతియొక్కరూ చేయు అర్చన, ధ్యానము, ఆరాధన, మొదలగు సాధనలన్నీ కేవలము వ్యక్తి నిమిత్తమే కానీ మరొకరి నిమిత్తము కాదు. అయితే, ఇట్టి సాధనల రీత్యా మోహక్షయమనే మోక్షము దొరకదు; స్వాంతస్సుఖము అనే నిత్యానందము లభించదు. "న కర్మణా న ప్రజయా ధనేన, త్యాగేనైకే అమృతత్వ మానశుః" కర్మముల వలన, సంతాన లాభము వలన, ధనార్జన వలన అమృతత్వము దొరకదు; త్యాగమువలననే అది లభించును, అని శ్రుతిలో చెప్పబడియున్నది.

ఈ దినము మీరు ఆచరించు ఓణం పండుగ, ఈ సత్యోపదేశమును మీకు అందించుచున్నది. బలిచక్రవర్తి తన యాగ (త్యాగ కర్మము) సమయమునందు భిక్షార్థిగా వచ్చిన బ్రాహ్మణ వటు వేషధారియైన మహా విష్ణువునకు మూడు అడుగులు భూమిని దానమిచ్చి, ఆ వామన మూర్తి త్రివిక్రముడుగా మారినపుడు, మూడవ అడుగు వేయుటకు స్థలము లేని పరిస్థితిని గమనించి, తన శిరముపై పాదము పెట్టుమని వేడుకొని, జన్మ సార్థకము చేసికొనినాడనే కథను ఈ దినము మీరు జ్ఞప్తికి తెచ్చుకొనుట మీ సంప్రదాయము, కదా! అమృతత్వమునకు ఆధారభూతమైన త్యాగముయొక్క మహత్వమును వామన మూర్తిగా అవతరించి భగవంతుడు లోకమునకు చాటిన దినము ఈ "ఓణం" పండుగ దినము.

మలయాళ రాజ్యము (కేరళము)ను గురించి అనేక విశిష్ట గాథలున్నవి హిమాలయ పర్వతప్రాంతమందున్న బదరీక్షేత్రమందు శ్రీమన్నారాయణుని ఆరాధించుటకు పూజారి (రావల్)గా కేరళము నుంచి

నంబూద్రి బ్రాహ్మణులనే నియమించే సాంప్రదాయము శంకరాచార్యులవారి కాలమునుండి వచ్చుచున్నది. శంకరాచార్యులవారి జననభూమి అను పవిత్ర కీర్తి కూడ కేరళకే దక్కినది. అద్వైత దర్శనమును బోధించి ఆనందానుభూతినందించిన కీర్తి కూడ కేరళదే. కాబట్టి ఈ నాడు ఆ సత్యమును, ఆ దివ్యత్వమును ప్రకటించుటకు మీరు పూనుకొనవలెను. దేహభ్రాంతిలో పడినంతవరకూ నరుడే గానీ, అది నశించి, ఆత్మజ్ఞానము దయించిన, అతడు నారాయణుడే. నరుడు నారాయణుడుగా మారును; నారాయణుడు నరుడుగా ధర్మసంస్థాపన కొరకు అవతరించవచ్చును. ఇవి రెండూ సహజము అని మీకు తెలిసియేయున్నది. కానీ, నరుడు తనలోని దివ్యత్వమును గుర్తించుకొని ఆనందమును అందుకొనలేక, అజ్ఞానాంధకారమునందే జీవించుచున్నాడు.

కొంత మంది యేదో ఒక సాధన ద్వారా దైవత్వమును పొందుటకు ప్రయత్నించిననూ, భక్తి, భగవంతుడు, వీటి పూర్ణ జ్ఞానము అందుబాటులో లేక, వారు నిరాశ పొందుచున్నారు.

భక్తి అంటే భగవంతునిపై సంపూర్ణమైన ప్రేమ దేశకాలములకూ పాత్రమునకూ అతీతమై నిలనునట్టి ప్రేమ. అయితే, కలియుగ ప్రభావము వలన, Part time భక్తిమాత్రమే ఈ నాడు అందరిలోను కనుపించుచున్నది. నష్టము కష్టము దుఃఖము దూషణ తగిలినపుడు మాత్రము భగవంతుడు జ్ఞాపకమునకు వచ్చును; ప్రార్థనలు పూజలు జరుపుదురు. సుఖము, ఆనందము ఆదాయము ఆహ్లాదము వచ్చినపుడు భగవంతుని యే మాత్రము చింతించక మెలగుదురు. అట్లే, భగవంతుని స్వరూప స్వభావములను సంపూర్ణముగా అర్థము చేసికొనక, ఇట్టివాడు అట్టివాడు అని వాదించుతారు. తాను అనుభూతి చెందక పదములను మాత్రము పెద్దలననుసరించి, ఉపయోగించి స్తోత్రములను రచించి పాడుదురు. నేడు భక్తులనవారిలో ఈ అనుభూతి కనుపించుటము లేదు. సర్వజ్ఞుడు, సర్వశక్తిమయుడు, సర్వవ్యాపి అని భగవంతుని విషయమై చెప్పుచున్నారే కానీ అనుభవము మాత్రము శూన్యముగానున్నది. హృదయములోని యోచన, వాక్కులోని సూచన, చేతిలోని ఆచరణ మూడూ ఏకముగా ఉండాలి. అదే భక్తుని లక్షణము. భక్తుడు అనే పేరుకు నిశ్చల మనస్సే సార్థకత నందించును.

సినిమా మందిరములోని తెరపై కుంభవర్షము యొక్క చిత్రములు పడి, ప్రేక్షకులకు యెంత భ్రమను కల్పించినూ ఆ తెరపై యే మాత్రము తడిగా ఉండదు! యుద్ధ చిత్రములు ఎన్ని పడినా, ఒక బొట్టు రక్తము కూడా తెరపై వుండదు. అట్లనే, దైవమనే తెరపై, జగత్తు చలించుచూ ఉండును. దానికే జగత్తు అని పేరు వచ్చినది. మీరు కూడ, ఆ జగత్తులో జరిగే ఏరుపేరులకూ, కష్టనష్టములకు లొంగక, చలించక, మీ నిజస్వరూపమైన దివ్యత్వమును ప్రకటించవలెను. అపుడే, మీరు విజ్ఞానము, సుజ్ఞానము, ప్రజ్ఞానములకు అధికారులగుదురు. మీ జేబులో అగ్గిపెట్టె ఉండవచ్చు; అయితే, అది మీషర్టును ఏ మాత్రమూ కాల్చదు. దానినుంచి ఒక పుల్ల తీసి పెట్టె పక్కలో వున్న మందుకు గీచితే, నిప్పు ఉద్భవించును. అంత వరకూ అగ్గి పుట్టదు. వ్యక్తిత్వమనే పుల్లను దివ్యత్వమనే మందుపై గీచిన అపుడు పవిత్రత ఏర్పడును, జన్మ సార్థకమగును.

అట్టి అనుభూతిని అందుకొనిన తరవాతనే, భగవంతుని సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తుడు, సర్వాంతర్యామి అని వివరించుటకు అర్హత కలు

గును. బలి చక్రవర్తి ప్రహ్లాదుని మనుమడు; కాబట్టి, ఆయనకు విష్ణుభక్తి పరంపరగా వచ్చినదే. వామనుడు త్రివిక్రమ రూపము ధరించి, భూమ్యాకాశములను ఆవరించినపుడు "నిను కనుగొనవశమా?" అని స్తుతి చేసినాడు. "నీవు అణువుకంటే అతి అణువుగా ఉన్నావు. ఘనముకంటె, అతి ఘనుడుగా వున్నావు, దొంగలలో నీవు గజదొంగ" అని ఆడి పాడి ఆనందము నందుకొన్నాడు లోక విఖ్యాత దొంగలు వస్తువాహనాదులను మాత్రమే దొంగిలింతురు పవిత్రమైన, పరిశుద్ధమైన అన్నింటి కన్న విలువైన చిత్తమును అపహరించేవాడు నిజముగా 'గజదొంగ' కదా? మీరందరూ అంత దూరమునుంచి ఎన్నో కష్టముల కోర్చుకొని, ఈ పండుగ నాడు స్వామి సన్నిధిలోనే వుండాలి అనే పవిత్ర వాంఛతో ఇక్కడ సమావేశము కావటము, మీచిత్తాపహరణము గావించిన పరమాత్ముని లీలకు ఒక చిన్న నిదర్శనము.

భగవత్ప్రేమ ఒక పెద్ద ప్రవాహము దానిలో మీ మీ ప్రేమ భావములు చిన్న చిన్న కాలువలవలె చేరుచున్నవి ప్రేమయే దైవము; ప్రేమించుటయే దైవారాధన. మానవుల ప్రేమనదులు సమ్మిళితమై దైవప్రేమ అనె అనుగ్రహ సాగరమును చేరి, సంగమించును.

ఈ పండుగయందు మీరు కేరళమందు "నేంద్ర" పండు ఆరగింతురు కదా? అయితే, తినుటకు ముందు దాని తొక్కను తీసి వేయవలెను, కదా? కమలా పండును తినుటకు ముందు కూడ అట్లే చేయవలెను, కదా? బలి చక్రవర్తి యొక్క భక్తిని స్వీకరించే ముందు భగవంతుడు వాని పశుబలము ధనబలము అధికార బలము అహంకారము అనే తొక్కను తీసివేసినాడని భాగవతము చాటుచున్నది. "బలి" యొక్క 'బలము'లన్నిటినీ విసర్జించి పరిశుద్ధ చిత్తమును మాత్రమే భగవంతుడు స్వీకరించినాడు

ఓణం పండుగను కేరళవాసులు ఆచరించే ఉద్దేశమిది; మానవులు బలిచక్రవర్తిని ఆదర్శముగా, ఆధారముగా అంగీకరించి, తమ ఆత్మానందమును భగవదర్పితము చేసి, జీవితమును సార్థకము చేసుకొనవలెను. ప్రతి సంవత్సరము మీరు "ఓణం" ను ఆచరించి వీడుకోలును మాత్రము జరుపుతున్నారే కాని, సుగుణములకు సత్‌చింతనలకు, సత్కార్యములకు స్వాగత మందించుటలేదు; అట్లు చేసిననే, "ఓణం" పండుగ నాచరించినందుకు సాఫల్యము సిద్ధించును.

మీ అదృష్టమే అదృష్టము ఇతర ప్రాంతముల వారికీ అవకాశము ఇంతవరకూ దొరకలేదు. వారికి కూడ జాతీయ పర్వదినములున్నాయి. అయిననూ, ఒక కేరళ రాష్ట్రము వారికే తమ 'ఓణం'ను సంవత్సరము సంవత్సరమూ స్వామి సన్నిధిలో జరుపుకొనుటకు అవకాశము దొరకుచున్నది అంటే ఇది మీ భక్తి ప్రపత్తులవలన మీకు లభించిన భాగ్యమనే చెప్పవచ్చును.

ఇంకొక విషయం - భగవద్భక్తి ఎక్కడ ఎక్కువ కనపించునో, అక్కడనే దానికి విరుద్ధమైన భావములు చర్యలు చెలరేగును. కేరళలో అట్టి భావములు బలముగా నున్నవి. అయితే, మీరు నిరాశ పడక. అధైర్యము చెందక, ఎదిరించి మీ శ్రద్ధాభక్తులను ప్రకాశింప జేసుకోవలెను. వజ్రమును కోసితే కాని చక్కగా శోభాయమానముగా ప్రకాశించదు. మీ మీ ఆచరణను చూచి నాస్తికులు కూడా ఆస్తికులుగా మారుతారు నిజముగా, నాస్తికులే లేరు; అందరి హృదయ పీఠములలోనూ ఆత్మారాముడున్నాడు వారిలోని సత్య స్వభావము, ప్రేమభావము ఇవన్నీ ఆ ఆత్మారాముని లక్షణములే. ప్రేమ లేనివా డెవ్వడూ లేడు అ ప్రేమయే భగవంతుడు, ప్రేమతో మెలిగితే అందరినీ సన్మార్గమందు నడిపించవచ్చును"

**శ్రీవారి దివ్యబోధ 30. 8. 74.**

# పు స్త క సూచి

1 పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజి్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 1-25 తో వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

తెలుగు:—

| | | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-65 |
| 2 | ,, ,, (2) | 4-00 | 0-75 |
| 3 | **మణిమాల** | 1-00 | 0-25 |
| 4 | అర్పణ | 1-00 | 0-15 |
| 5 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0 25 |
| 6 | సందేహ నివారిణి | 1-50 | 0-25 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-65 |
| 8 | వచనామృతము | 4-00 | 0-45 |
| 9 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 10 | గీతాభావప్రకాశము | 15-00 | 1-65 |
| 11 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-35 |
| 12 | భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి వేసవి ప్రబోధాలు | 2-50 | 0-35 |

కన్నడ:—

| | | | |
|---|---|---|---|
| 1 | ప్రశాంతివాహిని | 1-50 | 0-25 |
| 2 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 3 | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 4 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 5 | జ్ఞాన వాహిని | 1-50 | 0-15 |
| 6 | గీతావాహిని | 4-00 | 0-45 |

మలయాళము:—

| | | | |
|---|---|---|---|
| 1 | జ్ఞానోపశదేరత్నంగళ్ | 1-50 | 0-55 |
| 2 | 108 రత్నంగళ్ | 1-50 | 0-15 |
| 3 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-65 |
| 4 | అవతారమాహాత్మ్యం | 1-50 | 0-15 |
| 5 | ధర్మవాహిని | 1-00 | 0 15 |

ఇంగ్లీషు:-

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-55 |
| 2 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-65 |
| 3 | ప్రశాంతివాహిని | 2-00 | 0-25 |
| 4 | సమ్మర్‌షొవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0 65 |
| 5 | „ 1973 | 6-50 | 0-55 |
| 6 | సందేహ నివారిణి | 3-00 | 0-25 |

అరవం:—

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-25 |
| 2 | „ „ „ [2భా] | 4-00 | 0-65 |
| 3 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-45 |
| 4 | „ „ [2భా] | 3-00 | 0-55 |
| 5 | సాయిమాతా | 1-00 | 0-15 |
| 6 | ధర్మవాహిని | 1-50 | 0-25 |
| 7 | సందేహనివారిణి | 2-00 | 0-35 |
| 8 | జ్ఞానవాహిని | 1-50 | 0-15 |
| 9 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-25 |
| 10 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-15 |

హిందీ:—

| | | | |
|---|---|---|---|
| | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-15 |

గుజరాతి:—

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-15 |
| 2 | కథాసుధ | 2-00 | 0-25 |
| 3 | గీతావాహిని | 4-00 | 0 55 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4 00 | 0.55 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-15 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-25 |

అస్సామి:—

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారథి [షార్ట్‌బయాగ్రఫీ] | 1 00 | 0-15 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కథ | 0-25 | 0-15 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0-50 | 0 15 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0 45 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0-25 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-15 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0 25 |

-o—

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2 చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4 చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5. గమనిక : - పుస్తకముల కొరకు పైకము నీక్రింది అడ్రసుకే పంపవలెను :

శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతినిలయం పోస్ట్,

అనంతపురంజిల్లా, 515134.

6. పత్రికకు పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతనసారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు మాత్రమే పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును. పత్రికలుగాని పుస్తకములు గాని V.P.P. ద్వారా పంపబడవు.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను అటు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును

8. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మి చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు ..11/-74 అని యుండిన, మి చందా నవెంబర్ నెలతో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) అక్టోబర్ 31. వ తేదీ లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు మేనేజరు 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్తచెఱువు 30 P.C.O కు ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె , బి యల్

Regd. No. KRN/A-67

October 1974

ఆత్మ నిమగ్నత, అంతర్ముఖత, స్వస్వరూప నిష్ఠ, బ్రహ్మజ్ఞానము, ఈ నాలుగే నిజమైన ధర్మములు, ఇవియే సత్యము, శాంతము, ప్రేమ, అహింస అను నాలుగు రూపములు ధరించినవి.

—బా బా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 నవంబర్, 1974 సంచిక 9

## విషయానుక్రమణిక



సంవత్సర చందా : రు. 5/-. ఇతర వివరములకు అట్ట లోపలి భాగములో చూడండి.



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా



## అగస్త్యాశ్రమము

భరించలేని ఆనందమును అందుకొని అగస్త్యుడు సీతారామ లక్ష్మణులను ఆశ్రమము లోనికి తీసుకొని వెళ్ళి ఉన్నతాసనముల పై కూర్చొనబెట్టి, ఫల పానీయముల తెప్పించి అందించెను. కుశల ప్రశ్నలు వేయుచుండ అగస్త్యుడు కన్నులు మూసుకొని చిరునవ్వులు చిందులు త్రొక్క ఆనందబాష్పములు రాల్చుచు, "నాథా! నా కంటె అదృష్టవంతుడు లేడని భావించుచున్నాను. సాక్షాత్ నారాయణుడు నా చెంతకు వచ్చుట నా ఆశ్రమమున నివసించుట నిజముగా ఇది కలయా, లేక సత్యమా అని అనుపించుచున్నది," అని వేయి విధముల తన సంతోషమును వెలిబుచ్చెను.

అంత రామచంద్రుడు, మునిరాజా! మీ వద్ద నాకు దాపరికము లేదు. నేను వనమునకు వచ్చుటకు కారణము మీకు విశదమే. అందుచేత నా సంగతి నేను ప్రత్యేకముగా ప్రకటించుకో లేదు. ఏ ప్రకారము, ఋషులకు, మునులకు, తపః భంగము కలిగించు రాక్షసులను సంహరింపవలెనో, దైవదాసులను రక్షించవలెనో తమరు సెలవిచ్చిన ఆ రీతిగా చేతునని పలికెను. ఓ మునీ! హేమంత ఋతువులో కమలములు నశించు విధమున, నేడు ముని ద్వేషులు నశించుటకు సమయ మాసన్నమైనది, అని రాముడు తెలుపగనే, అగస్త్యుడు చిరునవ్వుతో, ఓ నాథా! మీకు సర్వము విదితము, ఇట్లేల నన్ను ప్రశ్నించుచున్నారో అర్థమగుట లేదు. ఇది నన్ను అనుగ్రహించు మాటలో లేక పరీ

క్షించు పలుకులో కూడ నిర్ణయించుకో లేక పోవుచున్నాను. అయితే మీ దర్శన స్పర్శన సంభాషణల ప్రభావముచే మీ భావమును కొంత వరకూ తెలుసుకోగలిగితిని. అదియూ తమ కటాక్షమే. మీ మాయ మీ పాదాక్రాంతురాలై. మీ భ్రుకటీ విలాసమును నిరీక్షించుచుండును. ఆ మాయయే మీ ప్రభావము చేత సమస్త దేవ గణములను సృజించుచున్నది.

మీ మాయ అజేయురాలు. మీ మాయ జీవుల నెంత కష్టపెట్టుచున్నదో ఆ సంగతి లోకప్రసిద్ధము. కటాక్షించి నా విన్నపము నాలకించు. మీ మాయ బొడ్డ చెట్టువంటిది. దాని పండ్లవంటివి మాయా కల్పితములగు బ్రహ్మాండ కటాక్షములు, ఈ బ్రహ్మాండములోని చరాచర జంతుజాలము లా పండ్లలోని పురుగులు వారు. వాని యందము పైపై జూడ చిత్రముగ నుండును, కానీ వాటి పొట్ట విప్పి చూడ పురుగులు లెక్కకు మిక్కుటము. ఈ బ్రహ్మాండ ఫలమునం దాసక్తి కలవారు కాల స్వరూపులగు మిమ్ము చూచి భయపడుచుందురు.

రామా! మీరు లోకారాధ్యులు. మనుజ మాత్రుని వలె మీరు నన్ను ప్రశ్నించుట, ప్రశంసించుట, ఇది యోగ్యముగా వున్నదా. నా కేదీ అక్కరలేదు. సీతాలక్ష్మణ సమేతుడై మీరు నా హృదయమున నివసించుము. ఈ ఒక వరమును నా కనుగ్రహింపుము. మీ సగుణ రూప ధ్యానమే నాకు అభిమానము అదే నా మతము, అభిమతము. వ్రతము. కాన కటాక్షింపుము, కరుణింపుము.

మీ దాసులకు గొప్పతనమిచ్చుట మీరు అమాయకుల వలే యేమీ తెలియని పామరుని వలే ప్రక్కకు తొలగుట, మీ ఘన లీలలలో ప్రధానమైన లీల కాన, మేరు నన్ను ప్రశ్నించకు. తమ అభీష్టమును అనుసరించుట నాకర్తవ్యము సారె సారెకు నన్ను నీ మాయలో దింపి పరీక్షించకు తండ్రీ, అని ప్రార్థించెను అంత, రామచంద్రుడు, మునివర్యా! ఈ ప్రాంతములు మీకు సహజ పరిచయము కనుక యెక్కడ నేను సీతాలక్ష్మణులతో నివసించుటకు యోగ్యమో నీవు నిర్ణయించుటలో తప్పేమున్నది. ఇది లోక ప్రవృత్తి కదా! అని జవాబివ్వగా, అగస్త్యుడు. నాథా! అడిగితిరి కనుక ఆజ్ఞను జవదాటక తెలుపనెంతును.

దండకారణ్యము

అతి సమీపమున పవిత్ర గోదావరి ప్రవహించుచున్నది. ఆ మహానది యుగములు తరబడి సజీవమై ప్రవహించునట్టిది. దాని సమీపమున దండకారణ్యము కలదు. ఆ దండకారణ్యమును పవిత్రము చేసిన ఋషులకు సమస్త సుఖములు చేకూర్చినవారగుదురు. కారణమేమన ఆ వనము మునిరాజు శాపముచే తపించుచున్నది. అంత రాముడు, అగస్త్యా! ఆ శాప వృత్తాంతము సీత విన గోరుచున్నది విపులముగా తెలుపుమని కోరగా, అగస్త్యుడు ఓ నటన సూత్రధారీ! ఒక సమయమున పంచవటీ తీరమున దుర్భిక్షము వచ్చెను. అపుడు మునులందరు గౌతమ ఋషిని ఆశ్రయించిరి. అతడు తపో మహిమతో విశేష కాలము ఆశ్రయించిన మునులను పోషించెను. దుర్భిక్ష కాలము తీరగనే ఋషులందరూ తమ తమ స్వస్థానములకు పో తలంచిరి.

అయితే వేషధారులైన కొందరు ఋషులు, గౌతమముని శక్తి సామర్థ్యములను చూచి వోర్వలేక కొన్ని కుట్రలు పన్ని. అతనిని యే రీతిగానైనా నిందల పాలు చేయవలెనని భావించి, ఒక్క గోవును వెతికి, కొన్ని క్షణములలో ప్రాణములు విడునట్టి దానిని తీసుకొని వచ్చి ఆశ్రమము లో పచ్చగా ఆకర్షనీయముగా వుండు ప్రదేశమున ప్రవేశింప జేసిరి.

గౌతముడు బయటకు వచ్చి చూచుసరికి ఆ గోవు పచ్చని గోభాయమానమైన పూల మొక్కలను, లేవలేక తినలేక, ప్రాణములు విడుటకు సంసిద్ధముగా వున్న గోవునుచూచి,పూల మొక్కలు పాడు చేయుచున్నదని తలంచి దానిని లేపి బైటకు త్రోయుటకై ప్రయత్నించగా ఆ ప్రయత్నముల లోనే, అనగా స్పృశించిన తక్షణమే ఆ గోవు అక్కడే ప్రాణములు విడెను. అంత కుట్రలు పన్నిన వేషధారి ఋషులు గౌతమునిపై గోహత్యా పాపమును అంట గట్టిరి, పుట్టించిరి. అతనిని దూషించిరి. అంత గౌతముడు గోవు ప్రాణములు విడుట యోచించి ఇది సకాల వర్జితమా లేక తనచే ప్రాణములు విడటమా అని కొంత ధ్యాన నిష్ఠుడై సత్యమును గమనించెను,

ఇది ఋషులు పన్నిన కపట నాటకమని తెలుసుకొని, ఆ వనమున ఇట్టి కపట ఋషులు నివసించకూడదని తలంచి ఈ వనము భ్రష్టమగుగాక ఈ వనమున రాక్షసులు మాత్రమే నివసింతురు గాక అని శపించెను.

ఇక దండకుడను రాజు గురు పుత్రికను బలత్కారముగ చెరబెట్టెను కనుక, ఆమె భృగు మహాముని బిడ్డ అగుట చేత ఆమె తండ్రికి విన్న వించగా తండ్రియైన భృగుమహర్షి కోపించి, అతని రాజ్యముపై ధూళివర్షమును కురిపించెను. అందువలన మట్టి మయమై ఈ రాజ్యము వనముగా మారెను; దండకుని రాజ్యము వనముగా మారుటచేత, దండకారణ్యమని పేరు వడసెనని తెలిపెను.

శాపవిమోచనము

ఓ రఘువంశ తిలకా ! తాము ఆ వనమున నివసించిన అందులోని రాక్షసులు నశింతురు, ప్రదేశము శాప విముక్తిని పొందును, ఋషులకు సత్సంకల్పములు పెరుగును, అనేక విధముల లోకోపకారము కలుగును, ఋషుల శాపములు తీరుట చేత, శపించిన ఋషులకు కూడా ఆనందము కలుగును, అని అగస్త్యుడు కోరగా సరి, చాలా మంచిదని అగస్త్యునితో సెలవు తీసుకొని సీతాలక్ష్మణులతో దండకారణ్యమునకు రామచంద్రుడు బయలుదేరెను. అంత అగస్త్యుడు, రామచంద్రునకు నమస్కరించి యెంతో కాలము నుండి తన చెంత నుంచుకొనిన కొన్ని అస్త్రములు తానుపయోగించుటకు వీలు కానందున వాటిని రామచంద్రునకు అందించి నా సర్వబలము తామే, ఈ అస్త్రబలములు నన్ను రక్షించవు, రామానుగ్రహ బలమే నిజ బలము. నిజ రక్ష అని తలంచి వాటిని గైకొనుమని ప్రార్థించెను.

అగస్త్యుని ప్రార్థనలను మన్నించి రాముడు ఆ అస్త్రములను అందుకొని ఆశ్రమమును విడెను. సీతారామలక్ష్మణులు దండకారణ్యము ప్రవేశించిన తరువాత అంతవరకూ యెండ జారిన వృక్షములు చిగుళ్లు పెట్ట మొదలిడెను, మొద్దు బారిన

లతలు పుష్ప గుచ్ఛముల వేసెను. అరణ్యము పచ్చగా రంగులు రంగులుగా, ప్రకృతి సౌందర్యము ను చేసుకొనెను. అందులో నివాస యోగ్యమయిన ప్రదేశమును వెతుకుతూ పంచవటీ తీరమునకు వచ్చి చేరిరి.

### జటాయు

అక్కడ వృద్ధుడైన జటాయువును చూచిరి. అతను పూర్వము దశరథుని మిత్రుడు, గృధ్రరాజు, అందువలన అతనికి దశరథుని మరణవార్తను శ్రీరాముడు తెలిపి అతనిని శాంతపరచి, తన పరిచయమును తనకు తాను చేసుకొనెను. గోదావరి తీరమున ఒక పర్ణశాలను నిర్మించుటకు నిర్ణయించిరి. జటాయువు మైత్రి దిన దినమునకు అధికమగుట చేత అక్కడి వాతావరణము ప్రదేశముల యొక్క స్థితిగతులు చక్కగా తెలుసుకొని ఆ రాత్రి అక్కడే వృక్షము క్రింద కాలము గడిపిరి.

### లక్ష్మణభక్తి

పంచవటీ తీరమున కొంత కాలము అధికంగా నివసించాలని తలంచి, సీతారాములు ఒక చల్లని ఛాయయందు విశ్రమించుచు, రాముడు లక్ష్మణుని పిలిచి, తమ్ముడా! ఈ ప్రాంతమున అన్ని విధముల అనుకూలమైన ఒక చక్కని ప్రదేశమును నిర్ణయించి నీకిష్టమైన రీతి ఒక పర్ణశాల నిర్మించమని ఆజ్ఞ చేయగా, ఆ పదములు, లక్ష్మణునకు మహా కత్తిపోటుల వలె తోచి భరించుకో లేక పోయెను. రామా ఇంతటి కఠిన మాటలు వినుటకు నేనే దోషము చేసితినో తెలుపుము అని, పాదములపై పడి ప్రార్థించెను.

అందులకు సీతారాములు ఆశ్చర్యమున లక్ష్మణా! యెందులకింత విచారించుచున్నావో అర్థమగుట లేదు, నా నోట కఠినపు మాట లేనాడైననూ వినియుంటివా? కఠినపు మాటలాడుటకు నా కేమైనా పిచ్చి పట్టినదా? ప్రాణసమానముగా చూచుకొంటూ నా ఆశయాలను శిరసావహించి ఆదరించుచున్న నిన్ను నేను కఠినపు మాటలాడుటతో అర్థము లేనిది. నేనేమంటిని, నీ కిష్టమైన స్థానమును ఒకటి నిర్ణయించి పర్ణశాల నిర్మించ మంటిని, అంతే కదా!

తిరిగి లక్ష్మణుడు, రామ, రామ, నేనీ మాటలను వినలేను అని చెవులు మూసుకోవటము చూచి, రాములు, మరింత ఆశ్చర్యపడి చూచు చుండ, లక్ష్మణుడే హస్తములు కట్టుకొని, స్వామీ! నా సర్వస్వము సీతారాములే అని తలంచితిని. నా అనువారు లేరు, నా కిష్టము రామాజ్ఞయే అని దేనినీ లెక్క చేయక రామాజ్ఞను నడచుకొను నట్టి దాసునిగా నేనుండ, నాకిష్టము వేరొక్కటున్నటుల తాము పలికిన, నేనెట్లు వినగలను, నా ఇష్టమే వేరొకటుండిన, రామసేవకు అర్హుడనగుదునా? నేను రామసేవకు అనర్హుడగుదును కదా. దానికే అనర్హుడైన నే నిక లోకానికే అనర్హుడను వ్యర్థుడను, నిరర్థక జీవిని, అని వెక్కి వెక్కి యేడ్వ నారంభించెను.

అంత సీత విషయమును చక్కగా గమనించి, సోదరా! నీ హృదయము మహా పవిత్రము, యేదో లోక సామాన్యముగా మీ అన్న అట్టి మాటలు ఉపయోగించెను కానీ నీ హృదయము మీ అన్న యెరుగక పోలేదు. ఇంత

మాత్రమునకు నీవింత దుఃఖించకు, లెమ్ము అని, ఓదార్చెను.

రాముడందులకు నవ్వుచూ. తమ్ముడా! నీ సూక్ష్మతకు నాకెంతయో ఆనందము. నీ భావములు సున్నితములు, అతి పవిత్రములు. ఇట్టి మాటలతో నిన్ను బాధించుటకు లోక సామాన్యముగా నేను ఆడిన మాటలే కాని వేరు కాదు. రమ్ము పోయి చూతము అని తమ్ముని వెంట బెట్టుకొని కొంత ప్రదేశము చూచి అక్కడ పర్ణశాల నిర్మించుమని చెప్పినతోడనే ఆహా నేను ధన్యుడను, ఇట్టి ఆజ్ఞను నెరవేర్చుటయే నా కర్తవ్యము కాని, నేనే నా ఇష్టమని ఒక దానిని సృష్టించుకొను అధికారము నాకు లేదు, నేను నీ వాడను, నీ దాసుడను, అని అన్నడు నమస్కరించి పర్ణశాలకు కఱ్ఱలు, ఆకులు కొట్టుటకు ప్రారంభించెను

లక్ష్మణుడు అంత సూక్ష్మ బుద్ధి కలవాడని సీతారాములు తెలుసుకొని, అతని శ్రద్ధా భక్తులకు వారిలో వారు యెంతో ఆనందించిరి. లక్ష్మణుని వంటి తమ్ముడు వారి వెంట వుండుటచే, అరణ్యవాసము. మహా హాయిగా యెట్టి [illegible] కూడా లేక అయోధ్యలో కంటె సుఖముగా జీవించుచున్నామని సీత పదే పదే, రామునకు తెలుపుతూ వచ్చెను.

(సశేషము)

---

కమనీయ కంఠమ్ము కదలినంతనె దివ్య
గాన ప్రవంతినే వినగవచ్చు;
అభయ ముద్రాంకిత హస్తమ్ము చూపించ
ఆర్తియంత హరించి హాయి గూర్చు;
కమలాక్షులల్లన కరుణను చిలికించ
హృదయమ్ము ఝల్లని మోదమందు;
మృదు మందహాసంబు పెదవిపై భాసిల్ల
స్వర్గమే దిగివచ్చి సరసనుండు;
వెంట జంట నుండి వెతలను బాపును,
పాదస్పర్శ మిగుల పావనమ్ము;
ఏమి చెప్పగలను, ఏ రీతి వర్ణింతు
సత్యసాయి ప్రభుని, సర్వగుణుని.

# రెండి, సాగిరండి

"నేను సదా మీ వెంటనే ఉన్నాను. విచారించ వద్దు. ఆ రైలు ప్రమాదమునుండి నిన్ను రక్షించుట ఎంత కష్టమైనదో నీకు తెలుసునా? నీ కుమారుడు కూడా, ఆ ప్రవాహముతో, ఆ వంతెన క్రింద అక్కడే చిక్కుకొనినాడు. అది కాక, ఆ గుండెపోటు మాటేమిటి? అది మరొక చిన్న వ్యవహారము! గుండె నొప్పి వచ్చిన రెండవ దినమున నీ స్థితి చాలా విషముగా ఉన్నది. డాక్టర్లందరు ఆ విషయములో ఒక నిశ్చయమునకు వచ్చినారు కూడా."

1970 జూన్ మాసము 26వ తేదీన, యీ అకించనుడైన పాఠశాలోపాధ్యాయుడు స్వామిని కలిసికొనినప్పుడు, స్వామి చెప్పిన మాటలివి. ఈ పలుకులు నాకు సంభ్రమము, కంపనము కలిగించి శరీరము జలదరించినది; ఒక విధమైన ఉపశమనము నన్నావరించినది

1964 డిశంబరు 23 వ తేదీ నాటి భయంకర కాళరాత్రి నా కన్నుల ఎదుట తటిల్లతవలె కనిపించినది. నేనున్న రైలు పెట్టెలో తెరచిన ద్వారముగుండా, గర్జించుచూ ప్రవహించే నదిలో నేను పడిపోయినాను రైలు పెట్టె శిథిలములన్నీ నా పైన పడి నన్ను క్రిందికి అణచి వేసినవి. అన్ని ప్రక్కల నుండి హృదయ విదారకములైన ఆర్తనాదములెన్నో వినిపించసాగినవి. చాలా మంది ఏదో విధముగా నది గట్టుకు చేరుకొనుటకు, ఎంతో నిరాశతో, ప్రయత్నము చేయసాగినారు. "సాయిరాం" అని నా యిష్ట దైవమును ఎలుగెత్తి పిలిచినాను మరుక్షణమే నా పాదములకొక బండ తగిలినది. దాని మీద నిలబడి తలను నీటి మీద నుంచగలిగినాను. ఆ కారుచీకటిలో నా కుమారుని పేరు పెట్టి పెద్దగా పిలవ సాగినాను. బాబా ఎంతటి కరుణామయుడు! "నేను క్షేమమే; నీ వెట్లా ఉన్నావు" అని నా కుమారుడు దగ్గరలోనే జవాబు చెప్పినాడు. బండి నదిలో పడే క్షణము వరకు, నాతో దీర్ఘ సంభాషణ గావించే డాక్టరుగారు కూడా దగ్గరలోనే కనిపించినారు; బాబా ఆ డాక్టరును రక్షించుటే కాకుండా, ఆతడు మా వద్దకు వచ్చి మా యిద్దరికి ప్రథమ చికిత్స గావించి మా కెంతో సహాయపడునట్లు చేసినారు. ఈ సంఘటన జరిగి ఆరు సంవత్సరములు గతించినవి. దీనిని గురించే బాబా చెప్పినది. ఇదే నేను వారికి అప్పగించిన 'బాధ్యత'!

ఈ సంఘటన జరిగిన ఐదు సంవత్సరముల తరువాత, 1969 లో, నాకు తీవ్రమైన గుండెపోటు వచ్చినది దైవమే నిశ్చయించిన సాయిమాతయొక్క ఉపకరణము మాదిరి, రైలు బండి దుర్ఘటనలో నాకు సాయము చేసిన డాక్టరే తిరిగి యిప్పుడు నాకు చికిత్స చేసినారు. ఇప్పుడు నేను, నా శేష జీవితమును నా స్వామి కాపాడి రక్షించుచున్నాడను పరమ విశ్వాసముతో, వారిసమక్షములో నిలబడినాను. పెన్నిధి లభించినట్లయినది. నా స్వామి తేజోమూర్తి అని, ప్రేమ స్వరూపుడని, జ్ఞాన ప్రదాత అని, అనంత

శక్తివంతుడని, కరుణామూర్తి అని, నేను తెలిసికొనినాను.

బాబా యీ యుగ అవతారమూర్తి. భౌతికముగానే కాకుండా, దానికన్న ఎంతో ఘనముగా, నైతికముగా, ఆధ్యాత్మికముగా కృంగి కృశించుచున్న మానవ హృదయములను సముద్ధరించుటకుగాను అవతరించిన దివ్యమూర్తి. మన హృదయములు సంకుచితమై కుంచించుకొని ఉన్నవి; మనమందరము సందేహ దుఃఖ సాగరములో మునిగి ఉన్నాము. బాబా మనల నందరిని యీ బురదలోనుండి గట్టుకు చేర్చి, భయ మను ప్రవాహమునుండి కాచి, రక్షించి, నిలబడు నట్టి శక్తిని ప్రసాదించుచున్నారు; జీవిత సమరము నెదుర్కొను బలమును, శక్తిని అనుగ్రహించుచు న్నారు. అలసట, తృప్తి అనే ద్వంద్వ రోగము లను నివారించుటకే బాబా అవతరించినారు; ఈ రోగములు, సాధకుని ప్రయత్నముల కవరోధములను కల్పించుచున్నవి.

మానవులలో పరివర్తన కలుగ చేయుటకు బాబా ప్రేమ మార్గమును చేబట్టినారు. వారి అనుగ్రహమే యీ ప్రేమకు వాహనము. వారి అనుగ్రహము చేతనే, మానవులందు నిద్రాణమై ఉన్న దివ్య లక్షణములను అభివృద్ధి పరచుకొనుటకు ప్రేరణ కలు గుచున్నది. ఆ గమ్యమును చేరుకొనుట కిది ఒక ఆధారము మాత్రమే. స్వామియొక్క నిజతత్త్వము నభివ్యక్తము గావించుకొనుటలో ఇది మనము నేర్చు కొను ప్రథమ పాఠము.

'నేను, నాది' అనునట్టి అతిశయ భావమే నేటి కాలములో సర్వత్రా మానవ లోకమును పీడించు చున్న భయాందోళనలకు, ఈర్ష్యా ద్వేషములకు, మూలకారణమని బాబా చెప్పుచున్నారు. మానవ హృదయ క్షేత్రములను కలుషితము గావించునట్టి యీ దుష్ట కలుపు మొక్కలను పెకలించి నశింప జేయుట బాబా బోధించునట్టి సాధన ద్వారానే సాధ్యము.

బాబా ప్రబోధములు మధురాతి మధురములు; అత్యంత సరళములు. ఇవి నెమ్మదిగా, దృఢముగా, ఒక్కొక్క అడుగు ముందుకు వేయించుచూ, మానవుని పశుస్థితినుండి పశుపతి స్థితికి గొంపోవును. స్వామి నిరంతరము మనయందున్నాడను స్థిరమైన భావమే ఈ సాధనయొక్క సారము. జీవిత యాత్రలో మనలను కాచి రక్షించుచూ బాబా మన సహచరుడుగా నున్నాడని మన అందరియొక్క అనుభవము. బాబా సర్వాంతర్యామి, అంతర్గత చైతన్యము, దివ్య దర్శ కుడు, నిరంతరము సావధానుడై ఉన్న సర్వసాక్షి.

మన మీ సాధన నెప్పటికైన ప్రారంభించెదమా? లౌకికముగా కానీ, ఆధ్యాత్మికముగా కానీ, బాబా దివ్య ప్రేమను మనపై ప్రసరింప చేయునట్టి అద్భు తానుభవ ప్రభావములో సావధానులమైతిమా, ముందు కు సాగి పోవుటే మన కర్తవ్యమని తెలుసుకుంటాము.

ఈ యాత్రను సాగించుటకు నిశ్చయించుకొనిన వారందరితో, బాబా "మీ రొక అడుగు నా దగ్గరకు వేసినట్లయిన, నేను పది అడుగులు మీ దగ్గరకు వేయుదును" అని చెప్పుచున్నారు.

ఈ లోగా, మనకై మనము తీసుకొనవలసిన కొన్ని ముందుచర్యలను గురించి పునశ్చరణము గావించుతాము. ప్రతి దినమును ప్రేమతో ప్రారం భించి, ప్రేమతో నింపించి, ప్రేమతో పరిసమాప్తము గావించవలెను. నిత్య కర్మ లన్నింటిని బాబాకు అర్పించవలెను; సర్వ కర్మలు భగవంతునిపూజా

కార్యములే. వ్యాకులత అనే దౌర్బల్యమునకు సిగ్గు పడవలెను. వ్యాకులపాటువలన మనము బాబాను సందేహించుచున్నాము, నిరాకరించుచున్నాము బాబా మన మార్గము నందుంచిన వారికి సహాయము చేయవలెను; కానీ, ఆ సహాయము చేసినట్లు ఎవ్వరికీ తెలియరాదు. అంతా ఆ పరమాత్మునిదే; మనము నిమిత్త మాత్రులమే. ఎటువంటి దోషములు చేయకుండా జాగ్రత్తగా ఉండి, బాబా కంగీకారమైన కార్యములనే చేస్తుండవలెను. కఠినోక్తులతో కానీ బాధ కలిగించే వ్యాఖ్యానములతో కానీ యితరులను కష్టపెట్టరాదు. మృదువుగా క్లుప్తముగా మాట్లాడుట నేర్చుకొనవలెను. బాబా అనుగ్రహించి మన కిచ్చిన దానితో తృప్తి చెంది, వారు నిర్ణయించిన పాత్రను చక్కగా నిర్వహించవలెను. జీవిత రంగము మీద తెర దిగునంతవరకు, దానినే మన నిశ్చయముగా భావించవలెను.

ప్రొ॥ జి. బి. పిళ్లై.

# " మంగళ హారతి "

హారతి ఆత్మ ప్రకాశమునకు చిహ్నము అందు చేతనే, భజనాంతములో పూజాంతములో కర్పూర హారతి ఇచ్చుట అచారమైనది. మనము గావించిన ప్రార్థనను, పూజను ఆత్మ ప్రకాశము పొందుటకు అర్పించినట్లుగా, హారతిని మనము పూజించిన దేవతకో, దేవతావిగ్రహమునకో అందించునట్లుగా త్రిప్పుతాము. హారతి లేక ఆరతి అనగా ఆత్మరతి లేక ఆత్మలో క్రీడించుట, లేక ఆత్మ పరమాత్మకొరకు వాంచించుట అని అర్థము. దీనికే ఒక జ్యోతిని మరొక జ్యోతియందు లయమొనరించుట అనగా, వేరు చేయబడిన జ్యోతిని విశ్వజ్యోతితో చేర్చుట అని కూడా అర్థము చెప్పవచ్చును.

కర్పూరము వెలిగించినప్పు డది పూర్తిగా హరించి పోతుంది; చివరకు కరదూప శేషము కూడా మిగులదు అటువంటి కర్పూరమునే హారతి కొరకుపయోగించుచుతారు. ఆరతి నిచ్చునప్పు డా వ్యక్తి, " పరమాత్మా, యిదే విధముగా, నాయందున్న మాలిన్యమునంతా, నిశ్శేషముగా, తిరిగి దీనికొరకు నేను ప్రార్థించకుండా, దహించి వేయి " అని అంతరంగములో ప్రార్థించవలెను.

శ్రీ సత్యసాయీశ్వరుని నిలయమైన ప్రశాంతి నిలయములో, నిత్య మాచరించుచున్న కర్మకాండను సాధకుడు చక్కగా గమనించి అనుసరించవలెను. బాహ్యాభ్యంతర పరిశుద్ధతకొరకు, నిదుర మేలుకొనిన వెంటనే ఇరువది ఒక్క సార్లు 'ఓం' ను, ప్రణవమును ఉచ్చరించి, సుప్రభాత గీతము నాలపించుచు, మన యందున్న శక్తులను మేలుకొలిపి, ఆ నాటి దైవిక కార్యములు ప్రారంభించెదము. తరువాత 'నగర

సంకీర్తనము గావించి, పరిసర ప్రదేశము నంతను పరిశుద్ధ పరిచెదము. మన బాహ్య కర్మలకు సూచకముగా, భజనలను, నగర సంకీర్తనమును చేయుమని బాబా ఆదేశించినారు. భగవన్నామమును పలుకుతూ, భగవంతుని రూపమును కన్నుల యెదుట నిలుపుకొని మన లౌకిక వ్యవహారములందు ప్రవేశింపుమని బాబా కోరినారు "మాం అనుస్మర యుధ్య చ"- నన్ను స్మరించచూ యుద్ధము చేయుము అని కదా శ్రీ కృష్ణుడు అర్జునునకు గీతలో బోధించినది.

దినాంతములో నిత్య కృత్యములందు అలసిపోయిన యింద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారములు నిద్రలో విశ్రాంతి పొందుటకుగాను, క్షేత్రములో చేరు సమయమునందు, యీ పవిత్ర మంగళహారతిని గావించుచున్నాము. సుషుప్తి సమయములో, తామందరు ఆత్మలో నిద్రావస్థలో ఉండగా, భగవంతుని రక్షకత్వము తమకున్నదని చూపించు చిహ్నముగా భగవంతుని కీర్తించుతారు. తమ కర్మల ఫలితముగా పొందిన వాసనల నన్నింటిని భగవానుని పాదపద్మముల వద్ద సమర్పించి, కరగింపచేసి, వాటి శక్తిని నశింప చేసుకొనెదరు. ఇదే బాబా పటమునకు కాని, విగ్రహమునకు కాని కర్పూర నీరాజనము గావించుటలోని అంతరార్థము.

పుట్టపర్తిలో కానీ, యితర ప్రదేశములందు కానీ, మంగళహారతి సమయములో పాడే (ఓం జయ జగదీశ హరే....) గీతికలో నాలుగు చరణములున్నవి. ఈ గీతికలో భగవానుని సంబోధించే అనేక నామములెంతో అర్థవంతములైనట్టివి.

ఈ గీతము ప్రణవనాదమైన 'ఓం' తో ప్రారంభమౌతుంది. 'ఓం' భగవంతునియొక్క అన్ని నామముల సారము; ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ.

"జయ జగదీశ హరే"— జగమునంతయూ ఈశుడవైన, ప్రభువువైన ఓ హరీ, నీకు జయమగుగాక అని సంబోధించుచున్నాము. జగమనగా నిరంతరము చలించుతూ, పరివర్తనము చెందుతూ, వృద్ధిక్షయములు పొందునట్టిదని అర్థము. ఈ చరణములో దైవీ శక్తులకు విజయము, ఆసురీ శక్తులకు అపజయమును గురించి కీర్తించటము జరిగినది.

తరువాత బాబాను భక్తులు 'స్వామీ' అని సంబోధించుతారు. సర్వేంద్రియములు, బుద్ధి, మనస్సు- అన్నీ, ఆదర్శప్రాయమైన అంగ నిర్మాణములో, అంతర్భూతుడైన స్వామిని సేవించుతూ, వారి ఆదేశముల ప్రకారము ప్రవర్తించుతవి. ఇంకా యీ చరణములో బాబాను భక్తజన సంరక్షకుడని, పర్తిమహేశ్వరుడని కూడా ప్రస్తుతించుట జరిగినది. పర్తిని బాబా తన ధర్మ చక్రమునకు, ధర్మోద్ధరణకు కేంద్రముగా స్వీకరించినారు. పర్తికి 'వాంఛానిలయమైన శరీరమని' కూడా అర్థము. బాబా మన ప్రతియొక్క శరీరములో ఉపస్థితుడై దానిని స్వాధీనమునందుంచుకొనినట్టి ప్రభువు.

రెండవ చరణములోని 'శశివదన' అనగా చంద్రునివంటి అందమైన మోము కలవాడని అందరికి తెలిసిన అర్థమే. సుప్రభాతములో, దిన ప్రారంభములో, ఆదిత్యునివలె జగత్తును బాబా ప్రకాశింపచేయుచున్నాడని చెప్పబడినది. దినాంతములో చంద్రునివలె చూచుచున్నాము. చంద్రమా మనసో జాతః, అనగా చంద్రుడు మనస్సున కధిపతి. చంద్రుని ముఖములో మన మనస్సునే చూచుకొని, ఆ బింబమంత ప్రకాశమానముగా, చల్లగా, నిర్మలముగా మన మనస్సుల నుంచుకొనుటకు ప్రతిజ్ఞ గావించుచున్నాము. సుప్రభాతములో 'శ్రీమన్' అని

సంబోధించినట్లుగా, మంగళ హారతిలో 'శ్రీకర' అని సంబోధించుట జరిగినది. అనగా, శాంతి సౌఖ్యములకు నిలయమే కాకుండా, మానవాళి సుఖ శాంతులకొరకు వీటిని సృజించి మనకు ప్రసాదించినారని అర్థము.

బాబా సర్వప్రాణపతి. ఆశ్రిత కల్పలత కూడా. సర్వేంద్రియములు, మనస్సు, బుద్ధి, ఇవి అన్నీ శ్రీవారి అనుగ్రహము ద్వారానే తమ కోరికలన్నింటిని నెరవేర్చుకొనగలుగుచున్నవి; ఇది వారి మహిమకు ప్రతిబింబము.

ఈ గీతముతో బాబా ఆపద్బాంధవుడుగా కూడా, కృతజ్ఞతా పూర్వకముగా, కీర్తించబడినాడు; ఆపదలందున్న వారందరికి బాబా శరణ్యము. ఇది చాలా ఉచితమైన లక్షణమని, మనస్సు నిద్రించునప్పుడు కూడా, నాటునట్లు చెప్పవలెను. గాఢనిద్రలో మనలను, మన పరిసరములను మనము మైమరచి ఉన్న స్థితిలో, మనకెటువంటి కీడు కలుగకుండా కాచి రక్షించు పరమాత్మ బాబా ఒక్కడే కదా. నిద్ర అవిద్య లేక గాఢమైన అజ్ఞానదశ. మనము శరణన్నంతనే, బాబా మనలనీ అజ్ఞానమునుండి కాపాడుచున్నాడు.

మూడవ పాదములో, బాబాను 'మాత, పిత, గురు, దైవము, అనే కాక, 'మరి అంతయు నీవే' అని సంబోధించబడినాడు. అంతర్యామిగా, బాబాయే, సర్వ మనోభావముల, బుద్ధియొక్క, కారణమైనందున తల్లిగా, ఈ భావములన్నింటిని ఉత్పత్తి చేయగలిగినందున తండ్రిగా, సర్వ ధర్మములు బోధించు గురువుగా, పరమానందమునకు గమ్యమైన దైవముగా, స్తుతించబడినాడు.

ఈ చరణములో బాబా 'నాద బ్రహ్మముగా' వర్ణించబడినాడు. శబ్దమునకు అతడే ఆది, మూలము వారినుండే యీ శబ్దము నిర్గమించినది; వివిధాకారములు తాల్చినది. ఆతడు నాగేంద్ర శయనుడు; నాగేంద్రమను మహాసర్పమును అనగా కుండలిని శక్తిని అదుపులో పెట్టినవాడు. ఆతడు జగన్నాథుడు; సర్వ చరాచర స్థావర జంగమాత్మకమైన సృష్టికి అధిపతి.

నాలుగవ పాదములో, బాబా ఓంకార రూపుడైనాడు. ఆతడు ఓజస్విగా పిలువబడినాడు; మూర్తీభవించిన బలతేజములు; ఆ మహా ప్రకాశమే లేకున్న ఏ ప్రాణి కూడా చలించలేదు. 'సాయి మహాదేవ' అని కూడా సంబోధించబడినాడు. అనగా సర్వేంద్రియములకు, మనస్సుకు, బుద్ధికి, వీటివలన పొందిన అనుభవములకు అధిపతియే కాక, వీటిని అతి చమత్కారముగా త్రిప్పగలిగినవాడు అని అర్థము.

చివరకు 'మంగళ హారతి అందుకో' అని ప్రార్థించుతాము. ఈ విధముగా ఆ దినములో మనము సంపాదించుకొనిన వాసనలన్నింటిని భగవానుని పాద పద్మముల వద్ద సమర్పించుకొనుచున్నాము. కర్పూర సువాసనలే యీ వాసనలయొక్క పరిమళమును సూచించును. అవి ఉదాత్తమై, నిర్మలముగా ఉండవలెను. వారినుండి మనము పొందిన జ్ఞానాగ్నిలో యీ వాసనలన్నీ నిశ్శేషముగా కాల్చివేయబడవలెను.

అంతములో బాబాను 'మంథర గిరిధారీ' అని సంబోధించుచున్నాము. దేవాసురలు పాలసముద్రమునమృతము కొరకు మథించుటకు మంథరగిరిని కవ్వముగా స్వీకరించినారు. ఈ కవ్వము సాగరములో దిగపడిపోకుండా, శ్రీహరి కూర్మ రూపమును ధరించి

తన వీపుమీద ఆ మంథర గిరిని నిలబెట్టినాడు. మన మనస్సే ఆ మంథరగిరి, బుద్ధి కవ్వము. ఎప్పుడైతే యీ కవ్వము యీర్ష్యా ద్వేషములనే పంకములో దిగబడిపోతుందో, అప్పుడు దానికి ఆధారముగా ఉండునట్లు ప్రార్థింపుతాము. అందుచేత, మన మందరము నిద్రించినప్పటికన్నా, ఎక్కువ పరిజ్ఞానమతో పరిశుద్ధ మనసుతో తెల్లవారి మేల్కొనగలము.

'మంథరగిరిధారీ' అని యీ సమాసమును రెండవ సారి కొద్ది మార్పుతో పలుకుటలో లోతైన అర్థమున్నది కొన్ని భజనమండలులందు చాలా చక్కని ప్రయోజనముతో యీ మార్పు చేసినారు. 'మంథర గిరిధారి' కి బదులు, 'మంగళ గిరిధారి' అని శ్రీకృష్ణుని స్తుతించుచున్నారు. ఇంద్రియముల కధినాథుడైన యింద్రుడు గోకులములో జలప్రళయము సృష్టించినప్పుడు, శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతము నెత్తి పట్టి గోపాలురను, గోవులను రక్షించినాడు. ఎంతో వినయ విధేయతలతో, భక్తి ప్రపత్తులతో, తన అనుగ్రహమనే ఛత్రము నెత్తి పట్టుకొని మన ఉన్నతాశయములను ఇంద్రియములనే వెల్లువ నశింప చేయకుండ రక్షించుమని బాబాను ప్రార్థించుతాము.

చివరకు బాబాను, నారాయణునిగా, సత్యనారాయణునిగా ముమ్మారు సంబోధించుతాము. భగవాన్‌కు వారి తల్లిదండ్రులు పెట్టిన పేరు సత్యనారాయణ సూక్ష్మముగా యోచించితే బాబాయే సత్యము. నారాయణ. తరువాత 'జయ సద్గురు దేవా' అని పిలుస్తాము.

ఇప్పుడు కర్పూరమంతా హరించునంత వరకు ఆరతి యిచ్చెదము : దానితో ఆ దిన చర్య అంతా పూర్తి అయినది ; ఆ నాటి జయాపజయములు, సందేహములు, కోరికలు, విధులు, ధర్మములు అన్నీ బాబా దివ్య పాదారవిందముల వద్ద సమర్పించబడినవి.

ప్రొ. యం. కృష్ణ కుట్టి మీనన్.

# న్యూయార్కు నగరములో సాయి యోగము

ఈ మధ్య న్యూయార్కు నగరములో మాడిసన్ అవెన్యూలో బాప్టిస్టు చర్చి సభా భవనములో, ఇంద్రాదేవి, మరికొందరు సాయి యోగమును గురించిన ఉపన్యాసములు, ప్రదర్శనలు ప్రారంభించినప్పుడు, షుమారు మూడువందల మంది ఆ సమావేశములో పాల్గొనినారు. అక్కడ చేరినవారిలో నాలుగు రకముల వ్యక్తులున్నారు; సాయిబాబా యొక్క ప్రాశ్చిమ భక్తులు, ఇంద్రాదేవియొక్క పాశ్చాత్య విద్యా

ర్థులు, యోగమునందాసక్తి కలిగిన పాశ్చాత్యులు, వినోదమును చూచి ఆనందించ వచ్చిన ప్రాక్పశ్చిమ వాసులు.

షుమారొక వందమంది పాశ్చాత్యులక్కడ చేరినారంటే, యువకులయొక్క మార్గదర్శకులలో, బాబా ఎటువంటి ప్రబల శక్తిగా ఉన్నది ద్యోతకమౌతున్నది.

ప్రార్థనా మందిర అధికారులు దానిని చాలా శ్రద్ధగా, అందముగా అలంకరించినారు. నెమలియాక లందలి వర్ణములను ప్రకటించునట్లుగా వివిధ వర్ణముల విద్యుద్దీపములతో ఆ ప్రాంగణము ప్రకాశించినది ఎరుపు, పసుపుపచ్చ పుష్ప గుచ్ఛములతో అచ్చటి పటములన్నీ అలంకరించినారు. ప్రణవ రూపమైన 'ఓం' ను, వారంద రెంతో పొందికగా, ఏకస్వరములో ఉచ్చరించినారు. ఆ ధ్వని అచ్చటి రంగుల కనుగుణ్యముగా ఉన్నదా అన్నట్లున్నది. అక్కడ చేరినవారందరుత్సాహ పూరితులుగా నున్నందున, 15 నిమిషములు మాత్రమే చేయవలెనను కొనిన భజన అరగంటకు పైగా సాగినది.

14 సంవత్సరముల వ్యవధి తరువాత, ఇంద్రాదేవి న్యూయార్కు నగరమునకు రావట మది మొదటి సారి. రష్యా దేశములో జనించి, భారతీయ తత్వమును జీర్ణించుకొనిన యీ డెబ్బదియైదు సంవత్సరముల వృద్ధురాలు ప్రేక్షక హృదయములను తన వాగ్ధోరణితో రంజింపచేసి వశము చేసికొనినది. బాబా లీలలను గురించి ప్రసంగించునప్పు డామె కంఠము, భక్తిరసము రంగరించబడి, రాగరస ప్లావితమైనది. ప్రేక్షకులెంతో ఏకాగ్రతతో, శ్రద్ధతో ఆలకించినారు. ఆమె ప్రసంగము పూర్తి అయిన వెంటనే, యితరులు కూడావెంట వెంటనే వేదిక వద్దకు వచ్చి, బాబాను గురించి తమ తమ అనుభవములకు సంబంధించిన విషయములు చెప్పినారు.

వీరు చెప్పిన విషయములకు, శ్రీకృష్ణుని లీలలకు ఎంతో సామ్యము కనిపించి నన్ను చకితుని గావించినది. వీరి ప్రసంగములన్నీ అవతారముయొక్క దైవత్వమును నిరూపించునట్టి విషయములే. అవతార పురుషుడు తన భక్తులయందు ప్రేమ కలిగి ఉండును కానీ, అదే సమయములో, వారి కోరికలకు, మమకారములకు, అతీతుడుగా ఉండును.

ఉపన్యాసాంతములో యింద్రాదేవి కొన్ని క్షణములంతర్ముఖురాలై, ఆలోచనలో నిమగ్నురాలైనది. "బాబాను గురించి చెప్పట సులభమైన కార్యము కాదు; ఏమి చెప్పవలెనో తోచుటలేదు." బాబాను అనన్య చిత్తముతో పూజించు భక్తులేకైక ధ్యేయముతో ఉండి, మౌన ధ్యానమునకే ప్రాముఖ్యము నిచ్చెదరని, అన్ని కోరికలకు, మమకారముల బంధనములకు దూరముగా నుందురని గుర్తించ కలిగినాను.

**రోజ్మరీ టి. బౌనో.**

# అనన్య విజ్ఞాన శాస్త్రము

అవతార తత్త్వములెప్పుడూ అనూహ్యములు, గోప్యములు, అవేద్యములు. తమ నిజస్వరూపస్వభావ, సత్యములను వివరించుటలో ఎవ్వరూ విజయులు కాజాలరని బాబా చెప్పి ఉన్నారు. అయినా, మానవుడు తన అల్ప బుద్ధితో, అవతార మాహాత్మ్యములను, తదితర ఘటనలను విశ్లేషించి, ఏవో కొన్ని, అవి ఎంత లోపభూయిష్ఠములైనను, నిర్ణయములు చేయకోరుతాడు.

ఈ విజ్ఞానశాస్త్ర యుగములో భగవాన్ బాబా ప్రప్రథమావతారము. వీరు శాస్త్రీయ దృక్పథముతో కూడిన విచారణను ప్రోత్సహించుచున్నారు అందుకొరకు బాబా ప్రతివారిని "రండి, చూచి పరీక్షించండి, అనుభవించి విశ్వసించండి" అని సలహా యిచ్చుచున్నారు. ఎందరో ప్రఖ్యాత శాస్త్రవేత్తలు వారిని భక్తితో పూజించుచున్నారనుటలో అతిశయము లేదు. బాబా వారియొక్క పరిశోధనలను ఆవిష్కరణలను ప్రోత్సహించుచున్నారు. ఈ సాంకేతిక జ్ఞానము, విజ్ఞానము మానవాళికి అందించిన సదుపాయములను బాబా గుర్తించినారు. ఈ సైన్సును పూర్తిగా వినియోగించుకొనుటకు వారు వ్యతిరేకులు కారు. వారు కూడా కళాశాలలు స్థాపించి పరిశోధనలను ప్రోత్సహించుచున్నారు,

కానీ, భగవాన్, శాస్త్ర విద్యను ఆధ్యాత్మిక విద్య అధిగమించుచున్నదని, ఆ విధముగా అధిగమించిన వారే భగవంతుని అభివ్యక్తము గావించుకొనగలరని స్థిరముగా ప్రకటించుచున్నారు. శాస్త్ర విద్య 'ఎట్లు?' అని మాత్రమే ప్రశ్నించుచున్నది; ఆత్మవిద్య 'ఎందుకు? ఎవరిని? ఎందునిమిత్తము?' అని కూడా ప్రశ్నించుతుంది.

ఈ నాటి శాస్త్రవేత్త లందించు దర్శకత్వముకన్న ఉన్నతమైన, ఉదాత్తమైన దర్శకత్వము మానవునకవసరమని బాబా చెప్పుచున్నారు. ప్రజల మన్ననలను, గౌరవమును పొందినట్టి సర్వజ్ఞులైన ఆత్మవిద్యావేత్తలు మాత్రమే యీ సవ్యమైన దర్శకత్వము నందించగలరని బాబా చెప్పినారు. బాబా అభిప్రాయములో యీ విజ్ఞానములో మానవత్వము శూన్యము. దీని వలన మానవు డొక రీతిగా శూన్యభావమును, ఒంటరితనమును, నిరాశా నిస్పృహలను మాత్రమే పొందుచున్నాడు. ఈ విజ్ఞానమొక వ్రణమువంటిది; ద్వేషమును యుద్ధమును పురికొల్పుచున్నది. పరస్పర వినాశమునకు మారణాయుధములను సరఫరా చేయుచున్నది.

భారతదేశమునకు కూడా యీ వెర్రి తలకెక్కినది; అత్యంత ధనికవాద పరమైన యీ శాస్త్ర విజ్ఞానమును భారతదేశము కూడా అంగీకరించినది. నేడీ విజ్ఞానశాస్త్రమతి విస్తృతముగా వ్యాపించి సర్వమును కబళించి వేయుచున్నది. అనేక శతాబ్దములుగా, నిర్మల నిరాడంబర జీవితము, ఉన్నతాదర్శములు భారతదేశమనుసరించినప్పటికి, కాల పరిస్థితులకు తల వంచి నేడీ

సుడిగుండములో తగులుకొనినది. శాస్త్ర విజ్ఞానమనే బ్రహ్మరాక్షసి సృష్టించుచున్న కీడు ప్రతిదేశమునకు తెలిసినప్పటికి, దానిని నేటివరకు, భౌతిక సుఖముల కొరకు తప్ప, నైతిక ఆధ్యాత్మిక పథములో మానవుని ఉన్నతికొరకు, ఉపయోగించలేదు.

భగవాన్ బాబా ఒక్కరే దానిని పరిష్కరించ గలిగినవారు; ఇందుకొరకే, విశృంఖలముగా విహరించే యీ విజ్ఞాన శాస్త్ర శృంఖలములలోనుండి మానవుని రక్షించి కాపాడుటకొరకే, బాబా అవతరించినది; " ఆత్మవిద్య ప్రతివాని జన్మహక్కు; దానిని ప్రతి మానవుడు తెలిసికొనవలసి ఉన్నది; దీనిని ప్రాణ ప్రదాతగా భావించవలెను. దీనిని సంపాదించుకొని స్వీయోన్నతికి ఉపయోగించుకొనవలెను, '' ఈ అనన్య శాస్త్రమును - ఆత్మజ్ఞానమును - యోగులైనవా రెన్నడో శోధించి స్థాపించి ఉన్నారు. ఈ అనితర ఆధ్యాత్మిక శాస్త్రమునం దపేక్ష కలిగినవారు, దీని నభ్యసించుట కొరకు నియమ నిబంధనలను కూడా ఆనాడే ఏర్పరచినారు. ఈ అనన్య విజ్ఞానమును నేర్వక, దానినుండి లాభమును పొందకుండుట ఎంతో నష్టదాయకము. ఈ యోగిపుంగవుల కృషిఫలితముగా, భారతదేశ మతి ప్రాచీన కాలమునుండి మానవ లోకమునకే గురు స్థానము నలంకరించినది. ఈ నాటికి, ఎన్ని ఆవరోధము లడ్డు వచ్చినా, ఆమెకి శక్తి ఉన్నది. బాబా అందించు ఒక చిన్న జ్ఞానాగ్ని కణము చాలు. ఉజ్వల దావానలముగా ప్రజ్వరిల్ల చేయుటకు. తిరిగి భారత దేశము ఈ అవతార పురుషుని ఆచార్యత్వములో ఆ ఉన్నత స్థానము నందకొనగలదు. ప్రాచీన రాజ స్థలలందు మన ఆధ్యాత్మిక గురు పుంగవులు పొందిన మన్నన మర్యాదలు, వారి వాణికి ఉన్న అధికారము, తిరిగి మరొక సారి పొందగలరు.

ప్రాచీన కాలములో సన్యాసులు, గురువులు, రాజులకు రాజధర్మమును తెలిపి ఆచరించునట్లు చేసినారు. ఆ నాటి రాజులు కూడా వీరిని సంప్రదించి వీరి సలహాలను పాటించినారు. భారతదేశము తిరిగి సుఖ శాంతులతో వర్ధిల్లవలెనన్న, యీ ఆత్మవిద్యా భాస్కరుల సలహాలను రాజకీయ వేత్తలు, విజ్ఞాన వేత్తలు పాటించవలసి ఉన్నది.

భగవాన్ తన అనంతానుగ్రహమును ప్రసరింప చేసి, సత్యసాయి సమితులు, వాటి అనుబంధ శాఖలు స్థాపించుటలో ఆధ్యాత్మిక పునరుజ్జీవమునకు పునాదులు వేసినారు. ఈ సేవాసంస్థలతో సంబంధమున్న ప్రతివారు, మనసా వాచా కర్మణా, వినయ విధేయులైన సాధకులుగా పరివర్తనము చెంది, తమ దోషములు దిద్దుకొనుచు, భగవాన్ హస్తములలో వారి ధర్మ కార్య నిర్వహణలో ఉపకరించు పరికరముగా తయారగుచున్నారు.

ఈ అవతార మాధునిక కాలమున కత్యంత ఉపయుక్తమైనది. అందుచేత ప్రపంచమొక చిన్న నివేశనముగా తయారైనట్లు గుర్తించి, ప్రపంచవ్యాప్తముగా ఆధ్యాత్మిక ప్రచారమునకు బాబా పూనుకొనినారు.

ఎంతో వేగముగా, తూర్పుగా వ్యాపించుచున్న యీ పాశ్చాత్య సాంకేతిక సంస్కృతియొక్క మేడిపండు గుణములు బాబాకు తెలుసు. దైన్య స్థితిలో భయభీతులై ఉన్న ప్రజలు, అతి త్వరలో ఏదో ఒక విధముగా ఫలితమును పొందవలెనని అనేక సిద్ధాంతముల నాశ్రయించుచున్నారని కూడా వారికి తెలుసు. ఈ సిద్ధాంతములు గమ్యమునకు దగ్గర దారులని చాటుకొనుచున్నవి. పిన్నవారినుండి పెద్దవారివరకు హిప్పీ తత్వము, మత్తు పదార్థములు, తదితర ప్రచారక

విధానములకు సిద్ధమగుచున్నారు. ఇవి జీవితము లోని కఠిన సత్యములను మరచునట్లు చేయుటచేత, ప్రజలు వీటి ప్రలోభములకు లోనగుచున్నారు. దీని ఫలితముగా వీరు తమ బాధ్యతలను విస్మరించు చున్నారు. ఈ నూతన సిద్ధాంతములు, వాదములు తమను నిరాశా నిస్పృహలలోనికి త్రోసి వేయునని యీ క్రొత్త బిచ్చగాండ్రు తెలియలేకున్నారు.

కఠినమైనప్పటికి, భారమైనప్పటికి, అమిత ఫల ప్రదాయిని అయిన ప్రాచీన మార్గమునే బాబా కావలె నని పట్టు పట్టినారు. వాతనియమిత భవనములలో కూర్చొని, ఏ కొన్ని నిమిషములో కన్నులు మూసి కొని దానికి ధ్యానమని పేరు పెట్టి సోమరి పోతులు గా, యిష్టము వచ్చినట్లు ప్రవర్తించుట స్వామి ఏ మాత్రము అంగీకరించరు. ఇటువంటి అడ్డుదారులనిన వారికి ఏవగింపు. అసంపూర్ణ (part time) భక్తి ధ్యానములనిన వారు అసహ్యపడుదురు.

భారత దేశములోని ఆధ్యాత్మిక బోధకులు, పర దేశీయులు తమ ఆశ్రమములకు వచ్చి, తమ బోధల నాలకించుట గాంచి అల్ప సంతోషులగుచున్నారు. ప్రపంచములో కోట్లాది ప్రజలు ఆధ్యాత్మికాహారము కొరకు, ఎంతగనో అలమటించుచున్నారని వీరే మాత్రము గుర్తించుట లేదు. ఈ ప్రజలు తమ ఆకలి తీర్చు ఏ ఆహారమునైనా రుచి చూచుటకు, ప్రపంచములో ఏ మూలకైనా పరుగెత్తుటకు సిద్ధముగా ఉన్నారు. ఈ గురువులు పరదేశములందు పరి భ్రమించుటలో పొందిన ప్రచారముతో ఆనందించు చున్నారు. వారిని చేరినవారి ఆకలి తీరకుండానే, యీ గురువులు తెరమరుగౌతున్నారు. రోగి కోరికకు అనుగుణ్యముగా మందు మార్చినట్లు, ఋషి ప్రోక్త ధర్మములను సడలించుటకు బాబా సమ్మతించరు.

భగవాన్ దేశాంతరములకు కూడా వేంచేసి, ధర్మ ప్రబోధము గావించెదరని ఆశించుచున్నాను. దేశాం తరములకు పోవుటకు ముందుగా భారతదేశమును చక్క బరచవలెనని వారనేక సార్లు చెప్పి ఉన్నారు. ధార్మిక పునరుద్ధరణ అనే నూతన శకమునకు మార్గదర్శిగా, భారతదేశమును ఆధ్యాత్మికముగా పునరుజ్జీవింపచేయ నిశ్చయించినారు.

నేటి వరకు, ఆఫ్రికాఖండములోని ఉగాండా దేశ మునకు, బాబా గావించిన ఒకే ఒక పర్యటనను గురించి తరచు ఆశ్చర్యము చెందుతుంటాను. భగవాన్ దీనులైన మానవుల వద్దకు వెళ్లుట మనకు తెలుసు. ఉగాండా భారతీయుల మధ్య తిరుగుచున్నప్పుడు, వారు అధ్యతన కాలములో ఎన్నో యిడుములకు లోను కావలసి ఉన్నదని బాబాకు తెలుసు. అందు చేత వారిలో ప్రేమ, సహనముల సందేశము ప్రసార ము చేసినారు. ఆఫ్రికా వాసులు కూడా బాబా బిడ్డలే; వారు కూడా బాబా ఆశీస్సులు కోరినవారే. అక్కడ భారతీయులు, ఆఫ్రికా నుండి చాలా క్లిష్ట పరి స్థితులలో ఉన్నట్లు బాబాకు తెలుసు. ఈ వ్యవహార మంతా, ఆఫ్రికాఖండ నూతన పరిణామమున కవసర మని, అది ఒక ఉపయోగకరమైన అనుభవముగా భావించి ఉండవచ్చును.

అల్ప కృషితో, అధిక ఫలితము సత్వరలో పొందవలెనను ఆధునిక వెర్రి ఆలోచనకు బాబా వ్యతి రేకము. వారు నూతన మతమును కానీ సిద్ధాంతమును కానీ బోధించ రాలేదు అన్ని మతములు, జ్ఞానము, ప్రశాంతి అనే పర్వత శిఖరమును చేర్చుటకు వివిధ మార్గములను వారంగీకరించినారు. అన్ని మతములకు మూల సూత్రములైన సత్య ధర్మశాంతి ప్రేమలనీ తిరిగి వారు బోధించుచున్నారు. వీటన్నింటికన్న

మిన్నగా ప్రేమాచరణను గురించి నొక్కిచెప్పుచున్నారు. "ప్రేమయే భగవంతుడు. ప్రేమలో జీవించుము" అని బోధించుచున్నారు. ప్రేమభావమొక్కటే, మానవుని సత్‌శీలుడని, సాధకుడని, భక్తుడని, ఆధ్యాత్మిక జీవనము గడుపువాడని, వర్గీకరించుచున్నది. "మీరు అహంభావముయొక్క బందీలు ; వెంటనే, జాగ్రత్తగా, అందుండి విముక్తులు కావలెను. కానీ, మీలో అధిక సంఖ్యాకులు నా నుండి విముక్తికి మార్గము ను తెలిసికొనుట లేదు ! అల్పమైన కోరికలనే తీర్చుకొన వచ్చుచున్నారు. చాలా కొద్దిమంది మాత్రమే నేను దేనిని ప్రసాదించుట కవతరించితినో, దానిని కోరుతున్నారు, అదే మోక్షము, ముక్తి. ముక్తి కోరే ఆ కొద్ది మందిలో, అత్యల్ప సంఖ్యాకులే సాధన మార్గమును చిత్తశుద్ధితో అనుసరించుచున్నారు. వీరిలో కూడా అతి సూక్ష్మ సంఖ్యాకులు నెగ్గగలుగుచున్నారు" అని బాబా చెప్పినారు.

నేటి ప్రపంచములోని శీలసంపదలందు కనుపించు క్లిష్ట స్థితిని బాబాయొక్క అనుగ్రహమొక్కటే పరిష్టముగా సవరించగలదు, ఇది ప్రపంచ మానవులలో పరివర్తనము కొనిరాగలదు. ప్రపంచమునందన్ని మూలలనుండి అనేక స్వభావములు కలిగినవారు, పరమార్థము కొరకు, సలహా సంప్రదింపుల కొరకు బాబా నాశ్రయించుచున్నారు. ఈ వచ్చినవారిలో, భగవంతునియందు విశ్వాసము లేనివారి నుండి, ఉన్నత స్థితికి చెందిన సాధకుల వరకున్నారు.

వీరందరు తన బిడ్డలే కావున, భగవాన్ ప్రేమతో అందరిని పిలిచి ఆదరించుచున్నారు. పాపులందెంతో కనికరము కలిగి ఉన్నారు, దుఃఖితులనోదార్చుచున్నారు. సందేహమనస్కులను చేయూతనిచ్చి ప్రకాశములోనికి గొనిపోవుచున్నారు.

ఎటువంటి వాడైననూ, ఏ స్థితియందున్ననూ, బాబా దివ్య ప్రేమ వానిని స్పృశించుతుంది. ఈ స్పర్శతో ప్రతివాడు తన ఆధ్యాత్మిక స్థితిని, తన గమ్యమును కొంతవరకు గ్రహించ కలుగుచున్నాడు. తనయందెన్నో లోపములున్నప్పటికి బాబా ఆదరించినందుకు ప్రతివాడెంతగానో ఆనందించుతాడు ; అతని లోని అలసత్వము తొలగిపోతుంది ; ఆతని అహంభావము నశించుపోతుంది. ఎన్నడూ లేని రీతిగా, ఆతనిలో ఒక కదలిక పుట్టి ఆత్మ ప్రకాశము కొరకు ప్రయత్నము చేయించుతుంది.

"భారతదేశము యోగభూమి, త్యాగభూమి, మానవ ఐక్యానుసంధాయక క్షేత్రము. ఆత్మజ్ఞానమునకు సహజమైన నిలయం," అని బాబా చెప్పినారు. తిరిగి భారతదేశమా ఉన్నత స్థితినందుకొని మానవాళిని మోక్షదామములోనికి తీసుకొని వెళ్లి, శక్తిని పొందవలెను.

ఈ పరమోత్తమ స్థితి తప్పక సిద్ధించునని బాబా సంకల్పించినారు ; కాన అది తప్పక సిద్ధించి తీరుతుంది.

డా॥ దేశరాజ్ ధైర్యం

# దయామయి జనని

ఎన్నిసార్లో మృత్యువును కౌగలించుకొనినాను; ఎన్నిసార్లో తల్లి గర్భమునుండి వెలువడినాను: ఎన్నిసార్లో నిద్రపోయినాను, మేల్కొనినాను. చివరకు, ఓ దయామయుడవైన ప్రభూ, నా కన్నులు స్పృశించినావు. నా హృదయము నీవు ఏతెంచిన ప్రదేశములోనికి వికసించినది.

నన్ను లేచి నీవెంట రానిమ్ము; నీ ప్రేమ నన్ను విమోహితుని గావించి ఓడించినది. నీ దివ్య సౌందర్యము విలోకించుచుతూ, నీ మధురవాణి నాలకించుచుతూ, నీ వునికియొక్క సురభిళత్వమును పీల్చుతూ, నా నిజ జీవితమును ప్రారంభించ వాంఛించుచున్నాను.

ఈవిధముగా ప్రార్థించగా, మందహాసముతో బాబా, "నీవు రేపిన దుమ్ములో నీవు ఉక్కిరిబిక్కిరి అగుచున్నావు! నీకు నీవుగా విధించుకొనిన బంధనము నీది. శరీరతత్వములో పూర్తిగా మునిగి, మానవ సంబంధములతో భారమైనావు. నీ యింటిని నీవొక వంతెనమీద నిర్మించుకొనినావు! నీవు పయనించుచున్న యాత్రికుడవని గుర్తుంచుకొ" అని చెప్పినారు

"నీకొరకు నీ ప్రథమ కర్తవ్యము త్యాగము! నీ ప్రణాళికలన్నింటిని, వాటిలో అతిముఖ్యవాటితోసహా విసర్జించు. నీ అభిమాన సిద్ధాంతములను, నీకు ప్రియమైన సిద్ధాంతములను, చిందరవందరగా నీ మస్తిష్కములో నింపికొనిన వివిధములైన విషయ జ్ఞానమును, అన్నిటికన్న మిన్నగా భావించి సేకరించిన భావములు, కీర్తి, ప్రతిష్ట, పాండిత్యము, అంతస్తులకై ఆరాటము విసర్జించు. ఇవి అన్నీ దైహికములు, లౌకికములు. ఆత్మసాక్షాత్కారము పొందిన తరువాత యీ లౌకిక ప్రపంచములో ప్రవేశించు; నీకప్పుడిది అంతా ఆత్మయొక్క నాటకమని తెలిసికొనగలవు"

"నీ ఆత్మకు దూరముగా, అటునిటు పరుగులెత్తితివి, ఎండమావులలో నీరు కోరితివి; కానీ సంఘర్షణలు దుఃఖము, బాధను మాత్రమే పొందితివి ఈ మృగతృష్ణ నెవ్వరు సృష్టించినారు? ఈ ప్రశ్న నీ పంకిల మనస్సునకు తట్టలేదు. ఒక భ్రాంతి మరొక భ్రాంతిని వెంబడించినది. ఒక తాత్కాలిక ఫలితము మరొకదానిని అనుసరించినది ఈవిధముగా దినములు ఆగకుండా గడచిపోయినవి. ఇప్పుడో భీతితో చికాకుతో విశ్రాంతికాని శాంతికాని ఎరుగక, తీవ్ర ఆవేదనతో సహాయముకొరకు అంగలార్చుచున్నావు."

ఆలోచించుటకూడా వదలుమని బాబా చెప్పినారు: "ఆలోచన నీ నిజతత్వమునకు పరాయిది. బుద్ధి స్థాయిలో ఆలోచన నిరర్థకము. కారణము, నీవు ఆలోచించిన సిద్ధాంతములు, అనుసరించిన వేదాంతము, ఎంత ప్రతిభతో నిర్మించినవైనప్పటికి, అవి కొద్దికాలమే నిన్ను సంతోషపరచగలవు; చివరకవి ఒకదానినొకటి ఖండించుకొని, అన్నీ నశించుతవి.

అన్వేషించు కానీ వాటిలో చిక్కుకొనవద్దు. నీవు తేనె లోకానీ, బురదలోకానీ దిగబడిన కాళ్లను శుభ్రపరచు కొనునట్టి యోగశాలై నుండవలెను. నీ హృదయమును మలినపరచి, నీ స్వాతంత్ర్యమున కడ్డుతగులు ప్రతి ఆకర్షణ వికర్షణలను తొలగించుకొనుము.

"అంతా నాకు వదలివేయి; సంపూర్ణముగా. నీ కిచ్చిన స్థానముయొక్క విధుల నాచరించుము. గతమును విస్మరించవద్దు; నాకు, ఎవరిలో నేను న్నా నో వారందరికి నీ ప్రేమలోని అత్యధికభాగము పంచి పెట్టుము.

"నిన్ను చూచేవారందరికి నీవు ప్రాపంచిక వ్యవహారములలో ప్రణాళికలలో నిమగ్నుడవై ఉన్నట్లు కనిపించినప్పటికి, నీవు నాయందు నా కార్యములందు నిరంతరము నిమగ్నుడవై ఉన్నట్లు తెలుసుకొనుము. నీవు నా చేతిలోని ఒక ఉపకరణము. యంత్రములను నడుపువాడు యంత్రములన్నింటిని నడుపుచున్న రీతిగా, నేను సర్వమానవులను నడుపుచున్నాను. నేను ప్రతిహృదయమందు నివసించుచున్నాను. నీవు చూచినది చేసినది ఆలోచించినది సర్వము, నీవు కాదు, నేను! యాత్రీకుడే కాక, యాత్రకూడా నేనే! నీవు నాయందు చేరినావు!" అని బాబా చెప్పినారు.

"ఓ దారితప్పిన ఆత్మలారా, రండి! మీ కేంద్రములలోనికి ఉపసంహరించుకొనండి! విశాలాంధకారములో విహరించిన ఓ కిరణములారా! తిరిగి రండి; సూర్యునిలో లీనముకండి" అని బాబా సంబోధించినారు.

నేనొక కిరణమును, మరీచికను, తరంగమును, అని బోధించినారు. "ఈవిశ్వమంతా ఒక స్వప్నము వంటిది. స్వప్నములకు నిద్ర కారణము; మాయ అనే నిద్ర పరమాత్మఅయిన ఏకైక సత్యములో యీ సృష్టిని కల్పించుచున్నది." అని చెప్పినారు.

"ఏకైక పరబ్రహ్మములో స్థాపించుకొనుము. నీవు పూర్ణుడవు. నీకు కోరికలు లేవు. నీ అంతర్గత దైవత్వమును సర్వదా జ్ఞప్తియందుంచుకొని ప్రవర్తించుము. ఆత్మదృష్టి అన్ని భౌతికవాంఛలను నశింప చేస్తుంది." అని బాబా రూఢిగా చెప్పినారు.

ఓ దయామయి జననీ!
నీ నిత్యానుకంపములో మముకాచి రక్షించు!
నీ తెలివితక్కువ బిడ్డలు,
నీ మాటలను పెడచెవినిపెట్టి,
నీనుండి మొగములు త్రిప్పికొని,
బంధములు విడలించి
మోక్షమును ప్రసాదించు
యుక్తులకొరకు, ఉపకరణములకొరకు,
బూడిద కుప్పలలో, కసవు తోట్లలో
కొట్లాడుకొనుచున్నారు.
ఓ దయామయి జననీ
వారల కాచి రక్షించు.

యస్.డి. ఖేరా.

# శ్రీవారితో సంభాషణ

ప్రశ్న : స్వామి ! ఈ ప్రపంచము నాతో చాలా క్రూరముగా ప్రవర్తించుచున్నది....

శ్రీవారు : ఆశ్చర్యమేమి ? అది దాని స్వభావము ; జననము జీవితము మరణము అన్నీ వ్యర్థము అని నేర్పించుటే దాని పని ! అవసరములను ప్రపంచము పరంపరగా సృష్టించుతుంది ; అవి బలీయముగా నున్నప్పుడు మానవుడు వాటిని నెరవేర్చుటకు ప్రయత్నించి....

ప్రశ్న : విఫలుడౌతాడు....

శ్రీవారు : బాహ్య జగత్తులో సాఫల్యతను కోరినప్పుడు విఫలుడు కాక తప్పదు. సరే ! అయిన ఆంతర్యములో సఫలత పొందగలడు. ఆంతర్య మెప్పుడూ అతని అందుబాటులోనే ఉంటుంది. బాహ్యరూపములపై మమకారమున్నంత వరకూ బాధ తప్పదు; ప్రపంచము క్రూరముగానే కనుపించుతుంది. అహంకారము నశించి, సుఖ దుఃఖములను సమభావముతో చూడ గలిగిన, బాధ ఉండదు ; అప్పుడే దానికి ఉపశమనము.

ప్రశ్న ; అయితే, ప్రపంచము సంగతి ?

శ్రీవారు : ప్రపంచమునుండి బాధను లేక మరి దేనినీ అపేక్షించకు, నిన్ను నా వద్దకు చేర్చుకొనుటకే నేను బాధను సంకల్పించినాను !

ప్రశ్న మిమ్ము చేరుటకు, బాధపడితే లతుందా? నాలో ఎటువంటి లోపములు ఉండ కూడదు కదా ?

శ్రీవారు ఏ లోపములు లేనివాడెవడు ? నేను కోరేది పట్టుదల, సాధన, శ్రద్ధ, స్థిరత్వము ; కాపట్యము లేని జీవితము

ప్రశ్న అయినప్పటికి, మహా అయితే, మిమ్ము పొందగలను, అనే ఆశ కొంత నాలో మొలకెత్తుచున్నది.

శ్రీవారు ఆశ, నిరాశ రెండూ సాపేక్షములు, పరమాత్మ ఈ రెంటికీ అతీతుడు, పరమాత్ముని చేరుటకు నీవు ఆశానిరాశల కతీతుడవు కావలెను; ఆ తత్వము అన్ని మార్గములందూ చలించును ; అయిననూ అది అచలము.

ప్రశ్న : అయిన నా కేమి నిర్దేశింతురు ?

శ్రీవారు : నేడు చేయదగిన పనిని నేడు ఒనరించు ; రేపటిది రేపు, అది చాలు. ఏ దినమున

కా దినముగా, ఏ క్షణమున కా క్షణము గా, గడచిన దానిని స్మృతియందుంచు కొనక, భవిష్యత్తును గురించి చింతించక, నిర్ణయించక....

ప్రశ్న : నిర్ణయించ కూడదా ?

శ్రీవారు : అవును! నిర్ణయములు బంధనములు! వాటి వలన, మనస్సు పై, క్రియల పై, నీ చర్యల పై ఒత్తిడి కలుగును. పుట్టిన బిడ్డ కట్టి నిర్ణయములు లేవు, ఒత్తిడి లేదు. ఏ నిర్ణయమైనా సరే, దాని నుండి బంధమే. బ్రహ్మ మొదలు అందరు, తాము చేసిన నిర్ణయములకు బానిసలై తమ స్వాతంత్ర్యమును, నిజ స్వారాజ్యమును పోగొట్టు కొనినారు

ప్రశ్న : అయితే, ఏకాగ్రతను సంపాదించుటకు నేను నిర్ణయించినది, తప్పా, స్వామి ?

శ్రీవారు : నాకు తెలుసు, అటు ఇటు పరుగెత్తే నీ మనస్సును దేనియందు స్థిరపరచవలెను అనే ప్రశ్న నిన్ను బాధించుచున్నది. మొదట, ఒక నామము మీద, తరువాత ఒక రూపము మీద, నీ శ్రద్ధను స్థిర పరచుటకు ప్రయత్నించినావు. కానీ, నామరూపములు శాశ్వతములు కావు. నామరూపములేమి? ఏదీ శాశ్వతము కాదు. ప్రతిదీ మార్పు చెందును. అయితే, ప్రజ్ఞ మాత్రము మారదు, నశించదు.

ప్రశ్న : అవును స్వామి! నామ రూపములపై ఏకాగ్రతను స్థిరపరచుట కష్ట సాధ్యముగా నున్నది.

శ్రీవారు : కారణమేమిటో తెలుసునా ? ధ్యానించుటకు నిర్ణయించినప్పుడే, జయము పొందవీలగునా ? అపజయము కలుగునేమో ? అనే సంఘర్షణ నీలో మొదలవుతున్నది కదా ? ఈ విధముగా ధ్యానించిన మంచిదేమో ? ఆ విధముగా ధ్యానించిన త్వరగా ఫలితము దొరకునేమో ? అనే విచారణ నీలో బలీయమగును, కదా ? ఫలాఫల విమర్శ తప్పు ! యదృచ్ఛా లాభసంతుష్టిని పొందవలెను. ఎటువంటి తారతమ్య భావాలు గానీ, అనుకూల ప్రతికూల భావాలు కానీ, ఏ యొక అభిప్రాయము కానీ, ఉద్దేశ్యము కానీ ఉండరాదు. నీకు నీవుగా ఉండవలెను.

ప్రశ్న : అది సాధ్యమా, స్వామి ? తరచుగా పరస్పర విరుద్ధమైన విశ్వాసముల మధ్య, డోళితుడగుచున్నాను కదా, ప్రభు !

శ్రీవారు : అది అనివార్యము. చంచలత్వము మనస్సు యొక్క, ప్రపంచముయొక్క నైజ స్వభావము. అయితే, ఎడతెగని ఈ తరంగముల పాటు పోటులలో మధ్య ప్రేలాడుటా ? లేక, ఈ పెనుతుఫాను కేంద్రమునందున్న ప్రశాంతిలో నిశ్చల నిర్మల నిస్స్వార్థముగా ఆనందము ననుభవించుటా ? ఇదిమానవుని ఎదుర్కొనే అన్ని సమస్యలలోని పెద్ద సమస్య.

ప్రశ్న : చక్రము యొక్క అంచా ? లేక, దాని ఇరుసా ?

శ్రీవారు : అవును ! ఇరుసు నిశ్చలము ; కానీ, మనస్సు చక్రమందలి ఆకుల వైపు ఆకర్షింపబడి, అందు చేరి, కోరికలనే బురదలో గిరగిర తిరుగుతుంది.

ప్రశ్న : అంటే మనస్సును జయించవలెను ! అదే కదా, స్వామి ఉద్బోధ ?

శ్రీవారు : మనస్సనేది కోరికల పుట్ట, ఆశల మూట. అది దాని సహజ స్వభావము దానితో జోక్యము కలిగించకొనవద్దు ఒక నిర్ణయము మరొక దానిని, ఒక కోరిక మరొక కోరికను, ప్రతిఘటించి, యాదవులు పరస్పరము నాశము గావించికొనినట్లుగా సంఘర్షణలు జరిపి, నాటకములాడు సమయమునందు, నీవు దానికి దూరముగా నుండి, సాక్షి వలె జాగ్రత్తగా చూచుచుండవలెను. కేంద్రమందుండి, సమచిత్తముతో....

ప్రశ్న : మీరే కదా, స్వామి, కేంద్రము, ఆకులు, పరిధి, అన్నియు ?

శ్రీవారు : నేనెవ్వరు అనేది నీ కిప్పుడనవసరము, నీ వెవడు ? నీ సత్యమేమి ? తెలుసుకొని, వాటిని దృఢపరచుకొనవలెను. అది నీ కర్తవ్యము. మనస్సుయొక్క ఎత్తుగడలకు లోనై ఇష్టపూర్వకముగా బందీవి కావద్దు సుమా ! దాని వలలో పడవద్దు. నా మీద ఆధారపడి నట్లయిన, నేనే దారి చూపించగలను. ఈ ద్వంద్వ ప్రపంచము నీకు ఆనందము చేకూర్చదు ; దాని వెంట పరుగెత్తె మనస్సు నిన్ను మోసగించునే కానీ రక్షించదు. అయితే, ఒక మాట : నీవు మనస్సు కాదు, దాని కతీతుడవు, అని జ్ఞాపకముంచుకో ! సంపూర్ణముగా పరిశుద్ధుడు కాలేదని నేనెవ్వరినీ దూరము చేయను.

ప్రశ్న : మీ నియమ నిర్బంధనలను, క్రమశిక్షణను, పాటించలేక పోతున్నాను, స్వామి ; క్షమించవలెను.

శ్రీవారు : నీ మనస్సు నియమ నిబంధనలను కోరుతుంది ; అయితే, వాటిని పాటించుటకు కావలసిన దృఢ సంకల్పము లేదు, కానీ నియమముల భారమును వహించకనే, ప్రేమతోనే ప్రేమసంబంధము ప్రేమ భావములతోనే చిత్తశుద్ధిని సంపాదించగలవు ప్రేమ ననుసరించక, నియమముల నాశ్రయించిన, వ్యాకులత తప్పదు. నే నెంత నిశ్చింతగా నున్నానో, గమనించు ! నా జీవిత మార్గమే నా సందేశము ; దాని ననుసరించి తరించు,

ప్రశ్న : నేను ప్రశాంతిని కోరుచున్నాను ; కానీ, దానిని పొందలేక పోతున్నాను. ఇది నా వ్యాకులత. అశాంతి వలన సంభవించు వ్యాకులత !

శ్రీవారు : కాదు, కాదు ! అశాంతివలన కాదు ! అశాంతిని సాక్షిగా, సంసారచక్రము యొక్క కేంద్రములో నిలచి వీక్షించక, మనస్సులో చేర్చుకుంటున్నావు ! దాని

వలన వ్యాకులత పడుచున్నావు! ఇది సముద్రము పైన అలల స్వభావము వంటిది అని తెలుసుకో! జయము ప్రధానము కాదు; అపజయమూ అప్రధానమే! భగవత్సంకల్పము ననుసరించి, కాలము జయాపజయము లనే ఒడ్డుల మధ్య ప్రవహించుచునే ఉంటుంది.

ప్రశ్న : ఆ సంకల్పమునకు దూరమై, నేనెంత కాలము బాధ పడవలెనో!

శ్రీవారు : ఆ సంకల్పమునందు నీవు కూడ ఒక భాగమే! అందుకనే నీవు ఈ అన్వేషణలో పడినావు; ఈ ఆకలి అనుభవించుచున్నావు. భగవంతునియందు లీనమై నిత్యానందమును పొందుటకు ప్రయత్నము చేయుచున్నావు. బాహ్య ప్రపంచమందున్న ఆహారములను ఇంద్రియముల ద్వారా అంతఃకరణముల ద్వారా ఆరగించిన, ఈ ఆకలి తీరునని, ఎన్నో తరముల నుండి మీ తరమువారితో సహా విశ్వసించి ఆ మార్గమును చేబట్టినారు. కానీ, ఆకలి బాధ అణగుట లేదు.

ప్రశ్న : స్వామీ! ప్రపంచముతో మేము ఏ రీతిగా వ్యవహరించవలెను ?

శ్రీవారు : ప్రపంచపు దారిని ప్రపంచమును పోనిమ్ము! దానిని పట్టుకొని వ్రేలాడవద్దు! అపేక్ష వద్దు; ఉపేక్ష నభ్యసించు,

మనస్సును ఏ నివాస స్థానమునూ ఉంచనీయవద్దు! నీవు గృహమును త్యజించి నివాసస్థానమును నిశ్చయించక తిరుగుట వలన లాభము లేదు! ఎందరో సాధు సన్యాసులు పేరు ప్రతిష్ఠల వెంట, ఆస్తి పాస్తుల వెంట, ద్వేషాసూయల వెంట పరుగిడుచున్నారు, కదా? వారు గృహమును త్యాగము చేసినారు, సరే. అయితే, తమకు కారాగృహములను నిర్మించుకొంటున్నారు! నేను బోధించునది : స్థిర నివాసము లేని మనస్సు.

ప్రశ్న అయిన, అది అంతటా పరిభ్రమించుతుంది కదా!

శ్రీవారు అవును, కానీ-డు, అన్నింటికి సాక్షిగా వుండని. అంతటా అన్నింటిలోనూ భగవంతుడున్నాడు కదా; పరమాత్ముడు కానిది ఏదీ లేదు. సర్వం ఖల్విదం బ్రహ్మ. నీవు కొన్నిటిని కాదంటున్నావు కాబట్టి, అవి నీ మినహాయించిన ప్రదేశము పై వత్తిడి కలుగజేస్తున్నవి. సర్వమూ భగవంతుడే అయినప్పుడాతని నెచ్చోట నుంచి మినహాయించ గలవు ? నీ అశాంతికిదే కారణము: నీవు భగవంతునికి పరిమితి కల్పించుచున్నావు. నీవు కూడా దివ్యుడవే గాబట్టి నీ నిజ తత్వము ఆ పరిమితిని నిరాకరించుచున్నది కూడ.

ప్రశ్న ఒక్కొక సారి కాపాడుమని ప్రార్థించతూ మీ సన్నిధికి వచ్చువారి సాధనామార్గములకు నా మార్గములకు గల వ్యత్యాసములను, అంతరములను, గమనించి, చాలా విచార పడుచున్నాను.

శ్రీవారు ఎందుకు ? అది నా సంకల్పమే! అన్ని మార్గములు పద్ధతులూ నావే! కొన్ని

సాధకులకు కొన్ని పద్ధతులు; అందరికి ఒకే మార్గము అన్వయించదు. ఏదో ఒక మార్గమునవలంబించిన, ఎట్టివారైననూ చక్కచేసికొని గురిని చేర్చ వీలున్నది,

ఈ తేనీటి మీద కోరిక—నాకు యెక్కువ బాధ కలిగించుచున్నది, స్వామి.

ఎందుకు? టీ తాగినంత మాత్రమున, స్వర్గము లభించక పోదు. రజోగుణము కలిగినవాడు తేనీరు త్రాగినందున కొంత సేపు కొంత ఉత్సాహము పొందగలిగితే, అతనికి అది వాంఛనీయమే. కానీ. తేనీరే సర్వమని భావించి దానికి దాసుడై దానిని ఆరాధించకూడదు ఇట్టి అలవాట్లను రెండు విధములుగా వదలిపెట్టవచ్చును. మొదటిది: తేనీరు దగ్గరకే పోకుండ, దానిని దూరముగా ఉంచినట్టి జీవనము జరువుకొనుట. దీనినుంచి తాత్కాలిక విజయము మాత్రమే లభించును. వత్తిడి జటిలమైనప్పుడు అది ప్రకోపించును. రెండవది: క్షణికమైనది, అశాశ్వతమైనది, గుణ భూయిష్టమైనది ఏదీ వాంఛనీయము కాదని గుర్తించిన, దాని కదే సడలిపోవును.

నా చికిత్స లనేక విధములు. అవి వ్యక్తిని బట్టి వ్యక్తియొక్క స్థితి గతులను బట్టి, మారును. భజన, జపము తపము, ధ్యానము మంత్ర తంత్రములు, సేవ, ప్రేమల, ద్వారా సాధకులు నన్ను చేరుకొందురు. ప్రతివాడు నన్ను చేరి తీరుతాడు; మార్గాంతరము లేదు.

ప్రశ్న: మీ అనుగ్రహము మీదనే ఆధారపడి యున్నాను, స్వామి. దాని కొరకు ఆర్తి చెంది ఉన్నాను; ప్రయత్నించుచున్నాను.

శ్రీవారు: ప్రయత్న మక్కరలేదు. ఆర్తి ఒక్కటే చాలు! నీ సంకల్పములన్నిటిని నా వద్దకు తెండి. వాటిని నేనే సంకల్పించినాను, దేనిని గురించీ విచారించవద్దు. నీ భయభీతులు, ఆందోళన కలవరములు, అసమర్థతలు, సందేహములు అసూయలు, నీ లోని లోపదోషములు అన్నింటినీ నివేదించు.

ప్రశ్న: స్వామి! సేవాకైంకర్యములో పాల్గొనుట యెట్లు? దానికి అంతరంగము ప్రోద్బల మీయకుండిన యేమి చేయవలెను?

శ్రీవారు: సేవను అనేక మార్గములందు చేయుటకు వీలున్నది. సేవాకర్మలలో పాల్గొనక, మీ ప్రశాంత జీవితముతోనే, నిశ్చల భావముతోనే, అందరికి ఉదాహరణముగా ఉండి ప్రోత్సాహము నందించిన, అదే పెద్ద సేవ! ప్రతివాడు ప్రతిదీ చేయవలెననే నియమము లేదు. పాశ్చాత్యులు కర్మనిరతులు, గాబట్టి, నీవు అదే అభిప్రాయమును ఆదరించుచున్నావు. విచారించకు, ప్రశాంతిలో మనోబుద్ధులను ఇంద్రియములను స్థిరపరచి ఆనందమునందు కొనువారు తక్కువ! ఆ విధముగానే భగవంతుడు సంకల్పించినాడు. లేకున్న, జగత్తెట్లు జరుగును? ఉదాసీనుడుగా ఏకాంత మనోభావము లోనే విహరించు, అయితే, నాతో

ఏకాంతము ! నా వలననే నీవు నీవుగా ఉన్నావు. ప్రతివాడు తాను యెక్కడనుంచి వచ్చినాడు, యెవరి వలన వచ్చినాడు, దేనికొరకు వచ్చినాడు, యెక్కడకు పోవుచున్నాడు, తన గమ్యమేమి, అని గుర్తించుకోవలెను.

ప్రశ్న : నేనింక చాలా నేర్చుకొనవలసి యున్నది, స్వామి,

శ్రీవారు నావద్ద నేర్చుకొన గోరుచున్నావు. కాన దైహిక లౌకిక అవసరములందే శ్రద్ధ కలిగి యున్నట్లయిన, కాలము వృథా పసుగెత్తిపోతుంది. మిమ్ములను నేను అనేక స్థితులలో ఉంచిననూ ప్రతి స్థితిలోను నాయందే శాంతి సమాధానములను పొందునట్లు గావించుతాను. నేర్చుకొనవలసినదంతా నేను నేర్పుతాను.

ప్రశ్న : స్వామి ! మీరు తరచు సంచారము చేయుచూ ఒక నివాసమందుండరు కదా ?

శ్రీవారు : ఎందుకు ? నన్ను కోరినప్పుడు నేను నీ దగ్గరనేవుంటాను. నేను ఈ నామరూపములే అని తలంచి ఈ దేహమే అని నమ్మితివా? నేను సర్వాంతర్యామిని, నేను లేని స్థలము లేదు ; నాకు తెలియనిది ఏదీ లేదు. నా సత్య స్వరూపమును కొంతైనా నీకు విశద పరచుటకే నేను, నీకు ప్రత్యక్షముగా నుండక, పరోక్షముగా ఎక్కడికో వెళ్లినట్లు నటించుచున్నాను, అంతే.

న్యూయార్కు భక్తురాలొకరితో శ్రీవారి సంభాషణ.

ఈశుడాతడు చూడ సర్వేశుడతడే;
జగములెల్లను ప్రోచెడి శక్తియతడె,
గమ్యమును చూపు దర్శకాగ్రణి యతండె
ప్రాణులెల్లను కాపాడు ప్రభువెయతడు.

నిత్యుడాతడు మరి సత్య నిరతుడతడె,
ఆర్తులను కాచి రక్షించు సాయియతడె,
రూపనామమ్ముల కతీత రూపుడతడె
పర్తివాసుండు సర్వ భూతాంతరాత్మ.

# సత్యస్య సత్యం

ప్రశాంతినిలయములోని వాతావరణము మిక్కుట ముగా దైవచింతనతో నిండి ఉన్నట్టిది. అక్కడ జరిగే అనేక సంఘటనలు యాదృచ్ఛికముగా కనిపించినా వాస్తవములో బాబా 'లీలలే'! దృశ్య పదార్థములకు సంబంధించిన మహిమలు మనుష్యులను అధికముగా ఆకర్షించుతవి. కానీ, ఆధ్యాత్మిక దృష్టితో చూడ గలిగినా, ఆధ్యాత్మిక భావముతో వినగలిగినా, ఆధ్యా త్మికావగాహన పొందిన వారా క్షేత్రములో ఎన్నో మహిమలను అనుభవించగలరు. అటువంటిది ఒకటి నేననుభవించినాను.

1973 సం॥ సెప్టెంబరు నెల 9వ తేది ఉద యము సుమారొక వేయిమంది కేరళ భక్తులు ప్రశాంతి నిలయములో ఓణం పండుగను జరుపుకొని ఆనందించి నారు. ఆ సందర్భములో స్వామి భక్తుల నానందింప చేయుటకు గావించిన ప్రసంగములో, ప్రతి మానవుని లో దానవత్వ మానవత్వ దైవత్వ లక్షణములున్నవని, పారమార్థిక ఉన్నతి కొరకు దైవత్వ లక్షణములయిన అహింస, దయ, శాంతి, ప్రేమలను కలిగి ఉండ వలెనని, అందుకొరకు మానవునియందు సత్ చిత్ ఆనంద లక్షణములు సహజముగానే ఉన్నవని, చెప్పినారు.

కానీ, ఈ లక్షణములున్నవని తెలిసికొనిన తరు వాత, వాటినేవిధముగా ప్రత్యక్షము గావించుకొన వలెను? సత్యస్య సత్యం; సత్యము ద్వారనే సత్య మును తెలుసుకొనవలెనని, చూడవలెనని, అనుభవము లోనికి తెచ్చుకొనవలెనని, స్వామి చెప్పినారు,

"మీ కొక చిన్న ఉదాహరణ యిస్తాను; చంద్రుని చూడగలందులకు మీకు క్రొవ్వొత్తి దీపములు కానీ లాంతరు కానీ, పెట్రోమాక్సు లైటు కానీ అవ సరము లేదు కదా! చంద్రుని నుండి ప్రసరించిన కిరణముల కాంతిలోనే చంద్రుని చూడవలసి ఉన్నది,'' అని బాబా చెప్పినారు. ఆ తరువాత ఆ నాటి ముఖ్య విషయము, బలి చక్రవర్తి కథను చెప్పి, ఏ విధముగా భగవంతు డాతని జీవితమును పరిసమాప్తి గావించినది, దానినుండి మనము నేర్చుకొనవలసిన నీతిని గురించి బోధించినారు.

ఆ సమయమున, బాబా చెప్పిన 'సత్యస్య సత్యం' నా మనస్సులో గాఢముగా ముద్రవేసినది; దానిని గురించే నేను మనస్సులో ఆలోచింప సాగినాను. అప్పుడే దాని మహిమను అర్థము చేసికొను వీలు సంభవించినది.

ఆ సాయంకాలము, ప్రశాంతినిలయ ప్రాంగణ మందున్న యిసుకలో భక్తులనేకులు కూర్చొని, స్వామి బయటకు వచ్చినప్పుడు వారి దర్శనము చేసుకొనుటకు గాను ప్రశాంతముగా వేచి ఉన్నారు. నేను కూడా వారితో కూర్చొనినాను. వారిలో ఒక యువకుడు దీక్షతో ఒక పుస్తకము చదువుచున్నాడు. అది చూచి ఒక వృద్ధుడు వానితో, "బాబా దర్శనముతో నీ

చదువంతా పూర్తి అవుతుంది లే '' అని చెప్పగా విని నాను ఆతడా మాటలు మరాఠీ భాషలో పలికినప్పటికీ, అది నాకు సమ్మెట పోటు వలె తగిలినది. దానితో ప్రదక్షిణము పూర్తి అయినది, అవును, చంద్రుని చూచుటకు దీపమెందుకు ?

" ఎంత సత్యము ! " అని నాలో నేను భావించినాను. ఆచరించకుండా, ఎంత మంచి ఆధ్యాత్మిక విషయములను గురించి నిరంతరము చదువుతున్నారు, వింటున్నారు, అధ్యయనము గావించుచున్నారు ! ఇవన్నీ కూడా చంద్రుని దీపముతో చూచు ప్రయత్నము లవంటివి

బాబా దర్శనముతో, పరతత్వమును గురించిన నీ సతనము సమాప్తి చెంది, ' సత్యస్య సత్యములో ' జీవించుటకు ప్రారంభించెదవు,

దత్ పెథె

---

# పరాశక్తి పండుగ

దసరా పండుగ ప్రారంభము కాకముందే ప్రశాంతినిలయము ప్రపంచమునందన్ని మూలలనుండి వచ్చిన వేలాది భక్తులతో నిండిపోయినది. శ్రీ సత్యసాయి సేవాదళ సభ్యులు వచ్చిన వారికి, రానున్న అసంఖ్యాకులైన భక్తులకు సదుపాయముల నేర్పాటు చేయుటలో నిమగ్నులైనారు. అన్ని రాష్ట్రముల నుండి వచ్చిన వీరందరు భగవాన్ అనేక ఆశీస్సులతో తమ తమ కార్యము లతి శ్రద్ధగా, జాగ్రత్తగా చేయ సాగినారు. 15 వ తేదీ రాత్రి 9 గంటలకు షుమారు 8 ‌0 మంది స్త్రీ పురుష స్వయం సేవకులున్న సమావేశములో భగవాన్, వారి బాధ్యతలను గురించి బోధించినారు.

చరాచర ప్రాణికోటి కంతటికి ఆధారమైన జగన్మాతయొక్క దసరా ఉత్సవమును, 16 వ తేదీ ఉదయము షుమారు 15000 మంది భక్తుల సమక్షములో, బాబా ప్రారంభించినారు. ప్రభాత ప్రభాకర మృదు కిరణములు ప్రసరించుచుండగా, వేదఘోషము, నాద స్వరము వీనుల విందుగా వినిపించుచుండగా, భగవాన్ ప్రశాంతి పతాకము నెగరవేసి, అసురుల మీద సురలు పొందిన విజయమునకు, దుర్మార్గము మీద సన్మార్గము పొందు విజయమునకు, అజ్ఞానము మీద జ్ఞానము పొందు విజయమునకు చిహ్నమని ప్రకటించినారు.

ఆ సాయంకాలము శ్రీ సత్యసాయి వైద్యశాల 17 వ వార్షికోత్సవము జరిగినది. యాభై మంది వైద్యులు అనేక ప్రాంతములనుండి యీ అశేష భక్తజనుల సేవకొరకు వచ్చినారు. ఈ సమావేశమునకు శ్రీ నకులసెన్, మాజీ గోవా గవర్నరుగారు, అధ్యక్షత వహించినారు. వైద్యశాలలో పనిచేయు డా॥ సీతారామయ్యగారు తమ వార్షిక నివేదికను సమర్పించి

నారు. 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం', ధర్మ సాధనకు శరీర మవసరము కావున, నవరాత్రులందు ప్రప్రథమముగా, జగన్మాత పరాశక్తి స్వభావమున కనుగుణ్యముగా యీ వార్షికోత్సవమును జరిపినట్లుగా శ్రీ నకులసెన్ చెప్పినారు. నిరంతరము ప్రతి ప్రాణి నుండి ప్రకంపనములు, భావములు, వాటివలన ప్రతి ప్రాణిలో కలుగు చర్య ప్రతిచర్యలను గురించి చెప్పి, యీ సత్యమును గుర్తించుట ఆరోగ్య విషయములందు చాలా అవసరమని, భగవాన్ చెప్పినారు.

దసరా పండుగ మూడవ దినమున, ఐదు వేలకు పైగా బీదవారికి, వికలాంగులకు మృష్టాన్నమును పెట్టించి, భగవాన్ స్వయముగా వారందరికి లడ్లు పంచిపెట్టినారు. ఆ తరువాత వేయిమంది వికలాంగులకు బాబా స్వయముగా ధోవతులు చీరెలు పంచి పెట్టినారు

దసరా నాలుగవ దినమున మహా పవిత్రమైన వేదపురుష సప్తాహ జ్ఞానయజ్ఞమును ప్రారంభించినారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖామంత్రి శ్రీ సూర్యనారాయణ రాజుగారు ప్రారంభోపన్యాసము గావించినారు; ఈ సందర్భము, ఇందులో పాల్గొనువారు, భగవాన్‌యొక్క దివ్య సన్నిధి, మహాభారతములోని రాజసూయ యాగమును జ్ఞప్తికి తెచ్చుచున్నదని చెప్పినారు. దైవ సన్నిధిలో యజ్ఞము గావించు అవకాశము లభించినందుకు, వేదపండితులను వారు అభినందించినారు.

యజ్ఞమునగా 'త్యాగము' ని, దేవతల నామంత్రించే మంత్రములయొక్క అంతరార్థమును భగవాన్ విశదపరచినారు. ఆ సాయంకాలము పది సంవత్సరములనాడు భారతీయ సంస్కృతిని, సనాతన ధర్మమును పునరుద్ధరించుటకుగాను ఏర్పాటు గావించిన ప్రశాంతి విద్వన్మహాసభ వార్షికోత్సవమును జరిపినారు.

తర్క వేదాంత శాస్త్రములలో నిధియైన, యెనుబది సంవత్సరముల వృద్ధుడైన బ్రహ్మశ్రీ ముదిగొండ పిచ్చయ్యశాస్త్రిగారు ప్రారంభోత్సవము గావించినారు. మానవ జీవిత మొక వ్యూహములో చిక్కుకొని నట్టి అనివార్యమైన సంఘర్షణవంటిదని వర్ణించినారు; మానవ మోక్షమునకు వేదములే మార్గమని ప్రకటించినారు. భగవాన్ బాబా యొక్క దివ్య ప్రేమను గురించి దీపక్ శ్రీమాలి అనే విద్యార్థి ప్రసంగించి, శ్రీ బాబావారి ప్రేమ సందేశము నాచరణలో పెట్టుటే ఉత్తమ పూజ అని చెప్పినాడు.

20 వ తేదీన, ఆ తరువాత దినములలో ఉదయ కాలము, భగవంతుని రాజరాజేశ్వరీ భావముగా పవిత్ర మంత్ర పఠనమును, ఏకైక పరమాత్మయొక్క అనంత నామరూపములను గురించిన ఆరాధనా శ్లోకములను శ్రావ్యముగా వాతావరణమంతా పవిత్రమగునట్లు గావించినారు. సాయంకాలము బ్రహ్మశ్రీ లంకా సీతారామ శాస్త్రి, బ్రహ్మశ్రీ శిష్ట్లా చంద్రమౌళి శాస్త్రిగారలు వేదపురుష యజ్ఞములో క్రమ విధానమును వివరించినారు. దేవతల నాహ్వానించిన మంత్రములయొక్క వేదాంత లక్షణములను మొదటివారు వివరించగా, రెండవవారు వాటియొక్క సాంకేతిక ప్రాముఖ్యమును గురించి చెప్పినారు.

21 వ తేదీ సాయంకాలము శ్రీ పిచ్చయ్యశాస్త్రి గారు అద్వైతమును గురించి ప్రసంగించినారు. వారి ఉపన్యాసాంతములో భగవాన్ నవరత్న హార మొకటి సృష్టించి వారి కంఠము నలంకరించినారు. డా॥ దివాకర్ల వెంకటావధాని ఆది శంకరుల సౌందర్యలహరిని గురించి ప్రసంగించి ప్రేక్షకులను ముగ్ధులను గావించినారు. తరువాత, దర్శన శాస్త్రములలో

ఆత్మకు గల పర్యాయ పదములను వివరించి, ఆత్మ సాక్షాత్కారము కొరకు ఆచరించవలసిన సాధన చతుష్టయమును గురించి భగవాన్ సవివరముగా బోధించినారు.

22 వ తేదీన, డా॥ వి. కె గోకాక్‌గారు, అమెరికా సంయుక్త రాష్ట్రములలో, హవాయి ద్వీపములో, యింగ్లాండులో, ఒక మాసము కాలము సత్యసాయి కేంద్రము లన్నింటియందు పర్యటించి వచ్చి, వారి అనుభవములను ప్రేక్షకుల కానందము కలుగునట్లుగా ప్రసంగించినారు. తాను వెళ్లిన ప్రతి ప్రదేశమునకంతకు ముందే భగవాన్ బాబా వెళ్లినట్లు నిదర్శనములను, అనేక శతాబ్దములకు ముందు జీసస్ చేసినట్లుగా, ప్రతి జిజ్ఞాసువుకు వారినందరిని సరిదిద్ది, ఓదార్చి, ప్రబోధించ వచ్చినట్లు తెలిసినట్లుగా చెప్పినారు. ఆ దినమున భగవాన్ షట్‌శాస్త్రములలో తెలిపిన అధ్యాత్మికాభివృద్ధికి కావలసిన సాధన చతుష్టయములో రెండవదానిని గురించి వివరించినారు.

23 వ తేదీన, దుర్గాష్టమినాడు కొవ్వూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ గారైన శ్రీ దూళిపాళ్ల రామచంద్ర శాస్త్రిగారు భగవాన్ బాబావారి దివ్య బోధలు సరళములై శాశ్వతములైనట్టివని, అవి ఉపనిషత్ వాహినివలె నిర్మలములని, నేటి కాలమున కెంతో అవసరమైనవని, భారతీయ ధార్మికభావములతో నిండి ఉన్నవని చెప్పినారు. ఆ తరువాత శ్రీమద్దుల్లపల్లి సత్యనారాయణ శాస్త్రిగారు ( నరసరావుపేట, యస్, యస్, యన్ కళాశాల ) శబ్దశాస్త్రమును గురించి, ధ్వని, కాంతి, శక్తి, దైవత్వములయొక్క క్షేత్రములలో దాని ప్రభావమును గురించి ప్రసంగించినారు. ఆ నాడు బాబావారు, ఏ అధ్యయన విషయము కానీ, ఎట్టి విచారణ కానీ, ఎట్టి నిర్ణయము కానీ, ఎట్టి ధ్యానవిషయము కానీ, నాలుగు ముఖ్య లక్షణములు కలిగి ఉండవలెనని, అవి వాటిలోని విషయము ప్రయోజనము, మార్గము, అధికారము అని చెప్పినారు. విషయమును గురించిన ప్రాథమిక జ్ఞానము, నిమిత్తమును గురించిన విషయ జ్ఞానము, దానిని సాధించు మార్గమును అనుసరించుటలో దృఢ నిశ్చయము, దానిని సంపూర్ణముగా నెరవేర్చుకొనుటకు కావలసిన శ్రద్ధ, తెలివి, నేర్పు, శక్తి లేనప్పుడు, ఎవ్వరూ దీనిని అధ్యయనము చేయరాదని చెప్పినారు. శ్రీవారు మానవునియొక్క స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను గురించి, వాటి భావమును గురించి వివరించినారు.

ఆ రాత్రి. శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థులు. ఈ పండుగ నిమిత్తము బాబావారు ప్రత్యేకముగా రచించిన పాండవ విజయము అనే నాటికను ప్రదర్శించినారు. ఈ నాటకమునకు వారే సూత్రధారిగా ఉండి, సంభాషణల నెట్లు పలుకవలెనో, పాటల నెట్లు పాడవలెనో భావములనెట్లు ప్రకటించవలెనో నేర్పించినారు. జగన్నాటక సూత్రధారి తన అనంతానురాగములో యీ చిన్న నాటకము ద్వారా, సుఖదుఃఖములు సమభావముతో అనుభవించవలెనని, రెండు దుఃఖముల మధ్య గల కాలమే సుఖమని, తిరిగి మరొక సారి మానవాళికి బోధించినారు. విద్యార్థులీ నాటికను చక్కగా ప్రదర్శించ, ఇరువది వేల మంది ప్రేక్షకులు, సందర్భానుసారముగా ఆనందించి, రోదించి, కోప అనుతాపములకు లోనైనారు. దీని తరువాత శ్రీ సత్యసాయి స్త్రీల కళాశాల విద్యార్థినులు, " బిషప్ గారి దీపపు సెమ్మెలు " అనే ఆంగ్ల నాటికను, ప్రేమవలన ఎట్టి కఠిన హృదయమునైనా ద్రవింప చేయవచ్చుననే యితివృత్తము గలదానిని, ప్రదర్శించినారు. ఈ రెండు నాటికలకు ముందు

శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థి ఒకడు "శ్రీరాముని కర్తవ్య నిష్ఠ" అనే ఏకపాత్రాభినయము ఆకర్షనీయముగా ప్రదర్శించినాడు.

24 వ తేదీన, జమ్మలమడక మాధవరామశర్మ గారు, సుప్రసిద్ధ ఆంధ్రకవి జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు ప్రసంగించినారు. శ్రీ శర్మ గారు తాను రచించుచున్న 'సత్యసాయి పురాణము' లో 16000 శ్లోకములు వ్రాసినానని. భగవాన్ 60 వ జన్మదినోత్సవమునాడీ పురాణమును శ్రీవారి పాద పద్మముల వద్ద సమర్పించుచుతానని చెప్పినారు. తరువాత బాబావారు ఆది శబ్దమైన ప్రణవమును గురించి వివరించి. సృష్టికంతకు ప్రణవమే మూలాధారమైనందున, దాని, అనంతశక్తిసాధకునకు చాలా అవసరమని బోధించినారు.

25 వ తేదీ విజయదశమి నాడు యజ్ఞము పరిసమాప్తి గావింపబడినది. సరిగా ఉదయము 9 గంటలకు, పండితులు, ఋత్విక్కులు వేదఘోష గావించుచుండగా, యజ్ఞమంటపములోనికిబాబావేంచేసి,యజ్ఞకుండములో పూర్ణాహుతిగా వేయుటకు గాను నవరత్నములు సృష్టించినారు. యజ్ఞకుండము చుట్టూ ఆ వేదపండితులతో కలసి వేదపురుషునిగా భగవాన్ నిలబడి ఉండగా. పవిత్రాగ్ని రేణులు కొన్ని గజముల ఎత్తుగా ఎగయగా చూచి, అక్కడ చేరిన అశేష భక్తాళి నిశ్చేష్టులైనారనిన అతిశయోక్తి కాదు.

తరువాత భగవాన్ షిర్డిసాయి రజిత విగ్రహమునకు పవిత్రస్నానము గావించి, ఒక యింద్రనీల మణి హారము సృష్టించి, ఆ విగ్రహము కంఠమున కలంకరించినారు. డా॥ భగవంతం గారు విభూతి పాత్రను పట్టుకొని ఉండగా, తన చేతులను ఒకదాని తరువాత మరొకటి దానిలోనికి జొనిపి. చిలికినట్టు త్రిప్పి, ఎంతో విభూతిని ఆ విగ్రహము మీద కురిపించినారు. ఆ తరువాత యజ్ఞతీర్థమును, అభిషేక జలమును కుశకాష్టముతో అక్కడ చేరిన 20000 మంది భక్తులకు పైన, భక్తశ్రేణుల మధ్య మెల్లగా నడచుచూ, చల్లినారు.

ఆ సాయంకాలము, భగవాన్ సందేశము. ధర్మకార్యములకు సంబంధించిన విషయములపై అన్ని రాష్ట్రములలో జరిపిన పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు బాబా బహుమతులు పంచిపెట్టినారు. 1500 ల మందికి పైగా విద్యార్థులు యీ పోటీలో పాల్గొనినారు. విజయులైనవారిని ప్రశాంతినిలయములో పవిత్ర విజయదశమినాడు భగవాన్ ఆశీస్సుల కొరకు ఆహ్వానించబడినారు. తరువాత బాబావారు ఆరుగురు కవులను తమ రచనలు చదువుట కాహ్వానించినారు.

బ్రహ్మశ్రీ బి. తిరుమలాచార్యులవారు సంస్కృతములో, శ్రీ యన్. కస్తూరిగారు తెలుగులో, డా॥ చతుర్వేదుల నరసింహశాస్త్రి (అమరేంద్ర) తెలుగు, ఇంగ్లీషులో, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు తెలుగులో, శ్రీదీపాల పిచ్చయ్యశాస్త్రిగారు తెలుగులో, శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు సంస్కృతము, తెలుగులో తమ రచనలను చదివి వినిపించినారు. భగవాన్ తమ ప్రసంగములో సమచిత్తమును, సమత్వమును వృద్ధిపరచుకొనుమని గట్టిగా బోధించినారు.

తరువాత రాత్రి 'పూతనా మోక్షము' అనే కథకళి నృత్యము జరిగినది. శ్రీ ఎ. వి. సుబ్బారావు పార్టీవారిచే గయోపాఖ్యానము నాటకములో ఒక రంగము ప్రదర్శించబడినది.

26 వ తేదీ రాత్రి భగవాన్ రజితాంబరధారియై వెండి తూగుటుయ్యాలలో ఆసీనులై భక్తజనుల కమితా

నందము గావించిరి. శ్రీవారి మందహాస సుందర వదనమును దర్శించి అందరి హృదయములు ప్రఫుల్లములైనవి ఆ సమయమున హైదరాబాద్ భారత్ ఎలెక్ట్రికల్సు వారు 'కుశలవ' బుర్రకథను చక్కగా అభినయముతో పాడినారు.

ఈ మహా భక్తసముదాయమును, గౌహతి, చీరాల ధర్మవరము, ఎర్నాకులం, తిరుచూరు బాలవికాస బాలబాలికలు, ఆయా దినములలో, తమ అభినయముతో అలరించినారు. చీరాల బాలవికాస కేంద్రమునకు చెందిన ఏడు సంవత్సరముల బాలిక మనోజ్ఞముగా స్ఫుటముగా ఆంగ్లభాషలో బాబాను గురించి ప్రసంగించి ప్రేక్షకుల నందరిని ఆనందములో ముంచివేసినది. బృందావనములోని శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థులు దీపక్ శ్రీమాలి, కమల్ సహాని, రవికుమార్ ఆంగ్లములో, విజయశర్మ హిందీలో భగవాన్ బాబావారి దివ్య సందేశమును గురించి ప్రసంగించినారు. వారి ప్రసంగములు క్లుప్తముగా, ప్రస్ఫుటముగా, ఉండుటే కాక, నిజాయితీతో తొణికిసలాడినవి. శ్రీరామకుమార్ ఛటర్జి భక్తి కీర్తనలు మనోహరముగా ఆలపించినారు. డా॥ కవితా రాయి పార్టీవారు, పల్లెపదాల పద్ధతిలో 'శ్రీ సత్యసాయి స్ఫూర్తి' అనే మకుటముతో పాడిన పాటలు అందరిని ఆకర్షించినవి. శ్రీ జస్‌రాజ్ పార్టీవారి సంగీతము అందరి మన్ననలందుకొనినది. కృష్ణా, గుంటూరు జిల్లాల భాగవత భక్త సమాజమువారు వారి కథా కాలక్షేపము, తరంగ కాలక్షేపము గావించినారు.

27 వ తేది భగవాన్, స్త్రీ బాల, పురుష, వృద్ధుల కందరికి విభూతి ప్రసాదమును స్వయముగా అందించి నమస్కరించుటకవకాశమిచ్చినారు.

ఈ దసరా మహోత్సవములను తిలకించి యిరువది వేలకు మించిన భక్తులు, తాము పొందిన ఆనంద హర్షముల నెన్నటికిని మరువజాలరు.

**సంపాదకుడు.**

జాతిమనుగడ కొరకు చక్కని పంటను పండించే చేలలో పెరిగే లేత మొక్కలవంటివారు పసిబిడ్డలు. ఈ పసిబిడ్డలు జాతి భవిష్యత్ మొక్క పునాదులకు మూల స్తంభముల వంటివారు; గొప్ప తరము వారికి ఆరాధన, వివేకము, పరీక్షణ బోధించే జాతీయ వృక్ష మునకు మూలవ... ...ము.

ఈ మూ... ...వచుటకు, పునాది స్తంభ ములకు... ...), పెరుగుచున్న మొక్క లకు... ...ఉండుటకు, సత్యసాయి బా... ...పొందించబడినవి. నేడు ...డితనము, వ్యాకులత, ...అత్యంత కలుషిత ...రు. పాశ్చాత్య శదే ...సిన ... ...మైన నాగ రికతయందు ప్రజలు ఆసక్తి కలిగియుండుటే దీనికి కారణము. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులే కాక, దేశ నాయకులు కూడా మన సంస్కృతియందు ఆదరణను కలిగియుండక, దానిని అవగాహన చేసికొని ఆచరించక పోవుట మన దురదృష్టము. పసిబిడ్డలకు మన యీ అమూల్య వారసత్వమును గురించి బోధించక పోవుట చాలా విచారకరము. పైగా, వారికి అన్య భావములు, ఆలోచనలు, ఆదర్శములు ఉగ్గుపాలతో బోధించుచున్నాము. జాతీయ గీతములు కాక, అర్థము లేని పరదేశ పిల్లల పాటలు పాడినందుకు వారిని అభినందించుచున్నాము! చదువుకొనినవారు, చదువు కొననివారితో, చదువురానివారితో కలిసి మెలిసి ఉండక తొలగి ఉండునట్లు నేర్పుచున్నాము.

**- బాబా**

# పుస్తక సూచి

1 పుస్తకములు వెలనూ పోస్టు మరియు రిజిష్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోసుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 1-25 తో వివరముగా వ్రాసి పంపవలెను.

పేరు

**తెలుగు:-**

| | | వెల | తపాలాచార్జి |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం(1) | 4-00 | 0-35 |
| 2 | ,, ,, (2) | 5 00 | 0 40 |
| 3 | మణిమాల | 1 00 | 0 25 |
| 4 | అర్పణ | 1-00 | 0-15 |
| 5 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0 5 |
| 6 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 8 | వచనామృతము | 5-00 | 0-25 |
| 9 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 10 | గీతాభావప్రకాశము | 15-00 | 0 90 |
| | దివ్యోపన్యాసములు | 1-50 | 0 25 |
| 12 | భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి వేసవి ప్రబోధాలు | 2-50 | 0-25 |
| 13 | భజనావళి | 2-90 | (-2) |
| 14 | కథాసుధ | 2-00 | 0-20 |

**కన్నడ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | ప్రశాంతివాహిని | 1-50 | 0-15 |
| 2 | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 3 | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 4 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 6 | గీతావాహిని | 4-00 | 0-25 |

**మలయాళము:—**

| | | | |
|---|---|---|---|
| 1 | 108 రత్నంగళ్ | 1-50 | 0-15 |
| 2 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-65 |
| 3 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-10 |
| 4 | ధర్మవాహిని | 1-00 | 0.10 |

**ఇంగ్లీషు:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-30 |
| 2 | సత్యం శివం సుందరం (3) | 6-00 | 0-35 |
| 3 | సమ్మర్‌షోవర్స్ ఇన్ బృందావన్ 1972 | 5-00 | 0 35 |
| 4 | ,, 1973 | 6-50 | 0-30 |
| 5 | సందేహ నివారిణి | 3-00 | 0-15 |

**అరవం:—**

| | | | |
|---|---|---|---|
| 1 | అన్‌బిన్ జ్యోతి | 2-00 | 0-15 |
| 2 | అవతారమొళిఅముదం[1భా] | 3-00 | 0-25 |
| 3 | ,, ,, [2భా] | 3-00 | 0-30 |
| 4 | సాయిమాతా | 1-00 | 0-10 |
| 5 | ధర్మవాహిని | 1-50 | 0-5 |
| 6 | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 7 | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 8 | అరుళ్‌వాక్కు | 2-00 | 0-15 |
| 9 | దివ్యజ్ఞాన దీపింగళ్ | 1-50 | 0-10 |
| 10 | సత్యశివసుందరం II | 4-00 | 0-35 |

**హిందీ:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సత్యసాయీశ్వరాయనమః [పద్యములు] | 1-00 | 0-10 |

**గుజరాతి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 2 | కథాసుధ | 2-00 | 0-20 |
| 3 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-3 |

**సింధి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | భజనావళి | 0-50 | 0-10 |
| 2 | ధ్యానవాహిని | 1-00 | 0-15 |

**అస్సామి:—**

| | | | |
|---|---|---|---|
| 1 | సనాతన సారధి [షార్ట్‌బయాగ్రఫీ] | 1-00 | 0-10 |
| 2 | శ్రీ భగవాన్ సత్యసాయి బాబేర్‌కథ | 0-25 | 0 10 |
| 3 | దివ్యవాణి[అడ్వైస్ టు ది స్టుడెంట్సు] | 0-50 | 0-10 |
| 4 | సత్యం శివం సుందరం (1) | 4-00 | 0-25 |
| 5 | ప్రశాంతి భజనావళి | 2-00 | 0- 5 |
| 6 | భాగవత వాణి | 0-50 | 0-10 |
| 7 | సాయి గాథ (పద్యములు) | 1-00 | 0 15 |

-o—

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2 చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4 చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెలియ జేయవలెను.

5. గమనిక :— పుస్తకముల కొరకు పైకము నీ క్రింది అడ్రసుకే పంపవలెను :

శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతినిలయం పోస్ట్, అనంతపురంజిల్లా. 515134.

6. పత్రికకు పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతనసారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు మాత్రమే పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును. పత్రికలుగాని పుస్తకములు గాని V.P.P. ద్వారా పంపబడవు.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు .12/-74 అని యుండిన, మీ చందా డిశంబర్ నెలతో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) నవంబర్ 30 వ తేదీ లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు మేనేజరు 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O కు ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యె., బి. యల్

November 1974

Regd. No. KRN/A-67

ఆత్మను విచారించి వెదుకుటే ఆత్మవిచారమన బడును. దేహమునకు వెలిని వెదుకు విచారము విచారము కాదు. వెలియనిన వాకు. పాండిత్యము. బుద్ధిచే పరామర్శించి చూచుటే విచారము.

—బాబా

Regd. with Registrar of Newspapers No. RN/1077 2/64

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధికర్పితము

సంపుటము 17 డిసెంబర్, 1974 సంచిక 10

## విషయానుక్రమణిక



సంవత్సర చందా : రు 5/-. ఇతర వివరములకు అట్ట లోపలి భాగములో చూడండి.



# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీసత్యసాయిబాబా

## 59

### కుటీరము

అతిసుందరముగా, మనోహరముగా, అనుకూలముగా, నిర్మించిన ఆ కుటీరమును సీతారాములు చూచి చాలా ఆనందించిరి. అందులో సీతాదేవి పరమాశ్చర్యముతో చూచుచు, మరది యొక్క శక్తియుక్తులను కొనియాడెను. అందులో చాలా సుఖముగా కాలము గడుపుతూ వచ్చిరి, శ్రీరామచంద్రుడు పంచవటీ తీరమున పర్ణశాల నిర్మించుకొని వున్నాడని తెలుసుకొని దినము అనేకమంది మునులు, ఋషులు, వారి శిష్య కోటితో చేరి వచ్చి దర్శించి, సంభాషించి రాములను వర్ణించుచూ వెళ్లెడివారు. మరికొందరు, శాస్త్ర, ధర్మ, మర్మములను తెలుసుకొన గోరి రామచంద్రుని అనేకవిధముల ప్రశ్నల నడుగుచుండెడివారు. కొందరు తాము చేయు తపస్సు సక్రమముగా వున్నదా లేక అందులోని దోషము లేమైన వుండిన తెలుపగోరుచున్నామని రాములను ప్రార్థించెడివారు. సర్వధర్మ ప్రవీణుడు కనుక, సర్వశాస్త్రములను యెరిగినవాడు కనుక, రామచంద్రుని ఈ విధముల వినియోగించుకొంటూ ఋషులు మునులు, పరమానంద పడుచుండిరి.

### ప్రశ్నలు

ప్రశ్నలు అడుగుటకు నాలుగు కారణములుండును, 1 తుచ్ఛము, 2 కనిష్టము, 3 మధ్యమము 4 ఉత్తమము, అని నాలుగు కారణములు, ఇందులో :—

[1] వివాదార్థము, ఒకరిని ఓడించుటకు ప్రశ్నవేయుట, ఇది తుచ్ఛము. [2] వాక్చాతుర్యము జూపించుటకు ప్రశ్నవేయుట; ఇది కనిష్టము. [3] బుద్ధి చాతుర్యము చూపించుటకు ప్రశ్నించుటము, ఇది మధ్యమము [4] సందేహములను నివృత్తిచేసుకొనుటకు ప్రశ్నించుట; ఇది ఉత్తమము. అయితే అనేక మంది ఋషులు 4 వ కారణమునకు చేరియుండిరి. ఇట్టి ఋషులను చూచి రామలక్ష్మణులు అమితానంద పడుచుండెడివారు, కొందరు రామచంద్రుడు తెలుపు అతి సులభమైన, ఆచరణ యోగ్యమైన శాస్త్రసమ్మతమైన ధర్మవిషయమ జవాబులకు మునులు, మురిసిపోయి, "ఓ నాథా! త్రికాలజ్ఞాన సంపన్నుడా! మీ కంటె వేరు ప్రభువు మాకెవ్వరు? ఋషి మానస సంచారులైన మీరు మా తపఃఫలముగా మాకు చిక్కితిరి; మేమెంత ధన్యులమో" అని ఆనందబాష్పములు రాల్చుతూ విడువలేక వెనుకకు పోయెడివారు. కొందరు అక్కడక్కడే వృక్షచ్ఛాయల క్రింద పరుండి కందమూలాదులు భుజించి వారి వారి ఆశ్రమములు కూడనూ విడిమరచి, అప్పుడప్పుడు రామచంద్రుడు వెలుపల సంచరించుచుండ చెట్ల చాటులనుండి దర్శించుకొంటూ ఆనందముగా కాలము గడిపెడివారు.

ఈ విధముగా రాముడు మునుల చిత్తములను అపహరించి, వారిని వున్మత్తులుగా గావించి సమస్త సాధనలు మాని రామచింతనే వారి నిజ తపస్సుగా వారి వారి భావములను కలిగించి, రాత్రి పగలు, ధర్మ బోధనలు సలుపుచూ, అప్పుడప్పుడు లక్ష్మణునితో "తమ్ముడా నా పని ఇదియే. ఇట్టి పవిత్ర కార్యము నిమిత్తమై నేను వచ్చి, అయోధ్యలో కూర్చొని లోకాభిరామాయణము అను వెంపుట ఎట్లు సాధ్యమగును. నా సంకల్ప కార్యము, నా రాక లక్ష్యము, ఇవియే. సాధు సంరక్షణ, లోక కంటకచర్యలను హతమార్చి, ధర్మాచరణను అభివృద్ధి గావించుట. అది ప్రారంభమైనది" అని అనేక విధముల తన సంకల్పములను తన అవతార తత్వమునూ తెలుపుచుండెడివారు.

## ఉపదేశము

ఒక్కొక్క పరి లోక కళ్యాణ నిమిత్తము లక్ష్మణుని ఆధారముగా అతనిగా నిమిత్త మాత్రుని గా భావించి, అనేక విషయాలు తెలిపెడి వారు. లక్ష్మణా, దేహమునందభిమానము, పదార్థములందాసక్తి, నీవు, నేను, అను మమకారము, ఈషణత్రయములును మొదలగునవి మాయా కల్పితములు. మాయయొక్క స్వరూపము అతి గోప్యము, విచిత్రము, అద్భుతము. మాయయే చరాచర ప్రపంచమును, జంతుజాలమును తన వశము చేసుకొని యుండును. ఇంద్రియములు పదియు వాని వాని అధిష్టాన స్థానముల ననుసరించి, అధిష్టాన దేవతలచే భోగముల ననుభవించును. ఆయా విషయ భోగములన్నియూ మాయా కృతములు.

ఈ మాయకు రెండు పేర్లు గలవు. ఒకటి విద్యామాయ; రెండవది అవిద్యామాయ. వీటిలో రెండు భేదములు గలవు. అవిద్య మహా దుష్టురాలు, ఆమె మూలమున అమిత దుఃఖములు కలుగును. దానికి వశులైన జీవులు సంసార కూపమున మునిగియుందురు. విద్యారూపియగు

మాయ ప్రభు ప్రేరణ వలన అనేక బ్రహ్మాండములను రచించెను. ఆ మాయకు స్వతంత్ర శక్తి లేదు. పరమేశ్వరుని సన్నిధిని వుండిన మాత్రమున ఆ మాయ త్రిగుణాత్మకమయిన ప్రపంచమును సృష్టించును. వర్ణాశ్రమ ధర్మములను విడచి సర్వము బ్రహ్మస్వరూపమని తలంచి భేదబుద్ధిని విడచినవాడే జ్ఞాని అని తెల్పును. "సర్వంకలవిధం నేహనానాస్తికించన" అని ప్రమాణము.

ఈ జగత్తు బ్రహ్మస్వరూపమనియూ, నానా విధ పదార్థము లొకటే అనియు తెలుసుకొనువాడే జ్ఞాని యగును. ఓ లక్ష్మణా! రజోగుణము బ్రహ్మయందును, సత్వ గుణము విష్ణువందును, తమోగుణము రుద్రునియందును సిద్ధించెను. ఈ మూడు గుణములే ప్రపంచమునకు కారణములు, ఈ మూడును తృణప్రాయములని తెలుసుకొని వాటిని విడిచిపెట్టినవాడే విరాగి కాగలడు. అతనే వైరాగి అను పదమునకు అర్హుడు అని లక్ష్మణునకు తెలుపుచుండెడి వారు.

## జ్ఞానము

ఒక్కొక పరి సీతాలక్ష్మణులను చెంత చేర్చుకొని, జీవుడు, తనకును మాయకును, పరమాత్మకును గల సంబంధమును యెంతవరకు తెలుసుకొనలేడో అంతవరకూ జీవుడు జీవుడుగానే వుండునని తెలిపెడివారు. అంతే కాక ఆ జీవుడు మాయకు లోబడి వుండెడివాడు. ఎపుడు జీవుడు తనకును పరమాత్మకును భేదము లేదనియు, పరమాత్మ యొక్క ప్రతిబింబమే తానని యు గ్రహించునో అపుడు జీవుని మాయ విడిచిపోవును. అదియే ఆత్మ జ్ఞానము. జీవాత్మకును, మాయకును. పరమాత్మకునూ గల సంబంధమును తెలిసికొనుట అత్యవసరము స్వధర్మము వలన విరక్తి పుట్టును, యోగమువలన జ్ఞానము కలుగును, జ్ఞానమే మోక్ష ప్రాప్తికి చివరి మెట్టు. పరమాత్ముని యందు అత్యంత ప్రేమ కలిగియుండుటే భక్తి, అట్టి భక్తునకే నేను ప్రసన్నుడనగుదును.

భక్తులకు నా ప్రేమను సుఖమును అందింతును. భక్తి స్వతంత్రము ; పరాధీనము కాదు. జ్ఞాన విజ్ఞానములు దాని ఆధీనములు. నిరుపమాన మగు సుఖమునకు భక్తిమూలము. సత్పురుషుల కటాక్షమే ఈ భక్తి భావములు కలుగుటకు ఆధారము. ఈ మార్గముననే జీవులు నన్ను త్వరగా చేరగలుగుదురు అని ప్రబోధించెడివారు.

ఈ విధమైన వాక్యములు సీతారామలక్ష్మణులు ఆనందముగా శ్రవణము చేయుచూ, యెక్కడున్నాము అను భావమునే మరచి తమలో తాము లోదృష్టిని చేరెడివారు. ఇట్లు ఆత్మ స్వరూప లక్షణములను ప్రబోధించి, రామచంద్రుడు కొంత విశ్రాంతి తీసుకొను సమయమున లక్ష్మణుడు, బైట కాపలా కాయుచూ ఊరకుండుటకు మనసొప్పక, రామ వాక్యములను స్మరించుచూ, అటు నిటు తిరుగుచుండ, ఆ వృక్షచ్ఛాయలో ఒక నిమ్మ మొక్క కనుపించెను,

## శూర్పనఖ

దానిని తీసి పర్ణశాలకు సమీపమున ప్రత్యేక రక్షణను కలిగించు నిమిత్తమై పాదు తీయుచుండ ఇంతలో రావణుని సోదరియైన శూర్పనఖ అను పిచురాలు, దుర్మార్గురాలు, పరుగెత్తుకొని వచ్చెను. లక్ష్మణుని చూచిన తక్ష

ణమే, ఆ చక్కదనమును చూచి అతని దేహ వర్చస్సును చూచి మోహించెను; నోటి మాట రాలేకపోయెను. తన వికారపు స్వరూపమును మార్చుకొనెను; సుందర దేహమును ధరించెను; కామవృత్తులు ప్రదర్శించెను. కానీ లక్ష్మణుడు ఆ రూపమునైననూ గమనించక, లెక్క చేయక, తన పని తాను చేయుచుండెను. ఇక భరించ లేక శూర్పనఖ లక్ష్మణుని సమీపించి, "నాథా! నన్నేల నిరాశకు గురి చేయుచున్నావు. నా తాపమును చల్లార్చి, మీ చల్లని దృష్టిని నా పై ప్రసరింపచేయుము" అని దీనయై ప్రార్థించు చుండ, దానిని కూడనూ వినీవిననట్లు నటించు చూ, ఆ రాక్షసి మొగమునైననూ చూడక తనలో తాను నవ్వుకొనుచూ, దాని ప్రవృత్తులను గమ నించుచుండెను.

ఇక తాళలేక శూర్పనఖ అతనిపై పడుటకు ప్రయత్నింప, లక్ష్మణుడు మొదట శాంత వచన ములతో, "అమ్మా! నేను శ్రీరాముని దాసుడను. నేను స్వతంత్రుడను కాను; కాన యే చిన్న కార్యమయినా రామాజ్ఞ లేక నే చేయను; చేయ పూనను" అని సంభాషణ ప్రారంభించెను. ఈ సంభాషణను విని సీతారాములు వెలుపలకు వచ్చి చూచుసరికి మాయామోహితురాలగు శూర్పనఖ అని రాములు గమనించి, తగిన జాగ్రత్తలో వుండెను. ఇంతలో శూర్పణఖ లక్ష్మణుని పిరికిపందవంటి వాడు అని అయోగ్యు డని అనేక విధముల రోషమైన మాటలను ప్రారంభించి, కొంత హాస్యమాడుటకు పూను కొనెను.

అంతవరకూ ఆమె శ్రీరాముని చూడలేదు. దృష్టి అంతయూ లక్ష్మణుని పై లగ్నమైనది. "ఓ సుందరుడా! నన్ను వివాహమాడుము నేను నీకు కావలసిన సుఖమునిత్తును. ఆదరింతును," అని అనేక విధముల బ్రతిమిలాడుచున్న ఆమె వచనములకు చోటివ్వక "ఓ సుందరీ! నేను దాసు డను. దాసుడైన నన్ను నీవు వివాహమాడిన నీవు దాసురాలు కావలసి వచ్చును కనుక. ప్రభువైన రాములను వివాహమాడిన నీకు నేను దాసుడ నగుదును; కాన అతనిని వివాహమాడుము" అని హాస్య వచనములు లక్ష్మణుడు ప్రదర్శించెను.

హాస్యము

ఇది నిజమేనని భావించి అటు ఇటు చూడ, పర్ణశాల ముందు భాగమున, ఒక సుందరమైన స్త్రీతో నవ్వుచున్న మహా సుందరమైన విగ్రహ మును చూచెను; ఇక అక్కడ వుండలేక పోయి నది. నరాసరి అక్కడికి వచ్చి, ఓ మన్మథుడా. నన్ను నీ దాసగా చేసుకొమ్ము అని దీనయై విల పించుచూ ప్రార్థించెను.

కానీ రాముడు కూడా కొంత ఆ రాక్షసికి బుద్ధి చెప్ప తలంచి, కొంత నిరాశ కలిగింపనెంచి తమాషాగా, హాస్యమాడ ప్రారంభించెను. "ఓ సుందరీ, నన్ను వివాహమాడుటకు వీలుకాదు, నేను ఏక పత్నీవ్రతుడను, నా తమ్ముడగు లక్ష్మణునకు సతి చెంతలేదు కనుక అతనిని వివాహ మాడుటలో నీకు శాంతి చేకూరును.

కాన, అతడు అన్ని విధములా సరియైన వాడు కనుక అతనినే వివాహమాడుము" అని తెలుప, ఆమె తిరిగీ లక్ష్మణుని చెంతకు వచ్చి మీ అన్నగారి అనుమతి అయినది కాన ఇక నీవు కాలహరణము చేయకూడదు, అంగీకరింపుము. అని వినయ విధేయతలు ప్రకటించుట చూచి

లక్ష్మణుడు మరింత సిగ్గుపడి, ఆమెను మరింత నిరుత్సాహ పరచుటకు హాస్యమును శ్రుతిమించు నట్లు గావించెను. రాముడు లక్ష్మణుని చెంతకు, లక్ష్మణుడు రాముని చెంతకు. పంపుటలో శూర్పణఖ మనసు విసుగెత్తి, ఇక భరించలేక, కామాంధురాలై, కన్నూమిన్నూ కానక, దుర్బుద్ధికి గురియామెను. ఈ స్త్రీ వుండుటచేత కదా రాముడు నన్నొల్లకున్నాడు. కాన ఈ స్త్రీని చంపి మ్రింగిన రాముడు తప్పక నన్ను మోహించు నని తలంచి సీతపై రుద్రురాలై దుమికెను.

అది చూచి లక్ష్మణుడు మండిపడి, రామాజ్ఞకై అతని ముఖవర్ణమును గమనించుచూ నిలచెను. అంత రామచంద్రుడు, మితిమీరిన రాక్షసి యెంత టిదైనను సంసిద్ధురాలు కావచ్చునని తలంచి, గోటితో పోవువాటికి గొడ్డలినెందు కుపయోగించుట అని భావించి, తన హస్తమును మీదికి చాపి బొటన వ్రేలుతో మిగిలిన నాలుగు వ్రేళ్లను తెక్కించెను.

సంజ్ఞ

ఈ సంజ్ఞ కర్థమును గమనించి సూక్ష్మ బుద్ధిగల లక్ష్మణుడు నాలుగు వ్రేళ్లు నాలుగు వేద ములనియు, వీటికి శృతులనియును శృతి అనగా చెవులనియును, హస్తమును మీదికి చాచుట చేత మీద ఆకాశ సంజ్ఞ అని భావించి ఆకాశము అనగా శబ్దమే బ్రహ్మమనియూ అదే స్వర్గ మార్గ మనియూ, స్వర్గమునకు నాకము అని మరొక అర్థము కలదనియూ, నాకమనగా ముక్కు అని భావించి వేదములకు శృతి, స్వర్గమునకు నాకము,- శృతులకు చెవులు నాకము ముక్కు అని అర్థముండుట చేత, తక్షణమే కత్తిని తీసి ఆ దుర్మార్గురాలి గర్వమణుచుట మంచిదని తలచి ఆమె ముక్కు చెవులు కోసివేసెను.

రోదనము

ఆ ముక్కు చెవులు కోయుటచేత, అరణ్యము దద్దరిల్లునట్లు రోదన చేసి, శూర్పణఖ రౌద్రాకార ము ధరించి దుఃఖించుచూ, మోహించి చెంతకు వచ్చిన స్త్రీని ఈ రీతిగా చేయుట న్యాయమా అని పలుకుచూ, నా అన్న అయిన రావణుని తీసుకొని వచ్చి మీకు తగిన రీతి గావింతునని శపథము చేసి వేగముగా వెనుకకు తిరిగెను

శూర్పణఖ సరాసరి ఖరదూషణాదుల వద్దకు వెళ్లి సోదరికిట్టి పరాభవము సంభవిల్లగా మీ రెట్లు భరించుచున్నారు. ఓ తమ్ముడా ! మీ భుజ బలములు ఎందు నిమిత్తము, కాల్పనా ? మీరు పురుషులు కారా ? అని రోదన చేయుచుండ విషయమేమిటో అని ఖరదూషణాదులకు బోధ పడక, చెల్లీ ! యేమిటీ వికారము, ఎవ్వరు నిన్నిట్లు వికారపరచిరి, విషయములను తెలుపు, ము, తదుపరి మా బల పరాక్రమముల చూడగల వు అని వారునూ అత్యంతాతురతతో ప్రశ్నింప, అపుడు అధిక కాలము రామలక్ష్మణుల రూపసౌం దర్యములనే వర్ణించుచూ వచ్చెను. అందులకు సోదరులు, యేమి జరిగినదో తెలుపమన వారి వర్ణనలతో కాలము వృథా పరచు చున్నావని కోపించిరి, అంత, అడవిలో జరిగిన వృత్తాంత మంతయూ ఆమె సోదరులకు తెలిపెను.

(సశేషము)

## శ్రీ జయంతి — మనస్వాపి

ఇది సత్య శ్రీ జయంతి
ఇది నిత్య శ్రీ జయంతి
సత్య నిత్య మహోన్నత
సారస్వత వైజయంతి
ఇది సత్య శ్రీ జయంతి

x x x

ఇది ధర్మ శ్రీ జయంతి
ఇది కర్మ శ్రీ జయంతి
ధర్మ కర్మ పూర్ణ శరత్
"పూర్ణచంద్ర" వైజయంతి
ఇది ధర్మ శ్రీ జయంతి

x x x

ఇది శాంతి శ్రీ జయంతి
ఇది కాంతి శ్రీ జయంతి
కాంతివలయ సంకలిత "ప్ర
శాంతినిలయ" వైజయంతి
ఇది శాంతి శ్రీ జయంతి

x x x

ఇది ప్రేమ శ్రీ జయంతి
ఇది రామ శ్రీ జయంతి
ప్రేమ రామ ఘనశ్యామ
సౌమనస్య వైజయంతి
ఇది ప్రేమ శ్రీ జయంతి

ఇది మమతా శ్రీ జయంతి
ఇది సమతా శ్రీ జయంతి
మమతామయ సమతాప్రియ
మాతృ శ్రీ వైజయంతి
ఇది సాయి శ్రీ జయంతి

x x x

ఇది కవితా శ్రీ జయంతి
ఇది నవతా శ్రీ జయంతి
మంజుల కవితా నవతా
మానవతా వైజయంతి
ఇది మాతృ శ్రీ జయంతి

x x x

లక్షలాది ప్రియ భక్తులు
సాక్షాత్ ప్రభు సన్నిధిలో
గుండెలు నిండించుకొన్న
కోర్కెలు పండించుకొన్న
నవరాత్ర శ్రీ జయంతి
నవభారత వైజయంతి

x x x

ఇది సాయి శ్రీ జయంతి
ఇది మాతృ శ్రీ జయంతి
ఇది సత్య శ్రీ జయంతి
ఇది ధర్మ శ్రీ జయంతి
ఇది శాంతి శ్రీ జయంతి
ఇది ప్రేమ శ్రీ జయంతి
ఇది కల్యాణ ప్రశాంతి
ఇది కలుముల మేలుబంతి
ఇది కవితా వైజయంతి

స్వామి నొక్కమాటు సంస్మరించిన చాలు
కన్నతల్లి ఎత్తుకొన్నయట్లు
పాలవెల్లి నడుమ నోలలాడినయట్లు
నిత్యశాంతిదాయి ! సత్యసాయి !

x x x

స్వామినొక్కమాటు సంస్మరించిన చాలు
వెండి కొండ నవ్వుచుండినట్లు
గుండెలోన శివుడు తాండవించినయట్లు
నిత్యశాంతిదాయి ! సత్యసాయి !

x x x

స్వామి ఒక్క అడుగు సాగివచ్చిన చాలు
ఉదయభాను రథము కదలినట్లు
అరుణ కిరణకాంతు లారబోసినయట్లు
నిత్యశాంతి దాయి ! సత్యసాయి !

x x x

స్వామి ఒక్క యడుగు సాగివచ్చిన చాలు
దేవళమ్ము తలుపు తెరచినట్లు
ప్రభువు చేయిసాచి అభయమిచ్చినయట్లు
నిత్యశాంతి దాయి ! సత్యసాయి !

x x x

స్వామి ముందు ఒక్కక్షణము నిల్చిన చాలు
చందమామ చేతి కందినట్లు
నంద నందనములు కందళించినయట్లు
నిత్య శాంతి దాయి ! సత్యసాయి !

x x x

స్వామి ముందు ఒక్కక్షణము నిల్చిన చాలు
సన్నజాజి పూలు చల్లినట్లు
పారిజాత వనము పరిమళించినయట్లు
నిత్యశాంతిదాయి ! సత్యసాయి !

ప్రభువు పెదవి విప్పి పలుకరించిన చాలు
ప్రేమ ఘుటలు తొలకరించినట్లు
పూర్వపుణ్య లహరి పులకరించినయట్లు
నిత్యశాంతిదాయి ! సత్యసాయి !

x x x

ప్రభువు పెదవి విప్పి పలుకరించిన చాలు
ముగ్ధమధుర మురళి మ్రోగినట్లు
సరసరాగ లహరి జాలువారినయట్లు
నిత్య శాంతి దాయి ! సత్యసాయి !

x x x

స్వామిపాదములను సంస్పృశించిన చాలు
ప్రేమవల్లి పల్లవించినట్లు
"అలకనంద" లోన జలకమాడిన యట్లు
నిత్యశాంతిదాయి ! సత్యసాయి !

x x x

స్వామి పాదములను సంస్పృశించిన చాలు
కోటినిధులు కొల్లగొన్నయట్లు
"దివిజగంగ" భువికి అవతరించిన యట్లు
నిత్య శాంతిదాయి ! సత్యసాయి !

x x x

సాయిమాత ఒక్కసారి నవ్విన చాలు
"పూర్ణచంద్ర" సుధలు పొంగినట్లు
అల "ప్రశాంతినిలయ" మవఘుళించినయట్లు
నిత్య శాంతిదాయి ! సత్యసాయి !

x x x

సాయిమాత ఒక్కసారి నవ్విన చాలు
సురలు విరుల వాన గురిసినట్లు
నవ వసంతలక్ష్మి నాట్యమాడిన యట్లు
నిత్య శాంతి దాయి ! సత్యసాయి !

— కరుణశ్రీ

[విజయదశమి నాడు కవిసమ్మేళన సందర్భమున పూర్ణచంద్ర మందిరమందు భగవాన్ సన్నిధిలో పఠించబడినవి.]

# విజయ పతాక

ప్రశాంతినిలయమందు ఆచరించే ప్రధాన పండుగలయందు పతాకోత్సవమనేది ఒక ప్రధానమైన సంప్రదాయము. పతాకమనేది విజయమునకు చిహ్నముగా వెలుగును. అయితే నవరాత్రి పండుగ యొక్క మొదటి దినమైన ఈ నాడు మనము ఏ విజయమును సాధించినాము ?

మానవత్వము వచ్చినందుకు సాధించవలసిన ముఖ్యమైన విజయము – ఆత్మ సందర్శనము, తనను తాను తెలిసికోవటము. జగత్తులోని అశాశ్వత వస్తువులను తెలుసుకొని, ఆ విధముగా తెలుసుకొనే తనను మాత్రం తెలుసుకొనక జీవితమును కొనసాగించటము కేవలము హాస్యాస్పదముగా నుండును.

లోకముయొక్క స్థితిగతులను పరికించినపుడు ప్రతి పదార్థమును క్షణక్షణము అనేక రీతులుగా మార్పు చెందుతున్నదని సులభముగా తేలును. విత్తన మొక్కటి మట్టిలో నాటితే, ఆ ఒక్క పదార్థము అనేక రూపములను పొంది, మొదలు, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పుష్పములు, కాయలు మొదలగు వస్తువులుగా రూపొందును అనునది సర్వవిదితమే. రూపనామములు మాత్రమే కాదు; ఒక్కొక్కదాని గుణము కూడ వేరువేరుగా వుండును. వాటి ఉపయోగము కూడ గుణము మార్పువలన వివిధముగా వుండును.

ఒకే మట్టి కుమ్మరియొక్క ప్రతిభ ప్రయత్నము వలన అనేక రూపనామములను పొంది అనేక ప్రయోజనములకు వీలగు పాత్రవిశేషములుగా మారును. ఒ బంగారము రకరకాల నగలుగా మారును. ఇ అందరి నిత్యానుభవమే కదా? అయితే, దీని అం [illegible]

ప్రతి కార్యమునకూ ఒక కారణముండి తీరాలి! మట్టి స్వయముగా కుండగా మారదు; ఆ మార్పుకు కుమ్మరియే కారణము. మట్టి ఉపాదాన కారణము మాత్రమే! కుమ్మరి దానికి నిమిత్తకారణము. ఆధారభూతమైన మూలప్రకృతిని సర్వజ్ఞుడైన సర్వశక్తుడైన భగవంతుడు తన తేజస్సుతో ప్రకాశింప చేయుచున్నాడు. కాబట్టి ఉపాదాన కారణము నిమిత్త కారణము రెండూ ఆ పరబ్రహ్మమే అని తెలుసుకొని, కర్తయూ భోక్తయూ అయిన ఆ భగవంతుని భజించి పూజించి అనుగ్రహమును సంపాదించి తరించుటయే మానవుని ఆద్య కర్తవ్యము. అదియే సరైన విజయము!

సాంఖ్యమందు అణువుల సంయోగమే పదార్థముల ఉత్పత్తి స్థితి లయముల కాధారమని చెప్పుదురు. వివిధమైన సంయోగముల వలన వివిధ వర్ణ విన్యాసములుగల, రూప నామ గుణ ప్రయోజనములుగల పదార్థములుత్పన్నమగును అనిన, అంత మాత్రములో జగత్తుయొక్క సమస్య తేలదు. ఈ చేరిక దేనివలన యెవరి ద్వారా జరుగుచున్నది అనే ప్రశ్న

మిగిలియుండును. అణువులలోని చైతన్యమున కాధార మేది? దానిలో గుప్తమై అప్రకటితమైయున్న శక్తియేది, అది యెట్లు అభివ్యక్తమగును, అను విషయములను ఈ నాటివరకు యెవ్వరూ నిర్ణయము చేయలేకున్నారు.

పాశ్చాత్య దేశములలోని తత్వవేత్తలు కూడ, ప్రకృతిలో కర్తలేకున్న కర్మలు ఎట్లు జరుగును అనే సమస్యకు సమాధానమును సాధించలేకున్నారు. అయితే, "ఏకోహం బహుస్యాం" అనే సంకల్ప బలమువలన అఖిలాండకోటి బ్రహ్మాండ మంతయునూ సృష్టించిన పరమాత్ముని గుర్తించి, ఆ పరమాత్మనే సర్వభూతాంతరాత్మ అని తెలుసుకొని, ఆనందానుభూతిని పొందుటయే, మానవులకు సర్వశ్రేష్ఠ విజయము! అన్ని జీవులూ ఈ విజయమును సాధించవలెను. అదే దైవ సంకల్పము! ప్రశాంతి పతాక యొక్క అంతరార్థమిదియే!

అయితే, మీరు ఈ విజయమును సాధించియున్నారా? లేదు. అయిననూ, ఆ విజయమునకు ఈ పతాకయొక్క మహత్తరమైన గుర్తు, కాబట్టి, దీనిని మరి మరి దర్శించుచూ, దానిలో లీనమైన తత్వములను గుర్తించుచూ, దానిని ఒక ఉత్తమ మార్గదర్శకముగా అంగీకరించి ఆదరించి అనుసరించుట సాయి భక్తుల ఆద్య కర్తవ్యము.

మీ తాత ముత్తాతలను మీరు చూడక పోయిననూ, తండ్రిదగ్గరనుంచి వారి మహత్వపూర్ణ జీవితాదర్శములను తెలుసుకొని మీ పూర్వీకులను కృతజ్ఞతతో స్మరించుచూ వారి అడుగుజాడలలో నడచేందుకు పూనుకోవలెను, కదా? తాత ముత్తాతల ఆస్తిపాస్తులను మాత్రము అనుభవించిన చాలదు; వారు ప్రోగు చేసిన ఆనంద ధనమును, సుజ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞాన ధనములను, వీటిని కూడ అందుకొని, వారి ఆశయములను అనుసరించాలి. అపుడే వారి సంతతి వారము అని చెప్పుకొనుటకు అర్హత కలుగును. కృతజ్ఞత లేని జీవితము వ్యర్థజీవితమే యగును.

ఈ ప్రశాంతి పతాకను మీ మీ హృదయ మందిరములో ఎగరవేసి, దాని అంతరార్థమును అపుడపుడు మననము చేసికొంటూ, ఆధ్యాత్మిక సాధనలను అభివృద్ధిచేసుకొని, పూర్వీకులవలె మీరు కూడా విజయమును సాధించి తరించండి అని ఆశించి ఆశీర్వదించుచున్నాను.

**శ్రీవారి దివ్యబోధ.**

చిత్త శుద్ధి తోడ చేసిన పూజకు
మట్టిపాత్ర చాలు మహిని చూడ;
విత్తమున్న దనుచు విర్ర వీగినవాడు
పతనమగుట నిజము, పర్తి సూక్తి.

# ఆరోగ్య పాలనము

ఆహార విహారముల వలన ఆరోగ్యము చెడునని వైద్యులందరూ హెచ్చరించుచున్నారే కాని, ఆహార మ టే ఏమిటో వారు విశదముగా తెలుపరు. పంచేంద్రియముల ద్వారా అనుభవించే, అందుకొనే, అన్నియూ ఆహారములే. నోటితో స్వీకరించినదానిని మాత్రము అహారమందురు; అయితే, చూచే చూపు, వినే విషయములు, తీసుకొనే వాసనలు, అనుభవించే స్పర్శములు, అన్నియూ ఆహారములే. అవి కూడా దేహారోగ్యమునకు మూల కారణములే! కొన్ని దృశ్యములను చూచినపుడు కడుపు త్రిప్పినట్లు వాంతి వచ్చును; కొన్ని విషయములను విన్నప్పుడు తక్షణమే షాక్ కొట్టినట్లయి, మనిషి పడిపోతాడు; వాసనలు, స్పర్శములు, వీటివలన అజీర్తి బయలుదేరును అని డాక్టర్లు చెప్పుచున్నారు. ఆరోగ్యవంతమైన దేహము ఆరోగ్యవంతమైన మనస్సుకు యెంత ముఖ్యమో, ఆరోగ్యవంతమైన మనస్సు కూడ దేహారోగ్యమునకు అంత ముఖ్యము.

ఆహారములు నోటికి రుచికరముగానూ సంతృప్తి సంతోషములను కలుగజేయునట్టివిగానూ వుండవలెను; అతి కారముగానూ అతి ఉప్పగానూ వుండకూడదు దేహమును ఎందు నిమిత్తముగా భగవంతుడు అనుగ్రహించినాడో సదా గమనించుకొనవలెను; జీవిత లక్ష్యాన్ని మరువక, జాగ్రత్తగా గట్టు చేరువరకూ దానిని పోషించి పరిపాలించుకొనవలెను. రాజస తామస ఆహారములకన్న, సాత్వికాహారమే సాధకుల కత్యగత్యము. సృష్టి రహస్యము అతి విచిత్రమైనది. గోచరించు పదార్థముల మంచి చెడ్డలను మాత్రము మానవులు నిర్ణయించుకొనగలుగుచున్నారు కానీ, అగోచరమైన వాటియొక్క గుణదోషములను నిర్ణయించ జాలక పోవుచున్నారు. ఒక విషయమును మీరు ముఖ్యముగా తెలుసుకొనవలెను; ప్రతి పదార్థము నుంచి కూడ, అతి సూక్ష్మమైన రేణువులు అణువులు అలల రూపములో యెల్ల కాలమునందు బయలుదేరుతూ వుంటాయి. ఒక సూది మొనయంత చిన్న బిందురూపమునుండి కొన్ని లక్షల అణువులు బయలుదేరును; ఇవి అతి సూక్ష్మము కాబట్టి చూడలేక పోతున్నారు.

ఒక కర్పూరపు ముక్కను ఒక డబ్బాలో పెట్టి, మూత వేసినా కూడ, కొంత కాలమునకు అది పూర్తిగా శూన్యమగును, కదా? దీనికి కారణమేమి? దానినుంచి సతతము ధారావాహినిగా బయలుదేరుచున్న అణువులే దాని నాశనమునకు కారణమయ్యెను. పరుల దేహములనుంచి వెలువడే అణురేణువులు గాలిలో చేరి, మీరు పీల్చుకొనే గాలితో మీ దేహములందు ప్రవేశించును. మీ దేహమునుండి కూడ అదే విధముగా, లక్షలాది అణురేణువులు బయలుదేరుచున్నవి ఈ రీతిగా విసర్జించటము స్వీకరించటము అనే రెండు క్రియలను అందరూ ఎల్లప్పుడూ చేయుచుందురు. దేహముయొక్క పటుత్వము ఆరోగ్యము క్షీణించుటకు తరుగుటకు పెరుగు

టకు అన్నిటికీ ఈ రెండు క్రియలే మూలకారణ ములు.

మలమూత్ర విసర్జనము దంత ధావనము స్నానాదులు. వీటివలన కొన్ని ప్రవేశములందు రోగముల నభివృద్ధిజేయు రేణువులు అధికముగా అభివృద్ధియగును. అక్కడంతా కోట్లకొలది రేణువు లుద్భవించి ఆ ప్రదేశములలో తిరుగువారియందు ప్రవేశించి వారి అరోగ్యమును క్షీణింపచేయును. ఇటువంటి మలిన ప్రదేశముల, మురికి నీరు ప్రవహించే స్థలములు. అనారోగ్యమునకు పుటినిల్లుగా వుండును.

ఈ రేణువులను నిరోధించుటకై పూర్వకాలమందు ఐదు రకముల స్నానములను నియమించినారు. మొదటిది. మృత్తికాస్నానము. మట్టిని దేహమంతా పూసుకొని, తరువాత స్నానమాచరించిన, అణువులన్నీ దానితోనే ధ్వంసమై దేహము పరిశుద్ధమగును. దానికే "మృత్తికే హర మే పాపం" అనే ప్రార్థన కూడ బయలుదేరినది. రెండవది: ఆతప స్నానము; దీనిని sun bath అంటారు. ఇవి సూర్యకిరణములను దేహమందు సర్వత్రా ప్రసరింపజేయును సూర్యుని ప్రకాశము క్రూరమైన రేణువులు ధ్వంసమగుటకు బాగా సహాయ మొసగును. మూడవది: వారి (నీటితో) స్నానము: పై భాగమునందు చేరిన రేణువులు లోపల ఉద్భవించే రేణువులు రెండూ పుణ్య తీర్థములందు భక్తిభావముతో స్నానమాచరించుట వలన మాయమగును. నాల్గవది: వాయుస్నానము: చల్లని గాలి దేహముపై వీచటము వలన రేణువులు నశించటానికి సహాయకారిగా వుంటుంది. ఐదవది: నగ్నస్నానము: దేహమంతా విభూతి రాసుకొనిన, ఆ విభూతితోనే ఆరోగ్యమును చెడిపే అణురేణువులు వదలిపోయి ఆరోగ్యము రక్షింపబడునని ఋషులు బోధించినారు.

ప్రాచీన కాలమందు ఋషులు శౌచమునాచరించి నిత్యము స్నానమును చక్కగా చేసేవారు! దీనిని ఈ నాటి విద్యావంతులు అనాగరికమని హేళన గావించుచున్నారు ప్రాచీనులు తమనెవ్వరైనా ముట్టినప్పుడు యేదైనా తాకినప్పుడు, స్నానమాచరించి దేహ నైర్మల్యమును మనశ్శాంతిని సంపాదించేవారు! "మడి" అనే సంప్రదాయము కూడ ఆరోగ్యము నిమిత్తమై చేసే కర్మ కాని వేరు కాదు. వీరిని ఆధునికులు హేళన చేయు సమయమున, శౌచవాదులు ఎదిరించి, సమర్థించుటకు దురదృష్ట వశమున అసమర్థులై పోవుచున్నారు. వారు కూడ కేవలము బాహ్యమునందు మాత్రమే 'మడి' ని ఆచరించుచున్నారే కాని, దాని ఉద్దేశమేమిటి, ఫలితమేమిటి, సక్రమముగా దానిని పాలించు విధానమేమిటి అని నిర్ణయించుటకు వారు అసమర్థులు! అయితే, పూర్వీకుల ఆచారములందు అంతరార్థము లేక పోలేదు. పురుషాయస్సు ఎంత కాలమో అంత కాలము జీవించి, తమ ఆశలు ఆశయములు అన్నిటినీ పూర్తి గావించుకొనుటకు వీలుండవలెననునదే వారి వాంఛ! ఆహార విహారములలో చక్కని మార్గము ననుసరించితే, ఆయస్సు వృద్ధియగును, శాంతి సంతోషములు చేకూరును, అని వారు నిశ్చయించుకొనిరి. పరాధీనములో పడక, ఆయుష్కాలమంతా సుఖ సంతోష సంతృప్తులతో గడిపి, అనాయాసముగా మరణమును పొందుటకు ఋషులు యుక్తాహార విహారములను, విధించిరి. ఆహార పదార్థములందున్న స్థూలభాగము మలముగా విసర్జింపబడును; వాటి యొక్క సూక్ష్మభాగము మాంసము కండరములు రక్తము మొదలగు పదార్థములుగా మారును. సూక్ష్మాతి సూక్ష్మమైన కారణ భాగము మనస్సును తీర్చిదిద్ది, భావములలోని మంచి చెడ్డలను నిర్ణయించును.

దీనివలననే, పెద్దలు ఆహారము వలన ఆరోగ్యము, ఆరోగ్యమువలన ఆధ్యాత్మికాభిరుచి, అభిరుచివలన సాధన, సాధనవలన సంకల్పము, సంకల్పమువలన ఫలసిద్ధి లభించునని ఘోషించిరి.

అయితే, ఈనాడు మలినాహారము వలన, మలిన మనస్సులు అభివృద్ధియగుచున్నవి ! కాలముయొక్క మాహాత్మ్యమేమిటో కానీ, శౌచాదులను వర్జించి మాలిన్యమును భుజించి, మలిన మనస్సులతో తాము బాధపడి, ఇతరులకు బాధ నందించుచున్నారు ; దంతధావనము స్నానము వీటిని కూడ విసర్జించినారు. దేహముయొక్క సింహద్వారమే నోరు ! ఆ సింహద్వారమే మలినముగా నుండిన అచ్చట నివసించే వారి గతి ఏమిటి ? ఇట్టివారలను విద్యావిహీనులనే చెప్పవలెను. మలిన భాష, మలిన అభ్యాసములు, మలిన చర్యలు, మలిన చింతనలు వీటిలో పడినవారి సాంగత్యము చేయక, వారినుండి దూరముగా వుండుటయే మంచిది. వారు ధనములో కోటీశ్వరులుగా వుండిననూ, గుణమున కూటికిపేదలతో సమానమే, వారిని సమీపించినచో, మీ ఆరోగ్యము చెడును, మీ బుద్ధులు పాడగును.

ఆరోగ్యమునకు ఆహారమెంత ప్రధానమో, దేహ పరిశుభ్రత కూడ అంత ప్రధానము. పూర్వ కాలమందు ఋషులు యోగులు మహా పరిత్యాగులుగా వుండి, దేహ బుద్ధి లేక ఇంద్రియ నిగ్రహముతో తపము నాచరించుట వలన వారి ఆరోగ్యము ఆయువు అభివృద్ధి చెందినవని తెలుసుకొనలేక, వారిని అనుకరించి దేహముయొక్క పరిశుభ్రతను గమనించక కొందరు సాధకులు మెలగుచున్నారు. అయితే అనుకరణమునకు కూడ అధికారముండవలెను. బలహీన హృదయులకు అనుకరణ అపాయము కలిగించును, శాశ్వతమైన సమచిత్తమును సంపాదించి తదుపరి ఋషులను అనుసరించుటకు పూనుకొనిన మంచిది, కానీ స్వార్థమును అభిలషించి, నేను చేయుటలో తప్పేమియున్నది ? వారు చేయలేదా ? వీరు చేయలేదా ? అనుటలో వెర్రితనమే కనబడుచున్నది. మీ బుద్ధియొక్క తప్పొప్పులను పరీక్షించుకొనక, ఈశ్వరుడు విషము త్రాగినాడని మీరు కూడ త్రాగితే ఫలితము తెలిసియేయున్నది. సామాన్య జనులు ధ్యాన సాధనల వలననే విజయమును సాధించవలసియున్నది. దేహమును నిర్లక్ష్య పరచుట కూడ చాలా పొరపాటు. వీరు దాటిన పిమ్మట తెప్పను తగులవేయవచ్చు కానీ, గట్టు చేరు వరకు దానికి తగిన విలువనిచ్చి తీరవలెను. జీవుడు వచ్చినది దేవుని కొరకే కాని డాక్టర్ల కొరకు కాదు ! డాక్టర్లకు దాసుడై వారినాశ్రయించక, ఆరోగ్యవంతుడై ఆనందము ననుభవించుటకు పట్టుదలవుండవలెను. దేహమనునది పండుపైనున్న తోలు ; దానిలోని గుజ్జు మనస్సు ; మాలిన్యము తినుటకు వీలు లేక పారవేసే విత్తనము ; ఆనందమే పండులోని రసము ! బాహ్యము కూడ ఆకర్షణీయముగా నుండవలెను. వర్ణము చూచి ఫలమును ఆశించుచున్నాము. రుచిని భావించి తరువాత ఆశించుచున్నాము ; దేహమును సత్కర్మల చేత అందముగా వుంచుకొనవలెను. మనస్సును సత్ భావములు సత్ చింతనలనే అందముగా వుంచుకొనవలెను. విశ్వమందు కర్మ; విశ్వేశ్వరునియందు భావములు, ఈ రీతిగా మానవుడు నిత్య జీవన యాత్రను సాగించుచున్నాడా అని పరమాత్ముడు వేయి కన్నులతో చూచుచుంటాడు.

పూర్వము మనుష్యులు, ప్రకృతి సంబంధమైన మందులు, చికిత్స, ఉపశాంతి, వీటితోనే ఆరోగ్యమును రక్షించుకొనువారు ! ఈ నాడు మందులు మాత్రలు ఇంజక్షన్‌లు ఆపరేషన్‌లు యెక్కువ అయినాయి.

అయితే, వీటివలననే రోగము కుదురి జబ్బు నయ మయినది అని భావించిన అది పిచ్చి భ్రాంతి! డాక్టర్ల వలన, మందుల వలన, ఆరోగ్యము సిద్ధించును అనునది నిజమయినచో, గతించిన వారందరూ జీవించియే యుందురు! పోనీ, ఎదురు, వారలకు ఈ డాక్టర్లు వుపదేశించు రీతిగానైనా వారు ఆచరించు న్నారా; లేదు! దేనివలన ఆరోగ్యము చెడునని వారు ఇతరులకు బోధించుచున్నారో, ఆ దురభ్యాస ములన్నీ వారిలోనే ప్రబలముగా పెరిగి, వారి చర్యలు హాస్యాస్పదముగా తయారైనవి. మత్తు పదార్థము సేవించిన అతి త్వరగా మనోబలము దేహబలము చెడును అని బోధించు వారూ డాక్టర్లే! కానీ, వాటిని వుపయోగించు వారిలో వారే యెక్కువ! ఆహార విహార పద్ధతులలో డాక్టర్లే పెడమార్గమును పట్టడము వలన. వారు సరైన మార్గదర్శకులు కారనే నిందలకు పాత్రులగుచున్నారు!

ఈ నాడు దైవిక క్షేత్రములో, అధ్యాత్మిక క్షేత్రములో, లౌకిక క్షేత్రములో కూడ, మార్గదర్శకులైన నాయకులు లేరు; దేశముయొక్క శోచనీయ పరిస్థితికి ఇదియే మూలకారణము. చెప్పునదొక్కటి. చేయునది యొక్కటి, అన్నట్లు మాట్లాడే వారు యెక్కువైనారు కానీ ఆచరణలో శూన్యముగా నున్నది;

దివ్యాత్మ స్వరూపులారా! భగవద్దత్తమైన మన జీవితమును, జన్మాంతర పుణ్యవిశేషము వలన దొరకిన ఈ దేహమును, భోగభాగ్యముల నిమిత్తమని తలంచి వ్యర్థము చేయక, యోగత్యాగములకే వినియోగించి సార్థకతను పొందండి. పరులమెప్పుకొరకు పని చేయకూడదు; ఆత్మ తృప్తికై ప్రాకులాడాలి! ఇతరుల కర్పణము కాదు ముఖ్యము; ఆత్మార్పణము గావించుకోవలెను. ఆత్మతృప్తి అనునది ప్రారంభ స్థితిలో లక్ష్యము కావచ్చు; అయితే, గమ్యస్థానము మాత్రము ఆత్మదర్శనము అని జ్ఞప్తియందుంచుకొనవలెను. మధ్య మధ్య వచ్చి అడ్డు పడుచున్న కష్టనష్టములు నిందానిష్ఠూరములు కేవలమప్రధానము. ఆత్మను కోరినా తనను పరమాత్మును కోరినట్లే. కాబట్టి కోరటమే అనవసరము. కావలసినదానినంతా, భగవంతుడే అందించును.

శ్రీవారి బోధ, ఆస్పత్రి వార్షికోత్సవము, 16–10–74.

# కర్మ

ప్రశ్న: స్వామి, ఇంద్రియములు అంతర్గత సాక్షికి దూరముగా, బాహ్య ప్రాపంచిక విషయములందు ఆసక్తి చూపినప్పుడు, సుఖదుఃఖములయొక్క ప్రతిఘాతములు సంభవించునని, మీరు చెప్పుచున్నారు కదా, మరి ఈ ఇంద్రియములకు ఉచితమైన

స్థానమేది ? ఆ విధముగా యింద్రియము లెందుకు ప్రవర్తించుచున్నవి ?

భగవాన్ : అది అంతా యిచ్ఛయొక్క నాటకము. ప్రాపంచిక పదార్థములందలి కోరికలే సుఖ దుఃఖములకు కారణము. భగవంతునిపై నున్న కోరిక పరమానందము కలుగ జేస్తుంది. ఇది సాధారణానందముకన్న చాలా ఎక్కువ బలవర్ధమైనది.

ప్రశ్న : కానీ, స్వామి, మా కర్మలు మా స్వధర్మ మునకు చాలా అరుదుగా పరిమితమగు చున్నవి. ప్రాపంచిక కోరికల వలననే మా కార్యములు జరుగుచున్నవి. దృశ్యము, శ్రవణము, ఆఘ్రాణము, స్పర్శ, బాహ్యము-ఇవన్నీ కోరికలను పెంచు చున్నవి

భగవాన్ : కోరికరూపములో భగవంతుడు మీ యందు చేరి పనిచేయుచున్నాడని జ్ఞాపకముంచు కొనుము.

ప్రశ్న : ఇది చాలా వింతగా ఉన్నది ! చెడ్డ కోరికలను భగవంతుడు ప్రోత్సాహించుతాడా?

భగవాన్ : ఏదో గాఢమైన ప్రేరణ, స్పందన, శక్తి ఉన్నప్పుడే కోరిక కలుగుతుంది. ఆశక్తి భగవంతునియొక్క కానుక. ఆనందమును కాని, విచారమును కాని కలిగించే కోరిక, దేశకాలపాత్రల ననుసరించి, మంచిది కావచ్చు లేక చెడ్డది కావచ్చు. చిన్నతనములో మంచిదిగా కనిపించిన ప్రాపంచికాభివృద్ధి, పెద్దతనములో చెడ్డది కావచ్చు. కోరికతోపాటు భగవంతుడు మీకు విచక్షణా శక్తిని కూడా ప్రసాదించుచున్నాడు. దీనిని ఉపయోగించుకొని దుష్కర్మలను విసర్జించండి మాయచేత భగవంతుడు ఆవరించబడినప్పుడది దుష్కర్మ. కానీ, మాయను హతమార్చి, భగవంతుని కనుగొనుటకు భగవంతుడొసంగిన పరికరమే విచక్షణా శక్తి.

ప్రశ్న : స్వామి ఆనందముగా ఉండుటే మానవుని స్వధర్మమని మీరు చెప్పుచున్నారు.

భగవాన్ ; ఆనందము దైవత్వమును చేరుటకు గల ప్రధాన మార్గములలో ఒకటి. దుఃఖముతో ఉండుట చాలా గురుతరమైన దైవదూషణే : దుఃఖము దైవమును అభివ్యక్తము గావించు కొనుటకు పెద్ద అవరోధము.

ప్రశ్న : స్వామి. మనస్సు ఏ కార్యమునందు నిమగ్నమై ఉండకున్నప్పుడు....

భగవాన్ : మనస్సు నిరంతరము చలించుచునే ఉంటుంది !

ప్రశ్న : ధ్యానించు సమయములో అని నా భావము.

భగవాన్: అవునా ?

ప్రశ్న : మనస్సు ఏ కర్మయందు నిమగ్నమై ఉండనప్పుడు, మా లక్ష్యము నెక్కడ నిలుపుకోవలెను ?

భగవాన్ : భృకుటియందు : అదే జ్ఞాన నేత్రము. పరమశివుని మూడవ నేత్రము.

ప్రశ్న : స్వామి, కాయము, మనస్సు, బుద్ధి, ఇవి పరులకొరకు పనిచేయవని, స్వీయ కార్యములే చేయునని చెప్పినారు కదా, దాని అర్థమేమిటి ?

భగవాన్ : దాని అర్థమేమనగా .... "దురదృష్ట వశమున, అదే పరిస్థితి." వ్యక్తికి హానిదాయకముగా అవి తమ కార్యములు చేయుచున్నవి. కానీ ఉత్తమ సంకల్పములకు అనుగుణ్యముగా వాటి కార్యములు చేయవలసి ఉన్నది. ఉదాహరణకు కన్నుల విషయము తీసుకొనండి. కన్నుల పని చూచుట; కానీ మనస్సు కన్నులద్వారా చూడవలసి ఉన్నది ; బుద్ధి మనస్సుకు మార్గము చూపాలి ; బుద్ధియందు ఆత్మభావము తప్పకుండా ప్రతిఫలించాలి.

ప్రశ్న : ఎవరి నిమిత్తమై యీ ఏర్పాటంతా జరుగుచున్నది, స్వామి ?

భగవాన్ : ఆత్మ నిమిత్తమే. భూమి తన యిరుసు మీద తిరుగుతూ అదే సమయములో, సూర్యుని చుట్టూ పరిభ్రమించుచున్నది. అదే విధముగా, మానవునిలోని వివిధ మనోవృత్తులు తమ తమ కార్యములను నెరవేర్చు కొనవలసియున్నది ; కానీ, ఆత్మ అన్ని శక్తులకు మూలస్థానము.

ప్రశ్న : సత్యఃకాలములో చేసే కర్మను కూడా భగవంతుడు మన్నించుతాడా ?

భగవాన్ : భూతకాలకర్మ, వర్తమానకర్మ, భవిష్యత్కర్మ అని కర్మ మూడు విధములు. వర్తమాన కర్మ దాని ప్రకారమది జరుగవలసినదే అది కదిలే బండివెనుక రేగినట్టి దుమ్ము వంటిది. బండి ఆగినప్పు డాదుమ్ము దాని మీద కప్పివేస్తుంది. కానీ, బండి ఈ దుమ్మును వదలించుకొనుటకు ఆగకుండా దారి వెంట పరుగెత్తలేము కదా. కాబట్టి, దుమ్ముతో నిండి ఉన్న బాటను వదలిపెట్టి, విశాలమైన, దుమ్ములేని రాజమార్గము మీద ప్రయాణము చేయటము ఉత్తమమైన విధానము. అనగా మానవుడు భగవంతుని అనుగ్రహమును పొంది, ఆ అనుగ్రహముతో చదును చేసిన మార్గము మీద ప్రయాణము చేయవలెను.

ప్రశ్న : ధార్మికాభివృద్ధి వాస్తవములో చాలా కష్టముగా కనిపించుచున్నది, స్వామి. ఈ విధముగా చెప్పినందుకు క్షమించండి.

భగవాన్ : అచంచలమైన ఆత్మవిశ్వాసము, ధార్మిక జీవనమునకు చాలా ప్రధానము. కనుక, ఒక సారి దీనిని సాధించినట్లయిన, ఆధ్యాత్మికాభివృద్ధి చాలా సులభము. ఎంత పెద్ద వర్షము కురియుచున్నా, బోర్లించి పట్టుకొనిన గిన్నెలో ఒక్క నీటి చుక్క పడదు, కానీ, దానిని సరిగా పట్టుకొనిన, చిన్న జల్లులు పడుచున్నప్పుడు కూడా, కొన్ని నీటి బిందువు లందులో తప్పక పడతవి. మనస్సును భగవంతుని కభిముఖముగా మరల్చండి ; అప్పుడే అనుగ్రహము లభించగలదు. ఉత్సాహ భక్తి విశ్వాసములు మెండుగా ఉన్నప్పుడే హృదయపాత్ర నిండుతుంది. ఓ ప్రియమైన

సాధకా! బాహ్య ప్రపంచములో జీవితము లెక్క లేనన్ని చిక్కులతో నిండి ఉన్నట్టిది. కానీ, మనః ప్రపంచములో జీవితము సరళమై సులభముగా ఉంటుంది.

ప్రశ్న : అందుకొరకు శరీరమును శోషింపచేయుట అవసరము కాదా ?

భగవాన్ : అది చెడ్డ సలహా. ఆరోగ్యముగా ఉన్న శరీరము చాలా తేలిక; అది బరువని పించదు. అటువంటి శరీరము చక్కని భావములకు నిలయమై సాధనకు మంచి దోహదము చేస్తుంది.

ప్రశ్న : ఈ దినమునకు అఖరి సందేహము స్వామి. కోరిక యొక్క మూలమునే ఛేదించి వేయుమని స్వామి సలహా యిస్తున్నారు ; దాని అర్థమేమిటి ?

భగవాన్ : కోరిక కలిగినప్పుడు, దానిని గురించి విచక్షణతో ఆలోచించు. అది మంచిదా, చెడ్డదా అని యోచన గావించు. చెడ్డదని భావించిన, దానిని విసర్జించు ; అది నీకు మంచిదని పించి, యితరులకు హాని కలిగించకున్న, అనుసరించు. ఎటువంటి నిర్ణయమునకు రాలేకున్న, ఆ అనిశ్చిత స్థితిని వ్యక్తము గావించుకొనునంత వరకు, ఏమీ చేయవద్దు

జాన్ హిస్లాప్ డైరీనుండి.

---

అనేకత్వముయొక్క ఆచ్ఛాదనములో దాగియున్న సత్యమును మన ఋషులెన్నడో కనుగొని ఉన్నారు. అనేకత్వమెల్లప్పుడూ ఏకత్వమును దాచివేస్తుంది ; దీనికి కారణము ద్రష్టయొక్క అజ్ఞానము; పాక్షిక దృష్టి ఆ ఏకత్వమును హెచ్చుగా ఆవరించి ఉండుటే ఆ ఋషులు సంపాదించిన జ్ఞానము—ఇదం సర్వం ఈశావాస్యం—ను, ఉపనిషత్తులలో నీతి కథలుగా చెప్పిన అనేక సద్విషయములను మన పసివారు నేర్చుకొను హక్కు కలిగి ఉన్నారు. ఎవ్వరికీ బాధ కలిగించకూడదని. ఎవ్వరినీ అవమానించరాదని వారికి బోధించవలెను. అట్లు చేయుట వారిని వారే అవమానించుకొనినట్లవుతుంది. "ఇతరులు నీ కేది చేయరాదని కోరుచున్నావో, దానిని నీ వితరులకు చేయరాదు," అనునట్టి ఉత్తమ నీతికి యిది ముఖ్యమైన ధార్మిక సూత్రము. ఏ రూపమును ప్రార్థించినా, అది ఏకైక పరమాత్మకే చెందుతుందని మీరు విని ఉంటారు. దీనికి మరొక అర్థము నేను వివరించుతాను ఆ అర్థమెంత సత్యమో యీ అర్థమంత సత్యము. భగవంతుని ఏ స్వరూపమును నీవవమానించినా. అది ఆ దేవదేవునే చేరుతుంది. సమస్త ప్రాణి కోటి భగవంతునియొక్క వివిధ రూపములని గుర్తుంచుకొనండి. కాబట్టి దీనిని జాగ్రత్తగా మననము చేసి, తదనుగుణ్యముగా సంస్కరించుకొనండి.

— బాబా.

# హృదయ రాగం

భజనలు ఆడంబరము కొరకు కాదు; భగవత్ప్రీతి కొరకే; భగవచ్చింతనతో చిత్తశుద్ధిని సంపాదించు కొనుటకే! అయితే, ఇక్కడ జరిగే భజనలు ఆనందము నందించుచున్నవా అంటే, ... కే మాత్రమూ ...ంచటము ... హృదయములోనుండి భావములు పొంగి పొరలి వచ్చినపుడే, ఆడంబర రహితమై ... అహంకారముచేత కలుషితము కానట్టి, సంకీర్తనమును గావించినపుడే ఆనందము నందించుటకు వీలగును. ఒకరి పై ఒకరు పోటీలు వేసుకొని పాడితే, చుప్పనాతి బుద్ధులు ప్రకటించితే, భజన లే విధముగా రాణించుతవి? ఏ విధముగా భగవంతుని ప్రీతిని సంపాదించుతారు? అట్టి భావనలు అట్టి చర్యలు భజన పద్ధతికే పెద్ద అవమానముగా వుండ గలవు. కాబట్టి, మీకు ఒక చిన్న ఆదర్శమును అందజేయుటకు అభిలషించుచున్నాను.

ఇక డ మాత్రము కాదు, ఏ భజన మండలిలోనైనా, ఏ సమితిలోనైనా, క్రొత్తవారు వచ్చి భజనలలో పాల్గొని పాడినప్పుడు, పాతవారు వారి ననుసరించి పాడటము లేదు; కలిపి పాడినా, అంత ఉత్సాహముతో ఉల్లాసముతో పాడటము లేదు. దీనినే నేను చుప్పనాతి బుద్ధి అన్నాను. పాతవారు పాడి నపుడంతా, పాతవారందరూ అనుసరించి పాడు తారు; పైగా, క్రొత్తవారికి నిరాశను గలుగజేసి, వారిని ఒక ప్రత్యేక గ్రూపుగా ఉంచుతారు. ఈ చెడు భావము నశించి పోవాలి; ఈ దుర్బుద్ధులకు సత్యసాయి భజన మండలిలో స్థానము లేదు. ఎవరు పాడినా, అది భగవన్నామమే కాబట్టి, అందరూ చేరి ఏక కంఠముగా పాడాలి. అట్లు చేయక ఊరికే కూర్చోవటము చూచితే, మీకు నోళ్లు పోయినవా, లేక హృదయములే సిలిచిపోయినవా, అని అడుగ వలసి వస్తుంది. భక్తికీ భేదభావములకూ ఏ మాత్రమూ సంబంధము లేదు. భేదభావములను దూరము చేసు కొని, హృదయ పూర్వకముగా భజనలు చేసిన, అప్పుడు హృదయ రంజకముగా వుండును కానీ భేదభావమనే రాక్షస గుణమును ప్రవర్తించుటకన్న భజననుంచి విరమించుకొనుట వారి కర్తవ్యము

మామూలుగా నిత్యమూ పాడేవాండ్లు కాక, యెవరైన భక్తిప్రపత్తులతో పాడేవాండ్లు వచ్చి అపే క్షించిన, వారికి అవకాశ మీయకపోతే, వారితో సహకరించక పోతే, దానివలన వారికి కాదు అవ మానము, సాయినే తిరస్కరించినట్లగును అని మీరు గమనించవలెను. ఇక్కడే కాదు, ఎక్కడైనా సరే, ఇది నా పాట కాదు, వారిది; నేనెందుకు వారితో చేరి పాడవలెను, అని ఎవరైనా సరే, ఊరకే ఉంటే, అది దుర్మార్గ లక్షణమని చెప్పుట కే అభ్యం తరమూ లేదు సాయి భక్తుల ఆటలు పాటలు నడ కలు అందరకు ఆదర్శములను అందించునట్లుండాలి. సాయి భజన మండలిలోనే భేదభావములు—భజనలో గానీ సేవాకార్యక్రమములలో గానీ, — బయలు దేరిన. ఇంక లోకమును చక్క చేయుట ఎట్లు? ధర్మ సంస్థాపన ఎటు?

ఈ రీతిగా భజన పాటలు పాడటము వలన, మీకు మీరే సంతసించవచ్చును, సంతోషించవచ్చును. అయితే, నాకు ఏ మాత్రమూ సంతృప్తి లేదు ఇక. మీరు ఏమి చేసి ఏమి ప్రయోజనము? ప్రేమతో నిండిన హృదయములనుండి భావశుద్ధితో, అందరూ ఏకమై, భజనలు గావించిన, నాకు ప్రీతి! వినే వారి హృదయములు కూడ కరుగును.

సాయి సంస్థలు భోజనమున కిచ్చు ప్రాధాన్యమును భజన కందించుట లేదు; తమో గుణమే అభివృద్ధియగుచున్నది; అహంకారము ఆడంబరము పెరిగి పోవుచున్నవి. పలుకులను భావముతో చేర్చినప్పుడు మాత్రమే, మీ భక్తి సక్రమమైన మార్గము ననుసరించును. లేకున్న దానిని భక్తి అనుటకు వీలు లేదు.

సంస్థల అధికారులు, భజనలో కాని, సేవాదళములో కానీ, మహిళా విభాగములో కానీ భేదాభిప్రాయములు మొలకెత్తి విషమించుట కవకాశమియ్యకూడదు. సేవను నిర్బంధముగా కాకుండా, ప్రేమ సంబంధముతో అందించిన, అందుకొను వారికి కూడ ఆనంద మగును. పాడేవాండ్లు ఆనందముగా పాడిన, వినేవారికి కూడ ఆనంద మగును. అశాంతితో పాడితే, ద్వేషాసూయలను హృదయము నందు నింపుకొని పాడితే, చెవి పోటుగా నుంటుంది. అందరూ సాయియొక్క పుత్రులు పుత్రికలు! వారిని గ్రూపులుగా విభజించుకొని, ఒకరినొకరు పరాభవము చేసికొనుచు ఏ రీతిగా సంతోషించుతారు? తనకు తాను అనుభవించి ఆనందముగా పాడక పోతే, ఆ పాట అడవి రోదనముగా నుంటుంది. పెదవుల నుండి కాక, హృదయమునుండి రాగము రావాలి. ఆ హృదయ రాగము లేకుండా పాడితే, అది రోగ లక్షణమే అవుతుంది.

బాబా - ప్రశాంతినిలయము 27-10-74.

హృదయ క్షేత్రములనుండి, ద్వేషము మాత్సర్యము, మదము, కోపము లనే మాలిన్యములను తొలగించి పరిశుభ్ర పరుచుకొనుమని అన్ని మతములు ప్రోత్సాహించుచున్నవి. ఈ పరిశుభ్ర పరచుకొను విధానములో విజయ ప్రాప్తికి అన్ని మతములు భగవదను అందించుచున్నవి. అహంకారపూర్ణ మనస్కులందు మాత్రమే, హెచ్చు తగ్గులను భేదభావములు ఉద్భవించును. తానే ఉత్తముడనని, తన మతమే పరమతములకన్న ఉత్తమమైనదని ఎవ్వడు వాదించునో ఆతడు తన విశ్వాసమును కోల్పోయినాడని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఆకులు, పూవులు, ఫలములు-ఇవి ఒక్కొక్క చెట్టున కొక్కొక్క విధముగా నుండును. కానీ, వాటి బోదెలను జాగ్రత్తగా పరిశీలించిన, వాటిలో సారూప్యత కనిపించుచుండుట గమనించగలము. అదే విధముగా, అన్ని మతములందలి మూలసూత్రములలోని ఏకత్వము సాధన వలన వ్యక్తమౌతుంది. అయితే యిది చాలా శ్రమతో కూడిన మార్గము, విధానము. కానీ, ప్రతి మానవుడు, నేడో, రేపో, యీ మార్గమునే స్వీకరించక తప్పదు. ఆధ్యాత్మిక క్షేత్రములందు అడ్డుదారులు నిష్ప్రయోజనము.

— బాబా.

# విశ్వకల్యాణము

అక్టోబర్ 19 వ తేదీ, ప్రశాంతినిలయమందు శ్రీవారి దివ్య సన్నిధిలో దేవాలయ శాఖామాత్యులు శ్రీ సూర నారాయణ రాజుగారు వేదపురుష సప్తాహ జ్ఞానయజ్ఞ మహోత్సవమును ఉద్ఘాటిస్తూ, "వేద పండితులు, పెద్ద పెద్ద విద్వాంసులు, అనుభవజ్ఞులు ఇన్ని వేలమంది భగవత్సన్నిధిలో చేరిన ఈ మహా సభనుద్దేశించి మాటలాడవలెనన్న, నాకు నిజముగా భయము వేస్తున్నది. మన సంస్కృతియొక్క ఆదర్శములను నిలబెట్టుటకు అందరూ ప్రయత్నించవలెనని మాత్రము నేను మనవి చేయుచున్నాను. ప్రపంచమునకే అది అత్యంత మూల్యమైనది. విమానయానమును ఆధునికులు ప్రారంభించునంతవరకూ రామాయణమునందు వివరించియున్న పుష్పక విమానమును ఎవ్వరూ నమ్మలేదు; అట్లనే అటంబాంబ్ హైడ్రోజన్ బాంబ్ మొదలగు మారణాస్త్రముల విషయము తెలుసుకొనువరకూ బ్రహ్మాస్త్రము పాశుపతాస్త్రము మొదలగువాటిని గురించి యెవ్వరూ నమ్మలేదు. పాశ్చాత్యులు యంత్ర మూలముగా సాధించిన సాహస పరాక్రమములను మనవారు మంత్రమూల మునునే సాధించిరి. నిత్యజీవితమందు కూడ, భారతీయ సంస్కృతి కట్టు జుట్టు బొట్టు వీటి ప్రాముఖ్యతను గుర్తించి త్రికరణ శుద్ధిపై యెక్కువ ప్రబోధించినది. ఆంధ్రప్రదేశమునందు పేరు ప్రతిష్ఠలు సంపాదించిన మహా మహా వేదపండితు లనేకులున్నారు: వారిలో చాలా మందిని నే నిక్కడ చూచుచున్నాను; ధన్యుడనైనాను. అయితే, వీరందరూ తమ నిత్యకర్మానుష్ఠానములో నిరతులై తమ గ్రామము లందే నిలచియున్నారు. అవకాశము దొరికినపుడు వారు దేశమంతా వెళ్లి వేదధర్మమును వేదములోని మహోపదేశములను సామాన్య జనులకు చక్కగా బోధించి, భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అవతార కార్యమునందు పాల్గొనవలెనని నేను వేడుకొనుచున్నాను. మన విద్యాభ్యాస క్రమమునందు కూడ భారతీయ సంస్కృతియొక్క ఆదర్శములను పాటించవలసియున్నది. కొన్ని దశాబ్దముల క్రిందట పిల్లలకు చదువు నేర్పుటకు ముందు, ప్రప్రథమముగా 'ఓం నమశ్శివాయ' అని వారిచే వ్రాయించి చెప్పించుట మన సంప్రదాయము. అది ఒక మంత్రోపదేశము; జీవితమంతా ఆ మంత్రము చేతికర్రగా పని చేయును. అయితే యిపుడు కాకి గాడిద అనే పదములే ప్రప్రథమములో బోధింపబడుచున్నవి దీని వలననే దురభ్యాసములు దుర్భావములు అవతరించి అహంకారము, ఆడంబరము, స్వార్థము ఇవి ప్రజా జీవనమందు పెరిగి పోవుచున్నవి వీటినంతను చక్కపరచుట రాజకీయ నాయకుల వలన కాదు. అవతార మూర్తి అయిన భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి ఆశీస్సుల వలనే ఇది సాధ్యమగును" అని చెప్పినారు తరువాత శ్రీవారు తమ దివ్య సందేశము నందించినారు.

త్యాగభూమి. యోగభూమి, కర్మభూమి అని అనాది కాలమునుంచి ప్రపంచ వ్యాప్తిగా కీర్తినొందిన పవిత్ర భారతభూమియందు జన్మించిన మీరందరూ నిజముగా గర్వించదగిన ధన్యజీవులే ; యెందుకనగ, మీరందరు వేదమాతయొక్క సత్‌సంతానము భారతీయుల భాగ్యము వలన శ్రీహరి ఇచ్చటనే అప్పుడప్పుడు అవతరించి దుష్టులను శిష్టులుగా మార్చి సాధు సంతులను ఓదార్చి దరిచేర్చి తన లీలాగుణగణ విశిష్టతను ప్రకటించి ప్రకాశింప జేసి మానవకోటికి మంచి మార్గము చూపి అనుగ్రహించుచున్నాడు.

ఆధ్యాత్మిక క్షేత్రమందు ఇట్టి సత్ కీర్తి నార్జించిన భారతదేశమందు ఈ నాడు అన్యాయ అక్రమ అసత్య అనాచారములు ప్రళయ తాండవము సలుపుచుండగా, అశాంతిలో మునిగి బాధపడుచున్నారు. ఇట్టి పరిస్థితిని తీర్చి దిద్దుటకు సత్యము ధర్మము ప్రేమ నీతి నిజాయితీలను, ఆచరణ రూపమైన ప్రచార ప్రబోధలు సలుపుట, అత్యవసరముగా నున్నది.

భారతీయ సంస్కృతికి వేదమే మూలాధారము. వేదవిహితమైన కర్మలనాచరించుట భారతీయులందరి కర్తవ్యము. అయితే, ఆ కర్మలనుంచి లభించె ఫలిత మేమిటి ? వాటి గమ్యమేమిటి ? అని కొందరు సందేహించవచ్చును. వేదము బోధించు అన్ని కర్మలు మానవత్వములోని దివ్యత్వమును వెల్లడించుటకై యేర్పడినవి కాని వేరు కాదు ; మానవులను అశాశ్వతమైన దేహతత్వమునుండి దూరము గావించి పవిత్ర ఆత్మ తత్వము దగ్గరకు చేర్చుటే వేదవిహిత కర్మల గమ్యము.

వేదమందు ప్రతిపాదింపబడినది సనాతన శాస్త్రమే. దానిని బాగా తెలుసుకొనినవారు ఆచరించినట్లయిన ఫలితము చక్కగా నిరూపితమగును. ఆ ఫలితమే అజ్ఞాన నాశనము ; జ్ఞాన సంపాదన, అంటే సామాన్యమైన లోకజ్ఞానము కాదు ; ఇంద్రియాతీతమైన, బుద్ధికి గోచరము కాని, పరమసత్యమైన మోక్ష జ్ఞానము ; దేనిని తెలుసుకొనిన అన్నియు తెలియునో అట్టి జ్ఞానమునే ఆర్జించవలసి వున్నది.

దీనినే " వేదయతి ఇతివేద :" వేదము తెలుపును, జగత్తత్త్వము మంత్రములపై ఆధారపడియున్నది ; ధర్మార్థకామ మోక్షములనే పురుషార్థములకు పవిత్రత నొసగునది కూడ వేదమే. పరమాత్ముని భౌతిక స్వరూపమును దైవస్వరూపమును మంత్రములు వశము చేసుకోగలవు.

క్రతువులయందు ఇంద్రాయస్వాహా, సూర్యాయస్వాహా, వరుణాయస్వాహా, దేవతాయస్వాహా అని ఉచ్చరించి అగ్నిహోత్రమునందు హోమద్రవ్యములను వేయుదురు. అప్పుడే ఆ ద్రవ్యములు సంపూర్ణముగా దగ్ధమగును అనునది సత్యము. అయితే, ఒక సందేహము బయలుదేరవచ్చును. అట్లు చెప్పకనే, అగ్ని అన్నిటినీ సహజముగా దగ్ధము చేయునే, మరి చెప్పుట యెందుకు, అని ! ఆ పదములు ఉచ్చరించుట వలన దివ్య తేజస్స్వరూపుడైన అగ్నిదేవునికి సంతృప్తి కలుగును, ద్రవ్యములను అతడు గ్రహించి, ఏయే దేవతలకు దానిని అందించవలెనో, ఆయా వారలకు సంతోషముగా అందించుటకు పూనుకొనును, అనునదే దాని అంతరార్థము. అగ్ని మాత్రమే కాదు, పంచభూతములు, ప్రకృతిలోని అన్ని వస్తువులూ దైవాకారములే ; దైవ స్వరూపులే ! దివ్యమూర్తులే !

కాళిదాసు కుమార సంభవ కావ్యమందు పర్వత చక్రవర్తి అయిన హిమవంతుని దైవస్వరూపునిగా స్తుతించి ఆనందానుభూతిని పొందినాడు. హిమాలయములోని నదీనదములు వన్య వృక్షములు అన్నిటినీ

దివ్య తేజోమయముగా వర్ణించి ఆదరించినాడు. అన్ని దైవ స్వరూపములకు వేదమందు అగ్నియే ప్రాణ స్వరూపము కాబట్టి, స్వాహా మంత్రోచ్చారణముతో యేది అగ్నిలో ఆహుతి చేసినను, అది వారికే కాక వారి మూలముగా ఆయా దేవతలకు చెందు ననునది వేదప్రమాణము.

మరొక విషయము, "అనంతావై వేదాః" వేదములు అసంఖ్యాకములని శ్రుతులే చెప్పుచున్నవి. ఒక వేదమును తెలుపుటకై ఇన్ని వేదములెందుకు అని కొందరు ప్రశ్నించవచ్చును గానీ, చిన్న పిల్లలకు పదములను నేర్పుటకు ప్రయత్నించినప్పుడు, పదము యొక్క అర్థమును బాగా తెలుపుటకొరకు, యెన్నో పదములను ఉపయోగించే అవసరమున్నది కదా! ఆకలి తీర్చుటకు కావలసినది అన్నమొకటి చాలు. అయినను, అన్నము ఇంకా రుచికరముగా సంతృప్తిగా ఉండుటకొరకు అనేక రూపనామములతో అన్నమునే రకరకాల పదార్థములుగా చేసి అందించుచున్నాము కదా. వేదమాతయొక్క ఉపదేశములను వ్యాప్తిగావించు నిమిత్తము, దానిని అనుభవింప జేయు నిమిత్తము, అనేక వేదముల నందించుటకు వేదమాత పూనుకొనినది.

పరబ్రహ్మమునుంచి బ్రహ్మము, బ్రహ్మమునుంచి కర్మ. కర్మలవలన పర్జన్యుడు, పర్జన్యుని వలన వర్షము ; వర్షము వలన అన్నము. అన్నమునుంచి జన్మము—ఇవి సృష్టియొక్క చరిత్ర. కాబట్టి, వేద విహిత కర్మలవలన పర్జన్యుడు తృప్తిచెంది వర్షమును కురిపించి అన్నమును అభివృద్ధిగావించును దానివలన సుభిక్షము, సుఖశాంతులు, లోక కల్యాణము చేకూరును. ఇదియే క్రతువుల నాచరించుటలోని వుద్దేశము

వ్యష్టి కాని సమష్టి కాని, మంచి చెడ్డలను నిర్ణయించుటకు కర్మలే కారణము ; దేహమందు యెంత వేడి యున్నదని నిర్ణయించుటకు థర్మామీటరును వుపయోగించుచున్నాము. మనసులోని మంచి చెడ్డలను కర్మల ద్వారా తెలుసుకొంటున్నాము. కర్మలే గుణములను నిరూపించును తాను చేయు కర్మలను పురస్కరించుకొని వాడు పశువు, వీడు పశుపతి అని నిశ్చయించుకొనవచ్చును.

కర్మలను చేయక యెవ్వరూ ఒక క్షణమైననూ ఉండ జాలరు. అయితే, చేసే కర్మలను స్వార్థ రహితముగా నిర్వర్తించుటకు ప్రయత్నము చేయవలెను, అదే పెద్ద సాధన. ఫలనిమిత్తముగా కర్మ చేయకూడదు : కర్మనిమిత్తమే కర్మ చేయవలెను. ముల్లును ముల్లుతోనే తీయవలెను ; వజ్రమును వజ్రముతోనే కోయవలెను. అదే రీతిగా చెడ్డ కర్మల వలన అనుభవించవలసి వచ్చిన బాధను మంచి కర్మల చేతనే రూపు మాపవలెను, సత్కర్మతోనే దుష్కర్మల ఫలితమును జయించవలెను.

ఈ విధానమును ఆచరించకపోవుట చేతనే, దేశము ఇన్ని అవస్థలకు అల్లకల్లోలములకు అశాంతికి ఆలవాలమైయున్నది. దేశమనగా మట్టి మట్టి కాదు ; మానవ సమూహమే; దేశములో పుట్టి పెరిగి పరంపరగా వచ్చిన సంస్కృతి సంప్రదాయములచే పుష్టిని తుష్టిని అందుకొనుచున్న ప్రజానీకమే ! ప్రజల పవిత్ర ప్రవర్తనలు, సద్భావములు, సత్చింతనలు అందరినీ ఆనందింప జేయును. వారి నడకలు వారి పలుకులు వారి నమ్మకములు పరిశుద్ధముగా వుండవలెను అప్పుడే సుఖశాంతులు దేశమందు తాండవించును.

ఒకానొక సమయమునందు ప్రజలలో త్యాగశీలము స్వార్థరహితమైన సేవలు క్షీణించి, అహంకార మమకారములు అభివృద్ధియగుట వలన, వేదము కృష్ణమృగరూపమును ధరించి, అరణ్యము లోనికి పరుగెత్తి

నదట కాని మహర్షులు వేద పండితులు మహనీయులు దానిని అనుసరించి, ఎంతో ప్రయత్నించి దాని చర్మమును మాత్రము తమతో తీసుకొని రాగలిగినారట ! ఈ సంఘటనను పురస్కరించుకొని, ఈ నాడు కూడ వేదవిహిత యజ్ఞములను ఆచరించు సమయమున ఋత్విక్కులు కృష్ణమృగ చర్మమును ధరించి ఆ జింక చర్మముపై ఆసీనులై, అగ్నిదేవునికి ఆరాధన సలుపుదురు. బాహ్యదృష్టికి అది చర్మము అయితే, యజ్ఞదృష్టికి అది శర్మము. శర్మము అనగా ఆనందము సుఖము అని అర్థము. యజ్ఞమునందు పాల్గొనువారు, తాముఆనందించి అందరికీ ఆనందమును సుఖసంతృప్తులను అందింతురు.

ప్రశాంతినిలయమందు ఆచరింపబడే యజ్ఞమునకు ఫలత్యాగ స్వరూపమైన ఆనందమే గమ్యము ! ఈ క్రతువు ఒక వ్యక్తి నిమిత్తము కాదు; ఒక దేశమునకు సంబంధించినది కాదు. ఇది లోక కల్యాణమును విశ్వకల్యాణమును ఆశించి స్వార్థరహితముగా ఆచరించే క్రతువు. సర్వులకు సద్బుద్ధినే కూర్చుము అని ప్రార్థించుటయే మీ కర్తవ్యము. సబ్ కో సన్మతి దే భగవాన్, అని గాంధి దేవుణ్ణి ప్రార్థించే వాడు అదే నిజమైన స్వార్థరాహిత్యము. దానినే మీరు అనుసరించవలెను.

# పద్మ వ్యూహము

వ్యష్టి జీవుడగును; సమష్టి ఈశ్వరుడు. రెండూ నశ్వరములే! యెందుకనిన, రెండూ కార్యములే! కారణ స్వరూపుడైన నిర్గుణ బ్రహ్మము మాత్రము మార్పు లేక, నిశ్చలముగా నిలచియుండును.

జీవులలోనూ పారమార్థికము, ప్రాతిభాసికము, వ్యావహారికము అని మూడు విధములున్నవి అయితే, ఇవి మూడూ, జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలవలె, నీటిలోని అలలు నురుగులవలె, బాగా పరీక్షించునపుడు ఏకస్వరూపముగనే కనబడును. నీటిని విడిచి అలలు లేవు; అలలను విడిచి నురుగు ఉండదు. నీటిలో అలలు కల్పితము; అలలో నురుగు కల్పితము. అట్లే, పారమార్థికమునుంచి ప్రాతిభాసికము, ప్రాతిభాసికమునుంచి వ్యావహారికము ఒకటి మరొకటికి ఆధారము. పారమార్థిక జీవుడైన కూటస్థుడు ప్రాతిభాసికమునందు ప్రతిబింబించును; ప్రాతిభాసికము వ్యావహారికములో ప్రతిబింబించును.

కూటస్థు అంటే, యెట్టి అవస్థలో కూడనూ మార్పు చెందనివాడు. అని అర్థము. ఆహార నిద్రా భయ మైథునాదులను దూరము చేసి, 'అహం బ్రహ్మాస్మి' అనే నిత్యానంద స్థితిలో నిలచి యుంటాడు.

ఇట్టి పవిత్ర స్థానమును, ఇటువంటి బ్రహ్మజ్ఞానమును పొందే నిమిత్తము మానవుడు అనుసరించవలసిన కర్తవ్యమేమిటి? అని అందరూ గుర్తించాలి. దీనికే సాధన చతుష్టయమును నిర్ణయించి యున్నారు.

నిత్యానిత్య విషయ పరిశీలన, ఇహాముత్ర ఫల భోగ విరాగము, శమదమాది షట్సంపత్తి, ముముక్షుత్వము. ఇవి నాలుగు చేరి సాధన చతుష్టయమనబడును. శ్రుతి స్మృతి శాస్త్రేతిహాస పురాణాదులను పఠించి, వాటిలోని నిత్య సత్యములను గ్రహించి, స్వానుభవములో బ్రహ్మ సత్యం జగన్మిథ్య

అనే స్థితియందు అంతఃకరణమును స్థిరముగా నిలపటమే ఈ పరిశీలనయొక్క సార్థకత! ఈ లోకమందు కానీ మరోలోకమందు కానీ దొరకే విషయానందము తుచ్ఛము. కేవలము స్వప్న దృశ్యము లవలె అనిత్యము అని గుర్తించగల శక్తిని పొందటమే ఫలభోగవిరాగము. కలలోని మేడలు, మిద్దెలు కన్నులు తెరచిన తక్షణమే లేవు కదా! కన్నులు విప్ప జాగ్రదవస్థలో కనబడే దృశ్యములు కలలో అసత్యమై తోచును: కలలోని దృశ్యములు జాగ్రత్తలో అసత్యము. ఈ పుట్టుటకు పూర్వము యే దేహములో నివసించి వాని చెప్పుటకు వీలుకాదు; గతించిన తరువాత ప్రాప్తించే దేహము యెట్టిదో యెవరు చెప్పగలరు?

కాన, ఆ యా కాలములకు ఆ యా అవస్థలు సత్యము, అని మాత్రము అర్థము చేసుకోవాలి. జగత్తునందు దృశ్యకల్పితమైన అనుభూతులు కేవలము మిథ్యా స్వరూపమని, లేక, స్వప్న స్వరూపమని అర్థము చేసుకోవలెను.

అంతవరకూ పోనక్కరలేదు. మీ మీ నిత్యానుభవమును స్మరించితే జగత్తు మిథ్య అనే విషయము స్పష్టమగును. అనేక మంది ప్రత్యక్ష ప్రమాణమును అంగీకరించి ఆదరింతురు. అయితే, వేదాంతము ఇంద్రియముల ప్రమాణమును ఏ మాత్రమూ అంగీకరించదు ఈ నాడు మీరందరూ ఈ ఆడిటోరియములో కూర్చొని స్వామియొక్క మాటలను పండితుల మాటలను శ్రవణము చేసికొని, హృదయముతో అందుకొని, ఇది సత్యము, అసత్యము కాదు, అని విశ్వసించవచ్చు! కొన్ని గంటలు గడచిన తరువాత, ఈ సమావేశము ముగించిన తరువాత, మీరు భోజనము చేసుకొని, ఇదే ఆడిటోరియమునందు పవళించి నిద్రించు సమయమునందు మీకు ఒక కల వచ్చును. మీ దేహము ఇచ్చటనే నిద్రించుచున్నది కానీ, ఆ కలలో మీరు కలకత్తా నగరమందో ఢిల్లీలోనో బొంబాయిలోనో తిరుగుచూ షాపింగ్ చేయుచున్నట్లుగా అనుభవమగును. స్వప్నావస్థలో కనుపించే ఆ దృశ్యము సత్యము కాదని మీ కే మాత్రమూ తోచదు.

జాగ్రదవస్థలో ఆడిటోరియములో అనుభవించినవన్నీ సత్యమే! స్వప్నావస్థలో కలకత్తా ఢిల్లీ బొంబాయిలలో తిరుగునది కూడ సత్యమే! అది ఎట్లు అని విచారణ సలిపితే, మీకే స్పష్టమగును; రెండవస్థలలోనూ ఉండేది మీరే, కాబట్టి, మీరే సత్యము. జాగ్రదవస్థలో కనుపించినది Day dream (దివా స్వప్నము), పగటి కల. నిద్రావస్థలో కనిపించినది Night dream (నిశా స్వప్నము) రాత్రికల. అంతే వ్యత్యాసము! రెండిటియందును రెండు విధములుగా ఉండునది సత్యము కాదు. రెండిటియందును ఒకే రీతిగా వుండినదే సత్యము. Truth is one, not two.

కనుకనే సత్యమును, మిథ్యను, గుర్తించి, ప్రబోధించి, మానవులకు నిత్యసూక్తులను అందించి నిత్యములో చేర్చునిమిత్తము శంకరుడు తన జీవితమును అంకితము చేసినాడు. దీనిని పురస్కరించుకొని, "బ్రహ్మ సత్యం, జగన్మిథ్య" అని వారు తెలుపుతూ వచ్చినారు. సత్యములోనూ మిథ్యలోనూ పరమాత్ముడున్నాడు! అదే పరమ సత్యము. సత్యము కానిది మిథ్య. కానీ, మిథ్య అని వేరొక పదార్థము ఎక్కడా లేదు! చీకటి అంటే, వెలుతురుయొక్క అభావమే, కాని, ప్రత్యేకమైన మరొక వస్తువు కాదు. ఉన్నదొక్కటే! రెండవది వట్టి భ్రమ.

ఆ ఒకటి ఏ రీతిగా రెండుగా మారినది అనేదానిని ముదిగొండ పిచ్చయ్య శాస్త్రిగారు ఇపుడు విశదీకరించి నారు. బొగ్గులో అగ్ని చేరితే, ఏ విధముగా వేడి ప్రకాశము మొదలైన గుణములు చేరునో, అట్లే జీవి యందు అహము చేరినప్పుడు, గుణభూష్టముగా కను పించును, అన్నారు అయితే, మీరు మరొక విష యమును కూడ గమనించవలెను. ఆ బొగ్గుకూడ అగ్ని చేరటము వలననే తయారయినది. అదే విధ ముగా అహము చేరుట వలననే (ఏకోహం బహు స్యాం) జగత్తు జగత్తులోని సమస్త వస్తువులు ఉద్భవించినవి.

అహం చేరినందువలన, జీవితమే ఒక పద్మవ్యూ హముగా మారినది, అని కూడ శాస్త్రిగారన్నారు. కుంభజుడు పద్మవ్యూహమును కురుక్షేత్రమందు తయారు చేయగా, అర్జునుడు లేని సమయమందు కుమా రుడు అభిమన్యుని, దానిని ప్రవేశించి భేదించుటకు ఆహ్వానించినారు, కౌరవులు. ఇట్టి పిలుపును నిరా కరించుట క్షత్రియ వీరులకు తగదు. తనను ఆశీ ర్వదించి పంపమని కుమారుడు తల్లిని ప్రార్థించగా, ఆమె, "నీ తండ్రి ఇక్కడ లేడు, నీ భార్య గర్భ వతి" అని రెండు విధములైన అర్థములు చెప్పినది.

ఆ మాటల గూఢార్థమేమనగా, మమకారము, అభి మానము అనే రెండు ఆటంకములను దాటితే తప్ప, కుంభజుడు (ప్రజ్ఞానం) పన్నిన పద్మాగమును నీవు జయించుటకు వీలు కాదు, అని. అర్జునుడు ఒకడు మాత్రమే పద్మవ్యూహమును భేదించి బయ టకు వచ్చుటకు సమర్థుడు, అని మహాభారతములో చెప్పబడియున్నది. దీని అర్థమేమనిన, అర్జునుడు అనగా నిర్మల చిత్తుడు, నిష్కళంకుడు, చిత్తశుద్ధిగల వాడు; కాబట్టి, "ప్రజ్ఞానం బ్రహ్మ" అని చెప్ప బడే బ్రహ్మమును తెలుసుకొని, బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి, అనే పవిత్ర స్థానమును చేరు టకు చిత్తశుద్ధి ప్రధానమైనది; చిత్తశుద్ధి వలననే జ్ఞాన శుద్ధి. అయితే భగవంతుని మరచి, లోకమునే మతి యందుంచుకొనిన వారికి ఎట్టి శక్తిసామర్థ్యము లుండినా, ధనబలము భుజబలము అధికారబలము లుండినా, అంతర్దృష్టిలో మమత అహంకారములుం డుట వలన, అశాంతి తప్పదు.

శ్రీబాబావారిదివ్యోపదేశము, 23-10-74

---

# హెచ్చరిక

పవిత్రాత్మ స్వరూపులారా !

నేడు స్వామి పుట్టిన దినమని అనేక రకములైన ఆనందములలో మీరు ఉత్సాహముగా ఈలాంటి కార్యక్రమములో పాల్గొనవచ్చినారు. కానీ, నిజముగా పుట్టిన దినము చేసుకోవటము కాని జన్మదినము జరుపుకోవటము కాని ఏనాడూ నా కిష్టము లేదు. నేను కేవలము మానవునియొక్క జీవిత తత్వాన్ని, మానవుని రహస్యాన్ని, స్వానుభవములో, అనగా, ఆచరించి అందించే నిమిత్తమై వచ్చినవాడనే కానీ ఏదో Birth Day జరుపుకోవటము, ఆడంబరమైన కార్యక్రమములు జరుపుకోవటము, దీనికంతా ఈ జీవితానికి ఎప్పుడు కూడను ఏ విధమైన ఆశలూ లేవు.

మీ అందరు కూడ ఏనాడు సత్యమైన ఆనందమును అనుభవింతురో ఆనాడే నాయొక్క పుట్టిన దినము, అదే నాకు ఆనందము. అంతే కాని, మీ హృదయములు ఎంతో అల్లకల్లోలముగా అనేక కష్ట నష్టములతో దుఃఖములతో విచారములతో నిండిన సమయములో నాకు పుట్టిన దినము అని చెప్పుకోవటము కేవలము అర్థము లేనట్టిదిగా వున్నది.

దీనిలో మరొక విషయమును కూడ మిమ్ము హెచ్చరించవలసినది అత్యవసరము. నా విషయము మీరు తెలుసుకోవటములో కాలహరణము చేయకండి; కాలమును వ్యర్థము చేయకండి. కారణమేమనగా, నాయొక్క విషయము తెలిసికోవటము యెవరికీ సాధ్యము కాదు! కనుక, తెలుసుకోవటానికి సాధ్యము కాని విషయమును తెలుసుకొనే ప్రయత్నమునకు పూనుకొనిన కాలహరణమే కాకుండ, కాయమును కూడ వ్యర్థము చేసుకొన్నవారవుతారు. మిమ్మలను మీరు ఏ నాడు తెలుసుకో గలరో, ఆ నాడే నన్ను తెలుసుకోనటానికి సాధ్యమవుతుంది.

నాకు ఈ లోకములో కావలసినది ఏ మాత్రమూ లేదు. నేను ఏ నాడు కూడ ఏ కార్యమును కానీ ఏ వస్తువును కానీ ఆశించిన క్షణము లేదు. నేను కేవలము ఇచ్చుకోవటానికి వచ్చినట్టివాడను కానీ పుచ్చుకోవటానికి వచ్చినవాడను కాను. నాకు మీరు ఇవ్వవలసినది ఒక్కటే! మీ నిర్మలమైన ప్రేమను ఇచ్చినపుడు, అదే నాకు తగినటువంటి ఆనందము.

గడచిన దసరాయందు కొన్ని రకములైన ప్రకటనలను చేసినారు. అయితే, వాటికీ స్వామికీ ఏమైనా సంబంధమున్నదా అని మీరు విచారించినపుడు పేరు మాత్రమే సంబంధము కాని, స్వామికి ఏలాంటి సంబంధమూ లేదు.

ఈ నాడు లోకములో యువకులు అనుసరించే పెడమార్గములను పురస్కరించుకొని, సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ వారు అనేక ప్రాంతములందు

కాలేజీలు స్థాపించి, తద్వారా అనేక రకములైన సంస్కారములను వారలకు కలిగింప జేసి, భారతీయ సంస్కృతిని నిలబెట్టి, సర్వమత సమ్మతమైన సత్యాన్ని ప్రబోధించే నిమిత్తమై వారుగా సంకల్పించు కొన్నారు దీని నిమిత్తమై స్వామియొక్క 50 వ సంవత్సరము పుట్టిన పండుగ అత్యంత వైభవముగా చెసుకోవాలని భక్తులయొక్క ఉత్సాహము చేత, వారు కమిటీలో కొన్ని నిర్ణయములు చేసుకొన్నారు.

అందువల్ల, కళాశాలలు స్థాపించే నిమిత్తమై దానికి, ప్రపంచములో ధనము లేక ఏ చిన్న కార్యము కూడ జరుగటానికి వీలుండదు కనుక, వారు ఒకొక వ్యక్తి జీవితమునకొక్క పర్యాయము 50 రూపాయులు ఇచ్చి నప్పుడు, దానినంతా ఒక ఫండుగా చేసి విద్యాసంస్థ లను, ఆరోగ్య సంబంధమైన సంస్థలను, అభివృద్ధి చేయవలెననే ఉన్నత భావాల చేత పవిత్ర హృద యాల చేత నిర్ణయించుకొనినారు. ఈ విధమైన నిర్ణ యాన్ని కమిటివారు తెచ్చి నా దగ్గర వప్పగించారు.

దానికి నేను ఈ విధమైన జవాబు చెప్పినాను; నాయనా! ఒకరి వలను కేవలము ధనము వస్తుంది కదా అనే ఉద్దేశము చేత గుట్టుగా వసూలు చేయుటకు పూనుకొనకండి; బట్టబయలుగా చెప్పి, ప్రపంచానికి గానీ, ప్రభుత్వానికి గానీ, వ్యక్తులకు గానీ, ఎట్టి సందేహములకు కూడనూ అవకాశము లేని మార్గమును అవలంబించటము మంచిది అని నేను వారికి ప్రబో ధించినాను. అందువలన, వారు ఆ నాడు (announcement) ఒక ప్రకటన చేసినారు,

దీనిని పురస్కరించుకొని, అనేక మంది, అర్థాలును కల్పించుకొని, కేవలము అనర్థాలనే కల్పించుకొని, స్వామియొక్క పుట్టిన పండుగ ఆచరిం చుటకు 50 లక్షలు ఖర్చు పెట్టుతారు అనే ఒక్క ప్రచారము కూడ కొనసాగించుకొనుచూ పోయినారు.

నిజముగా పుట్టిన దినమునకు గానీ మరే విధమైన వ్యక్తి సంబంధమైన భోగమునకు గానీ 50 లక్ష రూపాయలు వృథా ఖర్చు పెట్టుతున్నారంటే, అంత కంటె మహాపాపము మరొకటి ఉండదు. లోకములో అన్నము లేక, గృహములు లేక, అనేక అవస్థలు పడే మానవులు కోటానకోట్లున్న సమయములో, ఒక వ్యక్తి పుట్టిన పండుగ కోసము 50 లక్షలు ఖర్చు పెట్టుకొన్నారంటే, ఇంతకంటె మహా పాపము, ఇంత కంటె మహా దుర్వినియోగము మరొకటి ఉండదు ఈ లాంటిదానికి నేను ఏ నాడు కూడనూ పాల్పడను.

ఇంతియే కాదు, ప్రశాంతి నిలయములో జరుగే ఒక శివరాత్రికి గాని, నవరాత్రికి గానీ, మా ప్రశాంతి నిలయము తరపున కొంతవరకు కూడ దుర్వినియోగము ఏ నాడూ జరగదు. దసరా మహోత్సవములో ఇక్కడ లక్షలు ఖర్చయినాయి అని అనేకులు అనుకో వచ్చు కానీ, అందరు కూడనూ హృదయపూర్వకముగా దేహరీతిగా ఆచరించే పనులు తప్ప, ఒక నయా పైసా కూడ మాకు ఖర్చు లేదు. వచ్చే ఋత్విక్కులు కానీ, ఇచ్చే ఉపన్యాసకులు కానీ, ప్రశాంతి నిలయమునకు కేవలము ప్రేమతో వచ్చినారు. ఇట్లు ఆచరించట ము వలన, ఎవరికి ఏ విధమైన అనుకూలము జరిపే దానిలో, వాటినంత సేవాదళము వారు, సేవాసమితి వారు, వాలంటీర్లు హృదయపూర్వకముగా శ్రమ దేహములను అర్పితము చేసి పనులు గావించటము తప్ప వారికి నయాపైసా కూడ ఏ మాత్రమూ ఖర్చు పెట్టటము లేదు. ఈ నాడు మా ప్రశాంతి నిలయ ములో ఇంత పరిశుద్ధ ప్రదేశముగా మీరు అనుభవిస్తు న్నారంటే దీనికి యెవరు కారణము, యెంత మంది స్వీపర్లను పెట్టినాము? యెంత మంది కూలీలను పెట్టినాము? యే మాత్రమూ లేదు. యెవరెవరు వారి వారి స్థానములను ప్రదేశములను వారే పరిశుద్ధ

పరచుకొంటున్నారే తప్ప. దీనికి నయాపైసా ఏ మాత్రమూ ఖర్చు లేదు. ప్రశాంతి నిలయములో వినియోగింప బడేటటువంటి సద్వినియోగములు ప్రపంచములో యెక్కడకూడ లేదని చెప్పవచ్చు.

ప్రశాంతి నిలయము ఐహికముగా ఆముష్మికముగా కైవల్యముగా నైతికముగా భౌతికముగా ధార్మికముగా ఆధ్యాత్మికముగా లౌకికముగా రాజకీయముగా కూడనూ, ఆదర్శవంతమైన దానినే నిరూపిస్తున్నది కానీ అనర్థమైన దానికి ఏ మాత్రమూ చోటివ్వటానికి వీలు లేదని గట్టిగా చెప్పటములో యే మాత్రమూ సందేహము లేదు.

దివ్యాత్మ స్వరూపులారా! కేవలం మీకు కొంత దానధర్మము చేయాలని ఆశ కలిగియున్నప్పుడు విద్యా విషయములందు కాని ఆరోగ్య విషయములందు కానీ దీనులయందు కానీ, ఇట్టి పవిత్ర కార్యములో మనస్సును అభివృద్ధి చేసుకొని పాల్గొనటములో యెట్టి అభ్యంతరమూ లేదు.

ఇక్కడే కాదు. ఎక్కడైనా సరే, బీదలకు సహాయము చేయుటకు విద్యార్థులకు సహాయము చేయుటకు అనారోగ్యులకు తగిన సహాయము చేయుటకు మన సంస్థల వారు సంసిద్ధంగానే వుండాలి. అట్టి కార్యమునే మీరు నాయొక్క వాక్యముగా భావించుకోవాలి.

నాకు యే మాత్రము ఇష్టములేదు. ఈ లాంటి సంస్థలలో జరిగినట్టి పరోపకారసంబంధమైన ధర్మకార్యములలో పాల్గొని మీరు జన్మ సార్థకము చేసుకోవటములో ఎట్టి అభ్యంతరమూ లేదు.

మీ కందరికీ తెలిసిన విషయమే; నేను ఏ మాత్రమూ ఇక్కడ ఒక ఫలము కాని పుష్పము కాని ఒక కొబ్బరికాయ కానీ ప్రవేశింప చేయుటకు లేదు. కానీ, కొంత మంది వారి భక్తి ప్రపత్తుల వలన, వారి ఉద్రేకముల వలన, వారి ఉత్సాహము వలన, పోస్ట్ ద్వారా లేక ఇక్కడికి వచ్చిన తరువాత, నాకు పత్రములను తెచ్చి పెట్టుచూ వుంటారు. ఈ నాటినుంచి అవి కూడ యెవ్వరూ తేరాదని నాయొక్క ఆనతి! దీనిని పెద్ద ఆజ్ఞగా భావించి, మీరు పాలించాలి. ఎవరైనా తెచ్చినారంటే వారిని ప్రశాంతినిలయమందు చేర్చుటము లేదు; వారిని స్వామి ఆజ్ఞ మీరినవారుగానే చూస్తాము. నాకు కావలసినది మీ నిర్మల ప్రేమ. కాబట్టి ఈ నాటి నుంచి, పరోపకార సంబంధమైన కర్మలయందు మీ జీవితాలను సార్థకము చేసుకొంటారని నె నాశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

**శ్రీవారి జన్మదిన దివ్యోపన్యాసమునుండి, ప్రశాంతినిలయము, 23-11-74.**

---

కాంక్షతోడ నెవడు కర్మంబు లొనరించు
దక్కబోదు ఫలము ధరణియందు
కాంక్ష వదలి భక్తి కర్మలుపచరించ
ఫలితమొసగుచుండు పర్తి విభుడు.

# సమచిత్తము

సర్వ భూతదయయే అన్నిటికీ ఉత్తమమైన పుణ్య కర్మము; జీవహింసయే పెద్ద పాపము. నారు పెట్టిన దైవము నీరు పోయక పోడు. ఈ సత్యమును తెలుసుకొని, అందరిపై ప్రేమను ప్రసరించి తాను ఆనంద పడి ఇతరులకు ఆనంద మందించవలెను. ఇదే సార్థకమైన జీవితమార్గము.

జగత్తునందు మానవులు సుఖదుఃఖాలను అనుభవించుటకు వారి దృష్టిలోని దోషమే మూలకారణము. పరదోష శ్రవణమునకు చెవులు సదా సిద్ధముగా నుండును; దేనిని గురించి నిందించునో, విచారించునో, అవే చిత్తమునందు హత్తుకొనును అని యోచించక, దోషములనే చింతించి దోష భూయిష్ఠమైన జీవితములనే రూపొందించుకొని బాధపడుచున్నారు.

సర్పములకు రెండు ప్రధాన గుణములున్నవి. ఒకటి: అది తిన్నగా నడువకుండ, వంకర టింకరగా నడుచును. రెండవది: అట్లు సంచరించే సమయమునందు, ఏది చిక్కిన దానిని కరుచుచూ వెళ్లును. మానవులూ అంతే! తమ అభీష్టముల ప్రాప్తికి అడ్డము వచ్చిన వారందరినీ హింసించు స్వభావము, భయము పెట్టి వారికి బాధకలిగించడము, మానవుల సహజ స్వభావము.

సర్పము విషమయము; మానవులు విషయమయము! విషయము విషము బింబ ప్రతిబింబములు! అని రెండూ కవలలు! (Twins).

అయితే, విషసర్పమును నాగస్వర గానముతో పట్టవచ్చు! అట్లనే, విషయ వాసనలో పడిన మానవులను నామస్మరణ వలన పట్టవచ్చు! ఆ గానము వలన విషమణగిపోవును: ఈ స్మరణ వలన విషయ వాంఛలు నశించును. విషమయమైన మనస్సును, అమృతమయముగా మార్చుటే అన్ని సాధనల యొక్క పరమ లక్ష్యము.

దీనిని సమచిత్తమును సాధించుట అని కూడా చెప్పవచ్చును. ప్రకృతి పరిణామ మయము, నిరంతరము మార్పు చెందుచునే వుండును. వంట చేసినప్పుడు తియగా పవిత్రముగా రుచివంతముగా నుండు పదార్థములు కొంత సమయము గడచిన తరువాత, విషమయ మగును; కాలము గడచు కొలది వాటి స్వరూప స్వభావములు మార్పుచెందును. అట్టి మార్పులు రావలననే మానవులు నిరీక్షింతురు కూడ! ప్రకృతిలోని వస్తువులలో మార్పులు సంభవించకుండిన యెవరికి తృప్తియుండదు. పుట్టిన బిడ్డ పెరగకుండిన తల్లిదండ్రులు కంగారుపడి వైద్యమును నడుపుతారు. నిజముగా ఆపేక్షలు అభీష్టముల వలననే, విషయాపేక్ష అధికమగును; వాంఛలు పెరిగితే, బాధలధిక మగును; ఆనందము కరుగును.

పుట్టిన బిడ్డకు, ఆకలి దప్పులు తప్ప, మరెట్టి విషయ వాసనలు లేవు; కాబట్టి దానికెప్పుడూ ఆనందమే! అమృతపుత్రుడు కాబట్టి, అది ఆనందముగానే తేలుచుండును. దాని చిత్తము సమచిత్తముగానే వుండును.

సమచిత్తమనగా, లోకరీతిగా కాక, కష్టనష్టములను సమముగా భావించి సుఖదుఃఖములకు పొంగక క్రుంగక జీవించటమే! అయితే, సమము అనే పదమునకు బ్రహ్మము అనునట్టి మరొక అర్థమున్నది. బ్రహ్మమందు లగ్నమైన చిత్తమునకు సమచిత్తమని పేరు.

మానవుడు అమృతమయుడుగా పుట్టినను, అనృతమయుడుగా పెరిగి, జీవితమును పాడుచేసుకొనుచున్నాడు. విషయవాసనలను త్యాగము గావించినచో పరమాత్మ తత్త్వముగా తానే వెలుగును. ఇప్పుడు అహం అహం అనే పొగరు బోతుతనము మానవులను దానవులుగా తయారు చేయుచున్నది. అహం అనే పదముయొక్క నిజార్థమును తెలుసుకొని దానికి తగినట్లు తన నడకను తీర్చి దిద్దికోవటమే మానవుని కర్తవ్యము. ఆస్యచ హస్యచ సమాహారం అహః, అని శాస్త్రము చెప్పుచున్నది. అః (విష్ణు) హః (శక్తి), శక్తితో కూడిన విష్ణువునే అహం పదము గుర్తించుచున్నది. "మయాకృతం ఇదం సర్వం", నా వలననే ఈ సృష్టి స్థితి లయములన్నీ కలుగుచున్నవి అని దీనికి అర్థము.

అంతా తానే అయినప్పుడు, జీవులూ బ్రహ్మమే! కనుక, మంచి చెడ్డల కేమాత్రమూ స్థానము లేదే? అయితే, మంచి చెడ్డలు కనిపించుచున్నవే? అనుభవములోనికి వచ్చుచున్నవే? అని కొందరు సందేహపడవచ్చు. అయితే, అన్నియు అతనే అని, వాసుదేవ స్సర్వమిదం అని తెలుసుకొనిన తరువాత కదా, సమత్వము ఏర్పడేది? దేహమే తాను, అని అనుకోవటము వలన, ఇది మంచి ఇది చెడు అనిపించునే కాని, ప్రహ్లాదునివలె, నారాయణ భావమును అభివృద్ధి చేసుకొనిన, నామరూప భావముల నతిక్రమించిన, ద్వైతమే వుండదు. ప్రహ్లాదునికి ప్రపంచమంతా పదమే కానీ పదార్థము కాదు! ప్రపంచమంతా ఒక పదమునుంచి పుట్టినదే; ఆ పదమునకు అర్థరూపములుగా సృష్టియంతా వివిధమై వికసించినది. అంతే! పదము పదార్థములుగా కనిపించునది, దృష్టి దోషము వలన కాని, వేరు కాదు. అన్నిటిలోనూ ప్రసరించే పరాశక్తి ఒకటే.

దివ్యాత్మ స్వరూపులారా! నేడు మానవుని మనస్సు ఉండవలసిన రీతిగా లేకపోవటమే జగత్తుయొక్క దుఃస్థితికి మూలకారణము. బ్రహ్మము మారునట్టి పదార్థము కాదు, మారునట్టి శక్తి కాదు. కానీ, బ్రహ్మమయమైన ఈ జగత్తునందు అశాంతి ఎందుకు తాండవమాడుచున్నది? బ్రహ్మములోనే అశాంతి ప్రారంభమైనదా? అని కొందరు సంశయించ వచ్చును. అయితే, ఇది జగత్తుయొక్క సమస్య కాదు; ఇది వ్యక్తియొక్క సమస్యే! తనలో శాంతి లేనివానికి జగత్తులోనూ శాంతిలేదు. కన్నులేనివాని యెదుట పెద్ద బల్బు వెలిగితే, అతడు ఇంకనూ ఎప్పటివలె చీకటిగానే వున్నదని చెప్పుతాడు! అయితే కన్నులున్నవారికి అప్పుడు ప్రకాశమే!

కనుక, శాంతివంతులకు జగత్తు నిరంతరము శాంతిమయముగనే ఉండును. అన్ని రంగములలోనూ ఈనాడు మానవులు చేయు తప్పు ఇదియే! వ్యక్తి గతమైన సమస్యను సమష్టిపై పెట్టి, జగత్తును అపవిత్రము గావించుచున్నారు. నిజముగా జగత్తునకు అశాంతి లేదు. అది నిరంతరము శాంతిమయము, ఆనందమయము. అదే రీతిగనే జగత్తును ఆనందమయముగా శాంతిమయముగా నొనర్చుకొనే శక్తి వ్యష్టిలో లేదు, వ్యష్టికి ప్రాప్తి లేదు. అంతే!

ఈ కారణము వలన, అశాంతిని రూపొందించుచూ వస్తున్నాడు, మృత్యుమయమైన దేహమందు అమృత

త్వమున్నది; మట్టిలో మాణిక్యమున్నట్టు ! మాంసపు ముద్దయందు ప్రజ్ఞానమున్నది; జీవరూపమందు ఆత్మ భావమున్నది, దేహము కూలిపోవును, రాలిపోవును. అయిననూ, చంచలస్వరూపమైన అభీష్టములకు ఆశలకు ఆలవాల మగుచున్నాడు. దేహమే నేను అనే విశ్వాసము నభివృద్ధి చేసుకొని, దురవస్థలో పడిపోవుచున్నాడు జీవితమంతా వ్యర్థము చేసుకొనుట మాత్రమే కాదు ; మరణ క్షణమందు కూడ, దిగులు విచారము అశాంతి మొదలైన భావములతో బాధపడుచున్నాడు.

దేహములోని దేహికి చావు పుట్టుకలు లేవు ! ఆ దేహియే ఆత్మ. ఆత్మకు యెట్టి మార్పులూ కూర్పులూ ఉండుటకు వీలులేదు. దేహమునకు అధిష్టానమైన ఆత్మకు దేహగుణము లున్నవని తలంచటము కేవలము అజ్ఞానమే.

దృశ్యము వేరు, దృక్కు వేరు, కనపడే పదార్థములు వేరు. నేత్రము కూడ ఆత్మయొక్క ప్రకాశము వలననే చూచును. ఇంద్రియములు అద్దమువంటివి. అద్దముపై ఆత్మ ప్రకాశము పడిననే పదార్థములు వాటిలో గోచరమగును. దేహము, మనస్సు, చిత్తము, బుద్ధి, ఇంద్రియములు ఇవన్నీ పవిత్ర కర్మలకొరకు మానవులకు లభ్యమైనవి. వాటిని సత్కర్మలకొరకు వినియోగించవలెను. ఆ కర్మలవలన దొరకే ఫలితముకొరకు కాదు; కర్మకు మాత్రమే నీవు కర్తవు ! ఫలదాత వేరు. చేతిలో కత్తి తీసుకొని, కూరగాయలను కొయ్యవచ్చు. ఆ కూరగాయలను కత్తి తినదు. ఫలములను భుజించదు. నీవు ఆ కత్తివలె నిమిత్తమాత్రుడవు కావలెను.

మరొక చిన్న ఉదాహరణము. ఒక కప్పులో పండ్ల రసము పోసుకున్నాము. దాని రుచి ఆ కప్పుకు యే మాత్రమూ తెలియదు. నాలుకను చేరినప్పుడు కూడ, దానికి అది పులుపా తీపా అని అంత మాత్రమే తెలుసును కానీ ఆ పండ్ల రసమును పూర్తిగా అనుభవించుటకు నాలుక అసమర్థుడు ! కాబట్టి అది దాన్ని ఆ రసమును జఠరము లోనికి పంపును కడుపు కూడ, దానిని తానే అనుభవించక, చక్కగా జీర్ణించి సర్వాంగములకూ ఆ శక్తిని సప్లై చేయును; చిన్న నరములు పెద్ద నరములు దేహ పర్యంతము అన్ని చోట్ల ఆ శక్తిని ప్రసరింపజేయును

ఈ ఉదాహరణమును మీ మీ అనుభూతికి తగినట్లుగా మీకు సమన్వయము చేసుకోవాలి. ఆ కప్పే దేహము. దానిలో దివ్యత్వమైన మధురమైన ఆత్మ రసమున్నది. దానిని ఇంద్రియములనే స్ట్రాలో పీల్చిన, బుద్ధి అనే నాలుక నిత్యానిత్య పరిశీలన చేయును. తరువాత, అన్ని అనుభవములనూ ఆత్మకు అర్పితము గావించుచున్నది. జఠరమనే జీవతత్త్వము దాని సారమును సర్వాంగములకూ అందించి జడమును చిత్తుగా మార్చును. ఇదియే ఆధ్యాత్మిక జీవితముయొక్క రీతి, స్థితి.

**శ్రీవారిదివ్యోపన్యాసము. 25-10-74.**

# పుస్తక సూచి

పుస్తకముల వెలనూ పోస్ట్ మరియు రిజిస్ట్రేషను చార్జీలను మనియార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకములు పంపించగలము.

నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టుచార్జీలు క్రింద తెలియజేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోష్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలనూ పోస్టుచార్జీ మరియు ప్రతిఆర్డర్‌తోనూ రిజిస్ట్రేషనుచార్జీ రూ. 1-25 తో వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | పోస్టుచార్జి |
|---|---|---|---|
| **తెలుగు:—** | | | |
| 1 | సత్యం శివం సుందరం(1) | 5-00 | 0-35 |
| 2 | ,, ,, (2) | 5 00 | 0-40 |
| 3 | మణిమాల | 1 00 | 0 25 |
| 4 | అర్చన | 1-00 | 0-15 |
| 5 | భగవాన్ శ్రీసత్యసాయి కథా సుధారసము | 1-50 | 0 5 |
| 6 | సందేహ నివారిణి | 1-50 | 0-15 |
| 7 | గీతావాహిని | 4-00 | 0-35 |
| 8 | వచనామృతము | 5-00 | 0-25 |
| 9 | ధర్మవాహిని | 1-50 | 0-15 |
| 10 | గీతాభావప్రకాశము | 15-00 | 0-90 |
| 11 | దివ్యోపన్యాసములు | 1-50 | 0-25 |
| 12 | భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి వేసవి ప్రబోధాలు | 2-50 | 0-25 |
| 13 | భజనావళి | 2-00 | 0 15 |
| 14 | కథాసుధ | 2-00 | 0-15 |
| 15 | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| **కన్నడ:—** | | | |
| 1 | ప్రశాంతివాహిని | 1-50 | 0- 5 |
| 2 | సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 3 | ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 4 | ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 5 | జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 6 | గీతావాహిని | 4-00 | 0-25 |
| 7 | సత్యం శివం సుందరం II | 6-00 | 0-35 |
| **మలయాళము:—** | | | |
| 1 | 108 రత్నంగళ్ | 1-50 | 0-15 |
| 2 | వాచోరత్నంగళ్ | 3-00 | 0-65 |
| 3 | అవతారమాహాత్మ్యం | 0-50 | 0-10 |
| 4 | ధర్మవాహిని | 1-00 | 0-10 |

ఇంగ్లీషు:—

1 సత్యం శివం సుందరం (2) 5-00 0-30
2 సత్యం శివం సుందరం (3) 6-00 0-35
3 సమ్మర్‌షోవర్స్ ఇన్
బృందావన్ 1972 5-00 0 35
4 „ 1973 6-50 0-30
5 సందేహ నివారిణి 3-00 0-15

అరవం:—

1 ఆన్‌బిన్ జ్యోతి 2-00 0-15
2 అవతారమొళిఅముదం[1భా] 3-00 0-45
3 „ „ [2భా] 3-00 0-55
4 సాయిమాతా 1-00 0-10
5 ధర్మవాహిని 1-50 0- 5
6 సందేహనివారిణి 2-00 0-20
జ్ఞానవాహిని 1-50 0-10
8 దివ్యజ్ఞాన దీపింగళ్ 1-50 0-10
9 సత్యశివసుందరం II 4-00 0-35
10 భజనావళి 3-00 0-20
11 సత్యం శివం సుందరం [2భా] 3-00 0-65
12 „ „ [3భా] 6-00 0 40

ఒరియ :—

1 గీతావాహిని 5-00 0-20
2 ధ్యానవాహిని 1-50 0-10
3 ప్రేమవాహిని 1-50 0-10

హిందీ:—

సత్యసాయీశ్వరాయనమః
[పద్యములు] 1-00 0-10

గుజరాతి:—

1 భాగవత వాహిని 5-00 0-20
2 కథాసుధ 2-00 0-20
3 గీతావాహిని 4-00 0 35
4 వసంత వర్ష 5 00 0 4[illegible]

సింధ:—

1 భజనావళి 0-50 0-10
2 ధ్యానవాహిని 1-00 0 15

అస్సామి:—

1 సనాతన సారధి
[పార్ట్‌బయాగ్రఫీ] [illegible]-00 0 10
2 శ్రీ భగవాన్ సత్యసా
బాబేర్‌కథ 0-25 0 10
3 దివ్యవాణి[అడ్వైస్ [illegible]
స్టుడెంట్సు] 0-50 0 10
4 సత్యం శివం సుందరం [illegible] 4 00 0 25
5 ప్రశాంతి భజనావళి 2-00 0- 5
6 భాగవత వాణి [illegible] 0 10
7 సాయి గాథ (పద్యములు) 1-00 0 15
8 నామ మహిమ 2-00 0-10

బెంగాలి :—

1 సత్యం శివం సుందరం I [illegible] 0-25
2 దివ్య వాహిని 5-00 0-25
3 సందేహ నివారిణి 2-50 0-25
4 కథాసుధ [illegible]-00 [illegible] 0

—o—

## పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు, ఇంగ్లీషు ఈ రెండు భాషలలో మాత్రమే ఈ మాసపత్రిక ప్రచురింపబడుచున్నది. వార్షిక చందా: రు॥ 5. ఒక సంవత్సరమునకు తక్కువకానీ 5 సం॥ ల కెక్కువ కానీ చందాలు స్వీకరింపబడవు.

2 చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా వ్రాయవలెను. మనిఆర్డర్ ద్వారా చందా పంపునపుడు పూర్తి విలాసమును కూపను వెనుకభాగమున వ్రాయవలెను.

3. తెలుగు పత్రిక కావలెనో, ఇంగ్లీషు పత్రిక కావలెనో తెలుపవలెను.

4 చందా గడువు పొడిగించుటకు, చందా పంపించు సమయమునందే తన చందా నెంబరును తెల్పియ జేయవలెను.

5. గమనిక :- పుస్తకముల కొరకు పైకము నీ క్రింది అడ్రసుకే పంపవలెను :

శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతినిలయం పోస్ట్,

అనంతపురంజిల్లా. 515134.

6. పత్రికకు పైకమును పంపించువారు తమ చెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను "సనాతనసారథి", ప్రశాంతినిలయం (పోష్టు.) అనంతపురం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్, అను చిరునామాకు మాత్రమే పంపవలెను. చెక్కులు పంపేవారు, 0-50పై (బ్యాంకి ఖర్చులను కూడా కలిపి) మొత్తమును పంపవలెను. పత్రిక గాని, లేక పుస్తకములు గాని చెక్కు పైకము వసూలైన తరువాతనే పంపించబడును. పత్రికలుగాని పుస్తకములు గాని V.P.P. ద్వారా పంపబడవు.

7. ఉత్తర ప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయం పోష్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరములలో తమ చందానెంబరును వ్రాయని యెడల జవాబు లిచ్చుటకు ఆలస్యమగును.

8. పోష్టుద్వారా ఫొటోలు పంపబడవు.

### గమనిక

మీచందాగడువు యే నెల యే సంవత్సరమువరకు అని-మీ చందారసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము కాగితములోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు "../1-75" అని యుండిన, మీ చందా జనవరి నెలతో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥కు రు. 5) డిశంబర్ 31.వ తేదీ లోపల పత్రిక యొక్క కార్యాలయము చేరునట్లు పంపవలెను.

### —: శ్రీవారి కార్యక్రమములు :—

బాబావారు ప్రశాంతినిలయము నందున్నారా అని తెలిసికొనగోరు భక్తులు మేనేజరు 'సనాతన సారథి' ప్రశాంతి నిలయము (పోష్టు.) పెనుకొండ తాలూకా అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయికార్డుగానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాంగాని పంపితే, లేదా కొత్త చెఱువు 30 P.C.O కు ఫోన్ చేసితే తెలుపగలము.

కర్ణాటక రాష్ట్రపు బెంగుళూరు జిల్లా కాడుగోడి (పోష్టు) 'బృందావనము'లోని 'వ్రజ్ బృందావన్' ముద్రణాలయమునందు కె. కె. అప్పయ్య గారిచే ముద్రింపబడి బి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ తరుపున ప్రచురింప బడినది. యెడిటర్: యన్. కస్తూరి, యం. యే., బి. యల్

Reg

Regd. No. KRN/A-67

మానవుడు తన ముందుగతి మాట మరచి మోహ పరవశుడై, అనన్య సాధారణమైన ద్రవ్యము పదవి వాహనము, శరీరబలము, పశుగణము దివ్యభవనము, దీర్ఘాయువు ఈ మొదలైన ఐహిక సుఖములకు సంబంధించిన విషయము లేవి కలవో వాట్లన్నిటి యొక్కయు అశాశ్వత స్థితిగతులను గురించి తన జీవితకాలము నంతను ధారపోయుచున్నాడే కానీ, తన శాశ్వత సుఖమును గురించి క్షణమాత్రము కూడా ఆలోచించుట లేదు. ఎంత కష్టము !

— బాబా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64